# ప్రస్థానత్రయము

## సుధాఖ్య వ్యాఖ్యా సమేతము



రచయితలు

పూజ్యపాద

శ్రీశ్రీశ్రీ శంకరానందగిరి స్వాములవారు

ఓం నమో భగవతే శ్రీమదుమామహేశ్వరాయ

శ్రీమదుమామహేశ్వర గ్రంథమాల 12-వ పుష్పము.

# ప్రస్థానత్రయము

## సుధాఖ్య వ్యాఖ్యా సమేతము




రచయితలు :

పూజ్యపాద

శ్రీశ్రీశ్రీ శంకరానందగిరి స్వాములవారు

శ్రీ ఉమామహేశ్వర గురుపీఠము

శ్రీ సద్గురు ప్రణవానందాశ్రమము

గంజిగుంట మఠము




వెల రు. 8-0-0

ప్రతులకు :

శ్రీ సద్గురు ప్రణవానందాశ్రమము

గంజిగుంట మఠము

వజ్రకరూరు, p. o. (వయా) గుంటకల్.



శ్రీమాన్ పాడాగల్లు గిరియప్ప శ్రేష్ఠిగారు

షరాపు వ్యాపారము

ఆదవాని



సుధీవర శ్రీవంకదారు రామకృష్ణయ్య శ్రేష్ఠిగారు

ప్రొప్రయిటరు : న్యూ ఇండియా కార్పొరేషన్

తిమ్మనచెర్ల p. o. (గుంటకల్)



శ్రీమాన్ మాఘం పుల్లయ్య శ్రేష్ఠిగారు

హార్డ్ వేర్ మర్చంట్

నంద్యాల



పూజ్యపాద

శ్రీశ్రీశ్రీ సద్గురు ప్రణవానందస్వాములవారు

రచయితల పరమ గురువులు.



పూజ్యపాద

శ్రీశ్రీశ్రీ సదానంద సద్గురుస్వాములవారు

రచయితల గురువులు.



పూజ్యపాద

శ్రీశ్రీశ్రీ శంకరానందగిరి గురుస్వాములవారు

రచయితలు.

# పరిచయము

అద్వితీయమగు బ్రహ్మము తమ ఆత్మస్వరూపమైయే యున్నదను పరమార్థతత్త్వము నరయ ప్రస్థానత్రయము పరమప్రమాణము, వేదార్థసారసర్వస్వము నై యున్నది. ఉపనిషత్తులు శ్రుతిప్రస్థానమని, బ్రహ్మసూత్రములు న్యాయప్రస్థాన మని, భగవద్గీత స్మృతిప్రస్థానమని బ్రహ్మజ్ఞులు పలుకుదురు. అట్టి పరమబుధుల, గురువర్యుల, మహావాక్యములను మాగురువులచే వింటిమి. వాటినే మరల ప్రవచించితిమి. మహాప్రసాద మని యెంచి గురుభక్తి సూచకముగ ఆ విషయములనే "ప్రస్థానత్రయము, సుధాఖ్య వ్యాఖ్యాసమేతము" అను పేర రచించితిమి.

ఈ రచనయందు జగద్గురు శ్రీ శంకరభగవత్పూజ్యపాదుల ప్రస్థానత్రయ భాష్యము ననుసరించి మూలార్థమునకు విరుద్ధముగాకుండ యథామతి విషయమును సంగ్రహించితిమి.

ప్రస్థానత్రయము ఒకే గ్రంథముగ నుండిన, పాఠకుల కనుకూలమని 108 ఉపనిషత్తులం దతి ముఖ్యములగు 10 ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీత ఈ మూడింటిని ముచ్చటగ మూలార్థములను మాత్రము వివరించుచు వలయుచోట సమన్వయార్థమై భాష్యమునందలి భావమును చేర్చి వ్రాసితిమి. విషయమునుబట్టి యథోచితమగు అవతారికల నుంచితిమి. ఇక ☞ ఛాందోగ్య బృహదారణ్యకోపనిషత్తుల యందు మాత్రము ముముక్షువుల కత్యంతోపయుక్తములు గాని కొన్ని భాగములను విడిచి, వాటి సంక్షిప్తమగు అర్థమును మాత్రము దెలిపితిమి. బ్రహ్మసూత్రములకు తాత్పర్యార్థమైన భాష్యసమ్మతమగు సంక్షిప్తార్థమును, భగవద్గీత మూలార్థమును, అన్వయక్రమమున వ్రాసి పరమతాత్పర్యార్థమగు భాష్యమునందలి భావములను అచ్చటచ్చట శ్రుతిసమ్మతముగ వివరించితిమి.

[ ] ఈగుర్తునం దుండునవి శ్రీమదాచార్యుల భాష్యమని గ్రహింపవలయును. ఈ ప్రస్థానత్రయ (సుధాఖ్యవ్యాఖ్యాసమేత) మును శ్రద్ధచే శ్రవణ పఠనముల జేయువారు ఆత్మజ్ఞానసంపన్నులై మంగళమయజీవనులై అక్షయసుఖము ననుభవింతురు.

ఇట్టి పవిత్రగ్రంథరచన సమయమున గురుసాన్నిధ్యముననే యుండుచు పరమభక్తిచే చిత్తుప్రతిని శుద్ధప్రతిగా ఎత్తివ్రాసి చిత్తసంస్కృతి నొందిన అంతేవాసులగు చిరంజీవులైన ఆదవాని పాడాగల్లు శ్రీసత్యనారాయణ బ్రహ్మచారి, మఱియు గుంతకల్లు జి. వెంకటస్వామి బ్రహ్మచారి,- వీరికి ప్రస్థానత్రయమూర్తియగు శ్రీ గురుపరమాత్మ అనంత శుభప్రదు డగునుగాత!

శ్రీ శంకరానందీభగవద్గీతాది అనువాదకులు, శబ్దార్థకల్పతరువు ఇత్యాది గ్రంథ పరిష్కర్తలు నైన మా భాగ్య మనబరగు శ్రీ శుద్ధచైతన్యస్వామి పూజ్యపాదులు అనుగ్రహబుద్ధిచే గ్రంథ ముద్రణాకార్యము లెల్ల చూచుకొని మహోపకార మొనర్చిరి. అట్టి శ్రీ వారికి మా అనంత ప్రణామములు.

ఈ మహాగ్రంథరచనకు మొదట మంగళాచరణాత్మకముగ భక్తిచే "జగద్గురు శ్రీ శంకరచరిత్ర" యను గ్రంథము రచింపబడి ప్రచురణ మైనది. ఓమ్.

ఉత్తములును అత్యంత సమర్థులు నగు శ్రీ వెల్కం ప్రెస్ ప్రైవేట్ లిమిటెడ్ వారు గ్రంథముద్రణ మహాకార్యమును అనతికాలమున ముచ్చటగ ముగించిరి. వీరికి సర్వాంతర్యామి శ్రీ శంభు పరమాత్మ అనంత శుభప్రదు డగునుగాత!

షోడశ శ్రీ చాతుర్మాస్య
మహావ్రత పూర్ణ నుసమయము.
శార్వరి సం॥ కార్తీక శు౧౧లు.
సోమవారము, నంద్యాల.

శ్రీ శంకరానందగిరి స్వాములవారు.

ఓం నమో భగవతే శ్రీమదుమామహేశ్వరాయ

# మంగళాశాసనము

"శ్లో॥ దాతవ్యమితి యద్దానం దీయతేఽనుపకారిణే,
దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్."

అను గీతోక్తప్రమాణానుసారము - అడుగకనే ఈ దానము చేయదగునని తమకు దా దెలిసి ప్రత్యుపకారము జేయ శక్తిలేని, లేక శక్తిగలిగి యుండినను అతనిచే మరి యేప్రతిఫలము నపేక్షింపక నిర్మల బుద్ధిగలిగి-

దేశము : నవనందులకు మధ్య మహానంది యనబరగు నంద్యాల పుణ్యక్షేత్రము,

కాలము : ఈ షోడశశ్రీచాతుర్మాస్య మహావ్రతము పూర్ణమగు పుణ్యోదయకాలము,

పాత్ర : వేదాంతవేది యగు సద్గురుస్వామిసన్నిధి - ఇట్లు, ప్రస్థానత్రయము సుధాఖ్యవ్యాఖ్యాసమేతమును నీగ్రంథముద్రణకై దేశకాలపాత్రల నరసి భక్తిచే దానమొసగిన ఈసాత్త్వికదాతలకు ప్రస్థానత్రయవేద్యుడగు పరమాత్మ ప్రత్యగాత్మస్వరూపమున తమ హృదయేశుడై యున్నాడను జ్ఞానము నొసగి నిత్యశాంతిసుఖముల నిచ్చుగాత!

## నంద్యాల

శ్రీమాన్ రాజా పెద్ద సుబ్బరాయుడు శ్రేష్ఠి
కుం॥ సౌ॥ అన్నపూర్ణమ్మ 250-00

శ్రీమాన్ నెరవాటి బాలసుబ్బయ్య శ్రేష్ఠి కుం॥ సౌ॥ శేషమ్మ 250-00

శ్రీమతి పగిడి చాయమ్మ - కుమారుడు సుబ్బారావు
కుం॥ సౌ॥ నాగరత్నమ్మ 250-00

శ్రీమాన్ గెలివి వెంకట సుబ్బయ్య శ్రేష్ఠి కుం॥ సా॥ సుబ్బమ్మ 125-00
" మాఘం సుబ్రమణ్యాం శ్రేష్ఠి కుం॥ సా॥ రత్నమ్మ 116-00
" ఎ. జి. కేశవరెడ్డి కుం॥ సా॥ రామలక్ష్మమ్మ 116-00
" గుండా పద్మనాభయ్య శ్రేష్ఠి కుం॥సా॥ రామసుబ్బమ్మ 116-00
" మెలిశెట్టి కొండయ్య శ్రేష్ఠి కుం॥సా॥ సుబ్బలక్ష్మమ్మ 116-00
" ఉదయగిరి వీరయ్య శ్రేష్ఠి
కుం॥ సా॥ లక్ష్మీదేవమ్మ (తిమ్మాపురము) 116-00
" చీదెళ్ళ బాలకోటయ్య శ్రేష్ఠి
కుం॥ సా॥ సుబ్బలక్ష్మమ్మ 116-00
" నెరవాటి కృష్ణయ్య శ్రేష్ఠి కుం॥ సా॥ అనంతమ్మ 116-00
" కొప్పరపు సుబ్బరాయుడు శ్రేష్ఠి
కుం॥ సా॥ లక్ష్మీదేవమ్మ 116-00
" జూటూరు సుబ్రమణ్యం శ్రేష్ఠి కుం॥సా॥ పుల్లమ్మ 116-00
" సేగు చిన్నసుబ్బరాయుడు శ్రేష్ఠి కుం॥ సా॥ వీరమ్మ 116-00
" నిచ్చెనమెట్ల సుబ్బయ్య శ్రేష్ఠి 116-00
" బొగ్గరపు పుల్లయ్య శ్రేష్ఠి కుం॥ సా॥ సుబ్బమ్మ 116-00
" లగిశెట్టి నాగిశెట్టి కుం॥ సా॥ లక్ష్మీదేవమ్మ 116-00
" దుద్యాల నందమ్మ కుమారుడు అప్పయ్య శ్రేష్ఠి
కుం॥ సా॥ గురమ్మ 116-00
" దింటగుర్తి ఓబయ్య శ్రేష్ఠి కుం॥సా॥ మహాలక్ష్మమ్మ 116-00
" మలిశెట్టి నాగిశెట్టి కుం॥ సా॥ పార్వతమ్మ 116-00
" తాళ్ళూరు వీరప్ప, బి. యల్లమ్మ, సుబ్బమ్మ 116-00
" యస్. వెంగన్న కుం॥ సా॥ లక్ష్మీదేవమ్మ 116-00
శ్రీమతి మలిశెట్టి సుబ్బమ్మ 116-00
" యమ్. లీలావతమ్మ 116-00
" అయ్యపుశెట్టి లక్ష్మమ్మ 116-00
" లగిశెట్టి రంగమ్మ 116-00

శ్రీమతి శిరిగిరి మల్లమ్మ, సేలం ఈరమ్మ 116-00

" యోగిని సుబ్బమ్మ, త్యాగరాజస్వామి దేవాలయము 116-00

" మానికల పిచ్చయ్యభార్య కోటమ్మ (సీతారాంపురము) 116-00

" పగిడాల నందమ్మ 116-00

" మలిశెట్టి శేషమ్మ 116-00

శ్రీమాన్ టి. నాగప్ప, యమ్. పుల్లప్ప (పోలూరు) 116-00

" మంచా కాటన్న (చిందుకూరు) 116-00

" ఎ. బాలనాగిరెడ్డి (కొట్టాల) 116-00

" ఆళ్ళగడ్డ నాగిరెడ్డి కుII సాII వెంకటలక్ష్మమ్మ (రాయమలపూరు) 116-00

" ఆళ్ళగడ్డ పెద్దవెంగలరెడ్డి కుII సాII పుల్లమ్మ (రాయమలపూరు) 116-00

శ్రీమతి పులిమద్ది రామిరెడ్డి కూతురు పుల్లమ్మ " 116-00

శ్రీమాన్ ఆళ్ళగడ్డ రెడ్డి చిన్నవెంగలరెడ్డి కుII సాII శంకరమ్మ (రాయమలపూరు) 116-00

## ఆదవాని

శ్రీమాన్ గౌరా లక్ష్మీనారాయణయ్యశ్రేష్ఠి అండ్ సన్సు 316-00

" టి. జి. లక్ష్మయశ్రేష్ఠి అండ్ సన్సు 316-00

" పాడాగల్లు గిరెప్పశ్రేష్ఠి కుIIసాII గోపమ్మ 316-00

" ముత్యాల రంగయ్యశ్రేష్ఠి కుIIసాIIఅన్నపూర్ణమ్మ 316-00

" గొంది కృష్ణయ్యశ్రేష్ఠి కుIIసాII లక్ష్మీనరసమ్మ 250-00

" గట్టు వెంకయ్య శ్రేష్ఠి అండ్ బ్రదర్స్ 161-00

" ఎ. ఆనందము కుIIసాII సుభద్రమ్మ 116-00

" మెతుకుల వెంకయ్యశ్రేష్ఠి, రామచంద్రయ్యశ్రేష్ఠి 116-00

" గోనభావి ఆర్. హనుమంతరావు సన్స్ 116-00

## గుంతకల్లు

| | |
|---|---|
| సుధీవర శ్రీ వంకదారు రామకృష్ణయ్య శ్రేష్ఠి కుం॥ సౌ॥ సుబ్బరత్నమ్మ | 250-00 |
| శ్రీమాన్ వంకదారు వీరణ్ణశ్రేష్ఠి కుం॥సౌ॥ కమలాక్షమ్మ | 151-00 |
| ,, వంకదారు వెంకటరామయ్యశ్రేష్ఠి | 116-00 |
| ,, వంకదారు హనుమంతయ్యశ్రేష్ఠి కుం॥ సౌ॥ నాగరత్నమ్మ | 116-00 |
| శ్రీ వంకదారు దేవేంద్రప్ప గారి ధర్మపత్ని నరసమ్మ | 116-00 |
| శ్రీమాన్ కె. సి. మహదేవయ్యశ్రేష్ఠి కు॥సౌ॥ లక్ష్మీదేవమ్మ | 116-00 |
| ,, దేవతి రామయ్యశ్రేష్ఠి | 116-00 |
| భక్తిరత్న శ్రీ పోలా బాలసుబ్బయ్య శ్రేష్ఠి కుం॥ సౌ॥ సుబ్బలక్ష్మమ్మ | 116-00 |
| శ్రీమాన్ వల్లముకొండ శ్రీరామసుబ్బయ్యశ్రేష్ఠి కుం॥ సౌ॥ లక్ష్మీదేవమ్మ | 116-00 |
| శ్రీ వల్లముకొండ హనుమక్క కుమారుడు వెంకటసుబ్బయ్య కుం॥ సౌ॥ మాణిక్యమ్మ | 116-00 |
| శ్రీమాన్ ఆర్. వీరయ్య అండ్ బ్రదర్స్ | 116-00 |
| ,, పెద్ద వీరమ్మగారి డి. బసిరెడ్డి కుం॥సౌ॥ హంపమ్మ | 116-00 |
| ,, పెండ్యాల అళ్ళయ్యశ్రేష్ఠి కుం॥సౌ॥హనుమంతమ్మ | 116-00 |
| ,, ముత్యాల లక్ష్మయ్యశ్రేష్ఠి కుం॥సౌ॥మీనాక్షమ్మ | 116-00 |
| శ్రీమతి యం. వి. సరస్వతమ్మ | 116-00 |
| శ్రీమాన్ యం. తిప్పయ్య, నాగయ్య | 116-00 |
| శ్రీమతి కోగిలతోట జాగీర్దార్ సిద్ధమ్మ, భాగమ్మ (హాలర్వి) | 116-00 |
| శ్రీమతి కాలేద గంగమ్మ (చింతకుంట) | 116-00 |
| శ్రీమాన్ పాటీల్ బసవనగౌడు కుం॥ సౌ॥ బసమ్మ (శిరగాపురము) | 116-00 |

ఓం తత్ సత్



# వి ష య సూ చి క

## శ్రీమద్భగవద్గీత

## బ్రహ్మసూత్రములు



## ఉపనిషత్తులు





ఓమ్

## శ్రీ ఉమామహేశ్వర గురుపీఠ పరంపరా స్తోత్రము

ఓం కైలాసేశముమానాథం తథా నందీశ్వరం గురుమ్,
సనత్కుమారం సూతఘ్నం సర్వదా తం నమామ్యహమ్.
నమామి భగవన్నాథం కరూర్ సిద్ధమురుళ్ మునిమ్,
తచ్ఛిష్యం చ కళూర్ మాని పరమానయుతౌ భజే.
తిరుప్పనందాళగురుం తథా మధుర పుంజకమ్,
యోగీశ్వరం తిరునట రాజం భక్త్యా స్మరామ్యహమ్.
శివప్రకాశం యోగీశం స్వరూపానంద ముత్తమమ్,
తత్త్వరాజస్వామినం తం శాంతలింగార్యకం తథా.
కుమారదేవం తచ్ఛిష్యం చిదంబరగురుం విభుమ్,
నారాయణాచార్యగురుం భూమాతాండవరాయకమ్.
తాతార్యం తిల్లినాథం చ తథా వేంకటరంగకమ్,
ప్రణవానందమానీశం జ్ఞానినం తత్సుశిష్యకౌ.
ఆత్మానంద సదానంద యోగినౌ పరమౌ గురూ,
తచ్ఛిష్యం చ తపోనిష్ఠం శ్రోత్రియం శాంతరూపిణమ్
శ్రీశంకరానందగిరిం ప్రణమామి ముహుర్ముహుః,
అన్యానస్మద్గురూన్ వందే సత్వశుద్ధ్యై పునఃపునః.
శ్రేయోఽస్తూమామహేశాఖ్య పీఠస్థేభ్యస్సదా పరమ్,
తచ్ఛిష్యేభ్యః ప్రశిష్యేభ్యః సర్వేభ్యశ్చాస్తు మంగళమ్.
ముముక్షుభ్యః సాధకేభ్యః సర్వదాఽస్తు సుమంగళమ్,
సచ్చిదానంద దేవస్య ప్రసాదాత్సర్వమంగళమ్.

ఓమ్ హరలీలావతారాయ శంకరాయ పరౌజసే,

కైవల్యకలనాకల్ప తరవే గురవే నమః.

ఓమ్ నారాయణం పద్మభవం వశిష్ఠం

శక్తిం చ తత్పుత్రపరాశరం చ,

వ్యాసం శుకం గౌడపదం మహాంతం

గోవింద యోగీంద్ర మథాస్య శిష్యమ్,

శ్రీశంకరాచార్య మథాస్య పద్మ

పాదం చ హస్తామలకంచ శిష్యమ్,

తం త్రోటకం వార్తికకార మన్యా

నస్మద్గురూన్ సంతతమానతోఽస్మి.





శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః

# ప్రస్థానత్రయము

## సుధాఖ్యవ్యాఖ్యాసమేతము

### శ్రీమద్భగవద్గీత - ప్రథమాధ్యాయము

అవతారిక : ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమున యుద్ధసన్నద్ధులైన కురుపాండవుల ప్రవృత్తిని మఱియు క్షేత్రమహిమను గుఱించిన ధృతరాష్ట్రుని ప్రశ్న.

ధృతరాష్ట్ర ఉవాచ:

ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః,
మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ. 1

ధృతరాష్ట్రుడు ఇట్లు పలికెను—

సంజయా! యుద్ధము చేయు నిచ్ఛచే నా కుమారులును పాండవులును గూడి ధర్మమునకు నిలయమైన కురుక్షేత్రమునందు ఏమిచేసిరి?

"ధర్మాధర్మయో రుత్పత్తిస్థానఽత్వేపి ధర్మప్రధానత్వాత్ ధర్మక్షేత్రమ్" ధర్మప్రధానమైనది, ధర్మహాని గానివ్వక కాపాడునది కావున కురుక్షేత్రము ధర్మక్షేత్ర మనబడెను.

ఇచ్చట ధర్మవిరహితులగు దుర్యోధనాదులకు విజయము చేకూరదు. "యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః, తత్ర శ్రీర్విజయో భూతి ర్ధ్రువా నీతిర్మతిర్మమ." భగవంతుని ప్రాపు వడసిన పాపరహితుడగు విజయునకే విజయము, శ్రీ, భూతి, ధ్రువమైన

నీతి యని నిశ్చయించుకొని సంజయుడు తన ఆశయమును చెప్ప బూనెను.

అవ : సంజయుడు ధృతరాష్ట్రునకు దుర్యోధనుని విషయమై అతని చేష్టను తెలుపు చున్నాడు—

సంజయ ఉవాచ :

దృష్ట్వా తు పాండవానీకం వ్యూఢం దుర్యోధన స్తదా,
ఆచార్య ముపసంగమ్య రాజా వచన మబ్రవీత్. 2

సంజయుడు ఇట్లు చెప్పెను—

యుద్ధమునకై వ్యూహాకారముగ నిర్మింపబడిన పాండవుల సైన్య మును జూచి రాజగు దుర్యోధనుడు ద్రోణాచార్యుల కడకు వెళ్ళి ఇట్లనెను—

అవ : దుష్టబుద్ధితో దుర్యోధనుడు ద్రోణాచార్యునివద్ద జేయు పాండవసైన్యాభివర్ణన తొమ్మిది శ్లోకములతో చెప్పబడుచున్నది—

*పశ్యైతాం పాండుపుత్రాణా మాచార్య మహతీం చమూమ్,
వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా. 3

ఆచార్యా! బుద్ధిమంతుడగు మీ శిష్యుడైన ద్రుపదనందనుడు వ్యూహాకారముగ పన్ని యున్న పాండవుల ఈ మహాసైన్యమును జూడుడు.

అవ : పాండవసేనయొక్క బల పౌరుషములను వర్ణన చేయుచున్నాడు—

అత్ర శూరా మహేష్వాసా భీమార్జునసమా యుధి,
యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః 4

ఇందుండు శూరులు మహాధనుర్ధారులు మఱియు యుద్ధమునందు భీమార్జునులతో సములగువారు యుయుధానుడు విరాటుడు మహా రథు డగు ద్రుపదుడు మఱియు

* "ధృతరాష్ట్ర ఉవాచ; సంజయ ఉవాచ" అన్నట్లే ఇచట "దుర్యోధన ఉవాచ" అను వాక్యమును చేర్చుట సమంజసము.

అవ : పాండవసేనయందలి ప్రధానులైన మహారథులయొక్క నామోల్లేఖన మొనర్చుచున్నాడు.

ధృష్టకేతుశ్చేకితానః కాశిరాజశ్చ వీర్యవాన్,
పురుజిత్కుంతిభోజశ్చ శైబ్యశ్చ నరపుంగవః. 5

ధృష్టకేతువు, చేకితానుడు, వీర్యవంతుడగు కాశిరాజు, పురుజిత్తు, కుంతిభోజుడు, నరశ్రేష్ఠుడగు శైబ్యుడు, మఱియు

యుధామన్యుశ్చ విక్రాంత ఉత్తమౌజాశ్చ వీర్యవాన్,
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః. 6

పరాక్రమవంతుడగు యుధామన్యువు, వీర్యవంతుడగు ఉత్తమౌజస్సు, సుభద్రానందనుడగు అభిమన్యుడు, అటువలె ద్రౌపది బిడ్డలు, వీరందఱును మహారథులై యున్నారు.

అవ : తన సేనయందలి ప్రధాన శూరవీరులను ద్రోణాచార్యులకు తెలుపుచున్నాడు.

అస్మాకంతు విశిష్టా యే తాన్నిబోధ ద్విజోత్తమ,
నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే. 7

ఓ బ్రాహ్మణశ్రేష్ఠా! ఇక మనయందు మహత్త్వ విశిష్టులగు సేనానాయకుల నామములను స్మృతియం దుండుటకై మీకు జెప్పెదను వినుడు.

అవ : తన సేనయందు ప్రధానులగు మహారథులయొక్క నామోల్లేఖన చేయుచున్నాడు.

భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితింజయః,
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తి స్తథైవచ. 8

తాము, భీష్ముడు, కర్ణుడు, కృపాచార్యుడు, సమితింజయుడు, అశ్వత్థామ, వికర్ణుడు, మఱియు సౌమదత్తి,

అన్యేచ బహవశ్శూరా మదర్థే త్యక్తజీవితాః,
నానా శస్త్ర ప్రహరణా స్సర్వే యుద్ధ విశారదాః. 9

ఇంతే కాక నానా శస్త్ర విద్యలయందు ప్రవీణులును, యుద్ధ విద్యయందు నిష్ణాతులు నైన అన్యులగు వీరు లనేకులు నాకొఱకు

జీవితము నందలి అభిమానమును, ఆశను వీడి నిలిచియున్నారు.

అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితమ్,
పర్యాప్తం త్విదమేతేషాం బలం భీమాభిరక్షితమ్. 10

భీష్మునిచే రక్షింపబడిన మన సైన్యము అపరిమితము; కానిభీము నిచే రక్షింపబడిన యీపాండవసేన యన్ననో పరిమితి గలదై ఉన్నది.

ఐనను మన సైన్యము తగినంత బలోపేతమైనది కాదని దుర్యోధనునకు అనుమానము.

అవ : సర్వ ప్రకారములచే భీష్మని రక్షింపుడని శూర వీరులకు హెచ్చరిక చేయుచున్నాడు.

అయనేషుచ సర్వేషు యథాభాగ మవస్థితాః,
భీష్మమేవాభిరక్షంతు భవంత స్సర్వ ఏవహి. 11

నియమింపబడిన ఆ యా స్థానములలో వ్యూహ మార్గముల యందు నిలిచి తా మెల్లరు సర్వవిధముల భీష్ముని రక్షింపవలెను.

అవ : కురువృద్ధుడగు భీష్మడు దుర్యోధనుని సంతోషార్థము శంఖమును పూరించెననుచున్నాడు.

తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః,
సింహనాదం వినద్యోచ్చై శ్శంఖం దధ్మౌ ప్రతాపవాన్. 12

అనంతరము ప్రతాపశాలియును కురుకులమునకు పెద్దయైన తాత భీష్ముడు దుర్యోధనునకు సంతోషము కలుగునట్లు సింహగర్జనము చేసి తన రణశంఖమును పూరించెను (మ్రోయించెను).

తతశ్శంఖాశ్చ భేర్యశ్చ పణవానక గోముఖాః,
సహసైవాభ్యహన్యంత స శబ్ద స్తుములోఽభవత్. 13

వెంటనే శంఖములు, భేరులు, డోళ్లు, నగారాలు, గోముఖాది రణవాద్యములు ఒక్కపెట్టున మ్రోయింప నారంభించిరి. వాని ధ్వని మహత్తరముగ దశ దిక్కుల వ్యాపించెను.

తతశ్శ్వేతై ర్హయైర్యుక్తే మహతి స్యందనే స్థితౌ,
మాధవః పాండవశ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః. 14

ఆ పిదప తెల్లని గుఱ్ఱములచే పూన్పబడి మహారథమునందు గూర్చుండి యుండిన శ్రీకృష్ణార్జునులు తమ దివ్య శంఖముల నూదిరి.

పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః,
పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః. 15

శ్రీకృష్ణుడు పాంచజన్యమును, అర్జునుడు దేవదత్తమును, ప్రచండకర్మలు చేయు భీముడు పౌండ్రమను మహాశంఖమును ఘటియు

అనంతవిజయం రాజా కుంతీపుత్రో యుధిష్ఠిరః,
నకుల స్సహదేవశ్చ సుఘోష మణిపుష్పకౌ. 16

కుంతీపుత్రుడగు యుధిష్ఠిరుడు అనంత విజయమను శంఖమును, నకుల సహదేవులు సుఘోష మణి పుష్పకములను మటియు,

కాశ్యశ్చ పరమేష్వాస శ్శిఖండీచ మహారథః,
ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకిశ్చాపరాజితః. 17

మహాధనుర్ధారి యగు కాశిరాజును మహారథియగు శిఖండియును ధృష్టద్యుమ్నుడును విరాటుడును అపరాజితుడగు సాత్యకియు

ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే,
సౌభద్రశ్చ మహాబాహుః శంఖాన్ దధ్ముః పృథక్ పృథక్. 18

ద్రుపదుడు, ద్రౌపదీపుత్రులును, ఆజాను బాహువగు అభిమన్యుడును, ఇట్లు అందఱు వేఱువేఱుగా తమశంఖములను పూరించిరి.

స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్,
నభశ్చ పృథివీం చైవ తుములో వ్యనునాదయన్. 19

భూమ్యాకాశములను దద్దరిల్ల జేయు దట్టమగు నా శంఖారావములచే కౌరవుల గుండెలు పగిలిపోయెను.

అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః,
ప్రవృత్తే శస్త్రసంపాతే ధనురుద్యమ్య పాండవః. 20

రాజా! ఆ పిదప వ్యవస్థాబద్ధముగ నిలబడి యున్న కౌరవులను జూచి కపికేతనుడగు అర్జునుడు శస్త్ర ప్రయోగ సన్నద్ధుడై ధనుస్సునెత్తి

హృషీకేశం తదా వాక్య మిద మాహ మహీపతే,
సేనయో రుభయో ర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత. 21

శ్రీకృష్ణునితో ఈ వాక్యమును బలికెను. కృష్ణా! నా రథమును రెండు సేనల మధ్యమున నిలుపుము.

యావదేతా న్నిరీక్షేఽహం యోద్ధుకామా నవస్థితాన్,
కైర్మయా సహ యోద్ధవ్య మస్మిన్ రణ సముద్యమే. 22

రణమున నాతో పోరుటకై వచ్చిన యోధులగు వారి యందు నే నెవరితో యుద్ధము చేయవలెనో వారి నందఱను జూచెదను.

యోత్స్యమానా నవేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః,
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధే ర్యుద్ధే ప్రియ చికీర్షవః. 23

ఈ సంగ్రామమునందు దుష్టబుద్ధి గల దుర్యోధనునకు హితమును కలుగజేయు నిచ్ఛచే యుద్ధమున కాయత్తులై వచ్చి నిలిచి యున్నవారిని నేను జూచెదను.

సంజయ ఉవాచ :

ఏవముక్తో హృషీకేశో గుడాకేశేన భారత,
సేనయో రుభయో ర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్. 24

సంజయుడు చెప్పెను—

ఓధృతరాష్ట్రా! అర్జునుడు శ్రీకృష్ణున కీవిధముగ చెప్పిన పిదప శ్రీకృష్ణుడు రథమును రెండు సేనల మధ్యమున—

భీష్మ ద్రోణ ప్రముఖత స్సర్వేషాంచ మహీక్షితామ్,
ఉవాచ పార్థ పశ్యైతాన్ సమవేతాన్ కురూనితి. 25

భీష్ముడు ద్రోణుడు మొదలైన రాజులందఱ యెదుట నిలిపి శ్రీకృష్ణు డిట్లనెను. అర్జునా! ఒక్కచోట గుమిగూడి యున్న ఈ కౌరవులను చూడుము.

అప : అర్జునుడు రెండు సేనల యందును ఉన్న తన బంధువులను జూచి విషాద మొందుటను తెలుపుచున్నాడు.

తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః పితౄనథ పితామహాన్,
ఆచార్యాన్ మాతులాన్ భ్రాతౄన్ పుత్రాన్ పౌత్రాన్
సఖీం స్తథా. 26

అప్పుడు పార్థుడు అచ్చట జేరి యున్న పెద్దలను తాతలను ఆచార్యులను అన్నదమ్ములను మేనమామలను కొడుకులను మనుమలను అటువలె స్నేహితులను మఱియు

శ్వశురాన్ సుహృదశ్చైవ సేనయో రుభయోరపి,
తా న్సమీక్ష్య స కౌంతేయ స్సర్వాన్ బంధూ నవస్థితాన్ 27
కృపయా పరయాఽఽవిష్టో విషీదన్నిద మబ్రవీత్.

మామలను మిత్రులు మొదలగు వారిని ఉభయసేనలయందును జూచెను. ఇట్లు యుద్ధసన్నద్ధులై నిలిచియున్న తన బంధువుల నెల్లరిని జూచి అత్యధికమగు దయగలవాడై దుఃఖించుచు శ్రీకృష్ణునితో నిట్లనియెను.

అర్జున ఉవాచ :

దృష్ట్వేమం స్వజనం కృష్ణ యుయుత్సుం సముపస్థితమ్. 28
సీదంతి మమ గాత్రాణి ముఖంచ పరిశుష్యతి,
వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే. 29

ఓ కృష్ణా ! యుద్ధమునకై వచ్చి నిలిచి యున్న ఈ నా బంధువులను జూచి నా అవయవములు శిథిలములై స్వాస్థ్యమును దప్పి నోరెండుకొని వచ్చుచున్నది. శరీరము వణకుచున్నది. గగుర్పాటును గలుగుచున్నది.

గాండీవం స్రంసతే హస్తాత్ త్వక్చైవ పరిదహ్యతే,
న చ శక్నో మ్యవస్థాతుం భ్రమతీవచ మే మనః. 30

గాండీవము చేతినుండి జాఱిపడుచున్నది. ఒళ్లు వెచ్చనైనది. నిలుచుటకును శక్తిమంతుడను గాను. నా మనస్సు భ్రాంతమై యున్నట్లున్నది.

నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ,
న చ శ్రేయోఽను పశ్యామి హత్వా స్వజన మాహవే. 31

కృష్ణా! మఱియు నిదేమో అపశకునము లగపడుచున్నవి. స్వజనులను యుద్ధమునందు సంహారించుటవలన నే నేవిధమగు హితమును పొందజాలను.

న కాంక్షే విజయం కృష్ణ న చ రాజ్యం సుఖాని చ,
కిం నో రాజ్యేన గోవింద కిం భోగై ర్జీవితేన వా. 32

కృష్ణా! నాకు జయేచ్ఛ లేదు. రాజ్యమునుగాని సుఖమునుగాని నేను ఇచ్ఛయించుట లేదు. నాకు రాజ్యముచేగాని భోగములచేగాని వేయేల! జీవితముచేగాని కలుగు ప్రయోజన మేమున్నది?

యేషామర్థే కాంక్షితం నో రాజ్యం భోగా స్సుఖాని చ,
త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనాని చ. 33

ఎవరి కొఱకై మనము రాజ్యములను భోగములను సుఖములనను ఇచ్ఛయించితిమో వారే జీవితేచ్ఛను ధనాశను వీడి యుద్ధమునకు నిలిచి యున్నారు.

ఆచార్యాః పితరః పుత్రా స్తథైవ చ పితామహాః,
మాతులా శ్శ్వశురాః పౌత్రా శ్శ్యాలా స్సంబంధిన స్తథా. 34

ఇచ్చట ఆచార్యులును మఱియు పెద్దలును పుత్రులును అటువలె తాతలును మేనమామలును మనుమలును బంధువులును మఱియు అన్య సంబంధికులును నిలిచి యున్నారు.

ఏతా న్న హన్తు మిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన,
అపి త్రైలోక్య రాజ్యస్య హేతోః కింను మహీకృతే. 35

వీరు నన్ను చంపినను ముల్లోకముల రాజ్యము నాకు వచ్చుననినను నేను వీరిని చంపుట కిచ్ఛయింపను— అన్నపుడు ఈ ఒక రాజ్యమును గుఱించి ఏమి చెప్పవలయును? విశేష మేమి?

నిహత్య ధార్తరాష్ట్రాన్నః కా ప్రీతిస్స్యా జ్జనార్దన,
పాపమేవాశ్రయే దస్మాన్ హత్వైతా నాతతాయినః. 36

కృష్ణా! ఈ కౌరవులను జంపి మన మే హితమును బొందెదము? ఈ దుష్టులను చంపుటవలన మనకు పాపమే వచ్చును గదా!

తస్మాన్నార్హా వయం హంతుం ధార్తరాష్ట్రాన్ స్వబాంధవాన్
స్వజనం హిం కథం హత్వా సుఖినస్స్యామ మాధవ. 37

అందుచేత మన బంధువులైన ఈ కౌరవులను చంపుట తగదు. కృష్ణా! మనవారినే చంపుకొని మనము పొందు సుఖమైన నేమి గలదు? ఎట్లు సుఖమును పొందగలము?

యద్యప్యేతే న పశ్యంతి లోభోపహత చేతసః,
కులక్షయ కృతం దోషం మిత్రద్రోహే చ పాతకమ్. 38

లోభముచే మోహితులై వీరు కులక్షయము యొక్క దోషమును మిత్ర ద్రోహముచే గలుగు పాపమును తెలియని వారై యున్నారు.

కథం న జ్ఞేయ మస్మాభిః పాపా దస్మా న్నివర్తితుమ్,
కులక్షయ కృతం దోషం ప్రపశ్యద్భి ర్జనార్దన. 39

ఓకృష్ణా! ఈ కులక్షయము వలన గలుగు మహా దోషమును తెలిసిన మన మీ పాపమును చేయరాదని యేల తెలియరాదు?

కులక్షయే ప్రణశ్యంతి కులధర్మా స్సనాతనాః,
ధర్మే నష్టే కులం కృత్స్న మధర్మోఽభిభవత్యుత. 40

కులక్షయము వలన సనాతన మగు కుల ధర్మములు నష్టములగును. ధర్మములు నష్ట మయిన కుల మంతయును అధర్మ భూయిష్ఠ మగును.

అధర్మాభిభవాత్ కృష్ణ ప్రదుష్యంతి కులస్త్రియః,
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః. 41

అధర్మము యొక్క ప్రాబల్యముచే కులస్త్రీలు, కులము చెడును స్త్రీలు, కులము చెడిన యెడల వర్ణ సంకర మగును.

సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ,
పతంతి పితరో హ్యేషాం లుప్త పిండోదక క్రియాః. 42

అట్లు వర్ణ సంకర మయిన కులమును, కుల నాశకులును నరక

(2)

మున బడుదురు. కులీనులగు పితృదేవతలు గూడ పిండోదకములు లేనందువలన శ్రాద్ధాది కర్మలోపముచే పతనమొందెద రని భావము

దోషైరేతైః కులఘ్నానాం వర్ణసంకర కారకైః,
ఉత్సాద్యంతే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః. 43

కుల నాశక మగు ఇట్టి వర్ణ సంకరమును కలుగ జేయు పాపముల నుండి శాశ్వత మగు జాతి ధర్మములు, కుల ధర్మములు సంపూర్ణముగ నశించును.

ఉత్సన్న కుల ధర్మాణాం మనుష్యాణాం జనార్దన,
నరకే నియతం వాసో భవతీ త్యనుశుశ్రుమ. 44

ఓకృష్ణా! ఏ జనుల కుల ధర్మములు నష్ట మగునో వారికి నిశ్చయముగ నరక ప్రాప్తి యగునని మనము వినియున్నాము.

అహో బత మహత్పాపం కర్తుం వ్యవసితా వయమ్,
యద్రాజ్య సుఖ లోభేన హంతుం స్వజన ముద్యతాః. 45

అయ్యో! మనమీ రాజ్య సుఖలోభముచేత మన బంధువులనే చంపుట కొఱకాయత్తులమై భయంకర మగు నీ పాపకర్మ చేయుట కారంభించి యున్నాము (ఇది మంచిది కాదు).

యది మా మప్రతీకార మశస్త్రం శస్త్ర పాణయః,
ధార్తరాష్ట్రా రణే హన్యు స్తన్మే క్షేమతరం భవేత్. 46

దీని కంటెను శస్త్ర రహితుడనై నిలిచి యున్న నన్ను శస్త్ర ధారులగు కౌరవులు చంపినను మంచిదే యగును.

సంజయ ఉవాచ :

ఏవ ముక్త్వాఽర్జునస్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్,
విసృజ్య సశరం చాపం శోక సంవిగ్న మానసః. 47

సంజయుడు చెప్పెను:

*అర్జును డీవిధముగ రణమునందు శోకాకులుడై ధనుర్బాణము

---

* ఈ ప్రథమాధ్యాయమున ముముక్షువైనవాని లక్షణము లిట్లుండవలెనని అర్జునుని పాత్రద్వారా సూచితమైనది. చివరి శ్లోకమున మోక్షాభిలాషగల వాడు సర్వకర్మ సంన్యాసము గావింపవలెనని సూచింపబడినది.

లను బాణమై చి రథమున ఊరక కూర్చుండెను.

ఓంతత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే అర్జున విషాద
యోగో నామ ప్రథమోఽధ్యాయః.



ఓమ్

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః

# శ్రీమద్భగవద్గీత-ద్వితీయాధ్యాయము

అవ : మానవ జీవన పరమ లాభ మగు ముఖ్య సిద్ధాంతము లీ రెండవ అధ్యాయమున వివరింపబడును. ఆత్మయొక్క నిత్యత్వము అమరత్వము, దేహేంద్రియ జగత్తులయొక్క అనిత్యత్వము, అసంగాత్మబుద్ధిచే నాచరింపబడు నిష్కామకర్మ (స్వధర్మ) ఉపదేశము ఇత్యాది విషయములు —

సంజయ ఉవాచ :

తం తథా కృపయాఽఽవిష్ట మశ్రు పూర్ణాకులేక్షణమ్,
విషీదంత మిదం వాక్య మువాచ మధుసూదనః. 1

సంజయుడు చెప్పెను :

ఆ విధముగ అత్యంత కరుణావిష్టుడై కన్నీళ్ళు గ్రమ్మి ఖేదము నొందుచుండు అర్జునుని గురించి శ్రీకృష్ణపరమాత్మ ఈ విధముగ పలికెను.

శ్రీ భగవానువాచ :

కుతస్త్వా కశ్మలమిదం విషమే సముపస్థితమ్,
అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున. 2

పార్థా! శ్రేష్ఠులగు జనుల కనుచితమును నరకప్రదమునైన అకీర్తికరమగు నీచప్రవృత్తి ఇయ్యెడుదుడుకు సమయమున నీయందెట్లు కలిగెను ?

క్లైబ్యం మాస్మగమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే,
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠపరంతప. 3

పార్థా! పేడితనమును పొందవలదు. ఇది నీకు శోభ గాదు. క్షుద్రమగు నీ మానసిక దౌర్బల్యమును వీడి యుద్ధమునకు సిద్ధుడవు కమ్ము.

అర్జున ఉవాచ :

కథం భీష్మ మహం సంఖ్యే ద్రోణంచ మధుసూదన,
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హా వరిసూదన. 4

అర్జునుడు చెప్పెను:

కృష్ణా! నేను యుద్ధమునందు భీష్మద్రోణు లంతటి పూజ్యులపై బాణముల నెట్లు వేతును ?

గురూనహత్వా హి మహానుభావాన్
శ్రేయో భోక్తుం భైక్ష్య మపీహ లోకే,
హత్వార్థకామాంస్తు గురూనిహైవ
భుంజీయ భోగాన్ రుధిరప్రదిగ్ధాన్. 5

మహానుభావులగు గురువులను చంపుటకంటెను లోకమునందు భిక్షావృత్తిచే జీవించుట శ్రేష్ఠము. ప్రయోజనాపేక్షగల ఈ గురువులను చంపిన ఇచ్చటనే వారి రక్తముచే తడుపబడిన భోగముల ననుభవింప వలసి వచ్చును.

నచైతద్విద్మః కతరన్నో గరీయో
యద్వా జయేమ యది వా నో జయేయుః,
యానేవ హత్వా న జిజీవిషామ
స్తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః. 6

ఇందు మేమే జయింతుమో లేక మనలను వారే జయింతురో ఈ రెండిటియందు దేది మంచిదో మనకు తెలియదు. ఎవరిని చంపిన పిదప ఇక మనము జీవించవలయు నను ఆశయే వీడిపోవునో అట్టి యా కౌరవులే ఇచ్చట మన ఎదుట నిలిచి యున్నారు.

కార్పణ్య దోషోపహత స్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః,
యచ్ఛ్రేయస్స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్యస్తేఽహం శాధిమాం త్వాం ప్రపన్నమ్. 7

మనోదౌర్బల్యముచే నా స్వాభావికమగు శక్తి నష్టమై కర్తవ్యమూఢుడనై నిన్ను నేను అడుగుచున్నాను. కళ్యాణకరమగు దానిని నిస్సందిగ్ధముగ నాకు దెలుపుము. నేను నీ శిష్యుడను. నీకు *శరణాగతుడ నైతిని. శరణు బొందిన నాకు నీవు మార్గదర్శి వగుము. నన్ను శాసింపుము.

కృపణుని భావము కార్పణ్యము. అజ్ఞాన మని అర్థము. "యో వా ఏతదక్షరం గార్గ్య విదిత్వాఽస్మాల్లోకాత్ ప్రైతి సకృపణః" ఓగార్గీ! ఎవ్వడీ అక్షరమును అనగా ఆత్మను తెలియకయే ఈ శరీరమును వీడి పోవుచున్నాడో అతడు కృపణుడు. (దీనుడు దరిద్రుడని అర్థము.)

నహి ప్రపశ్యామి మమాపనుద్యా
ద్యచ్ఛోక ముచ్ఛోషణ మింద్రియాణామ్,
అవాప్య భూమా వసపత్న మృద్ధం
రాజ్యం సురాణా మపి చాధిపత్యమ్. 8

♦ఈ భూమి నంతయు నే యడ్డమును లేక నిష్కంటకముగ నేలు రాజ్యము నాకు కలిగినను, వేయేల! స్వర్గసామ్రాజ్యమే దొరకినను ఇంద్రియములను శోషింప జేయుచున్న ఈ మహాదుఃఖమును బాపు నుపాయమును నేను గానను.

సంజయ ఉవాచ :

ఏవముక్త్వా హృషీకేశం గుడాకేశః పరంతప,
నయోత్స్య ఇతి గోవిందముక్త్వా తూష్ణీం బభూవ హ. 9

---

* ముముక్షువైన వాడు ఆత్మజ్ఞానార్థము ఫల పుష్పాదుల నైకొని శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుడైన (విద్య, విజ్ఞానము గల) గురువును శరణుచొచ్చవలె ననెడి విషయము ఇచట సూచింపబడినది.

♦ నిత్యానిత్య వివేకము, ఇహాముత్రార్థ ఫలభోగవిరాగము ఇత్యాది సాధన చతుష్టయ సంపత్తి ముముక్షువు సంపాదింపవలె ననెడి విషయము ఇచట సూచింపబడినది.

ఇట్లు పలికి పార్థుడు నేను యుద్ధము చేయ నొల్లనని శ్రీకృష్ణుని తోఁ జెప్పి యూరకుండెను.

(ధర్మసమ్మూఢచేతసః మహతి శోకసాగరే నిమగ్నస్య అర్జునస్య అన్యత్ర ఆత్మజ్ఞానాత్ ఉద్ధరణం అపశ్యన్ భగవాన్ వాసుదేవః... ఆహ "అశోచ్యాన్" ఇత్యాది)

అవ : నిత్య నిర్దుఃఖమైన ప్రత్యగభిన్న పరమాత్మవే నీ వను తత్త్వదృష్టిచే ప్రపన్నార్తిహరుడగు భగవంతుడు ఆత్మజ్ఞానము వినా అర్జునుడు అన్యోపాయములచే నుద్ధరింప బడడని తలంచి మందస్మిత వదనారవిందుడై "అశోచ్య" నిత్యాదిగా ఉపదేశము నారంభించుచున్నాడు.

తమువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత,
సేనయో రుభయో ర్మధ్యే విషీదంత మిదం వచః. 10

రెండు సేనల నడుమ దుఃఖావిష్ట చేతస్కుడై నిలిచిన అర్జునుని గుఱించి హృషీకేశుడైన (సర్వేంద్రియప్రేరకుడగు) భగవంతుడు చిఱునవ్వు మోముతో నిట్లనెను —

అశోచ్యమగు విషయమున శోకించుట తగదు.

శ్రీభగవానువాచ :

అశోచ్యానన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే,
గతాసూ నగతాసూంశ్చ నానుశోచంతి పండితాః. 11

ఎవరికొఱకై నీవు దుఃఖంప దగదో అట్టివారిని గుఱించి దుఃఖంచుచున్నావు. మఱియు పైపెచ్చు పండితునివలె మాటలాడుచున్నావు. చచ్చినవారిని గుఱించియు బ్రతికిన వారిని గుఱించియు పండితులు దుఃఖంపరు.

జనన మరణ విషయకమగు శోకము జ్ఞానుల కుండదు. శోకార్హమగు పదార్థము ఆత్మయును గాదు అనాత్మయును గాదు. ఇట్టివిషయమున నీ వేడ్చుచున్నావన్న ఆత్మయందు అనాత్మను, అనాత్మయందు ఆత్మను దర్శించు అతత్త్వద్బుద్ధిగల అజ్ఞతచే ఏడ్చుచున్నావు. [ఉన్మత్త ఇవ అనుశోచితవానసి] పిచ్చివానివలె దుఃఖంచు వాడవైతివి. [పండితా ఆత్మజ్ఞాః నానుశోచంతి] ఆత్మజ్ఞులగు పండితులు శోకింపరు.

అవ : ఎందుచేత ననగా ఆత్మ నిత్యమై యున్నందువలన అని ఆత్మయొక్క నిత్యత్వ నిరూపణము జేయుచున్నాడు.

న త్వేవాహం జాతునాసం నత్వం నేమే జనాధిపాః,
నచైవ నభవిష్యామ స్సర్వే వయమతః పరమ్. 12.

నేను, నీవు, లేక ఈ రాజులు మొదలగు వారందఱును ఎన్నడును లేని వారని చెప్పుటకు రాదు. ఇక ముందు మన మెల్లరము ఉండుట లేదనియు చెప్పుటకు రాదు. అనగా త్రికాలాబాధితమగు సద్రూపాత్మ-స్వరూపులమై యున్నామని తెలియుము. ఒకే ఆత్మ యందు ఉపాధివశమున నే నేను, నీవు, వారు అనుమాట. వ్యవహార కల్పన. అంతే.

[త్రిష్వపి కాలేషు నిత్యాత్మస్వరూపేణ ఇత్యర్థః] భూతభవిష్యద్వర్తమానములలో — కాలత్రయమునందు — ఆత్మ స్వరూపముచే నిత్యులమయి యున్నామని అర్థము.

నిత్యమగు ఆత్మవిషయమున ధీరులు మోహము నొందరు.

దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా,
తథా దేహాంతరప్రాప్తి ర్ధీర స్తత్ర న ముహ్యతి. 13

దేహధారి యగు ఆత్మకు ఈ దేహమునందు బాల్య యౌవన వార్ధక్యావస్థ లుండినట్లే ఇతర దేహప్రాప్తియు నగును. ధీరు లీ విషయమున మోహము నొందరు. తప్పును ఒప్పుగ ఒప్పును తప్పుగ అంగీకరింపరు.

ఆత్మ నిత్యము, నిర్వికారము. అవస్థలయొక్క సంబంధము ఆత్మకు లేదు. కావున అసంగాత్మానుభవి యగు ధీరుడు జ్ఞాని మోహము నొందడు. [న మోహం ఆపద్యతే]

అవ : ఇంద్రియములయు విషయములయు సంయోగము అనిత్య మనుచు శీతోష్ణాదుల సహనమును గుఱించి తెలుపుచున్నాడు.

మాత్రాస్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణ సుఖదుఃఖదాః,
ఆగమాపాయినోఽనిత్యా స్తాం స్తితిక్షస్వ భారత. 14

అర్జునా! శీతోష్ణాదులను సుఖదుఃఖములను గలుగజేయు ఈ

బాహ్యమగు ఇంద్రియముల విషయముల స్పర్శలు ఉత్పత్తినాశములు గలవి. అనిత్యములైనవి. వీనిని నీవు సహింపుము.

[తేషు హర్షం విషాదం వా మాకార్షీః ఇత్యర్థః.] వీని విషయమై హర్ష విషాదముల నొందవలదు. సహింప వలసినదిగా చెప్పబడిన శీతోష్ణాది ద్వంద్వములు సహజ స్థితిచే నీ స్వరూపమునందు లేవు. ఇది దుఃఖమని తెలిసి సుఖవిస్మృతియైనవానికి సహించుమని చెప్పుటయే కాని తత్వజ్ఞునకు గాదు. అతనికి ఇది సహజస్థితి.

సహనముచే గలుగు ఫలము.

యం హి న వ్యథయంత్యేతే పురుషం పురుషర్షభ,
సమ దుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే. 15

పార్థా! సుఖదుఃఖము లెవ్వనికి సమానములో నిత్యాత్మదర్శియైన ధీరుడగు అట్టి పురుషుని ఈ ద్వంద్వములు వ్యథ పఱుప జాలవు. అత డమృత పదవిని బడయ సమర్థు డగును.

సత్తు, అసత్తులయొక్క స్వరూప నిర్ణయము.

నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః,
ఉభయోరపి దృష్టోఽంత స్త్వనయో స్తత్త్వ దర్శిభిః. 16

వస్తుతః లేనిది అస్తిత్వము (ఉనికి) కలదై యుండ జాలదు. అస్తిత్వము గలది (ఉన్నది) తత్వతః లేనిది కా జాలదు. తత్వజ్ఞులీ భావాభావముల (ఉనికి లేముల) రెంటియొక్క మూలమును జూచి యుందురు.

'ఉన్నది' 'లేదు' అను నీ రెండుభావములు అనాత్మయగు బుద్ధికి సంబంధించిన విషయములే ఆత్మ ఈ ఉభయ వికల్పములకు విలక్షణమును ఆధారమునై యున్నది. అట్టి ఆత్మయే తామని తత్వజ్ఞులు తెలిసి యుందురు.

ఆత్మయే సత్యమైనది.

అవినాశి తు తద్విద్ధి యేన సర్వమిదంతతమ్,
వినాశ మవ్యయస్యాస్య న కశ్చిత్కర్తు మర్హతి. 17

దేనిచే విశ్వ మెల్ల విస్తరింపబడి యున్నదో ఆ సత్యమును అవి

నాశి యని ఎఱుగుము. అట్టి అవ్యయ మగు ఆత్మయొక్క నాశము నెవరును చేయ జాలరు.

నాశము చేయువానికిని నాశము చేయబడువానికిని వ్యాపకమగు ఆత్మయే స్వరూపమై నందున అది నాశవంతము గాదు. నీ హరి ఎక్కడ ? వాని నాశ మొనర్తు నని యడిగిన హిరణ్యకశిపునకును అది వ్యాపకమని చెప్పిన ప్రహ్లాదునకును ఆధారమైయుండె నను నీ ఉదాహరణ ఇచ్చట గ్రాహ్యము.

ఆత్మానాత్మల నిత్యానిత్యత్వ ప్రతిపాదనము.

అంతవంత ఇమే దేహా నిత్యస్యోక్తా శ్శరీరిణః,
అనాశినోఽప్రమేయస్య తస్మా ద్యుధ్యస్వ భారత. 18

నిత్యమును నాశరహితమును అచింత్యము నగు శరీరియైన ఆత్మ యొక్క ఈ శరీరములు మాత్రమే నాశము గలవి. ఆత్మ నాశరహితుడు అందుచేత అర్జునా! యుద్ధము చేయుము.

ఇట్టి అప్రమేయమగు ఆత్మతత్త్వమును నాశ మొనర్తు నను కర్తృత్వ బుద్ధిని వీడుము. శ్రీరామకార్యమునందు కర్తృత్వబుద్ధిని వీడి భరతుడు రాజ్య మేలినట్లు.

ఆత్మ చంపునదియుగాదు. చంపబడునదియుగాదు.

య ఏనం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతమ్,
ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే. 19

ఆత్మ చంపు వాడనియును చంపబడువాడనియును తెలియు వారిరువురును ఈ ఆత్మయొక్క యథార్థస్వరూపమును తెలియనివారే. ఎందుకనగా ఈ ఆత్మ చంపుటయు లేదు; చంపబడుటయును లేదు.

అజ్ఞాన కార్యములైన క్రియాకారకఫలములు అనాత్మయగు దేహగేహాదులయందే ప్రవర్తించునవిగాని స్వయంసిద్ధమైన నిరవయవ మగు ఆత్మయందు సంభవింపవు.

ఆత్మకు షడ్భావ వికారములు లేవు.

నజాయతే మ్రియతే వా కదాచి
న్నాయం భూత్వా భవితా వా నభూయః,

(3)

అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే. 20

ఇతడు (ఆత్మ) పుట్టుటయు లేదు, చచ్చుటయును లేదు. మొదట ఉండి ఆ పిదప లేక పోవు వాడును కాదు. ఇతడు జన్మరహితుడు; నిత్యుడు, శాశ్వతుడు, సనాతనుడు. శరీరము చంపబడినను ఇతడు చంపబడుట లేదు.

[న విపరిణమ్యతే ఇత్యర్థః] ఆత్మ పరిణామరహితుడు.

వేదావినాశినం నిత్యం యఏనమజ మవ్యయమ్,
కథం స పురుషః పార్థ కం ఘాతయతి హన్తికమ్. 21

అజమును, నిత్యమును, అవ్యయమును, అవినాశియునగు ఆత్మ తత్త్వము నెఱిగిన పురుషుడు పార్థా ఎవరిని ఎట్లు చంపగలడు ? ఎట్లు చంపింపగలడు?

అవిక్రియమగు అద్వితీయాత్మ నే నని తెలిసిన జ్ఞానికి ఏకర్మ యును లేదని తత్త్వార్థము. ఇచ్చట చంపుట యను క్రియ ఉదాహరణా ర్థమైయే వాడబడిన దని తెలియవలెను.

ఆత్మకు దేహాంతరప్రాప్తి విషయమున దృష్టాంతము.

వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి,
తథా శరీరాణి విహాయ జీర్ణా న్యన్యాని సంయాతి నవాని దేహీ,

మనుష్యుడు జీర్ణమైన (చినిగిన) వస్త్రములను విడిచి నూతన వస్త్రములను ధరించు పగిది ఆత్మ జీర్ణమైన (శిథిలమైన) శరీరములను వీడి నూతనమగు దేహములను ధరించును.

అవ : వ్యాపకమగు ఆత్మయొక్క నిత్యత్వమును మరల విస్తారముగ వర్ణించు చున్నాడు.

నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః,
నచైనం క్లేదయంత్యాపో న శోషయతి మారుతః. 23

ఇతనిని శస్త్రములు ఛేదింప జాలవు. అగ్ని కాల్చదు. జలము తడుప జాలదు. వాయువు ఎండింప (ఆర్ప) జాలదు.

అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవచ,
నిత్యస్సర్వగతస్థాణు రచలోఽయం సనాతనః. 24

ఈ ఆత్మ ఛేదించుటకును, కాల్చుటకును, తడుపుటకును, ఎండింప జేయుటకును సాధ్యము కానివాడు. ఆత్మ (ఇతడు) నిత్యుడు, సర్వ వ్యాపకుడు, స్థిరుడు, అచలుడు, సనాతనుడు.

అవ్యక్తోఽయ మచిన్త్యోఽయ మవికార్యోఽయ ముచ్యతే,
తస్మా దేవం విదిత్వైనం నానుశోచితు మర్హసి. 25

ఇతడు (ఈ ఆత్మ) అవ్యక్తస్వరూపుడు. అచింత్యుడు వికార రహితుడని చెప్పుదురు. అందుచేత ఇతని యథార్థ స్వరూపమును దెలిసి నీవు శోకింప దగవు. "తరతి శోకమాత్మవిత్"

అవ : రెండవ పక్షము : జీవదృష్టి ననుసరించి చూచినను ఆత్మను గుఱించి శోకించుట తగదు.

అథచైనం నిత్యజాతం నిత్యంవా మన్యసేమృతమ్,
తథాపి త్వం మహాబాహో నైవం శోచితు మర్హసి. 26

మహాబాహూ! ఇక ఈ ఆత్మ నిత్యము పుట్టువాడును చచ్చు వాడు నని నీవు తలచినను ఈ ఆత్మవిషయమై శోకము చేయుట అను చితము.

జాతస్యహి ధ్రువో మృత్యు ర్ధ్రువం జన్మ మృతస్యచ,
తస్మా దపరిహార్యేఽర్థే నత్వం శోచితు మర్హసి. 26

పుట్టిన వానికి చావు, చచ్చిన వానికి పుట్టుక తప్పదు. ఈ రెంటిని తప్పించుటకు శక్యము కాదు. కావున నీ వీ విషయమున దుఃఖిం చుట యోగ్యము గాదు.

అవ : శరీరము లనిత్యములు. వీని విషయమై నీవు శోకింప దగదు,

అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత,
అవ్యక్త నిధనాన్యేవ తత్ర కా పరిదేవనా. 28

పార్థా! ఈ యగపడు భూతములు ఆరంభము నందును అంత మునందును నగపడనివే. మధ్యకాలమున మాత్రము వ్యక్తములైనవి

(అగపడినవానివలె ఉండునవి) అందువలన వీని విషయమై శోకమెందులకు? తగదని అర్థము.

అవ: ఆత్మతత్త్వమును చెప్పుట, తెలియుట, వినుట, అత్యంత దుర్లభమనుచున్నాడు.

ఆశ్చర్యవ త్పశ్యతి కశ్చిదేన
మాశ్చర్యవ ద్వదతి తథైవచాన్యః,
ఆశ్చర్యవచ్చైనమన్యశ్శృణోతి
శ్రుత్వాప్యేనం వేదనచైవకశ్చిత్. 29

ఆత్మను కొందఱు ఆశ్చర్యముగా చూతురు. అటువలె కొందఱు ఆశ్చర్యముగ చెప్పుదురు. కొందఱు ఆశ్చర్యముగా ఈ విషయమును చెప్ప విందురు. ఇట్లు వినికూడా ఇది యిట్టిదని ఎవఱును ఎఱుగుట లేదు. తాత్పర్య మేమన, ఆత్మతత్త్వము మనో వాక్కుల కతీతమై చూచువాని స్వరూపమును, చెప్పువాని స్వరూపమును, వినువాని స్వరూపమును, అదియే యైయున్నందువలన తమకంటె అన్యమగు ప్రమేయ పదార్థముగ జూడనెంచునట్టి గురుకృప లేనివారికి వేద్యము గాదు. కాని గురుకృపాలబ్ధి నొందిన వానికి ఆశ్చర్యము గాక దశముని పరిజ్ఞానమువలె స్వరూపమాత్రమై యున్నది. చెప్పువారియందు శ్రోత్రియ బ్రహ్మనిష్ఠులగు గురువులును, వినువారియందు ఉత్తములగు ముముక్షువులైన అధికారులును దుర్లభ మైనందున ఈ తత్త్వము ఆశ్చర్యమని చెప్పబడినది.

దేహీ నిత్య మవధ్యోఽయం దేహే సర్వస్య భారత,
తస్మా త్సర్వాణి భూతాని నత్వం శోచితు మర్హసి, 30

భారతా! సర్వదేహముల యందుండు ఈ ఆత్మ ఎప్పుడును చచ్చునది గాదు. అందువలన ఏ భూతముల విషయమైగూడ నీవు శోకించుట తగవు.

క్షత్రియులకు యుద్ధకర్మ విధ్యుక్తము.

స్వధర్మ మపి చావేక్ష్య నవికంపితు మర్హసి,
ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య నవిద్యతే. 31

ఇక స్వధర్మమువైపు జూచినను, నీవు వెనుకంజ వేయరాదు.

క్షత్రియులకు ధర్మమగు యుద్ధమునకంటె ఎక్కువ శుభదాయకమైన కర్మ మజేమియును లేదు.

యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వార మపావృతం,
సుఖినః క్షత్రియాః పార్థ లభంతే యుద్ధమీదృశమ్. 32

పార్థా! దైవబలమొందిన క్షత్రియులకు మాత్రము ఇట్లు తనంత తానే వచ్చి తలుపులు తెఱవబడిన స్వర్గముపలె ఇట్టి యుద్ధము ప్రాప్తించును.

అథచేత్త్వ మిమం ధర్మ్యం సంగ్రామం నకరిష్యసి,
తత స్స్వధర్మం కీర్తించ హిత్వా పాప మవాప్స్యసి. 33

నీవు ఈ ధర్మయుక్తమగు యుద్ధము చేయవేని స్వధర్మమును మఱియు కీర్తిని పోగొట్టుకొన్నవాడవై పాపమునకు గుఱి యగుదువు.

అకీర్తించాపి భూతాని కథయిష్యంతి తేఽవ్యయామ్,
సంభావితస్య చాకీర్తి ర్మరణా దతిరిచ్యతే. 34

ఇంతేగాక ఎల్లరు నీ అపకీర్తిని సంతతము చెప్పుకొనుచుందురు. సంభావితునకు అపకీర్తి చావు కంటెను చెడ్డది.

భయాద్రణాదుపరతం మన్యంతే త్వాం మహారథాః,
యేషాం చ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవమ్. 35

యుద్ధమునుండి భయమొంది వెను దిరిగితివనియే ఈ మహారథు లెల్లఱు నిన్ను భావింతురు. ఎవరిచే నీ వింతవఱకు మర్యాదను బడసి యున్నావో వారే నిన్ను అయోగ్యు డని తలంతురు.

అవాచ్యవాదాంశ్చ బహూన్ వదిష్యంతి తవాహితాః,
నిదంత స్తవ సామర్థ్యం తతో దుఃఖతరం నుకిమ్, 36

నీ ఈ శత్రువులు నీ సామర్థ్యమును హేళన మొనర్తురు. ఆడరాని మాట లనేకములు నాడుదురు. ఇంతకంటెను ఎక్కువ దుఃఖప్రదమగు న దేది గలదు?

హతో వా ప్రాప్స్యసీ స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్,
తస్మా దుత్తిష్ఠ కౌంతేయ యుద్ధాయ కృతనిశ్చయః 37

చచ్చిన స్వర్గము, విజయ మొందిన ఈ భూరాజ్యోపభోగము నీకే. ఎట్లు జూచినను నీ కిదే విహితమై యున్నది. ఓ కౌంతేయా! పోరాడుటకొఱకై నిశ్చయము జేసికొని లెమ్ము.

సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ,
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాప మవాప్స్యసి. 38

సుఖ దుఃఖములు లాభాలాభములు జయాపజయములు వీని యందు సమదృష్టి గలవాడవై ఆ పిదప యుద్ధమునకు ప్రవృత్తుడవు గమ్ము. అప్పుడు నీకు పాప మాపాదింపదు.

పాపమునకు కారణము కామ్యముతోగూడిన కర్తృత్వబుద్ధి. అట్టి కర్తృత్వము లేనివాడవై యుద్ధకర్మ నాచరింపుమని భావము.

నిష్కామకర్మయోగము యొక్క మహిమ.

ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధి ర్యోగే త్విమాం శృణు,
బుద్ధ్యా యుక్తో యయా పార్థ కర్మబంధం ప్రహాస్యసి. 39

ఈ విధముగా సాంఖ్యశాస్త్రము ననుసరించి అర్థాత్ జ్ఞాన శాస్త్రము ననుసరించి వస్తు తత్వ జ్ఞానమును జెప్పితిని. ఇక ఏ జ్ఞానము నాశ్రయించిన కర్మ బంధింపదో, ఆ బుద్ధి యోగ విషయక మగు జ్ఞానమును చెప్పెదను వినుము.

నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే,
స్వల్ప మప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్. 40

ఈ నిష్కామ యోగమార్గమునందు అభిక్రమనాశము (ప్రారంభించినది విఫలమగుట) గాని ప్రత్యవాయము (వ్యతిరేకమైన ఫలము నిచ్చుట) గాని లేదు. దీని ఆచరణ యత్కించిత్తు ఐనను మానవుని మహత్తరమగు భయమునుండి రక్షించును.

వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునన్దన,
బహుశాఖా హ్యనన్తాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్. 41

అర్జునా! ఈ యోగమునందు సునిశ్చితమగు (వ్యవసాయాత్మిక) బుద్ధివృత్తి ఏకముగా నుండును. ఇక నిశ్చయము లేనివారి బుద్ధి

మైనచో నానా విచారములచే నిండినదియును వివిధ ప్రకారముల పారాడునదియునై యున్నది.

కామ వాసనా విశిష్టులగు మానవుల స్వభావము.

యామిమాం పుష్పితాం వాచం ప్రవదంత్య విపశ్చితః,
వేదవాదరతాః పార్థ నాన్యదస్తీతి వాదినః. 42

పార్థా! వేదము నందలి కర్మకాండోక్తమగు అర్థవాదశ్రుతులకు మరిగి అందు మగ్నులైనవారు అంతకంటె అధికముగ మతేమి గలదని వాద మొనర్చుచు వన్నె చిన్నెలచే నొప్పు మాటలను జెప్పికొనుచుందురు.

కామాత్మాన స్వర్గపరా జన్మకర్మ ఫలప్రదామ్,
క్రియా విశేష బహుళాం భోగైశ్వర్యగతిం ప్రతి. 43

మఱియు విషయాసక్తిపరులై నానాప్రకారమగు కర్మలచే నూతనమగు జన్మల నొందుట యను ఫలము దొరకి మహాభోగ భాగ్యములచే నొప్పు స్వర్గమను గతి మాకు దొరకునని చెప్పుకొనుచు ఆపాత రమణీయమైన స్వర్గాదిభోగైశ్వర్యముల యాసక్తితో గూడుకొని యుందురు.

భోగైశ్వర్య ప్రసక్తానాం తయాఽపహృత చేతసామ్,
వ్యవసాయాత్మికా బుద్ధి స్సమాధౌ నవిధీయతే. 44

ఇట్టి అనాత్మవిషయవాసనలచే పరిపూర్ణమైన వారి మనస్సు వివిధ రీతుల ఈడ్వబడునదై భోగైశ్వర్యముల యందలి ఆసక్తిచే మోహ మొందిన వారి బుద్ధి సమాధిస్థితిని అనగా సమమగు ఆత్మ యందు నిలుకడ నొందుటయందు సమర్థమైనది కాదు.

త్రైగుణ్య విషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున,
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్. 45

వేదములు త్రిగుణాత్మకములగు విషయములచే నిండియున్నవి. కర్తృతంత్రములగు కర్మోపాసనాది భాగములచే నున్నవని భావము. నీవు త్రిగుణాతీతుడవుకమ్ము. ద్వంద్వ రహితుడవును. నిత్య సత్త్వస్థుడవును

అనగా ఆత్మప్రతిష్ఠితుడవును, యోగక్షేమముల చింతను వీడిన వాడవును ఆత్మమాత్రుడవు నగుము.

ఆత్మానుభవముచే జూడ యోగ క్షేమములు అర్థ రహితములు. ఆత్మ చిర సిద్ధము గాన సంపాద్యమును గాదు. నిత్యసుఖస్వరూపము గావున క్షేమ రహితమును గాదు. నిత్యానంద స్వరూప మని ఇందలి తాత్పర్యము.

యావానర్థ ఉదపానే సర్వతస్సంప్లుతోదకే,
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః. 46

ఎల్లెడల నీరు నిండి యుండగా బావిమొదలగు జలాశయముల యందెంతప్రయోజనమో బ్రహ్మజ్ఞాని యగు వానికి వేదములయొక్క ప్రయోజనమును అంతే! అనగా బ్రహ్మజ్ఞానమునందు ఇతర మగుసర్వ కర్మఫలములు అంతర్గతములై యున్నవని భావము.

కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన,
మా కర్మఫలహేతుర్భూ ర్మాతే సంగోఽస్త్వకర్మణి. 47

కర్మ చేయుటయందు మాత్రము నీ కధికారము గలదు. ఫల విషయకమగు అధికారము నీకు లేదు. కర్మఫలాశ గలవాడవు గాకుము. మఱియు అట్లయిన కర్మ చేయనేల? అని కర్మ చేయ కుండుట యందును ఆసక్తి గలవాడవు కావలదు. అసంగాత్మ బుద్ధిచే కర్తవ్యకర్మ నాచరించుమని భావము.

యోగస్థః కురు కర్మాణి సఙ్గం త్యక్త్వా ధనంజయ,
సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే. 48

ధనంజయా! ఆసక్తిని వీడి యోగస్థుడవై అనగా భగవద్బుద్ధి గలవాడవై సిద్ధ్యసిద్ధులను సమమని భావించి కర్మ నాచరించుము. బుద్ధియొక్క సమత్వమునకే యోగ మందురు.

ఫలాపేక్ష లేక ఈశ్వరార్పణ బుద్ధితో కర్మ చేయుచుండ మనస్సు శుద్ధమై ఆ మూలమున జ్ఞానసిద్ధి ఏర్పడును. అది ఇట్టిదను ఆపేక్షయును వదలి కర్మ చేయుమని భావము.

సకామకర్మయొక్క నింద, నిష్కామకర్మ యొక్క ప్రశంస.

దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగా ద్ధనంజయ,
బుద్ధౌ శరణ మన్విచ్ఛ కృపణాః ఫలహేతవః. 49

బుద్ధియొక్క సమత్వ రూపమగు నీ యోగము–ఎదుట (ఫలము నపేక్షించి చేయు) కర్మ నీచ మైనది. కాబట్టి నీవు సమబుద్ధికి శరణాగతుడవు కమ్ము. ఫలాపేక్ష గలవారు హీనులు, దరిద్రులు.

బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృత దుష్కృతే,
తస్మా ద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్. 50

సామ్యబుద్ధి గలవాడు (సత్వశుద్ధిచే జ్ఞానమును బడసిన వాడు) ఈ లోకమున పుణ్యాపాపములను దాటును. అతీతు డగును. అందుచే నీ వీ యోగము నవలంబింపుము. కర్తవ్యమగు కర్మ నాచరించి యా కర్మచే అంటబడక యుండు కుశలతయే యోగ మనబడును. కర్తను కట్టివేయుటయే స్వభావముగా గల కర్మలు తమ స్వభావమును వీడి వెళ్లునట్లు కర్మల జేయుటయే కర్మకౌశలము. అర్థాత్ సమత్వబుద్ధిచే నొప్పు జ్ఞానమని అర్థము.

కర్మజం బుద్ధియుక్తాహి ఫలం త్యక్త్వా మనీషిణః,
జన్మ బంధ వినిర్ముక్తాః పదం గచ్ఛంత్యనామయమ్. 51

సామ్యబుద్ధిగల జనులు (జ్ఞానులు) కర్మఫలమును విడిచి జన్మ బంధమునుండి ముక్తులై శోకరహితమగు పరమ పదవిని బడయుదురు.

యదా తే మోహకలిలం బుద్ధి ర్వ్యతితరిష్యతి,
తదా గంతాఽసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్యచ. 52

అర్జునా! నీబుద్ధి మోహమను దోషమునుండి దూరమైన (దాటి నట్లయిన) అపుడు నీవు వినిన, వినదగిన సర్వవిషయముల యందును విరక్తి నొందెదవు. ఇక చాలు ననిపించును.

శ్రుతి విప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా,
సమాధా వచలా బుద్ధి స్తదా యోగ మవాప్స్యసి. 53

వివిధములగు వేదవచనములచే సంచలన మొందిన నీ బుద్ధి నిశ్చ

(4)

లతనొంది సమాధియందు స్థిరముగా నిలిచినపుడు అనగా విక్షేపరహితమై చిత్తము బ్రహ్మైకయుక్తమైనపుడు నీకా యోగస్థితి కలుగును.

అవ : స్థిరబుద్ధి గలయట్టి స్థితప్రజ్ఞుని విషయమై అర్జునుని ప్రశ్న (నాలుగు ప్రకారములు).

అర్జున ఉవాచ :

స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ,
స్థితధీః కిం ప్రభాషేత కిమాసీత వ్రజేత కిమ్. 54

స్థితప్రజ్ఞుడని సమాధిస్థుడని ఎవని ననవలయును ? కేశవా ! స్థిరబుద్ధి గలవాడు ఎట్లు మాటలాడును ? ఎట్లుండును ? ఏ విధముగ వర్తించును ?

సమాధిస్థితుడగు స్థితప్రజ్ఞుని లక్షణములు.

శ్రీ భగవానువాచ :

ప్రజహాతి యదా కామాన్ సర్వాన్పార్థ మనోగతాన్,
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్తదోచ్యతే. 55

పార్థా ! మానవుడు తన మనస్సునం దుండిన ఎల్ల కామముల నెప్పుడు లెస్సగా విడచి తనయందు తానే అనగా ఆత్మచే ఆత్మయందే సంతుష్టుడాయెనో అపుడు స్థిరమగు జ్ఞానము గలవాడని చెప్పబడును. స్థితప్రజ్ఞుడని అర్థము. వస్తుతః మనస్సనునది తన రూపముచే స్థితప్రజ్ఞునియం దుండదు. కామములచే విముక్తమైన మనస్సు బ్రహ్మమే.

దుఃఖేష్వనుద్విగ్నమనా స్సుఖేషు విగతస్పృహః,
వీత రాగ భయ క్రోధః స్థితధీ ర్ముని రుచ్యతే. 56

దుఃఖములచే క్షోభము నొందని వాడును సుఖములయందు స్పృహ (ఆసక్తి) లేనివాడును అనురాగము భయము క్రోధమును విడచిన వాడును అగు ముని స్థిరబుద్ధి గలవాడని చెప్పబడును.

యస్సర్వత్రానభిస్నేహ స్తత్తత్ప్రాప్య శుభాశుభమ్,
నాభినందతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. 57

ఎవడు సర్వవిషయములయం దనాసక్తుడై శుభాశుభములను

పొందియు హర్ష విషాదముల నొంద కుండునో ఆతడు స్థితప్రజ్ఞుడు. స్థిరబుద్ధి గలవాడు.

యదా సంహరతే చాయం కూర్మోఽంగానీవ సర్వశః,
ఇంద్రియాణీంద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. 58

తాబేలు తన సర్వావయవములను లోన ముడుచు కొనునట్లు ఎవడు తన ఇంద్రియములను విషయములవైపు పోనివ్వక నిగ్రహించునో ఆతడు స్థిరబుద్ధి గలవాడు.

ఇచ్చట ఇంద్రియ నిగ్రహ మనగా తాబేలువలె విషయములచే భయగ్రస్తుడై ముడుచు కొనుట యని కాదు. వివేక దృష్టిచే గలిగిన అనాత్మ పదార్థముల మిథ్యాత్వనిశ్చయ పూర్వకమగు నిర్మోహమైన దృష్టియుక్తమగు యథోచిత వ్యవహారమని గ్రహింపవలెను.

విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః,
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే. 59

నిరాహారు డగు వాడు భోగానుభవశక్తి విహీను డయినందు వలన విషయము లతని నుండి విడిచి పోవును. దూర మగును. కాని తద్విషయకమగు రసము అనగా ఆసక్తి పోదు. పరమగు బ్రహ్మతత్త్వమును దెలిసిన ఆసక్తి దూరమగును.

ఆత్మ బ్రహ్మమేనను అపరోక్షానుభవము నొంద వాసనలు తన్ను వీడిపోవును. అన్యథా యవి వదలవని భావము.

ఇంద్రియము లత్యంత బలీయములు

యతతో హ్యపి కౌంతేయ పురుషస్య విపశ్చితః,
ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః. 60

కౌంతేయా! విద్వాంసుడు అనగా (ఇచట) అభ్యాసి ఎంత యత్నించినను చంచలమగు ఇంద్రియములు అతని మనస్సును బలవంతముగ అపమార్గముల బట్టించును.

తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః,
వశే హి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. 61

కావున ఇంద్రియముల నన్నిటిని సంయమించి నాయందే నిష్ఠ గలవాడై ఉండవలెను. ఎవడు ఇంద్రియములను తన వశమునం దుంచుకొని యుండునో అతని బుద్ధియే స్థిరమైనది.

అవ : విషయానుచింతనముచే తదాసక్తియును తన్మూలమున క్రమముగా గలుగు మానవుని పతనమును దెలుపుచున్నాడు.

ధ్యాయతో విషయాన్పుంస స్సంగ స్తేషూపజాయతే.
సంగా త్సంజాయతే కామః కామా త్క్రోధోఽభిజాయతే. 62

విషయములను చింతించు వానికి విషయాసక్తి గలుగును. అయ్యాసక్తిచే కామము పుట్టును. ఆ కామితపదార్థమున కడ్డువచ్చిన క్రోధ ముత్పన్న మగును.

క్రోధా ద్భవతిసమ్మోహ స్సమ్మోహా త్స్మృతివిభ్రమః,
స్మృతిభ్రంశా ద్బుద్ధినాశో బుద్ధినాశా త్ప్రణశ్యతి. 63

క్రోధముచే మోహమును (మూఢతయు) దానిచే ఆత్మవిస్మృతియు గలుగును (స్మరణశక్తి లేకపోవును) తద్ద్వారా బుద్ధినాశము నగును. బుద్ధి ఎంతవఱకు కార్యాకార్యముల నెఱుగ (వివేచింప) శక్తిమంతమై యుండునో అంతవఱకుమాత్రమే మానవత్వము ఉండును. బుద్ధినాశమైనచో అతడు సర్వానర్థములను జెందును. పతన మగును.

రాగద్వేష వియుక్తైస్తు విషయా నింద్రియైశ్చరన్,
ఆత్మవశ్యై ర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి. 64

అంతఃకరణమును తన వశమునం దుంచుకొన్న వాడు రాగద్వేష రహితుడై స్వాధీనములైన ఇంద్రియములచే విషయముల ననుభవించుచు (విధేయాత్మ) మనః ప్రసాదమును పొందును. ప్రసాద మనగా ప్రసన్నత. స్వస్థత నొందునని అర్థము.

ప్రసాదే సర్వ దుఃఖానాం హాని రస్యోపజాయతే,
ప్రసన్న చేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే. 65

చిత్తము ప్రసన్నమాయెనా ఆధ్యాత్మికాది సర్వదుఃఖములు దూర మగును. స్వాస్థ్యమగు ప్రసన్నచిత్తత గలవాని బుద్ధి సత్వరమున స్థిరత నొందును.

అవ : సాధన విహీనుడగు పురుషునకు సత్య విషయకమగు అస్తిత్వమును, శాంతి యును, సుఖమును లేదు.

నాస్తి బుద్ధి రయుక్తస్య నచాయుక్తస్య భావనా,
నచాభావయతశ్శాంతి రశాంతస్య కుత స్సుఖమ్. 66

బుద్ధి స్థిరత లేని అయుక్తునకు జ్ఞానము గలుగదు. ధ్యానము సాధింప బడదు. ధ్యానము (భావన) లేని వానికి శాంతి అలవడదు. అశాంతునకు సుఖమనున దెక్కడ?

ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే,
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావ మివాంభసి. 67

ఈ మనస్సు చంచలమగు ఇంద్రియముల వెంటబడి వెళ్ళ నారంభించిన యెడల సముద్రమునందు పెను గాలికి జిక్కిన నావ పెడ త్రోవ బట్టి భ్రష్టమయినటుల అట్టి మనస్సు మానవు నపమార్గమున దీసికొని వెళ్ళునని భావము.

తస్మాద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః,
ఇంద్రియాణీంద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. 68

అర్జునా! ఎవని ఇంద్రియములు విషయములనుండి చక్కగ సర్వవిధములచే నిగ్రహింపబడి యున్నవో అతని బుద్ధియే స్థిరమైనది.

అవ : అజ్ఞానులయొక్క నిశ్చయము నందు పరమార్థతత్త్వ మభావము నొందును. ఆత్మజ్ఞానియొక్క నిశ్చయమున సృష్టి అత్యంతాభావమగునని తెలుపు చున్నారు.

యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ,
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః. 69

సమస్త భూతములకు ఏది రాత్రియో దానియందు సంయమి తత్త్వజ్ఞాని మేల్కాంచి యుండును. దేనియందు సర్వభూతములు మేల్కాంచియున్నవో దానిని చూచుచుండు జ్ఞానియగు మునికి అది రాత్రియున్నట్లు. అనగా అజ్ఞులగు జీవులకు పరమార్థతత్త్వము రాత్రి వలె మబ్బునియు, అట్టి అజ్ఞాననిద్రనుండి మేల్కాంచిన వాడు స్థిత ప్రజ్ఞుడగు జ్ఞాని యనియు తాత్పర్యము. రాత్రి పగలనియు, పగలే

రాత్రి యనియు సంచరించు ఉలూకాది ప్రాణులే ఇందుల కుదాహరణము.

బ్రహ్మజ్ఞాని సముద్రము వంటివాడు.

ఆపూర్యమాణ మచలప్రతిష్ఠం
సముద్రమాపః ప్రవిశంతి యద్వత్,
తద్వత్కామాయం ప్రవిశంతి సర్వే
స శాంతి మాప్నోతి న కామకామీ. 70

(జలముచే) సర్వదిక్కులనుండి వచ్చి నిండింప బడుచున్నను అచలమును స్థిరమునై యుండు సముద్రమునందు సమస్త నదుల ప్రవాహము లన్నియు వచ్చి తనలో ప్రవేశించునట్లు సమస్త కామములు వచ్చి తన్ను వరించినను ఎవని మనస్సు స్థిరమై యున్నదో అతడు శాంతిని బొందును. కోరికలు గలవాడు శాంతిని పొందజాలడు.

అహంమమాభిమానముల త్యాగముచే పరమశాంతిప్రాప్తి

విహాయ కామాన్ యస్సర్వాన్ పుమాంశ్చరతి నిస్పృహః,
నిర్మమో నిరహంకార స్సశాంతి మధిగచ్ఛతి. 71

ఏ పురుషుడు సర్వ కామములను వీడి నిస్పృహుడై ప్రవర్తించునో నిర్మముడును నిరహంకారుడునై యుండునో అతడు శాంతిని పొందును.

బ్రాహ్మీస్థితి యొక్క మహిమ

ఏషా బ్రాహ్మీస్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి,
స్థిత్వాఽస్యా మంతకాలేఽపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి. 72

పార్థా! ఇదే బ్రాహ్మీస్థితి. ఒక్కసారి ఈ స్థితి ప్రాప్తమైనచో మానవుడు మోహమున మునుగడు. వేయేల! అంత్యకాలమునందీస్థితి యలవడినను అతడు బ్రహ్మనిర్వాణమును (మోక్షమును) పొందును.

ఓంతత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే సాంఖ్యయోగోనామ ద్వితీయోఽధ్యాయః.

ఓమ్

శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీమద్భగవద్గీత-తృతీయాధ్యాయము

అవ : జ్ఞానకర్మల రెండింటియందు ఏది ఉత్తమ మయినదో నిశ్చయించి నాకు దెలుపు మను అర్జునుని ప్రశ్నమూలమున ఈ అధ్యాయమునందు జ్ఞాన సాధనమగు కర్మయోగమును గుఱించి విస్తారముగ ప్రతిపాదింపబడును.

అర్జున ఉవాచ :

జ్యాయసీచే త్కర్మణ స్తే మతా బుద్ధి ర్జనార్దన,
తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ. 1

కర్మకంటెను స్థిరబుద్ధియే శ్రేష్ఠమని నీ మతమయి యుండిన ఓకృష్ణా! జనార్దనా! నన్నీ ఘోరమగు కర్మకూపమున నెందులకు ద్రోసెదవు?

వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే,
తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహ మాప్నుయామ్. 2

నీ సందిగ్ధమగు వచనములచేత నా బుద్ధి భ్రమించుచున్నది. అందుచేత నాకు శ్రేయస్సు చేకూరునట్లు ఒకే మాటను నిశ్చయించి చెప్పుము.

అధికారి ప్రభేదము ననుసరించి నిష్ఠ ద్వివిధము

శ్రీ భగవా నువాచ :

లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయాఽనఘ,
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్. 3

ఓ పాపరహితుడా! జ్ఞానయోగమని సాంఖ్యుల మార్గము. కర్మయోగమని యోగుల మార్గము. ఇట్లు రెండు విధముల ముక్తిమార్గములు ఈ లోకము నందు గలవని నేను పూర్వము చెప్పియున్నాను. ఇచ్చట చెప్పబడిన జ్ఞానకర్మ లను రెండు యోగములు రెండుగాను ఒకటే. నిష్కామకర్మద్వారా చిత్తశుద్ధి, ఆ మూలమున జ్ఞానము సిద్ధించునని తాత్పర్యము.

అవ : నిష్కామకర్మానుష్ఠానము లేనిదే నైష్కర్మ్యమనబడు జ్ఞానము (ముక్తి) దొరకదని చెప్పుచున్నారు.

న కర్మణా మనారంభా న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే,
న చ సంన్యసనా దేవ సిద్ధిం సమధిగచ్ఛతి. 4

కేవలము కర్మలు చేయకున్నంత మాత్రమున నైష్కర్మ్యమన బరగు జ్ఞానము దొరకునది గాదు. కర్మ సంన్యాస మాత్రమున అది సంప్రాప్త మగునది కాదు.

నహి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్,
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజై ర్గుణైః. 5

ఎవరును కర్మరహితులై ఒక క్షణమైన నుండ జాలరు. ప్రకృతికి వశులగు నందఱచేతను ఈ త్రిగుణాత్మికమైన ప్రకృతియే కర్మ నాచరింప జేయును.

ఇది అజ్ఞులకు సంబంధించిన మాట యని తెలియ వలయును. ఏలయన, జ్ఞానులు ప్రకృతికి వశులు గారు గావున ఇది వారి విషయమైన ప్రసంగము గాదు. చిత్తశుద్ధ్యర్థమై నిష్కామముగ తప్పనిసరి సాధకుడు తన విధ్యుక్తకర్మ నాచరింప వలయుననియే ఇచ్చట గ్రహింప వలయును.

మిథ్యాచారి యొక్క లక్షణము.

కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్,
ఇంద్రియార్థా న్విమూఢాత్మా మిథ్యాచారస్స ఉచ్యతే. 6

కర్మేంద్రియములను మాత్రము బిగబట్టి మనస్సుచే విషయములను స్మరించుచుండు మూఢుడు *మిథ్యాచారి యని చెప్పబడును.

నిష్కామ కర్మయోగి శ్రేష్ఠుడు.

య స్త్వింద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున,
కర్మేంద్రియైః కర్మయోగ మసక్త స్స విశిష్యతే. 7

* దురాచారికంటె మిథ్యాచారి శ్రేష్ఠుడు. మిథ్యాచారికంటె సదాచరణ గలవాడు శ్రేష్ఠుడు. సదాచారము గల వానికంటె నైష్కర్మ్యము సిద్ధించిన వాడు శ్రేష్ఠుడు. వానికంటె శ్రేష్ఠుడు "న భూతో న భవిష్యతి."

అర్జునా! ఎవడైతే మనస్సుచే ఇంద్రియములను చక్కగా నియమించి అనాసక్తుడై కర్మేంద్రియములచే కర్మయోగము నవలంబించునో అతడు శ్రేష్ఠుడు.

నిష్కామ కర్మాచరణచే చిత్తశుద్ధి గలుగ తన్మూలమున వాక్యార్థ జన్య జ్ఞానానుభవముచే వాసనలు వీడును గాని అన్యోపాయములచే వాసనలు వీడవని భావము.

అవ : శాస్త్ర విహిత మగు కర్మల నాచరించు విషయమున భగవదాజ్ఞ.

నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః,
శరీరయాత్రాఽపిచ తే న ప్రసిద్ధ్యే దకర్మణః. 8

శాస్త్ర విహితమై కర్తవ్యమై యుండు కర్మను చేయుము. కర్మ చేయ కుండుట కంటెను చేయుట మంచిది. కర్మ నాచరింపక యుండిన ఈ శరీర పోషణము గూడ నసాధ్యము.

యజ్ఞార్థా త్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః,
తదర్థం కర్మ కౌంతేయ ముక్తసంగ స్సమాచర. 9

యజ్ఞార్థమై ఆచరింపబడు కర్మలు వినా తక్కినవి బంధహేతువులు. ఓ కుంతీనందనా! అనాసక్తుడవై యజ్ఞార్థమైన (భగవత్ప్రీతికరమైన) కర్మ చేయుము.

అవ : ప్రజాపతి ఆజ్ఞ చొప్పున ఈ సృష్టియందు చరించుటచే ప్రజలకు పరమ శ్రేయస్సు చేకూరును.

సహ యజ్ఞాః ప్రజా స్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః,
అనేన ప్రసవిష్యధ్వ మేష వోఽస్త్విష్ట కామధుక్. 10

పూర్వము ప్రజాపతి యజ్ఞముతోబాటు ప్రజలను సృష్టించి ఇట్లు చెప్పెను. ఈ యజ్ఞముచే మీరు వృద్ధి నొందుడి. ఇది మీ కామధేనువు.

దేవాన్భావయతాఽనేన తే దేవా భావయంతు వః,
పరస్పరం భావయంత శ్శ్రేయః పర మవాప్స్యథ. 11

యజ్ఞముచే మీరు దేవతలను ఆరాధించుడి. దేవతలు మీకు

సమృద్ధమగు ఫలముల నిత్తురు. ఇట్లు పరస్పర మొకరి నొకరు తృప్తి నొందించు కొనుచు ఉత్తమ మగు శ్రేయస్సును బడయుడి.

అవ : దైవ నివేదనము చేయకయే చేసెడు భోగానుభవము నింద్యార్హము.

ఇష్టాన్భోగాన్హి వో దేవా దాస్యంతే యజ్ఞ భావితాః,
తైర్దత్తా న ప్రదాయైభ్యోయో భుంక్తే స్తేన ఏవ సః. 12

యజ్ఞముచే ఆరాధింపబడిన దేవతలు మీకు ఇష్టమగు భోగముల నిచ్చెదరు. వారిచ్చిన వానిని వారికి అర్పింపక తమకు తామే భుజించువారు (అనుభవించువారు) దొంగలని చెప్ప బడెదరు.

అవ : భగవదర్పితమైన పిదప యజ్ఞశేషమగు ఆ యన్నము భుజించువారియొక్క స్తుతి, తద్విపరీత వర్తనుల యొక్క నింద.

యజ్ఞశిష్టాశినస్సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః,
భుంజతే తేత్వఘం పాపా యే పచంత్యాత్మకారణాత్. 13

యజ్ఞమును చేసి తచ్ఛేషము నుపభోగించువారు సర్వపాప విముక్తు లగుదురు. కేవలము తమ పొట్టకొఱకై మాత్రము వంట చేసి కొనువారు పాపులు. వారు పాపము ననుభవింతురు.

సృష్టి చక్రము యొక్క క్రమము

అన్నాద్భవంతి భూతాని పర్జన్యా దన్నసంభవః,
యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః. 14

అన్నముచే భూతములు పుట్టును. ఆ యన్నము వర్షముచే కలుగును. ఆవర్షము యజ్ఞముచే ఏర్పడును. ఆ యజ్ఞము కర్మచే స్థితి నొందును.

కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షర సముద్భవమ్,
తస్మా త్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్. 15

కర్మ వేదముచే పుట్టును. వేదము అక్షరముచే (పరమాత్మచేత) నుద్భవించును. అందుచే సర్వవ్యాపకమగు పరమాత్మ యజ్ఞమునందు సదా ప్రతిష్ఠితమై యున్నది.

ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః,
అఘాయు రింద్రియారామో మోఘం పార్థ స జీవతి. 16

ఈ విధముగా నడుచుచున్న జగచ్చక్రమును ఇచ్చట చక్కగా నెవ్వ డనుసరింపడో అతని జీవనము పాపమయము. పార్థా! అట్టివాడు కేవల మింద్రియ సుఖములందు చిక్కువడి వ్యర్థజీవను డగును.

ఆత్మజ్ఞానికి కర్తవ్యము లేదు

యస్త్వాత్మరతి రేవస్యా దాత్మతృప్తశ్చ మానవః,
ఆత్మన్యేవ చ సంతుష్ట స్తస్య కార్యం న విద్యతే. 17

కాని ఎవడాత్మరతుడో ఆత్మతృప్తుడో ఆత్మసంతుష్టుడో ఆతనికి కర్తవ్య మేదియును మిగిలి యుండదు.

కర్తవ్య కారణమగు కర్తృత్వము మఱియు అజ్ఞానము భగ్నమై యుండును గావున అతనియందు (స్వరూపస్థితి గల వానియందు) కర్మ శేషము ఉండదు.

అవ : నిస్వార్థుడగు జ్ఞానికి కర్మ నాచరించుట వలన లాభము గాని ఆచరించక పోవుట వలన నష్టముగాని ఏమియును లేదు.

నైవ తస్య కృతేనార్థో నాకృతేనేహ కశ్చన,
నచాస్య సర్వభూతేషు కశ్చిదర్థ వ్యపాశ్రయః. 18

కర్మ నాచరించుటవలన గాని ఆచరింపక యుండుటవలన గాని తత్త్వవిదునకు స్వీయమగు ప్రయోజన మేమియును లేదు. సమస్త భూతములయందును ఏ ప్రయోజనము నవలంబించియు నత డుండడు.

అహం మమాభిమానములు వీడి ఆత్మరతుడై యుండిన అతడు కృతకృత్యుడని భావము.

ముముక్షువు కర్తవ్య కర్మ నాచరించ వలయును

తస్మా దసక్త స్సతతం కార్యం కర్మ సమాచర,
అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః. 19

అందుచే అనాసక్తుడవై సంతతము కర్తవ్యకర్మ నాచరింపుము. అనాసక్తుడై కర్మ నాచరించు పురుషుడు పరమ పదమును పొందును.

ఆత్మజ్ఞానమును బడసి ముక్తినొందునని అర్థము.

జనకాదులే ఇందుల కుదాహరణము

కర్మణైవహి సంసిద్ధి మాస్థితా జనకాదయః,
లోక సంగ్రహ మేవాపి సంపశ్య న్కర్తు మర్హసి. 20

జనకాదులు కర్మయోగము నుండియే పరమ మగు సిద్ధిని బడసిరి. కావున లోకసంగ్రహార్థమని యైనను నీవు కర్మ నాచరించుట యోగ్యము.

అవ : శ్రేష్ఠులగు ఉత్తమ పురుషుల యాచరణ అన్యుల కాదర్శ ప్రాయమును ప్రమాణ భూతమునై యుండును.

యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః,
స యత్ప్రమాణం కురుతే లోక స్త దనువర్తతే. 21

శ్రేష్ఠుడగు వాడు దేని దేని నాచరించునో ఎట్లు వర్తించునో అటువలె తక్కిన వారును ఆచరింతురు. అతడు దేనిని ప్రమాణముగ నంగీకరించునో లోకమును దానినే అనుసరించును.

అవ : భగవంతుడనైన నాకే కర్తవ్యమును లేక పోయినను లోక సంగ్రహార్థమై కర్మ నాచరించుచున్నాను.

న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన,
నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి. 22

పార్థా! మూడు లోకముల యందును నేను చేయ వలసిన కర్తవ్య మేమియును లేదు. అప్రాప్తమగు దానిని ప్రాప్తింప జేసికొన వలసినదియు లేదు. అయినను నేను కర్మ నాచరించుచున్నాను. పరమాత్మ అవాప్తకాముడు. వాని కర్మ కేవలము లోకసంగ్రహార్థమని ఇచ్చట గ్రాహ్యము.

యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతంద్రితః,
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః. 23

కర్మయందు నేను ఉదాసీనత నొంది కర్మ నాచరింపని వట్ల ఓ పార్థా! ఎల్లరు సర్వ విధములచే నన్నే అనుకరింతురు.

ఉత్సీదేయు రిమే లోకా న కుర్యాం కర్మ చే దహమ్,
సంకరస్య చ కర్తా స్యా ముపహన్యా మిమాః ప్రజాః. 24

నేను కర్మ చేయకున్న ఈ లోకములు పాడగును. నేనే లోక సంకర మొనర్చిన వాడ నౌదును. నేనే ఈ ప్రజలయొక్క నాశము నకు హేతువగుదును. కాన నీవును *లోక సంగ్రహార్థమై అనాసక్తిచే కర్మ నాచరించుట విధాయకమని భావము.

సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత,
కుర్యాద్విద్వాం స్తథాఽసక్త శ్చికీర్షు ర్లోకసంగ్రహమ్. 25

భారతా! అవిద్వాంసులు (అజ్ఞానులు) కర్మాసక్తిపరులై కర్మ నాచరించునట్లు లోకసంగ్రహార్థమై విద్వాంసులు (జ్ఞానులు) అనాసక్తులై కర్మ నాచరింప దగును.

న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసంగినామ్,
జోషయే త్సర్వకర్మాణి విద్వాన్యుక్త స్సమాచరన్. 26

కర్మాసక్తిపరులైన అజ్ఞజనుల మనస్సునందు కర్మలవిషయమై జ్ఞానులు అవిశ్వాసమును గలుగ జేయరాదు. విద్వాంసులు తాము స్వయముగా యోగయుక్తులై ఆచరించుచు సర్వకర్మలను అజ్ఞులచే చేయింపవలెను.

మూఢునియొక్క భావము

ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః,
అహంకార విమూఢాత్మా కర్తాఽహమితి మన్యతే. 27

ప్రకృతియొక్క గుణములచేతనే కర్మలు సహజముగ జరుగు చుండ అహంబుద్ధి వలన (దేహోఽహం బుద్ధివలన) మూఢుడగు వాడు తానే కర్తయని భావించును.

తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మ విభాగయోః,
గుణా గుణేషు వర్తంత ఇతి మత్వా న సజ్జతే. 28

అర్జునా! గుణకర్మలయొక్క ఈ తాత్త్విక మర్మము (సంబం

* ప్రజలను అధర్మమార్గమునుండి మఱలించి స్వధర్మమున మెలగునట్లు చేయుట.

ధము) నెఱిగినవాడు ఇదంతయును గుణముల చేష్ట యని తెలిసి వాని యందు సక్తుడు (సంబంధము గలవాడు) కాడు.

నా స్వరూపమునం దివి లేవని తెలిసి గుణాతీతుడగు జ్ఞాని అనాత్మ కర్తృకము లగు కర్మల యందు సక్తి (సంగము) నొందడు. అసంగుడుగా నుండునని భావము.

ప్రకృతేర్గుణ సమ్మూఢాః సజ్జంతే గుణకర్మసు,
తా నకృత్స్నవిదో మందా౯ కృత్స్నవి న్న విచాలయేత్. 29

ప్రకృతిగుణములచే మోహితు లైనవారు గుణకర్మలయందు సక్తులగు (సంగము గలవారగు) చున్నారు. పూర్వాపర జ్ఞానము లేని యా మందబుద్ధి గల జనుల మనస్సునందు కర్మ విషయకమగు సంశయమును జ్ఞానులు గలుగ జేయరాదు. చక్కని వివేకము గలుగక మునుపే కర్మత్యాగమును గుఱించి వారికి బోధింప రాదని భావము.

సమస్తకర్మలను నా యందర్పించి యుద్ధము చేయుము

మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మచేతసా,
నిరాశీ ర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః. 30

ఆత్మనిష్ఠాయుక్తమగు బుద్ధిచే సర్వకర్మలను నాకు అర్పించి నీ ఆశా మమత్వాదిగుణములను విడచి సంతాప రహితుడవై యుద్ధము చేయుము.

స్థూల, సూక్ష్మ, కారణ దేహముల తాదాత్మ్యమును తన్మూలకము లగు ఆధ్యాత్మికాది త్రివిధ సంతాపములను వీడి అసంగాత్మబుద్ధిచే కర్తవ్యము నాచరించుమని తత్త్వార్థము.

యే మే మత మిదం నిత్య మనుతిష్ఠంతి మానవాః,
శ్రద్ధావంతోఽనసూయంతో ముచ్యంతే తేఽపి కర్మభిః. 31

ఈ నా మతము ననుసరించి నిత్యము వర్తించు దోషబుద్ధి లేని శ్రద్ధావంతులగు వారు కర్మబంధమునుండి వీడువడుదురు.

యే త్వేత దభ్యసూయంతో నానుతిష్ఠంతి మే మతమ్,
సర్వజ్ఞాన విమూఢాంస్తా న్విద్ధి నష్టా నచేతసః. 32

ఈ నా మతము నసహ్యించుకొని నిందించుచు తత్ప్రకార మనువర్తించని వారు సర్వజ్ఞాన శూన్యులు (బుద్ధి లేనివారు) అగుదురు.

ఇచ్చట నా మత మనగా అర్థ మేమన, సర్వవ్యాపకమగు పరమాత్మతత్త్వము అందఱియందును అన్ని క్షేత్రముల యందును ఒక్కటై యున్నదను అపరోక్షాత్మనిశ్చయమూలమున నిత్యశాంతి నుండుట.

సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతే ర్జ్ఞానవానపి,
ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి. 33

జ్ఞానియు తన ప్రకృతి (స్వభావము) ననుసరించియే నడుచును. సర్వభూతములును తమ తమ ప్రకృతి ననుసరించును. కావున స్వభావమగు అనివార్యమైన నీ విషయమునందు తద్విరుద్ధమగు నిగ్రహమనున దెట్లు పొసగును?

రాగ ద్వేషములకు వశుడు గారాదు

ఇంద్రియస్యేంద్రియస్యార్థే రాగ ద్వేషౌ వ్యవస్థితౌ,
తయో ర్న వశ మాగచ్ఛే త్తౌ హ్యస్య పరిపంథినౌ. 34

ఇంద్రియములకు ఇంద్రియార్థములగు విషయములయందు రాగ ద్వేషము లనునవి యున్నవి. మానవుడు వానికి వశుడు కాగూడదు. అవియే ఇతనికి శత్రువులు.

నిగ్రహ మనునది శాస్త్రసమ్మతము. దైవమే ప్రయత్న రూపమునను అభివ్యక్త మగుచుండుట వలన సంస్కార మెంత బలిష్ఠమయినను శాస్త్రదృష్టి వలన గలిగిన విహితావిహిత పరిజ్ఞానముచే నొప్పు ప్రయత్నము సార్థక మని అర్థము.

అవ : స్వధర్మాచరణచే శుభము, పరధర్మాచరణచే అశుభము, హానియు నని తెలుపుచున్నారు.

శ్రేయా న్స్వధర్మో విగుణః పరధర్మా త్స్వనుష్ఠితాత్,
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః. 35

చక్కగా ఆచరింపబడిన పరధర్మమున కంటెను అట్లాచరింప బడక పోయినను స్వ (తన) ధర్మము మిక్కిలి శ్రేయోదాయకము. స్వధర్మాచరణ చేయుచుండు తఱి మరణము వచ్చినను అది శ్రేయః ప్రదమే! అన్యమగు పరధర్మము భయావహ మని భావము.

ఇచ్చట శ్రేష్ఠ మయిన స్వధర్మ మనగా నిర్మోహ మగు ఇంద్రియవ్యాపార వృత్తులచే ఆత్మ నే నను సత్యానుస్మృతిని దప్పక వర్తించుట.

అర్జున ఉవాచ :

అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః,
అనిచ్ఛన్నపి వార్ ష్ణేయ బలాదివ నియోజితః. 36

కృష్ణా! ఇచ్ఛ లేకున్నను బలవంతమున చేయి బట్టి ఎవరో చేయించు నట్టుగా ఈ పురుషుడు ఎవని ప్రేరణచే పాపము నాచరించును?

పాపాచరణకు కారణము కామము

శ్రీభగవానువాచ :

కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః,
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్. 37

రజోగుణముచే ఉత్పన్న మైనదియును ఎన్నడును తృప్తి నొందనిదియును మహాపాపియు నగు కామమే (ఇచ్ఛయే) పాపమును చేయించును. ఇదియే క్రోధ రూపముగను పరిణామము నొందును. ఇదియే లోకమున పరమ శత్రువని తెలియుము.

అవ : ఈ కామరూప శత్రువుచే జ్ఞాన మావరింప బడుచున్నదని దృష్టాంత పూర్వకముగ బోధించుచున్నారు.

ధూమేనావ్రియతే వహ్ని ర్యథాఽఽదర్శో మలేన చ,
యథోల్బేనావృతో గర్భ స్తథా తేనేద మావృతమ్. 38

అగ్ని పొగచేతను, అద్దము ధూళి చేతను, గర్భము జరయను సంచి (మావి) చేతను మూయబడి యుండునట్లు ఈ కామముచే జ్ఞానము ఆవరింపబడి యున్నది.

ఆవృతం జ్ఞాన మేతేన జ్ఞానినో నిత్యవైరిణా,
కామరూపేణ కౌంతేయ దుష్పూరేణానలేన చ. 39

కౌంతేయా! జ్ఞానులకు నిత్యవైరియై తృప్తిని జూడని ఈ కామ రూపాగ్నిచే స్వస్వరూప జ్ఞానము మూయబడి యున్నది.

కామునియొక్క వాసస్థానము

ఇంద్రియాణి మనో బుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే,
ఏతై ర్విమోహయత్యేష జ్ఞాన మావృత్య దేహినమ్. 40

ఇంద్రియములు, మనస్సు, బుద్ధి ఇవే ఈ కామముయొక్క ఆశ్రయ స్థానములు. వీని ఆశ్రయముద్వారా ఈ కామము జ్ఞానమును మూసి జీవుని మోహ గర్తమున ముంచుచున్నది.

ఇంద్రియములను నిగ్రహించి కాముని బరిమార్చవలెను

తస్మాత్త్వ మింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ,
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞాన విజ్ఞాన నాశనమ్. 41

అందుచేత భరత వంశోత్పన్నుడవైన ఓ అర్జునా! నీవు ఇంద్రియములను సంయమించి *జ్ఞాన విజ్ఞాన నాశియును పరమ పాపియు నగు ఈ కామమును జంపి వేయుము.

ఇంద్రియ మనః ప్రాణాదులకంటె ఆత్మ గొప్పది

ఇంద్రియాణి పరాణ్యాహు రింద్రియేభ్యః పరం మనః,
మనసస్తు పరా బుద్ధి ర్యో బుద్ధేః పరతస్తు సః. 42

విషయములకంటె ఇంద్రియములు, ఇంద్రియములకంటె మనస్సు, మనస్సుకంటె బుద్ధి, బుద్ధికంటె ఆత్మ గొప్పది.

అట్టి పరమోత్కృష్ట మగు ఆత్మ నీవయి యున్నావని ఇందలి భావము.

అవ : బుద్ధికి పరమగు ఆత్మ నేనని తెలిసి మనస్సును వశమునం దుంచుకొని కాముని గాల్చి వేయుము.

*జ్ఞానము—శాస్త్రజ్ఞానము. విజ్ఞానము—అనుభవరూపమైన (వృత్తి) జ్ఞానము.

ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మాన మాత్మనా,
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్. 43

ఈ ప్రకారము బుద్ధికంటెను గొప్పదియై యుండు ఆత్మను దెలిసి కొని, ఆత్మచేత అర్థాత్ నిర్మలమగు బుద్ధిచేత ఆత్మను (మనస్సును) నియమించి అర్జునా! దుర్జయుడగు ఈ కాముడను శత్రువును చంపి వేయుము.

ఓంతత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే కర్మయోగోనామ
తృతీయోఽధ్యాయః.

ఓమ్

శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీమద్భగవద్గీత - చతుర్థాధ్యాయము

ఈ నాలుగవ అధ్యాయమున అవతారము, అవతారోద్దేశ్యము, కర్మ, కర్మరహస్యము, యజ్ఞము, గురుసాన్నిధ్యము, జ్ఞానము, తత్ఫలము ఇత్యాది విషయములు నిరూపింప బడును.

సనాతనమగు జ్ఞానయోగ పరంపర

శ్రీ భగవా నువాచ :

ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహ మవ్యయమ్,
వివస్వాన్మనవే ప్రాహ మను రిక్ష్వాకవేఽబ్రవీత్. 1

ఈ అవ్యయమైన యోగమును నేను సూర్యునకు జెప్పితిని. అతడు మనువునకును మనువు ఇక్ష్వాకువునకును జెప్పెను.

ఏవం పరంపరాప్రాప్త మిమం రాజర్షయో విదుః,
స కాలేనేహ మహతా యోగో నష్టః పరంతప. 2

ఇట్లు పరంపరానుగతమై వచ్చిన ఈ యోగమును రాజర్షులు

తెలిసికొని యుండిరి. ఓ పరంతపా! ఈ యోగము మహత్తరమగు కాలగతిచే లుప్త మాయెను.

స ఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః,
భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేత దుత్తమమ్. 3

నీవు నా భక్తుడవును సఖుడవు నయినందు వలన ఈ ఉత్తమ రహస్యమును పురాతనము నగు యోగమును నేను నీకిపుడు జెప్పితిని.

అర్జున ఉవాచ :

అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః,
కథమేత ద్విజానీయాం త్వమాదౌ ప్రోక్తవా నితి. 4

నీ జన్మ ఇప్పటిది. సూర్యుని జన్మ అప్పటిది. ఈ యోగమును నేను మొదట సూర్యున కుపదేశించితి నను నీమాట నేనెట్లు విశ్వసింప వలయును ? (అనిన)

శ్రీ భగవానువాచ :

బహూని మే వ్యతీతాని జన్మాని తవచార్జున,
తాన్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరంతప. 5

అర్జునా! నేను అనేక జన్మలను (అవతారములను) పొంది యున్నాను. నీకైనను ఎన్నో జన్మములై యున్నవి. వాని నన్నిటిని నే నెఱుగుదును. నీవెఱుగవు.

నేను సమష్టిరూప మాయోపాధికుడను. నీవు వ్యష్టిరూప అవిద్యోపాధికుడవు, అసర్వజ్ఞుడ వని భావము.

అజోఽపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపిసన్,
ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవా మ్యాత్మమాయయా. 6

అవ్యయాత్మస్వరూపుడనగు నేను జన్మరహితుడను, మఱియు సమస్త భూతముల యొక్క స్వామినై యుండినను నా మాయాశక్తిచే (స్వీయ ప్రకృతి నాశ్రయించి) జన్మ మెత్తుదును.

భగవంతు డవతరించు కాలము

యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత,
అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహమ్. 7

ఓ భారతా! ఎప్పు డెప్పుడు ధర్మహానియు అధర్మోత్కర్షయు నగునో ఆ యా కాలములయందు నేను జన్మ నొందుదును.

అవతార కారణము

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్,
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే. 8

సాధుజన సంరక్షణ, దుష్టజన శిక్షణ మఱియు ధర్మసంస్థాపనార్థమై నేను యుగయుగముల యందు బుట్టెదను.

నా జన్మకర్మల నెఱుగుట మహాఫలము

జన్మ కర్మ చ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః,
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున. 9

దివ్యమైన ఈ విధమగు నా జన్మకర్మల తత్త్వమును తెలిసినవాడు ఈ దేహమును విడిచిన పిదప మరల జన్మ నొందడు. అర్జునా! నన్నే పొందును.

నేనే సర్వ భూతములయందు ఆత్మరూపుడనై యుండు కారణముచే నన్ను తన్నుగా తెలిసికొనుట వలన తనయొక్క జన్మ కర్మలను కల్పన యని తెలిసి ముక్తుడగును.

భగవత్స్వరూపానుభవము నొందు అధికారుల లక్షణము

వీత రాగ భయ క్రోధా మన్మయా మా ముపాశ్రితాః,
బహవో జ్ఞానతపసా పూతా మద్భావ మాగతాః. 10

ఆసక్తి రహితులును, భయరహితులును, క్రోధరహితులు నయి నాయందు తన్మయులైనవారు నన్నాశ్రయించి జ్ఞాన తపస్సుచే పరిశుద్ధులైన బహుజనులు నా సాయుజ్య ముక్తిని బడసి యున్నారు.

యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహమ్,
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః. 11

నన్నెవ రేవిధముగా భజింతురో వారికి నేనావిధముగా ఫలము నిచ్చెదను. పార్థా! మానవులు సర్వవిధముల నామార్గమునే అనుసరింతురు.

కాంక్షంతః కర్మణాం సిద్ధిం యజంత ఇహ దేవతాః,
క్షిప్రం హి మానుషే లోకే సిద్ధి ర్భవతి కర్మజా. 12

కర్మఫలాశచే జనులు ఆత్మయగు నన్ను మఱచి ఇతర దేవతలను పూజింతురు. మానవ లోకమునందు కర్మఫలము తొందరగ ప్రాప్తమగును.

చాతుర్వర్ణ్య కల్పన

చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణ కర్మ విభాగశః,
తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్. 13

గుణ కర్మలను బట్టి చాతుర్వర్ణ్యము (నాలుగు వర్ణములు) నానుండియే సృజింప బడెను. అయినను నన్ను వాని విషయమున అకర్తనుగను అవ్యయునిగను తెలియుము.

న మాం కర్మాణి లింపంతి న మే కర్మఫలే స్పృహా,
ఇతి మాం యోఽభిజానాతి కర్మభి ర్న స బధ్యతే. 14

నాకు కర్మలేపము లేదు. నాకు కర్మఫలాశయును లేదని తెలియువాడు కర్మచే బద్ధుడు కాడు.

అవ : పూర్వ ముముక్షువులవలె నీవును నిష్కాముడవై కర్మ నాచరింపుము.

ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః,
కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్. 15

పూర్వ ముముక్షువులు ఈ తత్త్వము నెఱిగి కర్మ చేసిరి. అందుచేత ప్రాచీనులగు వారు చేసినట్లే పురాతనమగు ఈ కర్మను నీవును జేయుమని భావము.

కర్మాకర్మల తత్త్వము నెఱిగినందువలన గలుగు ఫలము మోక్షము

కిం కర్మ కిమకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః,
తత్తే కర్మ ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్. 16

కర్మ యనగా నేమి? అకర్మ యనగా నేమి? అను నీ విషయమున విద్వాంసులు గూడ భ్రమ నొందుదురు. అందుచేత ఆ కర్మ విషయమైన జ్ఞానమును నీకు చెప్పెదను. ఆ జ్ఞానము నిన్ను కర్మ బంధమునుండి విడివడ జేయును.

కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః,
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః. 17

కర్మ యనగా నేమి? వికర్మ యనగా నేమి? అకర్మ యనగా నేమి? దీనిని తెలిసి కొన దగును. ఎందుకనగా కర్మతత్త్వమును తెలియుట కఠినము.

కర్మయం దకర్మను, అకర్మయందు కర్మను చూచు నతని ఘనత

కర్మణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మ యః,
స బుద్ధిమా న్మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్. 18

కర్మయం దకర్మను అకర్మయందు కర్మను చూచువాడే మనుష్యుల లోపల బుద్ధిమంతుడు. అతడే యోగయుక్తుడును, సమస్త కర్మల నాచరించిన వాడును అగును.

యస్య సర్వే సమారంభాః కామ సంకల్ప వర్జితాః,
జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణం తమాహుః పండితం బుధాః. 19

ఎవడు కామ సంకల్ప వర్జితుడై కర్మల నారంభించునో ఎవని కర్మ జ్ఞానాగ్నిచే దహింప బడియున్నదో అట్టివానిని జ్ఞానులు పండితుడని యందురు.

అవ : ఫలకాంక్షను విడిచి జ్ఞాని కర్మ నాచరించు చుండినను అతడు కర్మ చేయని వాడే.

త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః,
కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కించిత్కరోతి సః. 20

కర్మఫలమునం దాసక్తి లేనివాడై నిత్యతృప్తుడును నిరాశ్రయుడు నయిన వాడు కర్మయందు ప్రవృత్తి నొందినను అతడు నిష్క్రియుడే నని అర్థము. నిజముగ అతడేమియును చేయనివాడే నని భావము.

నిరాశీర్యత చిత్తాత్మా త్యక్త సర్వ పరిగ్రహః,
శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్. 21

నిష్కాముడును మనస్సును నియమించినవాడును సర్వసంగ

పరిత్యాగియు నైనవాడు కేవల శరీర నిర్వహణమాత్ర కర్మల నాచ రించు చుండినను వానిచేత నతడు బద్ధుడు గాడు.

యదృచ్ఛాలాభసంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః,
సమస్సిద్ధా వసిద్ధౌచ కృత్వాఽపి న నిబధ్యతే. 22

ఈశ్వరేచ్ఛా పరికల్పిత భోగమాత్ర పరితృప్తుడును ద్వంద్వా తీతుడును మత్సరము లేని వాడును మఱియు సిద్ధి అసిద్ధులను సమముగ చూచు నతడు కర్మ నాచరించినను బద్ధుడు గాడు.

అవ : యజ్ఞార్థమగు కర్మల నాచరించు జ్ఞానియొక్క సంపూర్ణ కర్మలు నశించును.

గత సంగస్య ముక్తస్య జ్ఞానావస్థిత చేతసః,
యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే. 23

జ్ఞాననిష్ఠా యుక్తమగు మనస్సు గల, సంగ రహితుడైన, జీవ న్ముక్త పురుషుడు యజ్ఞార్థమై చేసిన కర్మ పరమాత్మయందు లయ మొందును. అందుచేత నతడు బద్ధుడు గాడు.

కర్మయజ్ఞము బ్రహ్మమే

బ్రహ్మార్పణం బ్రహ్మహవి ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్,
బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మ సమాధినా. 24

అతడు చేయు అర్పణము బ్రహ్మము. హవిస్సు బ్రహ్మము. హోమ ధర్మములు బ్రహ్మము. బ్రహ్మ మనెడి అగ్నియందు బ్రహ్మ చేత ఆహుతి ఇవ్వబడునను దృష్టిమూలమున బ్రహ్మకర్మ-సమాధి యందుండు వాడు బ్రహ్మమునే పొందును.

దేవయజ్ఞమును జ్ఞానయజ్ఞమును బ్రహ్మమే

దైవమేవాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే,
బ్రహ్మాగ్నావపరే యజ్ఞం యజ్ఞేనైవోపజుహ్వతి. 25

కొందఱు యోగులు దేవతలకొఱకై యజ్ఞము చేయుదురు. కొందఱు బ్రహ్మమను అగ్నియందు యజ్ఞము (బ్రహ్మదృష్టి) చేతనే యజ్ఞమును (ఆత్మను) హోమము చేయుదురు. సోపాధికమగు ఆత్మను నిరుపాధికమైన బ్రహ్మమనెడి అగ్నియందు వేల్చెదరు. తన్మాత్ర ముగా దర్శించెదరని భావము.

### జ్ఞానేంద్రియ నిగ్రహ మనెడి యజ్ఞము

శ్రోత్రాదీనీంద్రియాణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి,
శబ్దాదీన్విషయానన్యే ఇంద్రియాగ్నిషు జుహ్వతి. 26

కొందఱు శ్రోత్రాది ఇంద్రియములను సంయమ మను అగ్నియందు హవనమొనర్తురు. కొందఱు శబ్దాది విషయములనెడి ఆహుతులను ఇంద్రియము లనెడి అగ్నియందు వేల్తురు.

### అంతఃకరణ సంయమ యజ్ఞము

సర్వాణీంద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే,
ఆత్మ సంయమ యోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే. 27

వేఱే కొందఱు సర్వేంద్రియములను, ప్రాణకర్మలను ఆత్మ సంయమ యోగమను అగ్నియందు హోమ మొనర్తురు.

### ఆఱు ప్రకారములైన ద్రవ్యాది యజ్ఞములు

ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞా యోగయజ్ఞా స్తథాఽపరే,
స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాశ్చ యతయ స్సంశితవ్రతాః. 28

సునిశితమగు (కఠిన) వ్రతములను జేయు యతులు కొందఱు [1]ద్రవ్యయజ్ఞమును, [2]తపోయజ్ఞమును, [3]యోగ యజ్ఞ మును, [4]స్వాధ్యాయ యజ్ఞమును, [5]జ్ఞానయజ్ఞమును జేయుదురు. వీరందఱు తీవ్రమగు కఠినవ్రతములను జేయు యత్నశీలురగు యతులు.

### ప్రాణాయామ యజ్ఞము

అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాఽపరే,
ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామ పరాయణాః. 29

కొందఱు ప్రాణమును అపానమందు, అపానమును ప్రాణమునందు హోమము జేసి ప్రాణాపాన గతుల నిరోధించి ప్రాణాయామమునందు నిమగ్ను లగుదురు.

---

1. ద్రవ్యత్యాగము, 2. తపస్సు—ఉపవాసము, 3. యోగాభ్యాసము, 4. వేదాధ్యయనము, ప్రణవాది మహామంత్రానుష్ఠానము, వేదాంతగ్రంథ పఠనము మొ॥, 5. పెద్దల వలన సద్విషయముల దెలిసికొనుట.

### ఆహార నియమ యజ్ఞము

అపరే నియతాహారాః ప్రాణాన్ప్రాణేషు జుహ్వతి,
సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపితకల్మషాః. 30

మఱి కొందఱు ఆహార నియమము గలిగి ప్రాణమును ప్రాణము నందే హోమము జేయుదురు. వీరందఱు యజ్ఞతత్త్వమును దెలిసినవారు. యజ్ఞముల మూలమున పాపములను పోగొట్టుకొన్నవారు.

అవ : ఇందు ఏ యొక యజ్ఞమైనను లేనివారికి ఇహము లేదు; పరమును లేదని తెలుపుచున్నారు.

యజ్ఞశిష్టామృతభుజో యాంతి బ్రహ్మ సనాతనమ్,
నాయం లోకోఽస్త్యయజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ. 31

యజ్ఞశేషమగు అమృతాన్నమును సేవించువారు శాశ్వతమగు బ్రహ్మమును బడయుదురు. అర్జునా! యజ్ఞము చేయని వానికి అసలు ఈ లోకమే లేదు అన్నపుడు ఇక పరలోక మెక్కడిది?

ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే,
కర్మజాన్విద్ధి తాన్ సర్వా నేవం జ్ఞాత్వా విమోక్ష్యసే. 32

ఇట్లు బహువిధములగు యజ్ఞములు బ్రహ్మమునుండి అనగా వేద ముఖమునుండి వెలువడినవి. ఇవన్నియును కర్మచే* గలుగునవియై యున్నవని తెలిసినచో ముక్తుడ వగుదువు.

### జ్ఞానయజ్ఞము సర్వశ్రేష్ఠము

శ్రేయాన్ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప,
సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే. 33

ద్రవ్యాది యజ్ఞములన్నింటికంటెను జ్ఞానయజ్ఞము శ్రేష్ఠము, శ్రేయస్కరమైనది. పార్థా! సర్వకర్మల సంపూర్ణత జ్ఞానమునందే యగును. జ్ఞానము సిద్ధింప సర్వకర్మఫలము సిద్ధించెనని అర్థము.

---

* ఆత్మయం దెట్టి కర్మయును లేదు. ఇయ్యది నిష్క్రియ మని వేదాంత సిద్ధాంతము.

అవ : జ్ఞానార్థమై శ్రోత్రియ బ్రహ్మ నిష్ఠుడగు గురుని కడకు వెడల వలెనని తెలుపుచున్నారు.

తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా,
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః. 34

ఆ జ్ఞానమును నీవు పొందవలయునన్న సాష్టాంగ దండ ప్రణామములచేతను చక్కని ప్రశ్నలచేతను సేవలచేతను దెలిసికొనుము. తత్త్వదర్శనులైన జ్ఞానులు (విద్యయు, విజ్ఞానమును గల వారు) నీకా జ్ఞానము నుపదేశింతురు.

గురు సన్నిధి సంప్రాప్త జ్ఞానఫలము

యజ్జ్ఞాత్వా న పునర్మోహ మేవం యాస్యసి పాండవ,
యేన భూతాన్యశేషేణ ద్రక్ష్యస్యాత్మన్యథో మయి. 35

పాండవా! ఒక్కసారి ఆ జ్ఞానమైన మరల నీకు మోహ మొదవదు. సర్వభూతములు ఆత్మయందును అనగా నీయందును అటువలె నాయందును జూచెదవు.

"త్వమేవాహమ్" నీవు నేనే యని తెలియుదువు. అనగా తత్పద లక్ష్యమగు బ్రహ్మము త్వంపద లక్ష్యమగు ప్రత్యగాత్మయే నని తెలిసి అభేదానుభవము నొందెదవు. సర్వకల్పనాధిష్ఠానమగు సచ్చిదానంద పరమాత్మ నేనే యని తెలిసికొనెద వని యర్థము.

జ్ఞానమహిమ

అపి చేదసి పాపేభ్య స్సర్వేభ్యః పాపకృత్తమః,
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి. 36

అందఱ పాపుల కంటెను నీవు మహాపాపివై యుందువు గాక! ఈ జ్ఞానమను నావచే ఆ పాపముల నెల్ల దాటగలవు.

పాపములు అపవిత్ర మనః కల్పనలు. మనస్సాక్షియగు పరమాత్మయందు ప్రబోధ గలిగినచో పాపబుద్ధి పలాయన మగును.

యథైధాంసి సమిద్ధోఽగ్ని ర్భస్మసాత్కురుతేఽర్జున,
జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా. 37

అర్జునా! మండు అగ్ని కట్టెలను గాల్చునట్లు జ్ఞానమను అగ్ని సర్వకర్మలను భస్మ మొనర్చును.

కర్మకు కారణము కర్తృత్వము. కర్తృత్వమునకు కారణము అజ్ఞానము. అజ్ఞానము ఆత్మజ్ఞానముచే నివృత్తి నొందగా సంచితాగామిప్రారబ్ధములను కర్మలుండవని భావము. ప్రారబ్ధము దేహమునకు సంబంధించిన దే కావున మిథ్యోపాధి విషయమున శంకా సమాధానము లేమియు సిద్ధింప లేవు.

జ్ఞానము పరమపవిత్రము

నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే,
తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విందతి. 38

జ్ఞానముకంటె పవిత్రమగు వస్తు విచ్చట మఱేదియును లేదు. యోగసంసిద్ధుడై ఈ జ్ఞానమును కాలాంతరమున తనయందు తానే పొందును.

యోగసంసిద్ధుడై అనగా నిష్కామ కర్మయోగము చేతను సమాధియోగముచేతను అర్థాత్ అభేదోపాసన యగు ధ్యాన యోగముచేతను జ్ఞానమునకు తగు సంస్కారము (యోగ్యత) నొంది ముముక్షువు తన్నుదా దెలిసి ధన్యుడగునని భావము.

అవ : జ్ఞానోపలబ్ధిని పొందు పాత్ర *శ్రద్ధయనియు, పరమగు ఆత్మశాంతియే దానికి ఫలమనియు దెలుపుచున్నారు.

శ్రద్ధావాఁల్లభతే జ్ఞానం తత్పర స్సంయతేంద్రియః,
జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతి మచిరేణాధిగచ్ఛతి. 39

శ్రద్ధాళువగు జ్ఞాననిష్ఠ గల జితేంద్రియుడు జ్ఞానమును పొందును. జ్ఞానమును పొందిన వెంటనే ఉత్తమమగు పరమ శాంతిని బడయును.

ఇచ్చట శ్రద్ధ యనగా నిరావరణవృత్తి యని తెలియవలయును.

శ్రద్ధావిరహితుడగు (సంశయాత్ముడైన) అజ్ఞుడు దుర్గతి నొందును

అజ్ఞశ్చా శ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి,
నాయం లోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః. 40

*గురు వేద శాస్త్ర వాక్యములయందు సత్యత్వ బుద్ధి — విశ్వాసము — నమ్మకము.

శ్రద్ధ లేని అజ్ఞాని సంశయ గ్రస్తుడై నాశ మొందును. సంశయ గ్రస్తునకు ఈ లోకమును లేదు. పరలోకమును లేదు. సుఖమును లేదు.

నిష్కామ కర్మయోగియగు జ్ఞానికి కర్మబంధము లేదు

యోగసన్న్యస్త కర్మాణం జ్ఞాన సంఛిన్న సంశయమ్,
ఆత్మవంతం న కర్మాణి నిబధ్నంతి ధనంజయ. 41

అర్జునా! యోగబుద్ధిచే కర్మలను పరమాత్మయందు సమర్పించి జ్ఞానముచే సంశయములను పరిహరించుకొన్న యట్టి ఆత్మదృష్టి గల వానిని కర్మలు బంధింపవు.

జ్ఞానముచే నిస్సందేహుడవై కర్తవ్యము నాచరించుము

తస్మాదజ్ఞాన సంభూతం హృత్‌స్థం జ్ఞానాసినాఽఽత్మనః,
ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత. 42

అందుచేత భారతా! లెమ్ము. అజ్ఞానముచే గలిగి హృదయము నాశ్రయించు కొని యుండు ఈ నీ సంశయమును జ్ఞానమను ఖడ్గముచే ఖండించుము. యోగము నాచరింపుము.

ఓంతత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే జ్ఞానయోగోనామ
చతుర్థోఽధ్యాయః

ఓమ్

శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీమద్భగవద్గీత-పంచమాధ్యాయము

అర్జున ఉవాచ :

సన్న్యాసం కర్మణాం కృష్ణ పునర్యోగం చ శంససి,
యచ్ఛ్రేయ ఏతయోరేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్. 1

కృష్ణా! ఒకసారి కర్మ సంన్యాసమును మఱొకసారి కర్మయోగ

మును పొగడు చున్నావు. ఈ రెంటి యందేది శ్రేయోదాయకమైనదో ఆ విషయమును నాకు నిశ్చయించి చెప్పుము.

అవ : (సంన్యాసము) జ్ఞానము కంటెను నిష్కామ కర్మయోగమే నీకు ప్రస్తుతము శ్రేయస్కరము.

శ్రీ భగవానువాచ :

సన్న్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయసకరా వుభౌ,
తయోస్తు కర్మసన్న్యాసా త్కర్మయోగో విశిష్యతే. 2

సన్న్యాసము మఱియు కర్మయోగమను నీ రెండును మోక్షప్రదములే. వానియందు కర్మసన్న్యాసము కంటెను కర్మయోగమే నీకిప్పుడు మంచిది.

నిష్కామ కర్మయోగము యొక్క మహిమ

జ్ఞేయస్స నిత్య సన్న్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతి,
నిర్ద్వంద్వో హి మహాబాహో సుఖం బంధా త్ప్రముచ్యతే. 3

ఎవడు ద్వేషరహితుడో, ఆశారహితుడో, అతడు నిత్యసన్న్యాసియని తెలియుము. మహాబాహో! ఇట్లు ద్వంద్వరహితుడైన వాడు అనాయాసముగ బంధముక్తుడగును.

సాంఖ్య కర్మ యోగములు రెండు గావు. ఒకటే

సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదంతి న పండితాః,
ఏకమప్యాస్థిత స్సమ్య గుభయో ర్విందతే ఫలమ్. 4

సాంఖ్య యోగమును మఱియు కర్మయోగమును విభిన్నములని మూర్ఖులు తలంతురు. పండితులో అట్లు జెప్పరు. ఇందేయొక్క దానిని చక్కగా నాచరించినను రెండిటి ఫలమును దొరకును.

ఒకటి సాధనము, ఒకటి సాధ్యము. ఇవెప్పుడును రెండు గావు. సాధన దశయందేది పరోక్షముగ భావింప బడినదో అది నిత్యాపరోక్షమైన ఒకే వస్తువని తెలియవలెను. బ్రహ్మమయ్యే యుండి చక్కని యోగముచే బ్రహ్మమే అని తెలియుట.

యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగై రపి గమ్యతే,
ఏకం సాంఖ్యంచ యోగంచ యః పశ్యతి స పశ్యతి. 5

సాంఖ్యులచే పొందబడు ఫలము యోగుల చేతను పొందబడును. సాంఖ్యమును అనగా జ్ఞానమును మఱియు యోగమును ఈ రెండు మార్గములును ఒకటే యని తెలిసినవాడు జ్ఞాని యని చెప్పబడును.

కర్మ యోగమున కంటెను సాంఖ్య యోగ సాధనము కఠినము

సన్న్యాసస్తు మహాబాహో దుఃఖ మాప్తు మయోగతః,
యోగయుక్తో మునిర్బ్రహ్మ న చిరేణాధిగచ్ఛతి. 6

అర్జునా! కర్మయోగ సహాయము లేనిది కర్మసన్న్యాసి యగుట కష్టము. యోగయుక్తుడగు ముని సత్వరమున బ్రహ్మపదమును పొందును.

అవ : నిష్కామ కర్మయోగి కర్మనాచరించు చుండియు కర్మచేత నంట బడడు

యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః,
సర్వభూతాత్మ భూతాత్మా కుర్వన్నపి న లిప్యతే. 7

ఎవడు పవిత్రుడును, మనస్సును జయించిన జితేంద్రియుడును తన ఆత్మను సర్వాంతర్యామి యగు బ్రహ్మము నందు స్థిరముగా నిలిపిన వాడునై యున్నాడో ఆత్మ బ్రహ్మమే నని ఎఱిగిన ఆ కర్మ యోగి కర్మ నాచరించినను బద్ధుడు గాడు.

జ్ఞాని కర్మల నాచరించు చున్నను ఆచరింపనివాడే

నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్,
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్. 8
ప్రలపన్ విసృజన్ గృహ్ణ న్నున్మిష న్నిమిష న్నపి,
ఇంద్రియా ణీంద్రియార్థేషు వర్తంత ఇతి ధారయన్. 9

చూచుట, వినుట, స్పృశించుట, ఆఘ్రాణించుట, పోవుట పరుండుట, ఊపిరి సలుపుట, మాటలాడుట, విడుచుట, పట్టుట, కన్ను తెఱచుట, మూయుట మొదలగు క్రియలను చేయుచుండినను ఆయా ఇంద్రియములు తమ తమ విషయములందు వర్తించు చున్నవని నేనేమియు జేయుట లేదని జ్ఞాని యగు యోగ యుక్తుడు తలంచును.

### భగవదర్థము కర్మ చేయువాడు నిర్లిప్తుడు

బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః,
లిప్యతే న స పాపేన పద్మపత్ర మివాంభసా. 10

కమల పత్రము నీటి నంటని పగిది బ్రహ్మార్పణ బుద్ధిచే అనాసక్తుడై కర్మల నాచరించు వానిని పాప మంటదు.

### చిత్తశుద్ధికై కర్మయోగాచరణ మావశ్యకము

కాయేన మనసా బుద్ధ్యా కేవలై రింద్రియై రపి,
యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వాఽఽత్మశుద్ధయే. 11

యోగులు సంగరహితులై శరీర మనో బుద్ధులచేతను కేవల మింద్రియములచేతను ఆత్మ శుద్ధి కొఱకై యే కర్మల నాచరింతురు.

యుక్తః కర్మఫలం త్యక్త్వా శాంతి మాప్నోతి నైష్ఠికీమ్;
అయుక్తః కామ కారేణ ఫలే సక్తో నిబధ్యతే. 12

యోగయుక్తుడగు వాడు కర్మఫలమును త్యజించి అద్వితీయ మగు నిష్ఠచే ప్రాప్తమగు శాంతిని పొందును. యోగయుక్తుడు గాని వాడు అనగా ఇంద్రియోపశమము లేనివాడు ఫలాసక్తుడై బంధము నొందును.

### సాంఖ్యయోగ (జ్ఞాన) స్థితి

సర్వ కర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ,
నవద్వారే పురే దేహీ నైవ కుర్వ న్నకారయన్. 13

జితేంద్రియుడు సర్వ కర్మలయం దనాసక్తుడై యున్నందువలన తా నేమియు జేయకయు చేయింపకయు నవద్వారములు గల ఈ శరీరమను పురము నందు సుఖముగా నుండును.

ఇతడు అసంగానందానుభవి; సర్వ విలక్షణ సచ్చిదానంద స్వరూపుడు.

### పరమాత్మ అకర్త. సర్వము చేయునది ప్రకృతియే

న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః,
న కర్మఫల సంయోగం స్వభావస్తు ప్రవర్తతే. 14

జనులకు కర్తృత్వమును గాని కర్మను గాని కర్మఫలసంయోగ మును గాని పరమాత్మ సృజించుట లేదు. ప్రకృతి (స్వభావము)చేతనే అవన్నియు ప్రవృత్తి నొందుచున్నవి.

ఈశ్వరుడు ఎవరి పుణ్యపాపములకును కర్త గాడు

నాదత్తే కస్యచిత్పాపం నచైవ సుకృతం విభుః,
అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః. 15

సర్వవ్యాపి యగు పరమాత్మ తాను ఎవరి పుణ్యపాపములను పొందుట లేదు. జ్ఞానము అజ్ఞానముచే ఆవరింపబడి యున్నందున జీవులు మోహవశు లగుచున్నారు.

జ్ఞానము సూర్యుని వంటిది

జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశిత మాత్మనః,
తేషా మాదిత్యవజ్జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్. 16

ఎవరికి ఆత్మవిషయకమగు అజ్ఞానము జ్ఞానముచే నాశమొందింప బడినదో వారికి సూర్యునివలె జ్ఞానము పరతత్త్వమును ప్రకాశింప జేయును.

మహాత్ములు బ్రహ్మమయులై యుందురు

తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః,
గచ్ఛం త్యపునరావృత్తిం జ్ఞాన నిర్ధూత కల్మషాః. 17

ఆ పరతత్త్వము నందే బుద్ధిని నిలిపిన వారును, అందే మగ్న మైన మనస్సు గలవారును, తన్నిష్ఠ గలవారును, పరమాత్మయే పరమ మగు ఆశ్రయమని తెలిసిన వారునగు మహాత్ములు జ్ఞానముచే పాపరహితులై మరల జన్మ నొందరు.

జ్ఞానియొక్క సమదృష్టి

విద్యా వినయ సంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని,
శుని చైవ శ్వపాకే చ పండితాః సమదర్శినః. 18

విద్యా వినయ సంపన్నుడగు బ్రాహ్మణుని యందును గోవు నందును ఏనుగు నందును కుక్క యందును చండాలుని యందును

జ్ఞాని సమదృష్టి గలవాడై యుండును. వీరందఱను జ్ఞాని సమదృష్టిచే చూచును.

ఉపాధులను విడచి ఉపహితమగు (సమమగు) బ్రహ్మమును దర్శించును. ఇది దృష్టి యుక్తమగు అభేదానుభవమే కాని క్రియా సాంకర్య మని అర్థము గాదు.

ఇహైవ తై ర్జితస్సర్గో యేషాం సామ్యే స్థితం మనః,
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మా ద్బ్రహ్మణి తే స్థితాః. 19

ఎవరి మనస్సు సమావస్థ (ఆత్మ) యందు స్థిరత నొందెనో వారిచ్చటనే జనన మరణ ప్రదమగు సంసారమును గెలిచిన వారని అర్థము. నిర్దోషమై యుండి సమముగా నుండునదే బ్రహ్మము, అందుచేత వారు బ్రహ్మము నందే స్థితి నొందినవా రనవలయును.

జీవన్ముక్తుడగు బ్రహ్మజ్ఞాని యొక్క దృక్పథము

న ప్రహృష్యేత్ప్రియం ప్రాప్య నోద్విజే త్ప్రాప్య చాప్రియమ్,
స్థిర బుద్ధి రసంమూఢో బ్రహ్మవి ద్బ్రహ్మణి స్థితః. 20

ప్రియమైన వస్తువు సంప్రాప్తమైన హర్ష మొందదు. అప్రియ వస్తువు ప్రాప్తమైన దుఃఖము నొందదు. ఇట్లు మోహ రహితమైన స్థిరబుద్ధి గలవాడై బ్రహ్మమును దెలిసి బ్రహ్మమునందే యుండును.

బాహ్యస్పర్శే ష్వసక్తాత్మా విందత్యాత్మని యత్సుఖమ్,
స బ్రహ్మయోగ యుక్తాత్మా సుఖ మక్షయ మశ్నుతే. 21

బాహ్య విషయములం దనాసక్తుడై ఆత్మయందే సుఖమును గాంచు బ్రహ్మయోగ యుక్తాత్ముడు బ్రహ్మమే ఆత్మయని తెలిసి తన్నిష్ఠయం దుండువాడై అక్షయ సుఖము ననుభవించును.

విషయ భోగము లయోగ్యములు

యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే,
ఆద్యంతవంతః కౌంతేయ న తేషు రమతే బుధః. 22

ఇంద్రియ విషయ సంయోగముచే కలిగిన భోగములు దుఃఖ ప్రదములై ఆద్యంతవంతములై యున్నవి. కావున ఓ కౌంతేయా!

బుద్ధిమంతులు అనగా తత్త్వజ్ఞులు వానియందు రమ్యత్వబుద్ధి నుంచరు.

శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్ఛరీర విమోక్షణాత్,
కామ క్రోధోద్భవం వేగం స యుక్త స్స సుఖీ నరః. 23

ఇహలోకము నందే ఈ శరీరమును విడుచుటకు ముందే కామ క్రోధములయొక్క ఉద్వేగము నాప గలిగిన వాడే యోగయుక్తుడు. అతడే సుఖియును.

నిర్వాణ పదము నొందువారి లక్షణము

యోఽన్త స్సుఖోఽన్తరారామ స్తథాఽన్తర్జ్యోతి రేవ యః,
స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మ భూతోఽధి గచ్ఛతి. 24

ఎవ డంతః సుఖియో అంతరంగమునందు ఆరామము నొందు వాడో ఎవనియందు జ్ఞానమను అంతర్జ్యోతి వెలుగుచున్నదో ఆ యోగియే బ్రహ్మరూపుడై బ్రహ్మపదమును పొందును.

ఆత్మ సచ్చిదానంద స్వరూపమని తెలిసి తన్నిష్ఠాపరుడై అద్వితీయమగు సుఖము ననుభవించును. తద్రూపుడేయై ఉండిపోవును.

లభంతే బ్రహ్మనిర్వాణ మృషయః క్షీణ కల్మషాః,
ఛిన్నద్వైధా యతాత్మాన స్సర్వ భూత హితే రతాః. 25

ఎవరి పాపములు క్షీణమై ద్వంద్వ భావములు నివృత్తినొంది యుండునో ఎవరు జితేంద్రియులై యుండి సర్వ భూతముల యొక్క శుభమునందు కల్యాణ కార్యము నందు ఆసక్తులై యున్నారో వారు ఋషులు. అట్టి వారు బ్రహ్మ సాయుజ్యమును (మోక్షమును) బడయుదురు.

కామ క్రోధ వియుక్తానాం యతీనాం యతచేతసామ్,
అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనామ్. 26

మనస్సునాపి కామ క్రోధ రహితులైన జ్ఞానులగు యతులకు సర్వత్ర బ్రహ్మమే అనుభూత మగును. వారు అధిష్ఠానమగు బ్రహ్మ దృష్టి గలిగి యుందురని భావము.

స్పర్శాన్ కృత్వా బహి ర్బాహ్యాం శ్చక్షుశ్చైవాన్తరే భ్రువోః,
ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యన్తర చారిణౌ. 27

యతేంద్రియ మనోబుద్ధి ర్మునిర్మోక్ష పరాయణః,
విగతేచ్ఛా భయ క్రోధో యస్సదా ముక్త ఏవ సః. 28

ఏ ముని బాహ్యములగు విషయములను బాహ్యముననే ఆపి భ్రూమధ్యమున దృష్టి నిలిపి ముక్కు గోళముల యందు సంచరించు ప్రాణాపానములను సమముగాజేసి ఇంద్రియ మనో బుద్ధులను సంయమించి మోక్షపరాయణుడై కామ క్రోధ భయ రహితుడై యున్నాడో అతడు నిత్య ముక్తు డని అర్థము.

ఈ యుత్తమ సాధనములు గలవాడు మఱి యే యితర సాధనల నపేక్షింపక ఈమూలముననే ముక్తి నొందవచ్చునని భావము.

*భోక్తారం యజ్ఞతపసాం సర్వ లోక మహేశ్వరమ్,
సుహృదం సర్వ భూతానాం జ్ఞాత్వా మాం శాంతి మృచ్ఛతి. 29

సర్వ యజ్ఞ తపస్సుల ననుభవించు వాడును, సర్వ భూతముల మిత్రుడును శ్రేష్ఠుడునగు సర్వలోకేశ్వరుడనైన నా యొక్క యథార్థ జ్ఞానము గలిగిన వాడు శాంతిని పొందును.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే కర్మసన్న్యాసయోగోనామ పంచమోఽధ్యాయః.

ఓమ్

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః

# శ్రీమద్భగవద్గీత-షష్ఠాధ్యాయము

అవ : ఈ అధ్యాయమున ధ్యాన యోగ సాధనను నిరూపించుచు తన్మూలమున జ్ఞానము కలుగునని చెప్పుచున్నారు.

శ్రీ భగవానువాచ :

* ఎవడు భోక్తగా ఉన్నాడో అతడు వస్తుతః ఈశ్వరుడుగానే ఉన్నట్టి యీ కీలకమును కనిపట్టినవాడు ముక్తి నొందును.

అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః,
స సంన్యాసీ చ యోగీచ న నిరగ్నిర్నచాక్రియః. 1

కర్మ ఫలము నాశింపక కర్తవ్య కర్మను చేయువాడే సన్న్యాసి అతడే యోగియును. కేవలము యజ్ఞాది అగ్నిని విడిచిన వాడుగాని కర్మ రహితుడుగాని సన్న్యాసి కాజాలడు.

సన్న్యాసము, కర్మయోగము ఇవి రెండును ఒకటే

యం సన్న్యాస మితి ప్రాహు ర్యోగం తం విద్ధి పాండవ,
నహ్యసంన్యస్త సంకల్పో యోగీ భవతి కశ్చన. 2

పాండవా! దేనిని సన్న్యాస మనెదరో అదే యోగమని తెలియుము. సంకల్పములను త్యాగము చేయనిదే ఎవడును యోగి కాజాలడు.

ముముక్షువునకు ధన్యోపాయము

ఆరురుక్షో ర్మునే ర్యోగం కర్మ కారణ ముచ్యతే,
యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే. 3

యోగ సిద్ధిని బడయ యత్నించు వానికి కర్మయోగము సాధనమగును. యోగసిద్ధిని బడసిన వానికి ఉపశమము ఆ స్థితియందు నిలుకడకు సాధనమగును.

యోగారూఢుని లక్షణము

యదా హి నేంద్రియార్థేషు న కర్మస్వనుషజ్జతే,
సర్వ సంకల్ప సన్న్యాసీ యోగారూఢ స్తదోచ్యతే. 4

ఎప్పుడు విషయముల యందు గాని కర్మల యందు గాని ఆసక్తి లేనివాడై సమస్త సంకల్పములను విడచియుండునో అప్పుడతడు యోగారూఢుడని చెప్పబడును.

తన్ను తానే ఉద్ధరించు కొనవలెను

ఉద్ధరే దాత్మనాఽఽత్మానం నాత్మాన మవసాదయేత్,
ఆత్మైవ హ్యాత్మనో బంధు రాత్మైవ రిపురాత్మనః. 5

మనుష్యుడు తన్ను తానే ఉద్ధరించుకొనదగును. తన్ను తానెప్పుడును అధోగతి నొందించుకొనరాదు. తన మనస్సే తనకు శత్రువు. తన మనస్సే తనకు మిత్రుడు.

తనకు తానే శత్రువు, తనకు తానే మిత్రుడు

బంధురాత్మాఽఽత్మనస్తస్య యేనాత్మైవాత్మనా జితః,
అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్. 6

ఎవడు తన్ను తానే జయించి యున్నాడో అనగా మనస్సు యొక్క చేష్టల ననుసరింపడో అతడు తనకు తానే మిత్రుడు. ఎవడు మనస్సునకు లొంగెనో ఆత్మ జ్ఞాన విహీనుడో అతడు తనకు తానే శత్రువువలె నుండును.

అజితేంద్రియుఁ డగు వానికి తన మానసేంద్రియములే పరమ శత్రువులవలె శ్రుతిపథమును దప్పి నడిపించుచు నిత్య మశాంతిని చేకూర్చును. కామ రాగ విద్వేషములను పురికొల్పును.

యోగారూఢత నొందిన వాని స్థితి

జితాత్మనః ప్రశాంతస్య పరమాత్మా సమాహితః,
శీతోష్ణ సుఖదుఃఖేషు తథా మానావమానయోః. 7
జ్ఞాన విజ్ఞాన తృప్తాత్మా కూటస్థో విజితేంద్రియః,
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాంచనః. 8

ఎవని ఆత్మ జ్ఞాన విజ్ఞానములచే తృప్తి నొందినదో ఎవడు జితేంద్రియుడో ఎవని ఆత్మ పరబ్రహ్మము నందు స్థిరమై యున్నదో ఎవడు మట్టిపెల్ల, ఱాయి, బంగారు మున్నగు సర్వము సమదృష్టిచే చూచునో ఎవడు శీతోష్ణములయందును సుఖ దుఃఖములయందును గౌరవ, అగౌరవముల యందును సముడో అతడు యోగసిద్ధుడని చెప్పబడును.

చక్కని జితేంద్రియత్వము ఆత్మోద్ధరణమునకు హేతువని ఇందలి భావము.

సర్వత్ర సమబుద్ధి గల యోగి యొక్క శ్రేష్ఠత

సుహృన్మిత్రా ర్యుదాసీన మధ్యస్థ ద్వేష్యబంధుషు,
సాధుష్వపి చ పాపేషు సమబుద్ధి ర్విశిష్యతే. 9

మంచి మనస్సుగల స్నేహితుడు, శత్రువు, ఉదాసీనుడు, మధ్యస్థుడు, ద్వేషి, బంధువు, సాధువులు, పాపులు మొదలగు వారందఱి యందును సమబుద్ధి గలవాడు గొప్పవాడు.

ఆ యా భిన్న భిన్న సంస్కారములను తన చిత్తమున తీసికొని చింతింపని వాడు, విపరీత భావము నొందనివాడు శ్రేష్ఠుడని యర్థము.

ధ్యానయోగ సాధనలు

యోగీ యుంజీత సతత మాత్మానం రహసి స్థితః,
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః. 10

యోగి యగువాడు ఏకాంతముగ నుండుచు చిత్తమును సంయమించి ఆశను వీడి పరిగ్రహబుద్ధిని త్రుంచి సంతతము యోగాభ్యాసపరుడై యుండవలెను.

శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసన మాత్మనః,
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చైలాజిన కుశోత్తరమ్. 11

పవిత్రమగు స్థలము నందు స్థిరమైన ఆసన మొకటి స్థాపించుకొనవలెను. ఆ యాసనము భూమికి చాల ఎత్తుగను తక్కువగను ఉండక తగు రీతిగ నుండవలయును. దర్భాసనము, దానిపై మృగచర్మము, దాని మీద శుభ్రమగు వస్త్రము కలిగినదై ఉండవలెను.

తత్రైకాగ్రం మనః కృత్వా యత చిత్తేంద్రియ క్రియః,
ఉపవిశ్యాసనే యుంజ్యా ద్యోగ మాత్మ విశుద్ధయే. 12

అచ్చట ఆసనస్థుడై కూర్చుండి ఆత్మ (మనస్సు) శుద్ధి కొఱకై చిత్తము నేకాగ్ర మొనర్చి మానసేంద్రియములను సంయమించి యోగరతుడు గావలెను.

అవ : తద్విధానమును దెలుపుచున్నారు.

సమం కాయ శిరో గ్రీవం ధారయన్నచలం స్థిరః,
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్. 13

వెన్ను మెడ తల వీటిని చక్కగ ఒకే విధముగ నిలిపి కదల

కుండ స్థిరము జేయవలయును. దిక్కుల నవలోకించక దృష్టిని తన నాసికాగ్రమున జేర్చి ఏకాగ్రత నొందించవలెను.

ప్రశాంతాత్మా విగత భీ ర్బ్రహ్మచారివ్రతే స్థితః,
మనస్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః. 14

శాంతచిత్తుడై భయమును వీడి బ్రహ్మచర్య వ్రతము నాచరించుచు మనస్సును సంయమించి నన్ను ధ్యానించుచు నాయందే నిష్ఠ గలిగి యోగయుక్తుడు గావలెను.

అవ : యోగఫలమును దెలుపుచున్నారు.

యుంజన్నేవం సదాఽఽత్మానం యోగీ నియతమానసః,
శాంతిం నిర్వాణ పరమాం మత్సంస్థా మధిగచ్ఛతి. 15

నియమింప బడిన మనస్సు గల అభ్యాసి యైన యోగి సర్వకాలములయం దీ ప్రకారముగ మనస్సును సమాధాన పఱచువాడై ఏకాగ్రచిత్తుడై మోక్షమనియెడి పేరుగల నా అధీనమైన శాంతిని పొందుచున్నాడు. సంసారోపరతి నొందుచున్నాడు.

అవ : ఆహార విహారాది నియమములు లేనివానికి యోగ మప్రాప్య మనుచున్నారు

నాత్యశ్నతస్తు యోగోఽస్తి నచైకాంత మనశ్నతః,
నచాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవచార్జున. 16

అర్జునా ! తిండిపోతునకును, ఏమియు తినని వానికిని, అతినిద్ర జేయువానికి, నిద్రయే లేక మేలుకొని యుండు వానికిని ఈ యోగ నిష్ఠ యలవడదు. సాధ్యము గాదు.

అవ : నియమితాహార విహారాదులు గలవానికి యోగము సిద్ధించుననుచున్నారు.

యుక్తాహార విహారస్య యుక్తచేష్టస్య కర్మసు,
యుక్త స్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా. 17

మితాహార విహార వ్యవహారములును, మితమగు మెలకువ నిద్రలును గలవానికి ఈ యోగము దుఃఖనాశక మగును.

### యోగయుక్తుడగు పురుషుని లక్షణము

యదా వినియతం చిత్త మాత్మన్యేవావతిష్ఠతే,
నిస్పృహ స్సర్వ కామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా. 18

నిగ్రహింపబడిన మనస్సు ఆత్మయందు స్థిరమై ఏ కోరికలును లేక ఆశారహితమైన యెడల మానవుడు యోగ యుక్తు డయ్యెనని చెప్పబడును.

అవ: దీపోపమానముచే యోగియొక్క చిత్తవృత్తికి సంబంధించిన నిశ్చలతను తెలుపుచున్నారు.

యథా దీపో నివాతస్థో నేంగతే సోపమా స్మృతా,
యోగినో యతచిత్తస్య యుంజతో యోగమాత్మనః. 19

ఈ ఆత్మయోగాభ్యాసము చేయుచు మనస్సును నిగ్రహించి వాయువు లేని స్థలమునం దుంచిన (కదలని) దీపముభంగి యోగి నిశ్చలుడును శాంతుడు నయి యుండును.

యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా,
యత్ర చైవాత్మనాఽత్మానం పశ్యన్నాత్మని తుష్యతి. 20

యోగాభ్యాసముచే నిరోధింపబడిన చిత్తము ఏ స్థితియందు స్థిరమై యున్నదో ఆత్మచే ఆత్మ నవలోకించుచు ఏ యవస్థయందు మానవుడు తుష్టుడై యుండునో,

సుఖమాత్యంతికం యత్త ద్బుద్ధి గ్రాహ్య మతీంద్రియమ్,
వేత్తి యత్ర నచైవాయం స్థిత శ్చలతి తత్త్వతః. 21

ఏ స్థితియందు పురుషుడు ఇంద్రియములకు గోచరింపని కేవల శుద్ధ బుద్ధి గమ్యమగు ఆత్యంతిక సుఖమును బడయునో, ఏ స్థితి యందు ఒక్కసారి నిలుకడ చెందిన అచ్యుతు డగునో,

యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః,
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాఽపి విచాల్యతే. 22

ఏ స్థితిని పొందినచో మనుష్యుడిక దాని కంటె ఎక్కువైనది మఱేదియు లేదని తెలియునో, ఏ స్థితి యందు స్థిరుడైనచో ఎట్టి మహాదుఃఖము గూడ నతనిని కదలింప జాలదో,

తం విద్యా ద్దుఃఖ సంయోగ వియోగం యోగ సంజ్ఞితమ్,
స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణ చేతసా. 23

ఆ స్థితియే దుఃఖమును ఆమూలాగ్రముగ నాశ మొందించు శక్తిగల దుఃఖ సంయోగ వియోగమను స్థితియై యున్నది. మనస్సును అలసట జెంద నివ్వక నిశ్చయాత్మికమగు బుద్ధిచే ఆ యోగమును సాధింపవలెను.

అవ: అచింత్యమగు పరమాత్మ యొక్క ధ్యాన విధి అనగా యోగోపాయము తెలుపబడుచున్నది.

సంకల్ప ప్రభవాన్ కామాం స్త్యక్త్వా సర్వా నశేషతః,
మనసై వేంద్రియగ్రామం వినియమ్య సమంతతః. 24

సంకల్పమే కారణముగా గలిగిన సర్వకామములను నిశ్శేషముగ విడచి సర్వవిధముల ఇంద్రియ సమూహమును మనస్సుచే సంయమించి,

శనై శ్శనై రుపరమే ద్బుద్ధ్యా ధృతి గృహీతయా,
ఆత్మ సంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్. 25

నెమ్మదిగా సావధాన మైన ధీరమగు బుద్ధిచే శాంతిని బడయవలయును. మనస్సును ఆత్మ యందు స్థిరపఱచి తక్కిన అన్ని చింతలను విడువవలెను.

మనస్సును పరమాత్మయందు సంలగ్న మొనర్చు నట్టి సమాధిస్థితి

యతో యతో నిశ్చరతి మనశ్చంచల మస్థిరమ్,
తత స్తతో నియమ్యైత దాత్మన్యేవ వశం నయేత్. 26

అస్థిరమగు నీ చంచలమైన మనస్సు ఏ యే మార్గములయందు వెళ్ళ ప్రయత్నించునో ఆ యా విషయముల నుండి మనస్సు నాపి (వెనుద్రిప్పి) వశము జేసికొని ఆత్మయందు స్థిరము జేయవలయును. అనగా ఆత్మభావనచే నిలుకడ జెందింప వలయును.

యోగికి ఉత్తమసుఖము సిద్ధించును

ప్రశాంతమనసం హ్యేనం యోగినం సుఖము త్తమమ్,
ఉపైతి శాంత రజసం బ్రహ్మ భూత మకల్మషమ్. 27

ఇట్లు ప్రశాంత మనస్సు గల రజోరహితుడగు బ్రహ్మనిష్ఠుడైన నిష్పాపుడగు యోగికి ఉత్తమ మగు సుఖము దొరకును.

యుంజన్నేవం సదాఽఽత్మానం యోగీ విగత కల్మషః,
సుఖేన బ్రహ్మ సంస్పర్శ మత్యంతం సుఖ మశ్నుతే. 28

యోగి ఈ విధముగా ఎల్లప్పుడును యోగము నాచరించుచుండిన పాపరహితుడై అత డనాయాసముగ ఆ బ్రహ్మయోగముచే గలిగిన అత్యంత శ్రేష్ఠమగు సుఖము ననుభవించును.

అవ : సర్వ సంసార దుఃఖ నివృత్త్యుపాయాత్మకమగు అద్వితీయ బ్రహ్మతత్త్వ ప్రబోధక వాక్యార్థ నిరూపణము.

సర్వ భూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః. 29

యోగ యుక్తుడగు నాతడు ఎల్లెడల సమదృష్టి గలవాడై సర్వభూతముల యందు ఆత్మను, ఆత్మయందు సమస్త భూతములను జూచును.

యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి,
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి. 30

ఎవడు నన్ను అన్నిటి యందును అన్నిటిని నా యందును జూచునో అట్టి వానినుండి నేను వేఱు గాను. నానుండి అతడును వేఱు గాడు.

సర్వభూతస్థితం యోమాం భజత్యేకత్వమాస్థితః,
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే. 31

ఇట్టి ప్రత్యగభిన్న పరమాత్మ దృష్టి గలవాడై సర్వభూతము లయందుండు నన్ను తన్నుగా నెవడు భజించుచున్నాడో అతడు సర్వకర్మల నాచరించుచుండినను నాయందే స్థితి నొందిన వాడై యున్నాడు నాకంటె అన్యుడు గాడు.

ఈమూడు శ్లోకములు తత్త్వమసి మహావాక్యమునందలి తత్త్వం పదార్థముల అభేద బోధక వాక్యములై యున్నవి. శ్రీ శంకరాచా

ర్యుల భాష్యసమ్మతము. [నిర్విశేషం బ్రహ్మాత్మైకత్వ విషయం దర్శనం జ్ఞానం యస్యసః సర్వత్ర సమదర్శనః] [తస్యచ మమచ ఏకాత్మకత్వాత్]

పరమ యోగి యొక్క లక్షణము

ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున,
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః. 32

అర్జునా ! సుఖమే యగుగాక!. లేక దుఃఖమే యగుగాక !. ఈ రెండు విషయములందును ఎవడు తనవలె అందఱిని సమముగా గాంచునో అతడే సర్వశ్రేష్ఠుడని చెప్ప బడును.

ఇచ్చట ఆత్మ అద్వితీయ మను దృష్టిచే పూర్ణమగు అహింసా తత్త్వమును దెలిపి నట్లాయెను. తనకు సుఖదుఃఖముల స్పర్శలేదు. అటువలె సర్వత్రాత్మ దర్శియగు నతనికి ఎవరి యందును సుఖదుఃఖాది హింసలు దోపవు. ఇది కేవలదృష్టి యుక్తమైన అద్వితీయ దర్శనమని భావము.

అవ : మనస్సు అతి చంచలమైనదను విషయమున అర్జునుని ప్రశ్న

అర్జున ఉవాచ :

యోఽయం యోగస్త్వయా ప్రోక్తః సామ్యేన మధుసూదన,
ఏతస్యాహం న పశ్యామి చంచలత్వాత్ స్థితిం స్థిరామ్. 33

మధుసూదనా! మనస్సు చంచల మైనందు వలన నీవు ఉపదేశించిన ఈ సమత్వముచే సంప్రాప్తమగు యోగము స్థిరముగా నుండు విధాన మేదియో నాకు తెలియదు.

చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢమ్,
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్. 34

కృష్ణా ! మనస్సు చంచలము, క్షోభదాయకము, బలిష్ఠము, మఱియు దృఢ మయినదియు నయియున్నది. దీని నాగ బట్టుట గాలిని మూట గట్టినట్లు మహాకఠినమై యున్నదని తెలియుచున్నది.

శ్రీ భగవానువాచ :

అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్,
అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే. 35

అర్జునా! మనస్సు చంచలము. తన్నిగ్రహము కఠిన మను మాటయు నిజము. నిస్సంశయము. అయితే వైరాగ్యాభ్యాసాదులచే నిగ్రహించుట సాధ్యము.

అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః,
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తు ముపాయతః. 36

ఆత్మసంశయము లేనిదే యోగ మసాధ్య మని నా యభిప్రాయము. కాని ఆత్మ సంయమము గలవాడు ప్రయత్నింప ఉపాయముచే ఈ యోగము సంప్రాప్త మగును. సాధ్యమని తెలియుము.

లకుముకి పిట్ట పట్టువలె ప్రయత్నముండిన తప్పక ఇది సాధ్యమే నని భావము.

అవ : యోగ భ్రష్టుని విషయము నందు అర్జునుని ప్రశ్న.

అర్జున ఉవాచ :

అయతిః శ్రద్ధయోపేతో యోగా చ్చలిత మానసః,
అప్రాప్య యోగ సంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి. 37

కృష్ణా! శ్రద్ధ యుండినను యత్నము జేయక యుండి నందువలన ఎవని మనస్సు యోగము నుండి జారి యోగసిద్ధి నొందజాలక పోవునో అట్టి వాని కేమి గతి యగును ?

కచ్చిన్నోభయ విభ్రష్ట శ్ఛిన్నాభ్ర మివ నశ్యతి.
అప్రతిష్ఠో మహాబాహో విమూఢో బ్రహ్మణః పథి. 38

కృష్ణా! మోహావిష్టుడై నందువలన బ్రహ్మమార్గము నందు స్థిరత నొందక యుండినవాడు ఇహపరములను రెండు లోకములచే భ్రష్టుడై విచ్ఛిన్న మేఘము వలె పూర్ణ నాశము నొందునా యేమి!

ఏతన్మే సంశయం కృష్ణ ఛేత్తుమర్హస్య శేషతః,
త్వదన్య స్సంశయస్యాస్య చ్ఛేత్తా న హ్యుపపద్యతే. 39

కృష్ణా! ఈ నా సంశయము నెడి వేరును గూడ నీవే పెకలించివేయవలెను. నీవు వినా ఈ సందేహమును నివర్తింప జేయువాడు మఱెవ్వారు గలరు?. లేరు.

మంచి పని చేసిన ఉత్తమునకు దుర్గతి లేదు

శ్రీ భగవానువాచ :

పార్థ నైవేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే,
నహి కల్యాణకృ త్కశ్చి ద్దుర్గతిం తాత గచ్ఛతి. 40

పార్థా ! అతడు ఈ లోకము నందుగాని పరలోకము నందుగాని నాశ మొందడు. యత్కించిత్ శుభము నాచరించిన వాడే యగుగాక అత డెప్పటికిని దుర్గతిని జెందడు.

యోగభ్రష్టుడు శ్రీమంతుల ఇంటి యందు జన్మించును

ప్రాప్య పుణ్యకృతాం లోకా నుషిత్వా శాశ్వతీస్సమాః,
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే. 41

పుణ్యకర్మలను జేసిన వారి లోకములను అనగా స్వర్గలోకమును బొంది బహుకాల మచ్చట భోగానుభవముల ననుభవించుచు నుండి మరల పవిత్రులును శ్రీమంతులు నగు వారి యింటి యందు (కులము నందు) యోగ భ్రష్టుడు జన్మించును.

అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్,
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్. 42

లేక బుద్ధిమంతు లగు యోగుల కులము నందు అతడు జన్మ మెత్తును. ఇట్టి జన్మ లోకమునందు అతి దుర్లభమైనది.

తత్ర తం బుద్ధి సంయోగం లభతే పౌర్వదైహికమ్,
యతతే చ తతో భూయ స్సంసిద్ధౌ కురునందన. 43

కురునందనా అచ్చట అతనికి పూర్వ జన్మ సంస్కారముచే సుబుద్ధి కలిగి అతడు ముందు మరల యోగ సిద్ధికై యత్నించును.

పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః,
జిజ్ఞాసు రపి యోగస్య శబ్దబ్రహ్మాతి వర్తతే. 44

ఆ పూర్వాభ్యాస బలముచేతనే అతడు మరల యోగమునందు ప్రవృత్తుడగును. కేవల మీ యోగవిషయకమగు జిజ్ఞాస గలవాడు గూడ శబ్ద బ్రహ్మము నతిక్రమించును. వేదోక్త కర్మఫలముల నతిక్రమించి నిజ తత్త్వము నరసి ముక్తుడగు నని భావము.

ప్రయత్నా ద్యతమానస్తు యోగీ సంశుద్ధ కిల్బిషః,
అనేక జన్మ సంసిద్ధ స్తతో యాతి పరాంగతిమ్. 45

చక్కని ప్రయత్నముచే ప్రయాస మైనను యత్నమును వీడక ప్రయత్నించుచుండు యోగి నిష్పాపుడై అనేక జన్మలైనపిదప జ్ఞానియై పరమగతిని పొందును. క్రమముగా సంస్కారాభి వృద్ధియై సమ్యగ్దర్శనము నొంది ధన్యుడగును.

అవ: యోగి మహిమ నభివర్ణించుచు నీవు యోగి వగు మని తెలుపుచున్నారు.

తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః,
కర్మిభ్య శ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున. 46.

తపస్సంపన్నుల కంటెను యోగి ఎక్కువ వాడు. శాస్త్రజ్ఞుల కంటెను అత డధికుడు. కర్మఠుల కంటెను అతడు శ్రేష్ఠుడు. అందుచేత అర్జునా! నీవు నిష్కామ యోగివి కమ్ము.

కృచ్ఛ్ర చాంద్రాయణాది తపస్సుల కంటెను, కేవల శాస్త్రజ్ఞాన మాత్రముగల జ్ఞానుల కంటెను, అగ్నిహోత్రాది కర్మలను జేయు కర్మఠుల కంటెను కర్మరహితుడగు యోగి జ్ఞానయోగి శ్రేష్ఠుడని ఇందలి అర్థము.

యోగినామపి సర్వేషాం మద్గతేనాంతరాత్మనా,
శ్రద్ధావా న్భజతే యో మాం స మే యుక్తతమో మతః. 47

అందఱి యోగుల యందును తన అంతరాత్మను నా యందు స్థిరముగ నిలిపి శ్రద్ధ గలవాడై ఎవడు నన్ను తన్నుగా భజించునో అతడే సర్వమునకు గొప్ప. ఇది నా మతము (అభిప్రాయము).

ఓం తత్స దితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే ఆత్మసంయమయోగో నామ.

షష్ఠోఽధ్యాయః



ఓమ్

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీమద్భగవద్గీత-సప్తమాధ్యాయము

అవ : జ్ఞానయుక్త మగు భక్తియోగమును భగవంతుడు అర్జునునకు తెలుపుచున్నాడు.

శ్రీభగవానువాచ :

మయ్యాసక్తమనాః పార్థ యోగం యుంజన్మదాశ్రయః,
అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు. 1

నన్నాశ్రయించి నాయందు చిత్తము నుంచి యోగాభ్యాసము చేయుచుండ సంశయ రహితమై సమగ్రముగ నన్ను నీవు ఎట్లు తెలియ గలిగెదవో ఆ విధమును జెప్పెదను వినుము.

జ్ఞానం తేఽహం సవిజ్ఞాన మిదం వక్ష్యా మ్యశేషతః,
యజ్జ్ఞాత్వా నేహ భూయోఽన్యజ్జ్ఞాతవ్య మవశిష్యతే. 2

విజ్ఞాన సహితమగు జ్ఞానమును నేను నీకు చక్కగా నుపదేశించెదను. సంపూర్ణమగు నా తత్త్వమును దెలిసిన పిదప ఇచ్చట మరల తెలిసికొనదగిన పురుషార్థ సాధన మేదియును మిగిలియుండదు.

ఆత్మతత్త్వము నరయువారు దుర్లభము

మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే,
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః. 3

వేలాదిజనులయం దెవడో ఒకడా తత్త్వసిద్ధికై యత్నించును. ఇట్లు ప్రయత్నించి సిద్ధులైన వారియందు నన్ను యథార్థముగ తెలిసికొనువా డెవడో ఒకడు మాత్ర ముండును.

కారణ మేమన ఆత్మ తత్త్వము అపూర్వము, అతిసూక్ష్మము, స్వరూప భూతమునై యున్నందువలన అన్యమై తెలియ బడునది కాదు. శ్రీగురుకృపావలంబన మాత్ర విశేషమున స్వసంవేద్యముగా తత్త్వము తెలియదగి యున్నది గాన అధికారు లరుదని భావము.

### పరాప్రకృతి, అపరాప్రకృతి

భూమి రాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధి రేవ చ,
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా.
అప రేయ మిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్,
జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్. 5

భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము ఇట్లు నా ప్రకృతి ఎనిమిది విధములు. ఇది అపరా యను ప్రకృతియై యున్నది.

దేనిచే ఈ జగత్తు ధరింపబడి యున్నదో ఆ జీవరూపమగు నా ప్రకృతి దీనికంటెను పర (ఉత్కృష్ట) మైనది, వేరైనది యని తెలియుము.

అవ : ఈ ద్వివిధ ప్రకృతి సంసారరూపమగు జగత్తునకు కారణముగా ఉన్నది.

ఏతద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ,
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయ స్తథా.

సమస్తభూతముల ఉత్పత్తి ఈ ద్వివిధ ప్రకృతి నుండియే యనునది చక్కగా లక్ష్యమునం దుంచుకొనుము. నేనే ఈ జగదుత్పత్తి స్థితి లయ కారణము.

### పరమేశ్వర తత్త్వము సర్వవ్యాపకము

మత్తః పరతరం నాన్య త్కించి దస్తి ధనంజయ,
మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ. 7

ధనంజయా! నా కంటెను అధికమైనది మరేమియును లేదు. సూత్రము నందు కూర్చబడిన మణులవలె ఈ సర్వము నా యందు గుచ్చబడి యున్నది.

అవ : రసాదుల రూపమున జలాది భూతముల యందును ఈశ్వరుని వ్యాపకత అర్థాత్ విభూతి నిరూపణము.

రసోఽహ మప్సు కౌంతేయ ప్రభాఽస్మి శశి సూర్యయోః,
ప్రణవ స్సర్వ వేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు. 8

జలము నందు నేనే సారమగు రసమై యున్నాను. సూర్య చంద్రులలోని ప్రకాశము నేనే. సర్వ వేదముల యందు ఓంకారము నేను. ఆకాశమునందు శబ్దము నేను. మానవులయం దుండు పౌరుషమను నృబీజ శక్తి నేను.

పుణ్యో గంధః పృథివ్యాం చ తేజశ్చాస్మి విభావసౌ.
జీవనం సర్వ భూతేషు తపశ్చాస్మి తపస్విషు. 9

పృథివి యందు పుణ్యమగు సుగంధము నేను. అగ్ని యందు తేజస్సు నేను. సర్వ భూతముల యందు జీవనము నేను. తపస్సంపన్నులలోని తపస్సు నేనయి యున్నాను.

బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనమ్,
బుద్ధి ర్బుద్ధిమతా మస్మి తేజ స్తేజస్వి నా మహమ్. 10

పార్థా! సమస్త భూతములకు సనాతనమగు బీజము నేనే యని తెలియుము. బుద్ధిమంతులలోని బుద్ధి నేనే. తేజస్సంపన్నుల లోని తేజస్సు నేను.

బలం బలవతాం చాహం కామ రాగ వివర్జితమ్,
ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ. 11

బలము గలిగిన వారి యందుండు కామ రాగ వివర్జిత మైన బలము నేనయి యున్నాను. భరతర్షభా! భూతములయందు ధర్మమునకు విరుద్ధము గాని కామము నేనయి యున్నాను.

పరమాత్మయందు జగత్కల్పన

యే చైవ సాత్త్వికా భావా రాజసా స్తామసాశ్చ యే,
మత్త ఏవేతి తాన్విద్ధి నత్వహం తేషు తే మయి. 12

సత్వ రజ స్తమో గుణాత్మకమై సృష్టింపబడిన సమస్త పదార్థములు నానుండియే ఏర్పడినవని తెలియుము. నేను వానియందు లేను. అయితే అవి నాయందు గలవు.

అవి నాయందు కల్పన. నేను సంసారులవలె వాని అధీనమై లేను. నా అధీనమునం దవి యున్నవి.

నన్ను తెలియ కుండుటకు కారణము త్రిగుణములే

త్రిభి ర్గుణమయై ర్భావై రేభిస్సర్వ మిదం జగత్,
మోహితం నాభిజానాతి మామేభ్యః పర మవ్యయమ్. 13

జగత్తు ఈ మూడు గుణములచే మోహపెట్ట బడినదై దీని కంటె వేఱై శ్రేష్ఠమై అవ్యయమైయున్న నన్ను దెలియుట లేదు.

మాయను దాటుట కుపాయము నన్ను భజించుటయే

దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా,
మామేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే. 14

త్రిగుణ మయ మైన నా యీ దైవీ (దివ్యమగు) మాయను దాటుట చాల కష్టము. కాని ఎవరు నన్నే భజింతురో వారు మాత్ర మీ నా మాయను దాటెదరు.

పాపకర్మ నాచరించు మూఢులు నన్ను భజింపరు

న మాం దుష్కృతి నో మూఢాః ప్రపద్యంతే నరాధమాః,
మాయయాఽపహృత జ్ఞానా ఆసురం భావ మాశ్రితాః. 15

ఈ మాయచే ఎవరి జ్ఞానము నష్టమై యున్నదో ఎవరీ రాక్షస బుద్ధి నాశ్రయించి యున్నారో మూఢులు, దుష్టులునయిన ఆ నరాధ ములు నన్ను భజించుట లేదు. నన్ను శరణు పొందరు.

నాలుగు తెఱగుల భక్తులు

చతుర్విధా భజంతే మాం జనా స్సుకృతినోఽర్జున,
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ. 16

అర్జునా! నాలుగు విధములగు సుకృతాత్ములయిన జనులు నన్ను భజింతురు. భరతర్షభా! వారెవరన, ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి జ్ఞాని.

జ్ఞాని యగు భక్తుని ప్రేమ ప్రశంస

తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే,
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థ మహం స చ మమ ప్రియః. 17

వారియందు అనన్య భక్తిగల నిత్యయుక్తుడైన జ్ఞాని శ్రేష్ఠుడు

నేను జ్ఞానికి అత్యంత ప్రియుడనై యున్నాను. అతడు నాకు ప్రియుడు. జ్ఞానియగు నతడు నేనే యని భావము.

ఉదారా స్సర్వ ఏవై తే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్,
ఆస్థిత స్స హి యుక్తాత్మా మామేవాను త్తమాం గతిమ్. 18

వీరందఱు ఉదార మతులైన సజ్జనులే. కాని జ్ఞాని యగు వాడు సాక్షాత్తుగ నా ఆత్మయే. నేనే యని నా మతము. ఎందుకనగా, యోగయుక్తుడగు జ్ఞాని అత్యుత్తమస్థితితో నా యందు స్థిరముగా నిలిచి యుండు నని భావము.

మహాత్ముడైన జ్ఞాని దుర్లభుడు

బహూనాం జన్మనామంతే జ్ఞానవా న్మాం ప్రపద్యతే,
వాసుదేవ స్సర్వ మితి స మహాత్మా సుదుర్లభః. 19

బహు జన్మలైన పిదప ఇదంతయును వాసుదేవాఖ్య పరబ్రహ్మమే యను దృష్టి గలిగి జ్ఞాని నా కడకు వచ్చును. ఇట్టి మహాత్ముడు దొరకుట దుర్లభము.

అన్యదేవతారాధన చేయుటకు హేతువు

కామైస్తైస్తై ర్హృత జ్ఞానాః ప్రపద్యంతేఽన్య దేవతాః,
తం తం నియమ మాస్థాయ ప్రకృత్యా నియతా స్స్వయా. 20

తమ తమ స్వభావము ననుసరించి వివిధ కామములచే మోహితులై జనులు ఆ యా నియమముల ననుసరించి నా నా దేవతలను భజింతురు.

ఇతర దేవతల నారాధించు వారికిని ఫలము నిచ్చువాడను నేనే

యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయార్చితు మిచ్ఛతి,
తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్. 21

ఏ భక్తుడు ఏ దేవతను ఏ మూర్తిని శ్రద్ధచే భజింప నిశ్చయించునో ఆ దేవతయందు ఆ మూర్తియందు అతని యా శ్రద్ధను నేను స్థిరపఱుతును.

సతయా శ్రద్ధయా యుక్త స్తస్యారాధన మీహతే,
లభతేచ తతః కామా న్మయైవ విహితా న్హి తాన్. 22

అతడా శ్రద్ధచే యుక్తుడై ఆ యా దేవతను ఆరాధించును. ఆ పిదప ఆ యా దేవతనుండి నాచేతనే నియమింపబడిన తత్తత్కామ ఫలములు అతనికి దొరకును.

అన్య దేవతోపాసనా ఫలము అల్పము

అంతవత్తు ఫలం తేషాం తద్భవ త్యల్ప మేధసామ్,
దేవాన్దేవయజో యాంతి మద్భక్తా యాంతి మామపి. 23

అల్ప మతి గల భక్తులకు ఫల మశాశ్వతము. దేవతలను పూజించువారు దేవతలను బొందుదురు. నా భక్తులు నన్నే పొందుదురు.

అవ్యక్తం వ్యక్తి మాపన్నం మన్యంతే మా మబుద్ధయః,
పరం భావ మజానంతో మమావ్యయ మను త్తమమ్. 24

నా అత్యంత శ్రేష్ఠమును ఉత్తమోత్తమమును అగు స్వరూపమును దెలియక అవ్యక్తాక్షర శబ్ద వాచ్యుడనైన నన్ను బుద్ధిలేనివారు (మూఢులు) వ్యక్త నామ రూపాత్మకునిగా దెలియుదురు.

అవ : అధిష్ఠానాత్మజ్ఞాన లోపముచే దేహాత్మబుద్ధి గలవారు నన్నీప్రకారముగ అర్థము జేసికొనెదరు.

నాహం ప్రకాశ స్సర్వస్య యోగమాయా సమావృతః,
మూఢోఽయం నాభిజానాతి లోకో మా మజ మవ్యయమ్. 25

యోగమాయచే మఱుగుబడి యున్నందు వలన నేనెల్ల వారికిని ప్రత్యక్షముగ నగపడుట లేదు. స్వరూపమాత్రమున నిత్య ప్రత్యక్షమే అయియున్నను అవిద్యచే నన్నెఱుగరని అర్థము. జన్మ రహితుడను, అవ్యయుడను అగు నన్ను మూఢులగు అజ్ఞులు తెలియరు.

తన్ను తెలియక తల్లి యశోద త్రాటిచే నన్ను గట్టుకాయత్త మైనట్లని తెలియ వలయును.

నే నన్నిటిని తెలియుదును. నన్నెవరును తెలియరు.

వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున,
భవిష్యాణి చ భూతాని మాం తు వేద న కశ్చన. 26

వెనుక గతించి పోయి నదియు ప్రస్తుతమున ఉండునదియు ముందు కా(రా)బోవు నదియు నగు దాని నంతయు భూత భవిష్య ద్వర్తమానములను నేను తెలియుదును. కాని నన్నెవరును తెలియరు.

సర్వ దేశ కాల కల్పనాధిష్ఠానముగా నుండుటచేత సర్వ ప్రకాశ కుడను నేనే యని భావము.

ఇచ్ఛా ద్వేష సముత్థేన ద్వంద్వ మోహేన భారత,
సర్వ భూతాని సమ్మోహం సర్గే యాంతి పరంతప. 27

ఎందుకనగా, శత్రు సంహారకుడవైన ఓ అర్జునా! ఇచ్ఛా ద్వేషములచే నుత్పన్నమైన ద్వంద్వములగు విషయముల యందలి మోహముచే ఈ సంసారము నందు వర్తించు సర్వ భూతము లున్మత్తము లయి పోవుచున్నవి.

పుణ్యాత్ములు నన్ను దృఢ భక్తిచే భజింతురు

యేషాం త్వంతగతం పాపం జనానాం పుణ్య కర్మణామ్,
తే ద్వంద్వ మోహ నిర్ముక్తా భజంతే మాం దృఢవ్రతాః. 28

అయితే, ఏ పుణ్యాత్ముల పాపము అనగా అజ్ఞానము అంతరించినదో వారీద్వంద్వ మోహములనుండి దూరులై దృఢమగు భక్తిచే నన్ను భజింతురు.

బ్రహ్మము, అధ్యాత్మము, కర్మ

జరా మరణ మోక్షాయ మా మాశ్రిత్య యతంతి యే,
తే బ్రహ్మ తద్విదుః కృత్స్న మధ్యాత్మం కర్మ చాఖిలమ్. 29

నన్నాశ్రయించి జనన మరణములనుండి ముక్తు లగుటకై యత్నించువారు సమగ్రముగా బ్రహ్మమును, అధ్యాత్మమును, మఱియు కర్మ రహస్యమును తెలిసికొందురు.

సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞం చ యే విదుః,
ప్రయాణ కాలేఽపి చ మాం తే విదు ర్యుక్త చేతసః. 30

అధిభూతము, అధిదైవము, అధియజ్ఞములతో గూడ నా జ్ఞానమును బడసిన యుక్తచిత్తులు మరణ సమయమున నన్ను మఱవరు. తెలిసికొందురు.

ఓంతత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే జ్ఞాన విజ్ఞాన యోగో నామ సప్తమోఽధ్యాయః

ఓమ్

శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీమద్భగవద్గీత-అష్టమాధ్యాయము

అవ : బ్రహ్మము, అధ్యాత్మము, కర్మ ఇత్యాది 7 విషయములను గుఱించి అర్జునుని ప్రశ్న.

అర్జున ఉవాచ :

కిం తద్బ్రహ్మ కి మధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ,
అధిభూతం చ కిం ప్రోక్త నధిదైవం కి ముచ్యతే. 1

పురుషోత్తమా! బ్రహ్మ మనగా నేమి? అధ్యాత్మ మనగా నేమి? కర్మ యనగా నేమి? అధిభూత మని దేని నందురు? అధిదైవ మనిన నేమి?

అధియజ్ఞః కథం కోఽత్ర దేహేఽస్మి న్మధుసూదన,
ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః. 2

అధియజ్ఞ మెట్లున్నది? ఈ దేహమునందు ఆ అధియజ్ఞ మేది? మధుసూదనా! జితేంద్రియులు మరణ సమయమునందు నిన్నెట్లు తెలియుదురు?

అవ : బ్రహ్మము, అధ్యాత్మము, కర్మ యను మూడు ప్రశ్నలకు ఉత్తరము.

శ్రీ భగవానువాచ :

అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మ ముచ్యతే,
భూత భావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః. 3

సర్వ శ్రేష్ఠమగు నాశ రహితమైన తత్వమే బ్రహ్మము. వస్తువు

యొక్క మూల స్వభావమే అధ్యాత్మము. భూతముల యొక్క ఉత్ప త్తికి కారణమైన సృష్టివ్యాపారమే కర్మ యని చెప్పబడును.

అధిభూతము, అధిదైవము, అధియజ్ఞము అను నీ ప్రశ్నలకు ఉత్తరము.

అధిభూతం క్షరో భావః పురుష శ్చాధిదైవతమ్,
అధియజ్ఞోఽహ మేవాత్ర దేహే దేహ భృతాంవర. 4

నాశవంతమగు పదార్థమే అధిభూతము. చేతన పురుషుడే (హిరణ్యగర్భుడే) అధిదైవము. దేహధారుల దేహమునం దుండు అధి యజ్ఞము (విరాట్ తత్వము)నేనై యున్నాను. (యజ్ఞోవై విష్ణుః).

అవ : అంత్య సమయమున భగవత్స్మరణయొక్క ఫలము. ఇదే ఏడవ ప్రశ్నకు ఉత్తరము.

అంతకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కళేబరమ్,
యః ప్రయాతి స మద్భావం యాతి నా_స్త్యత్ర సంశయః. 5

అంత్యకాలమున నన్నే స్మరించుచు ఈ దేహమును విడచి వెళ్ళు వాడు నన్నే పొందుదురు. ఇందు సందేహ మేమియును లేదు.

అంత్య దశయందలి భావానుసారముగా గతి కలుగును

యం యం వాపి స్మర న్భావం త్యజత్యంతే కళేబరమ్,
తం త మేవైతి కౌంతేయ సదా తద్భావ భావితః. 6

అర్జునా! ఎట్టి భావముచే ఏ యే స్మరణ గలిగి మానవుడు అంత్యకాలమున శరీరమును విడుచునో తత్తద్భావనానుసార మాతడు అందు నిమగ్నుడై సంతతము భావించు చున్నందువలన ఆ యా స్వరూపమునే పొందును.

సంతత మాత్మ స్మరణ గలిగి యుండవలెను

తస్మా త్సర్వేషు కాలేషు మా మనుస్మర యుద్ధ్యచ,
మయ్యర్పిత మనో బుద్ధి ర్మామే వైష్య స్యసంశయః. 7

అందుచేత నీవు సర్వకాలములయందు నన్ను స్మరించుచు కర్తవ్యమగు యుద్ధకర్మ చేయుము. నీ మనోబుద్ధులు నాయం దర్పి తమై యున్నందువలన నిస్సందేహముగ నీవు నన్నే నా స్వరూప మునే పొందుదువు.

సంతత మాత్మానుస్మృతి గలిగి కర్తవ్యము నాచరింపుము. ఆత్మశాంతి కడ్డముండదని భావము.

అభ్యాస యోగయుక్తేన చేతసా నాన్యగామినా,
పరమం పురుషం దివ్యం యాతి పార్థాను చింతయన్. 8

పార్థా! యోగాభ్యాసముచే కదలక నిలుకడ చెందిన మనస్సుచే దివ్యమగు ఆ పరమ పురుషునే ధ్యానించుచుండిన మానవుడు అతనినే పొందును.

ఇచ్చట సూర్య మండలాంతర్వర్తి యగు హిరణ్యగర్భుడని అర్థము.

అవ : స్మరణార్హ మగు పరమాత్మవర్ణన, తదనుచింతన విధానము.

కవిం పురాణ మనుశాసితార
మణోరణీయాంస మనుస్మరేద్యః,
సర్వస్య ధాతార మచింత్యరూప
మాదిత్యవర్ణం తమసః పరస్తాత్. 9

ప్రయాణకాలే మనసాఽచలేన
భక్త్యా యుక్తో యోగ బలేన చైవ,
భ్రువోర్మధ్యే ప్రాణ మావేశ్య సమ్యక్
స తం పరం పురుష ముపైతి దివ్యమ్. 10

దేశకాలాద్యతీత మగు తత్త్వము నెఱిగిన వాడును పురాతనుడును సర్వశాసకుడును సూక్ష్మరూపుడును సర్వాధారుడును అచింత్యరూపుడును అజ్ఞానాంధకారమున కతీతుడు (తమోతీతుడు) ను ఆదిత్యవర్ణుడు నగు ఆ పరమాత్మను అంత్యకాలమున స్థిరమగు మనస్సుచే భక్తి యుక్తుడై యోగబలమున ప్రాణములను భ్రూమధ్యమున నిలిపి ఎవడు స్మరించునో అత డాదిత్య పురుషునియం దైక్యమగును. అనగా నిత్య ప్రకాశ చైతన్యాత్మస్వరూపము నొందునని అర్థము.

అక్షర స్వరూప మగు పరమపదము

యదక్షరం వేదవిదో వదంతి
విశంతి యద్యతయో వీత రాగాః,

యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి
తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే. 11

వేదవిదులు దేనిని నాశ రహిత మని తెలుపుదురో ఆసక్తి లేని యతులు దేనియం దభేదము నొందుదురో, ఏ పదము నిచ్ఛయించి జనులు బ్రహ్మచర్య వ్రతమును పాలింతురో, ఆ పరమ పదమును నీకు సంగ్రహముగ దెలుపుదును.

అవ : ధ్యానయోగ విధి ననుసరించి ఓంకారోచ్చారణ చేయుచు మరణించువాడు పరమ గతిని బొందును.

సర్వ ద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ,
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణ మాస్థితో యోగ ధారణామ్. 12

దేహద్వారములను సంయమించి బహిరింద్రియములను నిగ్రహించి మనస్సును హృదయమునందు స్థిర మొనర్చి తన ప్రాణమును శిరస్సునందు చేర్చి యోగధారణయందు స్థితుడై,

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మా మనుస్మరన్,
యః ప్రయాతి త్యజన్దేహం స యాతి పరమాం గతిమ్. 13

బ్రహ్మరూపమైన "ఓమ్" అను ఏకాక్షరమును ఉచ్చారణ చేయుచు లక్ష్యమగు నన్ను స్మరించుచు ఎవడు దేహత్యాగము చేయునో అతడు పరమమగు స్థితిని బడయును.

అవ : ఇతరమును చింతింపక నిరంతరము భగవచ్చింతనము చేయువానికి భగవత్ప్రాప్తి సులభము.

అనన్యచేతాః సతతం యో మాం స్మరతి నిత్యశః,
తస్యాహం సులభః పార్థ నిత్య యుక్తస్య యోగినః. 14

పార్థా! అనన్యమగు భక్తిచే సంతతము నన్నే స్మరించుచుండు నిత్య యుక్తుడైన యోగి అనాయాసముగ నన్ను పొందును.

మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్,
నాప్నువంతి మహాత్మాన స్సంసిద్ధిం పరమాం గతాః. 15

నన్ను జేరి పరమసిద్ధి నొందిన మహాత్ములు మరల నీ అశాశ్వతమును దుఃఖనిలయమును అగు సంసారము (పునర్జన్మ) నొందరు.

ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున,
మాముపేత్య తు కౌంతేయ పునర్జన్మ న విద్యతే. 16

బ్రహ్మలోకమే ఆదిగా గల మఱేలోకమునకు వెళ్ళినను అచటి నుండి తిరుగ వచ్చి జన్మ నెత్తవలసినదే! అవి పునరావృత్తి గలవి. కాని అర్జునా ! నా కడకు వచ్చిన వానికి పునర్జన్మ లేదు.

బ్రహ్మకును రేయింబవలను కాలపరిమాణము కలదు

సహస్ర యుగ పర్యంత మహర్య ద్బ్రహ్మణో విదుః,
రాత్రిం యుగ సహస్రాంతాం తేఽహోరాత్రవిదో జనాః. 17

బ్రహ్మయొక్క రేయింబవళ్ళు దెలిసిన జనులు "వేయి చతుర్యుగము లైన బ్రహ్మ కొక్క పగలనియు, మరల వేయి చతుర్యుగములు దిరిగిన బ్రహ్మ కొక్క రాత్రి" యనియు జెప్పుదురు.

అవ : బ్రహ్మ మొదలు సమస్త భూతములును సారె సారెకు ఉత్పత్తి ప్రళయములు గలవై యున్నవి.

అవ్యక్తా ద్వ్యక్తయ స్సర్వాః ప్రభవం త్యహరాగమే,
రాత్ర్యాగమే ప్రలీయంతే తత్రైవా వ్యక్త సంజ్ఞకే. 18

బ్రహ్మకు పగలైనప్పుడు వ్యక్తములగు భూతములు అవ్యక్తము నుండి పుట్టును. రాత్రి వచ్చెననిన ఆ అవ్యక్తమను దానియందే అవి లయ మొందును.

భూతగ్రామ స్స ఏవాయం భూత్వా భూత్వా ప్రలీయతే,
రాత్ర్యాగమేఽవశః పార్థ ప్రభవ త్యహరాగమే. 19

పార్థా! స్వాతంత్ర్య రహితమగు నా భూత సమూహము బ్రహ్మకు పగలగు సమయమున అవశముగ మరల మరల పుట్టును రాత్రి వచ్చె నన్న అవశముగా మరల మరల లయ మొందు చుండును

పరబ్రహ్మము సనాతనము

పర స్తస్మాత్తు భావోఽన్యోఽవ్యక్తోఽవ్యక్తా త్సనాతనః,
యస్స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి. 20

వ్యక్తావ్యక్తములకు విలక్షణమైన అవ్యక్తమగు సనాతనమైన బ్రహ్మము కలదు. సర్వభూతములు నశించినను అది నాశమగునది కాదు.

అవ్యక్తోఽక్షర ఇత్యుక్త స్తమాహుః పరమాం గతిమ్,
యం ప్రాప్య న నివర్తంతే తద్ధామ పరమం మమ. 21

అదే అవ్యక్తము, అక్షరము అని చెప్పబడును. దానిని పరమగతి యని కూడ అందురు. దేనిని పొందిన పిదప మఱలి వచ్చుట లేదో అదే నా శ్రేష్ఠమగు స్థానము.

పురుషస్స పరః పార్థ భక్త్యా లభ్య స్త్వనన్యయా,
యస్యాంతస్థాని భూతాని యేన సర్వ మిదం తతమ్. 22

పార్థా! ఎవనియందీ భూతము లున్నవో ఎవడు వీని నెల్ల విస్తరింప జేయునో ఆ పురుషోత్తముడు అనన్య భక్తి మాత్ర లభ్యుడు.

శుక్ల కృష్ణ గతులు

యత్ర కాలే త్వనావృత్తి మావృత్తిం చైవ యోగినః,
ప్రయాతా యాంతి తం కాలం వక్ష్యామి భరతర్షభ. 23

భరతర్షభా! ఏ కాలమున దేహమును విడిచిన యోగులు మఱలి వచ్చుట లేదో ఏ కాలమున వెడలిన వారు మఱలి వచ్చెదరో ఆ కాలమును గుఱించి నీకు చెప్పెదను వినుము.

ఉత్తరాయణ మార్గము (శుక్లగతి) ముక్తిప్రదము

అగ్ని ర్జ్యోతి రహ శ్శుక్ల ష్షణ్మాసా ఉత్తరాయణమ్,
తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః. 24

బ్రహ్మజ్ఞులగు వారు అగ్ని, జ్యోతి, పగలు, శుక్ల పక్షము, ఉత్తరాయణపు ఆఱు నెలలు – ఈ మార్గమున వెళ్ళిన వారు బ్రహ్మమును బడయుదురు.

దక్షిణాయనమార్గము (కృష్ణగతి) జన్మప్రదము

ధూమో రాత్రి స్తథా కృష్ణః షణ్మాసా దక్షిణాయనమ్,
తత్ర చాంద్రమసం జ్యోతి ర్యోగీ ప్రాప్య నివర్తతే. 25

పొగ, రాత్రి, కృష్ణపక్షము, దక్షిణాయనపు ఆఱునెలలు ఈ మార్గమందు వెడలినవారు చంద్రలోకమునకు వెళ్ళి, మఱల వచ్చెదరు.

శుక్లకృష్ణే గతీ హ్యేతే జగతశ్శాశ్వతే మతే,
ఏకయా యాత్యనావృత్తి మన్యయాఽఽవర్తతే పునః. 26

జగత్తునందు శుక్లమనియు కృష్ణమనియు రెండు శాశ్వతమగు గతులు గలవు. ఒకదానిచే వెళ్ళిన పునర్జన్మ లేదు. మఱొకదానిచే వెళ్ళిన పునర్జన్మ కలదు.

ఉభయ మార్గముల నెఱిగిన యోగి యొక్క గొప్పతనము

నైతే సృతీ పార్థ జానన్ యోగీ ముహ్యతి కశ్చన,
తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున. 27

పార్థా! ఈ రెండు మార్గములను చక్కగా తెలిసికొనిన ఏ యోగియును మోహము నొందదు. అందుచేత సర్వకాలము లయందును నీవు యోగయుక్తుడవయి యుండుము.

వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ
దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టమ్,
అత్యేతి తత్సర్వమిదం విదిత్వా
యోగీ పరం స్థానముపైతి చాద్యమ్. 28

ఈ తత్త్వము నరసిన యోగి వేదాధ్యయనము చేతను యజ్ఞముల చేతను, తపస్సుల చేతను, దానముల చేతను పొందబడు సమస్త పుణ్యముల కంటెను అధికమగు ఫలమును శ్రేష్ఠమైన ఆద్య పదమును పొందును.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే అక్షర పరబ్రహ్మ
యోగో నామ అష్టమోఽధ్యాయః

—o—

ఓమ్

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీమద్భగవద్గీత-నవమాధ్యాయము

### విజ్ఞాన యుక్త జ్ఞానోపదేశ ప్రతిజ్ఞ

శ్రీ భగవానువాచ :

ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యా మ్యనసూయవే,
జ్ఞానం విజ్ఞాన సహితం యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్. 1

అసూయా రహితుడవైన నీ కొఱకు ఈ గుహ్యతమమైన విజ్ఞానముతో గూడిన జ్ఞానమును చెప్పెదను. ఈ సమ్యగ్జ్ఞానము నొందినచో అశుభమునుండి నీవు ముక్తుడ వగుదువు.

### జ్ఞానము యొక్క మహిమ

రాజవిద్యా రాజగుహ్యం పవిత్ర మిద ముత్తమమ్,
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తు మవ్యయమ్. 2

ఈ విద్య పరమ రహస్యము; అన్నిటి కంటెను శ్రేష్ఠమైనది. ఇది పవిత్రము, ఉత్తమము. ప్రత్యక్షముగా తెలియు నట్టిదియు ధర్మానుకూలమైనదియు ఆచరణకు సులభ సాధ్యమును అవ్యయమునై యున్నది.

### శ్రద్ధారహితులకు జ్ఞాన మబ్బదు

అశ్రద్ద ధానాః పురుషా ధర్మస్యాస్య పరంతప,
అప్రాప్య మాం నివర్తంతే మృత్యు సంసార వర్త్మని. 3

పరంతపా ! ఈ ధర్మము నందు విశ్వాసము లేని వారు నన్ను పొందక మృత్యుమయమగు సంసార మార్గమున వర్తించు చుందురు.

### పరమాత్మయొక్క సర్వవ్యాపకత్వము

మయా తత మిదం సర్వం జగ దవ్యక్త మూర్తినా,
మత్ స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః. 4

అవ్యక్త స్వరూపుడనైన నాచే ఈ జగత్తంతయును వ్యాపింప బడినది. సర్వ భూతములు నా యందు గలవు. అయితే నేను వాని యందు లేను.

న చ మత్ స్థాని భూతాని పశ్య మే యోగమైశ్వరమ్,
భూతభృన్న చ భూతస్థో మమాత్మా భూత భావనః. 5

నాయందీ భూతములు లేవు. అర్జునా! నా యోగసామర్థ్యమును చూడుము. భూతములను పుట్టించు నా యాత్మ భూతముల కాధార రూపమై యున్నది. కాని అది భూతములయందు లేదు.

యథాఽఽకాశస్థితో నిత్యం వాయు స్సర్వత్రగో మహాన్,
తథా సర్వాణి భూతాని మత్ స్థానీ త్యుపధారయ. 6

సర్వత్ర వెళ్ళ గల వాయువు నిత్య మాకాశమునం దుండునట్లు సమస్త భూతములు నాయం దున్నవని తెలియుము.

సర్వభూతముల ఉత్పత్తి స్థితి లయములకు నేనే కారణము

సర్వ భూతాని కౌంతేయ ప్రకృతిం యాంతి మామికామ్,
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్. 7

కుంతీనందనా! కల్పాంతమున ఎల్లభూతములు నా ప్రకృతి యందే లయ మొందును. కల్పారంభమునందు మరల వాటిని సృజింతును.

ప్రకృతిం స్వా మవష్టభ్య విసృజామి పునః పునః.
భూతగ్రామ మిమం కృత్స్న మవశం ప్రకృతే ర్వశాత్. 8

ప్రకృతికి అధీనమై యున్నందువలన అస్వతంత్రమై యుండు సమస్త భూత సంఘమును నేను నా ప్రకృతి యొక్క సాహాయ్యముచే మరల మరల సృష్టింతును.

భగవంతుడ నగు నన్ను కర్మ బంధింపదు

న చ మాం తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ,
ఉదాసీనవ దాసీన మసక్తం తేషు కర్మసు. 9

అర్జునా! ఉదాసీనునివలె నేనా కర్మలయందనాసక్తుడనై యున్నందువలన ఆ కర్మలు నాకు బంధకములు గావు.

మయాఽధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్,
హేతునాఽనేన కౌంతేయ జగద్విపరివర్తతే. 10

నేను అధ్యక్షుడనై ప్రకృతిచే ఈ చరాచరాత్మకమగు సృష్టిని కలుగ జేయించు చున్నాను. ఈ భ్రాంతి - కారణమువలననే జగత్తిట్లు ప్రవర్తించుచున్నది. ("అజ్ఞానే నావృతం జ్ఞానమ్")

సర్వ సాక్షియగు నాకంటె అన్య మేమియును లేదు. భోక్తృ భోజ్యములును లేవు.

అవ: దేహ ధారి యగు నన్ను అజ్ఞులు తిరస్కార భావముచే జూతురు. పరమాత్మ యని తెలియరు.

అవజానంతి మాం మూఢా మానుషీం తను మాశ్రితమ్,
పరం భావ మజానంతో మమ భూత మహేశ్వరమ్. 11

సర్వ భూతేశ్వరుడనగు నాయొక్క శ్రేష్ఠమగు ఉత్తమ స్వరూపమును దెలియక మూఢులు నన్ను మనుష్య సంబంధముగల శరీర మాత్రునిగా దలచి అవమాన మొనర్చుచున్నారు.

సర్వజ్ఞుడను, సర్వ ప్రాణుల ఆత్మయు నైయుండు నన్ను చూడరు. దశముడు లేడని రోదనము చేయు దశముని భంగి స్వరూపాజ్ఞతచే, మూఢులు నన్ను కేవలము నామ రూపవంతునిగ దెలియుదురని భావము.

ఆసురీ ప్రకృతి గలవారు నన్ను తెలియరు

మోఘాశా మోఘ కర్మాణో మోఘ జ్ఞానా విచేతసః,
రాక్షసీ మాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః. 12

వారి యాకాంక్షలును కర్మ జ్ఞానాదులును వ్యర్థములైనవి. వారు భ్రష్టమగు నీచమగు మనస్సు గలవారై యుండి మోహముచే రాక్షసియును ఆసురియు నగు ప్రకృతి నాశ్రయించి వర్తింతురు.

దైవీ ప్రకృతి గల మహాత్ములు నన్ను భజించెదరు

మహాత్మానస్తు మాం పార్థ! దైవీం ప్రకృతి మాశ్రితాః,
భజం త్యనన్య మనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్. 13

పార్థా! దైవీ ప్రకృతి నాశ్రయించిన మహాత్ములు నేను అవ్యయుడను సర్వభూతాధారుడనని తెలిసి అనన్యమగు మనస్సుచే నన్ను భజింతురు.

సతతం కీర్తయంతో మాం యతంతశ్చ దృఢవ్రతాః,
నమస్యంతశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే. 14

ఎల్లప్పుడు నా కీర్తనము జేయుచు దృఢమగు వ్రతముగలవారై ఇంద్రియ సంయమము చేయుచు భక్తిచే నాకు నమస్కారము మొనర్చుచు నిత్యయుక్తులైన వారు నన్నుపాసింతురు.

నా ఉపాసనలు నానా ప్రకారములు

జ్ఞాన యజ్ఞేన చాప్యన్యే యజంతో మా ముపాసతే,
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్. 15

కొందఱు జ్ఞాన యజ్ఞముచే నన్ను పూజించుచు ఉపాసింతురు. కొందఱు ఏకమనియు కొందఱు అనేకమనియు, మఱికొందఱు విశ్వతోముఖుడనియు వివిధ ప్రకారములచే నన్నుపాసింతురు.

భగవద్విభూతులు

అహం క్రతు రహం యజ్ఞ స్స్వధాఽహ మహ మౌషధమ్,
మంత్రోఽహ మహ మేవాజ్య మహ మగ్ని రహం హుతమ్. 16

నేనే శ్రౌత యజ్ఞము. నేనే స్మార్త యజ్ఞము. నేనే శ్రాద్ధాహుతి. వనస్పతులు నేనే. మంత్రము నేనే. ఘృతము నేనే. అగ్ని నేనే. ఆహుతి నేనే.

పితాఽహమస్య జగతో మాతా ధాతా పితామహః,
వేద్యం పవిత్ర మోంకార ఋ క్సామ యజు రేవచ. 17

ఈ జగత్తు యొక్క తల్లియు దండ్రియును నేనే. నేనే ఆధారుడను. నేనే పితామహుడను. పవిత్రమును తెలియుటకు యోగ్యమైనగు ఓంకారము నేనే. ఋగ్యజుస్సామములు నేనే.

గతిర్భర్తా ప్రభు స్సాక్షీ నివాస శ్శరణం సుహృత్,
ప్రభవః ప్రలయ స్థానం నిధానం బీజ మవ్యయమ్. 18

నేనే సర్వుల పరమ గతి, పోషకుడను, స్వామియునై యున్నాను. సాక్షియు నివాసస్థానమును ఆశ్రయుడను మిత్రుడను సర్వుల ఉత్పత్తి కారణమను. లయస్థానమును నిధానము అనగా కాలాంతరమున అనుభవించుటకు వచ్చు కర్మఫలము, అవ్యయమగు బీజమునై యున్నాను.

తపామ్యహ మహం వర్షం నిగృహ్ణామ్యుత్సృజామి చ,
అమృతం చైవ మృత్యుశ్చ సదసచ్చాహ మర్జున. 19

అర్జునా! తపింప జేయువాడను నేనే. వర్షమును నిగ్రహించువాడను అనగా ఆగబట్టు వాడను నేనే. మృత్యువు నేనే. అమృతమును, సత్తు, అసత్తును నేనే.

అన్య దేవతలను పూజించు సకామోపాసకుల ఫలము

త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా
యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే,
తే పుణ్య మాసాద్య సురేంద్రలోక
మశ్నంతి దివ్యాన్ దివి దేవ భోగాన్. 20

మూడు వేదములయందు చెప్పబడిన కర్మలను జేయు నిష్పాపులగు సోమయాజులు యజ్ఞములను జేసి స్వర్గార్థమై నన్ను ప్రార్థింతురు. వారు దేవేంద్రుని పుణ్యలోకమునకు వెళ్ళి దివ్య భోగముల ననుభవింతురు.

తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి,
ఏవం త్రయీధర్మ మనుప్రపన్నా
గతాగతం కామకామా లభంతే. 21

వారా విశాలమగు స్వర్గలోక భోగముల ననుభవించి పుణ్యము దీఱిన పిదప మృత్యులోకమునకు వచ్చెదరు. ఈ విధముగ కామాసక్తిపరులై కర్మల నాచరించువారికి రాకడ పోకడలు దప్పవు.

### నిష్కామ అనన్యోపాసనా ఫలము

అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్. 22

ఎవ రనన్యచిత్తులై దేనిని చింతింపక నన్నే ఉపాసింతురో అట్టి నిత్యాభియుక్తులగు వారి యోగక్షేమములను నేనే చూచుకొందును.

పరమగు దైవమైన నారాయణుడనగు నన్ను ఆత్మరూపుని అన్యమును దలంపక ధ్యానించునట్టి పరమార్థ దర్శులగు వారి యోగక్షేమములను నేనే చూచుకొందును. జ్ఞాని నేనే కావున అచ్చట యోగక్షేమముల ఆకాంక్ష లేదని తత్త్వార్థము.

యేఽప్యన్య దేవతా భక్తా యజంతే శ్రద్ధయాఽన్వితాః,
తేఽపి మామేవ కౌంతేయ యజంత్యవిధి పూర్వకమ్. 23

పార్థా! శ్రద్ధాయుక్తులై అన్యదేవతలను భజించువారుగూడ విధ్యుక్తమగు మార్గమున గాకున్నను ప్రకారాంతమున నన్నే భజింతురు.

అహం హి సర్వయజ్ఞానాం భోక్తాచ ప్రభు రేవ చ,
నతు మా మభిజానంతి తత్త్వేనాత శ్చ్యవంతి తే. 24

ఎందుకనగా, నేనే సర్వయజ్ఞములకు భోక్తను వాని స్వామియునై యున్నాను. అయితే నన్ను వారు యథార్థముగ తెలియనందువలన తప్పత్రోవ బోవుదురు. యథార్థము నెఱుగక జారిపడుదురు.

తాత్పర్య మేమన, వారు చేయు యజ్ఞాది కర్మలకును పరమాత్మయగు నేనే ప్రభువని తెలియనందున కామ్యఫల లోకమును బొంది పుణ్యక్షయానంతరము పతన మొందుదురు. నన్ను దెలిసినచో అక్షయ మగు పుణ్యపాప వివర్జితమైన మహాపుణ్యము ఆత్మానుభవమును బడయుదురని అర్థము.

### ఉపాసనానుసార మైన ఫలప్రాప్తి

యాంతి దేవవ్రతా దేవాన్ పితౄన్యాంతి పితృవ్రతాః,
భూతాని యాంతి భూతేజ్యా యాంతి మద్యాజినోఽపిమామ్. 25

దేవతోపాసనలు చేయువారు దేవతల కడకు, పితృదేవతల నుపాసించువారు పితృదేవతల కడకు, భూతవిశేషముల భజించువారు భూతములకడకు పోవుదురు. నన్ను భజించువారు నన్నే పొందుదురు.

భక్తియొక్క సౌలభ్యము

పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః. 26

మనస్సంయమము గలిగి నిర్మలమగు భక్తిచే నర్పించిన ఆకుగాని, పుష్పముగాని, ఫలముగాని, కడకు జలమేగాని ఏ అల్పవస్తువునైనను దానిని నేను ప్రీతిపూర్వకముగ స్వీకరింతును.

సర్వ కర్మలను భగవంతుడనగు నా కర్పించుము

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్,
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్. 27

అర్జునా! నీవు చేయు దానిని తిను దానిని హోమ మొనర్చు దానిని ఇచ్చు దానిని నీవు చేయు తపస్సును ఇంతేల? సర్వకర్మలను నా కర్పించుము.

సర్వ కర్మలను నా కర్పించుటచే ముక్తి

శుభాశుభ ఫలై రేవం మోక్ష్యసే కర్మ బంధనైః,
సన్న్యాస యోగ యుక్తాత్మా విముక్తో మా ముపైష్యసి. 28

ఇట్లు చేసిన ఆ కర్మల యొక్క శుభాశుభములచే నీవు ముక్తుడ వగుదువు. సన్న్యాస యోగ యుక్తాత్ముడవై అనగా నా యందర్పించిన చిత్తవృత్తిగల యుక్తాత్ముడవై ముక్తి నొందుదువు. నన్నే పొందుదువు.

సత్త్వులయందు నేను సముడను

సమోఽహం సర్వ భూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః,
యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్. 29

సర్వ భూతముల యందు నేను సమదృష్టి గలవాడను. నాకు ద్వేషింప దగిన వాడు గాని ప్రియుడుగాని ఎవరును లేరు. అయితే ఎవరు నన్ను భక్తిచే భజింతురో వారు నాయం దుందురు.

నాయందలి భక్తి యొక్క మాహాత్మ్యము

అపిచే త్సుదురాచారో భజతే మా మనన్యభాక్,
సాధు రేవ స మంతవ్య స్సమ్య గ్వ్యవసితో హి సః. 30

అత్యంత దురాచారియగు వాడును నన్ను అనన్యభక్తిచే భజించిన అతనిని సాధు వనియే తెలియవలయును. అతడు చక్కని చిత్త సంస్కరణచే స్థిరబుద్ధి గలవాడై యుండును.

క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి,
కౌంతేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి. 31

(తాత్పర్య మేమనిన) అతడు సత్వరమున ధర్మాత్ముడై సత్య మహిమచే శాశ్వత శాంతిని బడయును. అర్జునా! నా భక్తు డెన్నడును నాశ మొంద డనునది సిద్ధాంతమని తెలియుము.

భగవచ్ఛరణాగతిచే సర్వులు ధన్యులగుదురు

మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః,
స్త్రియో వైశ్యా స్తథా శూద్రా స్తేఽపి యాంతి పరాంగతిమ్.

పార్థా! స్త్రీలు, వైశ్యులు, శూద్రులును మఱియు నత్యంత పాపయోనుల యందు పుట్టిన వారును నన్నాశ్రయించి ఉత్తమమగు గతిని బడయుదురు. మోక్షమును బొందుదురు.

పై వారి నుల్లేఖించి చెప్పుటకు కారణము ప్రతిబంధ బహుళ మైన జన్మలని భావము. ఇట్టి ప్రతిబంధము లుండినను దృఢమైన భక్తి విశ్వాసములచే ఆత్మజ్ఞానమును బడసి ధన్యులు గావచ్చును.

కిం పున ర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయ స్తథా.
అనిత్య మసుఖం లోక మిమం ప్రాప్య భజస్వ మామ్. 33

ఇక భక్తులగు పుణ్యవంతులైన బ్రాహ్మణులును అటువలె రాజర్షులును ఆ పరమ పదమును బడయుదు రనుటలో ఆశ్చర్య మేమి గలదు? అనిత్యమును అసుఖము నగు ఈ లోకమును బొందియున్న నీవు నన్ను భజింపుము.

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
మామే వైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః. 34

నాయందు మనస్సు గలవాడవై యుండుము. నా భక్తుడవు కమ్ము. నన్ను భజింపుము. నాకు నమస్కారము చేయుము. ఇట్లు నా ఉపాసకుడవై నా యందే యుంచిన చిత్తము గలవాడవై ఆత్మయగు నన్నే పొందుదువు.

ఓంతత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే రాజవిద్యారాజగుహ్యయోగోనామ నవమోఽధ్యాయః

ఓమ్

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీమద్భగవద్గీత-దశమాధ్యాయము

అవ : నీ హితార్థమై చెప్పు నా పరమ ప్రభావ యుక్తమైన వచనములను వినుమని భగవంతు డాదేశించుచున్నాడు.

శ్రీ భగవానువాచ :

భూయ ఏవ మహాబాహో శృణు మే పరమం వచః,
యత్తేఽహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా. 1

మహాబాహో! పరమమగు నా వచనములను వినుము. ప్రసన్నవదనముచే సంతోషించు నీకు హితము గావలెనని మరల జెప్పుచున్నాను.

అవ : సర్వమునకు నేనే ఆది యగుటవలన నా యొక్క ఉత్పత్తిని దేవతలు గూడ తెలియరు.

న మే విదుః సురగణాః ప్రభవం న మహర్షయః,
అహ మాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః. 2

దేవతల సమూహము గాని మహర్షులు గాని నా పుట్టుకను తెలియరు. ఎందుకనగా, అందఱు దేవతల ఎల్లమహర్షుల ఆదికారణమను నేనే.

అవ : ప్రభావ సంపన్నుడనైన (నన్ను) పరమాత్మను తెలియుటచే గలుగు ఫలము

యో మా మజ మనాదించ వేత్తి లోక మహేశ్వరమ్,
అసమ్మూఢ స్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే.3

నేను జన్మరహితుడను, అనాదియు, సర్వేశ్వరుడ నని ఏ మానవుడు దెలియునో అతడు మోహ రహితుడై సమస్త పాపములనుండి ముక్తుడగును.

నా వలననే బుద్ధ్యాది సమస్త భావము లుత్పన్న మగును

బుద్ధి ర్జ్ఞాన మసమ్మోహః క్షమా సత్యం దమ శ్శమః,
సుఖం దుఃఖం భవోఽభావో భయంచాఽభయమేవ చ. 4

బుద్ధియు, జ్ఞానము, మోహమొందకుండుటయు, క్షమ, సత్యము ఇంద్రియదమనము, మన స్సంయమము, సుఖము, దుఃఖము, పుట్టుక బ్రతుకు, భయము, అభయము,

అహింసా సమతా తుష్టి స్తపో దానం యశోఽయశః,
భవంతి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః. 5

అహింస, సమత్వము, తుష్టి, తపస్సు, దానము, యశస్సు, అయశస్సు అను నిత్యాది భావములు జీవులకు నా నుండియే ప్రాప్తమగును.

నా వలననే సప్తఋషుల సనకాది యోగుల ఉత్పత్తి

మహర్షయ స్సప్తపూర్వే చత్వారో మనవ స్తథా,
మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః. 6

పూర్వపు సప్త మహర్షులును మొదటివారగు నలువురు మనువులును మద్భావులై నా మానసపుత్రులై కలిగిరి. లోకము నందలి సర్వ ప్రజలును వీరికి చెందిన వారే.

భగవద్విభూతి - యోగము నెఱుగుట వలన గలుగు ఫలము

ఏతాం విభూతిం యోగంచ మమ యో వేత్తి తత్త్వతః,
సోఽవికంపేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః. 7

ఎవడు ఈ నా మాహాత్మ్యమును, యోగశక్తిని యథార్థముగా దెలిసికొనునో అతడు నిస్సందేహముగ స్థిరమైన యోగస్థితిని బడయును.

అవ : సర్వకారణమగు నన్ను నిష్కామముగ పరమప్రేమచే భక్తులు నిరంతరము భజింతురు. వారికి జ్ఞానము కలుగును.

అహం సర్వస్య ప్రభవో మత్తస్సర్వం ప్రవర్తతే,
ఇతి మత్వా భజంతే మాం బుధా భావ సమన్వితాః. 8

నేనే సర్వుల ఉత్పత్తిస్థానము. అన్నియు నా నుండియే కలుగునని తెలిసి బుద్ధిమంతులు భక్తియుక్తులై నన్ను భజింతురు.

మచ్చిత్తా మద్గతప్రాణా బోధయంతః పరస్పరమ్,
కథయంతశ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతి చ . 9

నాయందుంచబడిన చిత్తము, మనఃప్రాణములు గలిగి పరస్పరముగ ఒకరి కొకరు బోధించు కొనుచు నిత్యము నా కథలను చెప్పికొనుచు భక్తులు సంతోష మొందుదురు. అటువలె నా ధ్యానమునందు మగ్నులగుదురు.

తేషాం సతత యుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్,
దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాంతి తే. 10

నాయందు నిత్యయుక్తులై ప్రేమచే ఇట్లు నన్ను భజించువారికి నేను బుద్ధియోగము ననుగ్రహింతును. అందువలన వారు నన్నే పొందుదురు.

తేషా మేవానుకంపార్థ మహ మజ్ఞానజం తమః,
నాశయా మ్యాత్మ భావస్థో జ్ఞానదీపేన భాస్వతా. 11

వారి ననుగ్రహింప వలయు నను దయచే నేనే అట్టివారి అంతఃకరణమునందు నిలిచి ప్రకాశవంతమగు జ్ఞాన జ్యోతిచే అజ్ఞానమను మబ్బును పాఱద్రోలుదును.

భగవత్స్తుతి

అర్జున ఉవాచ :

పరం బ్రహ్మ పరంధామ పవిత్రం పరమం భవాన్,
పురుషం శాశ్వతం దివ్య మాదిదేవ మజం విభుమ్. 12

నీవు పరబ్రహ్మవు. నీవు పరమ శ్రేష్ఠమగు స్థానము. పరమ పవిత్రుడవు. శాశ్వతమగు పురుషుడవు. దివ్యమగు ఆదిదేవుడవు. నీవు జన్మ రహితుడవు. సర్వ వ్యాపకుడవు.

ఆహుస్త్వా మృషయ స్సర్వే దేవర్షి ర్నారద స్తథా,
అసితో దేవలో వ్యాస స్స్వయం చైవ బ్రవీషి మే. 13

ఇట్లని ఋషులును దేవఋషియగు నారదుడును అసితుడును దేవలుడును, వ్యాసుడును ఇటులనే చెప్పుదురు. నీవును అటులనే నాకు జెప్పుచున్నావు.

సర్వ మేతదృతం మన్యే యన్మాం వదసి కేశవ,
నహి తే భగవన్ వ్యక్తిం విదు ర్దేవా న దానవాః. 14

కృష్ణా! నీవు జెప్పిన దెల్లయు సత్యమని నేను నమ్మెదను. దేవ దానవులును నీ వ్యక్తిత్వమును తెలియ జాలరు.

స్వయమేవాఽఽత్మనాఽఽత్మానం వేత్థత్వం పురుషోత్తమ,
భూతభావన భూతేశ దేవదేవ జగత్పతే. 15

ఓ పురుషోత్తమా! భూతభావనా! భూతేశా! దేవదేవా జగత్పతే! నిన్ను నీవే స్వయముగా తెలియుదువు.

వక్తు మర్హాస్య శేషేణ దివ్యా హ్యాత్మవిభూతయః,
యాభి ర్విభూతిభి ర్లోకా నిమాం స్త్వం వ్యాప్య తిష్ఠసి. 16

నీవు ఏ ఏ స్వరూపములచే ఈ లోకములను వ్యాపించియున్నావో దివ్యములగు ఆ స్వరూపములను నిశ్శేషముగ నాకు జెప్పుము.

కథం విద్యా మహం యోగిం స్త్వాం సదా పరిచిన్తయన్,
కేషు కేషు చ భావేషు చింత్యోఽసి భగవన్మయా. 17

ఓ భగవంతుడా! నీ యొక్క ఏ యే స్వరూపములను నేను ధ్యానించ వలెను? సంతతము ధ్యానించుచు ఓ యోగేశ్వరా! నిన్ను నే నెట్లు తెలిసికొన గలుగుదును?

విస్తరేణాత్మనో యోగం విభూతిం చ జనార్దన,
భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మేఽమృతమ్. 18

జనార్దనా! నీ యోగ సామర్థ్యమును నీశ్రేష్ఠ స్వరూపములను అనగా ఐశ్వర్య విస్తారమును మరల జెప్పుము. నీ అమృత వచనములు ఎంత వినినను నాకు తనివి దీఱుట లేదు.

అవ : ప్రధానమగు తన విభూతులను దెలుపుట కారంభించి "ఆద్యంత రహితుడ నగు నేనే సర్వస్వరూపుడ"నని అందు 72 విభూతులను 39వ శ్లోకము వఱకు తెలుపుచున్నారు.

శ్రీభగవానువాచ :

హంత తే కథయిష్యామి దివ్యా హ్యాత్మ విభూతయః,
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ నాస్త్యంతో విస్తరస్య మే. 19

నుంచి పార్థా! నా (ఐశ్వర్య) విస్తారము లనంతమై యున్నందు వలన అందు ముఖ్యములగు నా దివ్యవిభూతులను మాత్రమే చెప్పెదను వినుము.

అహమాత్మా గుడాకేశ సర్వ భూతాశయ స్థితః,
అహ మాదిశ్చ మధ్యం చ భూతానా మంత ఏవ చ. 20

ఓ గుడాకేశా! *సర్వ భూతాంతర్వర్తియగు ఆత్మ నేను. ♦సమస్త భూతముల ఆది, మధ్యము, అంతము నేనే.

ఆదిత్యానా మహం విష్ణు ర్జ్యోతిషాం రవి రంశుమాన్,
మరీచి ర్మరుతా మస్మి నక్షత్రాణా మహం శశీ. 21

ఆదిత్యులయందు విష్ణువు నేను. జ్యోతులయందు నేను కిరణములుగల సూర్యుడను. మరుద్దేవతలయందు మరీచి నేను. నక్షత్రముల యందు చంద్రుడు నేను.

---

* ఇయ్యది భగవంతుని ప్రధాన విభూతి. ♦ సర్పాదులకు రజ్వాదుల వలె.

వేదానాం సామవేదోఽస్మి దేవానా మస్మి వాసవః,
ఇంద్రియాణాం మనశ్చాస్మి భూతానా మస్మి చేతనా. 22

వేదములయందు సామవేదము నేను. దేవతలయందు నేను ఇంద్రుడను. ఇంద్రియములయందు మనస్సు నేను. భూత జాలము యందు చైతన్యము నేను.

రుద్రాణాం శంకరశ్చాస్మి విత్తేశో యక్షరక్షసామ్,
వసూనాం పావకశ్చాస్మి మేరుశ్శిఖరిణా మహమ్. 23

రుద్రులయందు శంకరుడను నేను. యక్షరాక్షసుల యందు కుబేరుడను నేను. అష్టవసువులలో అగ్ని నేను. పర్వతములయందు అత్యున్నతమైన మేరు పర్వతము నేనయియున్నాను.

పురోధసాం చ ముఖ్యం మాం విద్ధి పార్థ బృహస్పతిమ్,
సేనానీనా మహం స్కంద స్సరసా మస్మి సాగరః. 24

పురోహితులయందు ముఖ్యుడగు బృహస్పతి నేనని తెలి యుము. సేనాపతులయందు స్కందుడనబడు కార్తికేయుడు, లే కుమారస్వామి నేను. జలాశయములయందు సముద్రుడు నేను.

మహర్షీణాం భృగు రహం గిరామస్మ్యేకమక్షరమ్,
యజ్ఞానాం జప యజ్ఞోస్మి స్థావరణాం హిమాలయః. 25

మహర్షులయందు భృగుమహర్షి నేను. అర్థవంతమగు శబ్దము యందు ఏకాక్షరమగు ప్రణవము నేను. యజ్ఞములయందు జప యజ్ఞము నేను. స్థావరమగు వస్తువులయందు హిమాలయము నేను.

అశ్వత్థ స్సర్వ వృక్షాణాం దేవర్షీణాం చ నారదః,
గంధర్వాణాం చిత్రరథః సిద్ధానాం కపిలోమునిః. 26

అన్ని వృక్షముల యందు అశ్వత్థవృక్షము నేను; దేవ ఋషుల యందు నారదుడు నేను. గంధర్వులయందు చిత్రరథుడ నేను. సిద్ధుల యందు కపిలముని నేను.

ఉచ్చైశ్శ్రవస మశ్వానాం విద్ధి మా మమృతోద్భవమ్,
ఐరావతం గజేంద్రాణాం నరాణాం చ నరాధిపమ్. 27

గుఱ్ఱములయందు అమృత మథన కాలమున పాలకడలి యందు బుట్టిన ఉచ్చైశ్శ్రవము నేను. ఏనుగుల యందు ఐరావతము నేను. నరులయందు నరాధిపుడగు రాజు నేను.

ఆయుధానా మహం వజ్రం ధేనూనా మస్మి కామధుక్,
ప్రజన శ్చాస్మి కందర్ప స్సర్పాణా మస్మి వాసుకిః. 28

ఆయుధములందు వజ్రాయుధము నేను. ఆవులయందు కామ ధేనువు నేను. ప్రజోత్పాదనము జేయువారియందు కాముడు నేను. సర్పములయందు వాసుకి యను సర్పము నేను.

అనంత శ్చాస్మి నాగానాం వరుణో యాదసా మహమ్,
పితౄణా మర్యమా చాస్మి యమ స్సంయమతా మహమ్. 29

విషములేని నాగముల యందు అనంతు డను నాగము నేను. జలదేవతలయందు వరుణుడను నేను. పితృదేవతలయందు అర్యముడ నేను. శాసనము జేయువారియందు యముడు నేను.

ప్రహ్లాద శ్చాస్మి దైత్యానాం కాలః కలయతా మహమ్,
మృగాణాం చ మృగేంద్రోఽహం వైనతేయ శ్చ పక్షిణామ్. 30

రాక్షసుల యందు ప్రహ్లాదుడు నేను. భక్షించు వారియందు మహాకాలుడు నేను. మృగములయందు మృగరాజగు సింహము నేను. పక్షులయందు గరుత్మంతుడ నేను.

పవనః పవతా మస్మి రామ శ్శస్త్రభృతా మహమ్,
ఝషాణాం మకర శ్చాస్మి స్రోతసా మస్మి జాహ్నవీ. 31

వేగము గల వాటి యందు వాయువు నేను. శస్త్రధారులయందు నేను శ్రీరాముడను. జలచరములయందు మొసలి నేను. ప్రవహించు నదులయందు గంగానది నేను.

సర్గాణా మాది రంతశ్చ మధ్యం చైవాహ మర్జున,
అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతా మహమ్. 32

అర్జునా! ఈ సృష్టికి ఆది, మధ్యము, అంత్యము నేనే. విద్యల

యందు నేను అధ్యాత్మ విద్యను. వాదించువారి శాస్త్ర విహితము వాదము నేను.

అక్షరాణా మకారోఽస్మి ద్వంద్వ స్సామాసికస్య చ,
అహ మేవాక్షయః కాలో ధాతాఽహం విశ్వతోముఖః. 33

అక్షరములయందు నేను అకారము. సమాసములయందు ద్వంద్వసమాసము నేను. అక్షయమగు కాలము నేను. ఎల్లెడల ముఖములుగల బ్రహ్మ నేను.

మృత్యు స్సర్వ హర శ్చాహ ముద్భవశ్చ భవిష్యతామ్,
కీర్తి శ్శ్రీ ర్వాక్చ నారీణాం స్మృతి ర్మేధా ధృతిః క్షమాః. 34

సర్వమును హరించు మృత్యువు నేను. భవిష్యత్తున కలిగెడు వాని ఉత్పత్తి స్థానము నేను. స్త్రీలయందు కీర్తి, శ్రీ, వాక్కు, స్మృతి, మేధా, ధృతి, క్షమ నేనే.

బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛందసా మహమ్,
మాసానాం మార్గశీర్షోఽహ మృతూనాం కుసుమాకరః. 35

సామమంత్రములయందు నేను బృహత్సామము. ఛందస్సుల యందు గాయత్రీ ఛందస్సు నేను. మాసములయందు మార్గశీర్షము నేను. ఋతువులయందు వసంతఋతువు నేను.

ద్యూతం ఛలయతా మస్మి తేజ స్తేజస్వినా మహమ్,
జయోఽస్మి వ్యవసాయోఽస్మి సత్త్వం సత్త్వవతా మహమ్. 36

మోసముల యందు జూదము నేనై యున్నాను. తేజస్సంపన్నుల తేజస్సు నేను. జయమునేను. నిశ్చయము నేను. సత్త్వగుణవంతుల సత్త్వము నేను.

వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాండవానాం ధనంజయః,
మునీనా మప్యహం వ్యాసః కవీనా ముశనా కవిః. 37

వృష్ణికులము నందు వాసుదేవుడ నేను. పాండవులయందు ధనంజయుడ నేను. మునుల యందు వ్యాసముని నేను. కవులయందు శుక్రాచార్యుడు నేను.

దండో దమయతా మస్మి నీతి రస్మి జిగీషతామ్,
మౌనం చై వాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతా మహమ్. 38

(శాసించువారి) దండించువారి దండము నేను. విజయేచ్ఛగల వారి రాజనీతి నేను. గోప్యముల యందు మౌనము నేను. జ్ఞానుల యొక్క జ్ఞానము నేను.

యచ్చాపి సర్వ భూతానాం బీజం తదహ మర్జున,
నతద స్తి వినా యత్స్యా న్మయా భూతం చరాచరమ్. 39

అర్జునా! సర్వభూతముల ఆదిబీజము నేను. సృష్టియందు నన్ను విడిచి యుండు చరాచర భూతము లేవియును లేవు.

నా యొక్క విభూతు లనంతములు

నాంతో౽ స్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప,
ఏషతూద్దేశతః ప్రోక్తో విభూ తే ర్వి స్తరో మయా. 40

పార్థా! నాయొక్క దివ్య స్వరూపములు అనంతములు గలవు. ఈ నా విభూతి విస్తారమును నీకిపుడు నేను ఏకదేశీయముగ అంశమాత్రముగ జెప్పితిని.

అవ: నా యంశమాత్రమున ఈ సమస్త వస్తు జాతము ఉత్పన్న మగునని ఉపసంహరించుచున్నారు.

యద్య ద్విభూతిమ త్స త్త్వం శ్రీమదూర్జి తమేవ వా,
త త్త దేవావగచ్ఛ త్వం మమ తేజో౽ంశ సంభవమ్. 41

సంక్షేపముగా చెప్పవలె నన్న ఏ యే వస్తువు వైభవము, సిరి, సంపదలచే కూడి అభివృద్ధిప్రదమై యున్నదో అది నా తేజో౽ంశ సంభవమై యున్నదని (పుట్టినదని) తెలిసికొనుము.

అథవా బహునై తేన కిం జ్ఞా తేన తవార్జున,
విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్. 42

లేక, అర్జునా! నీకిక ఈవిధమున ఎక్కువగ జెప్పిన నేమి ప్రయోజనము? నేను నా యొక్క అంశమాత్రముననే ఈ విశ్వము నంతయు వ్యాపించి యున్నాను. "పాదో౽స్య విశ్వా భూతాని"

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే విభూతియోగోనామ దశమోఽధ్యాయః

ఓమ్
శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీమద్భగవద్గీత - ఏకాదశాధ్యాయము

అవ : నీ పరమోత్కృష్టమగు వాక్యములచే నా మోహము బాసెనని అర్జునుడు చెప్పుచున్నాడు.

అర్జున ఉవాచ :

మదనుగ్రహాయ పరమం గుహ్య మధ్యాత్మ సంజ్ఞితమ్,
యత్త్వయోక్తం వచస్తేన మోహోఽయం విగతో మమ 1

నన్ను అనుగ్రహించుటకై నీవు బోధించిన అధ్యాత్మతత్త్వమను పరమ రహస్యమగు జ్ఞానముచే నా మోహము తొలగెను. అనగా ఆత్మానాత్మల విషయక మగు అవివేకము తొలగెను. [అవివేకబుద్ధిః అపగతా ఇత్యర్థః]

భవాప్యయౌహి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా,
త్వత్తః కమలపత్రాక్ష మాహాత్మ్య మపి చావ్యయమ్. 2

ఓ కమలపత్రాక్షా! భూతముల యొక్క పుట్టు చావులను అవ్యయమగు మాహాత్మ్యమును విస్తారముగ నేను నీ నుండి వింటిని.

ఏవమేతద్యథాఽఽత్థత్వ మాత్మానం పరమేశ్వర,
ద్రష్టు మిచ్ఛామి తే రూప మైశ్వరం పురుషోత్తమ. 3

పరమేశ్వరా! నీ విపుడు వర్ణించిన నీ దివ్య స్వరూపమును నేను ప్రత్యక్షముగ దర్శింప నిచ్ఛయించుచున్నాను.

మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టు మితి ప్రభో,
యోగేశ్వర తతో మే త్వం దర్శయాత్మాన మవ్యయమ్. 4

ప్రభూ! అయ్యది నాచే చూడబడుటకు సాధ్యమని యోగ్యమని నీకు దోచిన ఓ యోగీశ్వరా! ఆ అవ్యయమగు నీ స్వరూపమును జూపుము.

విశ్వరూప ప్రదర్శనము

శ్రీ భగవానువాచ :

పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః,
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ. 5

పార్థా! దివ్యమైన నానావర్ణములును నానా ఆకృతులును గల నా యొక్క వందలాది వేలాది రూపములను జూడుము.

విశ్వరూప నిరూపణము

పశ్యాదిత్యా న్వసూ న్రుద్రా నశ్వినౌ మరుత స్తథా,
బహూ న్యదృష్ట పూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత. 6

ఆదిత్యులను, వసువులను, రుద్రులను, అశ్వినీకుమారులను, మరుత్తులను చూడుము. భారతా! ఆశ్చర్యకరమగు ఈవఱ కెన్నడును నీవు చూడని వాటి నన్నిటిని ఇచ్చట చూడుము.

ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్,
మమ దేహే గుడాకేశ యచ్చాన్యద్ద్రష్టు మిచ్ఛసి. 7

పార్థా! నా యం దేకమై ప్రకాశించు చరాచర సృష్టి జాతమును చూడుము. మఱియు నీవు చూడదలచిన దానిని నంతటిని ఈ నా దేహమున జూడుము.

దివ్యదృష్టి ప్రదానము

నతు మాం శక్యసే ద్రష్టు మనేనైవ స్వచక్షుసా,
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగ మైశ్వరమ్. 8

ఈ నీ మాంసమయ చక్షువులచే నన్ను జూడజాలవు. అందుచేత నీకు దివ్యమగు దృష్టి నొసగెదను. నా యోగ సామర్థ్యమును జూడుము.

సంజయ ఉవాచ :

ఏవ ముక్త్వా తతో రాజ న్మహా యోగేశ్వరో హరిః,
దర్శయామాస పార్థాయ పరమం రూప మైశ్వరమ్. 9

రాజా! ధృతరాష్ట్రా! మహా యోగేశ్వరుడగు శ్రీకృష్ణుడు ఇట్లు జెప్పి తన స్వరూపవైభవమును పార్థునకు జూపించెను.

విశ్వరూప సందర్శనము

అనేక వక్త్ర నయన మనేకాద్భుత దర్శనమ్,
అనేక దివ్యా భరణం దివ్యానేకోద్యతాయుధమ్. 10

అనేక ముఖములు, కన్నులు, అనేకాద్భుతములైన చూపులు దివ్యములగు వివిధాలంకారములు, సంసిద్ధ పఱుపబడిన వివిధాయుధములు వీనిచే నొప్పుచు ఆ రూపము కన్నులకు మిఱుమిట్లు గొల్పుచుండెను.

దివ్య మాల్యాంబర ధరం దివ్య గంధానులేపనమ్,
సర్వాశ్చర్యమయం దేవ మనంతం విశ్వతోముఖమ్. 11

ఆ అనంత మయిన సర్వత్ర ముఖములు గల ఆశ్చర్య కరమగు రూపము దివ్యమగు వస్త్రాభరణ మాలాలంకారములచే, దివ్య గంధానులేపనములచే శోభించుచుండెను.

దివి సూర్య సహస్రస్య భవేద్యుగప దుత్థితా,
యది భా స్సదృశీ సా స్యా ద్భాస స్తస్య మహాత్మనః. 12

వేలాది సూర్యులు ఒక్క పెట్టున ఆకసమున వెలిగిన ఎంత ప్రకాశ మగునో అంతటి మహాప్రకాశముచే నా మహాత్ముడు వెలుగుచుండెను.

తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్త మనేకధా,
అపశ్య ద్దేవదేవస్య శరీరే పాండవ స్తదా. 13

అనేకముగ విభజింపబడిన దానివలె నుండు ఈ విభిన్న ప్రపంచము నంతయును ఆ దేవదేవుని శరీరమునందు ఒక్కచోట యుండిన దానినిగా అర్జునుడు గాంచెను.

తత స్స విస్మయావిష్టో హృష్ట రోమా ధనంజయః,
ప్రణమ్య శిరసా దేవం కృతాంజలి రభాషత. 14

ధనంజయు డప్పుడు ఆశ్చర్య చకితుడై రోమాంచము గల వాడై ఆ దేవదేవునకు శిరము వంచి నమస్కారము జేసి ఇట్లు ప్రార్థించెను.

అర్జున ఉవాచ:

పశ్యామి దేవాం స్తవ దేవ దేహే
సర్వాం స్తథా భూత విశేష సంఘాన్,
బ్రహ్మాణ మీశం కమలాసనస్థ
మృషీంశ్చ సర్వా నురగాంశ్చ దివ్యాన్. 15

ఓ దేవా! నీ దేహము నందు సర్వ దేవతలను సమస్త భూత సమూహములను కమలాసనముపై గూర్చుండియుండిన సర్వుల స్వామి యగు బ్రహ్మను సర్వ ఋషులను ఎల్ల దివ్య సర్పములను జూచు చున్నాను.

అనేక బాహూదర వక్త్ర నేత్రం
పశ్యామి త్వాం సర్వతోఽనంత రూపమ్,
నాంతం న మధ్యం న పున స్తవాదిం
పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప. 16

అనేకములగు బాహువులు, ఉదరములు, ముఖములు, నేత్రములు గల అనంత రూపుడవగు నిన్నే సర్వత్ర కాంచుచున్నాను. విశ్వేశ్వరుడవగు విశ్వరూపా! నీ ఆదిమధ్యాంతముల నే నెచ్చటను గానకున్నాను.

కిరీటినం గదినం చక్రిణం చ
తేజోరాశిం సర్వతో దీప్తిమంతమ్,
పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమంతా
ద్దీప్తానలార్క ద్యుతి మప్రమేయమ్. 17

కిరీటమును ధరించి, గదా ధారివై, చక్రహస్తుడవై, సర్వత్ర ప్రకాశించుచున్న నిన్నే అన్ని దిక్కుల యందు చూచుచున్నాను.

నీవు తేజోరాశివి. ప్రజ్వలించుచున్న సూర్యాగ్నులబోలి నీ యాకృ
దర్శింప నలవి గాక యున్నది. నీవు అప్రమేయుడవు.

త్వమక్షరం పరమం వేదితవ్యం
త్వమస్య విశ్వస్య పరం నిధానమ్,
త్వమవ్యయ శ్శాశ్వత ధర్మగోప్తా
సనాతన స్త్వం పురుషో మతో మే. 18

నీవు నాశరహితుడవు. నీవే తెలిసికొనదగు శ్రేష్ఠవస్తువు. నీ
ఈ విశ్వము యొక్క పరమాధారుడవు. అవ్యయుడవు. శాశ్వత ధ
రక్షకుడవు. నీవు సనాతన పురుషుడవని నేను తెలియుదును.

అనాది మధ్యాంత మనంత వీర్య
మనంత బాహుం శశి సూర్య నేత్రమ్,
పశ్యామి త్వాం దీప్త హుతాశ వక్త్రం
స్వతేజసా విశ్వ మిదం తపంతమ్. 19

ఆది మధ్యాంతములు లేనివాడవు. అనంత వీర్యముగలవాడవు
అనంత బాహువులు గలవాడవు. చంద్రసూర్యులే నేత్రములుగా గ
వాడవు. ప్రజ్వలితాగ్నిని బోలిన ముఖములు గలవాడవు. నీ తేజస్సు
ఈ విశ్వమును ప్రకాశింప జేయుచున్నట్లు నేను చూచుచున్నాను.

ద్యావా పృథివ్యో రిద మంతరం హి
వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః,
దృష్ట్వాఽద్భుతం రూప ముగ్రం తవేదం
లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్. 20

స్వర్గ మర్త్య లోకములను తన్మధ్యమునను అన్ని దిక్కులయం
దును నీ వొక్కడవే వ్యాపించి యున్నావు. ఈ నీ అద్భుతమగు ఉగ్ర
రూపమును జూచి ఓ మహాత్మా! ఈ మూడు లోకములును వణకు
చున్నవి.

అమీ హి త్వాం సురసంఘా విశంతి
కేచిద్భీతాః ప్రాంజలయో గృణంతి,
స్వస్తీత్యుక్త్వా మహర్షి సిద్ధ సంఘాః
స్తువంతి త్వాం స్తుతిభిః పుష్కలాభిః. 21

ఇదో ఈ దేవగణములు నిన్ను ప్రవేశించుచున్నవి. కొందఱు చేతులు జోడించి భయగ్రస్తులై ప్రార్థించు చున్నారు. స్వస్తి యని నిన్ను మహర్షులు, సిద్ధ సంఘములు స్తోత్ర పాఠములచే స్తుతించు చున్నారు.

రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యా
విశ్వేఽశ్వినౌ మరుత శ్చోష్మపాశ్చ,
గంధర్వ యక్షాసుర సిద్ధ సంఘా
వీక్షంతే త్వాం విస్మితాశ్చైవ సర్వే. 22

రుద్రులు, ఆదిత్యులు, వసువులు, సాధ్యులు, విశ్వదేవతలు, అశ్వినీకుమారులు, మరుత్తులు, పితరులు, అటువలె గంధర్వ యక్ష రాక్షస సిద్ధ సంఘములు సర్వులు నీ వైపు విస్మితులై (ఆశ్చర్యముగ) చూచుచున్నారు.

రూపం మహత్తే బహు వక్త్ర నేత్రం
మహాబాహో బహు బాహూరు పాదమ్,
బహూదరం బహు దంష్ట్రా కరాళం
దృష్ట్వా లోకాః ప్రవ్యథితా స్తథాఽహమ్. 23

మహాబాహూ! అనేక ముఖములు, నేత్రములు, అనంత బాహువులు, ఊరువులు, పాదములచే ఒప్పు వికరాళమగు కోఱపళ్లు గల నీ మహారూపమును జూచి ఈ లోకములు భీతి నొందియున్నవి. వేయేల! నేనును భయమొంది యున్నాను.

నభ స్స్పృశం దీప్త మనేక వర్ణం
వ్యాత్తాననం దీప్త విశాల నేత్రమ్,
దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాంతరాత్మా
ధృతిం న విందామి శమం చ విష్ణో. 24

మిన్ను ముట్టునదియు తేజస్సంపన్నమును అనేక రంగులు గలదియు తెఱచుకొనియున్న నోళ్ళు గలదియు ప్రజ్వలించుచున్న విశాల నేత్రములు గలదియు నగు నీ యాకృతిని జూచి నా మనస్సు భయమొందినది. అందువలన ఓ భగవంతుడా! నా గుండె చెదరి యున్నది. శాంతియు చెదరినది.

దంష్ట్రాకరాళాని చ తే ముఖాని
దృష్ట్వైవ కాలానల సన్నిభాని,
దిశో న జానే న లభేచ శర్మ
ప్రసీద దేవేశ జగన్నివాస. 25

ప్రళయ కాలాగ్ని వలెనే యుండి వికరాళమగు నోళ్ళుగల
ముఖములను జూచి నేను దిక్కు దప్పి యున్నాను. నా మనస్సు
శాంతము పోయినది. దేవతల స్వామి వగు ఓ జగన్నివాసా! ప్రసన్ను
వగుము.

కలుగ నున్న జయాపజయములను అర్జునుడు చూచుట

అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః
సర్వే సహైవావనిపాల సంఘైః,
భీష్మో ద్రోణ స్సూత పుత్ర స్తథాఽసౌ
సహాస్మదీయైరపి యోధ ముఖ్యైః. 26

ఇదో రాజుల సమూహముతో సహ ధృతరాష్ట్రుని పుత్రు
లందఱును, భీష్మ ద్రోణులును ఈ సూతపుత్రుడగు కర్ణుడును, మా
పక్షపు ముఖ్య యోధు లందఱును,

వక్త్రాణి తే త్వరమాణా విశంతి
దంష్ట్రాకరాళాని భయానకాని,
కేచిద్విలగ్నా దశనాంతరేషు
సందృశ్యంతే చూర్ణితై రుత్తమాంగైః. 27

నీ యొక్క వికరాళమగు ముఖములు గల భయంకరమగు
నోళ్ళయందు త్వరత్వరగా ప్రవేశించు చున్నారు. అదో పండ్ల సందు
జిక్కువడి కొందఱి తలలు చూర్ణము లగుచుండుటను జూచు
చున్నాను.

యథా నదీనాం బహవోఽంబు వేగా
స్సముద్రమేవాభిముఖా ద్రవంతి,
తథా తవామీ నరలోక వీరా
విశంతి వక్త్రా ణ్యభివిజ్వలంతి. 28

వేగముచే ప్రవహించు నదుల ప్రవాహము లెల్ల సముద్రము వైపునకే పోవునట్లు ఈ నర లోక వీరు లెల్లరు నీ ప్రజ్వలితమగు నోళ్ళలో ప్రవేశించు చున్నారు.

యథా ప్రదీప్తం జ్వలనం పతంగా
　　విశంతి నాశాయ సమృద్ధవేగాః,
తథైవ నాశాయ విశంతి లోకా
　　స్తవాపి వక్త్రాణి సమృద్ధ వేగాః. 29

పతంగములు తమ నాశమునకై మండుచున్న మంట యందు అతితీవ్రముగ వచ్చి పడునట్లు ఈ జనులైననో తమ నాశమునకై రభసముతో వచ్చి నీ నోళ్ళయందు పడుచున్నారు.

లేలిహ్యసే గ్రసమానస్సమంతా
　　ల్లోకా న్సమగ్రా న్వదనై ర్జ్వలద్భిః,
తేజోభి రాపూర్య జగత్సమగ్రం
　　భాస స్తవోగ్రాః ప్రతపంతి విష్ణో. 30

ప్రజ్వలించు నీ నోళ్ళచే చుట్టు ప్రక్కల యందుండిన వారందరిని మ్రింగుచు రుచిగొని నాలుకచే చప్పరించు చున్నావు. ఓ విష్ణు పరమాత్మా! నీ ఉగ్రమగు కిరణములు సమస్త జగత్తును వ్యాపించి కాల్చు చున్నవి. తపింప జేయుచున్నవి.

భీతి చెందిన అర్జునుని ప్రశ్న

ఆఖ్యాహి మే కో భవానుగ్రరూపో
　　నమోఽస్తు తే దేవవర ప్రసీద,
విజ్ఞాతు మిచ్ఛామి భవంత మాద్యం
　　నహి ప్రజానామి తవ ప్రవృత్తిమ్. 31

ఉగ్ర స్వరూపివై యుండు నీవెవరు? నాకు జెప్పుము. ఓ దైవ శ్రేష్ఠుడా! నీకు నమస్కారము. ఇక ప్రసన్నుడ వగుము. సర్వమునకు కారణుడ వైన నిన్ను దెలియ నిచ్ఛయించు చున్నాను. ఈ నీ అద్భుత వ్యాపారమును నేను దెలియను.

భగవంతుడు బదులు చెప్పుట

శ్రీభగవానువాచ :

కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో
లోకాన్సమాహర్తుమిహ ప్రవృత్తః,
ఋతేఽపి త్వాం న భవిష్యంతి సర్వే
యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః. 32

నేను లోకమును సంహరించు ప్రచండరూపుడనగు కాలుడను. లోకసంహారార్థమై ఇచ్చట ప్రవృత్తుడనై యున్నాను. నీవు చంప... న్నను ఎదుటి సైన్యమునందు నిలిచియుండు ఈ వీరు లందఱును ... వారగుట నిశ్చయము. చచ్చెదరని భావము. నీవు నిమిత్తమాత్రు డవై యుద్ధము చేయుము.

తస్మాత్త్వముత్తిష్ఠ యశో లభస్వ
జిత్వా శత్రూన్ భుంక్ష్వ రాజ్యం సమృద్ధమ్,
మయైవైతే నిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్. 33

అందుచేత లెమ్ము. వీరిని గెలిచి యశస్సును పొందుము. శత్రు వులను జయించి సమృద్ధమగు రాజ్యసుఖము ననుభవింపుము. ము... టనే. వీరందఱు నాచే సంహరింపబడి యున్నారు. పార్థా! నీవు నా చే... యందు నిమిత్తమాత్రుడ వగుము.

సవ్యసాచీ! రెండు చేతుల చేతను బాణములను విడువు... విజయము నీకబ్బును. వ్యాపకాత్మ స్వరూపుడనగు నా సన్నిధానము... జరుగు ఏకార్యముల యందును కర్తృత్వమును వహింప వల... అప్పుడు కర్మ సాంగ మంగళ మగును. అర్థాత్ జీవితమున కర్తృ... బుద్ధికంటెను భారము, భయస్థానము మఱేదియు లేదు. ఆత్మసన్ని... ధానమున ఈ సమస్త సంచలన మనునది మఱవకుము.

ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ
కర్ణం తథాఽన్యానపి యోధవీరాన్,
మయా హతాంస్త్వం జహి మా వ్యథిష్ఠా
యుధ్యస్వ జేతాఽసి రణే సపత్నాన్. 34

మొదటనే నాచే చంపబడిన భీష్మ ద్రోణ కర్ణ జయద్రథాది వీరులను సంహరింపుము. వృథా వ్యథ నొంద బోకుము. యుద్ధము జేయుము. రణమున నీవు శత్రువులను జయింతువు.

సంజయ ఉవాచ :

ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య
కృతాంజలి ర్వేపమానః కిరీటీ,
నమస్కృత్వా భూయ ఏవాహ కృష్ణం
సగద్గదం భీతభీతః ప్రణమ్య. 35

శ్రీకృష్ణుని ఈ వచనములను విని అర్జునుడు వణకుచు చేతులను జోడించి నమస్కరించి తలవంచి గద్గద కంఠముచే మరల కృష్ణ పరమాత్మతో నిట్లు బలికెను.

అర్జున ఉవాచ :

స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా
జగత్ప్రహృష్య త్యనురజ్యతే చ
రక్షాంసి భీతాని దిశో ద్రవంతి
సర్వే నమస్యంతి చ సిద్ధ సంఘాః. 36

దేవా! నీ సంకీర్తనముచే జగత్తు ఆనందించును; అందే అనురక్తి నొందును. రాక్షసులు భయముచే దిక్కుల బట్టి పరువు లిడుచున్నారు. సిద్ధ సంఘము లెల్ల నీకు నమస్కారములు జేయుచున్నవి. ఇదంతయును సరియే.

కస్మాచ్చ తే న నమేర న్మహాత్మన్
గరీయసే బ్రహ్మణోఽప్యాదికర్త్రే,
అనంత దేవేశ జగన్నివాస
త్వ మక్షరం సదస త్తత్పరం యత్. 37

ఓ మహాత్మా! బ్రహ్మదేవుని పుట్టుకకును ఆది కర్తవయిన శ్రేష్ఠుడవగు నీకు వా రందఱును నమస్కారము జేయుటలో ఏమి ఆశ్చర్యముగలదు? ఎట్లు చేయకుందురు? అనంతస్వరూపా! జగన్ని

వాసా! నీవు అక్షర స్వరూపుడవు. సదసత్తులు నీవే. వాటి కతీతమగు పరతత్వమును నీవే.

అవ: అనంత స్వరూపుడగు భగవంతునకు సారెసారెకు అన్ని వైపుల నుండి అర్జునుడు నమస్కారములు చేయుట.

త్వమాదిదేవః పురుషః పురాణ
స్త్వమస్య విశ్వస్య పరం నిధానమ్,
వేత్తాఽసి వేద్యం చ పరంచ ధామ
త్వయా తతం విశ్వ మనంతరూప. 38

నీవు ఆదిదేవుడవు. పురాణ పురుషుడవు. నీవే ఈ విశ్వము యొక్క పరమాధారుడవు. నీవే జ్ఞానివి; జ్ఞేయ స్వరూపుడవు. నీవే పరమ స్థానము. ఓ అనంతరూపా! ఈ సమస్త విశ్వము నీచే వ్యాప్తమై యున్నది.

వాయు ర్యమోఽగ్ని ర్వరుణ శ్శశాంకః
ప్రజాపతి స్త్వం ప్రపితామహశ్చ,
నమో నమ స్తేఽస్తు సహస్రకృత్వః
పునశ్చ భూయోఽపి నమో నమ స్తే. 39

వాయు, యమ, అగ్ని, వరుణ, చంద్ర, ప్రజాపతులు మరియు ప్రపితామహుడు (బ్రహ్మకు నీవు తండ్రివైనందు వలన) వీరందఱును నీవే యయియున్నావు. వేలాదిగా నీకు నమస్కారములు. మరల మరల నీకు నమస్కారములు.

నమః పురస్తాదథ పృష్ఠత స్తే
నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ,
అనంతవీర్యామిత విక్రమ స్త్వం
సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః. 40

నీకు ముందునుండి నమస్కారము. వెనుకనుండి నమస్కారము. నీకు సర్వదిక్కుల నుండియు నమస్కారము. నీవు అనంత వీర్యుడవు అమిత శౌర్యము గలవాడవు. సమస్తమును నీవే సిద్ధపరచెదవు. అందుచే సర్వము నీవే యై యున్నాము.

అపరాధ క్షమాపనము

సఖేతి మత్వా ప్రసభం యదుక్తం
హే కృష్ణ హే యాదవ హే సఖేతి,
అజానతా మహిమానం త వేదం
మయా ప్రమాదా త్ప్రణయేన వాఽపి. 41

ఈ నీ మహిమను తెలియక నీవు నా స్నేహితుడ వని తెలిసి ఓకృష్ణా ! యాదవా ! మిత్రమా ! అను నిత్యాదిగా తప్పుచే గాని ప్రేమచే గాని నిన్ను అమర్యాదగా సంబోధించిన దానిని,

యచ్చాపహాసార్థ మసత్కృతోఽసి
విహార శయ్యాసన భోజనేషు,
ఏకోఽథవాఽప్యచ్యుత తత్సమక్షం
తత్క్షామయే త్వా మహ మప్రమేయమ్. 42

మఱియు ఆడుకొనునపుడును, కూర్చుండు నప్పుడును, పరుండు నపుడును, భోజనము చేయునపుడును ఏకాంతమున ఒక్కడవుగా నుండునపుడును లేక నలుగురితో గూడి యుండినపుడును చేష్టచే నేను అమర్యాదగా నిన్ను బలికిన పలుకులను ఓ అగమ్యుడా! నీవు క్షమించవలెనని ప్రార్థించుచున్నాను.

పితాఽసి లోకస్య చరాచరస్య
త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్,
నత్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యో
లోకత్రయేఽప్యప్రతిమ ప్రభావ. 43

ఈ చరాచర లోకములకు నీవు తండ్రివి. నీవు శ్రేష్ఠమైన పూజ్య గురుడవు. నీకు సములగు వారెవరును లేర న్నపుడు నీకంటె ఎక్కువైన వా రెవరుందురు ? ముల్లోకముల యందును నీ సమమగు శక్తి సంపన్ను లెవరును లేరు.

అవ : నా అపరాధమును క్షమించి పూర్వమగు నీ చతుర్భుజరూపముచే నాకు ప్రసన్నుడ వగుమని ప్రార్థించుట.

తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వా మహ మీశ మీడ్యమ్,

పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుమ్. 44

అందుచేత నేను దేహమును వంచి (ప్రణిధాన మొనర్చి) నమస్కార పూర్వకముగ నన్ననుగ్రహింపుమని పూజ్యుడవగు ఈశ్వరుడవైన నిన్ను ప్రార్థించెదను. దేవా! తండ్రి కుమారుని, మిత్రుడు తన మిత్రుని, ప్రియుడు ప్రియురాలియొక్క యపరాధములను క్షమించునట్లు నా యపరాధములను నీవు క్షమింపవలెను.

అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా
భయేన చ ప్రవ్యథితం మనో మే,
తదేవ మే దర్శయ దేవ రూపం
ప్రసీద దేవేశ జగన్నివాస. 45

ఎప్పుడును చూడని నీ రూపమును చూచి నేను సంతోషించినవాడనై యున్నాను. మఱియు నా మనస్సు భయముచే కూడినదై యున్నది. దేవతల స్వామి యగు ఓ జగన్నివాసా! ప్రసన్నుడవగుము. ఆ నీ పూర్వ స్వరూపమును జూపుము.

కిరీటినం గదినం చక్రహస్త
మిచ్ఛామి త్వాం ద్రష్టు మహం తథైవ,
తేనైవ రూపేణ చతుర్భుజేన
సహస్రబాహో భవ విశ్వమూర్తే. 46

సహస్ర బాహువులచే నొప్పారు ఓ విశ్వమూర్తీ! కిరీటముచే నొప్పుచు గదా చక్రములను ధరించిన నీ సౌందర్య రూపమును జూడ నిచ్ఛయించెదను. ఆ నీ చతుర్భుజములచే గూడిన సౌమ్యరూపమును జూపుము.

అవ : భగవంతుడు తన చతుర్భుజములతో ప్రసన్నుడగుట.

శ్రీ భగవానువాచ :

మయా ప్రసన్నేన తవార్జునేదం
రూపం పరం దర్శిత మాత్మయోగాత్,
తేజోమయం విశ్వ మనంత మాద్యం
యన్మే త్వదన్యేన న దృష్టపూర్వమ్. 47

అర్జునా! నిన్ను వినా తక్కిన వారెవరును మొదట చూడని తేజోమయమును అనాదియునగు విశ్వరూపమును నా యోగ సామర్థ్యముచేత నేను నీకు ప్రసన్నుడనై చూపించితిని.

న వేదయజ్ఞాధ్యయనై ర్న దానై
ర్నచ క్రియాభి ర్న తపోభిరుగ్రైః,
ఏవం రూప శ్శక్య అహం నృలోకే
ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర. 48

వేదపఠనము, యజ్ఞము, అధ్యయనము, దానము, కర్మ, ఉగ్రమైన తపస్సు మొదలగు వాటిని చేయువారికిగూడ, ఈ లోకమునందు పార్థా! నీకు తప్ప తక్కిన వారికి ఇట్టి దివ్య రూప సందర్శనము కాలేదు.

మా తే వ్యథా మా చ విమూఢభావో
దృష్ట్వా రూపం ఘోర మీదృఙ్మమేదమ్,
వ్యపేతభీః ప్రీతమనాః పున స్త్వం
తదేవ మే రూప మిదం ప్రపశ్య. 49

ఈ నా ఘోరరూపమును జూచి వ్యథ నొందవలదు. భయమొంద వలదు. నిర్భయుడవై ప్రసన్న చిత్తము గలవాడవై మరల ఆ నా మొదటి రూపమును జూడుము.

అవ: సౌమ్యమగు నతని దివ్యమంగళ విగ్రహమును జూచి అర్జును డూఱడిల్లుట.

సంజయ ఉవాచ:

ఇత్యర్జునం వాసుదేవ స్తథోక్త్వా
స్వకం రూపం దర్శయామాస భూయః,
ఆశ్వాస యామాస చ భీత మేనం
భూత్వా పున స్సౌమ్యవపు ర్మహాత్మా. 50

భగవంతుడు అర్జునునకు ఇట్లు జెప్పి తన పూర్వ రూపమును మరల జూపించెను. ఇట్లు సౌమ్యరూపమును ధరించి, భయగ్రస్తుడైన అర్జునునకు ఆశ్వాసనము అనగా ఊఱటను గలిగించెను.

అర్జున ఉవాచ :

దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన,
ఇదానీ మస్మి సంవృత్తస్సచేతాః ప్రకృతిం గతః. 51

భగవంతుడా! ఈ నీ సౌమ్యమగు మనుష్య రూపమును జూచి నా చిత్తము స్వాస్థ్య మొందినది. పూర్వ స్థితికి వచ్చితిని.

అవ : చతుర్భుజములచే నొప్పారు నీ దివ్య దర్శనము దుర్లభమని తత్ప్రభా మును వర్ణించుట.

శ్రీ భగవానువాచ :

సుదుర్దర్శ మిదం రూపం దృష్టవానసి యన్మమ,
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శన కాంక్షిణః. 52

దర్శించుటకు అసాధ్యమగు ఏ నా రూపమును నీవు జూచితివో ఆ నా స్వరూపమును జూచుటకై దేవతలు గూడ ఎల్లప్పుడు ప్రార్థించు చుందురు. ఇచ్ఛయించు చుందురు.

నాహం వేదై ర్న తపసా న దానేన న చేజ్యయా,
శక్య ఏవం విధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా. 53

నీకు ఏ రూపముయొక్క దర్శన మాయెనో ఆ రూపదర్శనము వేదము, తపస్సు, దానము, యజ్ఞము మొదలగువాని సాహాయ్యముచే గూడ గలుగుటకు సాధ్యము గాదు.

భక్త్యా త్వనన్యయా శక్య అహమేవంవిధోఽర్జున,
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప. 54

పరంతపుడవైన ఓ అర్జునా! అనన్యమగు భక్తిచే నన్ను తత్త్వతః తెలిసికొనుటకును, చూచుటకును, పొందుటకును అనగా నా సాయుజ్యమును (మోక్షమును) బొందుటకును సాధ్యమగును.

మత్కర్మకృ న్మత్పరమో మద్భక్త స్సంగ వర్జితః,
నిర్వైర స్సర్వ భూతేషు యస్స మామేతి పాండవ. 55

పాండవా ! నాకై కర్మను జేయువాడును, నేనే శ్రేష్ఠుడనని భావించువాడును, సంగవర్జితుడును, సర్వభూతముల యందు నిర్వైర బుద్ధి గలవాడు నగు నా భక్తుడు నన్ను చేరును. పొందును.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే విశ్వరూపసందర్శన
యోగో నామ ఏకాదశోఽధ్యాయః

ఓమ్

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీమద్భగవద్గీత - ద్వాదశాధ్యాయము

అవ : సగుణ నిర్గుణోపాసకులలో ఎవరు శ్రేష్ఠులని అర్జును డడుగుట.

అర్జున ఉవాచ :

ఏవం సతత యుక్తా యే భక్తా స్త్వాం పర్యుపాసతే,
యేచాప్యక్షర మవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః. 1

ఇట్లు సతత యుక్తచిత్తులై ఏ భక్తులు నిన్ను (సగుణరూపునిగ) భజించెదరో మఱియు నిన్నెవరు అవ్యక్తాక్షర స్వరూపునిగ నుపాసించెదరో ఆ యిరువురి యందు ఎవ రెక్కువ? యోగవిత్తము లెవరు ?

శ్రద్ధచే నన్నే ఉపాసించువారు శ్రేష్ఠులు

శ్రీ భగవానువాచ :

మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే,
శ్రద్ధయా పరయోపేతా స్తే మే యుక్తతమా మతాః. 2

అత్యంత శ్రద్ధాయుక్తులై నా యందు చిత్తము నుంచి ఏ నిత్యయుక్తులు నన్ను భజించెదరో వారు అందఱి కంటెను ఎక్కువమైన

యోగులని నా అభిప్రాయము (నా విశ్వరూపోపాసన చేయువారని భావము).

నిర్గుణ బ్రహ్మోపాసన చేయువారు నన్ను పొందుదురు

యేత్వక్షర మనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే,
సర్వత్రగ మచింత్యం చ కూటస్థ మచలం ధ్రువమ్. 3

అయితే నాశ రహితము ఇట్టిదని చెప్పరానిది అవ్యక్తము సర్వవ్యాపకము అచింత్యము కూటస్థము అనగా నిర్వికారమునగు ప్రత్యగాత్మమై యుండిన అచలమును సత్యమునగు నా స్వరూపము నెవరు ఉపాసింతురో,

సన్నియమ్యేంద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః,
తే ప్రాప్నువంతి మామేవ సర్వభూతహితే రతాః. 4

ఇంద్రియములను సంయమించి సర్వత్ర సమబుద్ధి గలవారై సర్వ భూతములకు హితము చేయుటయం దిష్టము గలవారు నన్నే పొందుదురు.

దేహాత్మబుద్ధి గలవారికి నిర్గుణోపాసన అసాధ్యము

క్లేశోఽధికతర స్తేషా మవ్యక్తాసక్తచేతసామ్,
అవ్యక్తా హి గతి ర్దుఃఖం దేహవద్భి రవాప్యతే. 5

అవ్యక్తాక్షర వాచ్యమగు తత్త్వము నుపాసించు వారికి ఎక్కువ కష్టమగును. ఎందుకనగా ఈ అవ్యక్తోపాసనాగతి దేహాత్మబుద్ధి గల వారికి కఠినమై తోచును.

యేతు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః,
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే. 6

కాని ఎవరు సర్వ కర్మలను నాకే అర్పించి నన్నే ఆశ్రయించి అనన్య యోగమున నన్ను భజించెదరో,

తేషామహం సముద్ధర్తా మృత్యు సంసార సాగరాత్,
భవామి నచిరాత్పార్థ మయ్యావేశిత చేతసామ్. 7

పార్థా! వారు నా యందు తమ చిత్తము నర్పించి యున్నందు

వలన వారిని నేను సత్వరమున మృత్యుగ్రస్తమగు సంసార సాగరము నుండి సముద్ధరించెదను.

చిత్తశుద్ధ్యర్థమై చేయబడు సగుణోపాసనల వివరము

మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ,
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః. 8

నాయందే చిత్తము నుంచుము. నాయందే బుద్ధిని నెలకొల్పుము. అట్లైన ఇక ముందు నాయందే నీవు వసింతువు. ఇది నిస్సంశయము.

అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్,
అభ్యాస యోగేన తతో మా మిచ్ఛాప్తుం ధనంజయ. 9

ఇట్లు నా యందు చిత్తమును స్థిరపఱచుటకు శక్తి లేకపోయిన అర్జునా! నన్ను అభ్యాసయోగముచే అనగా చిత్తమును ఒకే ఆలంబనము గలదిగా నుంచుటకైన సమాధానమును అభ్యాసయోగమును జేయ యత్నింపుము.

అభ్యాసేఽప్యసమర్థోఽసి మత్కర్మపరమో భవ,
మదర్థమపి కర్మాణి కుర్వ న్సిద్ధి మవాప్స్యసి. 10

అభ్యాసమును గూడ నీకు జేయుటకు సాధ్యము కానిపట్ల నాకై కర్మల జేయుటయందు దైనను మగ్నుడ వగుము.
నా కొఱకై కర్మలను జేయుటవలన సిద్ధిని బడయుదువు.

అభ్యాసము లేక పోయినను చేయు పనులన్నియును నాకొఱకే యని చేయు చుండిన సత్త్వ శుద్ధిని బడసి తద్ద్వారా జ్ఞానసిద్ధిని పొందుదువని భావము.

అథై తద ప్యశక్తోఽసి కర్తుం మద్యోగ మాశ్రితః,
సర్వ కర్మ ఫల త్యాగం తతః కురు యతాత్మవాన్. 11

నీవు ఇట్లు చేయుట కసమర్థుడ వైతివేని మద్యోగము నాశ్రయించి నా యందు చిత్తము నుంచి సర్వ కర్మ ఫల త్యాగమును ప్రయత్న పూర్వకముగ జేయుము.

ఈశ్వరార్పణ బుద్ధియే కర్మ ఫల త్యాగోపాయము

శ్రేయో హి జ్ఞాన మభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశిష్యతే,
ధ్యానా త్కర్మ ఫల త్యాగ స్త్యాగా చ్ఛాంతి రనంతరమ్. 12

అభ్యాసము కంటెను జ్ఞానము ఎక్కువ. జ్ఞానమున కంటెను ధ్యానము ఎక్కువ. ధ్యానమున కంటెను కర్మ ఫల త్యాగము ఎక్కువ. దానిచే ఆ తర్వాత శాంతి చిక్కును.

అకర్తృత్వ బుద్ధిచే కారణ సహిత సర్వ సంసార దుఃఖ నివృత్తి, నిత్య శాంతి యని భావము.

అవ : జ్ఞానికి సహజములై భక్తునకు సాధ్యములై యుండు జ్ఞాని యగు భక్తుని లక్షణములు.

అద్వేష్టా సర్వ భూతానాం మైత్రః కరుణ ఏవచ,
నిర్మమో నిరహంకారః సమదుఃఖ సుఖః క్షమీ. 13

ఏ భక్తుడు ద్వేష రహితుడును, సర్వ భూతములకు మిత్రుడును, దయ గలవాడును, మమకార రహితుడును, నిరహంకారుడును, సుఖ దుఃఖములను సమమని భావించు వాడును, ఓర్పు గలవాడును,

సంతుష్ట స్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః,
మయ్యర్పిత మనో బుద్ధి ర్యోమద్భక్త స్స మే ప్రియః. 14

సదా సంతుష్టుడును, యోగియు, సంయమియు, దృఢ నిశ్చయము గలవాడును, మనో బుద్ధులను నా కర్పించినవాడునై యున్నాడో అతడు నాకు ప్రియుడు.

యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః,
హర్షామర్ష భయోద్వేగై ర్ముక్తో య స్స చ మే ప్రియః. 15

ఎవని వలన లోకమునకు భయము లేదో, లోకముచే ఎవడు భయము నొందడో, ఎవడు హర్షము, క్రోధము, భయము, విషాదము వీటిచే ముక్తుడో అతడు నాకు ప్రియుడు.

అనపేక్ష శ్శుచి ర్దక్ష ఉదాసీనో గతవ్యథః,
సర్వారంభ పరిత్యాగీ యోమద్భక్త స్స మే ప్రియః. 16

అపేక్షా రహితుడును, పరిశుద్ధుడును, దక్షుడును, ఉదాసీనుడును, వ్యథ లేనివాడై యుండి సమస్త కామ్యకర్మలను విడిచి నిష్కాముడై కర్మలు జేయుచుండు వాడును అగు భక్తుడు నాకు ప్రియుడు.

యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి,
శుభాశుభ పరిత్యాగీ భక్తిమా న్యస్స మే ప్రియః. 17

ఏ భక్తుడు హర్షము నొందడో, ద్వేషింపడో, శోకము నొందడో, అపేక్షింపడో, శుభాశుభ పరిత్యాగియై యున్నాడో అతడు నాకు ప్రియుడు.

సమశ్శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః,
శీతోష్ణ సుఖదుఃఖేషు సమ స్సంగవివర్జితః. 18

శత్రు మిత్రుల యందు సముడై అటువలె మానావమానములను, శీతోష్ణ సుఖదుఃఖాదులను సమమని భావించి, సంగవర్జితుడై,

తుల్యనిందా స్తుతిర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్,
అనికేతః స్థిర మతి ర్భక్తిమా న్మే ప్రియో నరః. 19

నిందా స్తుతులను సమదృష్టిచే జూచుచు మౌనముగ నుండి యదృచ్ఛాలాభ సంతుష్టుడై అనికేతుడై (ఇది నా స్థలమను నిర్ణయము లేనివాడై) స్థిరమతి గలిగి నన్నాశ్రయించిన భక్తుడు నాకు ప్రియుడు.

యేతు ధర్మ్యామృత మిదం యథో క్తం పర్యుపాస తే,
శ్రద్దధానా మత్పరమా భక్తా స్తేఽతీవ మే ప్రియాః. 20

శ్రద్ధ నుంచి మత్పరాయణులై ఏ భక్తులు నేను జెప్పినట్టి అమృతమువంటి ఈధర్మము నాచరింతురో వారు నా కత్యంతప్రియులు.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగ శాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే భక్తి యోగో నామ
ద్వాదశోఽధ్యాయః.


తత్పదార్థ బోధకం
భక్తిషట్కం సమాప్తమ్.

ఓమ్

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీమద్భగవద్గీత-త్రయోదశాధ్యాయము

అవ : నా యధీనము త్రిగుణాత్మకము నగు ప్రకృతి పురుషుని భోగాపవర్గార్థమై ఈ దేహేంద్రియాద్యాకారముగ పరిణమించెను. కార్య కారణ సంఘాత రూపమైన దీనియందు పురుషుడు అధ్యాసచే నేనను బుద్ధిగలిగి తాదాత్మ్యము నొంది వృథా సంసార దుఃఖము ననుభవించు చున్నందువలన అట్టి దుఃఖ నివృత్త్యుపాయముగ ఆత్మానాత్మ వివేక యుక్తమైన జ్ఞేయ బ్రహ్మ తత్వోపదేశము ఈ అధ్యాయమున వివరింపబడు చున్నది.

శ్రీభగవానువాచ :

ఇదం శరీరం కౌంతేయ క్షేత్ర మిత్యభిధీయతే,
ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః. 1

పార్థా! ఈ శరీరము క్షేత్రమని చెప్పబడును. ఈ క్షేత్రమును తెలియు వానిని జ్ఞానులు క్షేత్రజ్ఞుడని చెప్పుదురు.

క్షేత్ర మనగా [క్షత త్రాణాత్, క్షయాత్, క్షరణాత్, క్షేత్ర వద్ వా అస్మిన్ కర్మఫల నిష్పత్తేః] దెబ్బనుండి కాపాడునదియు, పాడగునదియు, మెల్లమెల్లగ నశించి పోవునదియు, పొలమువలన ఫలము గలుగునట్లు ఇందు కర్మఫలము గలుగుచుండుట వలన, ఈ శరీరము క్షేత్రమని చెప్పబడును. జీర్ణమయి పోవుచుండుట వలన శరీరమనియు, ఆధ్యాత్మికాది దుఃఖములచే దహింపబడు చుండుట వలన దేహమనియు బిలుతురు. ఇదం అనుటవలన దృశ్యపదార్థ మనియు, ఈ సమస్త దృశ్య జాతము నెఱుగు జ్ఞాత ఒక్కడై యుండుట వలన క్షేత్రజ్ఞు డనియు నామము.

జీవాత్మ పరమాత్మల ఏకత్వ నిరూపణము

క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత,
క్షేత్ర క్షేత్రజ్ఞయో ర్జ్ఞానం యత్తజ్జ్ఞానం మతం మమ. 2

సర్వక్షేత్ర (శరీర) ములయందుండు క్షేత్రజ్ఞుడు నేనే యని

తెలియుము. క్షేత్ర క్షేత్రజ్ఞుల యథార్థ జ్ఞానమే నా యొక్క జ్ఞానము ఇది నా మతము.

క్షేత్రజ్ఞుడ నగు నన్ను అసంసారియైన పరమాత్మగా తెలిసి కొనుము. పిపీలికాది బ్రహ్మపర్యంతము సర్వోపాధులయందు ఏ క్షేత్రజ్ఞాత్మ వేఱు వేఱుగ నున్నట్లున్నాడో ఆ నన్ను ఏ యుపాధి విశేషమును లేని నిర్విశేష పరబ్రహ్మ తత్త్వమునుగ తెలిసి కొనుము. ఉపాధులను బాధింప ఉపహితమైన చేతనము ఏకము, అద్వితీయమునై యున్న దనునది దివ్యదృష్టి. ఈ సర్పము రజ్జువే యన్నట్లు సంసారియై యగపడు క్షేత్రజ్ఞుని జీవుని వ్యాపకమగు బ్రహ్మమే నని తెలియుము.

ఇది జీవబ్రహ్మల అభేదార్థ బోధకమగు తత్త్వమసి మహావాక్యార్థమై యున్నది. 'మాం' అను పదము తత్పదార్థమును శ్రుతిషడ్లింగ తాత్పర్యార్థమైన అద్వితీయ బ్రహ్మమును క్షేత్రజ్ఞయను పదము త్వంపదార్థమును క్షేత్ర విలక్షణమగు ప్రత్యగాత్మ స్వరూపమును విశదీకరించుచు "విద్ధి" యను పదము ఈ రెంటికి గల అభేదార్థమును దెలుపుచున్నది. బ్రహ్మమునందు తోచు అన్యత్వమును (అనాత్మత్వము) పరోక్షత్వమును, క్షేత్రజ్ఞుని యందుండు పరిచ్ఛిన్నత్వమును దుఃఖిత్వమును బాధించి క్షేత్రజ్ఞుడు అద్వితీయ బ్రహ్మమయి యున్నాడను అర్థము ఇందు నిరదించు చున్నదని తెలియవలెను.

తత్క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చయత్,
స చ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు. 3

ఆ క్షేత్రమేది? మఱియు ఎట్టిది? ఎట్టి వికారము గలది? ఏ దానిచే ఏది యగును? క్షేత్రజ్ఞు డెవరు? అతని ప్రభావ మెట్టిది? అను నీ విషయమును సంక్షేపముగ చెప్పెదను వినుము.

అవ : పైనదెలిపిన విషయమున ప్రమాణములను దెలుపుచున్నారు . .

ఋషిభి ర్బహుధా గీతం ఛందోభి ర్వివిధైః పృథక్,
బ్రహ్మసూత్ర పదై శ్చైవ హేతుమద్భి ర్వినిశ్చితైః. 4

ఈ విషయము వివిధములగు ఛందస్సులచే (వేదములచే) విడివిడిగా అనేక ప్రకారములుగ ఋషులవలన గానము చేయబడినది.

మఱియు సకారణముగ నిర్దుష్టార్థ నిర్ణయాత్మకములైన బ్రహ్మసూత్ర పదములచేత నీ యర్థము నిరూపింపబడియున్నది. అనగా ఉపనిషత్తుల చేతను బ్రహ్మసూత్రముల చేతను నిర్ధరింపబడిన సత్యార్థమని భావము.

క్షేత్రముయొక్క స్వరూపము, తద్వికారములు

మహాభూతాన్యహంకారో బుద్ధి రవ్యక్త మేవచ,
ఇంద్రియాణి దశైకంచ పంచ చేంద్రియ గోచరాః. 5

మహాభూతములు, అహంకారము, బుద్ధి, అవ్యక్తము, ఇంద్రియములు పది, ఒక మనస్సు, ఇంద్రియ గోచరములగు ఐదు విషయములు,

ఇచ్ఛా ద్వేష స్సుఖం దుఃఖం సంఘాత శ్చేతనా ధృతిః,
ఏతత్క్షేత్రం సమాసేన సవికార ముదాహృతమ్. 6

మఱియు ఇచ్ఛ, ద్వేషము, సుఖము, దుఃఖము, సంఘాతము, చేతన, ధృతి ఇవన్నియుగూడి వీటి యందలి వికారములతోసహా ఇది క్షేత్రమని చెప్పబడును.

సంఘాత మనగా, దేహేంద్రియాదుల గుంపు, చేరిక. చేతన అనగా జ్ఞానము. ధృతి యనగా ధారణాశక్తి (ధైర్యము) వ్యాకులత నొందిన దేహేంద్రియాదులను స్తిమిత మొనర్చుకొనుటకు హేతువైన ప్రయత్న విశేషమని అర్థము.

అమానిత్వాది 20 జ్ఞానసాధనములు

అమానిత్వ మదంభిత్వ మహింసా క్షాంతి రార్జవమ్,
ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మ వినిగ్రహః. 7

గర్వము లేకుండుట, దంభము లేకుండుట, అహింస, క్షమ, సరళత, గురుసేవ, శుచి, పవిత్రత, స్థిరత, ఆత్మసంయమము,

ఇంద్రియార్థేషు వైరాగ్య మనహంకార ఏవచ,
జన్మ మృత్యు జరా వ్యాధి దుఃఖ దోషానుదర్శనమ్. 8

విషయములయందు వైరాగ్యము, అహంకారము (అనాత్మ యందు ఆత్మబుద్ధి) లేకుండుట, జన్మము, జర, మరణము, వ్యాధి మొదలగునవి దుఃఖరూపములు [illegible] దోషయుక్తములనియు భావించుట,

అసక్తి రనభిష్వంగః పుత్ర దార గృహాదిషు,
నిత్యం చ సమచిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు. 9

ఆసక్తి లేకుండుట, పుత్ర కళత్ర గృహాదుల యందు సంగము లేకుండుట, ఇష్టానిష్ట సంఘటనలయందు చిత్తమును సమముగానుంచుకొనుట,

మయిచానన్యయోగేన భక్తి రవ్యభిచారిణీ,
వివిక్త దేశ సేవిత్వ మరతి ర్జన సంసది. 10

నాయందు అనన్యమగు అచలమైన భక్తి, ఏకాంతవాసము నందు ప్రేమ, జనసమూహముపట్ల అరుచి,

అధ్యాత్మజ్ఞాన నిత్యత్వం తత్త్వ జ్ఞానార్థ దర్శనమ్,
ఏతత్ జ్ఞానమితి ప్రోక్త మజ్ఞానం యదతోఽన్యథా. 11

అధ్యాత్మ జ్ఞానమే నిత్యమను భావన, తత్వ జ్ఞానముయొక్క ప్రయోజనమును గ్రహించుట ఈ అన్నిటిని జ్ఞానమనెదరు. దీనికంటె భిన్నమైనది అజ్ఞానము.

### జ్ఞేయ బ్రహ్మ తత్వోపదేశము

జ్ఞేయం యత్త త్ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వాఽమృత మశ్నుతే,
అనాదిమ త్పరం బ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే. 12

ఇక జ్ఞేయ మేది యను దానిని చెప్పెదను. దానిని దెలిసి మనుష్యుడు అమృతత్వమును (ముక్తిని) బడయును. అది అనాదియగు బ్రహ్మము. అది సత్తనియు చెప్పబడదు. అసత్తనియు చెప్పబడదు.

బ్రహ్మమునకు ఏ విశేషమును లేదని చెప్పుట వలననే అద్దానిని తెలుప వలయునని "అది సత్తు గాదు; అసత్తు గా"దని చెప్పబడినది. తాత్పర్యమేమన అది అసాధారణవస్తుతత్వము పరమును నిరతిశయము నగు బ్రహ్మము.

మఱియు ఏ కారణముచే జ్ఞేయ బ్రహ్మము సత్తనియు అసత్తనియు చెప్పబడదో, అనగా భావాభావ ధర్మముల కాశ్రయము గాదో ఆ కారణముచే ఏ యొక శబ్ద శక్యార్థమగు ముఖ్యవృత్తిచే

(వాచ్యార్థముచే) తెలియ బడదు. ఉన్నది లేదు అను నీ శబ్దప్రవృత్తికి జాతి, గుణ, క్రియ, సంబంధములను నాలుగు హేతువు లుండవలయును. జ్ఞేయ స్వరూపమగు బ్రహ్మమునందు ఈ విషయము లేవియును లేవని అర్థము. ప్రవక్ష్యామి-లెస్సగా చెప్పుట యనగా చెప్పుటకు రాని స్వానుభవసిద్ధమైన బ్రహ్మమును కేవల తాత్పర్యవృత్తిచే గ్రహించునటుల చేయుట యని అర్థము.

తటస్థ లక్షణముచే బ్రహ్మాస్తిత్వ నిరూపణము

సర్వతః పాణి పాదం తత్సర్వతోఽక్షి శిరోముఖమ్,
సర్వతః శ్రుతిమల్లోకే సర్వ మావృత్య తిష్ఠతి. 13

దానికి అన్ని వైపుల చేతులు, కాళ్ళు, శిరస్సులు, ముఖములు, చెవులును గలవు. అది లోకమునం దంతటను వ్యాపించి యున్నది.

సాంప్రదాయికమగు అధ్యారోపాపవాద ప్రక్రియచే అవయవవంతమగు ప్రాణుల దేహేంద్రియాది ఉపాధులచే క్షేత్రజ్ఞాత్మయొక్క ఉనికియు క్షేత్రోపహిత మయినందు వలన ఆ బ్రహ్మమునకు క్షేత్రజ్ఞుడను నామము ఔపచారికముగ కల్పింప బడిన విషయము తటస్థలక్షణముచే ఇందు తెలుప బడినదని భావము.

సర్వేంద్రియ గుణాభాసం సర్వేంద్రియ వివర్జితమ్,
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణ భోక్తృచ. 14

పై నిరూపింప బడిన బ్రహ్మతత్వము సర్వేంద్రియ గుణాభాసమైనను సర్వేంద్రియ గుణ రహితము. అసక్తమై యుండియు సర్వమునకాధారమై యున్నది. అది నిర్గుణమై యుండియు గుణభోక్తయై యున్నది.

గుణ శూన్యమగు పరబ్రహ్మము జ్ఞాన కర్మేంద్రియాది సర్వ గుణ కర్మ ధర్మములకు విలక్షణమును, ప్రకాశకమునై సన్నిధాన మాత్రమున సర్వగుణ కర్మ ధర్మాశ్రయమునై యున్నదని భావము.

బహి రంతశ్చ భూతానా మచరం చరమేవచ,
సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం దూరస్థం చాంతికే చ తత్. 15

అది భూతముల లోపలను వెలుపలను ఉన్నది. అది అచరమును చరమునై యున్నది. (జడ చేతన ప్రాణివర్గమునై యున్నది). అత్యంత సూక్ష్మమై యున్నందువలన అది అజ్ఞేయము తెలియబడదు. అది దూరము సమీపమునై యున్నది.

దేహేంద్రియాదుల ఉపాధిమూలమున నే వ్యాపకమగు పరబ్రహ్మ వస్తువునకు లోపల వెలుపల యనునది కల్పన యనియు, బుద్ధీంద్రియాదుల కగోచరమై స్వరూపముచేనున్నందున ఆకాశమువలె సూక్ష్మ మనియు, అవిజ్ఞేయ మనియు. జ్ఞానులకు ఇదంతయును ఆత్మయే, గాన సమీప మనియు అజ్ఞులకు జ్ఞానదృష్టి లేనందువలన దూరమనియు చెప్ప బడినదని భావము.

ఆత్మయందు భేదము లేదు. అది ఏకము

అవిభక్తం చ భూతేషు విభక్త మివ చ స్థితమ్,
భూత భర్తృ చ తజ్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ. 16

అది అవిభాజ్య మయినను, భూతములయందు విభజింపబడిన దానివలె నున్నది. అదియే భూతములయొక్క ఆధారము. భూతముల మ్రింగునదియు (ధ్వంస మొనర్చు నదియు) మరల ఉత్పన్నము జేయు నదియునై యున్నది.

ఉత్పత్తి స్థితి లయాధారము పరబ్రహ్మమే. భూతముల మూలమున విభజింపబడిన దానివలె నగపడుచునే అవిభాజ్యమై యున్నది. అది ఏకము. అట్టి ఆత్మ ఏకమని తెలియ నందువలన జాగ్రదాద్యనేకావస్థలుగా నగపడు చున్నది. ఆత్మ పరిణామ రహితము, అద్వయమునని అర్థము.

అవ : జ్ఞానముచే సంప్రాప్తమగు పరమ ప్రకాశమైన జ్ఞేయ బ్రహ్మ తత్త్వ నిరూపణము గావించుచున్నారు.

జ్యోతిషా మపి తజ్జ్యోతి స్తమసః పర ముచ్యతే.
జ్ఞానం జ్ఞేయ జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్. 17

అది సమస్త జ్యోతుల యందును ఉత్కృష్టమగు జ్యోతి. తేజోమయము. అది తమస్సున కతీతము. అదే జ్ఞానము. తెలియదగినది.

జ్ఞానముచే తెలియబడు వస్తువు. అనుభవముచే స్వసంవేద్యమగు వస్తువు. అది సర్వుల హృదయమునందు అనగా అంతఃకరణము నందు గలదు.

జ్యోతులనగా వెలుపల సూర్య చంద్రాగ్న్యాదులు, అంతరమున మనోవాగాదులును ప్రకాశకములై యున్నవి. ఏ మహాజ్యోతి వలన ఈ సమస్తమును ప్రకాశవంతమై యున్నదో అదియే స్వయం ప్రకాశమగు ఆత్మజ్యోతి యని, అలుప్త ప్రకాశమని చెప్పబడుచున్నది. ఈ జ్ఞేయమే స్వరూపముచే అనుభవ మైనచో జ్ఞానముయొక్క ఫలమని చెప్పబడు చున్నందు వలన జ్ఞానగమ్య మని పిలువ బడును. ఇంకను తెలియ వలసినదిగా నుండినపుడు జ్ఞేయమని చెప్పబడునని భావము. లేక అమానిత్వాది సద్గుణములచే నొప్పు హృదయమున వాక్యార్థశ్రవణముచే కలుగు బ్రహ్మాకారాకారితాంతఃకరణవృత్తిచే జ్ఞేయము అనుభూయమాన మగుచున్నందువలన జ్ఞాన గమ్యమని చెప్పబడును.

అవ : క్షేత్రము, జ్ఞానము, జ్ఞేయమను నీ తత్త్వమును చక్కగా దెలియ బ్రహ్మత్వము సిద్ధించు ననుచున్నారు.

ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః,
మద్భక్త ఏతద్విజ్ఞాయ మద్భావాయోపపద్యతే. 18

ఈ విధముగా క్షేత్రమును గురించియు జ్ఞానమును గురించియు జ్ఞేయమును గురించియు సంక్షేపముగ చెప్పబడినది. నా భక్తుడీ జ్ఞానమును బడసి స్వరూపస్థితిని పొందును.

ఇదియే సర్వవేదములయొక్క అర్థము. ఈ గీతార్థము నిదియే యియున్నదను విషయము చెప్పబడినది. [ఏతావాన్ హి సర్వో వేదార్థో గీతార్థశ్చ ఉపసంహృత్య ఉక్తః]

ఈశ్వరుడను, సర్వజ్ఞుడను, పరమ గురువను, వాసుదేవుడను ఐన నాయందు సర్వసమర్పణ బుద్ధిగలవాడై దేనిని చూచునో వినునో స్పృశించునో యాసర్వమును అధిష్ఠానమగు సద్రూప బ్రహ్మమే యను దివ్యదృష్టి గలవాడు మద్భక్తుడు. ఇట్టివాడు ముక్తి నొందును. ఇలను

గౌణభక్తుడు కాడు. మోక్షార్హుడై మోక్షము నొందు పరమ భక్తుడని భావము.

అవ : ప్రకృతి పురుషులు అనాదియైన తత్త్వములు. ప్రకృతి యందలి గుణసంగముచేతనే జీవునకు బంధ ప్రతీతి యనుచున్నారు.

ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి,
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతి సంభవాన్. 19

ప్రకృతి, మఱియు పురుషుడు ఈ రెండును అనాదిగా నున్నవని తెలియుము. వికారములును గుణములును ప్రకృతిచే పుట్టినవని తెలియుము.

ఇచ్చట ప్రకృతి యనగా అపరా ప్రకృతి. సత్త్వ రజస్తమో గుణాత్మకమైన సామ్యావస్థ. పురుషుడనగా 'జీవుడు, క్షేత్రజ్ఞుడు, భోక్త' ఇత్యాదిగా చెప్పబడు చేతనము. పరబ్రహ్మమునందు ఈశ్వరత్వము లేదు. ప్రకృతి పురుషులను ఉపాధి మూలమున నిర్గుణమగు పరబ్రహ్మము ఈశ్వరుడని చెప్పబడును. ప్రకృతిమూలముననే అతడు జగత్కారణమనియు చెప్పబడును.

ప్రకృతి, అవిద్య ఇవి రెండును అధిష్ఠానమగు బ్రహ్మజ్ఞానముచే అవిద్యా నివృత్తి ద్వారా బాధ యోగ్యములై యున్నవని తెలియవలయును.

ఆది లేకయు బ్రహ్మజ్ఞానముచే అంతము నొందు అనాది షట్కము – ? జీవ, ఈశ, జగత్తులు, మాయ, అవిద్య, కాలము.

కార్య కరణ కర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే,
పురుష స్సుఖ దుఃఖానాం భోక్తృత్వే హేతు రుచ్యతే. 20

ప్రకృతియే కార్య కారణ కర్తృత్వమునకు హేతువని చెప్పుదురు. పురుషుడు సుఖదుఃఖముల భోక్తృత్వమునకు హేతువని చెప్పబడును.

భోగ్య పదార్థముల కల్పనకు త్రిగుణాత్మికమగు ప్రకృతియే హేతువు. దేహేంద్రియాది మూలమున భోగ్య పదార్థములచే గలుగు సుఖదుఃఖానుభవములకు భోక్తృరూపమున పురుషుడు హేతు వగుచు

న్నాడు. పురుషుడు సుఖ దుఃఖముల ననుభవించు చుండుటే అతని సంసారమని అర్థము. [పురుషస్య చ సుఖదుఃఖానాం సంభోక్తృత్వం సంసారిత్వమ్ ఇతి.]

అవ : ప్రకృతియందలి గుణసంగముచేతనే పురుషునకు నానాయోని పరిభ్రమణ మనుచున్నారు.

పురుషః ప్రకృతిస్థో హి భుంక్తే ప్రకృతిజాన్ గుణాన్,
కారణం గుణసంగోఽస్య సదసద్యోని జన్మసు. 21

పురుషుడు ప్రకృతియం దుండియే ప్రకృతిచే పుట్టిన గుణకర్మ ఫలముల నుపభోగించు చుండును. గుణములతోడి సంగమే (సంబంధమే) పురుషుని మంచి చెడ్డ (ఉత్తమాధమ) జన్మములకు కారణము.

క్షేత్రజ్ఞుని ప్రభావము

ఉపద్రష్టాఽనుమంతా చ భర్తా భోక్తా మహేశ్వరః,
పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః. 22

ఈ దేహమునందు సమీపమున నుండి చూచువాడును, అనుమతించు వాడును, పోషించు వాడును, భుజించు వాడును, మహేశ్వరుడునైయున్న ఇతనినే పరమ పురుషు డందురు.

అంతరమున (సమీపముగ) తనకంటె మఱియొకడు లేక ప్రత్యగాత్మయై తానే తన సాక్షిత్వమున సర్వేంద్రియ వ్యాపారములు జరుగుచుండ తా నసంగుడై చూచుచుండుటవలన ఉపద్రష్టయనియు, సర్వకార్యములు తన అంగీకారము చేతనే (ఆత్మాశ్రయముననే) జరుగుచున్నందు వలన అనుమంత యనియు, సమస్త చరాచర జగత్ స్థితి ధారణచే భర్తయనియు, సర్వానందానుభవ చైతన్య రూపముచే నొప్పు కారణమున భోక్తయనియు, ఆత్మరూపమున స్వతంత్రుడై సర్వజగన్నియామకత్వముచే నుండు కారణమున మహేశ్వరుడనియు, ఈపై లక్షణములచే ఇట్లు ఒప్పారుచు ఈ కల్పిత సర్వోపాధి వినిర్ముక్తుడైన పరుడగు పురుషుడు పరమాత్మయనియు, నిత్య ముక్త ఏకమేవాద్వితీయ స్వరూపుడనియు శ్రుతి తెలుపుచున్నది.

ప్రకృతి పురుషులను తత్త్వతః తెలియుటచే కలుగు ఫలము

యం ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైస్సహ,
సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే. 23

ఎవడు ఈ విధముగా పురుషుని, ప్రకృతిని గుణములతో సహా తెలియునో అతడేవిధముగ వర్తించుచుండినను పునర్జన్మ నొందడు.

యథార్థమగు తత్త్వము నెఱిగిన తత్త్వవిదునకు కార్యసహిత కారణాజ్ఞాన నివృత్తియై యుండుటచేత నతనివలన కర్మలోప ముండదు. పుణ్యకర్మనే చేయడు అన్నపుడు పాపకర్మ నెటుల జేయును? సుతరాం చేయడు. అతడెట్లుండినను మరల జన్మమరణాది దుఃఖములను బొందడు.

భగవత్తత్వమును దెలియుటకు మూడు మార్గములు

ధ్యానేనాత్మని పశ్యంతి కేచి దాత్మాన మాత్మనా,
అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే. 24

కొందఱు ధ్యానము చేత ఆత్మను ఆత్మయందే చూతురు. కొందఱు సాంఖ్యయోగము చేతను, మఱి కొందఱు కర్మయోగము చేతను ఆత్మజ్ఞానమును పొందుదురు.

ఆత్మ తత్త్వ శ్రవణముచే సంసారోత్తారణమగును

అన్యేత్వేవమజానంతః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే,
తేఽపి చాతితరంత్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః. 25

ఇక కొందఱు దాని నెఱుగక వేఱొకరు చెప్పినదానిని విని ఉపాసింతురు. శ్రుతి పరాయణులగు వారు కూడ మృత్యువును దాటుదురు.

శ్రుతిని గురుముఖమున విని తన్నిష్ఠను బొంది జన్మ జరామరణ దుఃఖముల నుండి నివృత్తు లగుదురు. అమృతత్వమును బొందుదురని భావము.

క్షేత్ర క్షేత్రజ్ఞుల సంయోగముచే సమస్త జగదుత్పత్తి

యావత్సంజాయతే కించిత్సత్త్వం స్థావర జంగమమ్,
క్షేత్ర క్షేత్రజ్ఞ సంయోగా త్తద్విద్ధి భరతర్షభ. 26

స్థావర జంగమాత్మకమగు యత్కించిత్ పదార్థము కలిగె నన్న ఉత్పన్న మాయెనన్న ఓ పార్థా! అది క్షేత్ర క్షేత్రజ్ఞుల యొక్క సంయోగము వలననే ఉత్పన్న మగునని తెలియుము.

వేఱు వేఱు స్వభావములు గలిగిన క్షేత్ర క్షేత్రజ్ఞుల యొక్క యథార్థస్వరూపమును తెలియక స్వరూపాజ్ఞానముచే నేర్పడిన అధ్యాసమే ఇందులకు కారణమని తెలియ వలయును. శు_క్తిరజతవత్.

సమ్యక్జ్ఞాని లక్షణము

సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరమ్,
వినశ్యత్స్వవినశ్యంతం యః పశ్యతి స పశ్యతి. 27

సర్వ భూతముల యందు తాను సమమై యుండి అవి నాశ మొందినను తాను నాశమొందక యుండు పరమేశ్వర త_త్త్వమును ఎవడు తెలిసికొనునో అతడే త_త్త్వమును చక్కగా తెలిసిన నిజమగు జ్ఞాని.

సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థిత మీశ్వరమ్,
న హినస్త్యాత్మనాఽఽత్మానం తతో యాతి పరాంగతిమ్. 28

సర్వత్ర సమమై యుండు పరబ్రహ్మత_త్త్వ సాక్షాత్కార మొందిన వాడు తన ఆత్మను అనగా తన్ను తాను చంపుకొనడు. పరమగతిని బడయును. స్వస్వరూపస్థితి నొందును.

తానైన ఆత్మ దప్ప అన్యము లేదను బ్రాహ్మీదృష్టి గల సమదర్శికి చంపుట చంపుకొనుట యను వ్యవధానము లేదు. పరమపద స్థితి నొంది యుండునని అర్థము. స్వదేహమైన కరచరణాద్యవయవముల యందు భిన్న భావన ఏర్పడని యట్లు అన్య క్రియా కారక ఫలసాధన సాధ్యములచే కలుగు వేఱొక ఫల మతనికి ఉండదు. తాత్పర్య మేమన దేహాత్మవాదులు, భిన్నాత్మవాదులు వీరు అజ్ఞులు గావున ఆత్మ ఘాతకులు. తమ్మే తాము చంపుకొనిన వారని భావము.

ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః,
యః పశ్యతి తథాఽఽత్మాన మకర్తారం స పశ్యతి. 29

అన్ని విధముల కర్మలు ప్రకృతి చేతనే చేయబడుచున్నవి. ఆత్మ

అకర్త యని చక్కగా నెవ డెఱుగునో అతడే జ్ఞాని. తెలిసిన వాడు.

యదా భూత పృథగ్భావ మేకస్థ మనుపశ్యతి,
తత ఏవ చ విస్తారం బ్రహ్మ సంపద్యతే తదా. 30

ఎపుడు ఎవడు ఈ భూతములయొక్క నానాత్వమును ఒక్కని యందున్న దానినిగా దర్శించునో, ఒక్కనినుండియే ఈ సమస్తము విస్తృతమయి యున్నదని తెలియునో అప్పు డతడు బ్రహ్మానుభూతి నొందిన వాడగును.

శాస్త్రాచార్యోపదేశానుసారముగ ఇదంతయును అనగా ఈ ద్వైత విస్తారమంతయును ఆత్మ మయమే నని తనకంటె భిన్నము గాదని ఎప్పుడు గాంచునో అప్పుడు అద్వితీయ బ్రహ్మానుభూతి నొందిన వాడని తాత్పర్యము.

అవ : బ్రహ్మతత్త్వమైన ఆత్మతత్త్వము గుణాతీత మైనందున ఆత్మకు కర్తృత్వము లేదని తెలుపుచున్నారు.

అనాదిత్వాన్నిర్గుణత్వా త్పరమాత్మాఽయ మవ్యయః,
శరీరస్థోఽపి కౌంతేయ న కరోతి న లిప్యతే. 31

అనాదియు నిర్గుణుడు నయి యున్నందువలన ఈ అవ్యయ పరమాత్మ శరీరము నందుండినను దేనిని చేయడు. దేనిచేతను లిప్తుడు గాడు.

ఈ అపూర్వమగు ఆత్మతత్త్వమును (ఉపనిషద్దర్శనమును) న్యాయ వైశేషిక సాంఖ్య బౌద్ధాది మతములవారు తమ బుద్ధినే ప్రమాణముగ నంగీకరించి నందువలన అవ్యయ వ్యాపక నిర్గుణాత్మ తత్త్వమును గనలేక విడిచిరని చెప్పబడియున్నది. [భగవత్ప్రోక్తం ఔపనిషదం దర్శనం పరిత్యక్తం వైశేషిక సాంఖ్యార్హత బౌద్ధైశ్చ]

కావున ఇట్టి అపూర్వానుభవియగు ఆత్మజ్ఞానియందు కర్తృత్వ భోక్తృత్వములు లేవని అర్థము.

అవ : ఆకాశోపమానముచే ఆత్మయొక్క నిర్లేపత్వమును నిరూపించుచున్నారు.

యథా సర్వగతం సౌక్ష్మ్యా దాకాశం నోపలిప్యతే,
సర్వత్రావస్థితో దేహే తథాఽఽత్మా నోపలిప్యతే. 32

ఎట్లు సర్వవ్యాపి యగు ఆకాశము తన సూక్ష్మత వలన దేని చేతను లిప్తముగాదో అటువలె దేహము నందు వ్యాపించి యున్నను అసంగమును సర్వవ్యాపకము నగు ఆత్మ లిప్తుడుగాడు.

అవ : ఆదిత్యోపమానముచే ఆత్మయొక్క ప్రకాశకత్వమును నిరూపించుచున్నారు.

యథా ప్రకాశయత్యేకః కృత్స్నం లోక మిమం రవిః,
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత. 33

ఒకే సూర్యు డీలోకమెల్ల ప్రకాశింప జేయునట్లు పార్థా! క్షేత్రజ్ఞాత్మ ఈ సమస్త క్షేత్రమును ప్రకాశింపజేయును.

అవ : క్షేత్ర క్షేత్రజ్ఞుల యొక్క భేదమును, ప్రకృతినుండి విడువబడు నుపాయమును తెలిసి నందువలన గలుగు ఫలము.

క్షేత్ర క్షేత్రజ్ఞయో రేవ మంతరం జ్ఞానచక్షుషా,
భూత ప్రకృతి మోక్షం చ యే విదుర్యాంతి తే పరమ్. 34

జ్ఞానమయమగు చక్షుస్సుచే క్షేత్ర క్షేత్రజ్ఞుల యందుండు ఈ అంతరమును (ఈ భేదమును) భూతప్రకృతులచే విడివడు నుపాయమును, మోక్ష తత్త్వమును ఎవరు తెలిసి కొందురో వారు పరమపదమును బడయుదురు.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే క్షేత్రక్షేత్రజ్ఞ విభాగ యోగోనామ త్రయోదశోఽధ్యాయః.



ఓమ్

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

## శ్రీమద్భగవద్గీత - చతుర్దశాధ్యాయము

అవ : ఈశ్వరాధీనమైయుండు క్షేత్ర క్షేత్రజ్ఞులు జగత్కారణమే గాని సాంఖ్యులు చెప్పు స్వతంత్రమై యుండు ప్రకృతి పురుషులు గాదని నిరూపింపబడినది. ఇక ప్రకృతియం దుండుచు గుణములతోడి సంబంధమే సంసార కారణమని చెప్పుచు గుణము [illegible] ఎట్లు సంబంధ

మేర్పడును ? అవి దేహి నేప్రకారము బంధించును? మఱియు నా గుణ ములనుండి విముక్తి ఎట్లు? ముక్తుని లక్షణము లేవి? యను నీ విషయము లీ అధ్యాయమున వివరింపబడుచున్నవి.

శ్రీ భగవానువాచ :

పరం భూయం ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞాన ముత్తమమ్,
యజ్జ్ఞాత్వా మునయస్సర్వే పరాం సిద్ధి మితో గతాః. 1

ఏ జ్ఞానమును బొంది సర్వమునులు ఈ లోకమున పరమ సిద్ధిని బడసిరో ఆ ఉత్తమమగు పరమార్థ జ్ఞానమును గుఱించి మరల నీకు జెప్పెదను.

ఇదం జ్ఞాన ముపాశ్రిత్య మమ సాధర్మ్య మాగతాః,
సర్గేఽపి నోపజాయంతే ప్రళయే న వ్యథంతి చ. 2

ఈజ్ఞానము నాశ్రయించి నా సాధర్మ్యమును అనగా మత్స్వరూపానుభవము నొందిన వారు మరల సృష్టి సమయమున బుట్టుటయు లేదు. ప్రళయమున వ్యథ నొందుటయును లేదు.

ఇచ్చట సాధర్మ్య మనగా మత్స్వరూపానుభవము నొందిన వారనియే అర్థముగాని నా సమానమగు ధర్మమును పొందిన వారని అర్థము గాదు. ఎందుకనగా, ఈ గీతాశాస్త్రమునందు క్షేత్రజ్ఞుడు మఱియు ఈశ్వరుడు వీరికి భేదమున్నదని చెప్పుట లేదు. ఇంతేగాక జ్ఞానముయొక్క మహిమను తెలుపుటయే ఇందలి ఉద్దేశ్యము.

అవ : ప్రకృతి పురుషుల సంయోగముచే బీజ ప్రదాతనగు నా నుండి సర్వభూతముల ఉత్పత్తి యగు ననుచున్నారు.

మమ యోని ర్మహద్బ్రహ్మ తస్మిన్గర్భం దధామ్యహమ్,
సంభవ స్సర్వ భూతానాం తతో భవతి భారత .3

భారతా ! మహద్బ్రహ్మము అనగా మూలప్రకృతి జనన స్థానము. అచ్చట నేను గర్భము (తేజస్సు) నుంచెదను. దానినుండి హిరణ్యగర్భాది అన్ని భూతములు ఉత్పత్తి యగును.

ప్రకృతి పురుష శక్తిద్వయ యుక్తుడనగు ఈశ్వరుడనైన నేను

జీవుల అవిద్యా కామ కర్మానుసారముగ ఈ రెండిటిని సంయోగ పఱచెదనని అర్థము.

సర్వయోనిషు కౌంతేయ మూర్తయ స్సంభవంతి యాః,
తాసాం బ్రహ్మ మహద్యోని రహం బీజప్రదః పితా. 4

కౌంతేయా! సర్వ యోనుల యందును పుట్టు మూర్తుల (ప్రాణుల) జన్మస్థానము మహద్బ్రహ్మమే (ప్రకృతియే) యని తెలియుము. నేనే తద్బీజ ప్రదాతనగు తండ్రిని.

అవ : ప్రకృతిచే గలిగిన త్రిగుణముల వలన జీవాత్మ బంధింప బడిన వాని వలె నున్నాడని వివరించుచున్నారు.

సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతి సంభవాః,
నిబధ్నంతి మహాబాహో దేహే దేహిన మవ్యయమ్. 5

మహాబాహూ! ప్రకృతినుండి (విశేష రూపమున) పుట్టు సత్వరజస్తమోగుణములు అవ్యయ మగు ఆత్మను (దేహిని) ఈ దేహమునందు బంధించును.

వస్తుతః గుణరహితుడగు ఆత్మకు గుణములచే బంధము లేక పోయినను ప్రకృతిస్థమగు దేహ సంబంధముచే దేహి బంధింపబడిన వాని వలె నున్నాడని తెలియవలెను.

అవ : సత్వ రజ స్తమో గుణములు జీవాత్మ నెట్లు బధించు ననునది చెప్పుచున్నారు.

తత్రసత్త్వం నిర్మలత్వా త్ప్రకాశక మనామయమ్,
సుఖసంగేన బధ్నాతి జ్ఞానసంగేన చానఘ. 6

వాటియందు సత్వగుణము నిర్మలమై యున్నందువలన ప్రకాశకత్వమును నిర్మలత్వమును గలదియై ఆత్మను సుఖము మఱియు జ్ఞానమను వీటి సంగముచే బంధించును.

రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసంగ సముద్భవమ్,
తన్నిబధ్నాతి కౌంతేయ కర్మసంగేన దేహినమ్. 7

రజోగుణము రాగాత్మకమైన దని తెలియుము. ఇది ఆశ, ఆస క్తిని కలుగజేయును. కర్మాసక్తిమూలమున ఆత్మను బంధించును.

తమస్త్వ జ్ఞానజం విద్ధి మోహనం సర్వ దేహినామ్,
ప్రమాదాలస్య నిద్రాభి స్తన్నిబధ్నాతి భారత. 8.

అజ్ఞానముచే ఉత్పన్నమగు తమస్సు సర్వాత్మలను (జీవులను) మోహముచే బంధించును. ఓ భారతా! ఇది ఆత్మను ప్రమాదాలస్య నిద్రాదులచే బంధించును.

మూడు గుణముల కార్యము

సత్త్వం సుఖే సంజయతి రజః కర్మణి భారత,
జ్ఞాన మావృత్య తు తమః ప్రమాదే సంజయత్యుత. 9

సత్త్వగుణము సుఖము నందును రజోగుణము కర్మయందును తమస్సన్ననో జ్ఞానమును మూయుచు *ప్రమాదమునందును సంగ మును సంబంధమును గలిగించును.

ఒక గుణము మఱొక గుణము నణచివేయ జూచును

రజస్తమ శ్చాభిభూయ సత్త్వం భవతి భారత,
రజస్సత్త్వం తమ శ్చైవ తమస్సత్త్వం రజస్తథా. 10

భారతా! రజస్తమస్సుల నణచి సత్త్వమును, రజస్సత్త్వముల నణచి తమస్సును, తమస్సత్త్వములను ఓడించి రజస్సును, ఇట్లు ఒక దానికంటె నొకటి వృద్ధిని గాంచజూచును.

త్రిగుణములలో ఒకొకటి వృద్ధి నొందినపుడుండు లక్షణములు

సర్వద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే,
జ్ఞానం యదా తదా విద్యా ద్వివృద్ధం సత్త్వ మిత్యుత. 11

ఈ దేహముయొక్క సర్వేంద్రియములయందు ప్రకాశము అనగా జ్ఞానము వెలుగొంద నారంభించినప్పుడు సత్వగుణ మధిక మైన దని తెలియవలెను.

---

* అవశ్య కర్తవ్యమైన దానివిషయమై సోమరితనము

లోభః ప్రవృత్తి రారంభః కర్మణా మశమస్స్పృహా,
రజస్యేతాని జాయంతే వివృద్ధే భరతర్షభ. 12

భరతర్షభా! రజోగుణ మధికమైన లోభము, కర్మప్రవృత్తియు కర్మారంభము, ఉపశమము లేకుండుట, ఇచ్ఛ ఇవి ఉత్పన్నమగును.

అప్రకాశోఽ ప్రవృత్తి శ్చ ప్రమాదో మోహ ఏవచ,
తమస్యేతాని జాయంతే వివృద్ధే కురునందన. 13

కురునందనా! తమోగుణ మధిక మయిన అప్రకాశము, అప్రవృత్తి, ప్రమాదము (తప్పు తెలివి), మోహము ఇత్యాదులు కలుగును.

అవ : ఆ యా గుణము అభివృద్ధి నొంది యుండు సమయమున మరణించువారికి గలుగు ఫలములు

యదా సత్త్వే ప్రవృద్ధే తు ప్రళయం యాతి దేహభృత్,
తదోత్తమవిదాం లోకా నమలా న్ప్రతిపద్యతే. 14

సత్త్వ గుణ మధిక మైనవుడు దేహధారి యగు ప్రాణి మరణించినచో జ్ఞానుల యొక్క నిర్మల లోక మతనికి ప్రాప్తమగును.

రజసి ప్రళయం గత్వా కర్మసంగిషు జాయతే,
తథా ప్రలీన స్తమసి మూఢయోనిషు జాయతే. 15

రజోగుణ మధిక మైనపుడు మరణించిన మనుష్యునకు (కర్మ సంగులు) కర్మాసక్తులగు జనులయందు జన్మ యగును. తమోగుణ మధిక మైనపుడు మరణము గలిగిన మూఢయోనుల యందు జన్మించును.

సత్త్వ రజ స్తమో గుణముల యొక్క ఫలము

కర్మణ స్సుకృతస్యాహు స్సాత్త్వికం నిర్మలం ఫలమ్,
రజసస్తు ఫలం దుఃఖ మజ్ఞానం తమసః ఫలమ్. 16

పుణ్యకర్మఫలము సాత్వికము, పవిత్రము. రాజసకర్మఫలము దుఃఖదాయకము. తామస కర్మ ఫలము అజ్ఞాన మయియున్నది.

గుణత్రయముచే గలుగు ఉపగుణములు

సత్త్వా త్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవచ,
ప్రమాద మోహౌ తమసో భవతోఽ జ్ఞానమేవచ. 17

సత్త్వగుణముచే జ్ఞానము, రజస్సుచే లోభము, తమస్సుచే ప్రమాద మోహములే గాక అజ్ఞానమును కలుగు చున్నది.

గుణ త్రయ వృత్తులచే గలుగు గతులు

ఊర్ధ్వం గచ్ఛంతి సత్త్వస్థా మధ్యే తిష్ఠంతి రాజసాః,
జఘన్య గుణ వృత్తిస్థా అధో గచ్ఛంతి తామసాః. 18

సాత్త్వికులు పైలోకములకు బోవుదురు. రాజసులు మధ్య లోకమున అనగా మానవలోకమున నిల్తురు. తమోగుణము గలవారు అధోలోకమునకు బోవుదురు. అనగా పశు పక్షి క్రిమి కీటకాది జన్మ లెత్తుదురు.

అవ : ఆత్మ అకర్త, మఱియు గుణాతీత మని తెలిసినచో నా ప్రాప్తి యగునను చున్నారు.

నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టాఽనుపశ్యతి,
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి. 19

మానవు డెపుడు గుణములను విడచి కర్త వేఱొక డెవడును లేడని తెలియునో అప్పుడు గుణముల కతీతమైన శ్రేష్ఠతత్త్వమును తెలియును. అనగా ఆత్మ తత్త్వము నరసి అప్పు డతడు మద్భావము నొందును.

గుణా నేతా నతీత్య త్రీన్ దేహీ దేహ సముద్భవాన్,
జన్మ మృత్యు జరాదుఃఖై ర్విముక్తోఽమృత మశ్నుతే. 20

దేహి దేహమునకు కారణమై యుండు ఈ మూడుగుణములను దాటిన జన్మ మృత్యు జరా దుఃఖములనుండి విడువబడి అమృత పదము నొందును.

గుణాతీతుడగు పురుషుని విషయమై అర్జునుని 3 ప్రశ్నలు

అర్జున ఉవాచ :

కైర్లింగై స్త్రీన్గుణా నేతా నతీతో భవతి ప్రభో,
కిమాచారః కథం చైతాం స్త్రీన్గుణా నతివర్తతే. 21

ప్రభూ! ఈ మూడు గుణముల నతిక్రమించిన వాడు ఏ లక్షణ

ములచే (గుఱుతుగలిగి) యుండును? అతని ఆచార మెట్లుండును? అత డీ త్రిగుణముల నెట్లు దాటును?

శ్రీభగవానువాచ :

ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహమేవ చ పాండవ,
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి. 22

పాండవా! ప్రకాశము, ప్రవృత్తి, మోహము అను నీ సత్త్వ రజస్తమో గుణములు ప్రాప్తమయిన (వచ్చిన) ద్వేషింపడు. పోయిన ఆశింపడు.

ఈ గుణాగుణముల సంయోగ వియోగములయందు ఆత్మ దృష్టిచే తా నసంగుడై గుణాతీతుడై యుండును. ఇది వెలుపల నగ పడు లక్షణము కాదు. ఆంతరంగికమగు తన స్వరూప స్వభావము.

అవ : ఒకటి, రెండు ప్రశ్నల కుత్తరముగా గుణాతీత పురుషుని యొక్క లక్షణము, మఱియు నతని ఆచరణమును గుఱించి తెలుపుచున్నారు.

ఉదాసీనవదాసీనో గుణైర్యో న విచాల్యతే,
గుణావర్తంత ఇత్యేవ యోఽవతిష్ఠతి నేంగతే. 23

ఉదాసీనునివలె నుండి ఈ గుణములచే ఎవడు వికారము నొందడో గుణములే గుణకార్యముల నాచరించు చున్నవని తెలిసి అచంచలుడై యుండునో,

సమ దుఃఖ సుఖ స్స్వస్థ స్సమ లోష్టాశ్మ కాంచనః,
తుల్య ప్రియాప్రియో ధీర స్తుల్యానిందాత్మసంస్తుతిః, 24

మఱియు ఎవనికి సుఖము, దుఃఖము, మన్ను, ఱాయి, బంగారము సమమో, ఎవడు తనయందు తానే స్థిరుడో, ఎవనికి ప్రియాప్రియములు, నిందాస్తుతులు సమానములైనవో, ఎవడు ధీరుడో,

మానావమానయో స్తుల్య స్తుల్యో మిత్రారి పక్షయోః,
సర్వారంభ పరిత్యాగీ గుణాతీత స్స ఉచ్యతే. 25

ఎవనికి మానావమానములు, శత్రు మిత్ర పక్షములు రెండును సమమో ఎవడు సమస్త కామ్య కర్మలను విడచి యున్నాడో అతడు గుణాతీతుడని చెప్పబడును.

అవ : మూడవ ప్రశ్న కుత్తరముగా నాయం దనన్య భక్తిచే గుణాతీతుడని తెలుపుచున్నారు.

మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే,
సగుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే. 26

ఎవడు అనన్య భావముచే భక్తియుక్తుడై నన్ను భజించునో అతడీ గుణములను దాటి బ్రహ్మ పదమును పొందుటకు సమర్థుడగును.

బ్రహ్మణో హి ప్రతిష్ఠాఽహ మమృతస్యా వ్యయస్య చ,
శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యైకాంతికస్య చ. 27

అమృతమును, అవ్యయము నయిన బ్రహ్మమునకు, శాశ్వత మగు ధర్మమునకు, ఐకాంతికమగు సుఖమునకు నేనే ఆశ్రయమయి యున్నాను.

అమృతము, అవ్యయము ఇత్యాది స్వభావముగల పరమాత్మకు ప్రత్యగాత్మయే ప్రతిష్ఠ (అభివ్యక్తస్థాన) మని గురూపదిష్ట శ్రుత్యర్థావలంబనమున గలుగు చక్కని జ్ఞానముచే ఈ ప్రత్యగాత్మయే పరమాత్మ యని నిశ్చయమగును. ఇదే వాక్యార్థ జన్య ప్రత్యగభిన్న పరబ్రహ్మానుభవ మని చెప్పబడును.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే గుణత్రయ విభాగయోగోనామ చతుర్దశోఽధ్యాయః

ఓమ్

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః.

## శ్రీమద్భగవద్గీత-పంచదశాధ్యాయము

అవ : విరక్తుడగు నాతడే భగవత్తత్త్వము నరయుట కధికారియగు ననుభావముతో వృక్షరూపముచే సంసారాభివర్ణనము చేయుచున్నారు.

శ్రీభగవానువాచ :

ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయమ్,
ఛందాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్. 1

అవినాశి యగు అశ్వత్థము వలె నున్న ఈ ప్రపంచ వృక్షము యొక్క వేళ్ళు పైకి, కొమ్మలు మాత్రము క్రిందికి గలవని శాస్త్రజ్ఞులు వర్ణింతురు. వేదములే దీనియొక్క ఆకులని చెప్పుదురు. దీనిని దెలిసిన వాడు వేదజ్ఞు డనబడును.

నిత్యమై అత్యంత సూక్ష్మమై, కారణమై బృహద్రూప మైనందువలన అవ్యక్త మాయాశక్తిగల బ్రహ్మము ఈ సంసార వృక్షమునకు మీదుగ నుండు కారణముచే ఇయ్యది ఊర్ధ్వమూలమని చెప్పబడును. అధఃశాఖ మనగా అహంకార తన్మాత్రలే మొదలుగా గలిగి సంసార రూపమున సంకీర్ణమై క్రిందికి ప్రాకి కొమ్మలవలె నున్నందున ఇయ్యది అధఃశాఖమ్ అని చెప్పబడుచున్నది. అశ్వత్థ మనగా [నశ్వోఽపి స్థాస్యతి అశ్వత్థః] శ్వః=రేపటికైనను; న తిష్ఠతి=ఉండునది కాదు. అనిత్యము క్షణ ప్రధ్వంసి యని అర్థము. ప్రవాహ రూపమున ఎడతెగక అనాదిగ నుండుటచే అవ్యయ మనియు చెప్పబడుచున్నది. కాని ఇది యథార్థ జ్ఞానముచే నివృత్తి నొందునదై యున్నదని తెలియవలయును.

సంసార వృక్షము యొక్క విస్తార వర్ణన

అనాసక్తి (అసంగ) శస్త్రముచే దీనిని ఛేదింపవలయునని తెలుపుచున్నారు.

అధశ్చోర్ధ్వం ప్రసృతాస్తస్య శాఖా
గుణ ప్రవృద్ధా విషయ ప్రవాళాః,
అధశ్చ మూలా న్యనుసంతతాని
కర్మానుబంధీని మనుష్యలోకే. 2

అయితే ఈ వృక్ష శాఖలు త్రిగుణములచే పోషింపబడిన విషయములచే గూడి, మీదను క్రిందను ఎల్లెడల వ్యాపించి యున్నవి. కర్మమయమగు దీనివేళ్లు మానవ లోక పర్యంతము క్రిందను వ్యాపించి యున్నవి.

న రూప మస్యేహ తథోపలభ్యతే
నాంతో న చాది ర్న చ సంప్రతిష్ఠా,

అశ్వత్థమేనం సువిరూఢమూల
మసంగ శస్త్రేణ దృఢేన ఛిత్త్వా. 3

ఈ లోకమునందు దీనియొక్క నిజరూపము అనగా నిద్దాని కుండు ఆది మధ్య అంత్యాధారము లగపడుట లేదు. భద్రముగ వేరు విడిచి యున్న ఈ అశ్వత్థమను వృక్షమును అనాసక్తియను ఖడ్గముచే ఖండించి,

తతః పదం తత్పరిమార్గితవ్యం
యస్మిన్గతా న నివర్తంతి భూయః,
తమేవచాఽద్యం పురుషం ప్రపద్యే
యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ. 4

ఆ పిదప ఎవనిచే ఈ సృష్టి ప్రవృత్తి గలిగెనో ఆ పురుషుని ఆశ్రయింతు ననెడి భావనచే ఏ అక్షయ పదమును పొందిన పిదప పునర్జన్మ లేదో ఆ పరమ పదమునే వెదకవలెను.

భగవత్ప్రాప్తి నొందు పురుషుల లక్షణము

నిర్మాన మోహా జిత సంగ దోషా
అధ్యాత్మ నిత్యా వినివృత్త కామాః,
ద్వంద్వై ర్విముక్తా స్సుఖ దుఃఖ సంజ్ఞై
ర్గచ్ఛంత్య మూఢాః పద మవ్యయం తత్. 5

మాన మోహములు లేని వారు ఆసక్తిని వీడిన వారు అధ్యాత్మ జ్ఞానమే నిత్యమను నిశ్చయము గలవారు కామములచే నివృత్తులైనవారు సుఖదుఃఖాది ద్వంద్వముల నతిక్రమించిన వారునైన అమూఢులు అనగా ఆత్మానాత్మ – వివేకులు ఆ అవ్యయ (శాశ్వత) పదమును పొందుదురు.

పరమ పదమగు నా స్థానము స్వప్రకాశము

న తద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః,
యద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ. 6

ఎచ్చట సూర్యుడు చంద్రుడు అగ్ని వీరెవరును వెలుగుట లేదో

ఏ పదమును పొందిన పిదప మానవులు మరల తిరిగి రారో అదే నా శ్రేష్ఠమగు స్థానము.

ఆ స్థానము ప్రత్యక్షాది ప్రమాణాంతర ప్రతిపాదితము గాని వాఙ్మనోతీతమైన స్వరూపమగు బ్రహ్మమని ఇందలి తాత్పర్యార్థము.

జీవాత్మ స్వరూపము అర్థాత్ "త్వం" పద వాచ్యము

మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః,
మనష్షష్ఠానీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి. 7

నా సనాతనమగు అంశమే జీవలోకమునందు జీవుడై ప్రకృతి యందు మనస్సుతో గూడి ఆఱు ఇంద్రియములను ఆకర్షించును.

ఇచ్చట నా యంశ మనగా అంశాంశి భావ సంబంధమగు విశిష్ట పరమైన అర్థము గాదు. అభేదార్థమే యని చక్కగ గ్రహించు కొన వలయును. పరమాత్మయగు నారాయణుడనైన నా యొక్క అంశము, భాగము, అవయవము అను నివి యన్నియును పర్యాయపదములు. కింతు ఇది అవధారణార్థము గాదు.

ఈ నా యంశము జీవలోకమున అనగా సంసారమునందు జీవ రూపమున కర్త, భోక్త యని సనాతనముగ అనాదియై యుండినది. ఎట్లు నీటి యందు ప్రతిఫలించిన సూర్య ప్రతిబింబము సూర్యాంశమై యుండి జలము లేక పోగా ప్రతిబింబము సూర్యునే చేరి తిరుగ రాక సూర్యునియం దభేదము నొందునో, మఱియు ఘటము మొదలగు వాటియం దుండిన ఆకాశము ఆకాశాంశమయ్యేయుండి ఘట నాశా నంతరము ఆకాశమును జేరి మరల వెనుదిరగని యట్లు, పరమాత్మాంశ మైన ఉపాధిమంతుడైన జీవుడు వాచ్యార్థమగు ఉపాధితో తాదా త్మ్యమును వీడి తన్ను దా దెలిసి పరమ పదము వడసిన పిదప మరల రాడని అర్థము. ఇచ్చట తాత్పర్యార్థ మేమన, అవిద్యా కల్పితమగు ఉపాధిమూలమున ఏక దేశముగ అంశమని కల్పింప బడినది. అంతే యని భావము.

వేదాంత ప్రక్రియల యందు ఈ రెండు ఉపమానములచే రెండు వాదము లేర్పడినవి. అవి ఆభాసవాదము, అవచ్ఛేదవాద మని చెప్పుదురు.

అవ : వాయు ఉపమానముచే జీవాత్మయొక్క గమనమును వర్ణించుచున్నారు.

శరీరం య దవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః,
గృహీత్వైతాని సంయాతి వాయు ర్గంధా నివాశయాత్. 8

గాలి పుష్ప స్థానము నందుండు సుగంధమును నలుదిశలకు దీసికొని పోవునట్లు ఈశ్వరాంశమగు జీవుడు శరీర ధారణము చేయునపుడు శరీరమును విడిచి పోవు నపుడును వీటిని అనగా ఈ మానసేంద్రియ విషయ వాసనలను గూడ తీసికొని వెళ్ళును.

ఇట్లు సూక్ష్మ దేహ వాసనా విశిష్టుడై జీవుడు గమనాగమనములను జేయునని భావము.

అవ : సర్వావస్థలయందుండు ఆత్మను మూఢు లెఱుగరు; జ్ఞాను లెఱుగుదు రని చెప్పు చున్నారు.

శ్రోత్రం చక్షు స్స్పర్శనం చ రసనం ఘ్రాణ మేవచ,
అధిష్ఠాయ మనశ్చాయం విషయా నుపసేవతే. 9

శ్రోత్ర త్వక్ చక్షుర్ జిహ్వా ఘ్రాణములు, మఱియు మనస్సు వీటియం దధిష్ఠితుడై ఇతడు విషయముల ననుభవించును.

ఉత్క్రామంతం స్థితం వాఽపి భుంజానం వా గుణాన్వితమ్,
విమూఢా నానుపశ్యంతి పశ్యంతి జ్ఞాన చక్షుషః. 10

ఇతడు దేహమును వీడి వెళ్ళునపుడేమి, దేహమునం దుండు నపుడేమి గుణయుక్తుడై విషయముల నుపభోగించు నపుడేమి మూఢులితని నెఱుగరు; కాని జ్ఞానులు నిర్వికారమగు ఈ ఆత్మను తమ స్వరూపముగ తెలియుదురు.

యతంతో యోగిన శ్చైనం పశ్యంత్యాత్మన్యవస్థితమ్,
యతంతోఽప్యకృతాత్మానో నైనం పశ్యంత్యచేతసః. 11

ఈ మార్గమున యత్నించుచుండు యోగులు ఈ ఆత్మను పరమాత్మనుగా గాంతురు. ఆత్మయందు పరమాత్మను జూతురు. అయితే మనో నిగ్రహము లేని అసమ్యగాత్ములగు బుద్ధిహీనులైన దుశ్చరితులు యత్నించినను ఈ యాత్మను గానరు.

సమస్త తేజస్సులు పరమేశ్వర తేజస్సులే

యదాదిత్య గతం తేజో జగద్భాసయతేఽఖిలమ్,
యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్. 12

సమస్త జగత్తును ప్రకాశింపజేయు సూర్యునియందుండు తేజస్సును మఱియు చంద్రుని యందును, అగ్నియందు నుండు తేజస్సేది గలదో ఆ తేజస్సు నా యదియే నని తెలియుము.

గామావిశ్యచ భూతాని ధారయామ్యహ మోజసా,
పుష్ణామి చౌషధీ స్సర్వా స్సోమో భూత్వా రసాత్మకః. 13

పృథివియందు ప్రవేశము జేసి నేను నా యొక్క తేజస్సుచే భూతములకు ఆధారుడ నగుదును. రసపూర్ణుడగు సస్యాధిపతియైన చంద్రుడనై అన్ని వనస్పతులను నేనే పోషింతును.

అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః,
ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్. 14

నేను వైశ్వానరాగ్నినై ప్రాణుల దేహమునం దుండి ప్రాణాపాన వాయువులతో గూడి నాలుగు విధములగు అన్నమును పచనమొనర్తును. (భక్ష్య, భోజ్య, లేహ్య, చోష్యములను చతుర్విధాన్నములు.)

ప్రభావ యుక్తముగ పరమేశ్వర తత్వ స్వరూపాను కథనము

సర్వస్య చాహం హృది సన్నివిష్టో
మత్తః స్మృతి ర్జ్ఞాన మపోహనం చ,
వేదైశ్చ సర్వై రహ మేవ వేద్యో
వేదాంతకృ ద్వేద విదేవ చాహమ్. 15

సర్వుల హృదయములయందు నే నున్నాను. స్మృతి, జ్ఞానము, విస్మరణము నా నుండియే కలుగును. సర్వ వేదములచే వేద్యమగు తత్వస్వరూపుడను నేనే. జ్ఞేయము నేనే. వేదాంతమును జేసినవాడను వేదజ్ఞుడను నేనే.

ఏకాక్షర స్వరూప నిర్ణయము

ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవచ,
క్షరస్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే. 16

ఈ లోకము నందు క్షరాక్షరులని ఇద్దఱు పురుషులు గలరు. క్షరుడనిన ఈ సమస్త భూతములు. అక్షర మనిన సర్వాధారమగు అవినాశియై యున్న మూల తత్త్వము కూటస్థుడు.

అక్షర మనిన ఈ భూతములయందు ప్రతిఫలన రూపముగా నున్న క్షేత్రజ్ఞుడు అక్షర శబ్దముచే చెప్పబడిన కూటస్థుడని తెలియ వలెను. కూటస్థు డనగా రాశివలె నుండునదియు, రాశి, లేక మాయ యనియు, వంచన మనియు, కుటిలిత యనియు ఇత్యాది పర్యాయపద ములచే చెప్పబడుచు, మాయ వంచన మొదలగు లక్షణములు గలిగి అనేక విధములుగ నుండుటయే ఇచ్చట కూటస్థ శబ్దార్థము ఈ సంసార బీజము అనంతమై యుండుట వలన సమసి పోపునది (తీరునది) కాదు గావున అక్షర పురుషు డనిపించు కొనుచున్నదని భావము.

అఖండ వాక్యార్థమగు పురుషోత్తమ లక్షణము.

ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః,
యో లోకత్రయ మావిశ్య భిభర్త్యవ్యయ ఈశ్వరః. 17

విలక్షణుడగు పరమాత్మ యని చెప్పబడు ఉత్తమ పురుషుడు వీటి (క్షరాక్షరములు) కంటెను వేఱు. అతనినే పరమాత్మ యందురు. అతడు అవ్యయుడు, ఈశ్వరుడు; లోకత్రయమును వ్యాపించి, వీటిని ధరించి యున్నాడు. పోషించుచున్నాడు.

ఇచ్చట అన్యమనగా పై క్షరాక్షర కల్పనలకంటె వేఱగు పురు షోత్తమ పరమార్థ తత్త్వమని గ్రాహ్యము.

పురుషోత్తమ తత్వోపదేశము

యస్మాత్క్షర మతీతోఽహ మక్షరాదపి చోత్తమః,
అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః. 18

క్షరమున కవ్వల నున్నవాడను, అక్షరమున కంటెను ఉత్తము డను అయియుండుట వలన లోకము నందును అటువలె వేదముల

యందును నేను పురుషోత్తముడ నని ప్రసిద్ధి నొందితిని.

యో మామేవ మసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్,
స సర్వవిద్భజతి మాం సర్వభావేన భారత. 19

ఓ భారతా! ఎవఁడు పురుషోత్తముడ నగు నన్ను తెలియునో అతడు సర్వజ్ఞుడై నన్ను సమగ్రమగు భావముచే భజించును.

ఇట్టి పురుషోత్తమాత్మ తత్త్వజ్ఞానము గలవాడు సర్వ భూతముల చేత సర్వత్ర పురుషోత్తముడనగు నన్నే దర్శించును. అర్థాత్ సర్వము చిద్వివర్తమే, చిద్విలాసమే, చిన్మాత్రమే యను అఖండదృష్టి గలిగి యుండునని అర్థము.

ఇతి గుహ్యతమం శాస్త్ర మిద ముక్తం మయాఽనఘ,
ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యా త్కృతకృత్యశ్చ భారత. 20

అనఘా! ఇట్లు పరమ గోప్య మైన గుహ్యతమ శాస్త్రమును నీకు జెప్పితిని. దీనిని దెలిసి (ఈ తత్త్వమును దెలిసి) బుద్ధి మంతుడు కృతకృత్యు డగును.

ఇయ్యది కేవల గురు శిష్య న్యాయమున గురు కృపాలబ్ధిచే అధికారి యగు, సచ్ఛిష్యునకు స్వసంవేద్యమగు ఉపనిషద్దర్శన మైన అపూర్వ తత్త్వము గాన గుహ్యతమ మని చెప్పబడినది.

గీతాశాస్త్ర మంతయును ఈ అధ్యాయము నందు సంక్షేప ముగ నుల్లేఖింప బడినది. ఈ మూలమున సర్వ వేదార్థములును సంపూర్ణ ము లయినవి.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే పురుషోత్తమ ప్రాప్తి యోగో నామ పంచదశోఽధ్యాయః.



ఓమ్

శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

# శ్రీమద్భగవద్గీత-షోడశాధ్యాయము

అవ : మానవునకు ఉండ దగినది దైవసంపద *యనియు అవశ్య మది సంపాద్య విషయ మనియు, ఆసురీ సంపద అయోగ్యము, మఱియు త్యాజ్యమునని ఈ అధ్యాయమున వివరింప బడుచున్నది.

శ్రీ భగవానువాచ :

అభయం సత్త్వ సంశుద్ధి ర్జ్ఞాన యోగ వ్యవస్థితిః,
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్. 1

భరత వంశోత్పన్నుడవగు నో యర్జునా! అభయము, సత్వ సంశుద్ధి, జ్ఞాన యోగము, అటువలె కర్మయోగము ఈ రెండు మార్గముల యోగ్యమగు వ్యవస్థయు, దానము, ఇంద్రియ దమనము, యజ్ఞము, వేదాధ్యయనము, తపస్సు, నిర్వక్ర స్వభావము,

అహింసా సత్య మక్రోధ స్త్యాగ శ్శాంతి రపైశునమ్,
దయా భూతే ష్వలోలు ప్త్వం మార్దవం హ్రీ రచాపలమ్. 2

అహింస, సత్యము, అస్తేయము, అక్రోధము, త్యాగము, శాంతి, ఉదారబుద్ధి, భూతదయ, అనాసక్తి, మృదుత్వము, లజ్జ, స్థిరత,

తేజః క్షమా ధృతి శ్శౌచ మద్రోహో నాతిమానితా,
భవంతి సంపదం దైవీ మభిజాతస్య భారత. 3

భారతా! తేజస్సు, క్షమ, ధైర్యము, పవిత్రత, అద్రోహము, అగర్వము ఇత్యాదులు దైవీ సంపదతో గూడ పుట్టిన వాని గుణములై యుండును.

దంభో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్య మేవ చ,
అజ్ఞానం చాభిజాతస్య పార్థ సంపద మాసురీమ్. 4

---

* ఇచ్చట సంపద, లేక సంపత్తు అనగా ప్రాణుల జన్మకాలమున పుణ్య పాపాది కర్మ ననుసరించి ఆవిర్భవించెడి సంస్కార పరంపర.

పార్థా! దంభము, గర్వము, అభిమానము, కఠినత్వము, క్రోధము, అజ్ఞానము ఇవి ఆసురీసంపదతో పుట్టినవారి గుణములై యున్నవి.

వీటియొక్క ఫలము

దైవీ సంపద్విమోక్షాయ నిబంధా యాసురీ మతా,
మాశుచస్సంపదం దైవీ మభిజాతోఽసి పాండవ. 5

దైవీ సంపద మోక్ష దాయకము. ఆసురీ సంపద బంధ కారకము. పార్థా! శోకింప వలదు. నీవు దైవీ సంపదతో పుట్టిన వాడవు.

అవ : ఆసురీ సంపదగల పురుషుల లక్షణములను విస్తారముగ చెప్పుచున్నారు.

ద్వౌ భూత సర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవ చ,
దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ మే శృణు. 6

ఈ లోకము నందు దైవీ సంపద, మఱియు నాసురీ సంపద యను ద్వివిధప్రకారములచే ప్రాణు లవతరింతురు. దైవీ సంపత్తు యొక్క వర్ణన విస్తృతముగా దెలిపి యున్నాను. ఇక ఆసురీ సంపదను వినుము.

ఆసురీ సంపద గల వారి యందు సదాచార ముండదు

ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదు రాసురాః,
న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే. 7

ఇది మంచి, ఇది చెడ్డ, ఇది ప్రవృత్తి, ఇది నివృత్తి అనునది ఆసురీ సంపద గల జనులకు తెలియదు. వారి యందు పవిత్రత మంచి ఆచారము సత్యము ఈ గుణము లుండవు.

మఱియు వారు నాస్తికులై యుందురు

అసత్య మప్రతిష్ఠం తే జగదాహు రనీశ్వరమ్,
అపరస్పర సంభూతం కిమన్య త్కామహైతుకమ్. 8

ఈ జగత్తు అసత్యము, ఆశ్రయ రహితము, నిరీశ్వరము, పరస్పరసంబంధ మేమియు లేకనే పుట్టినదై యున్నది. కామము దప్ప ఈ సృష్టి హేతువు మఱేమియు లేదని వారందురు.

ఆసురీ ప్రకృతి గల వారు లోక కంటకులు

ఏతాం దృష్టి మవష్టభ్య నష్టాత్మానోఽల్ప బుద్ధయః,
ప్రభవంత్యుగ్ర కర్మాణః క్షయాయ జగతోఽహితాః. 9

ఈలాటి భావములతో నొప్పు అల్ప బుద్ధిగల ఈ నష్టాత్ములు మఱియు క్రూర కర్మల జేయు దుష్టాత్ములు ఈ లోకము యొక్క నాశ నార్థమై పుట్టుదురు.

కామ మాశ్రిత్య దుష్పూరం దంభ మాన మదాన్వితాః,
మోహా ద్గృహీత్వాఽసద్గ్రాహాన్ ప్రవర్తంతేఽశుచివ్రతాః. 10

ఎన్నడును తృప్తి యనునది లేని కోరికల నాశ్రయించి, దంభము అభిమానము మదము వీనితో నిండి మోహము వలన తప్పు భావము లను అవలంబించి నియమరహితులై అపవిత్రముగా ప్రవర్తింతురు.

చింతా మపరిమేయాం చ ప్రళయాంతా ముపాశ్రితాః,
కామోపభోగపరమా ఏతావదితి నిశ్చితాః. 11

వీరు చివరిదాక అపరిమితమగు చింతలయందు మునిగియుందురు. కామోపభోగములే అన్నిటి కంటెను శ్రేష్ఠములని నిశ్చయించుకొన్న వారై,

ఆశా పాశ శతై ర్బద్ధాః కామ క్రోధ పరాయణాః,
ఈహంతే కామ భోగార్థ మన్యాయేనార్థ సంచయాన్. 12

వందలాది ఆశాపాశములచే బద్ధులై, కామ క్రోధములతో గూడిన వీరు కామోపభోగార్థమై అన్యాయముచే ధనము సంపాదింప నిశ్చయింతురు.

ఇదమద్య మయా లబ్ధ మిమం ప్రాప్స్యే మనోరథమ్,
ఇదమస్తీద మపి మే భవిష్యతి పునర్ధనమ్. 13

ఇపుడు ఇది దొరకినది. ఇక ముందు ఇది దొరకును. నా వద్ద ఇపుడు ఇంత ధనమున్నది. ఇకముందు ఇంత రాగలదు.

అసౌ మయా హత శ్శత్రు ర్హనిష్యే చాపరానపి,
ఈశ్వరోఽహ మహం భోగీ సిద్ధోఽహం బలవాన్సుఖీ. 14

ఈశత్రువు నాచే హతుడాయెను. తక్కిన వారిని కూడ చంపె దను. నేనే ఈశ్వరుడను (ప్రభువు). నేనే భోగముల ననుభవించు వాడను, సిద్ధుడను. నేనే బలవంతుడను, సుఖవంతుడను.

ఆఢ్యోఽభిజనవానస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా,
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞాన విమోహితాః. 15

నేనే సంపద గలవాడను. కులవంతుడను. నావలె మఱెవ రున్నారు. నేను యజ్ఞము చేయుదును. దాన మిచ్చెదను. ఆనందిం చెదనని అజ్ఞానముచే వారీ వివిధరీతుల మోహితు లగుదురు.

అవ : ఇట్టి ప్రకృతి గలవారు ఘోర నరకమున బడుదురని తెలుపుచున్నారు.

అనేక చిత్త విభ్రాంతా మోహ జాల సమావృతాః,
ప్రసక్తాః కామ భోగేషు పతంతి నరకేఽశుచౌ. 16

చిత్త చాంచల్యముచే గూడినవారై మోహ గర్తమున మునిగి కామోప భోగములయం దత్యంతాసక్తిగల వీరు అపవిత్రమగు నరక మున బడుదురు.

ఆసురీ సంపద గలవారి స్వభావము

ఆత్మ సంభావితాః స్తబ్ధా ధన మాన మదాన్వితాః,
యజంతే నామ యజ్ఞైస్తే దంభే నావిధి పూర్వకమ్. 17

తమ్ము తామే పొగడుకొనుచుండువారై ధన మాన మదము లచేగూడి గర్వితులై శఠులై దిరుగు ఈ అసురులు దంభముచే కేవ లము పేరు ప్రతిష్ఠలకై మాత్రము విధ్యుక్తము గాని (విధివిరుద్ధమగు) నామమాత్ర యజ్ఞములను జేయుదురు.

అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః,
మామాత్మ పర దేహేషు ప్రద్విషంతోఽభ్యసూయకాః. 18

అహంకారము, బలము, గర్వము, కామము, క్రోధము నాశ్ర యించి ఈ నిందకులు తమ యొక్క పరుల యొక్క దేహము నందుండు నన్ను ద్వేషించుచు అసూయ గలవారై యుందురు.

తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్,
క్షిపామ్యజస్ర మశుభా నాసురీష్వేవ యోనిషు. 19.

నన్ను ద్వేషించు అమంగళ స్వరూపులగు క్రూరులగు ఈ నరాధములను నేను సారె సారెకు ఈ సంసారము నందలి ఆసురీ (నీచ) యోనుల యందు పుట్టించెదను.

అవ: ఆసురీ ప్రకృతి గలవారు అధోగతి నొందుదురని చెప్పుచున్నారు.

ఆసురీం యోని మాపన్నా మూఢా జన్మని జన్మని,
మా మప్రాప్యైవ కౌంతేయ తతో యాంత్యధమాం గతిమ్. 20

కౌంతేయా! ఆసురీ యోనుల యందు బుట్టిన ఈ మూఢులు జన్మ జన్మముల యందును నన్ను గానక అచ్చట నుండి అత్యంత అధోగతి నొందుదురు.

కామ క్రోధ లోభములు మూడు నరక ద్వారములు

త్రివిధం నరకస్యేదం ద్వారం నాశన మాత్మనః,
కామః క్రోధ స్తథా లోభ స్తస్మా దేతత్త్రయం త్యజేత్. 21

కామ క్రోధ లోభములను నీ మూడును నరక ద్వారములు. ఇవి ఆత్మ-నాశమునకు కారణములై యున్నవి. అందువలన ఈ మూడింటిని విడువ వలెను.

ఈ మూడు గుణములను విడిచి శ్రేయోమార్గమున వర్తించు వారికే
పరమగతి ప్రాప్తించును

ఏతైర్విముక్తః కౌంతేయ తమోద్వారై స్త్రిభిర్నరః,
ఆచరత్యాత్మనశ్శ్రేయ స్తతో యాతి పరాం గతిమ్. 22

కుంతీనందనా! తమో లోకమునకు దీసికొనిపోవు ఈ మూడింటిచే ముక్తుడై మనుష్యుడు తనకు శ్రేయస్సును కలుగ జేసికొనును. తన్మూలమున నతడు పరమగతి నొందును.

శాస్త్ర విధిని త్యజించి తమ ఇచ్ఛ చొప్పున వర్తించు వారి వర్తనలు

యశ్శాస్త్ర విధి ముత్సృజ్య వర్తతే కామ కారతః,
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాంగతిమ్. 23

ఎవడు శాస్త్రవిధిని వీడి కామముచే విషయ వాసనా విశిష్టుడై వర్తించునో వానికి సిద్ధి గాదు. సుఖము దొరకదు. పరమమగు ఆత్మ స్థితిని బొందడు.

శాస్త్ర ప్రమాణము ననుసరించి నీవు కర్మ నాచరింపుము

తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ,
జ్ఞాత్వా శాస్త్ర విధానోక్తం కర్మ కర్తు మిహార్హసి. 24

అందువలన అర్జునా! ఇది కార్యము, ఇది అకార్య మని తెలి యుటకు మానవులకు శాస్త్రమే ప్రమాణము. శాస్త్రము నెఱిగి విధి విహితములగు కర్మలనే ఆచరించుట నీకు కర్తవ్య మగును.

ఇందలి తాత్పర్య మేమన, మానవుడు మంచివగు దైవగుణ ములు గలవాడై పెద్దల నాశ్రయించి శాస్త్ర దృష్టి గలిగి హిత, మిత, పవిత్ర వర్తన గలవాడై కర్తృత్వము లేక ఆత్మ బుద్ధిచే జీవన పరమ లాభమగు జ్ఞానమును బడయుట కర్హు డగునని భావము.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే దైవాసుర సంప ద్విభాగ
యోగో నామ షోడశోఽధ్యాయః.



ఓమ్

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీమద్భగవద్గీత - సప్తదశాధ్యాయము

శ్రద్ధను గుఱించిన అర్జునుని ప్రశ్న

అర్జున ఉవాచ :

యే శాస్త్ర విధి ముత్సృజ్య యజంతే శ్రద్ధయాఽన్వితాః,
తేషాం నిష్ఠా తు కా కృష్ణ సత్త్వ మాహో రజ స్తమః. 1

కృష్ణా! అజ్ఞానముచే శాస్త్రవిధి ననుసరింపక పోయినను శ్రద్ధ మాత్రము గలిగి ఎవరు పూజింతురో యజ్ఞములను జేయుదురో అట్టి వారి నిష్ఠ సాత్వికమా? రాజసమా? లేక తామసమా?

గుణానుసారము శ్రద్ధ మూడు విధములు

శ్రీ భగవానువాచ :

త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా,
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు. 2

ప్రాణులయందు స్వభావముగ శ్రద్ధ సాత్త్విక రాజస తామసము లని మూడు విధములు. అది ఎట్లనిన, వినుము.

పురుషుని స్థితి శ్రద్ధానుసారముగ ఉండును

సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత,
శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధ స్స ఏవ సః. 3

భారతా! శ్రద్ధ యనునది వారి వారి స్వభావము ననుసరించి యుండును. మానవుడు శ్రద్ధా మయుడు. ఎవని శ్రద్ధ ఎట్లుండునో అటువలె అతడుండును.

అవ : దైవ యక్ష ప్రేతాది సంపూజన కార్యములచే శ్రద్ధాయుక్తులగు నా యా పురుషులను తెలియవచ్చు ననుచున్నారు.

యజంతే సాత్త్వికా దేవాన్ యక్ష రక్షాంసి రాజసాః,
ప్రేతా న్భూతగణాంశ్చాన్యే యజంతే తామసా జనాః 4

సాత్త్వికులు దేవతలను, రాజసులు యక్ష రాక్షసులను, తామసులు భూత ప్రేతములను పూజించెదరు.

అవ : శాస్త్ర విధి ననుసరింపక ఘోర తపః కర్మాదులను చేయువారు నిందార్హులనుచున్నారు.

అశాస్త్ర విహితం ఘోరం తప్యంతే యే తపో జనాః,
దంభాహంకార సంయుక్తాః కామ రాగ బలాన్వితాః. 5

దంభాహంకారములచే గూడి కామ రాగ పశుబల యుక్తులై శాస్త్ర విరుద్ధముగా ఘోర తపస్సు నాచరించుచు,

కర్షయంతశ్శరీరస్థం భూతగ్రామ మచేతనః,
మాంచైవాంతశ్శరీరస్థం తాన్విద్ధ్యాసుర నిశ్చయాన్. 6

మఱియు శరీరము నందలి పంచభూతముల సంఘాతమునే గాక శరీరాంతరమున నుండు నన్నును వ్యథ నొందించుచు కృశింప జేయు అవివేకులు అసురులని తెలియుము.

అవ : గుణానుసారమగు ఆహారము, యజ్ఞము, తపస్సు, దానము ఇత్యాది భేదము లను బోధించుచున్నారు.

ఆహార స్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః,
యజ్ఞ స్తప స్తథా దానం తేషాం భేద మిమం శృణు. 7

వేలువేలుగా జనులకు ప్రియమైన ఆహారములు మూడు విధములై యున్నవి. అటువలె యజ్ఞ దాన తపస్సులు గూడా త్రివిధములై యున్నవి. ఆ యీ భేదమును వినుము.

సాత్త్వికులకు ప్రియమైన ఆహారము

ఆయు స్సత్త్వ బలారోగ్య సుఖ ప్రీతి వివర్ధనాః,
రస్యాస్స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారా స్సాత్త్విక ప్రియాః. 8

ఆయుస్సు, సత్వము, బలము, ఆరోగ్యము, సుఖము, ప్రీతి వీటిని వృద్ధి చేయు రసయుక్తములును స్నిగ్ధములును (చమురుతో గూడినవి) శరీరము నందు స్థిరముగ (కొంత తడవు) ఉండి సంతోషమును గలుగ జేయు నవియు నగు ఆహారములు సాత్వికులకు ప్రియమైనవి.

రాజసులకు ప్రియమైన ఆహారము

కట్వామ్ల లవణాత్యుష్ణ తీక్ష్ణ రూక్ష విదాహినః,
ఆహారా రాజసస్యేష్టా దుఃఖ శోకామయ ప్రదాః. 9

దుఃఖము, శోకము, రోగములను గలిగించు కారము, పులుసు, ఉప్పు, అతి ఉష్ణము, రూక్షము (కడుపులో నగ్గి పడె నన్నట్లుండు) ఇత్యాది ఆహారములు రజోగుణము గలవారి కిష్టములై యుండును.

తామసులకు ప్రియమైన ఆహారము

యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్,
ఉచ్ఛిష్ట మపి చామేధ్యం భోజనం తామస ప్రియమ్, 10

ఎక్కువ ఉడికినది, రసము లేనిది, దుర్గంధము గలది, పాసినది, (రాత్ర్యనంతరితమైనది) భుజింపబడగా మిగిలినదియు అపవిత్రమునగు ఆహారము తామసులకు ప్రియము.

సాత్త్విక యజ్ఞము

అఫలాకాంక్షిభి ర్యజ్ఞో విధి దృష్టో య ఇజ్యతే,
యష్టవ్యమేవేతి మన స్సమాధాయ స సాత్త్వికః. 11

ఫలాశ లేక ఇది చేయదగినది (కర్తవ్య కర్మ) యని విధి విహితముగా స్థిరచిత్తముచే చేయు యజ్ఞము సాత్త్విక మనబడును.

రాజస యజ్ఞము

అభిసంధాయ తు ఫలం దంభార్థమపి చైవ యత్,
ఇజ్యతే భరతశ్రేష్ఠ తం యజ్ఞం విద్ధి రాజసమ్. 12

ఓయీ భరతశ్రేష్ఠుడా! ఫలాపేక్షచే కేవలము దంభార్థమై ఏ యజ్ఞము చేయబడునో అది రాజసము.

తామస యజ్ఞము

విధి హీన మసృష్టాన్నం మంత్రహీన మదక్షిణమ్,
శ్రద్ధా విరహితం యజ్ఞం తామసం పరిచక్షతే. 13

విధివిహీనమైనది, అన్నదానము లేనిది, మంత్రము లేనిది, దక్షిణలు లేనిది, శ్రద్ధలేనిదియైన యజ్ఞము తామస యజ్ఞ మనబడును.

శారీర తపస్సు

దేవ ద్విజ గురు ప్రాజ్ఞ పూజనం శౌచ మార్జవమ్,
బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే. 14

దేవతలను, బ్రాహ్మణులను, గురువులను, విద్వాంసులను (పెద్దలను) పూజించుటయు, పవిత్రత, నిర్వ్యాకత బ్రహ్మచర్యము అహింస ఇవి శారీర మగు తపస్సని చెప్పబడును.

వాచిక తపస్సు

అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్,
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే. 15

ఎవరి మనస్సును నొప్పించని వాక్యములను మాట్లాడుట, ప్రియమును సత్యమును హితకరమునగు మాటల నాడుట, *స్వాధ్యాయాభ్యాసము ఇవి వాచిక తపస్సని చెప్పబడును.

* వేదాధ్యయనము, ఉత్తమగ్రంథ పారాయణము, ప్రణవాది మహా మంత్రానుష్ఠానము మొ॥

మానసిక తపస్సు

మనః ప్రసాద స్సౌమ్యత్వం మౌన మాత్మ వినిగ్రహః,
భావ సంశుద్ధి రిత్యేత త్తపో మానస ముచ్యతే. 16

మనః ప్రసన్నత, సౌమ్యత, మౌనము, మనోనిగ్రహము, భావ సంశుద్ధి యను నివి మానసిక తపస్సనబడును.

సాత్త్విక తపస్సు

శ్రద్ధయా పరయా తప్తం తప స్తత్త్రివిధం నరైః,
అఫలాకాంక్షిభిర్యుక్తై స్సాత్త్వికం పరిచక్షతే. 17

ఫలాశ లేక యోగ యుక్తులగు జనులు పరమశ్రద్ధచే జేయు ఈ మూడు విధములగు తపస్సు సాత్త్విక మనబడును.

రాజస తపస్సు

సత్కార మాన పూజార్థం తపో దంభేన చైవ యత్,
క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చల మధ్రువమ్. 18

జనులయందు తనయొక్క సత్కార మాన పూజార్థమైయును, పొగడ్తలు గావలయుననియును జేసిన దాంభికమగు తపస్సు రాజస తపస్సనబడును. అది స్థిరము, నిత్యము గానిది. అర్థాత్ చలనము గలది. అధ్రువమైనది.

తామస తపస్సు

మూఢగ్రాహేణాత్మనో య త్పీడయా క్రియతే తపః,
పరస్యోత్సాదనార్థం వా తత్తామస ముదాహృతమ్. 19

మూర్ఖతచే దురాగ్రహమువలన తనకు తాను తొందరను కలుగజేసికొని మఱి యొకరి నాశమునకై చేయబడు (క్షుద్ర) తపస్సు తామస తపస్సనబడును.

సాత్త్విక దానము

దాతవ్య మితి యద్దానం దీయతేऽనుపకారిణే,
దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్. 20

కేవలము విధ్యుక్తమగు కర్తవ్య బుద్ధిచే యోగ్యమగు దేశ

కాల పాత్రలను చూచి తనకు ప్రత్యుపకారము చేయు నను భావము లేక ఒసగిన దానము సాత్త్విక మనబడును.

రాజస దానము

యత్తు ప్రత్యుపకారార్థం ఫల ముద్దిశ్య వా పునః,
దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్. 21

ప్రత్యుపకార బుద్ధిచే ఫలము నుద్దేశించి మనస్సు నొచ్చుకొని ఇచ్చు దానము రాజస మనబడును.

తామస దానము

అదేశ కాలే యద్దాన మపాత్రేభ్యశ్చ దీయతే,
అసత్కృత మవజ్ఞాతం తత్తామస ముదాహృతమ్. 22

ఏ దానము అయోగ్యమగు దేశ కాలముల యందుగాని, అపాత్రునకుగాని, అనాదరముచే (అమర్యాదగా) గాని ఒసగ బడినదో అది తామస దాన మనబడును.

ఓం తత్ సత్ అను నీ నామముల మహిమ

ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధః స్మృతః,
బ్రాహ్మణా స్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా. 23

ఓం తత్ సత్ అని బ్రహ్మము యొక్క నిర్దేశము మూడు విధములుగ చెప్పబడి యున్నది. పూర్వము బ్రాహ్మణులును వేదములును యజ్ఞములును ఈ నిర్దేశ పూర్వకముగా (ఈనామముల నుచ్చరించి) నిర్మింప బడియున్నవి.

తస్మాదోమిత్యుదాహృత్య యజ్ఞ దాన తపః క్రియాః,
ప్రవర్తంతే విధానోక్తాః స్సతతం బ్రహ్మవాదినామ్. 24

అందువల్లనే ముముక్షువులు చేయు విధ్యుక్తమగు యజ్ఞ దాన తపస్సు లనెడి సర్వకర్మలును సంతతము "ఓమ్" అను ఉచ్చారణానంతరమే ఆరంభింప బడుచున్నవి.

తత్ శబ్ద ప్రయోగము

తదిత్యనభిసంధాయ ఫలం యజ్ఞ తపః క్రియాః,
దానక్రియాశ్చ వివిధాః క్రియంతే మోక్ష కాంక్షిభిః. 25

"తత్" అని స్మరించి ఫలాశ లేక వివిధ యజ్ఞ దాన తపః కర్మలను మోక్షాపేక్ష గలవారు చేయుదురు.

సత్ శబ్ద ప్రయోగము

సద్భావే సాధుభావే చ సదిత్యేతత్ప్రయుజ్యతే
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ యుజ్యతే. 26

"సత్" అనగా ఉనికిగలది. సాధు అనగా మంచిది (ప్రశస్తమైనది). ఈఅర్థము లందు"సత్" అనునది ఉపయోగింప బడును. పార్థా! ప్రశస్తమగు కర్మయందును "సత్"అను శబ్దము ఉపయోగింపబడును.

యజ్ఞే తపసి దానే చ స్థితిస్సదితి చోచ్యతే,
కర్మ చైవ తదర్థీయం సదిత్యేవాభిధీయతే. 27

యజ్ఞ దాన తపః కర్మలయందు స్థిరత్వము గలిగి యుండుట సత్ అనబడును. వాటికొఱకై చేయబడు సర్వకర్మలును 'సత్'అనియే చెప్పబడును.

అవ : అశ్రద్ధచే చేయు కర్మ అయోగ్యము అసత్తని చెప్పబడును.

అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్,
అసదిత్యుచ్యతే పార్థ న చ తత్ప్రేత్య నో ఇహ. 28

అశ్రద్ధచే జేసిన యజ్ఞము, ఇచ్చిన దానము, ఆచరించిన తపస్సు మఱి ఇతరమగు ఏ కర్మయే యగుగాక! అది "అసత్" అని చెప్పబడును. పార్థా! అట్టి కర్మచే ఈ లోకమునగాని పరలోకమున గాని స్థితి లేదు. గతి లేదు. ప్రయోజనము లేదని భావము.

ఇందలి తాత్పర్య మేమన, నిష్కామముగ సాత్త్విక శ్రద్ధచే విహిత కర్మల నాచరింప వానిచేత మనశ్శుద్ధియై క్రమేణ అక్షయమగు ఆత్మ జ్ఞాన మహాఫలము గలుగు ననియు, తదితరములు ఫలమునిచ్చి క్షయమై పోవుచు అనుతాపము నొసగి జన్మమరణాదులకు కారణమగునని యు భావము. "ఓం తత్ సత్" అను మహామంత్రమును ముముక్షువు సంతతము ఉచ్చరింప దగునని అర్థము.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే శ్రద్ధాత్రయ విభాగ యోగోనామ సప్తదశోఽధ్యాయః

ఓమ్

శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

# శ్రీమద్భగవద్గీత-అష్టాదశాధ్యాయము

అవ : ఈ అధ్యాయమున, వెనుకటి అధ్యాయముల యందు చెప్పబడిన అర్థము లెల్ల సంక్షిప్తముగ ముచ్చటింపబడును. సంన్యాస త్యాగములను గుఱించిన అర్జునుని ప్రశ్నచే ఈ అధ్యాయ మారంభింప బడుచున్నది.

అర్జున ఉవాచ :

సంన్యాసస్య మహాబాహో తత్త్వ మిచ్ఛామి వేదితుమ్,
త్యాగస్య చ హృషీకేశ పృథక్కేశినిషూదన. 1

మహాబాహో! హృషీకేశా! కేశినిషూదనా! సన్న్యాసము మఱియు త్యాగ మను వీటి తత్త్వమును వేఱు వేఱుగ దెలియ నిచ్ఛయించు చున్నాను.

అవ : త్యాగ విషయము నందు ఇతరుల యొక్క నాలుగు ప్రకారములైన అభిప్రాయములను తెలుపుచున్నారు.

శ్రీ భగవానువాచ :

కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో విదుః,
సర్వ కర్మ ఫల త్యాగం ప్రాహు స్త్యాగం విచక్షణాః. 2

కామ్యకర్మలను విడుచుటయే సన్న్యాసమని బుద్ధిమంతులు తెలియుదురు. సర్వ కర్మల ఫలమును విడుచుటయే త్యాగమని పండితులు చెప్పుదురు.

త్యాజ్యం దోషవ దిత్యేకే కర్మ ప్రాహు ర్మనీషిణః,
యజ్ఞ దాన తపః కర్మ న త్యాజ్య మితి చాపరే. 3

దోషవంతమగు కర్మను విడువవలసినదని కొందఱు విద్వాంసుల మతము. ఇక యజ్ఞ దాన తపః కర్మలను మాత్ర మెన్నటికిని విడువరాదని కొందఱు విద్వాంసులు చెప్పుదురు.

అవ : త్యాగ విషయమై భగవానుడు తన నిశ్చయమును మూడు శ్లోకములచే చెప్పుచున్నారు.

"తత్" అని స్మరించి ఫలాశ లేక వివిధ యజ్ఞ దాన తపః కర్మలను మోక్షాపేక్ష గలవారు చేయుదురు.

సత్ శబ్ద ప్రయోగము

సద్భావే సాధుభావే చ సదిత్యేతత్ప్రయుజ్యతే
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ యుజ్యతే. 26

"సత్" అనగా ఉనికిగలది. సాధు అనగా మంచిది (ప్రశస్తమైనది). ఈఅర్థము లందు"సత్" అనునది ఉపయోగింప బడును. పార్థా! ప్రశస్తమగు కర్మయందును "సత్"అను శబ్దము ఉపయోగింపబడును.

యజ్ఞే తపసి దానే చ స్థితిస్సదితి చోచ్యతే,
కర్మ చైవ తదర్థీయం సదిత్యేవాభిధీయతే. 27

యజ్ఞ దాన తపః కర్మలయందు స్థిరత్వము గలిగి యుండుట సత్ అనబడును. వాటికొఱకై చేయబడు సర్వకర్మలును 'సత్'అనియే చెప్పబడును.

అవ: అశ్రద్ధచే చేయు కర్మ అయోగ్యము అసత్తని చెప్పబడును.

అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్,
అసదిత్యుచ్యతే పార్థ న చ తత్ప్రేత్య నో ఇహ. 28

అశ్రద్ధచే జేసిన యజ్ఞము, ఇచ్చిన దానము, ఆచరించిన తపస్సు మఱి ఇతరమగు ఏ కర్మయే యగుగాక! అది "అసత్" అని చెప్పబడును. పార్థా! అట్టి కర్మచే ఈ లోకమునగాని పరలోకమున గాని స్థితి లేదు. గతి లేదు. ప్రయోజనము లేదని భావము.

ఇందలి తాత్పర్య మేమన, నిష్కామముగ సాత్త్విక శ్రద్ధచే విహిత కర్మల నాచరింప వానిచేత మనశ్శుద్ధియై క్రమేణ అక్షయమగు ఆత్మ జ్ఞాన మహాఫలము గలుగు ననియు, తదితరములు ఫలమునిచ్చి క్షయమై పోవుచు అనుతాపము నొసగి జన్మమరణాదులకు కారణ మగుననియు భావము. "ఓం తత్ సత్" అను మహామంత్రమును ముముక్షువు సంతతము ఉచ్చరింప దగునని అర్థము.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే శ్రద్ధాత్రయ విభాగ యోగోనామ సప్తదశోఽధ్యాయః

ఓమ్

శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

# శ్రీమద్భగవద్గీత-అష్టాదశాధ్యాయము

అవ: ఈ అధ్యాయమున, వెనుకటి అధ్యాయముల యందు చెప్పబడిన అర్థము లెల్ల సంక్షిప్తముగ ముచ్చటింపబడును. సంన్యాస త్యాగములను గుఱించిన అర్జునుని ప్రశ్నచే ఈ అధ్యాయ మారంభింప బడుచున్నది.

అర్జున ఉవాచ:

సంన్యాసస్య మహాబాహో తత్త్వ మిచ్ఛామి వేదితుమ్,
త్యాగస్య చ హృషీకేశ పృథక్కేశినిషూదన. 1

మహాబాహో! హృషీకేశా! కేశినిషూదనా! సన్న్యాసము మఱియు త్యాగ మను వీటి తత్త్వమును వేఱు వేఱుగ దెలియ నిచ్ఛయించు చున్నాను.

అవ: త్యాగ విషయము నందు ఇతరుల యొక్క నాలుగు ప్రకారములైన అభిప్రాయములను తెలుపుచున్నారు.

శ్రీ భగవానువాచ:

కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో విదుః,
సర్వ కర్మ ఫల త్యాగం ప్రాహు స్త్యాగం విచక్షణాః. 2

కామ్యకర్మలను విడుచుటయే సన్న్యాసమని బుద్ధిమంతులు తెలియుదురు. సర్వ కర్మల ఫలమును విడుచుటయే త్యాగమని పండితులు చెప్పుదురు.

త్యాజ్యం దోషవ దిత్యేకే కర్మ ప్రాహు ర్మనీషిణః,
యజ్ఞ దాన తపః కర్మ న త్యాజ్య మితి చాపరే. 3

దోషవంతమగు కర్మను విడువవలసినదని కొందఱు విద్వాంసుల మతము. ఇక యజ్ఞ దాన తపః కర్మలను మాత్ర మెన్నటికిని విడువ రాదని కొందఱు విద్వాంసులు చెప్పుదురు.

అవ: త్యాగ విషయమై భగవానుడు తన నిశ్చయమును మూడు శ్లోకములచే చెప్పుచున్నారు.

నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ,
త్యాగో హి పురుషవ్యాఘ్ర త్రివిధ స్సంప్రకీర్తితః. 4

అర్జునా! భారతసత్తమా! త్యాగవిషయమై నా నిశ్చయమును వినుము. త్యాగము మూడు విధములై యున్నదని ప్రసిద్ధము.

యజ్ఞ దాన తపః కర్మ న త్యాజ్యం కార్య మేవ తత్,
యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్. 5

యజ్ఞదాన తపః కర్మలు విడువదగినవి కావు. చేయవలసినదే. తెలిసిన వారికివి మంచివే. పావనములే.

అవ : యజ్ఞ దాన తపః కర్మ ఫలముల యందలి ఆసక్తిని మాత్రము విడువ వలయును.

ఏతాన్యపి తు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ,
కర్తవ్యానీతి మే పార్థ నిశ్చితం మత ముత్తమమ్. 6

ఈ కర్మల నైనను అనాసక్తులై ఫలము నాశింపక చేయదగునని నా నిశ్చితాభిప్రాయమై యున్నది.

తామస త్యాగలక్షణము

నియతస్య తు సంన్యాసః కర్మణో నోపపద్యతే,
మోహాత్తస్య పరిత్యాగ స్తామసః పరికీర్తితః 7

నియతమగు కర్మను వీడుట అనుచితము. మోహము వలన మూర్ఖతచే అట్లు విడిచిన అది తామస త్యాగ మనిపించుకొనును.

రాజస త్యాగము

దుఃఖ మిత్యేవ యత్కర్మ కాయ క్లేశ భయాత్త్యజేత్,
స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగ ఫలం లభేత్. 8

దుఃఖ దాయకమనియు, కాయక్లేశ మనియు, భయముచే కర్మను వీడినచో అది రాజస త్యాగ మగును. దీనిచే త్యాగ ఫలమెన్నడును దొరకదు.

సాత్త్విక త్యాగము, తత్ఫలము

కార్య మిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున,
సంగం త్యక్త్వా ఫలం చైవ స త్యాగః సాత్త్వికో మతః. 9

ఆసక్తిలేక ఫలాశను వదలి కర్తవ్యమని నియతమగు కర్మను చేసిన అది సాత్త్విక త్యాగ మనిపించుకొనును.

న ద్వేష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్జతే,
త్యాగీ సత్త్వసమావిష్టో మేధావీ ఛిన్నసంశయః. 10

ఎవడు కర్మను క్లేశదాయకమని ద్వేషించుట లేదో సుఖకర మగునని కర్మయం దాసక్తుడు గాడో అతడే సర్వ సంశయములను దాటిన బుద్ధిమంతుడును సత్త్వ సంపన్నుడు నగు త్యాగి.

అవ: కర్మ ఫల త్యాగమును చేయువాడే త్యాగి యని తెలుపుచున్నారు.

నహి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః,
యస్తు కర్మ ఫల త్యాగీ స త్యాగీ త్యభిధీయతే. 11

దేహధారియగు నతడు అశేషముగ కర్మలను విడిచి పెట్టుట అశక్యము. అందుచేత ఎవడు కర్మఫలమును త్యజించునో అతడే త్యాగి యనిపించుకొనును.

కర్మ ఫలము త్రివిధము

అనిష్ట మిష్టం మిశ్రంచ త్రివిధం కర్మణః ఫలమ్,
భవత్యత్యాగినాం ప్రేత్య నతు సంన్యాసినాం క్వచిత్. 12

అనిష్టము, ఇష్టము, మిశ్రమమని కర్మఫలము మూడు విధములు. కర్మ ఫలాశను వీడని త్యాగరహితులకు మరణానంతరము (ఈ లోకము నుండి వెడలిన పిదప) ఆ యా కర్మఫలము ప్రాప్తమగును. కాని త్యాగిని ఇవేవియును తాకజాలవు.

అవ: సర్వకర్మలకును అధిష్ఠానాదులు 5 కారణములని తెలుపుచున్నారు.

పంచైతాని మహాబాహో కారణాని నిబోధ మే,
సాంఖ్యే కృతాంతే ప్రోక్తాని సిద్ధయే సర్వ కర్మణామ్. 13

మహాబాహో! సమస్త కర్మల సిద్ధికొఱకై (క్రింద దెలుపు) ఈ ఐదు కారణము లని సాంఖ్య గ్రంథములందు చెప్పబడి యున్నది. వాటిని చెప్పెదను వినుము.

అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్,
వివిధాశ్చ పృథక్చేష్టా దైవం చైవాత్ర పంచమమ్. 14

1 అధిష్ఠానము, 2 కర్త, 3 నానావిధములగు సాధనములు, 4 వివిధములగు యత్నములు మఱియు 5వది దైవము.

ఇచట అధిష్ఠానము అనగా ఇచ్ఛాద్వేషాదులకు ఆశ్రయమగు శరీరము. కర్త అనగా అంతఃకరణోపాధి యుక్తుడగు జీవుడు. ఇతడే కర్మకర్త, భోక్త. కరణమనగా శ్రోత్రాది ఇంద్రియములు. నాలుగవది వివిధ వాయు సంబంధములగు ప్రాణాపానాదివ్యాపారములు (చేష్టలు). ఐదవది వీటి నన్నిటిని పూర్ణమొనర్చు చక్షురాది ఇంద్రియానుగ్రాహకమగు సూర్యాది అధిదైవ మని తెలియవలయును. ఇవియే సర్వకర్మలకు కారణములు.

శరీర వాఙ్మనోభిర్యత్కర్మ ప్రారభతే నరః,
న్యాయ్యం వా విపరీతం వా పంచైతే తస్య హేతవః. 15

మనుష్యుడు తన శరీర వాఙ్మనస్సులచే ఏ కర్మ నారంభించునో ఆ కర్మ న్యాయ్యమై యుండనీ లేక అన్యాయ్యమై యుండనీ దానికి ఈ ఐదే కారణములై యున్నవి.

తత్రైవం సతి కర్తార మాత్మానం కేవలం తు యః,
పశ్యత్యకృతబుద్ధిత్వా న్న స పశ్యతి దుర్మతిః. 16

ఇట్లుండగా కేవలుడగు ఆత్మను అకృతాత్మ (బుద్ధి) గల ఏ మూర్ఖుడు ఆత్మయందు కర్తృత్వము నారోపించి ఆత్మనే కర్తగా తెలియునో ఆ మతిహీనునకు ఏమియును తెలియదని అర్థము.

అవ : ఆత్మను అకర్తగా దెలియువాడు జ్ఞాని, అతనికి కర్మలేపము లేదు.

యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే,
హత్వాఽపి స ఇమాం ల్లోకాన్న హన్తి న నిబధ్యతే. 17

ఎవనికి అహంకార భావన లేదో, ఎవని బుద్ధి కర్మలచే అలిప్తమై యున్నదో, అతడీ లోకములనెల్ల సంహరించినను తత్త్వతః అతడు సంహరించుటయు లేదు. అందుచే బద్ధుడగుటయు లేదు.

అవిద్యా కల్పితమగు అధిష్ఠానాది పంచకారణముల యొక్క మిథ్యాత్త్వము నెఱిగిన సాక్షిత్వానుభవియగు బ్రహ్మవిదుడు (కర్మసాక్షి) కార్యరంగమున సమస్త లోకములను సంహరించియును సంహ

రింపనివాడే. ఆ కర్మఫలము లతనిని బంధింపవు. తాత్పర్య మేమన, అసంగాత్మ జ్ఞానదృష్టిచే ఇవి యెల్లను మిథ్యాప్రలాపములని నిశ్చితార్థము. ఇందలి భావము దృష్టియుక్త మైన ఉపనిషదర్థ మని తెలియవలయును.

అవ : కర్మయొక్క ప్రేరకమును, తదాశ్రయమును తెలుపుచున్నారు.

జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా,
కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసంగ్రహః. 18

జ్ఞానము, జ్ఞేయము, పరిజ్ఞాత యివి కర్మప్రేరణావశ్యకములు. కరణము, కర్మ, కర్త యివి మూడు కర్మ సంగ్రహామునకు గావలసినవి.

జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః,
ప్రోచ్యతే గుణ సంఖ్యానే యథావచ్ఛృణు తాన్యపి. 19

గుణభేదముచే జ్ఞానము, కర్మ, కర్త ఇవియు మూడు ప్రకారములై యున్నవని సాంఖ్య శాస్త్రము నందు చెప్పబడియున్నది. ఆ విధానమును చెప్పెదను వినుము.

అవ : త్రివిధ గుణముల ననుసరించి జ్ఞానము, కర్మ, కర్త ఇత్యాది భేదములను తెలుపుచున్నారు. ఇందు సాత్త్విక జ్ఞానము.

సర్వభూతేషు యేనైకం భావ మవ్యయ మీక్షతే,
అవిభక్తం విభక్తేషు తజ్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్. 20

భిన్నాభిన్నములగు సమస్త భూతములయందు ఒకే అఖండము, అవ్యయమునగు భగవదనుభవము ఏ జ్ఞానముచే నగునో ఆ జ్ఞానము సాత్త్వికమని తెలియుము.

రాజస జ్ఞానము

పృథక్త్వేన తు యజ్జ్ఞానం నానాభావాన్ పృథగ్విధాన్,
వేత్తి సర్వేషు భూతేషు తజ్జ్ఞానం విద్ధి రాజసమ్. 21

ఏ జ్ఞానము వలన సర్వ భూతములయందు వేఱు వేఱుగా నానారూపములు అగపడునో ఆ జ్ఞానము రాజస జ్ఞానము.

తామస జ్ఞానము

యత్తు కృత్స్నవదేకస్మిన్ కార్యే సక్త మహైతుకమ్,
అతత్త్వార్థవ దల్పం చ తత్తామస ముదాహృతమ్. 22

ఏ దొక నిర్ధారితమైన ఉద్దేశము లేకనే అనగా తద్విషయక మగు జ్ఞానము లేకయే ఇదే సర్వమని ఆ కార్యము నందు ప్రవేశించు జ్ఞానము తామస జ్ఞానము.

సాత్త్వికకర్మ

నియతం సంగరహిత మరాగ ద్వేషతః కృతమ్,
అఫల ప్రేప్సునా కర్మ యత్తత్సాత్త్విక ముచ్యతే. 23.

ఫలాపేక్షా రహితుడు ఆసక్తిని వీడి రాగద్వేషములు లే చేయు నియతకర్మ సాత్త్విక మనిపించుకొనును.

రాజస కర్మ

యత్తు కామేప్సునా కర్మ సాహంకారేణ వా పునః,
క్రియతే బహులాయాసం తద్రాజస ముదాహృతమ్. 24

ఫలాశ గలవాడు అహంకార యుక్తుడై విశేషమగు ఆయాస ముచే, చేసిన కర్మ రాజస మనిపించుకొనును.

తామస కర్మ

అనుబంధం క్షయం హింసా మనపేక్ష్య చ పౌరుషమ్,
మోహాదారభ్యతే కర్మ యత్తత్తామస ముచ్యతే. 25

పూర్వాపర సంబంధమును, తత్పరిణామమును, తన బలమును, నాశమును అనగా కలుగు హింస ఇత్యాదులను విచారింపక అవివే ముచే (అజ్ఞతవలన) ఆరంభించి చేయబడు కర్మ తామసకర్మ యని పించుకొనును.

సాత్త్వికకర్త

ముక్తసంగోఽనహంవాదీ ధృత్యుత్సాహ సమన్వితః,
సిద్ధ్యసిద్ధ్యో ర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే. 26

నిస్సంగుడును, నిరహంకారియు, ధైర్యోత్సాహములచే యుక్తు డునై సిద్ధ్యసిద్ధులచే వికారముపొందని కర్త సాత్త్వికకర్త యనబడును.

రాజస కర్త

రాగీ కర్మ ఫల ప్రేప్సు ర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః,
హర్ష శోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః. 27

ఆసక్తి గలవాడు, ఫలాపేక్షచే గూడినవాడు, లోభియు, హింస జేయువాడును, అపవిత్రుడును, హర్ష శోకములకు వశుడును అగు కర్త రాజసుడని చెప్పబడును.

తామస కర్త

అయుక్తః ప్రాకృత స్తబ్ధ శ్శఠో నైష్కృతికోఽలసః
విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే. 28

చంచల బుద్ధి గలవాడును, మూఢుడును, నమ్రత లేనివాడును, శఠుడును అనగా మోసగాడును, లేక ఇతరుల జీవనమును పాడుజేయు నుద్దేశము గలవాడును, సోమరియు, ఒక విధమగు దొంగచూపులచే వ్రేలాడు ముఖము గలవాడును, ఎల్లప్పుడు వ్యసనము గలవాడును, దీర్ఘ సూత్రియు అనగా చురుకుదనము లేనివాడునగు నతడు తామస కర్త యనబడును.

అవ: మూడు గుణముల భేదము ననుసరించి గలుగు బుద్ధి, ధృతి, వీటి విభిన్నతను తెలియజేయుచున్నారు.

బుద్ధే ర్భేదం ధృతేశ్చైవ గుణత స్త్రివిధం శృణు,
ప్రోచ్యమాన మశేషేణ పృథక్త్వేన ధనంజయ. 29

పార్థా! సత్త్వ రజ స్తమో గుణముల భేదముచే మూడు విధములై యున్న బుద్ధియొక్కయు, ధైర్యము యొక్కయు, భేదమును నేను నీకు విడివిడిగా నిశ్శేషముగ జెప్పెదను వినుము.

సాత్త్విక బుద్ధి

ప్రవృత్తిం చ నివృత్తిం చ కార్యాకార్యే భయాభయే,
బంధం మోక్షం చ యా వేత్తి బుద్ధిస్సా పార్థ సాత్త్వికీ. 30

ప్రవృత్తి, నివృత్తి, కార్యము, అకార్యము, భయము, అభయము, బంధము, మోక్షము వీటిని చక్కగా తెలియు బుద్ధి సాత్త్విక మనబడును.

### రాజసీబుద్ధి

యయా ధర్మ మధర్మం చ కార్యం చాకార్య మేవ చ,
అయథావ త్ప్రజానాతి బుద్ధిస్సా పార్థ రాజసీ. 31

పార్థా! ధర్మము, అధర్మము, కార్యము, అకార్యము, వీటిని చక్కగ తెలియని బుద్ధి రాజస బుద్ధి యనబడును.

### తామసీబుద్ధి

అధర్మం ధర్మమితి యా మన్యతే తమసాఽఽవృతా,
సర్వార్థాన్ విపరీతాంశ్చ బుద్ధిస్సా పార్థ తామసీ. 32

పార్థా! ఏ బుద్ధి అజ్ఞానముచే నావరింపబడి అధర్మమును ధర్మమని ధర్మమును అధర్మమని తెలియునో, ఇటువలె సర్వప్రసంగములను వైపరీత్యముగ తెలియునో అది తామస బుద్ధి యనబడును.

### సాత్త్వికీధృతి

ధృత్యా యయా ధారయతే మనఃప్రాణేంద్రియక్రియాః,
యోగేనావ్యభిచారిణ్యా ధృతిస్సా పార్థ సాత్త్వికీ. 33

ఏ ధృతి (ధైర్యము) అవ్యభిచరితమై అటు ఇటు చలింపక స్థిరమై యుండి మనః ప్రాణేంద్రియాది క్రియలను ఫలాశ లేక యోగముచే ధరించుచున్నదో అది సాత్త్వికమగు ధృతి.

### రాజసీ ధృతి

యయా తు ధర్మ కామార్థాన్ ధృత్యా ధారయతేఽర్జున,
ప్రసంగేన ఫలాకాంక్షీ ధృతిస్సా పార్థ రాజసీ. 34

ఓ అర్జునా! ప్రసంగానుసారము ఫలాశచే యుక్తమగు ఏ ధృతి వలన ధర్మార్థకామములను మానవుడు సాధించునో అది రాజస మగు ధృతి.

### తామసీధృతి

యయా స్వప్నం భయం శోకం విషాదం మద మేవ చ,
న విముంచతి దుర్మేధా ధృతిస్సా పార్థ తామసీ. 35

హే పార్థ! దుష్బుద్ధి గలవాడు ఏ ధృతి మూలమున నిద్రను,

భయమును, శోకమును, ఖేదమును, మదమును విడుచుట లేదో అది తామసధృతి యనబడును.

మూడు గుణముల ననుసరించి కలుగు త్రివిధములైన సుఖములను గుఱించి వినుమని చెప్పుచు సాత్త్వికసుఖలక్షణమును నిరూపించుచున్నారు

సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ,
అభ్యాసాద్రమతే యత్ర దుఃఖాంతం చ నిగచ్ఛతి. 36

అర్జునా! ఇటువలె సుఖముగూడ మూడు ప్రకారములై యున్నది. మనుష్యుడు ఏ సుఖము నందు అభ్యాస పూర్వకముగా మగ్నుడగునో, దేనివలన సమస్త దుఃఖములును సంపూర్ణముగ నివృత్తి నొందునో,

యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్,
తత్సుఖం సాత్త్వికం ప్రోక్త మాత్మ బుద్ధిప్రసాదజమ్. 37

ఏది మొదట విషమువలె (చేదుగ) నుండి చివర అమృతము వలె నుండునో! ఏది ఆత్మనిష్ఠచే బుద్ధి ప్రసన్నతవలన ఆవిర్భవించునో ఆ సుఖము సాత్త్విక మనబడును.

రాజస సుఖము

విషయేంద్రియ సంయోగా ద్యత్తదగ్రేఽమృతోపమమ్,
పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్. 38

ఇంద్రియములయు విషయములయు సంయోగముచే కలుగునదియును మొదట అమృతమువలె నుండి కడకు విషమువలె పరిణమించు నదియునగు సుఖము రాజస మనబడును.

తామససుఖము

యదగ్రే చానుబంధే చ సుఖం మోహన మాత్మనః,
నిద్రాలస్య ప్రమాదోత్థం తత్తామస ముదాహృతమ్. 39

ఏ సుఖము మొదట, చివర మోహమును కలుగ జేయునో, ఏది నిద్రాలస్య ప్రమాదాదులచే ఉత్పన్న మగునో అది తామస సుఖ మనబడును.

న తదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః,
సత్త్వం ప్రకృతిజైర్ముక్తం యదేభిస్స్యాత్త్రిభిర్గుణైః. 40

త్రివిధమగు నీ ప్రకృతిగుణములచే విముక్తమై యుండు ప్రాణి పృథివియందును లేదు. స్వర్గమునందును దేవతలయందును లేదు. అంతయు త్రిగుణమయమే యని భావము.

వర్ణ ధర్మ విషయము

బ్రాహ్మణ క్షత్రియ విశాం శూద్రాణాం చ పరంతప,
కర్మాణి ప్రవిభక్తాని స్వభావ ప్రభవైర్గుణైః. 41

పరంతపా! బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రాదులకు వారి వారి స్వభావ గుణముల ననుసరించి కర్మలు విభాగింప బడియున్నవి.

బ్రాహ్మణ స్వభావ కర్మ

శమో దమ స్తపశ్శౌచం క్షాంతి రార్జవ మేవ చ,
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రాహ్మం కర్మ స్వభావజమ్. 42

శమము, దమము, తపస్సు, పవిత్రత, ఆర్జవము, క్షమ, జ్ఞానము, విజ్ఞానము, భగవద్విశ్వాసము ఇత్యాదులు స్వభావముగా బ్రాహ్మణుని ధర్మములు.

క్షత్రియ స్వభావ కర్మ

శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధేచాప్యపలాయనమ్,
దాన మీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్. 43

శౌర్యము, ధైర్యము, తేజస్సు, దక్షత, యుద్ధమునందు వీపు జూపకుండుట (పారిపోవని తనము), దాతృత్వము, ప్రజలను పాలించు సద్భావన ఇత్యాదులు స్వభావముగ క్షత్రియ ధర్మములు.

కృషి గోరక్ష వాణిజ్యం వైశ్యకర్మ స్వభావజమ్,
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్. 44

కృషి అనగా వ్యవసాయము, గోరక్షణ, వ్యాపారము ఇవి స్వభావముగ వైశ్యుల ధర్మములు. పరిచర్య (పరుల సేవ జేయుట) మొదలగునవి స్వభావముగ శూద్ర ధర్మములు.

అవ : స్వాభావికమగు తమ తమ ధర్మములను (కర్మలను) నిష్కామముగ నాచరింప భగవత్ప్రాప్తి యగును.

స్వే స్వే కర్మణ్యభిరత స్సంసిద్ధిం లభతే నరః,
స్వ కర్మ నిరత స్సిద్ధిం యథా విందతి తచ్ఛృణు. 45

ఈశ్వరార్పణ బుద్ధి గలిగి తమ తమ కర్మలయందు (స్వధర్మమునందు నిరతులైన నరులు సంసిద్ధి నొందుదురు. అట్టి స్వకర్మ నిరతులగు వారెట్లు సిద్ధిని పొందుదురో, ఆవిషయమును జెప్పెదను వినుము.

యతః ప్రవృత్తి ర్భూతానాం యేన సర్వ మిదం తతమ్,
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః. 46

ఎవని వలన ఈ భూతముల ఉత్పత్తియో, ఎవడు దీనినంతయు వ్యాపించి యున్నాడో, అట్టి వానిని తన స్వభావసిద్ధమగు కర్మచే నిష్కామముగా పూజించిన మానవుడు సిద్ధిని బడయును. అనగా జ్ఞాన నిష్ఠకు తగు యోగ్యతను బడయునని భావము.

స్వధర్మ పాలనాభివర్ణన

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మా త్స్వనుష్ఠితాత్,
స్వభావ నియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్. 47

చక్కగ ఆచరింపబడిన పరధర్మమున కంటెను కించిద్దోష యుక్తమైనను స్వధర్మమే గొప్పది. మంచిది. స్వభావముచే నియమింపబడిన కర్మ నాచరించుచుండు మనుష్యునకు దోష మంటదు.

స్వధర్మ త్యాగము చేయరాదు

సహజం కర్మ కౌంతేయ సదోష మపి న త్యజేత్,
సర్వారంభాహి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః. 48

అర్జునా! స్వభావసిద్ధమగు కర్మ సదోషమైనను త్యాజ్యము గాదు. ఎందుకనగా అగ్ని పొగచే ఆవరింపబడి యుండునట్లు సమస్త కర్మలు దోషయుక్తములే. కాని మదర్పణ బుద్ధితో చేయవలసిన శాస్త్రవిహితమగు నీకు సంబంధించిన కర్మ ధర్మములయందు నీవు ప్రవర్తింప వచ్చునని ఇచ్చట అర్థము. అజ్ఞానికి కర్మత్యాగ మశక్యము. జ్ఞానికి మాత్రము శక్యమని ఇందలి భావము.

అసక్తబుద్ధి స్సర్వత్ర జితాత్మా విగత స్పృహః,
నైష్కర్మ్య సిద్ధిం పరమాం సన్న్యాసేనాధిగచ్ఛతి. 49

దేనియందును ఆసక్తి నొందక మనస్సును నిగ్రహించి నిస్పృహుడైనవాడు సంన్యాసముచే అనగా కామ్యకర్మల త్యాగముచే నైష్కర్మ్య సిద్ధిని జ్ఞాననిష్ఠా యోగ్యతను పొందును.

జ్ఞాన యోగ సాధన క్రమ నిరూపణ

సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాఽఽప్నోతి నిబోధ మే,
సమాసేనైవ కౌంతేయ నిష్ఠా జ్ఞానస్య యా పరా. 50

కౌంతేయా! సిద్ధిని బొందినవాడు జ్ఞానము యొక్క అత్యంత శ్రేష్ఠమగు బ్రహ్మపదము నెట్లు పొందు ననునది సంక్షేపముగ చెప్పెదను వినుము.

బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాఽఽత్మానం నియమ్య చ,
శబ్దాదీ న్విషయాం స్త్యక్త్వా రాగ ద్వేషౌ వ్యుదస్య చ. 51

శుద్ధ బుద్ధిచే గూడి దృఢమగు మనస్సుచే ఇంద్రియములను సంయమన మొనర్చి శబ్దాదివిషయములను త్యజించి రాగ ద్వేషములను విడిచి,

వివిక్తసేవీ లఘ్వాశీ యత వాక్కాయ మానసః,
ధ్యాన యోగ పరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః. 52

ఏకాంతవాసము జేయుచు మితాహారము గలవాడై వాఙ్మనః కాయములను నిరోధించి వైరాగ్యశీలుడై నిత్యము ధ్యాన యోగ సంపన్నుడై,

అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్,
విముచ్య నిర్మమశ్శాంతో బ్రహ్మభూయాయ కల్పతే. 53

అహంకారము, బలము, గర్వము, కామము, క్రోధము పరిగ్రహము (అనాత్మ పదార్థముల యందలి ఆశ) మొదలైన వాటిని విడిచి నిర్మముడగువాడు ప్రశాంతాత్ముడై బ్రహ్మపదమును పొంద సమర్థుడగును.

అవ : బ్రహ్మనిష్ఠుడగు వాని లక్షణము అనగా జ్ఞానయోగముచే పరాభక్తి నొందిన వాని స్థితి.

బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి,
సమస్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్. 54

ఈ క్రమము ననుసరించి బ్రహ్మపదము నొందిన (బ్రహ్మానుభూతి నొందిన) ప్రసన్నాత్ముడు శోకము నొందడు. ఏ యొక్కటి నపేక్షింపడు. సర్వభూతములయందు సముడై పరమగు నా భక్తిని బడయును.

నేను తానే నను ఉత్తమమగు జ్ఞాన స్థితిని బొందును. ఇదే చతుర్విధములైన భక్తులలో పరాయను జ్ఞాన భక్తుని యొక్క స్థితి యని తెలియవలయును.

భక్త్యా మా మభిజానాతి యావాన్ యశ్చాస్మి తత్త్వతః,
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనంతరమ్. 55

భక్తిచే నేను ఎట్టివాడను ? ఎవరనునది (చక్కగ) తత్త్వతః తెలిసికొని అతడా పిదప నన్ను బొందును.

జీవ బ్రహ్మైక్యానుభవ రూప అభేద జ్ఞానము నొందునని ఇచ్చటి తత్త్వార్థము.

నిష్కామ భక్తిచే నన్నాశ్రయించు వానికి ముక్తి

సర్వ కర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః,
మత్ప్రసాదా దవాప్నోతి శాశ్వతం పద మవ్యయమ్. 56

నన్నాశ్రయించి ఎల్లప్పుడు సర్వకర్మలు చేయు చుండినను నా యనుగ్రహమున నతడు శాశ్వతమగు అవ్యయ పదము నధిగమించును.

నా యందే చిత్తము నుంచుము

చేతసా సర్వ కర్మాణి మయి సంన్యస్య మత్పరః,
బుద్ధియోగ ముపాశ్రిత్య మచ్చిత్త స్సతతం భవ. 57

సమస్త కర్మలను మనసా నా కర్పించి మత్పరాయణుడవై స్థిరమును, సమమునగు బుద్ధి గలవాడవై సంతతము నా యందు చిత్తము నుంచుము.

మచ్చిత్త స్సర్వ దుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యసి,
అథ చేత్త్వ మహంకారా న్న శ్రోష్యసి వినంక్ష్యసి. 58

నా యందు చిత్తము గలవాడవై యుండిన నీవు నా యనుగ్రహముచే సంకటముల నుండి తరింతువు. దాటెదవు. గాని అహంకారముచే నేను జెప్పిన దానిని లక్షింప కుండినచో తప్పక నీవు నాశమొందెదవు.

యదహంకార మాశ్రిత్య నయోత్స్య ఇతి మన్యసే,
మిథ్యైష వ్యవసాయ స్తే ప్రకృతి స్త్వాం నియోక్ష్యతి. 59

అహంకారము నాశ్రయించి నేను యుద్ధము జేయ నొల్లనని చెప్పు నీమాట మిథ్యాప్రలాపము. ఈ నీ నిశ్చయము వ్యర్థము. ఎందు కనగా, నీ ప్రకృతి (స్వభావము) నీ చేతులచే మరల నీ కర్మ నాచరింప జేసియే తీరును.

స్వభావజేన కౌంతేయ నిబద్ధస్స్వేన కర్మణా,
కర్తుం నేచ్ఛసి యన్మోహా త్కరిష్యస్యవశోఽపి తత్. 60

కౌంతేయా! నీ స్వాభావికమగు కర్మచే నీవు బద్ధుడవై యున్నావు. మోహము నొంది నందువలన దేనిని జేయనొల్లనని నీవు చెప్పుచున్నావో దానిని ప్రకృతి వివశుడవై నీవు చేసియే తీరవలసి వచ్చును.

సర్వుల హృదయమున నే నున్నాను

ఈశ్వర స్సర్వ భూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి,
భ్రామయ న్సర్వ భూతాని యన్త్రారూఢాని మాయయా. 61

అర్జునా! యంత్రారూఢుడై యుండి సమస్త భూతములను తన మాయచే త్రిప్పుచు ఈశ్వరుడు సర్వభూతముల హృదయ దేశమున వసించు చున్నాడు. (పరమాత్మ నైన నేను సర్వాంతర్యామినై యున్నాను).

అవ: అట్టి నీ యాత్మ రూపుడగు ఈశ్వరుని శరణు బొందు మనుచున్నారు.

తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత,
తత్ప్రసాదాత్పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్. 62

పూర్ణమగు భక్తిభావనచే అతనికి శరణాగతుడ వగుము. అతని కృపచే పరమ శాంతి యను శాశ్వత పదవిని పొందుదువు.

ఇతి తే జ్ఞానమాఖ్యాతం గుహ్యా ద్గుహ్యతరం మయా,
విమృశ్యైత దశేషేణ యథేచ్ఛసి తథా కురు. 63

ఇట్లు గోప్యమున కంటెను పరమ గోప్యమగు జ్ఞానమును నీకు జెప్పియున్నాను. దీనిని అశేషముగ చక్కగ విమర్శించి నీ ఇచ్ఛ చొప్పున (నీకు దోచినట్లు) చేయుము.

అవ: అర్జునుని యందలి అత్యంత ప్రేమచే అతని హితార్థమై మరల నుపదేశించు చున్నారు.

సర్వ గుహ్యతమం భూయః శృణు మే పరమం వచః,
ఇష్టోఽసి మే దృఢమితి తతో వక్ష్యామి తే హితమ్. 64

సర్వ గుహ్యతమ మగు పరమ రహస్యమును మరల జెప్పెదను, నీవు నా కత్యంతము గావలసిన వాడవని యెంచి నీకు హితము జెప్పెదను.

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే. 65

నాయందు మనస్సు గలవాడవు గమ్ము. నన్నే యజింపుము. నా భక్తుడ వగుము. నాకు నమస్కరింపుము. సత్యముగ నీవు నన్నే చేరుదువు.

నీవు నాకు ప్రియుడవై యున్నావు. కావున నీకిది ప్రతిజ్ఞాపూర్వకముగా జెప్పుచున్నాను.

ఇచ్చట తాత్పర్య మేమనగా, ఈపై ఇంతవఱకు నిరూపింపబడిన పరమార్థ జ్ఞానమున కంటె అన్య మింకేమియును లేదను పరమైక శ్రద్ధాయుక్తమగు మహోపకార స్మరణాత్మకమైన గురుభక్తి సూచకమగు అనుస్మరణమే ఈ భగవదుక్తి యొక్క భావమని గ్రహింపవలయును.

అవ : సర్వ ధర్మాశ్రయ త్యాగ పూర్వకముగ నన్నే శరణు బొందుమని సమస్త వేదాంత సిద్ధాంతమగు సమ్యక్ జ్ఞానమును బోధించుచున్నారు.

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ,
అహం త్వా సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః. 66

సర్వ ధర్మములను విడిచి నన్నొక్కనినే శరణు బొందుము. నేను నిన్ను సమస్త పాపములనుండి ముక్తుని జేసెదను. శోకింప వలదు.

"సర్వ ధర్మాన్ పరిత్యజ్య" అను నీ ప్రసంగమున (ధర్మశబ్దేన అత్ర అధర్మోఽపి గృహ్యతే) ధర్మమను మాటచే ఇచట ధర్మములతోబాటు అధర్మములనున్ను అని గ్రహించవలెను. ఎందుకనగా, నైష్కర్మ్య మనబడు పరమార్థ సిద్ధాంతమును దెలుపుట కొఱకై వెలువడిన ప్రసంగ మిదియై యున్నది; కాబట్టి అధర్మములను త్యాగము జేసిన వానికే పరమార్థానుభవ మగునని దీని కర్థము. "నావిరతో దుశ్చరితాత్..." చెడ్డ నడవడిని వీడని వాడు శాంతిని బడయ జాలడు అన్నట్లు అధర్మములను దుర్నడతలను విడిచిన వానికే ఈ పరమార్థానుభవమగునని తాత్పర్యము. మఱియు ధర్మమును త్యజించి అధర్మము నాచరించినను తప్పు లేదను అర్థము నిచ్చుట జేయ రాదు.

వస్తుతః ముముక్షువు ధర్మమును కూడ పాపమని విడిచి నప్పుడు అధర్మము నాచరించుట యనున దెట్లు పొసగును? జ్ఞానైకదృష్ట్యా ధర్మమునుగూడ పాప మనియే ఉపనిషత్తు దెలుపుచున్నది. "న సుకృతం న దుష్కృతగ్ం సర్వే పాప్మనోఽతో నివర్తంతేఽపహతపాప్మా హ్యేష బ్రహ్మలోకః" (ఛాం. ఉ. 8–వ ప్ర. 4. ఖం. 1–వ మంత్రము). ఇదే విషయమును స్మృతిగూడ "త్యజ ధర్మ మధర్మం చ" అను నీ ప్రకారముగ బ్రహ్మాత్మాభేద దృష్టిచే ధర్మాధర్మ రూపమగు వృత్తియును త్యాజ్యమని గ్రహింప వలయును. కేవల సుషుప్తి సుఖము ననుభవించు నప్పుడే ఈ ద్వంద్వములు లేవు – అన్నపుడు నిరావరణమగు బ్రహ్మాత్మానుభవ సమకాలమున ఈ ద్వంద్వ లేశమును ఉండదని ఆధ్యాత్మిక దివ్యదృష్టి యుక్తమైన మాట.

ఇక నన్నొక్కనినే శరణు బొందు మనిన సర్వుల ఆత్మయును, సర్వభూతములయందు సముడై యుండు ఈశ్వరుడను, అచ్యుతుడను, జన్మ జరా మరణాదులు లేని వాడ నగు నన్నొక్కనినే అనగా "నేనే ఆత్మ యని శరణు బొందుము. ("అహమేవ ఇత్యేవం శరణం వ్రజ")

ఇట్టి అకర్త్రాత్మ జ్ఞానానంతరము మరల అన్య ఉపాస్యోపాసక భేద భావము లుండునని అర్థము గాదు. నాకంటె అన్య మేదియును లేదను దృఢ నిశ్చయ స్థితియే ఇందలి సత్యార్థము.

నీ ఆత్మరూపుడనై నేనే వెలుగు చుండుటచేత నిన్నాశ్రయించి యుండిన అజ్ఞానమును నన్ను నిన్నుగా తెలియుటయను స్వరూపజ్ఞాన ముచే అనగా నేనే నీవుగా నుండు కారణమున అద్దానిని నాశ మొన ర్తును. శోకింప వలదు. శోకము నీ స్వరూపము నందు అత్యంతా భావము. ఇట్లు అహంకారాద్యనాత్మ వస్తువులకు సంబంధించిన సమస్త ధర్మాధర్మముల త్యాగముచే నేను నీవే యను అభేద శరణా గతి కేవల జ్ఞానైకభక్తి స్వరూపతః ముక్తి.

అవ : పవిత్రమగు భగవద్గీతోపదేశమును అపాత్రుడగు అనధికారికి అసాంప్రదా యికునకు చెప్పరాదని తెలుపుచున్నారు.

ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన
నచాశుశ్రూషవే వాచ్యం నచ మాం యోఽభ్యసూయతి. 67

తపస్సు లేని, భక్తి లేని, సేవాబుద్ధి లేని, (విను ఇచ్ఛలేని) నన్ను దూషించు ఏ మానవునకును ఈ జ్ఞానమును చెప్పగూడదు.

అధికారులగు వారికి గీత నుపదేశించుటచే గలుగు మహాఫలము

య ఇమం పరమం గుహ్యం మద్భక్తే ష్వభిధాస్యతి,
భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయః 68

ఎవడు శ్రేష్ఠమును పరమ రహస్యమునగు దీనిని నా భక్తులకు జెప్పునో అతనికి భక్తి యధికమై నన్నే పొందును. ఇందు సందియము లేదు.

నచ తస్మా న్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః,
భవితా న చ మే తస్మా దన్యః ప్రియతరో భువి. 69

మానవులయందు అతని కంటెను నాకు ప్రియమును కలుగ జేయువాడు మరెవ్వడును లేడు. లోకమున అతని కంటెను నాకు మిక్కిలి ప్రియుడగు వాడెవడును పుట్టడు.

గీతను పఠించు వానికి గలుగు ఫలము

అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాద మావయోః,
జ్ఞాన యజ్ఞేన తేనాహ మిష్టస్స్యా మితి మే మతిః. 70

ఎవడు ఈ ధర్మయుక్తమయిన ఆధ్యాత్మికమగు మనయొక్క సంవాదమును అధ్యయనము జేయునో అతడు నన్ను జ్ఞాన యజ్ఞముచే పూజించినట్లగునని నా నిశ్చయము.

గీతను శ్రవణము చేయు వానికి గలుగు ఫలము

శ్రద్ధావా ననసూయశ్చ శృణుయాదపి యో నరః,
సోఽపిముక్త శ్శుభాంల్లోకాన్ ప్రాప్నుయా త్పుణ్యకర్మణామ్. 71

దోషబుద్ధిని, అసూయను వీడి ఏ పురుషుడు శ్రద్ధాయుక్తుడై దీనిని వినునో అతడు పాపవిముక్తుడై పుణ్యావంతులగు వారి శుభలోకములను పొందును.

కేవలము గీతాతత్త్వమును వినుట మాత్రముననే అగ్నిహోత్ర, అశ్వమేధాది మహాయుగములు చేసిన వారు బొందిన ఉత్తమ లోక ప్రాప్తి యగునని యుండ, ఇక తజ్జ్ఞానమును బొందిన నిత్య నిరంతర తృప్తిరూప ముక్తి గలుగు ననుటయం దావంతయు సందియము లేదని అర్థము.

అవ : గీతా శ్రవణముచే అర్జునునకు మోహము నష్టమయినదా ? లేదా ? యను విషయమును దెలియ భగవంతుడు ప్రశ్నించుట.

కచ్చి దేతచ్ఛ్రుతం పార్థ త్వయైకాగ్రేణ చేతసా,
కచ్చి దజ్ఞాన సమ్మోహః ప్రణష్టస్తే ధనంజయ. 72

పార్థా ! నీవు దీనిని (గీతను) ఏకాగ్రచిత్తముచే విని యున్నావు కదా ?. నీ అజ్ఞాన రూప మోహము నష్టమైనది గదా ?.

అవ : నా యొక్క మోహము నష్టమయినది. నీ యాజ్ఞను శిరసావహింతునని అర్జునుడు విన్నవించు కొనుట.

అర్జున ఉవాచ :

నష్టో మోహః స్మృతి ర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాఽచ్యుత,
స్థితోఽస్మి గత సందేహః కరిష్యే వచనం తవ. 73

అచ్యుతా! నా మోహము నష్టమాయెను. నీ ప్రసాదము వలన స్వరూప స్మృతి గలిగెను. సంశయములు పరిహరింప బడెను. నీ ఆజ్ఞానుసారము వర్తించెదను.

శ్రీకృష్ణార్జునుల యొక్క సంవాద మహిమ

సంజయ ఉవాచ :

ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః,
సంవాద మిమమశ్రౌష మద్భుతం రోమహర్షణమ్. 74

ఈ ప్రకారముగ నేను వాసుదేవుని, మఱియు మహాత్ముడగు పార్థుని ఈ అద్భుతమైన రోమహర్షము గలిగించునట్టి అపూర్వ సంవాదమును వింటిని.

వ్యాస ప్రసాదా చ్ఛ్రుతవా నేతద్గుహ్యతమం పరమ్,
యోగం యోగేశ్వరా త్కృష్ణా త్సాక్షాత్కథయతస్స్వయమ్. 75

వ్యాసానుగ్రహముచే నేను గుహ్యతమమగు పరమైన ఈ యోగమును యోగేశ్వరుడగు సాక్షాత్ శ్రీకృష్ణపరమాత్మ ముఖారవిందమునుండి చెప్పబడిన దానిని వింటిని.

అవ : శ్రీకృష్ణార్జునుల పుణ్య సంవాదముచే గలిగిన సంజయుని యొక్క అతి హర్ష నిరూపణము.

రాజన్ సంస్మృత్య సంస్మృత్య సంవాద మిమ మద్భుతమ్,
కేశవార్జునయోః పుణ్యం హృష్యామి చ ముహుర్ముహుః. 76

ఓ ధృతరాష్ట్రా! ఈ కేశవార్జునుల పరమాద్భుతమైన పుణ్య సంవాదమును దలంచి తలంచి సారె సారెకు హర్షము నొందుచున్నాను. ఆనందించుచున్నాను.

తచ్చ సంస్మృత్య సంస్మృత్య రూప మత్యద్భుతం హరేః,
విస్మయో మే మహాన్ రాజన్ హృష్యామి చ పునః పునః. 77

మఱియు ఆ హరియొక్క అద్భుతమగు రూపమును సంస్మరించి సంస్మరించి మహదాశ్చర్యము నొందుచున్నాను. పునః పునః ఆనందము నొందుచున్నాను.

యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః,
తత్ర శ్రీర్విజయో భూతి ర్ధ్రువా నీతి ర్మతి ర్మమ. 78

ఎచ్చట యోగేశ్వరుడగు శ్రీకృష్ణపరమాత్మ, ధనుర్ధారి యగు పార్థుడు ఉందురో అచ్చట శ్రీ, విజయము, భూతి, ధ్రువమగు నీతి ఇత్యాదు లుండునని నా మతము.

రాజ్యలక్ష్మికి శ్రీయనియు, శత్రు జయమునకు హేతువగు ఉత్కర్షతకు విజయ మనియు, ఉత్తరోత్తర రాజ్యలక్ష్మ్యభివృద్ధికి భూతి యనియు, న్యాయమునకు నీతి యనియు పేరు. మనశ్శుద్ధి మూలమున సంప్రాప్తమగు ఆత్మ జ్ఞానమునందు ఇవన్నియును అంతర్గతములని తెలియ వలయును.

ఎచ్చట పరిశుద్ధాంతః కరణమో అచ్చట భగవన్నివాసము అనగా బ్రహ్మానుభూతి, అచ్చటనే సమస్త సంపదలును నిత్యతృప్తియు నుండును. ఈ బ్రహ్మానుభవియొక్క తృప్తి యందు సార్వభౌముడు మొదలుకొని హిరణ్యగర్భుని వఱకు గల సర్వానందములు సర్వ శుభములు అంతర్గతములని తాత్పర్యము.

అనుబంధ చతుష్టయముచే గూడిన అధికారియు శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుడగు గురువునుండుచోట సర్వసంపత్ శ్రీ వెలయుచుండును.

ఇతి శ్రీమహాభారతే శతసాహస్రికాయాం సంహితాయాం వైయాసిక్యాం శ్రీమద్భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే మోక్షసంన్యాస యోగోనామాష్టాదశోఽధ్యాయః.

ఇచ్చటికి వ్యాస ప్రణీతంబగు లక్ష శ్లోకంబులచే నొప్పారు శ్రీ మహాభారత సంహిత యందు భీష్మ పర్వమున శ్రీ భగవంతునిచే గానమొనర్పబడిన బ్రహ్మవిద్యయు యోగశాస్త్రమునయిన శ్రీకృష్ణార్జున సంవాదాత్మకమగు ఉపనిషత్తులయందు మోక్ష సంన్యాస యోగమను పదునెనిమిదవ అధ్యాయము సంపూర్ణము.

ఓం తత్ సత్

అసి పదార్థ బోధకం

జ్ఞానషట్కం సమాప్తమ్



ఓం నమో భగవతే శ్రీమదుమామహేశ్వరాయ

# వైయాసికీ శారీరక మీమాంసా

# బ్రహ్మసూత్రములు

సర్వ వేదాంత తాత్పర్య నిర్ణయాయ మహామునిః,
చకార బ్రహ్మసూత్రాణి భగవాన్ బాదరాయణః. 1

చత్వార స్తత్ర చాధ్యాయాః ప్రత్యేకం తే చతుష్పదాః,
సూత్రాణాం పంచపంచాశ దుత్తరం శతపంచకమ్. 2

వేదాంతస్థాధికరణం ద్వినవత్యుత్తరం శతమ్,
ఏతచ్ఛారీరకం శాస్త్రం కృష్ణద్వైపాయనో గురుః,
పుత్ర మధ్యాపయామాస శిష్యం చ శుక మాదరాత్. 3

సూత్రలక్షణమ్—

అల్పాక్షర మసందిగ్ధం సారవ ద్విశ్వతోముఖమ్,
అస్తోభ మనవద్యం చ సూత్రం సూత్రవిదో విదుః. 4

---

సర్వోపనిషత్సార మిది యని నిర్ధరించుటకై శ్రీవేదవ్యాస మహర్షి బ్రహ్మసూత్రములను రచించెను. 1. ఇవి నాలుగధ్యాయములు గలవి. వీనిలో ప్రతి అధ్యాయమునకు నాలుగు పాదములు గలవు. మొత్తము గ్రంథము 555 సూత్రములు, 192 అధికరణములు గలిగి యున్నది. 2. ఈ శాస్త్రమును శ్రీవేదవ్యాసాచార్యులు పుత్రుడును శిష్యుడు నైన శ్రీశుకునకు ఆదరాతిశయమున నుపదేశించెను. 3.

కొద్ది అక్షరములు గలిగి సందిగ్ధము గాక సారవంతమై శాస్త్రార్థమునం దంతటను వర్తించునదియు, వ్యర్థపద రహితము, నిర్దోషమునై యొప్పు వాక్య (గ్రంథ) విశేషము సూత్ర మనబడు నని తజ్జ్ఞుల నిర్వచనము. 4.

## 1-వ అధ్యాయము - 1-వ పాదము

ఉపనిషద్వాక్యములకెల్ల బ్రహ్మతత్త్వమును బోధించుటయే పరమ తాత్పర్యము. అట్టి బ్రహ్మతత్త్వము నెఱుగ సమర్థమగు అర్థములు గల వాక్యముల వివరణ మీ ప్రథమ పాదమున దెలుపబడుచున్నది.

### ౧. జిజ్ఞాసాధికరణము

అవతారిక : అధికారి బ్రహ్మతత్త్వ విచారణ చేయవలయును.

### అథాతో బ్రహ్మజిజ్ఞాసా 1

బ్రహ్మ తత్త్వ విచారార్హత గలిగిన పిదప అనగా నిత్యానిత్య వస్తువివేకము, ఇహాముత్రార్థ ఫలభోగ విరాగము, శమాదిషట్క సంపత్తి, ముముక్షుత్వ మను సాధనచతుష్టయ సంపత్త్యనంతరము ఈ అధికారియగు ముముక్షువు బ్రహ్మ జిజ్ఞాస చేయవలయును. ఎందుకన, కర్మలను బోధించునట్టి వేదములే ఆ యా కర్మఫలము లనిత్యములని తెలుపుచుండుటవలన మోక్షాధికారి యగు నతడు పరమసత్యమగు బ్రహ్మతత్త్వమునే విచారించవలె నని సూత్రార్థము.

వివరణ: తాను కాని దానిని తాను గాదని నిషేధించి (వేఱుపఱచి) తన్నుదా దెలియుటయు, మానసేంద్రియాదులను సంయమించి (నిగ్రహించి), ఐహికాముష్మిక సుఖములయందపేక్ష లేకయుండుటయు, శమాదిషట్కసంపత్తి కలవాడై, జనన మరణ సుఖదుఃఖాద్యనుభవ రూప సంసార నివృత్త్యుపాయమునందు అధికమగు ఇచ్ఛ గలిగిన, సాధన చతుష్టయ సంపద్విశిష్టుడే బ్రహ్మ విచారమున కధికారి యని అర్థము. వేదమునందు చెప్పబడిన వైదిక కర్మలు, తత్తత్ఫలములు, సాతిశయ క్షయ పతనాది అనిత్య లక్షణములు గలవై అశాశ్వతములై యున్నవని వేదములు చెప్పుచున్నందువలన వివేకి యగువాడు జాగరూకుడై కర్మ (ఫలము) యందలి అభిమానమును వీడి సర్వానర్థ నివృత్తి పూర్వక శాశ్వతానంద లక్షణాత్మకమగు మోక్షము నిచ్ఛయించ వలయును. బ్రహ్మత్వము తన స్వరూపమైయే యుండినను అజ్ఞతచే మఱుగుపడిన దానివలె నున్నం

దువలన ఏతద్విచారము సంసారాధ్యాస (భ్రమ) నివృత్తికై అత్యా వశ్యకమని అర్థము.

౨. జన్మాద్యధికరణము

అవ : జగన్మూలమును విచారార్హమునగు బ్రహ్మలక్షణ మెట్టిదను విషయము ఈ సూత్రమున వివరింపబడును.

జన్మాద్యస్య యతః. 2

దృశ్యమగు నీ ప్రపంచోత్పత్తి స్థితి లయాదులు దేనివలన గలుగుచున్నవో అదే బ్రహ్మము.

ఈ జగదుత్పత్తి స్థితి లయాదులకు కారణమగునదే బ్రహ్మము. వివిధములగు నామరూపములచే జగత్తు ♦అనేక జీవులతో గూడి వ్యవస్థా బద్ధమై అనూహ్యమై వెలయుచున్నది. కాబట్టి దీనికి కారణమగు ఆ బ్రహ్మము సర్వజ్ఞ మనియు దెలియు చున్నది.

3. శాస్త్రయోనిత్వాధికరణము

అవ : బ్రహ్మము సర్వజ్ఞ మనియు అది కేవలము శాస్త్రప్రమాణము చేతనే తెలియబడు ననియు దెలుపుచున్నారు.

శాస్త్రయోనిత్వాత్. 3

శాస్త్రములకు అనగా ఋగ్యజుస్సామాథర్వాణ వేదములకు మూలమగుటవలన, లేక కారణ మగుటవలన బ్రహ్మము సర్వజ్ఞము. సర్వజ్ఞమగు ఈ బ్రహ్మమునుండి ఉచ్ఛ్వాస ప్రశ్వాసములవలె ప్రయత్నము లేకనే వెలువడిన ఉపనిషత్తులను శాస్త్రములే ఇందులకు ప్రమాణము. ఉపనిషత్తులు బ్రహ్మ విషయమునే అనేక యుక్త్యనుభవములచే చక్కగా నిరూపించి తెలుపుచున్నవి. అది ప్రత్యక్షాది ఇతర ప్రమాణములచే గ్రహింప బడునది గాదు. అనగా ప్రమాణాంతర ప్రతిపాద్యము గాదు. అపూర్వ మగు ఉపనిషత్తే ఆవరణ నివృత్తి పూర్వకముగ బ్రహ్మ తత్త్వమును దెలుపుటకు సమర్థమై

♦ బ్రహ్మ స్తిత్వమునకంటె వేఱగు ఉనికిచే జగత్తుండజాలదు. వస్తుతః ఈ జగమంతయు అలీకము, అసత్తు.

యున్నదని పరమ ప్రమాణమై యున్నదని అర్థము.

## ౪. సమన్వయాధికరణము

అవ : ఉపనిషత్తులు ఒక్కొకటి ఒక్కొక్క విధముగ దెలుపుచుండ కేవల పరబ్రహ్మ తత్త్వమును నిర్ణయించుటే ఉపనిషత్తాత్పర్య మని ఎట్లు తెలియవలయుననగా, సర్వోపనిషత్తులు ఏక ముఖ ముగా బ్రహ్మతత్త్వమునే తెలుపుచున్నవని చెప్పుచున్నారు.

## తత్తు సమన్వయాత్ 4.

ఉపనిషత్తుల ఆద్యంతములు చక్కగా నవలోకించి గురుముఖ మున దెలిసి చూచిన బ్రహ్మమునే గుఱిగా దెలుపుటకొఱకై (ఉపని షత్తు లన్నియు) ప్రవర్తించు చున్నవని సుస్పష్ట మగును. గురుశాస్త్ర సహాయము లేని కేవల మూహాచే ఆత్మ తత్త్వము తెలియబడునది కాదు. అది ఇంద్రియములకు గోచరించునది కాదు. అతీంద్రియము కాబట్టి ఉపక్రమోప సంహారాది శ్రుతి షడ్లింగ తాత్పర్య నిర్ణాయక దివ్య దృష్టిచే ఉపనిషత్తు లన్నియును అద్వితీయమగు బ్రహ్మమునే బోధించునవియై యున్నవనియు మఱి యొకటిని దెలుపుట తాత్పర్యము గాదని తెలియవలయును.

## ౫. ఈక్షత్యధికరణము

అవ : ఉపనిషత్తులు బ్రహ్మమునే బోధించు చున్నవని ఎందుకు చెప్ప వలయును? సత్త్వరజస్తమోగుణముల సామ్యావస్థ యగు ప్రధానాదులను దెలుపుచున్నవని చెప్పిన తప్పేమి? యనిన యోజించుట యనునది చేతన మగు బ్రహ్మమునందే గాని జడ మగు ప్రధానాదులయందు సంభవింప జాలదని నిరూపణ చేయుచున్నారు.

## ఈక్షతేర్నాశబ్దమ్. 5

చూచుట యను క్రియ నుపయోగించుట వలన, లేక సంక ల్పించె నని చెప్పుటవలన ఇది జడమగు ప్రధానమునకు జెల్లదు. కాబట్టి చేతన మగు బ్రహ్మమునకంటె జడమగు ప్రధానాదులను ఉప నిషత్తులు చెప్పవు.

## గౌణశ్చేన్నాత్మశబ్దాత్. 6

జలము, అగ్ని యోజించెనని వేదములయందు చెప్పబడినది. జడములగు నా భూతములు యోజించెననుట గౌణమైన విషయమే యగుగాని ముఖ్యముగాదు. అటువలె ప్రధానాదులయొక్క యోజనయు గౌణమే అనవలెను. ఎట్లన, జగత్కారణ మైన వస్తువు సద్రూప మగు ఆత్మయే యనియు, అదియే యోజించె ననియు చెప్పవలయునే గాని (అది గౌణము కాదు) అచేతనమగు ప్రధానము(సత్వరజస్తమో గుణముల సామ్యావస్థ యగు ప్రకృతి) సంకల్పించె ననుట పొసగదు.

## తన్నిష్ఠస్య మోక్షోపదేశాత్. 7

ఆ సత్యవస్తువునందు నిష్ఠ యనగా అభేద జ్ఞానముగల యతనికి మోక్ష మగునని ఉపదేశించుట వలన సచ్ఛబ్దముచే చెప్పబడునది ప్రధానము గాదు. నిజముగా జగత్కారణము బ్రహ్మమే యనుటకు తాత్కారణము జగత్కారణమును ధ్యానించు వానికి మోక్ష మగునని చెప్పబడి యున్నది. కాబట్టి జడమగు ప్రధానమును ధ్యానించుటవలన మోక్ష మనునది ఎట్లు పొసగును? అసంభవము.

అవ : సచ్ఛబ్దవాచ్యము బ్రహ్మమే యని ఈ రెండవ కారణముచే గూడ తెలుపుచున్నారు.

## హేయత్వావచనాచ్చ. 8

మోక్షావస్థయందు విడువ వలసిన దానిని నిరూపించినందువలనను, ఏ యొకటిని దెలిసిన సర్వమును తెలిసినట్లగునో యను ప్రతిజ్ఞా వచనమునకు విరోధమగుట వలన సచ్ఛబ్దముచే చెప్పబడునది ప్రధానము కాదు. వాచ్యార్థ మగు ప్రధానాదులు త్యాజ్యములు.

జగదుత్పత్తి స్థానము నీ ఆత్మయే యని శ్వేతకేతువను చేతనునకు ఉపదేశింప బడినది. అది ప్రకృతియే అయి యుండిన దానిని గ్రహింప జేయకుండునా? దానిని బోధింపక తన యథార్థ స్వరూపమును బోధించెను అన్నపుడు ప్రధాన మను మాట ఎచ్చట నున్నది?

అర్థానిని ధ్యానించు వానికి మోక్షమని ప్రధానాదివాదులు కూడ చెప్పలేరు.

వేఱొక కారణము:

స్వాప్యయాత్. 9

తనయందు అనగా సత్ పదమునకు అర్థమగు బ్రహ్మమునందు సర్వము లయ మగుటవలన, సుషుప్తి సమయమునందు జీవుడు బ్రహ్మమునందే లీన మగునని చెప్పబడి యుండుట వలనను సత్పదముచే చెప్పబడినది ప్రధానము కానేరదు. గాఢ నిద్రయందు ఎల్లప్రాణులు జగత్కారణ మగు బ్రహ్మమునందే సద్రూపాత్మయందే చేరుటవలన ఈ చేతనుల చేరిక జడమగు ప్రధానమునందు సంభవింప జాలదని అర్థము.

గతి సామాన్యాత్. 10

సర్వోపనిషత్తులు బ్రహ్మమునందే తాత్పర్యము గలవియై యున్నందున జడమగు ప్రధానము సచ్ఛబ్దముచే చెప్పబడునది గాదని తెలియవలెను.

శ్రుతత్వాచ్చ. 11

శ్రుతియందు ప్రత్యక్షముగ సర్వజ్ఞ మగు చేతన వస్తువే జగత్కారణ మని చెప్పబడి యుండుటచేత సచ్ఛబ్దముచే చెప్పబడినది ప్రధానము కాదు; పరబ్రహ్మమే. కాబట్టి జగత్కారణత జడమగు ప్రధానమునకు గాని, మఱి దేనికిగాని చెల్లదు.

౬. ఆనందమయాధికరణము

అవ : ఉక్తపంచాధికరణములచే వేదాంత శ్రుతి వాక్యము లన్నియు బ్రహ్మమునే బోధించు చున్నవని చెప్పబడి నట్లాయెను. విజ్ఞానమయ కోశాంతర్గతమై మఱియొక ఆత్మ గలదు అనెడి వాక్యమునందలి ఆనందమయ శబ్దము నిర్గుణ పరబ్రహ్మమును బోధించునా? అట్లుగాక ఉపాసనా నిమిత్తమై సగుణ బ్రహ్మమును దెలుపునా? యనిన బ్రహ్మమును పుచ్ఛమని చెప్పినదియు తప్పు గాదని తెలుపు చున్నారు.

## ఆనందమయోఽభ్యాసాత్. 12

ఆనందమయుడు బ్రహ్మమే యని అనేక సారులు చెప్పుటవలన ఆనందమయ శబ్దముచే చెప్పబడినది నిర్గుణ పరబ్రహ్మమే. వేయేల? ముందు విమర్శించు నపుడు సారెసారెకు బ్రహ్మశబ్దము "ఆనందం బ్రహ్మణో విద్వాన్" ఇత్యాదిగా అనేక వాక్యములచే ఆనందమయ శబ్దము పరబ్రహ్మ బోధక మని తెలియుచున్నది. కాన నిర్గుణ పర బ్రహ్మమును బోధించునే గాని ఇతరమును బోధించదు. "బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" అను వాక్యమునందలి బ్రహ్మ పదము స్వతంత్రముగ పరబ్రహ్మమునే బోధించు నని అర్థము.

## వికార శబ్దాన్నేతిచేన్న ప్రాచుర్యాత్. 13

'మయట్' ప్రత్యయమునకు వికారార్థము గాబట్టి ఆనందమయ పదముచే చెప్పబడునది బ్రహ్మమే యని ఎట్లు చెప్పదగును? అనిన, అది సరికాదు. ఎందుచేత ననగా ప్రాచుర్యాత్—'మయట్' ప్రత్యయము ప్రాచుర్యార్థకముగ గూడా ఉండుట వలన (నిరతిశయమైన ఆనందమని అర్థము) ఆనందమయ శబ్దమునకు ఆనందము వికారముగా గలది యని అర్థము గాక కేవలము ఆనందమే యని అర్థ మగుటవలన ఆనందమయ శబ్దముచే చెప్పబడునది పరబ్రహ్మమే యని అర్థము. మఱియు ఆనందమయునకు వెనుక చెప్పబడిన కోశములకెల్ల పుచ్ఛ మని చెప్పిన పద్ధతి ననుసరించి దీనికిని ఆ నామము నుపయోగింప యోగ్యమై యున్నది. అంతేగాని నిజముగా ఆనందమయునకు అవ యవములు లేవు. ఇక పుచ్ఛ మని చెప్పబడినది పుచ్ఛమువలె ఆధార మని తెలియవలయును.

## తద్ధేతువ్యపదేశాచ్చ. 14

బ్రహ్మమే సర్వకారణమై యున్నట్లు చెప్పబడినందున అదియే ఆనందమయ శబ్దమునకు అర్థము.

## మాంత్రవర్ణికమేవచ గీయతే. 15

"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" యను మంత్రమునందు చెప్ప బడిన బ్రహ్మమే ఆనందమయ వాక్యమునగూడా చెప్పబడినది. అందుచే

ఆనందమయ పదముచే వర్ణితమైనది నిర్గుణ పరబ్రహ్మమే. పై శ్రుతి యందు బ్రహ్మ మని ఉల్లేఖింప బడి యున్నది కావున పుచ్ఛ మన్నను తప్పు గాదు.

నేతరోఽనుపపత్తేః. 16

ఆనందమయు డనగా జీవుడు అను అర్థము గలదుగదా యనిన, ఈ వాక్యము జీవుని తెలుపుట కొఱకై వెలువడినది కాదు. ఈ ఆనందమయుడు జీవుడే యని చెప్పునెడల ఆ జీవుడే సర్వ జగత్తును సృజించెనని చెప్పవలసి వచ్చును. కావున ఇది పొసగదు. ఈ సమస్తము ఏ ఆధారమున ఏ యునికినుండి బయలు దేరి వచ్చునో ఆ పర బ్రహ్మతత్వమును దెలుపుటకొఱకై వెలువడిన వాక్యమే గాని ఆనంద మయ శబ్దముచేత జీవుడు చెప్పబడు ననుట సంభవింపదు. ఇచ్చట ఆనందమయ పదముచే చెప్పబడు వాడు జీవుడు గాడని భావము. బ్రహ్మ శబ్దము స్వతంత్రముగ నిర్గుణ మగు అర్థమునే చెప్పును.

భేద వ్యపదేశాచ్చ. 17

ఈ ఆనందమయుడు (జీవుడు) బ్రహ్మమునుండి ఆనందమును పొందునే గాని అన్యథా కాదు. కాబట్టి ఇతడు ముఖ్యుడు కాడు.

నిజమగు ఆనందము (ఆనందమొందించునది) బ్రహ్మమే. జీవునకును ఆనందమయునకును భేదము చెప్పబడి యుండుటవలన ఈ ఆనందమయుడు బ్రహ్మము తప్ప మఱి యొకడు గాడు.

కామాచ్చ నానుమానాపేక్షా. 18

తైత్తిరీయోపనిషత్ భృగువల్లి యందు చెప్పబడి యుండు ఆనందము బ్రహ్మమే యని నిర్ణయ మైనందుచే ఆనందమయు డనినను బ్రహ్మమే యని ఎందుకు చెప్పరాదు? అనిన, ఆనందరూప మొందినది యను అర్థముగల మయట్ ప్రత్యయముండుటవలన ఈ ఆనంద మయుడు బ్రహ్మము గాడు. బ్రహ్మతత్వ మింకొక దానిచే వికారము నొందునది కాదు. వికారార్థమును చెప్పవలయునను ఉద్దేశముచే ఈ మయట్ అను ప్రత్యయము ఆనందమయ కోశమునందు ప్రయోగింప

బడినది. అట్లు లేకున్న ఈ మయట్ ప్రత్యయమునకు విరోధము వచ్చును.

## అస్మిన్నస్యచ తద్యోగం శాస్తి. 19

జీవుడు బ్రహ్మత్వమును పొందునని బ్రహ్మమునకు, జీవునకును భేదమును తెలుపుటను చూచిన, ఇచ్చట చెప్పబడినది సగుణ బ్రహ్మమనియా యర్థము? అనిన, సమాధానము—

ఇచ్చట బ్రహ్మమునందు జీవుడు చేరి అభేద మొందునని చెప్పినందువలన యీ జీవ బ్రహ్మలకు భేదము లేదు. మఱియు పరబ్రహ్మతత్వము అవాఙ్మానసగోచర మైనందువలనను, నిర్గుణతత్వ మైనందువలనను అట్టి పరమ సత్యమును చెప్పుటకై వెళ్ళి శ్రుతిమాత ఏతన్మధ్యమున లోకసిద్ధ మగు భేదమును చెప్పియుండుట కేవలానువాదమాత్రమే యని తెలియవలయును. నేనే పరబ్రహ్మ మను జ్ఞానముగల ఈ ఆనందమయాత్మకు అనగా జీవునకు బ్రహ్మమే నీవైయున్నావని వేదము (మహావాక్యము) చెప్పుచున్నది.

## ౭. అంతరధికరణము

సూర్య మండలాంతర్వర్తియు నేత్రాంతర్గతుడునై యున్న బంగారు మేని ఛాయగల పురుషుని ఉపాసన జేయవలె నని ఛాందోగ్యశ్రుతియందు చెప్పబడి యుండుటచే ఈ పురుషుడు సంసారియా? లేక పరమేశ్వరుడా? యనిన ఆ సూర్యమండలము నందుండు నదియు బ్రహ్మమే నని తెలుపు చున్నారు.

## అంతస్తద్ధర్మోపదేశాత్. 20

మున్ముందు అదే శ్రుతియందు ఆదిత్యాంతర్గతుడగు బ్రహ్మము పాపముల సంస్పర్శ లేని వాడని తెలుప బడుచున్నాడు. కాబట్టి ఆ పురుషుడు పరబ్రహ్మమే నని అర్థము. అతనికి బంగారు ఛాయగల దేహము అను నీ మొదలగు రూపములను చెప్పియుండుట కేవలముపాసనార్థమయియే గాని అన్యథా కాదని తెలియవలయును. మఱియొక కారణము:

### భేదవ్యపదేశాచ్చాన్యః. 21

ఆ పురుషుడు సూర్యమండలమునం దుండుచు సూర్యున కగపడక సూర్యు నేలుచున్నందున, ఆ సూర్యున కధిష్ఠానమై యున్నాడని చెప్పబడి యున్నందున అతడు పరమాత్మయే (బ్రహ్మమే) యని అర్థము. మఱియు ఎవడు సూర్యుని ప్రేరేపించు చున్నాడో ఎవనికి సూర్యుడే శరీరమో తన లోపలనే యుండినను ఎవనిని సూర్యుడు తెలిసికొనలేకున్నాడో వాడే పరబ్రహ్మము. ఇచ్చట సూర్యు డనగా సూర్యదేహము నభిమానించు జీవుడని తెలియవలయును.

#### ౮. ఆకాశాధికరణము

### ఆకాశ స్తల్లింగాత్. 22

జగత్కారణ మాకాశ మని ఒకానొక శ్రుతియందు చెప్పబడి యున్నది. అట్లుండగా బ్రహ్మమే జగత్కారణ మని ఎట్లు చెప్పగలరు? "అస్య లోకస్య కా గతిరితి ఆకాశ ఇతి హోవాచ" అను నీ వాక్యమునందుండు ఆకాశ శబ్దమునకు భూతాకాశ మని అర్థమా? లేక పరబ్రహ్మమా? అనిన ఇచట ఆకాశ మనినను బ్రహ్మమే నని సమాధానము చెప్పుచున్నారు.

ఆకాశము సమస్త భూతములకు అవకాశ మొసగి కారణమై యుండుట వలనను అట్టి ఆకాశమునకును బ్రహ్మము కారణముగా నుండుటవలనను ఇచట ఆకాశ మనగా బ్రహ్మ మను అర్థము మాత్రమే యోగ్య మగును. దేశ కాల వస్తు పరిచ్ఛేద రహితమగు పరమార్థ తత్వమును దెలిపెద నని ప్రారంభించి ఆకాశ మని చెప్పబడి యుండుట వలన ఇచ్చట ఆకాశ శబ్దమునకు విలక్షణ మగు బ్రహ్మ మనియే అర్థము గ్రహింప వలయును.

#### ౯. ప్రాణాధికరణము

(ప్రాణ మనినను బ్రహ్మమే.)

### అత ఏవ ప్రాణః. 23

మఱొక చోట సమస్త భూతములు ప్రాణమునందే చేరిపోవు నని చెప్పబడి యున్నందువలన జగత్కారణము ప్రాణవాయు వేనా!

కాదా? అనిన ప్రాణ మనినను ఇచట బ్రహ్మమేనని సమాధానము.

బ్రహ్మమునందే లయ మొందుటవలన ప్రాణ మనగా ఇచట బ్రహ్మమనియే అర్థము. కాబట్టి ప్రాణ శబ్ద వాచ్యము పరబ్రహ్మమే. ఈ ప్రాణముచే సర్వభూతములయొక్క ఉత్పత్తి లయములు జెప్పబడి యున్నవి. సమస్త భూతములయొక్క ఉత్పత్తి వినాశములు బ్రహ్మమునందే సంభవించును. ప్రాణవాయువునందు గాదు.

## ౧౦. జ్యోతిశ్చరణాధికరణము

(జ్యోతి అన్నను బ్రహ్మ మనియే అర్థము.)

### జ్యోతి శ్చరణాభిధానాత్. 24

ద్యులోకమునకు పైగా ఏ జ్యోతి ప్రకాశించు చున్నదో అనునీ మొదలగు వాక్యములయందుండు జ్యోతి శ్శబ్దముచే చెప్పబడునది పరబ్రహ్మమా? లేక అగ్న్యాది మండల త్రయమున ఏదైన నొకటియా? అనిన జ్యోతి యనినను బ్రహ్మమనియే సమాధానము.

ఇచ్చట జ్యోతి శ్శబ్దముచే పరబ్రహ్మ తత్వమే చెప్పబడును గాని సూర్యాది జ్యోతిస్సులు గాదు. ఎందువల్ల ననగా, 'పాదోస్య విశ్వా భూతాని' ఈ భూతము లెల్ల ఒక్క పాదమని మిగిలిన మూడు పాదములు పై నున్నవని చెప్పబడి యుండుట వలన జ్యోతి ర్వాక్యమునందలి ద్యులోక సంబంధము బ్రహ్మమును బోధించు నదియే యని అర్థము.

### ఛందోభిధానాన్నేతిచేన్న తథా చేతోఽర్పణనిగదాత్తథాహి దర్శనమ్. 25

"పాదోస్య విశ్వాభూతాని" యనుచోట బ్రహ్మమును గుఱించియే చెప్పిన దని చెప్పరాదు. అంతకు పూర్వవాక్యము ఈ ప్రపంచమంతయు గాయత్రియే యని గాయత్రీ ఛందస్సును చెప్పుచున్నది. కావున జ్యోతి శ్శబ్దము పరబ్రహ్మమును గూర్చి చెప్పుననుట చెల్లదు.

సమాధానము: ఇచ్చట చెప్పినది గాయత్రీ స్వరూపముతోనుండు బ్రహ్మమునందు గాయత్రీ మూలమున మనస్సును (బ్రహ్మ

త్త్వమునందు) ఏకాగ్రత నొందింప వలయు నను దృష్టిచే నిర్గుణ మగు పరబ్రహ్మ తత్త్వము జ్యోతి శ్శబ్దముచే చెప్పబడినది. కాబట్టి పైమూడు పాదములు బ్రహ్మమే. గాయత్రీ మూలమున బ్రహ్మో పాసనయే ఇచట చెప్పబడినదని తెలియ వలయును.

భూతాదిపాదవ్యపదేశోపపత్తేశ్చైవమ్. 26

సమస్త భూతములు ఒక పాదమే యను మాట గాయత్రీ స్వరూపముతోనుండు బ్రహ్మమునకు సంబంధించినదే కాని ఛందస్సు నకు సంబంధించినది కాదు. ఛాందోగ్య శ్రుతియందు గాయత్రీ పాదములను వర్ణించు నపుడు ప్రథమము జంతువులనియు ద్వితీయము భూమి యనియు తృతీయము శరీరమనియు చతుర్థము హృదయ మనియు చెప్పబడి యున్నది. వర్ణాత్మక మగు గాయత్రీ ఛందస్సునకు ఇట్టి పాదము లుండునా? ఉండ నేరవు. సర్వాత్మక మగు ఆ పరబ్రహ్మ మునకే ఉపాసనార్థమై ఇట్టి అర్థమును కల్పించుట విరోధము గాదు. కావున గాయత్రీమంత్రము పరబ్రహ్మమునే చెప్పును.

ఉపదేశభేదాన్నేతిచేన్నోభయస్మిన్నప్యవిరోధాత్. 27

శంక: గాయత్రీ మంత్రమునందుండు మూడు పాదములు దేవ లోకమునందున్నవి యనునది బ్రహ్మాండమునందలి మాట యయ్యె. ఇచ్చట నన్ననో దేవలోకమునకంటెను పైనున్న జ్యోతిప్రసంగము కాబట్టి ఈ రెండును వేఱువేఱు గాదా?

సమా: ఇచ్చట దేవలోకమునందు అని సప్తమీ విభక్తిని చెప్పియుండినను అది దేవలోకమునకంటే 'అతః పరో దివః' అను పంచమీ విభక్తి అర్థమునే చెప్పును నని తెలియ వలయును. అందుచే ఈ చెప్పబడిన దొకభేదము కాదు. పిట్ట చెట్టుకొనయందున్నది. అది చెట్టు కొనకు పైనున్నది అని రెండు విధముల చెప్పినను అర్థ మొక్కటే యైనట్లు జ్యోతి శ్శబ్దముచే చెప్ప బడినది బ్రహ్మమనియే భావము.

౧౧. ఇంద్రప్రాణాధికరణము

ప్రాణస్తథానుగమాత్. 28

శంక: కౌషీతకీ బ్రాహ్మణోపనిషత్తునందు ఇంద్ర ప్రతర్దన

సంవాదములో ఇంద్రుడు నేనే యని జ్ఞాన స్వరూప మగు ప్రాణమును చెప్పియుండుట వలన ఆ వాక్యమునందలి ప్రాణవాయువే ఉపాస్య దేవత కారాదా? ప్రాణ శబ్దమునకు అర్థమేమి? అధిదేవత యగు ఈ ఇంద్రుడు జీవుడా? పరబ్రహ్మమా? అనిన, ఇంద్రునియందుండు నదియు బ్రహ్మమే నని సమాధానము.

ప్రాణశబ్దమునకు పరబ్రహ్మ మనియే అర్థము. ప్రాణ మనిగాని జీవు డనిగాని అర్థము కాదు. 'ప్రాణోస్మి ప్రజ్ఞాత్మా' జనన మరణాదులు లేని వాడు అను నీ మొదలగు బ్రహ్మ సంబంధమైన లక్షణములను తెలిపి యున్నందువలన ప్రాణవాక్యమునందలి ప్రాణపదముచే పరబ్రహ్మమే చెప్పబడును. సందర్భానుసారముగా ఈ తెలిపిన ప్రాణ వాయువు గాదు.

### నవక్తురాత్మోపదేశాదితిచేదధ్యాత్మసంబంధభూమాహ్యస్మిన్. 29

శంక : పై ఉపనిషత్తునందు ఇంద్రుడు "మామేవ విజానీహి" ఓ ప్రతర్దనా! నీవు నన్ను బాగుగా తెలిసికొను మని చెప్పు వాక్యముండుటచేత ఇంద్రు డనగా శరీరముగల ఒక దేవత యని ఆ దేవతయే ప్రాణశబ్దముచేత చెప్పబడిన వాడని తెలియునే గాని బ్రహ్మ మనుట పొసగదు గదా? అనిన,

సమాధానము : ఇంద్రుడు తనను తెలిసికొను మని చెప్పియుండి నంతమాత్రమున ప్రాణ శబ్దము పరబ్రహ్మమును చెప్పదనుటకు రాదు. ఆ అధ్యాయమునం దెచ్చట జూచినను పరబ్రహ్మముయొక్క లక్షణములే విశేషముగా చెప్పబడియున్నవి. ఆత్మ ఆనందము అమృతము ఇత్యాది. అందుచేత వజ్రపాణి యగు ఇంద్రునకు సంబంధించిన ఔపాధికమైన మాటలు ఇందు లేవు. అందువలన పరమాత్మయే (పరబ్రహ్మమే) ఉపాసనాయోగ్య మని అర్థము.

### శాస్త్రదృష్ట్యా తూపదేశో వామదేవవత్. 30

శంక : 'మామేవ విజానీహి' (నన్నే బాగుగా దెలిసికొనుము) అని చెప్పిన ఇంద్రుని వాక్యార్థమేమి? నీకు పరమ పురుషార్థము కల్గునని చెప్పుట యందేమి అర్థము గలదు? ఇంద్రునకు దేహమునకంటె

వేఱగు బ్రహ్మము నేనను జ్ఞాన ముండె నని ఎట్లు చెప్పగలవు? అట్లు డిన బ్రహ్మ తత్త్వమును మఱొక్కరికి బోధించు ననుటదెట్లు? అనిన,

సమా : ఇంద్రునకుగూడ శుక వామ దేవాదులకు వలె ఆత్మ జ్ఞాన ముండెను. అతడు శాస్త్రములను చక్కగ చదివి గురుకులవాస మొనర్చి బ్రహ్మ సాక్షాత్కార మొందిన వాడు గావున అతడు ఇతరు లకు ఉపదేశింప వచ్చును.

జీవముఖ్య ప్రాణలింగాన్నేతి చేన్నోపాసా త్రైవిధ్యాదాశ్రితత్వా దిహతద్ యోగాత్. 31

శంక : ప్రాణ పదమునకు ఇంద్రుడే యని అర్థము కాకపోయి నను బ్రహ్మమే యని అర్థము చెప్పుట సరికాదు. ఈ శ్రుతియందు 'సవాచం విజిజ్ఞాసీత' అను వాక్యముచే ప్రాణశబ్దమునకు జీవు డని అర్థము చెప్పబడి యున్నది. మాటలాడువానిని తెలియుము. ప్రాణమే ప్రజ్ఞానాత్మయే ఈ శరీరమును బట్టి నిలుపుకొని యున్నదని అర్థ మున్నందువలన ఈ వాక్యము జీవుని ప్రాణవాయువును ఉపాసించవలె నని చెప్పినట్టు లయినది. అందుచే నది కేవల బ్రహ్మోపాసనయే యని చెప్పదు గదా? అనిన,

సమా : అట్లుగాదు. అచ్చట ప్రాణ, జీవ, బ్రహ్మ యను మూడు ఉపాసనలు చెప్పబడి యున్నవి. 'స్థూలారుంధతీ' న్యాయమున అనగా అరుంధతి కాని పెద్ద నక్షత్రమునే మొదట అరుంధతి యని తెలిసికొని యా పిదప దానిని విడిచి నిజమగు అరుంధతిని జూచునట్లు ప్రాణము మఱియు జీవుని ఉపాసనలు బ్రహ్మజ్ఞానమునకు సాధనములై యున్న వని తెలియవలయును.

ఇది 1-వ అధ్యాయమున 1-వ పాదము.

---

## 1వ అధ్యాయము-2వ పాదము

అవ: ఈ పాదమునందు బ్రహ్మోపాసనాపరమగు వాక్యముల వివరణ గలదు.

## ౧. సర్వత్ర ప్రసిద్ధ్యధికరణము

## సర్వత్ర ప్రసిద్ధోపదేశాత్. 1

'సక్రతుం కుర్వీత మనోమయః ప్రాణశరీరో భారూపః'

శంక: మనోమయ మగు ప్రాణమే శరీరముగా గలవాడును-ప్రకాశరూపుడు నగు ఆ పురుషుడే క్రతువొనర్చును, అను నీ వాక్యము మనోమయత్వాధర్మముచే గూడిన జీవుని తెలుపునా? లేక బ్రహ్మమును దెలుపునా? యనిన, మనోమయు డన్నను బ్రహ్మ మనియే సమాధానము. సమస్త వేదాంత వాక్యములయందు సర్వత్ర పరబ్రహ్మమును దెలుపుటకు ఏ పదము విరివిగా ఉపయోగింప బడునో అట్టి అతిప్రసిద్ధ మగు బ్రహ్మపదమే 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అను నీ ఉపక్రమోపసంహార వాక్యములయం దుపయోగింపబడి యున్నందున ప్రస్తుత వాక్యమునందుగూడ ఆ పరబ్రహ్మమే ఉపాసకుల అనుగ్రహార్థమై మనోమయత్వాది ధర్మములచే ఆరోపింప బడెను. కాబట్టి మనోమయ మన్నను బ్రహ్మమనియే అర్థము.

అవ: మనోమయత్వాది గుణములు గలది పరబ్రహ్మమే యనుటకు వేఱొక కారణము.

## వివక్షిత గుణోపపత్తేశ్చ. 2

అచ్చట చెప్పబడి యున్న సత్య సంకల్పాది గుణములు బ్రహ్మమునకు మాత్రమే ఘటిల్లును. ఇతరమునకు చెల్లవు.

అవ: మనోమయత్వము మొదలగు గుణములు గలది పరబ్రహ్మమే యని నిర్ణయించి ఆ పురుషుడు జీవుడు గాదని చెప్పబడుచున్నది.

## అనుపపత్తేస్తు న శారీరః. 3

సత్య సంకల్పాది గుణములు జీవునియం దగపడుట లేదు. కావున ఇచ్చట జీవు డని అర్థము గాదు. బ్రహ్మ మనియే తెలియవలెను. జీవునకు సర్వజ్ఞత్వాది గుణములు లేక పోవుటవలన మనోమయత్వాదులు సర్వాత్మక మగు పరబ్రహ్మమునం దుండినను విరోధము లేనందున 'సక్రతుం కుర్వీత' మొదలగు వాక్యములందు వర్ణింపబడినవాడు పరబ్రహ్మమే కాని జీవుడు కాదు.

## కర్మ కర్తృ వ్యపదేశాచ్చ. 4

పరబ్రహ్మమును ప్రాప్య క్రియకు కర్మ గాను జీవుని కర్తగాను చెప్పుట వలనగూడ మనోమయత్వాది గుణములు గలవాడు జీవుడు కాదు. అనగా బ్రహ్మము ఉపాస్యము. జీవుడు ఉపాసకుడు. ఇట్లు చెప్పియుండుటవలన ఇచ్చట ఉపాసనార్థమై చెప్పబడినది బ్రహ్మమేగాని జీవుడు గాదు. జీవుని పరమార్థ స్వరూపము బ్రహ్మమే.

## శబ్దవిశేషాత్. 5

శబ్దముయొక్క భేదము వలన జీవునియందుండు పురుషుని ఉపాసన జేయవలయు నని వేఱొక శ్రుతి చెప్పుచున్నందువలన ఇచ్చట తెలిపినది జీవుని గాదు. పరబ్రహ్మము నే యని స్పష్ట మగుచున్నది.

## స్మృతేశ్చ. 6

'ఈశ్వర స్సర్వ భూతానాం హృద్దేశేర్జున తిష్ఠతి' దేని నుపాసించునో అద్దాని స్వరూపము తానే యగునని గీత తెలుపుచున్నది. జీవుని ఉపాసించిన, ముందు తాను జీవుడే యగునుగదా? అసలు తాను జీవుడే అయియుండగా దాని కొఱకు ప్రయత్న మేల? కాబట్టి ఉపాస్య దేవత పరబ్రహ్మమే యగును గాని నిజముగా జీవుడు కానేరడు.

## అర్భకౌకస్త్వాత్తద్వ్యపదేశాచ్చ నేతిచేన్న నిచాయ్యత్వాదేవం వ్యోమవచ్చ. 7

శంక : అట్టి వ్యాపకు డగు పరమాత్మను ప్రాదేశమాత్రమును చిన్నస్థలమునందు అనగా హృదయమునం దున్నాడని చెప్పుట సంభవింపదు గదా? అట్టిది పరబ్రహ్మ మెట్లగును? అనిన,

సమా : ధ్యానార్థమై పరబ్రహ్మము చిన్నదిగా వర్ణింపబడి యున్నది. సర్వత్ర వ్యాపక మగు స్వరూపము ధ్యానార్హము కాదు. అట్టి వ్యాపక పరబ్రహ్మమును అభివ్యక్త మొనర్చు ఆ స్థానమును హృదయ మని నిర్దేశించి చెప్పుట తప్పు కాదు. వ్యాపక మగు ఆకాశము (మహాకాశము) ఘటాకాశము, సూచ్యాకాశము అని ఎట్లు వ్యప

హరింప బడుచున్నదో, అట్లు ధ్యానార్థమై హృదయదేశముచే చిన్నదిగావర్ణింప బడినది ఆ పరబ్రహ్మమే.

## సంభోగప్రాప్తిరితిచేన్న వైశేష్యాత్. 8

శంక : బ్రహ్మము హృదయమున ప్రాదేశ మాత్రమున నున్నదని అంగీకరించిన అదియును జీవునివలె సుఖ దుఃఖాది అనుభవములకు లోబడవలసి వచ్చును. అందుచేత అచ్చట బ్రహ్మ మని అంగీకరింప రాదు? అనిన,

సమా : వస్తుతః జీవ బ్రహ్మలకు భేదము లేకపోయినను ఉపాధులచే భేద ముండినట్లు భాసిల్లును. జీవునకు కలుగు సుఖ దుఃఖానుభవము బ్రహ్మమునకు కలుగదు. జీవుడు పుణ్య పాపములు చేసి సుఖ దుఃఖానుభవముల ననుభవించువాడు. ఈశ్వరునియందు అవి లేవు. అందుచేత అతనికి సుఖ దుఃఖ సంస్పర్శ లేదు.

### ౨. అత్రధికరణము

## అత్తా చరాచరగ్రహణాత్. 9

శంక : 'యస్య బ్రహ్మచ క్షత్రంచోభే భవత ఓదనః, మృత్యుర్యస్యోపసేచనమ్' ఎవనికి బ్రహ్మ క్షత్రియ కులము లన్నము వంటివో, సర్వ ప్రపంచమును సంహరించు మృత్యువు ఎవనికి అనుపానము వంటిదో అట్టి వాని స్వరూపమును తెలిసికొనవలయు నని శ్రుతి. కాబట్టి అట్టి యా పురుషుడు బ్రహ్మ మని చెప్పుటకు వీలులేదు. ఇట్టి ద్వంద్వాభిమాని జీవుడే కాని బ్రహ్మము కాదుగదా? అనిన, సర్వమునకు ఆధారమైనది బ్రహ్మమే నని సమాధానము. ఇచ్చట బ్రహ్మ క్షత్రపదములచే స్థావర జంగమాత్మక మగు సమస్తప్రపంచమును అన్నమువలె భుజించువాడు లేక సంహరించువాడు అను నిత్యాది సర్వశక్తిమత్వము బ్రహ్మమునకే పొసగును గాని జీవునకు పొసగదు. కావున ఇది బ్రహ్మతత్వమును ప్రతిపాదించు వాక్యమే యని తెలియవలయును.

## ప్రకరణాచ్చ. 10

ఈ కఠోపనిషత్ప్రసంగము 'నజాయతే మ్రియతేవా' బ్రహ్మతత్వమునకు పుట్టు చావులు లేవు అని చెప్పు ప్రసంగమునందు బ్రహ్మబోధక

మైన సదుత్తరముగా చెప్పబడి పరబ్రహ్మోపాసనయందే తాత్పర్యముగా గలది యని తెలియవలయును.

## 3. గుహాధికరణము

## గుహాం ప్రవిష్టావాత్మానౌ హి తద్దర్శనాత్. 11

శంక : 'ఋతం పిబంతౌ సుకృతస్య లోకే గుహాం ప్రవిష్టౌ పరమే పరార్ధే ఛాయాతపౌ బ్రహ్మవిదో వదంతి' అను నీ కఠశ్రుతియందు చెప్పబడినవారు గుహాయందు (హృదయగుహ) ప్రవేశ మొనర్చి కర్మఫలముల ననుభవించుచుండు ఛాయాతపములవలె విరుద్ధ స్వభావము గలిగిన ఈ ఇరువు రెవరు? అనిన, గుహాయందుండు ఇంకొకడును బ్రహ్మమే నని సమాధానము.

వీరిద్దఱియందు ఒకడు జీవుడు, మఱొకడు పరమాత్మ (బ్రహ్మము) ఒక చెట్టుపై రెండు పక్షు లున్నవి అని చెప్పు శ్రుత్యర్థమువలె ఇచ్చట కూడా హృదయగుహాయం దుండువారు ఒకడు జీవుడు, మఱొకడు పరబ్రహ్మము.

## విశేషణాచ్చ. 12

ఈ ప్రకరణమునందు జీవబ్రహ్మలను గుఱించిన విశేషములే యుండుట వలన పై వాక్యమునందు వర్ణింప బడినది పరబ్రహ్మవిషయమనియే తెలియవలయును.

## ४. అంతరాధికరణము

శంక: 'యఏషోఽక్షిణి పురుషో దృశ్యతే' కంటియందుండు పురుషుని ఉపాసన జేయ వలయు నని చెప్పి యుండు ఛాందోగ్య శ్రుతియందు వర్ణింప బడిన పురుషు డెవ్వడు? అతడు ప్రతిబింబరూపమా? లేక జీవు డనియా? అట్లుగాక నేత్రాధిదేవత యగు సూర్యు డనదగునా? అనిన, నేత్రమునందుండు నతడును బ్రహ్మమే నని సమాధానము.

## అంతర ఉపపత్తేః. 13

సమా: అతడు జీవుడు కాడు బ్రహ్మమే. జన్మమరణాదులు లేని ఆనందేత్యాది లక్షణములు పరబ్రహ్మమునకే పొసగును. కాబట్టి

కంటిలోనున్న పురుషుడు పరబ్రహ్మమే నని ఇచ్చట తెలియవలెను. ప్రతిబింబాదు లేవియును గాదు.

శంక: సర్వవ్యాపక మగు పరబ్రహ్మమునుగూర్చి తెలుపునపుడు స్థల మొకటి నిర్దేశించి చెప్పుట యుక్తము కాదుగదా? యనిన,

స్థానాదివ్యపదేశాచ్చ. 14

సమా: సూర్యమండలము, హృదయము, మొదలగు పరిశుద్ధో పాధులయందు బ్రహ్మ నుపాసింప దగునని అనేక స్థలములయందు జెప్పబడి యున్నది. అటువలె నేత్రము అతి శుద్ధప్రదేశ మైనందున అచ్చట బ్రహ్మోపాసన యనునది విహితమే.

సుఖవిశిష్టాభిధానాదేవచ. 15

ప్రస్తుత వాక్య ముండిన ఆ ప్రకరణమునందు 'ప్రాణోబ్రహ్మ' 'కం బ్రహ్మ' (ప్రాణమే పరబ్రహ్మము సుఖమే పరబ్రహ్మము) అని యుండుటచే నేత్రమునం దున్నదని చెప్పబడినది పరబ్రహ్మమే యని అర్థము.

శ్రుతోపనిషత్కగత్యభిధానాచ్చ. 16

వేదాంత శాస్త్రము దెలిసిన ఉపాసకులకు దొరకు దేవ యానము మొదలగు మార్గమే నేత్రమునం దుండువానిని ఉపాసించిన వారికి దొరకునని జెప్పబడి యుండుటవలన నేత్రమునం దుండువాడు బ్రహ్మమే యని భావము.

అవ: అక్షి పురుషుడు పరబ్రహ్మమే యని నిర్ణయించి ప్రతిబింబాదులు కావని తెలుపుచున్నారు.

అనవస్థితేరసంభవాచ్చ నేతరః. 17

ప్రతిబింబము సంతతము ఉండునది కాదు గావున అద్దాని ఉపా సన అయోగ్యము. జీవునియం దమృతత్వము మొదలగు ధర్మములు లేవు. అందువలన పై జెప్పిన లక్షణములు బ్రహ్మము నకుతప్ప జీవాదు లకు లేవు. అక్షి పురుషుడు పరబ్రహ్మమే యని సారసంగ్రహము.

## ౫. అంతర్యామ్యధికరణము

శంక: "యఃపృథివీమంతరోయమయతి, ఏషతఆత్మాంతర్యామ్యమృతః" అను శ్రుతి భూమిలోపలనుండి సమస్తమును భరించువాని ఉపాసన చేయవలె నని శ్రుతియందు జెప్పబడినది. అట్టైన అతడు తదభిమానదేవతయా? లేక పరబ్రహ్మమా? పరమాత్మ శరీరము లేనివాడగుటచే సమస్తమును ప్రేరణ యొనర్చు చున్నాడనుటకు వీలు లేదుగదా? యనిన, అంతరమున నుండుచు పాలించునదియు బ్రహ్మమే నని సమాధానము.

**అంతర్యామ్యధిదైవాదిషు తద్ధర్మవ్యపదేశాత్. 18**

సమా: అసాధారణ ధర్మయుక్త మగు ఏ పరబ్రహ్మతత్త్వము అమృతస్వరూప మనియు ఎవడు నాకును నీకును ఆత్మ యనియు చెప్పబడియున్నాడో, అంతర్యామి బ్రాహ్మణమునందు తెలుపబడిన ఆపరమ పురుషుడు పరబ్రహ్మమే నని అర్థము.

శంక: ప్రధానమే అంతర్యామి అని చెప్పరాదా? అనిన,

**నచ స్మార్తమతద్ధర్మాభిలాపాత్. 19**

సమా: అచ్చట ప్రధాన ధర్మము లగు సత్వ రజ స్తమో గుణముల ప్రసంగమే లేదు. అంతర్యామి యగు పురుషుడే వర్ణింప బడియున్నాడు. సర్వసాక్షియగు పరబ్రహ్మమే అంతర్యామి గాని సాంఖ్య శ్రుతియందు చెప్పబడు జడ మైన ప్రధానము కాజాలదు.

శంక: ప్రధానము కాకపోయినను జీవు డైనను అంతర్యామి కాడా?

**శారీరశ్చోభయేఽపిహి భేదేనైనమధీయతే. 20**

సమా: జీవుడు అంతర్యామి కాడు. కాణ్వశాఖ వారును మాధ్యందినశాఖ వారును జీవుని అంతర్యామికంటె వేఱైన వానినిగా చెప్పుచున్నారు. కావున సమస్త జీవులయం దుండి, పాలించు సర్వసు అంతర్యామి యగు బ్రహ్మమే గాని జీవుడు గాడని అర్థము.

## ౬. అదృశ్యత్వాది గుణకాధికరణము

(అగపడనిదియు మఱియు దొరకనిదియు బ్రహ్మమే)

శంక: జ్ఞాన కర్మేంద్రియములకు వేద్యము కాని తత్వము నుపాసన చేయవలె నని చెప్పియుండినపట్ల ఆ మాట ప్రధానమునకో, లేక జీవునకో సంబంధించునే కాని బ్రహ్మమునం దెట్లు పొసగును? అనిన, అయ్యా! అగపడనిదియు దొరకనిదియు గూడా బ్రహ్మమే నని సమాధానము.

### అదృశ్యత్వాదిగుణకో ధర్మోక్తేః. 21

సమా: 'యత్తదద్రేశ్యమగ్రాహ్యమ్' అను వాక్యము తర్వాత 'యస్సర్వజ్ఞ స్సర్వవిత్' ఇత్యాదిగా నున్నది గాన ఇచ్చట సర్వజ్ఞము సర్వకారణము నగు బ్రహ్మమే జగత్కారణ మని వర్ణింపబడినది. అందువలన జీవుడు కాదని భావము.

### విశేషణభేదవ్యపదేశాభ్యాంచ నేతరౌ. 22

వేఱు శ్రుతులయందును బ్రహ్మము జీవునికంటెను ప్రధానమునకంటెను విలక్షణముగ వర్ణింప బడినందున జగత్కారణము జీవుడు గాదు. ప్రధానమును గాదని అర్థము.

అవ: ఈ అర్థము నిర్ణయించుటకు వేఱొక కారణమును చెప్పుచున్నారు.

### రూపోపన్యాసాచ్చ. 23

'అగ్నిర్మూర్ధా చక్షుషీ చంద్రసూర్యౌ' ద్యులోకము శిరస్సు చంద్రసూర్యులు నేత్రములు అను మొదలగు వాక్యములచే జగత్కారణ మగు బ్రహ్మమునకు సమస్త ప్రపంచమయ మగు రూప మొకటి చెప్పబడి యుండుటచే ఇది జీవుడని కాని ప్రధాన మని గాని చెప్పుటకు రాదు. సర్వాత్మత్వము లేక పోవుటచే ఈ ప్రధాన జీవాదులు జగత్కారణములు గావు. 'యత్తదద్రేశ్య మగ్రాహ్యమ్' అను వాక్యములందు వర్ణింప బడిన అదృశ్యత్వాదిలక్షణములుగల బ్రహ్మము జగత్కారణమే గాని అన్యము గాదు.

## ౭. వైశ్వానరాధికరణము

శంక: ఆత్మ, లేక బ్రహ్మ మనిన ఎవరని శ్రుతియందు ప్రశ్న

ఉదయింప వైశ్వానరు డని ఉత్తరువు చెప్పబడినది. అచ్చట చెప్ప బడిన వైశ్వానరు డనగా జఠరాగ్నియా? పంచభూతములలో చేరిన అగ్నియా? తదభిమాన దేవతయా? లేక జీవుడా? యనిన వైశ్వా నరుడు బ్రహ్మమేనని సమాధానము.

## వైశ్వానరసాధారణశబ్ద విశేషాత్. 24

సమా: పై శ్రుతియందు వైశ్వానర శబ్ద మున్నను అది సర్వ వ్యాపక మగు పరబ్రహ్మమునకు సంబంధించినదే కాని జఠరాగ్ని మొదలగు వానియందు దేనికిని సంబంధించినది గాదు. 'ఆత్మానమే వేనమ్' అను వాక్యమునందలి వైశ్వానర శబ్దముచే బోధింప బడు నది పరబ్రహ్మమే.

## స్మర్యమాణమనుమానం స్యాదితి. 25

వైశ్వానర స్వరూపమును చెప్పుట కుద్యుక్తమైన యా స్మృతి 'అగ్నియే అతనికి శిరస్సు' అను నీ మొదలగు బ్రహ్మధర్మములను చెప్పి యుండుటను జూచిన వైశ్వానర శబ్దమునకు బ్రహ్మమే అర్థ మని తెలియబడుచున్నది.

శంక: అతడు శరీరములోపల ప్రవేశించి యున్నాడని హృద యము మొదలగు ప్రత్యేక స్థానములు చెప్పుట వలన అది బ్రహ్మ మెట్లగును? జఠరాగ్నియేగదా? యని శంకించిన,

## శబ్దాదిభ్యోంతఃప్రతిష్ఠానాచ్చనేతిచేన్న తథా దృష్ట్యుపదేశా దసంభవాత్ పురుషమపి చైనమధీయతే. 26

సమా: జఠరాగ్నిరూపమున బ్రహ్మము నుపాసించు మని చెప్పుటకొఱకై వెలువడిన వాక్య మది. కేవలము జఠరాగ్నికి 'అగ్నియే శిరస్సు' అను నీ మొదలగు అర్థము పొసగదు. వాజస నేయులుకూడా ఆ వైశ్వానరుని లోపలనుండి పాలించు పురుషుడు వేఁడని చెప్పుదురు. అంతేగాక జఠరాగ్నికి పురుషత్వము సంభవింపదు. వ్యాపక మగు పురుషత్వము బ్రహ్మమునకే సంభవించును.

## అత ఏవ న దేవతా భూతంచ. 27

ఈ చెప్పబడిన కారణము వలన విశ్వమయ మగు శరీరము కలిగి యుండుటకు వీలు లేదు. కావున అచ్చట చెప్పబడినది వెలుపలి పంచభూతములలోని అగ్ని గాని, అగ్ని-అభిమాన దేవత గాని ఈ వైశ్వానర శబ్దముచే చెప్పబడినది కాదు. కేవల మగు పరబ్రహ్మమే యని తెలియవలయును.

## సాక్షాదప్యవిరోధం జైమినిః. 28

జఠరాగ్ని స్వరూప సంబంధమే లేక ఈ వైశ్వానర శబ్దమునకు కేవలము బ్రహ్మమే అర్థ మని జైమిని ఋషి గూడా చెప్పెను. వైశ్వానరు డనగా ఇచట సర్వుల హృదయముల నధిష్ఠించి యుండు అధిష్ఠాన పరబ్రహ్మతత్వ మనియే అర్థము.

ఇక అగ్నిశబ్దమున కన్ననో ముందుకు దీసికొని వెళ్ళువాడని అర్థ మున్నందున పరమశ్రేష్ఠత్వమును తెలుపుచున్నది.

శంక: వ్యాపక మగు పరబ్రహ్మమును చిన్నదగు స్థలమున నుండువాడనుట పొసగునా?

## అభివ్యక్తేరిత్యాశ్మరథ్యః 29

సమా: బ్రహ్మము వ్యాపక మయినను ఉపాసకుల పరమానుగ్రహార్థమై చిన్నదగు శరీరమునందు ప్రవేశించి ప్రత్యక్ష మగునని ఆశ్మరథ్యు డను మహాముని అభిప్రాయము. ప్రాదేశమాత్రశ్రుతి వలన పై నిరూపించిన వ్యాపకత్వమునకు విరోధము లేదు.

## అనుస్మృతే ర్బాదరిః. 30

వ్యాపక మగు బ్రహ్మము ధ్యానించుటకు రాదు. కావున చిన్నదగు శరీరము గలదానిగా భావించి ఉపాసించుటవలన బాధ లేదని బాదరి మహాముని అభిప్రాయము.

## సంపత్తేరితి జైమినిస్తథాహి దర్శయతి. 31

వాజసనేయ బ్రాహ్మణమునందు పరబ్రహ్మమును ప్రాదేశమాత్రముగా చూపుచున్నది. అందుచే విరోధ మేమియు లేదు.

దేహావయవములయందు వ్యాపకుడగు వైశ్వానరుని అవయవములు భావించుటవలన బ్రహ్మము చిన్నదగు శరీరమంతది మైనదాయన్నట్లు గాన వచ్చును. లోప మేమియు లేదని జైమిని మహాముని అభిప్రాయము.

## ఆమనంతిచైన మస్మిన్. 32

పరబ్రహ్మమును భ్రూమధ్యమునందు దృష్టినుంచి ఉపాసన చేయవలయునని జాబాల శాఖవారు అనగా జాబాలోపనిషత్తును అధ్యయనము చేయువారు చెప్పుచు బ్రహ్మమునకు చిన్న పరిమాణమును చెప్పినను తప్పు లేదందురు. జఠరాగ్ని యని కాని, అందున్నాడని కాని శుద్ధబ్రహ్మము నుపాసించి తలంచినంత మాత్రమున పరబ్రహ్మయొక్క వ్యాపకత్వమునకు లోపమేమియు లేదు. ఇదే వైశ్వానరవాక్యమునకు పరమ తాత్పర్యము.

ఇది ఒకటవ అధ్యాయమున రెండవ పాదము.

---

## 1వ అధ్యాయము - 3వ పాదము

### ౧. ద్యుభ్వాద్యధికరణము

శంక: ఎవనియందు ద్యులోకము, భూమ్యాకాశాదు లున్నవో అతనిని ఆత్మ యని తెలిసికొనుమని చెప్పిన శ్రుత్యర్థము పరబ్రహ్మమా! జీవుడా? లేక వాయువా? యని అడిగిన ఈ సర్వమునకు బ్రహ్మమే ఉనికి యని సమాధానము.

## ద్యుభ్వాద్యాయతనం స్వశబ్దాత్. 1

సమా: పై వాక్యమునందు ఆత్మ యను శబ్దము ప్రయోగింపబడినందున అది బ్రహ్మమే యగును గాని ప్రధానాదులలో ఏదియును కాదు. సర్వాధారము, నిర్విశేష మగు పరబ్రహ్మమే యని తాత్పర్యము. ఈ విషయమును నిరూపించుటకు మఱియొక కారణమును తెలుపుచున్నారు.

## ముక్తోపసృప్యవ్యపదేశాత్. 2

'భిద్యతే హృదయగ్రంథి శ్ఛిద్యంతే సర్వసంశయాః' ఇత్యాదిగా చెప్పబడుటచే ద్యులోకాదులకు ఆధారము బ్రహ్మమనియే అర్థము. రాగద్వేషాదులనుండి విముక్తులైనవారు నామరూపములను వీడి తత్పదలక్ష్య మగు బ్రహ్మానుభవము నొంది తన్మాత్రులై యుండు వారని యున్నందువలన అది బ్రహ్మమే నని అర్థము. "తథా విద్వాన్ నామరూపాద్విముక్తః" పరాత్పరం పురుష ముపైతి దివ్యమ్" ఇత్యాదిగా శ్రుతియందు చెప్పబడియున్నది.

అవ : 'యస్మిన్ ద్యౌః'అను మొదలగు వాక్యములు పరబ్రహ్మమునే చెప్పుచున్నవని, ప్రధానాదులు కావని సిద్ధాంత పఱచుచున్నారు.

## నానుమాన మతచ్ఛబ్దాత్. 3

''యస్సర్వజ్ఞ స్సర్వవిత్'' ఎవడు సామాన్యముగను విశేషముగను సమస్తము నెఱిగి యున్నాడో అను మొదలగు వాక్యములనుబట్టి మూడు గుణములను గుఱించిన మాటయే అచ్చట లేదు గావున ద్యులోకాదులకు అధిష్ఠాన మగు నవి ప్రధానాది కారణములు కావని తెలియవలయును.

అవ : ప్రధానము గాకపోయినను జీవుడైనను కాదా? యనిన, జెప్పుచున్నారు.

## ప్రాణభృచ్చ. 4

సమా : ప్రాణిమాత్రుడైన జీవుడు కానే కాడు. ప్రపంచమునందుండువాడు ప్రపంచమునకు ఆధార మెట్లగును? కాడు.

## భేదవ్యపదేశాత్. 5

జీవుడు తెలిసికొను వాడని, ద్యులోకాధార మగు ఆత్మవస్తువు తెలిసికొన దగినదని పరస్పరము భేదము చెప్పి యుండుటవలన ఇచ్చట జీవు డని అర్థము కాదు.

## ప్రకరణాత్. 6

ప్రస్తుతము ఉక్త శ్రుతి బ్రహ్మమును బోధించు సందర్భము

నందు చెప్పబడిన దగుటచే ఇచ్చట బ్రహ్మ మనియే అర్థము. "కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వ మిదం విజ్ఞాతం భవతి" ఏ యొక వస్తువును తెలిసికొనిన సర్వమును తెలిసికొని నట్లగునో యని చెప్పు పై వాక్యమునకు జగత్కారణము పరబ్రహ్మ మనియే అర్థ మగును గాని జీవుడు మొదలగు వారు కారు. ఈ ప్రకరణము ననుసరించి అర్థమిదియే యని అన్వయించవలెను.

## స్థిత్యదనాభ్యాం చ. 7

మఱి యొక శ్రుతియందు "ద్వా సుపర్ణా సయుజా సఖాయా" "ఒకటితో నొకటి స్నేహముగలిగియుండి ఒకటి నింకొకటిని (జంటను) వీడని రెండు పక్షులు గలవు" అను నీ వాక్యమునందు జీవుడు కర్మ ఫలానుభవి; బ్రహ్మము సాక్షి మాత్రమై యుండును. వీరిరువురు ఒకే చెట్టునందలి రెండు పక్షులుగా వర్ణింప బడిరి. కావున ఆ పురుషుడు పరబ్రహ్మమే కాని వేఱు కాదు. జీవుడు కర్మ ఫలముల ననుభవించు నట్లు పరబ్రహ్మ మనుభవించునది కాదు. అందుచే ద్యులోకాదులకు ఆధారము పరబ్రహ్మ మనుటయే తగును.

## ౨. భూమాధికరణము

"యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి స భూమా" ఎచ్చట మఱొకదానిని చూడడో వేఱొకటి వినడో అన్యమును తెలిసికొనడో అదే భూమ యను నీ వాక్యమునందలి అర్థము పరబ్రహ్మమా? లేక పెద్దదగు ప్రాణ మనియా? అనిన, పూర్ణ మగు ఆవస్తువు బ్రహ్మమే నని సమాధానము.

## భూమా సంప్రసాదాదధ్యుపదేశాత్. 8

ఛాందోగ్యోపనిషత్తునందు నారద మహామునికి సనత్కుమారుడు బ్రహ్మము నుపదేశించె నని గాథ. "భూమానం భగవో విజిజ్ఞాస ఇతి" భగవన్! సర్వవ్యాపకు డగు భగవంతుని దెలిసికొన దలచు చున్నానని చెప్పబడి యున్నది. అందుచే ప్రాణమునకంటె వేఱగు మఱొకదానిని గూర్చి తెలియుట మిగిలి యున్నది. కావున భూమ శబ్దముచే చెప్పబడునది పరబ్రహ్మమే కాని ప్రాణము కాదు.

## ధర్మోపపత్తేశ్చ. 9

పై విషయమునే ఈ సూత్రము విశద పఱచును. సుఖ స్వరూపత మఱియు అమృతత్వము మొదలగు ధర్మములు బ్రహ్మమునకే తగియుండును గాని ప్రాణమునకు కాదు. "యోవై భూమా తత్సుఖం యోవై భూమా తదమృతం అతోఽన్యదార్తమ్" అనగా భూమశబ్దముచే నేది చెప్పబడెనో అదే పరమానంద స్వరూప మైనది. అదే మోక్షస్వరూప మైనది. దానికంటె వేఱైన పదార్థజాత మంతయు నశించు స్వభావము గలది. ఈ కారణమువలన ఇచ్చట ప్రాణ మని అర్థము కాదు. భూమ శబ్దముచే చెప్పబడు వాడు బ్రహ్మమే.

### 3. అక్షరాధికరణము

"ఏతద్వైతదక్షరం గార్గి బ్రాహ్మణా అభివదంతి" ఓ గార్గీ! దీనినే బ్రహ్మవేత్తలు అక్షర మని చెప్పుదురు. అను నీ ఉపనిషద్వాక్యమునందలి అక్షర పదముచే చెప్పబడు నట్టిది ఓంకార రూపమగు అక్షరమా? లేక పరబ్రహ్మమా? యనిన ఇచట అక్షర మనబడినది బ్రహ్మమే నని సమాధానము.

## అక్షరమంబరాంతధృతేః. 10

పృథివ్యాద్యాకాశ పర్యంతము సమస్త భూత భౌతికాది వికారములను ధరించె నని చెప్పబడుటచే ఇచ్చట అక్షర శబ్దముచేత చెప్పబడినది బ్రహ్మమే గాని ఓంకారాక్షరము కాదు.

## సాచ ప్రశాసనాత్. 11

"ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి సూర్యాచంద్రమసౌ విధృతౌ తిష్ఠతః" ఓ గార్గీ! సూర్య చంద్రులు ఈ అక్షరముయొక్క ఆజ్ఞయందే నడుచు చున్నా రని చెప్పబడి నందువలన ఇది (ఆజ్ఞ చేయుట) చేతనధర్మమే కాని అచేతన ధర్మము కాదు. అందువలన అక్షర మనిన బ్రహ్మ మనియే తెలియవలెను. జడ మగు ఓంకారము ఆజ్ఞ చేయజాలదు.

అవ : మఱియొక కారణమును దెలుపుచున్నారు.

## అన్యభావవ్యావృత్తేశ్చ. 12

పరబ్రహ్మమునకంటె ఇతర మగు ప్రధానము జీవుడు మొద లగు వాటియొక్క నివృత్తిని తెలుపుచుండుట వలన అక్షర శబ్దముచేత చెప్పబడునది పరబ్రహ్మము. "ఏతదక్షరం గార్గ్యదృష్టం ద్రష్టృ" తాను దేనిచేతను చూడబడ కుండినను ఈ అక్షరము సమస్తమును చూచు చుండును. "నాన్యదతోఽస్తి ద్రష్టృ" ఈ అక్షరమునకంటెను ద్రష్ట అనగా సాక్షి వేఱు లేడు అని ఇత్యాది వాక్యములచే చెప్పబడుట వలన ఓంకారాక్షరము (ప్రధానము) కాదని స్పష్టముగా తెలియబడు చున్నది.

### ౪. ఈక్షతికర్మాధికరణము

"యః పునరేతం త్రిమాత్రేణోమిత్యనేనైవాక్షరేణ పరం పురుష మభిధ్యాయీత" అకార ఉకార మకారము లను మూడు మాత్రలుగల 'ఓమ్' అను అక్షరమును పురుషునిగా ఎవడు ధ్యానిం చునో అను మొదలగుశ్రుతిచే ఉపాసకుని వలన ప్రణవము ధ్యానింప బడవలె నని చెప్పబడి యున్నది. అన్నపుడు ఇచ్చట ఉపాస్యమై యుండు ఆ పురుషుడు హిరణ్యగర్భుడా? అనగా సమష్టిజీవుల నభిమా నించు బ్రహ్మయా? అనిన, ధ్యానింప దగినదియు పరబ్రహ్మమేనని సమాధానము.

## ఈక్షతికర్మవ్యపదేశాత్సః. 13

ధ్యానించు వానికి ధ్యేయ మగు పురుషుడు దృశ్యము కావల యును కదా? తెలిసికొనుట యను క్రియకు కర్మగా ఏర్పడినందువలన అది సరికాదు. పరబ్రహ్మము దృశ్యమైన అది ఎల్లప్పుడు ఉండవలసి నదే గదా? హిరణ్యగర్భుడు ఒకానొక కాలమునందు లేనివాడగును. అందువలన అగపడువాడు అని చెప్పుట సరికాదు. కాబట్టి హిరణ్య గర్భుడు ధ్యేయము కాదు. పరబ్రహ్మమే ధ్యానార్హ మైనది. "తస్మిన్ దృష్టే పరావరే" సర్వవ్యాపక మగు పరబ్రహ్మమును తెలిసికొనినచో ముక్తుడగును. "స ఏతస్మాత్ జీవఘనాత్పరాత్పరం పురిశయం పురుష మీక్షతే" ఈ సమస్త జీవుల నభిమానించు హిరణ్యగర్భు డున్న సత్యలోకమునకంటె అతీతమును ఎల్ల శరీరములయం దంతర్యా

మియు నగు పరమాత్మను జూచును అను మొదలగు శ్రుతులు పర బ్రహ్మనే తాత్పర్యముగా (ఏకముఖముగా) బోధించుచున్నవి.

## ౫. దహరాధికరణము

శరీరాంతర్గతమై యున్న చిన్నదగు హృదయాకాశమునందు వెదకి తెలియవలె నని శ్రుతి చెప్పుచున్నది. అట్లైన ఆకాశమన్న అది భూతాకాశ మనియా? అనిన, కాదు చిన్నదగు నా యాకాశ మన్నను బ్రహ్మమే నని సమాధానము.

## దహర ఉత్తరేభ్యః. 14

అది సత్య సంకల్పాదులు మొదలగునవి గలది యని ముందు చెప్పబడియున్నందున అద్దానికి అర్థము బ్రహ్మ మనియే తెలియవలెను. దహరాకాశపదముచేత చెప్పబడువాడు బ్రహ్మమే యని భావము. ''ఏష ఆత్మాఽపహతపాప్మా'' హృదయకమలమున నున్నదని చెప్ప బడిన ఆకాశ మేదికలదో, అదే ఆత్మ; అదే ఏ పాపమును లేని పావన వస్తువు.

అవ: ఇందులకు మఱొక కారణము.

## గతిశబ్దాభ్యాం తథాహి దృష్టం లింగంచ. 15

గాఢనిద్రయందు సమస్త ప్రాణులు ఆ చిన్న ఆకాశమునం దనుదినము చేరుచుండుననిచెప్పుట వలన అది బ్రహ్మమే. అదొక లోక మనియు భావించి ''బ్రహ్మైవ లోకః'' అను వ్యుత్పత్తి చెప్పబడి నది. గాఢనిద్రయందు సర్వజీవులు లయింతు రని వేఱొక శ్రుతియు కలదు. ''ఇమాః సర్వాః ప్రజా అహరహర్గచ్ఛంతః ఏతం బ్రహ్మ లోకం న విందంతి'' జీవు లందఱు ప్రతిదినము పరబ్రహ్మమును పొందు చున్నను ఇది యిట్టిది అని దాని తత్త్వమును తెలిసికొన లేకున్నారు. ఎల్ల ప్రపంచము దహరాకాశమునందే సుషుప్తి సమయమున లీన మగు ననియును అదే బ్రహ్మలోక మనియును చెప్పబడును. కాబట్టి భూతాకాశమునందు గాని జీవునియందు గాని ప్రపంచముయొక్క లయ మసంభవము. కావున దహరాకాశముచేత చెప్పబడునది పర బ్రహ్మమే.

ధృతేశ్చ మహిమ్నోఽస్యాస్మి న్నుపలబ్ధేః. 16

మఱియు విశ్వ ప్రపంచమును ధరించినా డని చెప్పుటచేతను. దహరాకాశ మనిన పరబ్రహ్మ మనియే తెలియవచ్చు చున్నది. "అథ య ఆత్మా స సేతుర్విధృతిః" ఆత్మయే సమస్త జగత్తును ధరించి, అన్నిటిని వ్యవస్థాబద్ధమై నియమన మొనర్చుచున్నా డని చెప్పబడి యుండుట వలన దహర మనగా పరబ్రహ్మ మనియే అర్థము. ఈ కార్యము జడ మగు ఆకాశమునకును సంబంధించినది కాదు.

ప్రసిద్ధేశ్చ. 17

ఇచట ఆకాశ మను శబ్దముచే చెప్పబడునది బ్రహ్మమే యని శ్రుతి ప్రసిద్ధము.

ఇతర పరామర్శా త్స ఇతిచే న్నాసంభవాత్. 18

"అథ యఏష సంప్రసాదోస్మా చ్ఛరీరా త్సముత్థాయ" అను వాక్యముయొక్క చివర జీవుడని అర్థము వచ్చి యుండినను వ్యాపకుడగు పరమేశ్వరునకు గమనము లేదు. అందుచేత దహరాకాశమున చెప్పబడిన ధర్మములు జీవునియం దుండుటకు వీలు లేదు. కాబట్టి ఈ దహరపదమునకు పరబ్రహ్మ మనియే అర్థము.

ఉత్తరాచ్చేదావిర్భూతస్వరూపస్తు. 19

ప్రక్కనుండు ప్రాజాపత్య విద్యయందు జీవుని గుఱించియే సర్వ విషయములు చెప్పబడి యుండినను అందు చెప్పబడిన జీవుడు భాగత్యాగ లక్షణ ద్వారా మహా వాక్యార్థ జ్ఞానము నొంది అజ్ఞాన నివృత్తుడై శుద్ధ ప్రత్యగభిన్న పరమాత్మస్వరూపుడై యుండువాడే గావున ఈ విద్యయందు చెప్పబడిన జీవుడు పరబ్రహ్మమే. సత్య సంకల్పాది ధర్మములు జీవునకు పొసగవు. దహరాకాశ శబ్దమునకు జీవుడని అర్థము కాదు. మఱియు ముందు వాక్యమునందు అతడు గాఢనిద్రాయుక్తుడని చెప్పబడి యుండుటవలన, నతడు జీవుడని యాశంకించినను, అట్లు గాదు. అచ్చట గాఢనిద్రయొక్క దోషము నెఱిగి శరీరాభిమానమును విడిచిన ముక్త జీవుని యొక్క మాట యున్నది. ముక్తుడగు నతడు బ్రహ్మమే నని అర్థము.

శంక : 18-వ సూత్రమునందు చూపబడిన జీవ తత్త్వార్థ మేమి? ముక్తజీవునియందు జీవత్వమే లేనందువలన అతనిని గాఢనిద్రాయుక్తుడని చెప్పవలయునా ఏమి?

అన్యార్థశ్చ పరామర్శః. 20

గాఢనిద్రా యుక్తు డనునది జీవుని విషయమే అయినను ఆ వాక్యము జీవ స్వరూపమును వర్ణించుటకు రాలేదు. జీవబ్రహ్మలు వేఱు గాదని తెలుపుచున్నది. ఈ జీవుని విమర్శ బ్రహ్మస్వరూప నిర్ణయార్థమై విమర్శింప బడినదే గాని దహరాకాశ శబ్దమునకు జీవు డని అర్థము చెప్పుటకు కాదు.

శంక : అల్ప మగు ఆకాశమును బ్రహ్మమన్న సర్వత్ర వ్యాప్త మగు పరమాత్మను చిన్నదిగా తెల్పినట్లాయెను. అటులయిన హృదయాకాశ మనిన జీవుడని ఎందుకు చెప్పరాదు? అనిన,

అల్పశ్రుతేరితిచే త్తదుక్తమ్. 21

సమా : పరబ్రహ్మము చిన్నదని చెప్పినంత మాత్రమున బాధ లేదు. అది ఉపాసనార్థమై చెప్పిన మాట. తత్త్వతః బ్రహ్మ మనియే అర్థము.

౬. అనుకృత్యధికరణము

అనుకృతే స్తస్యచ. 22

సమస్తమును ప్రకాశింప జేయునది అలౌకిక మగు బ్రహ్మమే యని తెలియ వలయును. "న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం నేమావిద్యుతో భాంతి కుతోఽయ మగ్నిః, తమేవ భాంత మనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి" సూర్య చంద్రాగ్ని మండల త్రయము దేనిని ప్రకాశింప జేయజాలదో దేనివలన ఈ మండలములు ప్రకాశించుచున్నవో ఆ పరమప్రకాశము భౌతిక మైనది కాదు.

అపిచ స్మర్యతే. 23

"న తద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః" ఇత్యాది స్మృతులును ఇదే అర్థమును చెప్పుచున్నవి.

## ౭. ప్రమితాధికరణము

శంక: "అంగుష్ఠ మాత్రః పురుషః" అంగుష్ఠ మాత్రుడై యున్నాడని చెప్పబడిన పురుషుడు జీవుడా? లేక పరబ్రహ్మమా? సర్వ వ్యాపక మగు పరబ్రహ్మమును అంగుష్ఠ మాత్రమని చెప్పుట తగదు గదా? అనిన, అట్లు గాదు. అంగుష్ఠ పరిమాణ మని చెప్పబడి నను ఇచట బ్రహ్మ మనియే అర్థము చెప్పుచున్నారు.

**శబ్దాదేవ ప్రమితః. 24**

సమా: శ్రుతిచే ఈశాన శబ్దము ప్రయోగింపబడి యుండుట వలన అంగుష్ఠ మాత్రమను కొలతచే చెప్పబడినవాడు పరబ్రహ్మమే యని అర్థము. "ఈశానో భూత భవ్యస్య" భూత భవిష్యత్తులను నియమించువాడని యున్నందువలన బ్రహ్మమే ఈశాను డని చెప్ప బడును గాని జీవుడు కాదు.

శంక: సరే. అట్లయిన వ్యాపక మగు పరబ్రహ్మమును అంగుష్ఠ స్వరూపు డని యనవచ్చునా? యనిన,

**హృద్యపేక్షయా తు మనుష్యాధికారత్వాత్. 25**

సమా: బుద్ధిమాంద్యము గలవారి హృదయము సంకుచితము. కావున సర్వత్ర వ్యాపక మగు పరమాత్మను ఉపాసించుట వారి కలవి గాదు. కాన ఉపాసనార్థమై ఆ విధముగ చెప్పబడినది. అయిననేమి! బ్రహ్మము అచ్చటను వ్యాపించి యున్నందువలన అంగుష్ఠమాత్ర పరి మాణమని చెప్పబడినది. అంతమాత్రమున తన వ్యాపకత్వమునకు భంగము రాదు.

## ౮. దేవతాధికరణము

శంక: "తద్యో యో దేవానాం ప్రత్యబుధ్యత సఏవ తదభవత్" దేవతలలో ఎవడు ఆ పరబ్రహ్మము నెఱుగునో వాడు బ్రహ్మమే యగును అనునట్టి వాక్యము లుండుటవలన దేవతలకుకూడా బ్రహ్మ జ్ఞానము, తదుపాసన, తచ్ఛాస్త్రాదులయందు అధికారము ఉన్నదని తెలియుచున్నది. ఇట్లుండ 25-వ సూత్రమున శాస్త్రోక్త మగు ఉపాసనాదులు మనుష్యులకు మాత్ర మున్నవని చెప్పిరి. దేవతలకు

లేవా? కేవలము మానవులకు మాత్రమేనా? అనిన దేవతలకు గూడా బ్రహ్మవిద్యయం దధికార మున్నదని సమాధానము చెప్పబడును.

తదుపర్యపి బాదరాయణః సంభవాత్. 26

సమా: అనేకోపాసనలు దేవతలు కూడ చేయవచ్చును. ఎందు కనగా వారికి బ్రహ్మలోక ప్రాప్తీచ్ఛ కలదు. కావున కొన్ని ఉపాస నలు వారికి సంబంధించును. కొన్ని సంబంధించవు. బ్రహ్మవిద్యయందు వారికిని అధికారము గలదు. ఇది బాదరాయణాచార్యులవారి అభి ప్రాయము.

శంక: 'ఇంద్రాయ' అని యిట్లు చతుర్థీ విభక్తిచే కూడిన శబ్దముగల వారిని దేవత లనెదరు. అవి జడము లైనచో వాటికి బ్రహ్మవిద్యాధి కార మెట్లు సంభవించును? అంతేగాక దేవతలకు శరీరము గలదను నదియు ఒప్పుకొనవలసివచ్చును. అట్లైన యజ్ఞాది కర్మవిశేషములందు విరోధము వచ్చును. బహుజనులు అనేక స్థలములందు ఒకే దేవతను గూర్చి యజ్ఞముల నాచరించు చుండిరేని అప్పుడా దేవత శరీరముతో ఆయా స్థలములకు పోవలసి వచ్చును గదా? అదెట్లు సంభవించును? కావున దేవతలకు బ్రహ్మవిద్యయం దధికారము లేదుగదా? యనిన,

విరోధః కర్మణేతిచేన్నానేకప్రతిపత్తేర్దర్శనాత్. 27

సమా : అనేక స్థలములయందు జరుగు యజ్ఞాది కర్మలయందు ఒక్క దేవతయే శరీరముతోగూడ వచ్చునని చెప్పునది విరోధము కాదు. దేవతలకు అనేక శరీరములను ఒకే మాఱు ధరించుట, అనేకు లచే ఒకే దేవత పూజింపబడుట (ఉపాసింపబడుట) లోకానుభవము. చతుర్థీవిభక్తి శబ్దముచే పిలువబడు శరీరములు గల దేవతలు గలరని పురాణములయందు గలదు. యోగుల వలెనే దేవతలు యోగప్రభావ ముచే ఏక కాలము నందు అనేక శరీరములను ధరింప వచ్చును. అనే కులచే ఒక్క దేవతయే పూజింప బడవచ్చు నని భావము. "కతి దేవాః" దేవత లెందఱు? అను మొదలగు వేదభాగమునందు 3306 గురు దేవత లని చెప్పి వారిని శోధించి 33గురు దేవతలుగా దెలుపును. వారెవ రనిన, 8 మంది వసువులు, 12 గురు సూర్యులు, 11 మంది

రుద్రులు, 1 ప్రజాపతి, 1 ఇంద్రుడు ఈ దేవతలకంటె ఆ 3306 గురు దేవతలు వేఱు కాదు. ఆ ముప్పది ముగ్గురే ఆఱుగురు దేవతలైయున్నారు, వారెవరనగా, అగ్ని, భూమి, వాయువు, అంతరిక్షము, సూర్యుడు, ద్యులోకము, మఱి యా ఆఱుగురే త్రిలోకము లనబడు ముగ్గురు దేవతలనియును ఆ ముగ్గురును అన్న ప్రాణము లనబడు ఇరువురే యనియును, ఆ ఇరువురును ప్రాణ శబ్దముచే చెప్పబడు వాయు వొక్కడే యనియును, ఆ ఒక్క దేవుడే 3306 దేవతారూపములచే నున్నాడని వేదభాగమున తెలియ బడుచున్నది. దీనినిబట్టి పై సూత్రార్థము యోగ్యమే యని తెలియు చున్నది. ఈ విషయము పురాణముల యందు గూడా చెప్పబడినది.

శంక : ఇంద్రుడు మొదలగు దేవతలకు శరీరము లున్నవని చెప్పిన, శరీరములు నాశవంతములు అన్నప్పుడు వాటిని జెప్పు వేదములుకూడా నాశము గావలసి వచ్చును గదా? అనిన,

శబ్దఇతిచేన్నాతఃప్రభవాత్ప్రత్యక్షానుమానాభ్యామ్. 28

సమా : అట్లు గాదు. వేదశబ్దములు సత్యార్థము గలవి. వేదములచేతనే దేవతలు మొదలగువారి ఉత్పత్తి యగునని చెప్పినంత మాత్రమున విరోధ మేమియు లేదు. నిత్యశబ్ద ప్రయోగము ఉన్నంత మాత్రముననే ఆ పదార్థము లెల్ల నిత్యములై యుండవలె నను నిర్బంధము లేదు. ఎందుకన, "ఏత ఇతి వై ప్రజాపతిర్దేవానసృజతాసృగ్రమితి మనుష్యాన్" ఇంద్రియాది దేవతలసి స్మరణమాత్రముననే ఆ దేవతలను సృజించెను. "అసృగ్ర" శక్తమునందు రమమాణబుద్ధి గల అను పదమునుండి మనుష్యులను సృజించె నని శ్రుతి చెప్పు చున్నది. "నామ రూపంచ భూతానాం కర్మణాంచ ప్రవర్తనమ్, వేదశబ్దేభ్య ఏవాదౌ నిర్మమే స మహేశ్వరః" సమస్త భూతముల నామ రూపములును అవి చేయు పనులను బ్రహ్మదేవుడు వేదశబ్దములనుండి ఆదియందు నిర్మించె నని స్మృతియును దెలుపుచున్నది. కాబట్టి తాత్పర్యము ఇంద్రుడు మొదలగు వారి వ్యక్తినాశన మున్నను వేదమునందుండు శబ్దమును బట్టి బ్రహ్మ సృజించెను. అందుచే వేదశబ్దములు అనిత్యములు కావు.

## అత ఏవచ నిత్యత్వమ్. 29

అందుచేతనే వేదము నిత్యము. అనగా వేదార్థము నిత్యము. దేవతలు అనిత్యమని చెప్పినంత మాత్రమున వేదములు అనిత్యమని చెప్పరాదు.

శంక : మహాప్రళయమునందు సర్వము నశించును గదా? రెండవ సృష్టియందు వ్యక్తులు నశించిన పిదప దేవతల కాయా నామములు అట్లే యుండునని చెప్పుట ఎట్లు పొసగును? వేఱొక సృష్టి కాదా? వేదము నిత్యమెట్లగును? అనిన,

## సమాన నామరూపత్వాచ్చాఽఽవృత్తావప్యవిరోధో దర్శనాత్స్మృతేశ్చ. 30

సమా : పై శంకయందు తెలుపబడినట్లు సర్వ వ్యవహారములు మహాప్రళయమున నశించి మరల నూతనములై ఉత్పన్నము కావలసిన అగత్యము లేదు. అట్లంగీకరించినను వేద శబ్దార్థ నిత్యత్వమునకు లోపము లేదు. మహాప్రళయమునందు కేవలము జీవుల సంస్కారములు తప్ప ఇతర మెల్ల నశించును. ఉత్తర సృష్టియందు నామరూప భేదము లేకయే సర్వ ప్రపంచము జనించ వచ్చును. పూర్వపూర్వ సంస్కారము ఉత్తరోత్తర అధ్యాసకు కారణమగును. "ధాతా యథా పూర్వమకల్పయదితి శ్రుతేః" (సర్వప్రపంచమును మొదటివలె బ్రహ్మ సృష్టించెను) కావున సూర్య చంద్రాగ్న్యాదులు వెనుకటి సృష్టియందువలె సృష్టింప బడె నని శ్రుతి స్మృతులు ఇదే అర్థమును చెప్పుచున్నవి.

అవ : ఇప్పుడు జైమినిఋషి అభిప్రాయము తెలుపుచున్నారు.

## మధ్వాదిష్వసంభవాదనధికారం జైమినిః. 31

వసు రుద్రాదిత్యాది దేవతలలో ఒక్కొక్కరిని ధ్యానము చేయవలె నని మధువిద్య మొదలగు కొన్నివిద్యలు చెప్పబడి యున్నవి. ఇవి పరబ్రహ్మోపాసనార్థమై చెప్పబడి యుండుటచే వీరికి బ్రహ్మవిద్యాధికార మెట్లు పొసగును? అది సాధ్యము కాదు. ఎందుకనగా, ఆదిత్య

మండలమే ఫలమైయుండు ఉపాసనకు ఆ ఆదిత్యుడే ఎట్లధికారి యగును? అటువలె దేవతలకు బ్రహ్మవిద్యయం దధికారము లేదని జైమిని అభిప్రాయము.

జ్యోతిషి భావాచ్చ. 32

మీదుగా ప్రకాశించు ఆదిత్యాది లోకములను అనగా కనబడు సూర్యమండలము మొదలగు గోళకములయందు ఇంద్ర మొదలగు నామములచే బిలుచు పద్ధతి అనగా రూఢియును గలదు. కాని ఆ సర్వము అచేతనములగుటచే వాటికి బ్రహ్మవిద్యయం దధికారము లేనే లేదని అభిప్రాయము.

భావం తు బాదరాయణోఽస్తిహి. 33

బాదరాయణాచార్యుడు దేవతలకు కూడ బ్రహ్మవిద్యాధికారమున్నదని తలచుచు అది ప్రమాణ సమ్మతమని చెప్పుచున్నాడు. ఆదిత్య మండలమే ఫలముగా కలిగిన ఉపాసనాదులయందు ఆదిత్యుడే మొదలగు దేవతలకు అధికారము లేకపోయినను బ్రహ్మవిద్యయం దధికారము కలదని బాదరాయణుని అభిప్రాయము. దేవతలకు కర్మ చేయు సామర్థ్యము మోక్షాపేక్ష యుండుటలో విరోధము లేదనియు అందుచే దేవతా సంబంధ మగు మధువిద్యయందు దేవతలకధికారము లేకపోయినను నిర్గుణ బ్రహ్మవిద్యయం దధికార మున్నదనుటకు లోపము లేదని యభిప్రాయము.

౯. అపశూద్రాధికరణము

శంక : మానవులకు, దేవతలకు, బ్రహ్మవిద్యయం దధికారము కలదని పై సూత్రమున వర్ణింప బడెను. ఇక మనుష్యులలో నాలుగు వర్ణములు గలవు. అయితే శూద్రులకు బ్రహ్మవిద్యయం దధికారము కలదాయనిన, బ్రహ్మవిద్య నడుగుటకు వచ్చిన జానశ్రుతిని ఓరీ! శూద్రుడా! యని పిలిచినట్లున్నది. అపుడు శూద్రునకు బ్రహ్మవిద్యాధికారము కలదా? లేదా? అనిన, లేదని సమాధానము చెప్పుచున్నారు.

శుగస్యతదనాదరశ్రవణాత్తదాద్రవణాత్సూచ్యతేహి. 34

సమా: తేజస్వి యగు జానశ్రుతి యను రాజును చూచి ఒక

హంస ఆశ్చర్యమొందగా మఱొక హంస ఆ రైక్వుని ముంగిట ఇదేమి గొప్ప? యనెను. ఈ మాట విని జానశ్రుతి అయ్యవమానమున కోర్వ జాలక మహాతేజస్వి యగు రైక్వుని వెదకుచు ఒకచోట బండి క్రింద కూర్చుండి యున్న అతనిని గో ధనాదులచే సత్కరించెను. అప్పుడు ఓరీ శూద్రా! యని రైక్వుడు సంబోధించెను. అతడు జాతి శూద్రుడు గాకపోయినను హంసల పలుకులచే భయ మొందు అజ్ఞానము గలవాడు, దుఃఖముతో పరుగెత్తినవాడు కాబట్టి "శుచా దుద్రావ" అను నీ వ్యుత్పత్తిచే జానశ్రుతి మహారాజునందు శూద్రత్వము ప్రయోగింప బడెను. తాత్పర్య మేమనగా శూద్రజాతి వారికి బ్రహ్మవిద్యయందు అధికారము లేదు. ఎందుకనిన, వారికి మోక్షమునం దిచ్ఛయు, వేదాధ్యయనాదులు చేయుటకు సామర్థ్యమును ఉండదు అన్నపుడు ఇక వారు గురు వేదాంత వాక్యార్థ శ్రవణ మననాదులయందును ఇష్టము లేని వారనే భావము. కాబట్టి పరమ సత్యార్థమును దెలియుటకు తగు పవిత్రత, సామర్థ్యమును గలవాడే అధికారి యని గ్రాహ్యము.

క్షత్రియత్వగతేశ్చోత్తరత్ర చైత్రరథేన లింగాత్. 35

ముందు వాక్యమునందు జానశ్రుతి క్షత్రియు డనియును చైత్రరథుడను క్షత్రియుని సహాధ్యాయియై యున్నట్లును తెలియబడుచున్నందున అతడు క్షత్రియుడే గాని శూద్రుడు కాదని తెలియుచున్నది.

సంస్కార పరామర్శాత్తదభావాభిలాపాచ్చ. 36

బ్రహ్మవిద్యను గుఱించి తెలుపు ప్రతిస్థలమునందును 'తగ్ంహో పనిన్యే' ఆ శిష్యున కుపనయనము చేసెను. అను మొదలగు వాక్యములచేత బ్రహ్మ క్షత్రియ వైశ్యులకు మాత్రమే శాస్త్రోపనయనాది సంస్కారము చెప్పబడి యున్నది. శూద్రులకు ఉపనయనము చెప్ప బడ లేదు గావున వారికి బ్రహ్మవిద్యయం దధికారము లేదు.*

---

* "సుగతిమియాచ్ఛ్రవణాచ్చ శూద్రయోనిః" అనెడి స్మృతినిబట్టి పెద్దల పరిచర్య చేయుచు సద్విషయముల వినుచు వారు తరింపవచ్చును. వేదాధ్యయనాదుల అవసరము లేదు.

## తదభావ నిర్ధారణేచ ప్రవృత్తేః 37

శూద్రుడు కాడని తెలిసిన పిదపనే అనగా పరమలౌకికాభిరతుడు గాక సత్యము నపేక్షించిన శుభ సంస్కారము గలవాడే యని తెలిసిన పిదప బ్రహ్మవిదులు బ్రహ్మోపదేశము చేసినట్టుగ ఛాందోగ్యశ్రుతియందు తెలియఁబడుచున్నది. (గౌతమ, సత్యకామ, జాబాలాదులు).

కుల గోత్రములు తెలియని అతని నిరభిమాన మగు సత్యమైన పలుకులను విని బ్రాహ్మణుడు కానివాడు సత్యమును చెప్ప జాలడని తత్వతః ఎఱిగి జాబాలునకు బ్రహ్మవిద్యను బోధించినట్లు తెలియబడు చున్నది. ఈ కథ ఛాందోగ్యోపనిషత్తునందు వివరింప బడియున్నది.

## శ్రవణాధ్యయనార్థప్రతిషేధాత్ స్మృతేశ్చ 38

"న శూద్రాయ మతిం దద్యాత్" శూద్రునకు వేదశుద్ధ మగు జ్ఞానము నివ్వరాదు అను స్మృతి వేదార్థమున కధికారము లేదని చెప్పుచున్నది. అజ్ఞుడగు లౌకికునకు కర్మాదులయందు అధికారము లేదని చెప్పుచున్నది. కాని విదురుడు, ధర్మవ్యాధుడు మొదలగు శూద్రు లనేకులు బ్రహ్మజ్ఞానులై యుండిరని భారతము మొదలగు గ్రంథములనుండి తెలియఁబడుచున్నది. కాని వారిజ్ఞానము పూర్వ జన్మ పరిశ్రమనుబట్టి జనించినది గాని ఈ జన్మయందు చేసిన ప్రయత్నము వలన కాదు. ఈ జన్మమున శూద్రుడై యుండువాడు పూర్వజన్మమున శూద్రుడుగా నుండవలయు నను నియమము లేదు గదా. అందుచేత పూర్వజన్మశుద్ధు లగు మహాత్ములకు ఏదియో ఒక కర్మవశమున శూద్రజన్మ కలిగినను బ్రహ్మజ్ఞానము వారికి అప్రయత్నముగ సిద్ధించును. అట్లు కానివారికి మాత్రము వేదాధ్యయన బ్రహ్మజ్ఞానాదులయందు ప్రవేశ మేర్పడి ధన్యులగుటకు సాధ్యము కాదు. భక్తి మొదలగు ఇతరోపాయములచే చిత్తశుద్ధి నొందుటకు మాత్రము సాధ్య మని, అధికార మని తెలియవలయును. ఇచ్చట శూద్రశబ్దమున కర్థము చిత్తసంస్కృతి లేని వాడని భావము.

౧౦. కంపనాధికరణము

శంక: "యదిదం కించ జగత్సర్వం ప్రాణ ఏజతి నిస్సృతమ్" సమస్త ప్రపంచము ప్రాణము వలననే పుట్టినది; ప్రవృత్తి నొందు చున్నది. ప్రపంచము వాయువుచే కదలుచు తన కార్య మొనర్చు నని తెలియ వచ్చుచున్నది. కాబట్టి ఈ ప్రాణ శబ్దముచే చెప్పబడు నది బ్రహ్మమా? లేక ప్రాణవాయువా? అనిన ఈ ప్రాణము బ్రహ్మమే నని సమాధానము.

కంపనాత్. 39

సమా: ప్రపంచ మంతయు బ్రహ్మముయొక్క ఆజ్ఞచేతనే కద లుచు, ప్రవృత్తి నొందుచున్నది. అందువలన ఇచ్చట ప్రాణ శబ్ద ముచే చెప్పబడునది పరబ్రహ్మ మనియే అర్థము.

౧౧. జ్యోతిరధికరణము

శంక: "ఏష సంప్రసాదోऽస్మాచ్ఛరీరాత్సముత్థాయ పరంజ్యోతి రుపసంపద్య" జీవుడు జ్ఞానము గలవాడై పరంజ్యోతిని పొందుచున్నా డను వాక్య మున్నందున జ్యోతిశ్శబ్దముచే చెప్ప బడునది అగ్ని యనియా అర్థము? అనిన, కాదు. ఇచట జ్యోతి యన్నను బ్రహ్మమే యని సమాధానము.

జ్యోతిర్దర్శనాత్. 40

సమా: ఉపక్రమాది లింగములచే పై జ్యోతి శ్శబ్దమువలన చెప్పబడునది బ్రహ్మ మనియే అర్థ మగును. ఎందుకనగా, అది ప్రకా శములకెల్ల ప్రకాశ మని చెప్పబడినది.

౧౨. అర్థాంతరత్వాది వ్యపదేశాధికరణము

ఆకాశోऽర్థాంతరత్వాది వ్యపదేశాత్. 41

ఆకాశ మనిన బ్రహ్మ మనియే అర్థము. బ్రహ్మము నామ రూపాది సర్వ పదార్థములకు అంతరమై ఆధారమై యున్నది. కావున ఇచట ఆకాశశబ్దముచే చెప్పబడునది భూతాకాశ మని అర్థము కాదు. నామ రూపములయొక్క ఉనికి బ్రహ్మ మనియే తెలియవలెను.

## ౧౩. సుషుప్త్యుత్క్రాంత్యధికరణము

శంక: బృహదారణ్యకశ్రుతియందు "కతమ ఆత్మేతి యోయం విజ్ఞానమయః" అనగా దేహేంద్రియాదులలో ఆత్మ ఎవడు? అని జనకునిచే ప్రశ్న చేయ బడినట్టును బుద్ధి స్వరూపుడే ఆత్మ యని యాజ్ఞవల్క్యుడు చెప్పినట్లును వినబడుచున్నది గదా! అందువలన విజ్ఞానమయ శబ్దవాచ్యుడు జీవుడా? లేక పరబ్రహ్మమా? అనిన, పరబ్రహ్మమే యని సమాధానము.

### సుషుప్త్యుత్క్రాంత్యోర్భేదేన. 42

సమా: ఇది కేవలము జీవుని విషయమే కాదు. గాఢ సుషుప్తి నిద్రయందు కూడా ప్రాణ వాయు వున్నట్లు తెలియు చున్నందువలన జీవునికంటెను వేఱగు బ్రహ్మ మనియే ఈ విజ్ఞాన మయ శబ్దమున కర్థము. "ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్తః" ఆనందమయాత్మచే వ్యాప్తమైన జీవుడు నిద్రావస్థయం దేమియు తెలియ లేదను అనుభవమును బట్టి ప్రాజ్ఞ శబ్దముచే చెప్పబడువాడు పరబ్రహ్మమేయని తెలియు చున్నది.

వేఱొక కారణము:

### పత్యాదిశబ్దేభ్యః. 43

"సర్వస్య వశీ సర్వస్యేశాన స్సర్వస్యాధిపతిః" అను వాక్యమున్నందున సమస్తమును తన అధీనమునం దుంచుకొని పాలించువాడై యున్నాడనియును ఈ వాక్యమున కర్థమగును గాన జీవుడు కాదు బ్రహ్మ మనియే తెలియవలయును.

ఇది ఒకటవ అధ్యాయమున మూడవ పాదము.



## 1వ అధ్యాయము-4వ పాదము.

అన్నియు బ్రహ్మబోధక మగు వాక్యములే అయి యున్న నిక ప్రధానాది బోధక వాక్యము లేమైనను గలవా? అను మొదలగు సంశయములను గుఱించిన వివరము ఈ పాదమునందు జెప్పబడును.

౧. ఆనుమానికాధికరణము

శంక : మొదటి అధ్యాయము మొదటి పాదము నందలి ఐదవ అధికరణమునందు వేదములు ప్రధానమును గుఱించి ఏమియు చెప్ప వని చెప్పియున్నారు గదా? అదెట్లు పొసగును? ఇంద్రియములకంటె విషయములు గొప్పవనియు, మహత్తుకంటెను అవ్యక్తము గొప్ప దనియు 'మహతః పరమ వ్యక్తమ్' మహత్తత్త్వమునకంటెను ప్రత్యక్ష ముగ నగపడని జగత్కారణ మైన అవ్యక్తము శ్రేష్ఠ మనియును, దానికంటెను పురుషు డధికుడనియు, ఇట్లు పరబ్రహ్మము ప్రధానమును జగత్కారణ మని శ్రుతియందు చెప్పబడు చుండగా వేదాంత వాక్యము లన్నియు కేవలము పరబ్రహ్మమును గుఱించియే తెలుపు ననుట ఎట్లు పొసగును?

## ఆనుమానికమప్యేకేషామితిచేన్న శరీరరూపకవిన్యస్త గృహీతే ర్దర్శయతి చ. 1

సమా : 'ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవచ' అను శ్రుతి శరీరమును రథరూప కల్పనచే నిరూపించినది. అవ్యక్త మను నీమాట శరీరమునకు చెందినదే గాని అనుమాన ప్రమాణముచే తెలియదగు ప్రధానము అవ్యాకృతము, మాయ, అవ్యక్తము, ఈ పదములతో చెప్పబడునదై యున్నది. కాని సాంఖ్య కల్పిత మగు ప్రధానాదులను గూర్చి చెప్పినది కాదు. అందుచేత జగత్కారణము ప్రధాన మని చెప్పరాదు. "ఇంద్రియేభ్యః పరాహ్యర్థాః" ఇత్యాదిగా చెప్పబడినది రథికు డైన పరమపురుషుని గుఱించియే కాని శరీరాది ప్రధానమును గుఱించిన మాట కాదు.

శంక : శరీరము స్థూల మైనది కదా? దాని నవ్యక్త మనుట ఎట్లు పొసగును?

## సూక్ష్మం తు తదర్హత్వాత్. 2

సమా : ఇచ్చట శరీర మనిన సూక్ష్మశరీర మనియే గ్రహించ వలయును గాని అవ్యక్త శబ్దము స్థూల శబ్దమున కర్థ మని చెప్పరాదు.

సూక్ష్మశరీరము స్పష్టముగా అగపడునది గాదు. అది అవ్యక్త మని తెలియవలెను.

శంక : జగత్కారణము సూక్ష్మ మనియు అదే అవ్యక్తమనియు మీా రంగీకరించ నట్లయిన అప్పుడు ప్రధానాదులే జగత్కారణముగ మీారును అంగీకరించు నట్లయినది. సాంఖ్య మతస్థులును అదే చెప్పు చున్నారు. అటులయినచో మీా మతమునకు భంగము రాదా? యనిన,

తదధీనత్వాదర్థవత్. 3

సమా : అవ్యక్తము జగత్కారణ మని చెప్పుట మా మతమునకు భంగముకాదు. మాది సేశ్వరము. సాంఖ్యులు చెప్పునది నిరీశ్వరము. ఈశ్వరాధీనమున అవ్యక్తముండి తద్ద్వారా సృష్ట మగునదై యున్నది. సాంఖ్యులు చెప్పు ప్రధానము స్వతంత్ర మయినది. అద్వితీయ మగు సత్తు ఒక్కటే యుండి తదాధారముచే ప్రధానాది కల్పిత మగు నీ సృష్టి ఏర్పడినది. అందుచే ఈ మిథ్యా ప్రతీతివలన అద్వైతమునకు భంగము రాదు. అవ్యక్త మనిన అది ప్రధానము గాదని అర్థము.

జ్ఞేయత్వా వచనాచ్చ. 4

సాంఖ్యులు ప్రకృతి పురుషుల నెఱింగిన మోక్ష మని చెప్పుదురు. అనగా ప్రధానమే జ్ఞేయ మని తెలుపుదురు. మా మతమునందు ఈ ప్రధానమును (అవ్యక్తమును) తెలిసికొన వలయు నని ఎచ్చటను చెప్పబడి యుండుటలేదు. అందుచే సాంఖ్యులు చెప్పు ప్రధానము కంటె మేము చెప్పు అవ్యక్తము వేఱు.

శంక: "అశబ్ద మస్పర్శ మరూప మవ్యయమ్" శబ్ద స్పర్శ రూప రహిత మైనది, నాశము లేనిది అను మొదలగు వాక్యములు అవ్యక్తమునే గదా తెలుపుచున్నవి? అనిన,

వదతీతిచేన్న ప్రాజ్ఞోహి ప్రకరణాత్. 5

సమా: పూర్వాపర సందర్భములనుబట్టి చూచిన ఈ శ్రుతి అవ్యక్తమును గుఱించి చెప్పునది కాదు. ప్రస్తుత మగు ఈ ప్రకర

ణమునందు కేవల పరబ్రహ్మమునే గుఱిగా శ్రుతి ప్రతిపాదించు చున్న దని తెలియవలయును.

అవ: ఈ అవ్యక్త శబ్దము ప్రధానార్థకము గాదని నిరూపించు చున్నారు.

## త్రయాణామేవచైవముపన్యాసః ప్రశ్నశ్చ. 6

యమ నచికేత సంవాదాత్మక మైన కఠశ్రుతియందు తత్సందర్భానుసారముగ అగ్ని, జీవ, బ్రహ్మలను నీ త్రివిధ విషయములపై ప్రశ్నోత్తరము లున్నవే గాని అచ్చట ప్రధాన విషయక మగు ప్రశ్న కాని, ఉత్తరము గాని లేదు.

## మహద్వచ్చ. 7

మహచ్ఛబ్దము మహత్తత్వమును చెప్పుటకు సాంఖ్యశాస్త్రమునందు ప్రయోగింప బడి యుండినను "మహాంతం విభుమాత్మానమ్" అను వేదవాక్యము మహత్తత్వమును చెప్పదు. ఇక అవ్యక్త శబ్దము సాంఖ్య తంత్రములో ప్రధానమును చెప్పుటకు ప్రయోగింప బడినను వేదము ఆ విధముగ చెప్పదు. కావున బుద్ధికంటెను మహత్తత్వము పెద్ద దనునపుడు ఆ మహత్తత్వమునకు ముందు ఆత్మ యని చెప్పబడినది జీవు డనియే అర్థము. మహత్తత్వము అవ్యక్తమైన శరీర మని భావము.

### ౨. చమసాధికరణము

శంక: 'అజామేకాం లోహిత శుక్ల కృష్ణామ్' ఎఱుపు తెలుపు నలుపు అను వర్ణములు గల, జనన మరణ శూన్యమైన, అను వాక్యమునందలి 'అజా' శబ్దముచేత వేదము ప్రధానమునే చెప్పును గదా? యనిన, కాదని చెప్పుచున్నారు.

## చమసవదవిశేషాత్. 8

సమా: చమస మను యజ్ఞపాత్రమువలె అజా అను పదము ప్రధానమునే చెప్పు నని చెప్ప రాదు. పైన ఉబ్బు క్రింద డొల్ల కలిగిన చమస మను మాట ఏయొక్క అర్థమును లేక, సంశయాస్పదమై యుండునట్లు 'అజ' మనుమాటయు సంశయాస్పదమై యున్నది. అందు

చేత ప్రధాన మని చెప్పరాదు. ఎఱ్ఱగను, తెల్లగను నల్లగను ఉండు నదై తనవంటి బహుబిడ్డలను కనునదై యుండు అజను (మేకను) ఇంకొక అజము అనుభవించుచున్నది. భోగాత్మక మగు ఆ అజను చూచి మఱొక అజము అనాసక్తిచే వీడుచున్నది అను నీ యర్థము గల ఒక శ్రుతి తెలుపుచు దానికుండు మూడు వన్నెలే సత్త్వ రజ స్తమో గుణము లని చెప్పుచున్నది. అద్దాని కనురూపము లగు బిడ్డ లనిన త్రిగుణాత్మకము లైన ప్రజలనియు భోగ మొందు ఒక అజ మనిన అవివేకి యగు జీవుడనియు త్యాగ మొందు ఇంకొక అజ మన్న వివేకి యగు విరక్తు డనియు అర్థము. అందు భోగ మొందు అజనే (కపిలమతానుయాయులు) ప్రధాన మందురు. ఇది అజమను పద మునకు సత్యార్థము కాదు. బ్రహ్మ మనియే సత్య మగు అర్థము.

### జ్యోతిరుపక్రమాత్తు తథాహ్యధీయత ఏకే. 9

ఇచ్చట అజ శబ్దముచే చెప్పబడునది అగ్ని జల పృథివ్యాది పదార్థము లని చెప్పవలయును. ఎందుకనగా, ఛాందోగ్యశాఖవారు ఈ విధముగనే ఒప్పుకొనుచున్నారు.

శంక: అజ మనగా పుట్టుక లేనిదని అర్థము. పైన జెప్పిన అగ్ని జల పృథివ్యాదులో పుట్టినవి. అందుచేత ఈ అర్థ మెట్లు పొస గును? ఈ మూడు భూతములం దన్ననో మేక ఆకృతి దేనికిని అసలే లేదు? అనిన,

### కల్పనోపదేశాచ్చ మధ్వాదివదవిరోధః. 10

సమా : మేకయొక్క పోలిక ఇందు గలదు. ఒకానొక మేక పై మూడు వన్నెలు పొందినదై యుండవచ్చును. మఱియు తనవలె నున్న బిడ్డలను ఈనుచుండవచ్చును. అందుచేత అజ మను మాటకు పై మూడు భూతము లనియే అర్థము.

### 3. సంఖ్యోపసంగ్రహాధికరణము

అవ : ఇరువది యైదు తత్త్వము లనిన అవి సాంఖ్యులు చెప్పునవి గాదని చెప్పు చున్నారు.

శంక : "యస్మిన్ పంచ పంచ జనా ఆకాశశ్చ ప్రతిష్ఠితః" ఏ పరబ్రహ్మమునందు పంచప్రాణాదులు ఆకాశము ప్రతిష్ఠింప బడి యున్నవో అను నీ శ్రుతియందు అగపడు ఈ 25తత్వములు సాంఖ్యుల యొక్క తత్వములేనా? అనిన,

న సంఖ్యోపసంగ్రహాదపి నానాభావాదతిరేకాచ్చ. 11

సమా : వాక్యమునందు చెప్పబడిన పంచజన శబ్దముచే జ్యోతి, ప్రాణ, నేత్ర, శ్రోత్ర, మనస్సు లని చెప్పబడును. మొదటి పంచ శబ్దముచే వీటి సంఖ్య చెప్పను. అంతేకాని పంచజన శబ్దములు గాని 25 తత్వములు గాని చెప్పబడుట లేదు. కాబట్టి పంచజన వాక్యమునందు సాంఖ్య కల్పితము లగు 25 తత్వములు చెప్పబడ లేదు. అందుచే ప్రధానము వేదోక్తము గాదు.

శంక : పంచజన వాక్యమునందలి అర్థమేమి?

ప్రాణాదయో వాక్యశేషాత్. 12

సమా : ప్రాణమునకు ప్రాణము 'ప్రాణస్య ప్రాణః' అను నీ వాక్యమునందు చెప్పబడిన ప్రాణము నేత్రము, శ్రోత్రము, అన్నము, మనస్సు అను నివియే పంచజన వాక్యమునందలి పంచజన శబ్దముచే చెప్పబడునవి కాని సాంఖ్యులచే చెప్పబడు పంచజన పంచవింశతి తత్వములు గాదు.

జ్యోతిషైకేషామసత్యన్నే. 13

కాణ్వశాఖయందు అన్న మనునది లేదు. పంచజన వాక్యమునకు పూర్వము వినబడుచున్న జ్యోతిర్వాక్యము అనుసంధేయము. ఇచ్చట తేజస్సుతో కూడి అయిదగు నని గ్రహింపవలెను.

## ౪. కారణత్వాధికరణము

అవ : ఆకాశాది సమస్తభూతములకు కారణము బ్రహ్మమే యని ఎల్లెడల చెప్పి యుండుట వలన శ్రుతులకు పరస్పర విరోధము లేనేలేదని తెలుపుచున్నారు.

కారణత్వేనచాఽఽకాశాదిషు యథా వ్యపదిష్టోక్తేః. 14

"తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః" "తత్తేజోఽ

సృజత” అను మొదలగు వాక్యములు మొదట ఇది యుండుట వలననే సృష్టియనియు, ఇంకొక స్థలమున మొదట లేనందువలన సృష్టియనియు, తనంత తానే సృష్టి యనియు, ఆకాశమునుండి సృష్టి యారంభింప బడెననియు ఇట్లు వివిధప్రకారములచే చెప్పబడినది. మఱియు త్రివృత్కరణాత్మక మగు అగ్నినుండి సృష్టి అయ్యెననియు, ఇట్లు అస్తవ్యస్తమై జగదుత్పత్తిని గుఱించి చెప్పబడినది. అందువలన నీవు జగత్తు బ్రహ్మమునుండియే సృష్టి యాయె నని ఎట్లు చెప్పగలవు? అనిన,

సమా : అందువల్ల నేఆకాశాది ఈ సృష్టిక్రమ విషయము పరస్పర విరుద్ధమై యుండుటనుబట్టి ఈ పుట్టుకకు అధిష్ఠాన మగు బ్రహ్మము ఏక మనియు, అద్వితీయ మనియు చెప్పుటకు ఆవంతయు సందేహము లేదని గ్రహించ వలయునని తాత్పర్యము.

## సమాకర్షాత్. 15

పూర్వాపర సందర్భములను చక్కగా విచారించి చూచిన జగత్కారణము బ్రహ్మ మనుటలో సందేహము లేదు. “అసద్వా ఇద మగ్ర ఆసీత్” “సదేవసౌమ్యేదమగ్ర ఆసీత్”, అని సృష్టి పుట్టక పూర్వము అసత్తే యుండెనని ఒక మాటయు, మఱియు ఓ సౌమ్యుడా! సృష్టి పుట్టక పూర్వము ఇదంతయు సత్తుగా నుండెనని మఱియొక మాటయు, నిట్లు పరస్పర విరోధముగా నున్నవి. లేనిదానినుండి పుట్టుట యనునది అసంభవ మని తెలిసి ఉన్న సత్తునుండియే పుట్టుట యను సల్పనను ప్రబోధించుచు, పూర్వోత్తర సందర్భముల సమన్వయ పఱచి కర్వము పరబ్రహ్మమునందే సమన్వయ మగుననియు, అన్యత్ర కాదనియు, చెప్పుటవలన బ్రహ్మమే జగత్కారణ మని తెలియవలయును. వస్తుతః ఉనికికి లేమి లేదు. లేనివగు ప్రధానాదులకు ఉనికి లేదు. ఉన్నది పుట్ట వలసిన పనిలేదు. లేనిది పుట్టుట అసంభవము. అట్లైనను ఉన్న సద్బ్రహ్మము నుండియే అనిర్వచనీయముగ ఈ సమస్తము జనించు నని అధ్యారోపము. కాబట్టి జగత్కారణము సద్రూప బ్రహ్మమే నని అర్థము.

## ౫. బాలాక్యధికరణము

శంక : 'యో వై బాలాక ఏ తేషాం పురుషాణాం కర్తా యస్య

నైతత్ కర్మ సవై వేదితవ్యః' ఓ బాలాకిమునీ! ఈ ఆదిత్యాది పురుషులకు ఎవడు కర్తయో ఈ సర్వము ఎవని సృష్టియో వాడే తెలిసికొనబడదగిన వాడు. అను నీ వాక్యమును జూడ పనులన్నియు ప్రాణాశ్రయమున నడచు చున్నందున ఇచ్చట తెలిసికొన వలసినది జీవుని గుఱించియా? లేక ప్రాణమును గుఱించియా? అనిన, జగత్కారణము కేవల జీవప్రాణములు కాదని సమాధానము.

## జగద్వాచిత్వాత్. 16

ఈ వాక్యము జగత్తును గుఱించి చెప్పుచుండుట వలన శ్రుతియందు తెలిసికొన వలయునని చెప్పబడిన వాడు పరబ్రహ్మమే గాని ప్రాణము గాదు. ప్రాణము జగదంతర్గత మైనదే యని అర్థము.

శంక : కర్త యనుమాటచేత జీవుడే యని తోచుచున్నది. ఇట్లు జీవప్రాణములు కర్తలుగా నుండుట విస్పష్టముగా తెలియబడుచున్నందున ఇది బ్రహ్మ మెట్లగును? అనిన,

## జీవముఖ్యప్రాణలింగాన్నేతిచేత్తద్వ్యాఖ్యాతమ్. 17

సమా : కాదు. జీవుడు, ప్రాణము, బ్రహ్మము ఈ మూడును ఉపాసనార్థమై గుఱుతులుగా చెప్పబడినవి. ఈ విషయము 1-1-31-వ సూత్రమునందు చెప్పబడి యున్నది.

అవ : ఈ విషయమునందు ఇతరుల అభిప్రాయము.

## అన్యార్థం తు జైమినిః ప్రశ్నవ్యాఖ్యానాభ్యామపి చైవమేకే. 18

ఇచ్చట జీవరూప మగు అర్థము బ్రహ్మమును తెలుపుటకొఱకై సాధన మైయున్న గని జైమినిఋషి చెప్పుచున్నారు. ఎందుకనగా, అచ్చటి ప్రశ్నోత్తరములచే ఈ అర్థమే తేలుచున్నది. మఱియొక శాఖవారు ఇదే వాక్యమునందు జీవుని చెప్పి పరబ్రహ్మమును వేఱుగా చూపుచున్నారు. ''యఏష విజ్ఞానమయః పురుషః క్వైషవై తదభూత్, య ఏషోంతర్హృదయ ఆకాశః'' ఈ విజ్ఞాన మయ పురుషుడు ఎచ్చట నుండెను? అని ప్రశ్న. హృదయ మధ్యమునందుండు సూక్ష్మ మగు దహరాకాశములో నుండెను అని సమాధానము. ఈ వాక్యములచేత

విజ్ఞానమయ శబ్దము ప్రయోగింపబడి యుండుటచే జీవు డని అర్థము స్పష్టముగ తెలియుచున్నది. కాబట్టి ఈ వాక్యశేషమునందు జీవ విమర్శ యుండినను ఇది బ్రహ్మపర మనుటలో సందియము లేదు.

## ౬. వాక్యాన్వయాధికరణము

శంక: "ఆత్మావా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః" ఇత్యాది బృహదారణ్యకశ్రుతియందు మోక్షసాధనను గుఱించి యాజ్ఞవల్క్యమహర్షిని మైత్రేయి అడిగినట్టుగా తెలియబడుచున్న ఈ వాక్యమునందలి ఆత్మ యనునది జీవు డనియే కదా అర్థము? అనిన చూడదగినది, వినదగినది, జీవుడు గాదని సమాధానము.

## వాక్యాన్వయాత్. 19

సమా: "ఏక విజ్ఞానేన సర్వవిజ్ఞానం భవతి" ఏ ఆత్మతత్త్వము తెలిసిన పిదప సమస్తము తెలిసినట్టగునో అను మొదలగు శ్రుత్యర్థమును బట్టి చూచిన పై వాక్యమునందు ఆత్మ యను శబ్దముచే చెప్పబడునది పరబ్రహ్మమునకే చెల్లును గాని ఏక విజ్ఞానముచేత సర్వవిజ్ఞానము కలుగుననుట ఇతరమునకు సంభవింపదు. కావున ఇచట ఆత్మశబ్దార్థము బ్రహ్మ మనియే తెలియవలయును.

శంక: 'నవా అరే పత్యుః కామాయ పతిః ప్రియో భవత్యాత్మనస్తు కామాయ పతిః ప్రియో భవతి' భార్యకు భర్త ప్రియుడై యున్నా డనుట భర్తకొఱకు గాదు. భార్యకొఱకే అను నీ వాక్యముచేత సర్వపదార్థముల ననుభవించు పురుషుడు ఆత్మయే యని వర్ణింపబడియున్నాడు గదా? అందుచే 'ఆత్మావా అరే...' అను వాక్యమునందు తెలిసికొను వాడని యుపదేశింపబడి యున్నాడు. ఇట్లైనపుడు అనుభవించువాడు జీవుడే గాని పరబ్రహ్మ మెట్లగును? జీవులు అనాదిగా యుండదగిన వారు. బ్రహ్మముచే పుట్టిన వారు కాదు. ఇట్లుండ బ్రహ్మమును తెలిసిన సమస్తమును తెలిసినట్లే యని ఎట్లు చెప్పనగును? అనిన, ఆశ్మరథ్య మహాముని అభిప్రాయము ననుసరించి ఇప్పుడు చెప్పుచున్నారు.

ప్రతిజ్ఞాసిద్ధేర్లింగమాశ్మరథ్యః. 20

సమా: బ్రహ్మము నెఱిగిన సమస్తమును దెలిసినట్టే యగునను మాటచే జీవులెల్లరు పంచభూతములవలె బ్రహ్మమునుండి పుట్టిన వారనియు, కార్యకారణములకు భేదము, అభేదము రెండును చెల్లు ననియు భేదాభేదములు రెండును గలవనియు చెప్పినందున బ్రహ్మ మును తెలిసినందువల్ల సర్వమును తెలిసిన ట్లగునని భేదాభేదవాది యగుస ఆశ్మరథ్యుని మతము. 'ఆత్మావారే' అను శ్రుతియందు జీవబ్రహ్మలకు అభేద మను అంశమును మాత్రము గ్రహించి జీవుడే బ్రహ్మ మను అభిప్రాయముతో 'ఆత్మ యను శబ్దముచే చెప్పబడు చున్నాడు. ఇట్లు చెప్పుటవలన విరోధము లేదని అతని అభిప్రాయము.

ఉత్క్రమిష్యత ఏవంభావాదిత్యౌడులోమిః. 21

దేహము మొదలగు వాటియందలి అభిమానమును వీడిన జీవు నకు బ్రహ్మజ్ఞానముచే సర్వజ్ఞానము కలుగు నని ఔడులోమి మహాముని తలంచును. అనగా సంసారదశయందు జీవునకు బ్రహ్మమునకు భేదము నిత్యముగ నున్నట్టును, జ్ఞానము కలిగిన పిదప బ్రహ్మముతో అభేదము సిద్ధించు ననియును ఇతని మత సారసంగ్రహము.

అవ: పై ఆశ్మరథ్య, ఔడులోమి మతములయందు చెప్పబడిన సమా ధానము దోషయుక్తము. ఈ క్రింది సూత్రమునందు నిర్దుష్ట ముగా కాశకృత్స్నాచార్యులు తమ అభిప్రాయమును తెలుపు చున్నారు. ఇదియే సూత్రకారుల అభిప్రాయ మని తెలియవలెను.

అవస్థితే రితి కాశకృత్స్నః. 22

'పరబ్రహ్మమే విజ్ఞానాత్మ యగు జీవుడు' అని చెప్పబడి యుండుటవలన జీవబ్రహ్మల కెప్పుడును భేదము లేదు. జీవుని గుఱించి చెప్పినను పరబ్రహ్మమును గుఱించి చెప్పినను ఒక్కటే. కాబట్టి 'ఆత్మావారే' అను వాక్యములో ఆత్మశబ్దముచేత చెప్పబడినది పర బ్రహ్మమునకంటె వేఱు గాదని అర్థము.

## 8. ప్రకృత్యధికరణము.

అవ: జగత్కారణము బ్రహ్మమే యని తెలుపుచున్నారు.

### ప్రకృతిశ్చ ప్రతిజ్ఞా దృష్టాంతానుపరోధాత్. 23

జగత్తునకు పరమాణువులు ఉపాదానకారణమని బ్రహ్మము నిమిత్తకారణమని ఇట్లు రెండుగా లేవు. బ్రహ్మమే ఉపాదానకారణము, నిమిత్తకారణము నయియున్నది. ఏదాని నెఱిగిన సమస్తము నెఱిగినట్లగునో అను విషయమునందు మట్టి దృష్టాంత మిచ్చినందువలన ఒక మట్టి దృష్టాంతమును తెలిసికొనిన సర్వ ఘట శరావాదులు మట్టివే యని తెలిసికొనునట్లు పరబ్రహ్మ మొకదానిని తెలిసికొనిన సర్వప్రపంచమును తెలిసికొన్నట్లగును. "నాశ్రుతం శ్రుతం" దేనివలన వినబడని వస్తువు లన్నియు వినబడుచున్నవి? అనిన ఒక్క బ్రహ్మజ్ఞానము వలననే యను నిత్యాదిగా చెప్పిన వాక్యము లిచ్చట గ్రాహ్యము.

శంక: ఒక పరబ్రహ్మమే ఉపాదానకారణము, నిమిత్తకారణమునై యున్నదని చెప్పవచ్చునా? అనిన,

### అభిధ్యోపదేశాచ్చ. 24

"సోఽకామయత బహుస్యామ్" బ్రహ్మము తన ఇచ్ఛచే నే ననేకరూపములు గలవాడ నయ్యెదనని సంకల్పించెను. లేక ధ్యానించెను అను నిత్యాదిగా చెప్పబడి యుండుట వలన జగద్రూపమై యున్నవాడును, సంకల్ప పూర్వకముగా సృష్టి యొనర్చిన వాడై యున్నందు వలనను బ్రహ్మమే ఉపాదానకారణమును, నిమిత్తకారణమును నైయున్నాడనుటకు సందియము లేదు; కావున పరబ్రహ్మము అద్వితీయమను శ్రుతిప్రమాణానుసారము 23వ సూత్రమునందు చేసిన సిద్ధాంతము సరియైనది.

### సాక్షాచ్చోభయామ్నానాత్. 25

ప్రత్యక్షముగా ఈ సమస్త జగత్తు పుట్టునది, స్థితిపొందునది బ్రహ్మమునందే యని నిర్ధరింపబడి చెప్పినందువలన బ్రహ్మమే జగత్తు

వకు నిమిత్తోపాదానకారణమై యున్నదని అర్థము "సర్వాణి హవా ఇమాని భూతాన్యాకాశ దేవ సముత్పద్యంతే ఆకాశం ప్రత్యస్తం యాంతి" ఈ సమస్తభూతములు బ్రహ్మమునందే ఉత్పన్నము లగుచున్నవి. అందే లయ మొందుచున్నవి.

ఆత్మకృతేః పరిణామాత్. 26

'తదాత్మానగ్గం స్వయ మకురుత' ఆ పరబ్రహ్మము తనను, తానే ప్రపంచముగా చేసికొనెను అను నీ వాక్యమువలన ఈ ప్రపంచము యొక్క సృష్టికర్త బ్రహ్మమే యని చెప్పబడి నట్లాయెను. మఱికొన్ని శ్రుతులయందు ఆ పరబ్రహ్మమే ప్రపంచరూపముగా పరిణమించె నని చెప్పబడి యుండుటయు గలదు. కాని ఆధ్యాత్మిక దృష్ట్యా ఈ పరిణామమునకు వివర్త మనిచెప్పుటయే సంప్రదాయము. వివర్తోపాదానము—రజ్జు సర్పము. పై ప్రమాణము ననుసరించి బ్రహ్మము ప్రపంచమునకు ఉపాదానకారణము, నిమిత్త కారణ మని చెప్ప వచ్చును.

యోనిశ్చహి గీయతే. 27

పరబ్రహ్మము ఉపాదానకారణ మని స్పష్టముగా 'కర్తారమీశం పురుషం బ్రహ్మయోనిం' అని యోనిశబ్దముచే పరబ్రహ్మమే ఉపాదాన మని చెప్పబడినది.

౮. సర్వవ్యాఖ్యానాధికరణము

జగదుపాదాన కారణము, నిమిత్త కారణమును ఒకే పరబ్రహ్మ మనియు ప్రధానాదు లేవియు కావని శ్రుత్యర్థమును దెలిపి ఈ అధికరణమునందు పరమాణువులు మొదలగునవి జగత్కారణములు కావని నిరసించు చున్నారు.

ఏతేన సర్వే వ్యాఖ్యాతా వ్యాఖ్యాతాః. 28

ఏ కారణముచేత జగత్కారణము బ్రహ్మమనియు ప్రధానాదులు జగత్కారణము కావని ఖండింప బడినవో ఆ కారణముచేత నే

ఇతర మతము లన్నియు ఖండింపబడిన వయ్యెను. కాబట్టి పరమాణువులు మొదలగునవి జగత్కారణ మనునది సరికాదు.

ఇతి వైయాసిక్యాం శారీరక మీమాంసాయాం
ప్రథమాధ్యాయస్య చతుర్థః పాదః.
ఇది 1-వ అధ్యాయమున 4-వ పాదము.
ప్రథమాధ్యాయము సంపూర్ణము.
ఓం తత్ సత్.



# వైయాసికీ శారీరకమీమాంసా
# బ్రహ్మసూత్రములు

## అథ ద్వితీయోధ్యాయః

## రెండవ అధ్యాయము - మొదటిపాదము.

అవ : ఈ అధ్యాయమునందు మతమతాంతరులకు సమాధానము చెప్పబడును.

### ౧. స్మృత్యధికరణము

అవ : సమస్త వేదాంత వాక్యములు పరబ్రహ్మమే జగత్కారణ మని చెప్పుచున్నట్టివిగా ఈ మొదటి అధ్యాయమునందు సిద్ధాంతీకరించి ఇప్పుడు ప్రధానమే జగత్కారణ మని చెప్పునట్టి కపిలాచార్యుల స్మృతికి పై విషయము విరుద్ధ మగును గదా? యనిన, ఈ విషయమును గుఱించిన సమన్వయ మీ యధికరణము నందు దెలుపుచున్నారు.

శంక : ప్రధానము జగత్కారణము కాదని చెప్పినందువలన ఇక కపిల స్మృత్యభిప్రాయ మేమి?

స్మృత్యనవకాశదోషప్రసంగ ఇతి చేన్నాన్యస్మృత్యనవకాశదోష ప్రసంగాత్. 1

సమా : కపిలుని స్మృతినిబట్టి బ్రహ్మము జగత్కారణ మని చెప్పుకున్నచో, మనుస్మృతి ప్రమాణము గాకపోవలసి వచ్చును. కాబట్టి తాత్పర్య మేమనిన, స్మృతులు శ్రుతి విరుద్ధములు గాక శ్రుత్యా లంబితమై యుండినపుడు మాత్రమే ఆ స్మృతులు అంగీకార యోగ్య ములు. అట్లు లేకున్న అంగీకరింప దగినవి కాదని భావము.

ఇతరేషాంచానుపలబ్ధేః. 2

వేదాంత తత్త్వమునందు జగత్కారణ మని చెప్పియుండిన మాయను కపిల మతానుయాయులగు సాంఖ్యులు ప్రధాన మని యనె దరు. అయితే వేదాంత తత్త్వమునందు చెప్పబడు మాయ ఈశ్వరాధీన మైనది. కపిల సాంఖ్యులచే చెప్పబడు ప్రధానము స్వతంత్ర మైనదని చెప్పబడును. ఎట్లైననేమి? మాయనే ప్రధాన మని, మహత్ అని, అహంకార మని ఈ మొదలగు శబ్దములచే చెప్పుదురు. కాని వీటికి ఆశ్రయమే లేనందువలన శ్రుతులయం దెచ్చటను వీటిని గుఱించిన మాటయే లేదు కాబట్టి మహత్తత్త్వము మొదలగు వానిని కల్పించి యున్న భాగ మెట్లు అప్రమాణమో ప్రధానము కూడ అప్రధానము. కల్పన యని అర్థము. జగత్కారణము కేవల పరబ్రహ్మమే యని ఉత్త రార్థము.

౨. యోగప్రత్యుక్త్యధికరణము

సాంఖ్యులకును, యోగులకును విషయము (అర్థము) ఒక్కటే గావున ఇప్పుడు యోగస్మృతి కూడా అప్రమాణ మని చెప్పుచున్నారు.

ఏతేన యోగః ప్రత్యుక్తః. 3

పైన చెప్పిన యుక్తులచేతనే యోగ స్మృతియు అప్రమాణము. యోగులకును, సాంఖ్యులకును ప్రధానాదులయందు భేదము లేదు. జడ మగు ప్రధానము జగత్కారణ మని ఇరువురును చెప్పుదురు. కావున పైన చెప్పినదే వీరికిని ఉత్తర మని భావము.

3. విలక్షణత్వాధికరణము

శంక: బ్రహ్మము జ్ఞానానందము స్వరూపముగా గలిగిన దని శ్రుతి చెప్పుచున్నది. ఇట్టి బ్రహ్మము జడమగు విరుద్ధ స్వభావముగల ఈ జగత్తుకు కారణ మెట్లగును? అనిన, విరుద్ధ స్వభావము గలవియు ఒకటి కొకటి కారణము గానచ్చు నని సమాధానము.

నవిలక్షణత్వాదస్య తథాత్వంచ శబ్దాత్. 4

సమా: ప్రపంచము చేతనముగానే యున్నది. వేదమునందు "విజ్ఞానంచా విజ్ఞానంచ" జగత్కారణమైన వస్తువే చేతనము, అచేతనము నాయెను అను వాక్యము గలదు. మఱియు జలము యోజించెను అను నీ మొదలగు శ్రుతులయందు పంచభూతములకు చేతృత్వము (చేతనత్వము) అగపడుచున్నది. అందువలన ప్రపంచము, బ్రహ్మము ఒకటి కొకటి విరుద్ధ స్వభావము కలవి కాదని అర్థము.

అభిమాని వ్యపదేశస్తు విశేషానుగతిభ్యామ్. 5

శంక: శ్రుతి స్మృతులయందు జలము మొదలగునవి యోజించెను అను నీ క్రియ అభిమాన దేవతలకు సంబంధించినదై యున్నది గాని జడ మగు భూతముల పనికాదు అందుచేత బ్రహ్మము, ప్రపంచము ఒకటి కొకటి విరుద్ధ స్వభావము గలవి యనుటయే నిజము అనిన సమాధానము.

దృశ్యతే తు. 6

జగత్తునందు చేతనముల వలన అచేతనములు, అచేతనముల వలన చేతనములు పుట్టు చున్నట్లు చూచుచున్నాము. జడ మగు పేడయందు వృశ్చికములు, పురుగులు పుట్టుట చూచుచున్నాము. చేతనమైన సాలెపురుగునందు జడ మగుదారమును, మఱి చేతను లగు మనుష్యులయందు జడ మగు గోళ్ళు వెంద్రుకలు ఏర్పడుట ప్రత్యక్షముగ చూచుచున్నాము. కాబట్టి కారణ మగు బ్రహ్మము చేతనమైనప్పటికిని జడ మగు ప్రపంచము పుట్టవచ్చును.

శంక: ఇట్లు చెప్పి నట్లయిన ఈ ప్రపంచము సృష్టికి పూర్వము

అసత్తని చెప్పవలెను గదా? మొదట ఉండినదే పుట్టె నని చెప్పు. మీరు లేనిది పుట్టె నని ఎట్లు చెప్పగలరు? అనిన,

## అసదితిచేన్న ప్రతిషేధమాత్రత్వాత్. 7

సమా: చెప్పవచ్చును. దోష మేమియు లేదు. అగపడు ఈ కార్యరూపమైన నామ రూప ప్రపంచము సృష్టి పుట్టక పూర్వము లేదని చెప్పవచ్చును. ఈ ప్రపంచము ప్రళయమునందు కారణరూపమున నుండెనని మేము చెప్పుట వలన అది పుట్టవచ్చును. జగత్కారణ మగు బ్రహ్మమునకు నాశ మెప్పుడును లేదు. నామరూపములు మిథ్యాభూతములు, వ్యవహారమాత్రములు. ప్రపంచోత్పత్తికి పూర్వము లేనిదని చెప్పినంత మాత్రమున తప్పేమియు గాదు. కేవల ప్రతీతి మాత్రము లగు నామరూపములచే అద్వితీయత్వమునకు హాని లేదు.

అవ : ప్రపంచ మచేతన మయినను చేతన మగు బ్రహ్మము దానికి కారణముగా నుండవచ్చును. కారణమునందుండు లక్షణములు కార్యమునందుండ వలయు నను నియమము లేదు. అధిష్ఠానమునం దివి ఆరోపితములు, ఈ విషయము 6, 7 సూత్రములలో చెప్పబడినది. ఇక ముందు మఱొక శంకను కనబఱచుచున్నారు.

## అపీతౌ తద్వత్ప్రసంగాదసమంజసమ్. 8

ప్రళయమున జగత్తు బ్రహ్మమునందు లయమై పోవునని చెప్పినందువలన మరల పుట్టుట ఎట్లు సంభవించును?

## నతు దృష్టాంతభావాత్. 9

పై సూత్రమునందు చేయబడిన శంకను ఖండించుటకు అనేక దృష్టాంతములు గలవు. భూమియందు గలిసి పోయి యుండిన కప్పల శరీరములు వర్షాకాలమునందు మరల పుట్టునట్లు బ్రహ్మమునందు గలిసి పోయి సంస్కార రూపముగ నున్న ఈ జగత్తు మరల పుట్టవచ్చును. మఱియు కుండ మట్టియందు లీన మగునపుడు కుండకు గల కంబుగ్రీవత్వాదులు మట్టికి రాలేదు. అటువలె కల్పితమగు సంస్కారములు

ప్రళయకాలమున బ్రహ్మమునందు లయించి యుండినను తత్సంబంధము బ్రహ్మమునకు లేదు. అది అసంగము.

స్వపక్షదోషాచ్చ. 10

ప్రధానమును జగత్కారణ మని చెప్పు తన మతమునందును ఈ దోషము ఉండియే యున్నది. ఎందుచేత ననగా ప్రళయమునందు జగత్తు ప్రధానమునందు కలసి పోయినది. అందుచేత నామ రూపాత్మక జగత్తు సత్యమని చెప్పు సాంఖ్య మతమునకు ఈ దోషములు ఉన్నవి. ప్రపంచము మిథ్య యని చెప్పు వేదాంత మతమునకు విరోధము లేదు. వేదాంత తత్త్వముపై సాంఖ్యులు చేయు పూర్వపక్షములు నిరర్థకములు.

తర్కాప్రతిష్ఠానాదప్యన్యథాఽనుమేయమితి చేదేవమప్యవిమోక్ష ప్రసంగః. 11

కాపిల సాంఖ్యులు జగత్తునకు ప్రధానమే కారణ మని కేవల యుక్తి బలమున నిశ్చయించి యున్నారు. యుక్తులు శక్తి కలిగి నిలుచునవి కావు. ఎందుకనగా తర్క మనునది కేవలము మనుష్యుల బుద్ధివికాసముచే ఏర్పడుచుండును. అందుచే దానికి నిలుకడ గలుగదు. ఒకడు యుక్తిచే ప్రధానమే జగత్కారణ మనును. ఇంకొకడు తన యుక్తులచే అణు పరమాణువులనే జగత్కారణమనును. వీరిలో ఒకరితో నొకరికే తగవు. అందులో ఏది నిజమని? తస్మాత్ వేదములు తెలిపిన యుక్తుల బలముచే చేతన మగు బ్రహ్మమే జడ మగు జగత్తునకు కారణ మని నిశ్చయ మగుచున్నది. తర్కముచే నొప్పారు సాంఖ్యాది సిద్ధాంతములు వేదాంత తత్త్వమునకు రోధకములు కావు. సమస్త శ్రుత్యర్థములకు బ్రహ్మమునందే సమన్వయార్థమని సిద్ధాంతము.

౪. శిష్టాపరిగ్రహాధికరణము

అవ : సాంఖ్యులు చెప్పు తర్కము వలన సిద్ధాంతమునకు భంగము లేదు. ఇక వైశేషికులు అనగా కణాద మతము వారు. వీరి శాస్త్రమునే తర్కశాస్త్ర మనియు పిలుతురు. ఈ మతాంత

రులు చెప్పు తర్కములవలన గూడ అద్వైత మతమునకు భంగము లేదు.

ఏతేన శిష్టాపరిగ్రహా అపి వ్యాఖ్యాతాః. 12

జడ మగు ప్రధానాదులను కారణ మని చెప్పుట సరికాదు. మనువు మొదలగు వేదమతాంగీకారు లగు పెద్దలచే తిరస్కరింప బడియుండు పరమాణు కారణ వాదులగు కణాదాదుల తర్కశాస్త్ర శుష్కయుక్తులు సమంజసములు గావు. ఇందుచే శిష్టసంప్రదాదికులు కానివా రందఱికి ఉత్తరము చెప్పినట్టాయెను.

౫. భోక్త్రాపత్త్యధికరణము

శంక : చేతనముసందు జడము లెల్లయు ఏకమై పోవుట వలన చేతనము, జడము అను భేదము లేకపోవలసి వచ్చును గదా? అనిన, జడ చేతనములు వేఱువేఱుగ నుండవచ్చు నని చెప్పుచున్నారు.

భోక్త్రాపత్తేరవిభాగశ్చేత్స్యాల్లోకవత్. 13

సమా: సముద్ర మంతయు నీరే యైనను అలలు, నురుగులు, బుగ్గలుగా వేఱువేఱై యుండి ఒకటితో నొకటి చేరి యుండునట్లు చేతనము, జడము కలసి పోవుట లేదు. నురుగు మొదలగునవి నీటికంటెను వేఱు గాని యట్లు చేతనము, జడము అనునవి బ్రహ్మమునకంటె అన్యముగ లేవు. కల్పిత మగు భోక్తృ భోజ్యములను భేదముండుటలో వస్తుతత్త్వమున విరోధ మేమియు లేదు. అందుచే ప్రత్యక్షమునకు విరోధము కాదు.

౬. ఆరంభణాధికరణము

తదనన్యత్వ మారంభణ శబ్దాదిభ్యః. 14

"వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవసత్యమ్" "ఐతదాత్మ్య మిదగ్ం సర్వం, నేహనానాస్తికించన" వ్యవహారమునకు ఆధారముగా కల్పింప బడిన నామరూపములు అధిష్ఠానమునందు భేదమును కలిగింప జాలవు. కుండ, గూన, బాన, ఇత్యాదులు మృత్తిక కంటె అన్యములు కావు. ఇట్లని దృష్టాంత పూర్వకముగా కారణ

రూప మగు పరబ్రహ్మము కార్య మగు ప్రపంచమునకంటె అన్యము కాదనియు ఈ భేదము లన్నియు నామమాత్రములే యనియు తెలియవలెను.

భావేచోపలబ్ధేః. 15

కారణముయొక్క ఉనికి, ఆశ్రయమే కార్య మగు జగత్తునకు ఉనికియు ప్రకాశమునై యున్నది. అట్టి అస్తిత్వము నాధారముగా జేసికొని యుండు ప్రపంచము పరబ్రహ్మమునకంటె వేఱు కాదనుట కేవలము శ్రుతిచేత మాత్రమే గాక యుక్తిచేతను సిద్ధాంతమైనది.

సత్త్వాచ్చావరస్య. 16

"సదేవ సౌమ్యేద మగ్ర ఆసీత్" "బ్రహ్మవా ఇదమగ్ర ఆసీత్" సృష్టికి పూర్వ మీ ప్రపంచ మంతయు సద్రూపమై యుండెను అను నిత్యాది శ్రుత్యనుసారము సంతతము ప్రపంచము బ్రహ్మాస్తిత్వమునందే యుండుట వలన బ్రహ్మమునకంటె ప్రపంచము వేఱుగా లేదని తెలియవలెను.

శంక : 'అసద్వా ఇదమగ్ర ఆసీత్' ఈ సృష్టికి పూర్వము ప్రపంచ మంతయు అసత్తుగా నుండె నను నీ వాక్యముచే ప్రపంచము లేదని తెలియ బడుచున్నది. కావున ప్రపంచము ఎల్లప్పుడు బ్రహ్మమునందే యున్నదని ఎట్లు చెప్పవచ్చు ననిన, జగత్తు బ్రహ్మమునకంటె వేఱు కాదని చెప్పుచున్నారు.

అసద్వ్యపదేశాన్నేతిచేన్న ధర్మాంతరేణ వాక్యశేషాత్. 17

సమా: 'అసద్వా ఇదమగ్ర ఆసీత్' అను వాక్యముయొక్క చివరి భాగము నందలి పదమును లక్ష్యమునకు తెచ్చుకొన్నచో సైన సూక్ష్మ రూపమున వాసనా మాత్రమై ఈ జగత్తు అవ్యాకృత రూపమున ఉండియే యుండె నని పై శ్రుతియొక్క అభిప్రాయము. 'తత్సదాసీత్' అదే సత్తయ్యెను అని చెప్పబడి నట్లు తెలియుచున్నది. కాబట్టి మొదట సూక్ష్మరూపమున నుండినదే సృష్టిసమకాలమున స్థూలరూపము నొందె నని తాత్పర్యము.

### యుక్తేః శబ్దాంతరాచ్చ. 18

సృష్టికి పూర్వము అది శశవిషాణమువలె లేనిదే అయి యుండిన పక్షమున ఇప్పుడు పుట్టిన వెంటనే లేదని చెప్పిన యుక్తికి బలముండెడిది. అట్లుగాక ఈ ప్రపంచము ప్రళయమునందు సూక్ష్మరూపమున అడగి యుండె నని శ్రుతులు వక్కాణించుచున్నవి.

### పటవచ్చ. 19

వస్త్రము ఒకప్పుడు ముడువ బడినదియు ఒకప్పుడు తెఱవ బడినదియు నయియుండవచ్చును. అటువలె ప్రపంచము ప్రళయమునందు సూక్ష్మమై సృష్టిసమకాలమునందు స్థూలమై యుండవచ్చును. ఇంత మాత్రమున ప్రపంచమునకును, పరబ్రహ్మమునకును వస్తుతః భేద మనునది ఘటిల్లదు. ఇట్లు పరమార్థ మగు సత్యమును ఎన్నిసారులు చెప్పినను ప్రపంచ బ్రహ్మలకు భేదమే యున్నట్లు అజ్ఞునకు మాత్రము ప్రతీతి గాకపోదు. కాని అధిష్ఠాన జ్ఞానము గలవానికి సందేహ ముదయింపదు. భేదము దర్శింప బడదు.

### యథా చ ప్రాణాది. 20

యోగులు ఉచ్ఛ్వాస ప్రశ్వాసములను నిరోధించి నపుడు ప్రాణము సూక్ష్మత్వ మొందుటయు తక్కిన సమయములందు స్థూల రూపము నొంద నవద్వారములనుండి లోను, వెలిని పారాడుట యగును. అటువలె ప్రపంచము ప్రళయ కాలములో సూక్ష్మమై యుండి సృష్టి కాలమునందు స్థూలరూపము నొందును.

### ౭. ఇతరవ్యపదేశాధికరణము

### ఇతరవ్యపదేశాద్ధితాకరణాదిదోషప్రసక్తిః. 21

'స ఆత్మా తత్త్వమసి' ఆ పరబ్రహ్మమే ఆత్మ; అదియే నీవు అను నీ మొదలగు వాక్యములచేత శ్రుతి జీవబ్రహ్మాభేదమును చెప్పి యున్నది అన్నపుడు బ్రహ్మము తానే సృష్టియందు ప్రవేశించి జీవుడై యున్నందువలన అతడు తనకు ఇష్ట మగు స్రక్చందనాది పదార్థములను మాత్రమే పుట్టించు కొనక వ్యాఘ్రము, సింహము మొదలగు

అనిష్ట పదార్థములను ఎందుకు సృష్టించు కొనవలెను? జీవుడును బ్రహ్మము నొకటే కదా? బ్రహ్మమే ఇట్లు జీవరూపముతో సృష్టించు చున్నాడు అన్నపుడు మంచివి యగు పదార్థములనే ఎందుకు సృష్టించు కొనగూడదు? అనిన,

## అధికంతు భేదనిర్దేశాత్. 22

'ఆత్మావారే ద్రష్టవ్యః' పరబ్రహ్మమును తెలిసికొన వలయు నను నీ శ్రుతిచే బ్రహ్మస్వరూపము జీవులకంటెను అత్యంతము భిన్న మని తెలియుచున్నది. అయితే దేహాభిమానము వీడి, హృదయ గ్రంథి ఛేదింపబడి బ్రహ్మసాక్షాత్కారము నొందు నంత పర్యంతము భేదము—జీవబ్రహ్మలు వేఱువేఱనునది—నిలిచియే యుండును. శ్రుతి యును చెప్పుచున్నది. జీవులకు ఈ జగత్తు ఇష్టానిష్టాత్మకమై యున్నది. జీవులు జగత్తును సృజింప లేరు. జగత్సృష్టి యన్నో సర్వాధిష్ఠాన మగు బ్రహ్మము నుండియే. బ్రహ్మమునకు ఇష్టానిష్టములు లేవు. అందుచే ఇష్టానిష్ట సృష్టివిషయక మగు దోషము బ్రహ్మమునకు సోకదు. బ్రహ్మకు సృష్టిసంబంధమును లేదు. మిథ్యాప్రతీతియని అర్థము. ఆవరణము లేని నిరుపాధికు డగు జీవుని గుఱించి మాత్రమే ఇచ్చట బ్రహ్మత్వము బోధింపబడి యున్నదని భావము.

శంక: పరబ్రహ్మము ఒక్కటే జగత్కారణమై ఉన్న యెడల ఈ ప్రపంచ మంతయు నొక్కటిగా నుండవలయును గదా? పై ఇష్టానిష్ట ములు ఎవరికైనను అగుగాక! జ్ఞానానందస్వరూప మగు బ్రహ్మము ఇట్టి జగత్తు నెట్లు కలుగజేయును? అనిన,

## అశ్మాదివచ్చ తదనుపపత్తిః. 23.

సమా: ఒకే భూమియందు వజ్రము, వైడూర్యము మొదలగు రత్నములును, సుగంధ దుర్గంధములచే కూడిన వృక్షముల విత్తనములు గలదియై కాంతియందును రుచియందును వాసనయందును అనేక భేదము లుండినట్లును, అన్నరస మొకదానిచేతనే రక్తమాంసాది విచిత్ర సృష్టి ఏర్పడునట్లు బ్రహ్మచే విచిత్ర మగు నీ జగత్తు కలుగ వచ్చును. బాధ లేదు. బ్రహ్మము జగత్కారణ మను సిద్ధాంతమున కేవిధముగను విరోధము లేదు.

౮. ఉపసంహార దర్శనాధికరణము

శంక: ఘటాకృతి పొందవలె నన్న కులాల దండ చక్ర నిమిత్తాది విభిన్న కారణము లుండవలయునుగదా? ఇవేవియును లేక ఏకమగు బ్రహ్మము అనేక మగు ఈ జగదాకృతి నెట్లు పొందును? అనిన, బ్రహ్మము సాధనాపేక్ష లేకయే జగదుత్పత్తి చేయ గలదని సమాధానము.

ఉపసంహారదర్శనాన్నేతిచేన్న క్షీరవద్ధి 24.

సమా: అట్లు గాదు. పాలు ఇతర సహాయము లేకనే పెరుగై పోవును. అటువలె ఏకమగు బ్రహ్మముచే ప్రపంచ మాయెను. ఇక ఇందుపై నాతంచనము (మజ్జిగ విడుచుట) వల్లనే పెరుగైనది కదా? యని యుక్తిని వాడరాదు. మఱియు బ్రహ్మము ప్రపంచాకృతిగా అగ పడిన దనునది మిథ్య యగు అవిద్య వలననే—అనిర్వాచనీయ మగు మాయచే—స్వప్నమువలె కల్పన యని తెలియ వలయును.
అవ : ఇందులకు వేఱొక దృష్టాంతమును చూపుచున్నారు.

దేవాదివదపి లోకే 25.

దేవతలు, రాక్షసులు కలహించు నపుడు మాయచే చతురంగ బలాదులు పుట్టించి నట్లుగా చెప్పబడుచున్నది. మఱియు నిద్రాశక్తియే విచిత్రముగ స్వప్నమును సృష్టించు నట్లును సర్వాధారమగు బ్రహ్మము నాశ్రయించి మాయచే ఈ జగద్రచన యగుట విశేష మేమియు కాదు.

౯. కృత్స్నప్రసక్త్యధికరణము.

కృత్స్నప్రసక్తిర్నిరవయవత్వశబ్దకోపో వా 26.

శంక: బ్రహ్మము తన శక్తి విశేషముచే ప్రపంచమును పుట్టింప గలదనిన పరిణామ్యుపాదాన కారణ మనినట్టగును. అప్పుడు అనేక దోషములు వచ్చును. బ్రహ్మము నిరవయవ మనిన, అట్టి బ్రహ్మమే జగద్రూపమై పోవుట వలన బ్రహ్మము లేని దగును. జగత్తు బ్రహ్మా ధారమున ఉన్నదనియు, ప్రకాశించు చున్నదనియు చెప్పు విషయము నకు విరోధ మగును. అట్లుగాక సావయవ మని చెప్పినను నిరవయవ మని చెప్పు శ్రుతికి భంగము వచ్చు నని శంకించిన,

## శ్రుతేస్తు శబ్దమూలత్వాత్. 27.

సమా : బ్రహ్మస్వరూపము ఎఱుగుటకు వేద మొక్కటే ఆధారమై యున్నందువలన వేదము చెప్పు మాట పరమ ప్రమాణము, వేదము చెప్పినట్లుగా అది నిరవయవ మని, జగత్తునకు ఆధార మని, ప్రకాశక మని యుక్త్యనుభవములచేత ఈ అర్థము సిద్ధాంతము చేయ బడి యున్నది. మిథ్య యగు మాయాశక్తిచే బ్రహ్మము జగద్రూపముగ దోచును. ఎట్లు లోకమునందు సర్పము, పూమాల, జలధార యను మిథ్యారూపములచే రజ్జువే అగపడుచుండి అధిష్ఠాన మగు తాను చెడకనే సర్పము మొదలగు మిథ్యాప్రత్యయముల ప్రతీతి కాస్పదమై యుండి నట్లు, జగద్రూప మొందిన బ్రహ్మము జగత్ప్రతీతి సమకాలము నందును అధిష్ఠాన మగు యునికినుండి వ్యభిచరించునది (చెడునది) కాదు. వివర్తోపాదాన మని అర్థము.

## ఆత్మని చైవం విచిత్రాశ్చహి. 28

పైన చెప్పినట్లు విచిత్ర మగు పదార్థములు నిరవయవుడగు జీవునియందును అగపడుచున్నవిగదా? అదెట్లనిన, స్వప్నమునందు అగపడు వస్తువు లన్నియు జీవునిచేతనే సృజింప బడినవై ఆ స్వప్న కల్పిత పదార్థములు జీవునకు సంబంధము లేనట్లు నిరవయవు డగు మాయాసహిత బ్రహ్మమునందు నానావిధ ప్రపంచము పుట్టుచున్నను పైదోషము: లాపాదించవు. ఇచ్చట జీవుడు అవయవములు కలవా డనుట అనుభవ విరుద్ధము. ఇతడు అవయవవంతుడు కాడు. స్వప్న ద్రష్ట యని అర్థము. ఇది వేదాంత సమ్మత మగు వివర్తవాద మని అర్థము.

## స్వపక్షదోషాచ్చ. 29

సాంఖ్యులును ప్రధానమునకు అవయవములు లేవని ఒప్పుకొని యున్నారు. బ్రహ్మము జగద్రూపముగ నున్నపుడు బ్రహ్మమే లేక పోయి నట్లగునను నీ మాట హాస్యాస్పదము. సాంఖ్యాదులు చెప్పెడి ప్రధానము నిరవయవ మైనందున అది జగత్తుగా అగపడినపుడు అది యును లేకపోవలసి వచ్చును. కాబట్టి బ్రహ్మము జగద్రూపముగ నుండినపుడును తన అస్తిత్వము చెడదని అర్థము.

## ౧౦. సర్వోపేతాధికరణము

### సర్వోపేతా చ తద్దర్శనాత్. 30

బ్రహ్మము సర్వశక్తి సమన్వితమని శ్రుతి చెప్పుచున్నది. అవయవములు లేకుండినను అది జగత్తును కలుగజేయ వచ్చును.

### వికరణత్వాన్నేతి చేత్తదుక్తమ్. 31

శక్తి ఉండునుగాక! శరీరేంద్రియాది సాధనములు లేనందువలన బ్రహ్మము జగద్రూప మెట్లగును? "అచక్షుష్క మశ్రోత్రమ్" అను మొదలగు వాక్యములు పరబ్రహ్మమునకు శరీరేంద్రియములు లేవని చెప్పుచున్నవిగదా? యనిన,

సమా: పరబ్రహ్మము శరీరము లేనిదైనను అనిర్వచనీయ మగు మాయచే సమస్త జగత్తును సృజింప వచ్చును. ఇందు విరోధ మేమియు లేదు.

## ౧౧. ప్రయోజనవత్వాధికరణము

### న ప్రయోజనవత్వాత్. 32

జగత్తును చేయుట వలన బ్రహ్మమునకు ప్రయోజనము లేదు. అది జగత్తును చేయదు. కుండను చేయు కుమ్మరి వానికి ఫలము గలదు. సర్వకామావాప్త స్వరూప మగు ఆనందమే స్థితిగా గలిగిన బ్రహ్మమునకు జగద్రచనచే ఏమి ప్రయోజన మని శంకించిన, ఈ క్రింది సూత్రముచే సమాధానము తెలుప బడును.

### లోకవత్తు లీలాకైవల్యమ్. 33

అదొక లీల. లోకమునందు కావలసినంత ఐశ్వర్యాది సర్వ సౌకర్యము లుండినను రాజు మొదలైనవారు ఒక్కొక్కసారి ఆనందముగా లీలచే ఏమైనను చేయుచుందురు. మఱొకప్పుడు ఊరకనే యుందురు. అటువలె ఏ కోర్కెయు లేని బ్రహ్మము లీలామయమై సృష్టికాలమునందు ప్రపంచోత్పత్తిని జేయుచు ప్రళయకాలమున లయ మొనర్చుచు ఊరకుండును. ఇదే బ్రహ్మలీల, ఆట.

## ౧౨ అవైషమ్యానైర్ఘృణ్యాధికరణము

శంక : ఈశ్వరుడు కొందఱిని దరిద్రులు గాను మఱి కొందఱిని ఐశ్వర్యవంతులుగను చేయుచున్నట్లు అనుభవము. ఇట్లుండగా నిర్దయ, పక్షపాతాది దోషము లతని నాపాదించవా? యనిన, సమాధానము.

### వైషమ్యనైర్ఘృణ్యే న సాపేక్షత్వాత్తథాహి దర్శయతి. 34

సమా : ఈశ్వరునియందు ఏ పక్షపాతమును లేదు. ప్రభువు మనుష్యులు చేసిన మంచి చెడుగుల ననుసరించి వారి వారికి తగిన బహుమానములును శిక్షలును విధించుట పక్షపాత మనియా అర్థము! అట్లు కాదు. బీదలుగను ధనికులుగను చేసినది వారు వారు చేసికున్న కర్మయే కారణముగా గలిగినది గాని ఈశ్వరుఁడు కారణము కాడు. ఈశ్వరుడు ఆత్మరూపమున తనకు తానై యున్నా డను తత్వమును తెలియ నందువలన అతద్బుద్ధిచే కర్మపరతంత్రులై జీవు లిట్లు పుణ్య పాప వశు లగు చున్నారు. కాని పరబ్రహ్మమునందు నిర్దయత్వము, పక్షపాతిత్వము ఇత్యాది గుణము లేవియు అపాదించవు.

శంక: సృష్టి యయిన పిదప పుట్టిన వారికి ఆ యా కర్మ లుండిన ఉండవచ్చును. "సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్" సృష్టికి పూర్వము ప్రపంచము లేదని శ్రుతి చెప్పుచున్నది. అటులయిన మొట్టమొదట ఆ కర్మ ఎచ్చట నుండి వచ్చెను? ప్రళయమునందు కర్మలన్నిటికి లయ మున్నది గదా? మరల కర్మ లెట్లు సంభవించును? అనిన,

### న కర్మావిభాగాదితి చేన్నాదిత్వాత్. 35

సమా: కర్మ అనాది గావున ఇది ఇప్పటి నుండియే యని చెప్పుటకు రాదు. ఆత్మజ్ఞానానుభవముచే మాత్ర మది అంతము కలది యగును. కాబట్టి మొదట సృష్టి యనునది అనాది. ప్రళయమునందు కర్మలు సంస్కారరూపమున అణగి యుండును. అట్లు లేదని చెప్పిన కృతప్రణాశ అకృతాభ్యాగమాది దోషములు వచ్చును. ఈ ఈశ్వర సృష్టి—వైచిత్ర్యమునకు పూర్వాపూర్వ సంస్కారము ఉత్తరోత్తరభాస యున్నట్లు జీవుల అనాది సంస్కార రూప కర్మయే కారణము.

## ఉపపద్యతే చాప్యుపలభ్యతే చ. 36

బ్రహ్మము వెనుకటి వలె సృష్టించెను అను మొదలగు శ్రుతులనుబట్టి సంసార రూప మగు ప్రపంచము అనాది యనుట యుక్తియుక్తమై యున్నది. జీవుల కర్మానుగుణ్యముగ విచిత్ర సృష్టి యగును.

### ౧౩. సర్వధర్మోపపత్త్యధికరణము

శంక: పరబ్రహ్మమే జగత్కారణమని సిద్ధాంతము చేయబడినది. కాని నిర్గుణ మగు బ్రహ్మమునకు సర్వము నెఱుగుటయు పాలించుటయునను మొదలగు ధర్మములు సంభవించవుగదా? మఱి జగత్తునెట్లు పుట్టించ గలుగు ననిన, మయాశబలిత బ్రహ్మముచే జగద్రచన కావచ్చునని చెప్పుచున్నారు.

## సర్వధర్మోపపత్తేశ్చ. 37

సమా: మాయిక మగు గుణములచే కూడిన శబళ బ్రహ్మము వస్తుతః నిరుపపాధిక మయ్యును, నిరవయవ మయ్యును, సర్వ ప్రపంచమునకు వివర్తోపాదానకారణమై సమస్తమును ఎఱుగుచు, సమస్తమును పాలించు చున్నదని చెప్పుట తప్పు కాదు. అందుచే బ్రహ్మమునుండి జగత్తు కలుగ వచ్చును. ఇది వేదాంత సిద్ధాంతము.

ఇదిరెండవ అధ్యాయమున మొదటి పాదము



## 2-వ అధ్యాయము 2-వ పాదము

### ౧. రచనానుపపత్త్యధికరణము

అవ: సాంఖ్యాది మతముల ఖండన పూర్వకముగ ప్రధానాదులచే జగదుత్పత్తి కాదని తెలుపుచున్నారు.

## రచనానుపపత్తేశ్చ నానుమానమ్. 1

సాంఖ్యులు చెప్పున దేమన, ఘటమునం దంతయు మృత్తు వ్యాపించి యున్నట్లు సమస్త జగత్తు సుఖ దుఃఖాది మోహములచే

వ్యాపింపబడి యున్నది. మోహదాయకమై సుఖ దుఃఖాది ద్వంద్వము లచే గూడిన ఈ సత్త్వ రజ స్తమో గుణములే ప్రధాన మని చెప్ప బడును. అది కేవలము జడము. చేతను డగు పురుషుని ఇష్టార్థమై తనకు తానే విచిత్ర మైన జగత్తగు చున్నది. ఇందువలన దోషమేమి! యని సాంఖ్యులు చెప్పుదురు. అయ్యా! జడ మగు ప్రధానమునకు జగత్తును సృష్టించు శక్తి లేదు. అది చేతనమునందే పొసగు నని సమాధానము. ఈ విషయమున మఱి యొక హేతువును చెప్పు చున్నారు.

## ప్రవృత్తేశ్చ. 2

జడ మగు ప్రధానము ప్రపంచ మగుటకు ప్రయత్నించె నను మాటయే చెల్లదు. జడ మగు ప్రధానాదులకు ఇచ్ఛాదులు కలుగవు. సంబంధింపవు.

## పయోంబువచ్చేత్తత్రాపి. 3

(సాంఖ్యులు) స్తన్యమునందు స్వయముగా పాలు పొంగి వచ్చి నట్లును, నదియందు నీరు ముందునకు ప్రవహించి నట్లును జడ మగు ప్రధానము స్వయముగ మహత్తు, అహంకారము మొదలగు వాటిచే జగద్రూప మగునని చెప్పుదురు. కాని అది అసంభవము. తల్లికి పాలు, నదిలో నీరు ఇవి చేతనుడగు ఈశ్వరుని ప్రేరణచే వచ్చునుగాని స్వతం త్రములు గావు.

అవ : సాంఖ్య సిద్ధాంతముపై మఱొక దోషమును చూపు చున్నారు.

## వ్యతిరేకానవస్థితేశ్చానపేక్షత్వాత్. 4

ప్రధానముకంటెను వేఱగు చేతనుని సహాయము లేదని చెప్పు సాంఖ్యుని మతము తప్ప వారు ప్రధానముకంటె విలక్షణ మగు బ్రహ్మ తత్త్వమును అంగీకరింపరు. అట్టి ప్రేరక మగు పరమేశ్వరశక్తి లేనందు వలన ఈ ప్రధానముచే ఎల్లప్పుడు సృష్టి యగుచునే యుండవలెను. మఱి ప్రళయమనునది ఎప్పుడును లేక పోవలసి వచ్చును. అట్లుగాక బ్రహ్మ మన్నచో చేతన మగుటవలన దేశకాలముల జ్ఞాన ముండుటచే

ఒకప్పుడు సృష్టియు మఱొకప్పుడు సృష్టిలేనితనమును పొసగును. కాబట్టి జడ మగు ఈ ప్రధానమునకు కాలముయొక్క జ్ఞానము లేనందువలన గ్రుడ్డివాని సంధ్యావందనము వలె ఎల్లప్పుడు ప్రపంచము పుట్టుచునే యుండవలసి వచ్చును. ఇది అసంభవము.

శంక : గోవుచే తినబడిన గడ్డి తనకు తానే పాలై మాఱినట్లు ప్రధానము తనకు తానే ప్రపంచ మగును అనిన సమాధానము.

## అన్యత్రాభావాచ్చ న తృణాదివత్. 5

సమా : పైన చూపబడిన దృష్టాంతము విషమము. గడ్డికి స్వతంత్రముగా క్షీరరూపము నొందు శక్తి లేదు. అదే గడ్డిని ఎద్దు తినిన పాలగునా? కాదు. అటువలె ఇతర పశువుల గర్భమునందు పాలు కాజాలవు. కాన ఇది అనుచిత మగు ఉపమానము. వేయేల? ఈశ్వర ప్రేరణచే గడ్డి క్షీరము లగునని అర్థము.

## అభ్యుపగమేఽప్యర్థాభావాత్. 6

ప్రధానము స్వయముగా జగత్తును సృజించె నని ఒప్పుకొనినను సాంఖ్యుని సిద్ధాంతము తప్పు. జడ మగు ప్రధానము ప్రపంచమును సృష్టించినను ప్రయోజనము లేదు. జడ మగు ప్రధానమునకు భోగము గాని మోక్షము గాని రెండును లేవు. ఇక ప్రపంచ రచనచే బ్రహ్మమునకైనను ఏమి ప్రయోజన మనిన, ప్రయోజన మేమియు లేకపోయినను ఇది పొసగును. చిద్విలాసముగ లీలామయముగ జరుగ వచ్చును. ఇట్టి శివుని ఆట జడ మగు ప్రధానమున కెట్లు ఘటించును? ఎట్లును సంభవించ దని అర్థము.

## పురుషాశ్మవదితిచేత్తథాఽపి. 7

చైతన్య సన్నిధి మాత్రమున ఇంద్రియములు విషయములయందు వర్తించిన భంగి చూచుటకు శక్తి యుండి నడచుటకు శక్తి లేనివాడు, చూచుటకు శక్తి లేక నడచుటకు శక్తి యున్నవానిని ఆశ్రయించి నడచు నట్లును శరీరమునందు గ్రుచ్చుకొనియున్న ఇనుప సూదులను అయస్కాంతపు సన్నిధినుండి (సంబంధమువలన) వెలుపలికి తీసినట్లు, బ్రహ్మసాన్నిధ్యమున ప్రధానము ప్రపంచ మగుచున్నదని

చెప్పకూడదా? అనిన, అట్లు గాదు. చైతన్య సన్నిధానము సంతతము ఉండుటవలన ప్రధానముచే ఎల్లప్పుడు ప్రపంచ మగుచునే యుండ వలసి వచ్చును. అట్లు గాదు.

అవ : సాంఖ్య మతమున మఱొక రూపమును చూపుచున్నారు.

అంగిత్వానుపపత్తేశ్చ. 8

సత్వ రజ స్తమో గుణములు సమానముగ నుండు స్థితియే ప్రధాన మని సాంఖ్యులు చెప్పుచున్నారు. త్రిగుణముల వైషమ్యము వలననే సృష్టి యని తెలియు చున్నది. ఇట్లుండగా ఈశ్వర ప్రేరణ రహితము గుణత్రయ సామ్యావస్థా రూపము నైన ప్రధానముచే సృష్టి ఎట్లగును? కాజాలదు. సాత్విక సృష్టి యగునపుడు సత్త్వగుణ పాలన మగును. రజోగుణసృష్టి యగునపుడు రజోగుణ పాలనము, తామస సృష్టి యయినపుడు తమోగుణము ఉండవలసి వచ్చును గదా? అట్లు గాక వీటి సమావస్థ యగు ప్రధానముచే సృష్టి యనుట ఎట్లగును? కాదని అర్థము.

అన్యథాఽనుమితౌచ జ్ఞశక్తివియోగాత్. 9

ప్రధానమునకు చేతనశక్తి యున్నదని చెప్పుటకు వీలు లేక పోవుట చేతను, చేతన సహాయ మైనను ఉన్నదని అంగీకరింపక పోవుట చేతను, అర్థ రహిత మగు ఈ ప్రధానము ఎల్లపుడు సృష్టి చేయవలసి యుండవచ్చును. అర్థాత్ ఈ మతము నిర్దుష్ట మైనది కాదని భావము

విప్రతిషేధాచ్చాసమంజసమ్. 10

ఉపనిషద్వాక్యములకు విరుద్ధ మైనందువలన ఈ సాంఖ్యుల మతము సమంజస మయినది కాదు. ఒకచోట ఇంద్రియములు 7 అనియు, మఱొకచోట 11 అనియు, ఇంకొక చోట పంచతన్మాత్రలు మహత్తత్త్వము నుండి పుట్టు ననియు, పరస్పరము విరుద్ధములై చెప్ప బడి యున్నవి. ఈ కారణముల వలన సాంఖ్యమతము సరియైనది కాదు. మొదటి అధ్యాయమునందును ప్రధానవాదమును గుఱించిన విమర్శ చెప్పబడినది. అచ్చట ప్రధానము జగత్కారణ మని శ్రుతులయందు చెప్పబడ లేదనియు, శ్రుతి సమ్మతము కాదనియు నిరూపింప బడినది.

ఇప్పుడు యుక్తులచేత కూడా ప్రధానము జగత్కారణము కాదని నిరూపించడ మైనది.

## ౨. మహద్దీర్ఘాధికరణము

శంక : కారణముయొక్క గుణములు కార్యమునందు అగపడవలెను. జ్ఞానానందరూప మగు బ్రహ్మము జగత్తునకు కారణమై యుండిన పట్ల ఈ జగత్తెల్ల జ్ఞానానంద మయమై యుండవలయును గదా? అట్లు లేదు గావున జగత్తునకు బ్రహ్మము కారణము గాదని వైశేషిక మతస్థులు అక్షేపించుదురు. అందులకు సమాధానము.

**మహద్దీర్ఘవద్వా హ్రస్వ పరిమండలాభ్యామ్. 11**

సమా : వారు చెప్పు సిద్ధాంతము ననుసరించియే వారికి సమాధానము. చిన్న పదార్థములు ఒకటి నొకటి చేరుకొని పెద్ద పదార్థములను పుట్టించు నని చెప్పు అణు పరమాణు సంయోగ వాదులు జ్ఞానానంద స్వరూప మగు బ్రహ్మమునుండి జడ దుఃఖాత్మక మైన జగత్తు పుట్టిన దనుటకు సందియమేల? పుట్టవచ్చును గదా? చిన్న చిన్న పదార్థములచే పెద్ద పెద్ద పదార్థము లేర్పడునట్లు బ్రహ్మమునుండి జగత్తు కలుగ వచ్చును.

## 3. పరమాణు జగదకారణత్వాధికరణము

అవ : 2-వ అధ్యాయమున మొదటి పాదమున 4-వ అధికరణమునందుగూడ వైశేషికులు వేదాంత మతముపై చెప్పు దోషములు తెలిపి ఖండింప బడినవి. అయినను ప్రస్తుతాధికరణమునందుకూడా అవేవిషయములను వివరించు చున్నారు.

**ఉభయథాపి న కర్మాతస్తదభావః. 12**

వైశేషికులు సృష్టికి పూర్వము పరమాణువు లన్నియు నిశ్చేష్టితములై యుండి అదృష్ట విశేషమువలన పరమాణువుల సంచలనరూప కర్మ పుట్టును. ఆ కర్మవలన పరమాణువులు ద్వ్యణుకములై అట్టి ద్వ్యణుకములనుండి పృథివ్యాది పంచ భూతములు జనించు ననియు మరల అదృష్ట విశేషమువలన ఆ ద్వ్యణుకములు విభాగ

మైనపుడు ప్రళయ మగు ననియు వైశేషికులు చెప్పుదురు. అది సరి కాదు. ఈ పరమాణువులను ప్రేరణ యొనర్చువాడు ఈశ్వరుడా! లేక జీవుడా? ఎట్లు చెప్పుటకును రాదు. వారిరువురును నిరవయవులు. ఆ పరమాణువులను ఒకదానితో నొకటి చేర్చుటకును సమర్థులు గారు. నిరవయవములు గాన ప్రేరణ యనునదియు పొసగదు. సాధ్యము గాదు. అందుచే ఈ పరమాణువుల పరస్పర సంయోగమునకు మార్గము లేదు. జడ మైనందువలన తమకు తామే వచ్చి సంయోజన మగు ననుట సరిపడదు. కాబట్టి వైశేషికులు చెప్పు చిన్నవగు పదార్థములచే అణుపరమాణువులచే పెద్దదగు జగత్తయ్యె ననుట తప్పు.

సమవాయాద్యుపగమాచ్చ సామ్యాదనవస్థితేః 13

అవయవ వంతములగు దారములు అవయవము కలిగిన గుడ్డ యందు సమవాయ మను సంబంధముచే కూడి యున్నదని నైయాయకులు చెప్పుదురు. దారమును వేఱు చేసిన బట్టయే లేకపోవుట వలన అది నిత్య సంబంధ మని వారి నిశ్చయము. సమవాయ మను నది సంయోగము వలెనే ఇదొక విధమైన సంబంధము, రెండు పదార్థములు ఒకదానితో నొకటి చేసుకొన్న సంయోగ సంబంధ మందురు. గుడ్డపై ఘటము నుంచి నపుడు ఘటముయొక్క సంయోగ సంబంధము గుడ్డయందు వచ్చిన దనెదరు. ఇంతేగాక గుడ్డయందు ఆ సంయోగ సంబంధము సమవాయ సంబంధముచేత వచ్చిన దని చెప్పెదరు. ఇట్లు సంయోగమునకు సమవాయ మను వేఱు సంబంధమును చెప్పినట్లే సంయోగమువలె ఒక సంబంధ మనిపించుకొన్న సమవాయమునకు వేఱొక సంబంధమును చెప్పవలసి వచ్చును. ఆ పిదప దానికి మఱొక సంబంధము కావలసి వచ్చును. అటువలె ఒకటికి మఱియొకటియై నిలుకడ లేని అనవస్థాది దోషములు వచ్చును. అందుచేత ఈ నైయాయిక మతము అసంగతము. తాత్పర్య మేమన, పరమాణువుల వలన ద్వ్యణుకములు, ద్వ్యణుకములవలన త్ర్యణుకములు ఇట్లు ఒకదాని కొకటి సంబంధముచే ఈ ప్రపంచము పుట్టు ననెదరు. కాని ఇది అసంభవము. అనవస్థా దోష యుక్తము.

## నిత్యమేవచ భావాత్. 14

ప్రపంచమును సృష్టించుటయు, ప్రళయము నొందించుటయు పరమాణువుల స్వభావ మైనదని వైశేషికులు చెప్పుదురు. ఇదియు అయోగ్యమే. పరమాణువులు ఎల్లప్పుడు ఉండునవి గావున ప్రళయము నందును సృష్టి కావలసి వచ్చును. ఒకవేళ ఈశ్వరప్రేరణచే అవి ఒక్కొక్కసారి మాత్రమే జగద్రూపము నొందుచుండు నని చెప్పుట కును వీలు లేదు. ఈశ్వరుడు నిరవయవుడు. పరమాణువులు నిరవయవ ములు. కాబట్టి ఈ రెండింటికి సంయోగ మగుట సంభవించదు. ఈ విషయము వెనుక చెప్పబడియే యున్నది.

## రూపాదిమత్వాచ్చ విపర్యయో దర్శనాత్. 15

నైయాయికులు, లేక వైశేషిక మతస్థులు పృథివి, జలము, అగ్ని, వాయువు ఈ నాలుగు భూతములు మాత్రమే పరమాణువుల వలన గలిగిన వని చెప్పుచున్నారు. రూపము, రసము, గంధము మొద లగు గుణములచే కూడినవి యన్నపుడు రూపము మొదలగు గుణములు గల ఘటము మొదలగు న వెల్ల సావయవములై యుండి చివకు నాశ మగునవే యని అగపడు చున్నందున ఈ పరమాణువులు ఎల్ల ప్పుడు ఉండునవి కాజాలవు. పృథివ్యాది భూతము లెట్లు అనిత్యములో పరమాణువులును అట్లే అనిత్యములు కావలసి వచ్చును; కడకు పర మాణువు లున్నవనుటయు ప్రత్యక్ష విరుద్ధము.

## ఉభయథా చ దోషాత్. 16

పరమాణువులను సావయవము లనినను దోషమే. నిరవయవము లనినను దోషమే. సావయవ మనిన నాశము గలవి యగును. నిరవయవ మన్ననో ఒకటి నొకటి చేరుకొనునవి కాదని యగును. ఎట్టకేలకు పర మాణువులచే జగత్తగునను ఈ నైయాయిక మతమునకే అస్తిత్వము లేదు.

## అపరిగ్రహాచ్చాత్యంత మనపేక్షా. 17

వేదవేత్త లగు మనువు మొదలైన శిష్టు లెవ్వరును ఈ వైశే షిక నైయాయిక దర్శనములను పరిగ్రహింప లేదు. కాబట్టి మోక్షేచ్ఛ

మైనపుడు ప్రళయ మగు ననియు వైశేషికులు చెప్పుదురు. అది సరి కాదు. ఈ పరమాణువులను ప్రేరణ యొనర్చువాడు ఈశ్వరుడా? లేక జీవుడా? ఎట్లు చెప్పుటకును రాదు. వారిరువురును నిరవయవులు, ఆ పరమాణువులను ఒకదానితో నొకటి చేర్చుటకును సమర్థులు గారు. నిరవయవములు గాన ప్రేరణ యనునదియు పొసగదు. సాధ్యము గాదు. అందుచే ఈ పరమాణువుల పరస్పర సంయోగమునకు మార్గము లేదు. జడ మైనందువలన తమకు తామే వచ్చి సంయోజన మగు ననుట సరిపడదు. కాబట్టి వైశేషికులు చెప్పు చిన్నవగు పదార్థములచే అణుపరమాణువులచే పెద్దదగు జగత్తయ్యె ననుట తప్పు.

సమవాయాద్యుపగమాచ్చ సామ్యాదనవస్థితేః. 13

అవయవ వంతములగు దారములు అవయవము కలిగిన గుడ్డ యందు సమవాయ మను సంబంధముచే కూడి యున్నదని నైయాయికులు చెప్పుదురు. దారమును వేఱు చేసిన బట్టయే లేకపోవుట వలన అది నిత్య సంబంధ మని వారి నిశ్చయము. సమవాయ మనునది సంయోగము వలెనే ఇదొక విధమైన సంబంధము, రెండు పదార్థములు ఒకదానితో నొకటి చేరుకొన్న సంయోగ సంబంధ మందురు. గుడ్డపై ఘటము నుంచి నపుడు ఘటముయొక్క సంయోగ సంబంధము గుడ్డయందు వచ్చిన దనెదరు. ఇంతేగాక గుడ్డయందు ఆ సంయోగ సంబంధము సమవాయ సంబంధముచేత వచ్చిన దని చెప్పెదరు. ఇట్లు సంయోగమునకు సమవాయ మను వేఱు సంబంధమును చెప్పినట్లే సంయోగమువలె ఒక సంబంధ మనిపించుకొన్న సమవాయమునకు వేఱొక సంబంధమును చెప్పవలసి వచ్చును. ఆ పిదప దానికి మఱొక సంబంధము కావలసి వచ్చును. అటువలె ఒకటికి మఱియొకటియై నిలుకడ లేని అనవస్థాది దోషములు వచ్చును. అందుచేత ఈ నైయాయిక మతము అసంగతము. తాత్పర్యమేమన, పరమాణువుల వలన ద్వ్యణుకములు, ద్వ్యణుకములవలన త్ర్యణుకములు ఇట్లు ఒకదాని కొకటి సంబంధముచే ఈ ప్రపంచము పుట్టు ననెదరు. కాని ఇది అసంభవము. అనవస్థా దోష యుక్తము.

నిత్యమేవచ భావాత్. 14

ప్రపంచమును సృష్టించుటయు, ప్రళయము నొందించుటయు పరమాణువుల స్వభావ మైనదని వైశేషికులు చెప్పుదురు. ఇదియు అయోగ్యమే. పరమాణువులు ఎల్లప్పుడు ఉండునవి గావున ప్రళయము నందును సృష్టి కావలసి వచ్చును. ఒకవేళ ఈశ్వరప్రేరణచే అవి ఒక్కొక్కసారి మాత్రమే జగద్రూపము నొందుచుండు నని చెప్పుట కును వీలు లేదు. ఈశ్వరుడు నిరవయవుడు. పరమాణువులు నిరవయవ ములు. కాబట్టి ఈ రెండింటికి సంయోగ మగుట సంభవించదు. ఈ విషయము వెనుక చెప్పబడియే యున్నది.

రూపాదిమత్త్వాచ్చ విపర్యయో దర్శనాత్. 15

నైయాయికులు, లేక వైశేషిక మతస్థులు పృథివి, జలము, అగ్ని, వాయువు ఈ నాలుగు భూతములు మాత్రమే పరమాణువుల వలన గలిగిన వని చెప్పుచున్నారు. రూపము, రసము, గంధము మొద లగు గుణములచే కూడినవి యన్నపుడు రూపము మొదలగు గుణములు గల ఘటము మొదలగు న వెల్ల సావయవములై యుండి చివర నాశ మగునవే యని అగపడు చున్నందున ఈ పరమాణువులు ఎల్ల ప్పుడు ఉండునవి కాజాలవు. పృథివ్యాది భూతము లెట్లు అనిత్యములో పరమాణువులును అట్లే అనిత్యములు కావలసి వచ్చును; కడకు పర మాణువు లున్నవనుటయు ప్రత్యక్ష విరుద్ధము.

ఉభయథా చ దోషాత్. 16

పరమాణువులను సావయవము లనినను దోషమే. నిరవయవము లనినను దోషమే. సావయవ మనిన నాశము గలవి యగును. నిరవయవ మన్ననో ఒకటి నొకటి చేరుకొనునవి కాదని యగును. ఎట్టకేలకు పర మాణువులచే జగత్తగునను ఈ నైయాయిక మతమునకే అస్తిత్వము లేదు.

అపరిగ్రహాచ్చాత్యంత మనపేక్షా. 17

వేదవేత్త లగు మనువు మొదలైన శిష్టు లెవ్వరును ఈ వైశే షిక నైయాయిక దర్శనములను పరిగ్రహింప లేదు. కాబట్టి మోక్షేచ్ఛ

గల ముముక్షువులు ఈ దర్శనములను విచారింప వలసిన అవసరము లేదు. సంపూర్ణముగ విడువ వలసినది.

౪. సముదాయాధికరణము

అవ : పైన చెప్పబడిన అధికరణముచే నైయాయిక వైశేషిక మతములను ఖండించి బౌద్ధమతమును ఖండించుటకై ఆరంభించు చున్నారు. ఈ బౌద్ధమతమునం దైననో సౌత్రాంతికుడు, వైభాషికుడు, యోగాచారుడు, మాధ్యమికు డని బౌద్ధులు నాలుగు తెఱగులు. అందు సౌత్రాంతిక వైభాషిక మతములు రెండును ఒకటే.

సముదాయ ఉభయహేతుకేఽపి తదప్రాప్తిః. 18

ఇంతవఱకు అణువులు జగత్తును పుట్టించు నని చెప్పు వైశేషికులకు ఉత్తరము చెప్పబడినది. ఇక అయ్యణువులగుంపే జగత్తని చెప్పు బౌద్ధులకును ఉత్తర మేమన, బౌద్ధులయందు జ్ఞానము, దానికి విషయ మగు విషయాదులు రెండును, ఉండవలసినదే యని చెప్పువారు ఒక తెగ. వీరు చెప్పున దేమనిన, గంధముయొక్క పరమాణువుల చేరికయే పృథివి. రసము యొక్క పరమాణువుల సమూహామే జలము. రూప పరమాణువుల సమూహామే అగ్ని. స్పర్శ పరమాణువులయొక్క కూడికయే వాయువు. ఈ భూతములే జీవ జడముల శరీరము లయి యున్నవి. ఇక ఆకాశ మన్ననో వీరు కుందేటి కొమ్మువలె లేనిదని యందురు. నూనెను పీల్చుకొని మండు దీపము సారెసారెకు కరుడు గట్టుకొనుచు భిన్నభిన్నములై యుండి చివరకు ఆరిపోవు నటుల జీవులు నాశ మగుదురు కదా? యని శంకించిన, సమాధానము. ఈ నాలుగు భూతముల ఉత్పత్తి వివరమును విమర్శించిన అసలు పరమాణువుల సమూహా మొకటి కలదను మాటయే లేదు. ఎందుకన పై మతము నందు జీవు లెల్లరు క్షణక్షణమునకు వేఱగు క్షణిక విజ్ఞానమునే ఆధారముగా గైకొన్నవారై యున్నారు. నిలుకడ లేని ఈ క్షణికము లగు పరమాణువులను సమకూర్చు పనికూడా వారిచేత కాదు. (వీరు ఈశ్వరుని అంగీకరింపరు.)

శంక: పరమాణువులను సంయోగ మొనర్చు వారు ఒకరు కావలెనో? లేక తమంత తామే యగునా? చేతన పదార్థ మొకటి అంగీకరించవలసిన అవసరము లేకనే అణుసముదాయము సిద్ధించును గదా? అనిన,

ఇతరేతరప్రత్యయత్వాదితి చేన్నోత్పత్తిమాత్రనిమిత్తత్వాత్. 19

సమా: పూర్వ పూర్వ ఘట పరమాణువులు ఉత్తరోత్తర ఘట పరమాణువులను పుట్టించుటకు కారణ మని వారి అభిప్రాయము. అందుచేత వాటిని సముదాయ మొనర్చుటకు ఎల్లప్పుడు స్థిరముగా నుండిన ఈశ్వరు డొకడు అవశ్యము. జడములైన క్షణిక పరమాణువులు తమకు తామే చేరుకొన జాలవు.

ఉత్తరోత్పాదే చ పూర్వనిరోధాత్. 20

రెండవది పుట్టు నపుడు, మొదటిది లేకపోవు నపుడు కూడ కార్యోత్పత్తి కాదు. మొదటి పరమాణువులు ముందు రాబోవు పరమాణువులను పుట్టించు ననుటయు చెల్లదు. ముందు పరమాణువులు పుట్టు లోపలనే వెనుకటి పరమాణువులు నాశమై యుండును. అందుచే అవి రాబోవు (ముందరి) పరమాణువులను పుట్టింప జాలవు.

అసతి ప్రతిజ్ఞోపరోధో యౌగపద్యమన్యథా. 21

కారణమువలన కార్యము పుట్టు ననిన అదియు విరోధమే. ప్రతివస్తువును ఒక క్షణమాత్రమే యని ఈ (మీ) మత సిద్ధాంత ముండి నపుడు కారణమునుండి కార్యము పుట్టు ననుటకే రాదు. ఇక సముదాయము ఎట్లేర్పడును? కావున సమస్తము క్షణికమే యను మీ సిద్ధాంతమునకే భంగము వచ్చును. తాత్పర్య మేమనగా కార్యరూపమై యుండు సమస్తమునకు కారణ మొకటి కలదని అంగీకరించిన అదియు తప్పే యగును. ఎందుకనిన, ఇట్లు కారణరూపము గలదని అంగీకరించిన కారణము లేకనే కార్యములు కలుగునను అతని సిద్ధాంతమే లేకపోవును. అట్లు కారణము లేదనిన కార్యకారణములు రెండును ఒకే కాలమునం దుండినట్లాయెను అన్నప్పుడు సర్వము క్షణిక మను ఇతని సిద్ధాంతమే అసలెట్లు నిలుచును? నిలువదు.

ప్రతిసంఖ్యాఽప్రతిసంఖ్యానిరోధాప్రాప్తిరవిచ్ఛేదాత్. 22

ఘటము నొకరు బుద్ధిపూర్వకముగా పగుల గొట్టినపుడు కలుగు నాశము ఒక విధ మగు నాశము. ఇక కాలము ననుసరించి మహా భూతముల నాశ మొక విధము. ఇట్లు తన్నాశము రెండు ప్రకారము లని బౌద్ధుల అభిప్రాయము. వారి మతమునందు పూర్వపూర్వ పరమాణువులు ఉత్తరోత్తర పరమాణువులను పుట్టించు నను నియమము గలదు. జడ మగు పరమాణువులకు దేశకాల విశేషముల జ్ఞానము లేదు. అందుచేత పరమాణువుల సముదాయమునకు ఎప్పటికిని నిలుకడ యుండదు. కాబట్టి వారి మతమునందు సృష్టి ప్రళయములు రెండును సంభవించవు.

ఉభయథా చ దోషాత్. 23

ఘటము మొదలగు పరమాణువుల సముదాయమునకు కొంచెము సేపైనను స్థిరత్వ మున్నదందురా? లేదా? అని శంకించుకొని ముందీ విధముగ వర్ణించు చున్నారు. లేదు. ఎట్లు చెప్పినను ఈ బౌద్ధులకు దోషము తప్పదు. స్థిరత్వము గలదని చెప్పిన వారి సిద్ధాంతమే లేక పోవును. వారు స్థిర పదార్థము గలదని ఒప్పువారే కారు. ఇదేమి పిచ్చియో? క్షణికత్వ మనిన ఘటముచే జలము తెచ్చుకొనునంత కాల మైనను కార్యము జరుగు నట్టాయెనుగదా? మఱియు బౌద్ధ మతమున పరమాణువులకు మాత్రము క్షణికత్వము, పరమాణుసముదాయ రూపము లగు ఘటాదులకు కొంచెము స్థిరత్వ ముండు ననియు అందు చేత ఘటాదులచే జలము తెచ్చుట మొదలగు కార్యములు జరుగ వచ్చును అనిన,

సమా: వీరు పరమాణువుల కంటెను పరమాణువుల సమూహము వేఱని అంగీకరించినను ఘటపటాది పదార్థములు ఈ అణువుల సముదాయము మొదలగు క్రమముచే పుట్టినవే యని ఒప్పుకొన్న ట్లాయెను. అందుచే వీరు నైయాయికుల మతమునకు చేరినవా రగుదురు. కాబట్టి అసలీ మతమునకు అస్తిత్వమే లేదు.

ఆకాశే చావిశేషాత్. 24

వారు చెప్పు ఈ నాలుగు భూతములు పరమాణువుల కూటికయే

యను మాటయొక్క తప్పిదమును దెలుపుట యయ్యెను. ఇక ఆకాశము కుండేటి కొమ్మువలె లేదనుమాటను కొంత విచారింతము. పై భూత చతుష్టయమువలె ఆకాశము గూడా ఉన్నదనియే నిశ్చయము. ఉక్తమైన నాలుగు భూతములు నేత్రమున కగపడినట్లు ఆకాశము అగపడక పోయినను లేదని చెప్పరాదు. పక్షి ఎగురుచున్నపుడు ఆధారమగు వస్తువు ఉన్నదనియే అంగీకరించవలెను. లేదను మాట తగదు.

## అనుస్మృతేశ్చ. 25

ఇక జీవు లెల్లరు క్షణిక విజ్ఞాన స్వరూపు లను మాటను కొంత విచారింతము. నిన్నటి దినము అనుభవించిన పదార్థముల అనుస్మృతి నేడు స్మరింప బడుచున్నందున అది క్షణికముగాక అవిచ్యుతమై యున్నదనియే అర్థ మగుచున్నది. అట్లుగాక క్షణిక జ్ఞాన సంతాన రూపులే జీవు లనినచో వెనుకటి దినము నందలి జ్ఞానానుభవము లెల్ల గాఢనిద్రయందు లేకపోయి మఱుసటి దిన మవి జ్ఞప్తికి రాకుండవలసి యుండెనుగదా? ఈ విషయమునందు మఱుసటి దినము కలుగు జ్ఞానమే ముందు జ్ఞప్తిని కలిగించుననిని యనిన ఒకడు అనుభవించు దానిని మఱొకడు జ్ఞప్తికి తెచ్చుకొనవలసి యుండెను. ఇది అసంభవము. కాబట్టి ఆత్మ క్షణిక మని చెప్పు బౌద్ధమతమే తగినది కాదు.

## నాసతో దృష్టత్వాత్. 26

సర్వ పదార్థములు క్షణికము లని చెప్పిన, ఆ క్షణిక పదార్థములనుండి కార్య ముత్పత్తి కాదు. బౌద్ధులు అభావము నుండియే కార్యోత్పత్తి యగునని చెప్పుదురు. అది తప్పు. మొదటి దినము యొక్క క్షణికజ్ఞాన సంతానములు వెనుకటి దినముయొక్క క్షణిక జ్ఞాన సంతానములచే పుట్టవలసి వచ్చును. వెనుకటి దినమునందలి క్షణిక జ్ఞాన సంతానము లన్నియు గాఢ నిద్రయందు తమకు తాము లేకపోయిన వగుటచేత వాటినుండి ముందు దినముయొక్క జ్ఞాన సంతానములు పుట్టుటకు త్రోవయే లేదు. అభావమువలన కార్యోత్పత్తియును కాదు.

## ఉదాసీనానామపి చైవం సిద్ధిః. 27

అవి గాఢ నిద్రయందు పోయినను ముందు కలుగు వాటిని

పుట్టించు ననిన లోకమునందు ఉదాసీనులై యుండు నిరుద్యోగ జీవులకును తమ ఇష్టార్థము లన్నియు ఈడేర వలసి వచ్చును. ఇది అనుభవ విరుద్ధము. కాబట్టి సౌత్రాంతిక వైనాశికుల మతము అత్యంతాసంగత మని భావము.

### ౫. ఉపలబ్ధ్యధికరణము

ఇప్పుడీ యధికరణమునందు యోగాచార మతమును ఖండించుచున్నారు.

### నాభావ ఉపలబ్ధేః. 28

బౌద్ధులయందు కొందఱు మాటలచే పిలువబడు వస్తువులే లేవని చెప్పుచున్నారు గదా! వారేమి ప్రపంచమును శశవిషాణమువలె లేదనువారా? లేక స్వప్న ప్రపంచమువలె కేవల ప్రతిభాస మాత్రమే యని చెప్పువారా? కాని కుందేటి కొమ్మువలె అసలే లేదను మాట సంభవింపదు. ఎందుకనగా, ప్రత్యక్షమై అగపడుచున్నది. జగత్తు శశవిషాణమువలె లేనిదై యుండిన సుతరాం అగపడకుండ వలసి యుండును.

### వైధర్మ్యాచ్చ న స్వప్నాదివత్. 29

భేద ముండుటవలన స్వప్న జగత్తువంటి దనుట సంభవింపదు. స్వప్న జగత్సాదృశ్యముచేత జాగ్రత్ప్రపంచము కేవల ప్రతీతి మాత్రమైనదని చెప్పుట సాహసమే. ఎందుకనగా ఈ రెండింటికి భేదము గలదు. స్వప్న జగత్తు మేల్కాంచిన వెంటనే అగపడక పోవును. ఇది అనుభవము. అందుచేత దానిని కేవల ప్రతీతి మాత్ర మని చెప్పినను తప్పులేదు. ఈ జాగ్రద్రూప మగు జగత్తయిననో అటువలె అగపడక పోవునది కాదు. అగపడుచున్నది. బ్రహ్మజ్ఞాన మైనపుడు అగపడక పోవునని శ్రుతి చెప్పవచ్చును. బౌద్ధులో శ్రుతిని ఒప్పువారు కారు. శ్రుతిని అంగీకరించిననో వారు సత్య మతమును అంగీకరించినవారే యగుదురు.

### న భావోఽనుపలబ్ధేః. 30

ఎచ్చటను ప్రత్యక్షముగా అగపడక పోవుట యనునది లేనందు

వలన మాత్రమే గాక ఆధారము లేనందువలన అది అగపడునది కాదు. బౌద్ధమతమున జగత్తునకు ఆధార మనునది లేదు. ఎందు కనగా, అది అగపడునది కాదు. వేయేల? వారికి పారమార్థిక మగు ఆధారము తెలుపు ప్రమాణమే లేదు.

క్షణికత్వాచ్చ. 31

వేదాంత తత్త్వమును అంగీకరింపనంత మాత్రముననే వారికి ఆధారము తెలుపు ప్రమాణమే లేదని అనరాదు. సమస్త పదార్థములకు జ్ఞానము ఆధార మని వారి అభిప్రాయము. కాని ఆ జ్ఞానమన్నో ప్రతి క్షణమునను నాశమగు స్వభావము గలది. మఱియు అనేకములై యుండునది. అందుచేత అది జగదాధారము కాజాలదు. సమస్త జ్ఞానములు ఏకాధారమున భాన నగునని ఒప్పుకొనిన అది వేదాంత సిద్ధాంతమునకు సమ్మతమే. అదే బ్రహ్మము.

సర్వథాఽనుపపత్తేశ్చ. 32

ఈ బౌద్ధాదులయందు జ్ఞానము, మఱియు తత్పదార్థములు, సమస్తమును శూన్య మని చెప్పు వారును కలరు. వీరి మత మన్నో శ్రుతి స్మృత్యాది సర్వ ప్రమాణములకు విరుద్ధమై యుండినందువలన ఇది సమ్మతము గాదు. ఈ ప్రకారముగ సౌత్రాంతిక వైభాషిక మతముల వారివలె యోగాచార మాధ్యమిక మతములు గూడా అప్రామాణికములే యని తెలిసి శ్రేయస్కాములు వీటిని విడువవలయును. జగత్తు కేవలము జ్ఞానాతిరిక్తమై యున్నదని చెప్పరాదు.

౬. ఏకస్మిన్నసంభవాధికరణము

అవ: పై రెండధికరణములచే 4విధములగు బౌద్ధమతములను ఖండించి ఈ అధికరణమునందు దిగంబర జైనమతములను ఖండించుచున్నారు.

నైకస్మిన్నసంభవాత్. 33

ఒకదానియందు ఏకత్వము, అనేకత్వము మొదలగు విరుద్ధ ధర్మములు సంభవించవు. దిగంబరులు జైనులు జగత్తునకు నిత్యత్వము అనిత్యత్వము ఏకత్వము అనేకత్వము మొదలగు విరుద్ధ ధర్మములు గల

వని చెప్పుదురు గాని ఒకే వస్తువునందు ఇట్లు విరుద్ధ ధర్మము లుండ జాలవని అర్థము. ప్రత్యక్ష విరుద్ధ మగుటచే ఇది అప్రమాణము.
అవ : మరల వేఱొక భాగమును ఖండించు చున్నారు.

ఏవంచాత్మాఽకార్త్స్న్యమ్. 34

మఱియు శరీర మెంతో జీవు డంతే యని దిగంబరులు జైనులు తలంతురు. కాని అట్లయిన చీమ దోమ మొదలగు శరీరములయందు గల జీవునకు కర్మవశమున ఏనుగు మొదలగు పెద్ద శరీరముగల జన్మ వచ్చినట్టయిన అపుడా జీవుడు ఏనుగున్నంత పెద్దదిగా వికాసము నొంద నలసి వచ్చును. ఒకవేళ ఏనుగు మొదలగు పెద్ద ప్రాణుల రూపమున నుండు జీవులకు కర్మవశమున చీమ దోమ మొదలగు చిన్న శరీరముగల జన్మ వచ్చిన అప్పుడాత్మ సంకోచ మొందవలసివచ్చును. జీవుడు శరీర పరిణామ మాత్రుడని అనిత్యమని తెలియవలసి వచ్చును. ఈ విధముగ చెప్పుట దోషము. తప్పిదము.

నచ పర్యాయాదప్యవిరోధో వికారాదిభ్యః. 35

జీవులు దూదిముద్దవలె అవయవములు గలవారు. అందుచేత చీమ మొదలగు చిన్న శరీరములు వచ్చినప్పుడు చిన్నగిల్లుదురు. ఏనుగు మొదలగు శరీరములు వచ్చినపుడు పెద్దగ వికాస మొందుదు రని వారు చెప్పుదురు. అటులయిన జీవుడు అవయవములు గలవాడై వృద్ధిక్షయములు పొందువా డగునని చెప్పినట్లాయెను. ఇది అసంభవము. జీవులు అవయవములు గలవారని చెప్పిన ఇక మార్పొందుచు నాశ మొందు వారు గావలసి వచ్చును. అట్లుగాదు వస్తుతః విచారించిన జీవు డని చెప్పబడువాడు నిరవయవ మగు వ్యాపకమైన బ్రహ్మమే.

అంత్యావస్థితేశ్చోభయనిత్యత్వాదవిశేషః. 36

జీవుడు ఆది, మధ్య, అంత్య దశలయందు పరిణామ రహితుడై సంకోచ మొందుట, వికాస మొందుట యనునవి లేక మోక్ష సమయమునందు ఒకే స్థితిలో ఉండు ననిన ఇక వారు మాకంటె అన్యులు కారు. వారు మమ్మే శరణు బొందిన వారగుదురు.

## ౭. పత్యురసామంజస్యాధికరణము

అవ : పాశుపత మత ఖండన.

### పత్యురసామంజస్యాత్. 37

నైయాయికులు, వైశేషికులు, శైవులు మొదలగు వారు శ్రుతి పథమును అనుసరింపక ఈశ్వరుడు కేవలము కార్యరూప కారణు డని చెప్పుదురు. విత్తనమునుండి మొలక మొదలగునవి లేచునపుడు వాటిని వెలుపలకు వచ్చునట్లుగ చేసినవాడు వేఱొక డుండవలయునని యన వచ్చును. ఎందుకనగా, ఘటాద్యుత్పత్తివలె కొన్ని క్రియలచే అవి పైకి లేచినట్లున్నవి. ఘటమునకు కులాలునివలె మొలక మొదలగు వాటికి ఈశ్వరుడు కావలెనని వారు చెప్పుదురు. కాని అది సరికాదు. ఈశ్వరుడు కేవలము ఈ కార్యకారణుడు మాత్రమే కాదు. మొలక దృష్టాంతము సృష్టికర్త యొకడున్నా డని సూచించుటకు మాత్రము చెప్పబడినదే గాని సర్వజ్ఞుడగు ఈశ్వరునియొక్క ఉనికిని (అస్తిత్వ మును) దెలుపు విషయమున ఇది ప్రమాణము గాదు.

### సంబంధానుపపత్తేశ్చ. 38

ఈశ్వరుడు ప్రధానాదులను ప్రేరణ యొనర్చు నని చెప్పినచో ప్రధానాదులకును ఈశ్వరునకును సంబంధ మొకటి కలదని చెప్పవలసి వచ్చును. అట్లు లేదు. నైయాయికాది మతములయందు పరమాణువు నిరవయవ మనియు, ఈశ్వరుడు నిరవయవు డనియు చెప్పబడి యున్నది అన్నపుడు ఆ ఇద్దఱికి సంయోగ సంబంధ మెట్లగును? కాదు. అందు చేత ఈశ్వరుడు పరమాణువులను ప్రేరణ జేయువాడు కాడు. అట్లుండి నపుడు పరమాణువులచే ప్రపంచ మేర్పడె ననుట తగదు.

### అధిష్ఠానానుపపత్తేశ్చ. 39

మఱియు వారి మతమునందు పరమాణువులు ఇంద్రియములకు గోచరించునవి కావు. అందుచే ఈశ్వరునకును పరమాణువు లగపడుట లేదు. కాబట్టి యా పరమాణుప్రేరకు డీశ్వరుడు గాడు. వారి మతము నందు జగత్తు పుట్టె ననుటకు మార్గమే లేదు. ఈశ్వరుడు నిమిత్త కారణు డనియు ప్రధానాదులను ప్రేరణ జేసి తన్మూలమున సృష్టి చేయు ననియు చెప్పెడి పాశుపత మత మసమంజసము.

## కరణవచ్చేన్న భోగాదిభ్యః. 40

ఇక పరమాణువులు జీవులకుదప్ప ఈశ్వరునకు అగపడునని చెప్పిన, అదియు సరి కాదు. ఒకరి కగపడనిది మఱెవ్వరికిని అగపడదు. అయితే పరబ్రహ్మమునకు గూడా అగపడదనియా? అర్థ మనిన, అట్లు గాదు. ఆ విషయము వేఱు. శ్రుత్యుక్త మగు పరబ్రహ్మతత్త్వము సర్వజ్ఞము. అది సమస్తమును దెలియును.

శంక : జీవులు తమ కగపడక యుండు ఇంద్రియములను ప్రేరణ యొనర్చు నట్లు ఈశ్వరుడున్నూ తన కగపడని పరమాణువులను ప్రేరణ యొనర్చు ననిన తప్పేమి?

సమా : అట్లు గాదు. విషయోపభోగార్థమై జీవులు ఇంద్రియ విషయ ప్రేరణ లందుట సహజము; కాని శరీరము లేని ఈశ్వరునకు పరమాణువులచే కలిగిన జగత్తువల్ల ఏ భోగానుభవమును లేనందువలన అతడు పరమాణుప్రేరకుడు గాదని అర్థము.

## అంతవత్త్వమసర్వజ్ఞతా వా. 41

ఇంతే కాదు. పాశుపతులు ఈశ్వరుని సావయవు డనెదరో? లేక నిరవయవు డనెదరో? సావయవుడన్న నాశము కాగలవా డగును. నిరవయవు డన్న జగత్తునకు, ఈశ్వరునకు సంయోగ సంబంధము లేనందువలన అతనిని సర్వజ్ఞుడు కాడని చెప్పవలసి వచ్చును.

### ८. ఉత్పత్త్యసంభవాధికరణము

ఈశ్వరుడు నిమిత్తకారణము మాత్రమే యని చెప్పెడి వేద విరుద్ధములగు సిద్ధాంతములను ఖండించి వేదమతమునకు సంపూర్ణ విరుద్ధము కాకపోయినను కొన్ని అంశములందు మాత్రము భేదము కలిగియున్న పాంచ రాత్ర సిద్ధాంతమును ఈ అధికరణముచే ఖండించు చున్నారు.

## ఉత్పత్త్యసంభవాత్. 42

పాంచరాత్రులు బ్రహ్మమునుండి జీవు లేర్పడి రనియు, ఆ జీవులు నుండి అంతఃకరణములు కలిగిన వనియు చెప్పుదురు. కాని బ్రహ్మము

నుండి జీవులు పుట్టిరను మాట పొసగదు. జీవులు బ్రహ్మమునుండి కలిగిన వారయితే పంచ మహాభూతములవలె నాశమగువారే యగుదురు. మఱియు మోక్షార్థులు కాకపోవలసి వచ్చును. అందుచేత పాంచరాత్రాగమమునందు చెప్పబడిన ఈ విషయము విరుద్ధము.

నచ కర్తుః కరణమ్. 43

కర్తయైన జీవుని నుండి కరణ మగు అంతఃకరణము పుట్టదు. అజ్ఞుడైన జీవునకు అంతఃకరణమును కలుగజేయు శక్తి ఎక్కడిది? అంతఃకరణము మొదలగునవి నేరుగా బ్రహ్మము నుండియే కలిగినవని శ్రుతి చెప్పుచున్నది.

విజ్ఞానాదిభావే వా తదప్రతిషేధః. 44

జీవులు విజ్ఞానానంద రూపు లనియు, త్రికాలాబాధితు లనియు బ్రహ్మాతిరిక్త సత్తగలవారు కారనియు వారంగీకరించిన మేము వారి మతమును తిరస్కరించుట లేదు. అప్పుడు వారు తదంతర్భూతులే యగుదురు.

విప్రతిషేధాచ్చ. 45

విరుద్ధ ధర్మములు చెప్పుటవలన పాంచరాత్రమత మసమంజసము. జీవులు పుట్టిన వారని చెప్పుట ఉపనిషద్వాక్యము లన్నిటికి విరుద్ధము. అందువలన ఈ మతము అంగీకారయోగ్యము కాదు. జీవబ్రహ్మలకు భేదము లేదని అనేక శ్రుతులు ఘంటాఘోషముగ తెలుపుచున్నవి.

ఇది రెండవ అధ్యాయమున రెండవ పాదము.



## 2వ అధ్యాయము-3వ పాదము

### ౧. వియదధికరణము

అవ: వేద విరుద్ధము లగు మతము లన్నిటిని ఖండించి వేదాంత మతము నిర్దోష మని వెనుకటిపాదమున నిరూపింప బడినది. ఈ పాద

మున వేదవాక్యములయందు గల పరస్పర విరోధమును పరిహరించి వేదాంత సిద్ధాంతమును దృఢపఱచుచు ఆకాశమును గుఱించి ఈ అధికరణమున చెప్పుచున్నారు. (1—5 పూర్వపక్షసూత్రములు.)

న వియదశ్రుతేః. 1

ఛాందోగ్య శ్రుతియందు 'తత్తేజోఽసృజత' పరబ్రహ్మము అగ్నిని సృజించెను అను మొదలగు వాక్యము లుండుటచే మహాభూతముల ఉత్పత్తిని గుఱించి చెప్పునప్పుడు ఆకాశ వాయువుల యొక్క సృష్టి చెప్పబడ లేదు. మఱియు,

అస్తితు. 2

ఛాందోగ్య శ్రుతియందు చెప్పక పోయినను "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశ స్సంభూతః" అని తైత్తిరీయోపనిషత్తునందు ఆకాశోత్పత్తి చెప్పబడి యుండుట వలన శ్రుతులకు పరస్పర విరోధము వచ్చును గదా? లేక తైత్తిరీయోపనిషత్తునందు ఆకాశోత్పత్తి చెప్పబడినది కావున ఆ శ్రుతినే ప్రమాణముగా గైకొని ఆకాశము పుట్టినదని యన వచ్చునా?

గౌణ్యసంభవాత్. 3

ఇచ్చట తైత్తిరీయ శ్రుతి ముఖ్యమైనది కాదు. ఆకాశోత్పత్తి నిర్ణయించుటకు వీలు లేదు. నిరవయవ మగు ఆకాశమునకు ఉత్పత్తి పొసగదు. ఆ మాట గౌణము.

శబ్దాచ్చ. 4

"వాయుశ్చాంతరిక్షం చైతదమృతమ్" వాయు వాకాశములు మోక్షస్వరూపులై యున్నవని శ్రుతివాక్య ముండుటచేత ఆకాశము ఉత్పత్తి గలదికాదు. ఉత్పత్తి కాని దానికి నాశ ముండదు. బ్రహ్మము ఆకాశమువలె నిత్యమైనందున ఆకాశమునకు ఉత్పత్తి పొసగదు. అదియుగాక,

స్యాచ్చైకస్య బ్రహ్మశబ్దవత్. 5

భృగువల్లీ శ్రుతియందు అన్నమును బ్రహ్మ మని చెప్పినపుడు బ్రహ్మమను నా శబ్దము ఎట్లు గౌణమో, అటువలె ఆకాశము పుట్టె

నని చెప్పిన శ్రుతియందలి పుట్టుక యను మాటయును గౌణ మనియే అర్థము గదా?

అవ : ఈ విధముగా 5సూత్రములచే పూర్వపక్షమును జూపించి ఇక ఈక్రింది రెండు సూత్రములచే సూత్రకారులు స్వమత సిద్ధాంతమును చూపు చున్నారు.

## ప్రతిజ్ఞాహానిరవ్యతిరేకాచ్ఛబ్దేభ్యః. 6

ఏ యొక పదార్థము నెఱిగిన సర్వము నెఱింగి నట్లగునో యని ఛాందోగ్యశ్రుతి ప్రతిజ్ఞా పూర్వకముగ మృద్ఘటముల యుపమానముల నొసగి కార్య కారణములకు భేదము లేదని చెప్ప బడినది. వేదాంత వాక్యములచే ప్రతిపాదింపబడు పరబ్రహ్మమే జగత్కారణ మనియు, పరబ్రహ్మము నొక్కటి దెలిసికొన్న సర్వమును తెలిసికొన్నట్లగునని, ప్రతిజ్ఞ చేయబడి ఆకాశము పరబ్రహ్మమునుండి పుట్టునని అంగీకరింప బడినది. కాబట్టి తైత్తిరీయమునందు చెప్పబడిన ఆకాశోత్పత్తి శ్రుతి విరుద్ధము కాదు. అప్రధానము కాదు. ఛాందోగ్య శ్రుతియందు అగ్నిని సృష్టించె నని మొదటనే చెప్పబడినది. తైత్తిరీయమునందు అగ్ని మూడవదిగా చెప్ప బడినది. దీనినిబట్టి చూచిన ఛాందోగ్య శ్రుతియందలి అర్థము కూడ ఈ అగ్ని, ఆకాశ వాయువులకు తరువాత సృజింప బడినదియే యని భావము. కాని శ్రుతికి వేఱు అర్థము చెప్పు అభిప్రాయము లేదు. కాబట్టి పై రెండుశ్రుతుల అర్థ మొక్కటే. ఆకాశమున కుత్పత్తి కలదని చెప్పుటను అంగీకరించుట యోగ్యము. ఇందులకు మఱొక కారణము దిగువ సూత్రమున చెప్పబడును.

## యావద్వికారం తు విభాగో లోకవత్. 7

లోకమునందు భేదము ఏ యే చోట భాన మగునో ఆ యా స్థలములయం దంతట ఒకదానివలన నొకటి పుట్టినట్లు అగపడును. ఎట్లనగా, ఈ అగపడు జగత్తంతయు అల, నురుగు, మొదలగునవి సముద్రమునుండి పుట్టి సముద్రరూపమైయే యుండునట్లు, బ్రహ్మము నుండి పుట్టిన ఈ సమస్తము బ్రహ్మాతిరిక్తము కాదు. భేదము లేని అద్వితీయ మగు బ్రహ్మ కార్యము గాదు. ఆకాశము అమృత స్వరూప మని శ్రుతియందు చెప్పిన మాట ఔపచారికము. పరబ్రహ్మము సర్వ

వ్యాపక మగుటచే అట్టి పరబ్రహ్మమునుగూర్చి చెప్పునపుడు ఆకాశము నకు అమృతత్వమును చెప్పుదురు గాని ప్రత్యక్ష మగు భూతాకాశ మును గుఱించి చెప్పుట యని కాదు.

## ౨. మాతరిశ్వవ్యాఖ్యాధికరణము

అవ: ఆకాశము పుట్టినదని చెప్పి వాయువు కూడ అటువలె నని చెప్పుచున్నారు. ఇచ్చట పుట్టెను అని చెప్పుటవలన సత్తే వివర్త మయ్యెనని గ్రహింప వలెను. (పూర్వరూపము చెడకనే చెడిన దాని వలె నగపడుట.)

### ఏతేన మాతరిశ్వా వ్యాఖ్యాతః. 8

పై అధికరణమునందు చూపిన యుక్తులచేతనే వాయువు పుట్టె నను మాట ఛాందోగ్యశ్రుతియందు, లేక తైత్తిరీయమునందు మాత్రము ఉన్నదనుటచేత గౌణ మని అర్థ మేమియు కాదు. అది యును ఆకాశమువలె పుట్టిన దనియే చిద్వివర్త మనియే చెప్ప వలయును.

## ౩. అసంభవాధికరణము

### అసంభవస్తు సతోఽనుపపత్తేః. 9

అటులైన బ్రహ్మముకూడ ఆకాశమువలె ఏదొకదానిచే పుట్టిన దనియే చెప్పవలయునా? అనిన, అట్లు చెప్పరాదు. పరబ్రహ్మము సత్తాసామాన్య స్వరూప మగుటచేత సర్వ పదార్థములయం దుండు ఉని కియే అది. అందువలన మఱొక అస్తిత్వముచే పరబ్రహ్మము పుట్టిన దనుట తప్పు. బ్రహ్మము పుట్టునది కాదు. అది అజము. దానికి వేఱొక ఉనికిగా గాని సద్విశేషముగా గాని యుండి పుట్టుటకు వీలు లేదని అర్థము.

## ౪. తేజోఽధికరణము

### తేజోఽతస్తథాహ్యాహ. 10

అగ్ని వాయువునుండి కలిగె నని తైత్తిరీయ శ్రుతియందు ఉన్నది. ఇక అగ్ని బ్రహ్మమునుండి పుట్టెనని ఛాందోగ్య శ్రుతియం దున్నది. ఈ రెండిటియందు విరోధ మగపడు చున్నది కదా? యని

శంకించిన, అగ్ని వాయురూప మొందిన బ్రహ్మమునుండి జనించెనని చెప్పవలయును. వాయు వయిన పిదప అగ్ని పుట్టెనని అన్వయించుకొన వలయును. (వాయోః) అను పంచమీ విభక్తికి వరుస యని మాత్రమే అర్థమును గ్రహింప వలయును.

౫. అబధికరణము

## ఆపః. 11

'తదాపోఽసృజత' ఆ బ్రహ్మము జలమును సృజించెను. 'అగ్నేరాపః' అగ్నినుండి జలముపుట్టెను. ఈ రెండు శ్రుతులకును విరోధము లేదు. అనగా పై భూతములవలె జలము అగ్నిరూపము నొందిన బ్రహ్మమునుండి కలిగెనని చెప్పవలయును.

౬. పృథివ్యధికరణము

## పృథివ్యధికారరూప శబ్దాంతరేభ్యః. 12

'తా అన్నమసృజంత' నీటిచే అన్నము పుట్టెనని శ్రుతి చెప్పుచున్నది. అన్నమన్న ధాన్యమా?, లేక భూమియా? అని శంకించిన సమాధానము. జలముచే పృథివీ భూతము పుట్టెనని అర్థము. ఎందుకనగా, ఈ ప్రసంగము మహాభూతముల ఉత్పత్తి క్రమము నందలిదై యున్నది. మఱియు జలముచే అన్నము కలిగె ననుమాట వేఱొక చోట నున్నను జలమునుండి పృథివి కలిగెనని విస్పష్టముగ అర్థమగుచున్నది.

౭. తదభిధ్యానాధికరణము

శంక : ఆకాశమునుండి వాయువు, వాయువునుండి అగ్ని యని ఈ ప్రకారముగ భూతములే ఒకదాని నొకటి కలుగ జేసెననియా? ఇందలి అర్థ మనిన,

## తదభిధ్యానాదేవ తు తల్లింగాత్సః. 13

సమా : ఆకాశాదులు స్వతంత్రముగా ఏ వస్తువును పుట్టింపజాలవు. 'సోఽకామయత' ఆ పరబ్రహ్మము సంకల్పించెను. యోజించెనని శ్రుతి చెప్పుచున్నందువలన ఆకాశరూప బ్రహ్మము వాయువును వాయురూప మగు బ్రహ్మము అగ్నిని ఇటువలె వేశ్వేఛాకృతులొందిన

ఆ బ్రహ్మమే వివిధ ప్రకారములుగ పుట్టించె నని చెప్పవలయును. తాత్పర్యమేమనిన, సమస్త సృష్టియు బ్రహ్మమునుండియే యనియు, బ్రహ్మతత్త్వమే భూతముల అంతర్యామియైయుండి వ్యవహరించెననియు శ్రుతి తాత్పర్యము.

## ౮. విపర్యయాధికరణము

అవ: ఏడు అధికరణములచే ప్రపంచోత్పత్తిని గుఱించిన వివరణ జేయబడినది. ఇక తల్లయమును గుఱించి తెలుపుచున్నారు.

**విపర్యయేణ తు క్రమోఽత ఉపపద్యతే చ. 14**

సృష్టి ఏ వరుస ననుసరించి చెప్పబడినదో, దానికి విపర్యయముగ లయ మని తెలియవలయును. లయ మనగా సృష్టిక్రమముయొక్క విరుద్ధ క్రమము. పృథివి జలమునందు, జలము అగ్నియందు ఇత్యాదిగా గ్రాహ్యము.

## ౯. అంతరావిజ్ఞానాధికరణము

శంక: "ఏతస్మాజ్జాయతే ప్రాణో మనస్సర్వేంద్రియాణిచ ఖం వాయుర్జ్యోతిరాపః పృథివీ విశ్వస్య ధారిణీ" ఆ పరమాత్మచే ప్రాణము, మనస్సు, ఇంద్రియములు, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథివి పుట్టినవని శ్రుతి అంతఃకరణముయొక్క ఉత్పత్తిని మొదట చెప్పి ఆ పిదప భూతములయొక్క ఉత్పత్తి చెప్పబడియున్నది. ఈ క్రమమును చెప్పుటకు అర్థమేమి? అనిన,

**అంతరా విజ్ఞానమనసీ క్రమేణ తల్లింగాదితి చేన్నావిశేషాత్. 15**

సమా: ఇచ్చట అంతఃకరణము కలిగెను అని ఇంతమాత్రము అర్థమును గ్రహించుకొనవలయునే గాని వీటి క్రమమును తీసికొన వలసిన పని లేదు. ఈ ప్రాణేంద్రియాదు లన్నియు ఆ యా భూతములనుండి పుట్టినవి. అందుచేత భూతముల ఉత్పత్తి యైన పిదపనే వీటి ఉత్పత్తి యని తెలియవలెను.

## ౧౦. చరాచరవ్యపాశ్రయాధికరణము

శంక: వేదమునందు కొన్ని చోటుల జీవుడు పుట్టుచున్నాడనియు మృతి నొందుచున్నాడనియును చెప్పుచు, కొన్ని స్థలములందు

ఆ యా కర్మలు గూడా విధింప బడి యున్నవి. వేఱొకచోట అన్నినో జీవుడు నిత్యుడనియే చెప్పబడు చున్నాడు. పరస్పర విరోధము గల ఈ రెండు సందర్భములకు అర్థమేమి?

చరాచరవ్యపాశ్రయస్తు స్యాత్తద్వ్యపదేశో భాక్తస్తద్భావ భావిత్వాత్. 16

సమా : జనన మరణములు దేహధర్మములు. జీవునకు జనన మరణములు గలవని చెప్పు శ్రుతి అప్రధాన మైనదని తెలిసికొన వలెను. చక్కగా విచారించిన పుట్టు చావులు రెండును శరీరమునకు సంబంధించినవి. దేవదత్తుడు పుట్టెను మరల చచ్చెను అను నీ వ్యవహారము లన్నియు అతని శరీరమునకు సంబంధించినవి. అగ్నిచే తప్త మైన ఇనుప ముద్ద అగ్నియే యని అజ్ఞతచే దెలియు నట్లు జీవుని సంబంధముచే శరీరము జీవుడే యను మిథ్యాజ్ఞానము బహుకాలమునుండి యుండినందువలన అట్లు వ్యవహరింప బడుచున్నదని భావము.

౧౧. ఆత్మాధికరణము

శంక: "ఏతస్మాదాత్మానస్సర్వ ఏత ఆత్మానో వ్యుచ్చరంతి" పరబ్రహ్మమునుండి జీవు లందఱు వచ్చుచున్నారని శ్రుతి చెప్పుచున్నది. కావున మహాభూతములవలె జీవుడు కూడా కల్పాదియందు పుట్టుచున్నాడని చెప్పగూడదా? అనిన, సమాధానము.

నాత్మాఽశ్రుతేర్నిత్యత్వాచ్చ తాభ్యః. 17

శ్రుతియందు జీవుల పుట్టుక మాటయే లేదు. సృష్టిని గుఱించి చెప్పు స్థలమునందు భూత భౌతిక సృష్టియే చెప్పబడినది గాని జీవోత్పత్తి విషయ మైన శ్రుతి జీవుని పరమైనది కాదు. బృహదారణ్యక శ్రుతియందు "అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణః" జీవుడు అనాది యయిన వాడు; పుట్టుక లేనివాడు; సర్వకాలములయం దుండువాడు; రూపభేదము లేనివా డను నిత్యాదిగా జీవుని గూర్చి శ్రుతులు చెప్పుచున్నవి. కాబట్టి పరబ్రహ్మమే జీవరూపుడై భూతములయందు ప్రవేశించునని జీవుని యొక్క నిత్యత్వమునే శ్రుతి సాధించు చున్నది.

## ౧౨. జ్ఞాధికరణము

### జ్ఞోఽత ఏవ. 18

జీవ చైతన్యమును ఆగమాపాయిత్వ లక్షణము గలదని (వచ్చి పోవునదని) కొందఱనెదరు. ఇక కొందఱు ఎల్లప్పుడు ఉండునదనియు అందురు. ఈ జీవ చేతనము సంతతము ఉండు ననియే తాత్పర్యము. ఆ పరబ్రహ్మమే జీవరూపమున భూతములయందు ప్రవేశించి యున్నది. జీవుడు స్వయంప్రకాశ స్వరూపుడు. మఱియు వైశేషికులు చెప్పునట్లు ఆగంతుక విజ్ఞానము కలవాడు కాడు. జీవునకు పుట్టుకను నాశనమును చెప్పుట ఉపాధి ననుసరించిన మాటయే గాని పరమార్థతః ఇవి జీవునకు లేవు.

## ౧౩. ఉత్క్రాంతిగత్యధికరణము

అవ : ఈ 19-వ సూత్రమునుండి 28వ సూత్రమువఱకు పూర్వపక్ష సూత్రము లని తెలియవలయును.

### ఉత్క్రాంతిగత్యాగతీనామ్. 19

'సయదస్మాచ్ఛరీరాదుత్క్రామతి' ఆ జీవుడు ఈ శరీరమునుండి వెడలిపోయెను అను నీ వాక్యముచే జీవులు దేహమును విడిచి, స్వర్గ నరకములకు నెళ్ళుచు, అచ్చట కష్ట సుఖముల ననుభవించి, మరల దేహము నొందుట యనునది అగపడుచున్నందున, అతనికి పరిణామమున్నదనియే అర్థ మగుచున్నది. అట్లుగాక వ్యాపకుడే అయి యుండినచో పోవుట, వచ్చుట అనునది పొసగదు కదా ? కాబట్టి జీవుడు మధ్యమ పరిమాణుడు కాకపోయినను అణుమాత్రు డని యైనను చెప్పవలెను గదా ? యని శంక.

### స్వాత్మనా చోత్తరయోః. 20

సూక్ష్మదేహము జీవునితో స్వర్గ నరకముల కేగునని చెప్పవలయును. లేకున్న సుఖ దుఃఖముల అనుభవమే లేకపోవును గదా ! కాబట్టి జీవుడు అణుమాత్రు డని తెలియ వలయును.

### నాణురతచ్ఛ్రుతేరితి చేన్నేతరాధికారాత్. 21

అణువు కాదని వేదమునందు చెప్పబడి యుండుటవలన శ్రుతి

పరబ్రహ్మమును గూర్చి చెప్పు సందర్భమునందు ఆవిధముగా చెప్పినదే. గాని జీవుడు అణుమాత్ర స్వరూపుడు కాడని చెప్పుటకు వీలులేదు.

## స్వశబ్దోన్మానాభ్యాం చ. 22

"ఏషోఽణురాత్మా చేతసా వేదితవ్యః" అను వాక్యముచేత శ్రుతి జీవుని అణుమాత్రు డని చెప్పి యున్నది. వెంద్రుకకొస యంత పరిమాణము గలవా డనియు చెప్పబడి యున్నది. అందుచేత జీవుడు అణుమాత్రుడే.

## అవిరోధశ్చందనవత్. 23

శంక : జీవుడు అణుమాత్రు డైన అత డొకేచోట నుండవలసి వచ్చును. అప్పుడు సర్వ శరీరములకు సంబంధించిన సుఖ దుఃఖాదులను తెలిసి కొనుట ఎట్లు సంభవించును? అనిన పూర్వపక్షి. అట్లు కాదని నిరూపించుచున్నాడు.

సమా : సువాసిత మగు శ్రీగంధము శరీరముపై ఒకచుక్క ఎచ్చట పడినను సర్వత్ర దాని గంధము వ్యాపించు నట్లు జీవుడుకూడా అణుస్వరూపు డయ్యు సర్వ శరీరములకు సంబంధించిన సుఖ దుఃఖాదులను తెలిసికొన వచ్చును. కాబట్టి జీవుడు అణువు.

## అవస్థితివైశేష్యాదితి చేన్నాభ్యుపగమాద్ధృది హి. 24

పై దృష్టాంతము సరియైనది కాదు. శ్రీగంధముయొక్క చుక్క శరీరముపై నొకచోట యుండునది అగపడును. అటువలె జీవుడు ఎచ్చటనో ఒకచోట యుండునది అగపడదు. ఈ విషయమునే మరల వేఱొక విధముగ సమర్థించు చున్నాడు.

## గుణాద్వా లోకవత్. 25

శంక : అయ్యా! అతడు హృదయమునం దున్నాడని శ్రుతి చెప్పుచున్నదిగదా? దీపము ఇంటియం దొకచోట ఉండినను దాని వెలుతురు ఇల్లంతయు వ్యాపించునట్లు ఈ జీవుడు హృదయ మను నొక చోట ఉండినను అతని గుణములైన సుఖ దుఃఖాదులు శరీరమునం దంతటను అగపడుట సంభవింప వచ్చును.

## వ్యతిరేకో గంధవత్. 26

గంధము పుష్పముయొక్క తోడు లేకపోయినను వాయువీచికలచే నలుదిశలు వ్యాపించునట్లు సుఖ దుఃఖములు జీవుని తోడు లేకపోయినను దేహమునం దెల్ల వ్యాపించి అగపడును.

## తథా చ దర్శయతి. 27

"ఆలోమభ్య ఆనఖాగ్రేభ్యః" జీవుడు హృదయమునం దుండువాడును అణుస్వరూపుడు నయి అతడే నఖ శిఖ పర్యంతము చైతన్యరూపమున శరీర మాద్యంతము వ్యాపించి యున్నాడు.

## పృథగుపదేశాత్. 28

రెండు పక్షులు గలవని ఉపనిషత్తులయందు చెప్పబడెను. ఆ శ్రుతియందలి కథవలె జీవ బ్రహ్మలకు భేదమునే చెప్పి యుండుటవలన జీవ బ్రహ్మలకు భేదమే కాని అభేదము పొసగదు.

అవ : 19-వ సూత్రము మొదలు ఈ 28-వ సూత్రము వఱకు పూర్వపక్షమును చూపించి సూత్రకారులు ఈ క్రిందివిధముగా దానిని ఖండించి సిద్ధాంతమును చేయు చున్నారు.

## తద్గుణసారత్వాత్తు తద్వ్యపదేశః ప్రాజ్ఞవత్. 29

జీవుడు అణుస్వరూపు డని చెప్పుట తప్పు. తదర్థము వేఱు. శ్రుతులు జీవునకు ఉపాధి యగు బుద్ధియొక్క అణుత్వాదిగుణములను బట్టి జీవుని అణుస్వరూపముగా బోధించు చున్నవే గాని వేఱు గాదు. నేను కర్తను, నేను భోక్తను అను భావన లెల్ల అంతఃకరణమునకు చెందినవే. జీవుడు అంతఃకరణ విశిష్టుడై యున్నందువలన ఆ ఉపాధినిబట్టి జీవుడు అణువని చెప్పబడి యున్నాడని 'తత్త్వమసి' ఇత్యాది వాక్యములచే చెప్పబడి యున్నది. వేయేల? పరబ్రహ్మమునుగూడ ఉపాసనార్థమై అణుపరిమాణ మని చెప్పుటయు గలదు. ఆ దృష్టిచే జీవుడు అణువని చెప్ప బడినాడు గాని తత్త్వతః జీవుడు సర్వవ్యాపకమగు బ్రహ్మమే. అణుస్వరూపుడు గాడు. 'జీవో బ్రహ్మైవ నాపరః' జీవుడు బ్రహ్మమే.

భావద్భాత్మభావిత్వాచ్చ న దోష స్తద్దర్శనాత్ 30.

శంక: అటులైన బుద్ధియును జీవుడును వేఱు వేఱయినందున 'సంయోగా విప్రయోగాంతాః' సంయోగము లన్నియు అవశ్యము వియోగమును కలిగి యుండును. అను వాక్యరీతి బుద్ధి వియోగమైన వెంటనే జీవుడు అగపడక పోవలసి వచ్చును. మఱియు అసంసారి యనియు చెప్పవలసి వచ్చును గదా? యనిన,

సమా: ఆత్మ సాక్షాత్కారానుభవము కలుగు నంతపర్యంతము అంతఃకరణము ఉండియే ఉండును. గాఢ నిద్రయందు దడ అగుపడ నంత మాత్రమున లేదని అర్థము గాదు. సూక్ష్మ రూపమున ఉండనే యున్నది. అందుచే నీవు చెప్పిన పై దోషమునకు అవకాశము లేదు. నిద్రనుండి జీవుడు మేల్కాంచునని శ్రుతియు నున్నది. తాత్పర్య మేమనిన, శరీర వియోగము కలిగి నప్పటికిని జీవునకు బుద్ధి వియోగము కలుగ దనియు, సంసార ముండునంత వఱకు బుద్ధి సంయోగ మును తప్పక ఉండుననియు నిర్ణయము. కాబట్టి ఆ సంయోగము భ్రాంతిమూలకమైన దగుటచే తత్త్వ జ్ఞానము కలుగు నంతవఱకు తన్నాశము కలుగదని అర్థము. ఆత్మ జ్ఞానముచే అది బాధింప బడును. అపరోక్షముగా దాని మిథ్యాత్వనిశ్చయ మగును.

శంక: అంతఃకరణము బ్రహ్మసాక్షాత్కార మగు నంతపర్యంతము అటులనే యుండు నని చెప్పుట పొసగదు. ఎందుచేత ననగా, ప్రతిదినము గాఢ నిద్రయందు అంతఃకరణము సహజముగ నాశ మొందునని శ్రుతికలదు గదా? యనిన, సమాధానము.

పుంస్త్వాదివ త్త్వస్యసతోఽభివ్యక్తియోగాత్. 31

సమా: అంతఃకరణము నిద్రయందు సూక్ష్మరూపముననుండి జాగ్రదవస్థయందు స్థూలరూపము నొందుచున్నది. నిద్రయందు ఘట పటాది విషయ జ్ఞానము లేనంత మాత్రమున తద్వాసనారూప బీజ నాశ మగునని అర్థము గాదు. బీజమునందు వృక్ష మడగియుండి అగపడక పోయినంతమాత్రమున లేదని అర్థము గాదు. అటువలె నిద్రయందు అంతఃకరణము సూక్ష్మరూపమున నుండి జాగ్రదాదులక్ష

కారణమై స్థూలరూపము నొందునని భావము. (బాల్యమునందు యౌవనాదు లడగి యుండి వ్యక్త మగునట్లు).

శంక: బుద్ధి యనునది సత్యముగ ఉండి నప్పుడు గదా? మీరు చెప్పు సిద్ధాంతము సరిపడును? అనిన,

నిత్యోపలబ్ధ్య నుపలబ్ధి ప్రసంగోన్యతర నియమోవాఽన్యథా. 32

సమా: బుద్ధి యనియు, మన స్సనియు అంతఃకరణ మొక్కటియే అట్లుచెప్ప బడుచున్నది. నిశ్చయించిన బుద్ధి యనియు, సంశయించునపుడు మనస్సనియు చెప్పుచున్నారు. అసలు అంతఃకరణ మున్నదా లేదా? అను ప్రశ్నయే అసమంజసము. ఎందుకనగా, అంతఃకరణము ఎల్లప్పుడు స్థూల సూక్ష్మ ఘటపటాది పదార్థములను ఎఱుగుచునే యుండును. అట్లు లేకున్న స్థూల సూక్ష్మాది విశేష జ్ఞానమే లేకుండ వలసి వచ్చును. కాబట్టి అంతఃకరణ మొకటున్నదనియే ఒప్పుకొనవలెను. సావధానముగా నున్నపుడు ఇంద్రియముల ద్వారా విషయానుభవము గలుగు ననియు, అట్లు లేనప్పుడు తదనుభవము కలుగ దనియు చెప్పుట సమంజసము. అందుచే సిద్ధాంతమునకు భంగ మేమియు లేదు. అంతఃకరణము ఒకప్పుడు స్థూలముగను సూక్ష్మముగను ఉండునని అర్థము.

౧౪. కర్త్రధికరణము

శంక: 'అసంగో హ్యాయం పురుషః' ఈ పురుషుడు దేనితోను సంబంధము గలవాడు కాడనియు, మఱియు 'యావజ్జీవ మగ్నిహోత్రం జుహుయాత్' బ్రతికి యున్నంతకాలము హోమము చేయవలయు ననియు గల యీ వాక్యములను చూచిన పరస్పర విరోధము అగపడు చున్నది గదా? జీవుడు కర్త యని ఎట్లు చెప్ప నగును? బుద్ధియే కర్త గాదా? అనిన,

కర్తాశాస్త్రార్థవత్త్వాత్. 33

సమా: శాస్త్రము లన్నియు ప్రయోజనములు కలవై యుండుట వలన అట్టి ప్రయోజనార్థకము లగు శాస్త్రములను చేతనులను గుఱించియే ఉపదేశించుట యుక్తము. కాబట్టి జీవుడే కర్త యని

తెలియు చున్నది. స్వర్గమును గోరినవారు జ్యోతిష్టోమము చేయ వలయు నని చెప్పిన వాక్యము, మఱియు జీవుడు ఏమైనను చేయగల డను మాటయు జీవ సంబంధమైనది యగుపట్ల, లేక కేవల అంతఃకర ణమునకే చెప్పబడి యుండినపట్ల జీవునకు స్వర్గ నరకములు లేకపోవలసి వచ్చును. తాత్పర్య మేమనగా, చేతనుడగు ఆత్మయే కర్త యని చెప్పుట యుక్తము,

## విహారోపదేశాత్. 34

స్వర్గ నరకాదులకు వెళ్ళి విహరించి వచ్చు నట్లుగ తద్విషయక మైన సంబంధము శ్రుతియందు చెప్పబడి యుండుటవలన పుణ్యాపాప ముల కర్త జీవుడనియే అంగీకరింప వలసి వచ్చును. కర్త కాని వానికి కార్య ముండుట సంభవింపదు. కావున జీవుడే కర్త యని తాత్పర్యము.

## ఉపాదానాత్. 35

ఉపాదాన కారణ మగుట వలనను జీవుడే కర్త. చచ్చిన పిదప ఇతడు దేవతాయోగ్య మగు శరీరమునో, లేక నరలోకమునకు తగు శరీరమునో పొందునని చెప్పబడి యుండుటవలన ఇతడుపుణ్యాపాపములు చేయు వాడని అంగీకరింప వలసి వచ్చును. ఇంద్రియములందున్న గ్రహణశక్తికి జీవుడు ఉపాదానకారణ మని తెలియు చున్నది. కాబట్టి ఇతడే కర్త.

## వ్యపదేశాచ్చ క్రియాయాం నచేన్నిర్దేశవిపర్యయః. 36

లౌకిక వైదిక క్రియలయందు జీవుని అంగీకరింప వలెను. ఇచ్చు వాడు, పుచ్చుకొనువాడు, చేయువాడు, తెలియువాడు, అను మొద లగు శ్రుతి పలుకుల ననుసరించియు అతడే సర్వమును చేయు వాడని అర్థ మగుచున్నది. బుద్ధి కర్మ నాచరించు నపుడు సాధన మగును. కావున 'విజ్ఞానం యజ్ఞం తనుతే' బుద్ధి కర్మలు చేయునదని చెప్పి నందువలన విరోధ మేమియు లేదు.

శంక : జీవుడు ఏమైనను చేయగల డనిన గాఢ నిద్రయందును తన ఇష్టానిష్ట విషయముల గూర్చి ఏమైనను చేయవచ్చును గదా? అనిన,

## ఉపలబ్ధివదనియమః. 37

సమా : జీవుడు జ్ఞాన స్వరూపు డని సాంఖ్యులు చెప్పినను గాఢ సుషుప్తి సమయమునందు ఘటపటాది విషయ జ్ఞాన మెట్లు కాదో, అటువలె జీవుని కర్మయు ఒకొక కాలమునందు మాత్ర ముండునే గాని ఎల్లప్పుడు ఉండదని తెలియవలెను. ఇచ్చట కర్తృత్వ మనగా ఇతరము లగు సాధనములను ప్రేరణ యొనర్చుటయే కాని స్వయముగా సర్వమును ఆచరించుట యని కాదు. కారకములతో సంబంధము లేని కర్త యని చెప్పుటయే ఇచ్చట అభిప్రాయము. కర్మ సాధనము లగు బుద్ధి మొదలగునవి భ్రాంతిచే శుభాశుభములయందు ప్రవర్తించినను ప్రేరకుడగు కర్తయందు దోషములు సంభవించవని తాత్పర్యము.

## శక్తివిపర్యయాత్. 38

బుద్ధియే కర్త యని చెప్ప రాదా? యనిన అట్లు చెప్ప రాదు. అది చేయునది కాదు. అది చేయుటకు సాధనము మాత్ర మని తెలియ వలెను.

## సమాధ్యభావాచ్చ. 39

పుణ్య పాపములు చేయు వాడు జీవుడు కాదనిన అతనికి పరమాత్మయందు అంతర్ముఖత ఏర్పడదు. 'శ్రోతవ్యో మంతవ్యో ద్రష్టవ్యో నిదిధ్యాసితవ్యః' వేదాంతార్థమును వినుట చింతించుట ధ్యానించుట అనునవె లేకపోవలసి వచ్చును. మఱియు మోక్ష మను నది లేదని చెప్పవలసి వచ్చును. ఇక బుద్ధికి మోక్ష మనిన, అది మోక్ష కాలమున లేకపోవు నదియు, జడము నగుటనందునలన మోక్ష మను మాట బుద్ధికి పొసగదు. కావున జీవుడే కర్త యని తాత్పర్యము.

### ౧౫ తక్షాధికరణము

శంక : పై యధికరణమునందు జీవుడు కర్త యని నిర్ధరింప బడినది. అటులయిన అసంగ శ్రుతులకు, విధి వాక్యములకు పరస్పర విరోధము వచ్చును గదా? యనిన,

## యథా చ తక్షోభయథా. 40

సమా : ఏమైనను చేయు చుండుటయే జీవుని స్వభావ మని

నైయాయికాదు లందురు గదా? అనిన, అట్లు గాదు. ఉపాధితో కూడి నపుడు జీవుడు కర్త యగును. ఉపాధి విముక్త మయినపుడు అసంగుడగునని అర్థము. జీవునకు ఈ కర్తృత్వము ఉపాధినిమిత్తమే కాని స్వాభావిక మైనది కాదు. ఈ కారణము వలన స్వభావమును బట్టి చూడ అసంగు డనియు, ఔపాధిక మగు కర్తృత్వమును బట్టి కర్త యనియు శ్రుతి జీవునిగుఱించి చెప్పుచున్నది. వడ్రంగి లోకము నందు ఉలి, బాడిస మొదలగు సాధనములతో గూడి పనులుచేయు వాడై కర్తయై కష్టముల ననుభవించును. ఆ కొరముట్లను ప్రక్కకు పాఱవైచి కూర్చుండి నపుడు హాయిగ నుండును. అటువలె జీవుడు జాగ్రత్స్వప్నములయందు దేహేంద్రియాదుల నభిమానించి ఆ యా కష్ట సుఖముల ననుభవించి గాఢ నిద్రయందు తదభిమానమును వీడి ఏదొక్కటియు లేక అసంగుడై యుండును. జీవు డేమైనను చేయు ననుమాట దేహాద్యభిమానముతో గూడి నప్పటి మాటయే కాని అతని సహజ స్వభావము కాదు.

౧౬. పరాయత్తాధికరణము

## పరాయత్తంతు తచ్ఛ్రుతేః. 41

జీవునకు గల కర్తృత్వము ఈశ్వరారాధన మైనదే కాని స్వతంత్ర మైనది కాదు. కాబట్టి జీవుడు పుణ్య పాపముల నాచరించు నపుడు పరమాత్మ ప్రేరణ యగునని భావము.

## కృతప్రయత్నాపేక్షస్తు విహితప్రతిషిద్ధావైయర్థ్యాదిభ్యః. 42

ఈశ్వరుడు స్వతంత్రుడుగదా? జీవు లేమియూ జేయకున్నను ఎందుచేకు ఫల మీయకూడదు? అని శంకింప అయ్యా! ఈశ్వరుడు జీవుల ప్రయత్నానుసారముగా సుఖ దుఃఖముల నిచ్చు చున్నాడు. అట్లు గాని పట్ల విధి నిషేధములను గుఱించి చెప్పు శ్రుతులకే అర్థము లేకపోవలసి వచ్చును.

౧౭. అంశాధికరణము

అవ: 'య ఆత్మని తిష్ఠన్' ఎవడు జీవునియందున్నాడో 'తత్త్వమసి' ఆ బ్రహ్మమే నీవు అను మొదలగు భేదమును అభేదమును జెప్పు శ్రుతులకు పరస్పర విరోధము రాదా? యనిన, జెప్పుచున్నారు.

## అంశో నానావ్యపదేశాదన్యథా చాపి దాశకితవాదిత్వమధీయత ఏకే. 43

పై శ్రుతులకు విరోధము లేదు. జీవ బ్రహ్మలకు గల భేదము కల్పితము. స్వభావముగా పరబ్రహ్మమునందు విభాగములు లేవు. కావున జీవుడు కల్పితాంశ మనియే నిర్ణయ మైనది. జీవుడు, బ్రహ్మము అని రెండు పక్షులుగ వర్ణించి శ్రుతి వారిద్దఱికి భేదమును చెప్పినది. ఓ జీవుడా! నీవు బ్రహ్మమే అయియున్నావని చెప్పు వాక్యముచేత శ్రుతి మరల అభేదమును చెప్పినది.

శంక: అట్లైన శ్రుతి ఇట్లు ద్వివిధముగ చెప్పుటచే పరస్పర విరోధము కాదా? అనిన, సమాధానము: ఇచ్చట జీవులు ప్రతిబింబము వలెను బ్రహ్మము బింబమువలెను ఉన్నారని గ్రహింపవలెను. ప్రతిబింబము లేక బింబ మున్నది. అందుచే విరోధము లేదు. ఈ జీవ బ్రహ్మల సంబంధ మిట్లుండుట వలన జీవులను బ్రహ్మముయొక్క అంశము లని ఎఱుగ వలయును.

## మంత్రవర్ణాచ్చ. 44

'పాదోస్య విశ్వాభూతాని' ఈ సమస్త జగత్తు బ్రహ్మమునందొక పాదమే యని శ్రుతి చెప్పి యున్నది. పాద మనుటకు అర్థము అంశ మని తెలియ వలయును. కావున జీవుడు బ్రహ్మము యొక్క అంశము.

## అపిచ స్మర్యతే. 45

'మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః' అని స్మృతియు జీవుడు బ్రహ్మముయొక్క అంశ మని చెప్పుచున్నది.

అవ: జీవుడు బ్రహ్మముయొక్క అంశ మనినచో ఇక పరబ్రహ్మమును సుఖ దుఃఖములు కలదియే అన్నట్లాయెను గదా? యను విషయమున శంకా, సమాధానములు.

శంక: సూత్రమునకు బురద యంటిన సూత్రము అంశముగా గలిగిన పటమునకు అనగా గుడ్డకు బురద యంటినట్లేగదా? అటువలె

జీవులకు సుఖ దుఃఖములు కలిగినపట్ల జీవులు అంశముగా గలిగిన బ్రహ్మమునకును సుఖ దుఃఖములయొక్క సంపర్కము ఉన్నదనియే తెలియవలెను? అనిన,

## ప్రకాశాది వన్నైవం పరః. 46

సమా: పరమాత్మకు సుఖ దుఃఖముల సంబంధము లేదు. గవాక్షముగుండా వచ్చి ఇంటియందు పడిన సూర్య రశ్మి ఏతద్గవాక్షముయొక్క వర్తులాకృతిని, విచిత్ర మగు వక్రత్వాది ధర్మములను పొంది ప్రకాశించుచుండినను వెలుపల నున్న సూర్యరశ్మికి ఈ ఉపాధిధర్మము లేవియు లేవు గదా? అటువలె జీవచైతన్యము దేహాభిమానము వలన సుఖదుఃఖములు గలదిగను, ఇక దేహోపాధి విముక్త మగు బ్రహ్మచైతన్యము దేహాభిమానము లేనందువలన భయ శోకాదులు లేనిదిగను అసంగమై యున్నదనియును తెలియవలయును. జీవుడు ఉపాధి సంబంధమువలన సుఖ దుఃఖములను అనుభవించుచున్నను పరబ్రహ్మమునకు ఆ యనుభవముచే కలుగు లిప్తత ఏమియును లేదు. అసంగమనియే అర్థము.

## స్మరంతి చ. 47

సర్వత్ర వ్యాపించి యున్న ఆకాశమునకు మఱిదేనితోను సంపర్క మెట్లు లేదో, దేశ కాల వస్తు పరిచ్ఛేద రహితమై వ్యాపించియున్న బ్రహ్మమునకును దేనియొక్క సంబంధమును లేదని స్మృతియు జెప్పుచున్నది. అవిద్యోపాధి లేక పోవుటచే బ్రహ్మమునకు సుఖదుఃఖాదులు లేవనియు, ఉపాధి కలవాడగుటచే జీవుడు తత్సంబంధము కలవాడువలెను ఉన్నదని స్మృతులును చెప్పుచున్నవి.

## అనుజ్ఞాపరిహారౌ దేహసంబంధాజ్జ్యోతిరాదివత్. 48

ఇది చేయ వలసినది; ఇది చేయ రానిదని శాస్త్రమునందు చెప్పబడిన విధి నిషేధము లెల్లయు దేహాభిమానముగల జీవులకొఱకై చెప్పబడినదే గాని దేహాభిమానము లేని బ్రహ్మమునకు అనగా బ్రహ్మానుభవులకు గాదు. పై జెప్పిన సూర్యప్రకాశమే ఇందులకు దృష్టాంతము.

శంక: నీ యభిప్రాయానుసారము జీవులు ఒకరి కంటె నొకరు

వేఱు కానిపట్ల ఒక జీవునకు సుఖము గలిగినపుడు సర్వ జీవులకును సుఖము కలుగవలెను. ఒకనికి దుఃఖమయినపుడు సర్వులకును దుఃఖము గలుగ వలయును అన్నపుడు ఒకడు దరిద్రుడు, ఒకడు ధనికుడు భేదము లేక పోవలసి వచ్చును గదా? యనిన,

## అసంతతేశ్చావ్యతికరః. 49

సమా : అయ్యా! బ్రహ్మజ్ఞాన మగు పర్యంతము జీవులకు దేహ సంబంధము విడుచునది గాదు. అందుచేత జీవులు అవిద్యోపాధి వశులై విడి విడిగానే ఉన్నందువలన ఈ సుఖదుఃఖములయొక్క సాంకర్యము కావలసిన పని లేదు. అధిష్ఠాన మగు బ్రహ్మజ్ఞాన మయినచో ఈ భేదజనక మగు సర్వము కల్పన యని తెలియును.

## ఆభాస ఏవచ. 50

జీవుడు పరబ్రహ్మముయొక్క, ఆభాసము – ప్రతిబింబము. అంశ మనిన, ప్రతిబింబ మనియే అర్థము. అంతఃకరణమునందు ప్రతిబింబించిన ప్రతిబింబ స్వరూపు లగు జీవులు గుణతారతమ్యముచే ఏర్పడిన వివిధాంతఃకరణముల సంబంధము గలవారై విభిన్న మగు సంస్కారముచే ఉపాధి వివశులై యున్నారు. అందుచే ఈ సుఖ దుఃఖముల యొక్క సాంకర్యము లేకనే వారి వారి మోహపాశములచే భిన్న భిన్నముగ నున్నారు. కాబట్టి ఒకరికి సుఖము గలిగినపుడు అందఱికి సుఖము, ఒకరికి దుఃఖము కలిగినపుడు అందఱికి దుఃఖము గలుగ వలయు నను మాట పొసగదు. ఉపాధిసంబంధము వలని కల్పనయే ఇదంతయు నని తెలియ వలయును.

## అదృష్టానియమాత్. 51

అదృష్టమును నిర్ణయించుటకు వీలు లేదు. ఇది ఈ జీవుని అదృష్టము; ఇది ఆ జీవుని అదృష్ట మని నిర్ణయించుటకు రాదు. కాబట్టి జీవుల సుఖ దుఃఖములకు విభాగ మేర్పడ దని అర్థము. 49–వ సూత్రమునందు చూపబడిన దోషము నైయాయికాది మతస్థులకు సంబంధించినదే గాని ఇచ్చట సంబంధము లేదు. జీవులు సర్వత్ర నిండియున్నారనియు, అందఱు జీవులు అన్నిశరీరములయందున్నారని చెప్పు నైయాయికుల మతము జూచినను ఏ యే పుణ్యాపాపములు ఎవ

రెవరికి సంబంధించిన వను విషయమును దెలుపుటకు మార్గము లేదు. కాబట్టి కొందఱు దరిద్రులుఁగను కొందఱు ధనికులుగను ఉండినను జీవులయొక్క సుఖ దుఃఖము లన్నిటికి ఒకే విధమగు కలయిక (ఏకత) ఘటిల్లదు.

## అభిసంధ్యాదిష్వపి చైవమ్. 52

ఇది చేయుదును; ఇది చేయను అను నీ యనుభవములయందు సామాన్యముగా ఆత్మ మనస్సుల కేర్పడు సంయోగమువలన అందఱి ఆత్మ సాన్నిధ్యమున జరుగు ఉద్దేశములు మొదలగు వానియందైనను సాంకర్యమేర్పడ వచ్చును గదా? ప్రతి జీవుఁను సర్వవ్యాపియే. అందు వలన ఆ యా జీవులు ఆ యా కర్మలను జేయుటకు పుట్టిరని యైనను విభాగము చేయుటకు సాధ్య పడదా? అనిన సమాధానము చెప్పు చున్నారు.

## ప్రదేశాదితి చేన్నాంతర్భావాత్. 53

సాంఖ్య వైశేషిక మతములందు చూప బడిన సుఖ సాంకర్యాది దోషములు నివారణ చేయబడవు. ఏలయనగా, ఆ మతముల యందు జీవు లందఱు సర్వవ్యాపకులే యని ఒప్పుకొందురు; ఈ జీవుని శరీరమిది: ఆ జీవుని శరీర మది యని నిర్ణయించుటకు వీలు లేదు. ఈ మతమున తెలుప బడిన దోషముల నెవరును నివారణ చేయ జాలరు. చక్కగా విచారించి చూచిన జీవుడు పరబ్రహ్మము యొక్క ప్రతిబింబము. ఉపాధి నానాత్వమువలన వేఱువేఱుగా ఉన్నట్లు అగపడు చున్నాడు. కాబట్టి మా సిద్ధాంతము నిర్వివాద మని అర్థము. అథవా దేహము మొదలగు వాటి సంబంధమువలన జీవు లొక కొలతకు లోబడిన వారు. అందుచే సుఖ దుఃఖాది సాంకర్యమున్నూ లేదు. అట్లుగాక వ్యవస్థాబద్ధమై జరుగు ననిన, వారును ఈ సిద్ధాంతమునే అంగీకరించి నట్లాయెను. ఏమైన నేమి? ఎట్లు కేలకు నైయాయికుల మతము అసమంజసము.

ఇది రెండవ అధ్యాయమున మూడవ పాదము.



## 2-వ అధ్యాయము-4-వ పాదము

అవ: ఇప్పుడు సూక్ష్మ (లింగ) శరీర విషయక మగు శ్రుతుల యందును పరస్పర విరోధము లేదని సమన్వయ పఱచు చున్నారు.

### ౧. ప్రాణోత్పత్త్యధికరణము

#### తథా ప్రాణాః. 1

పంచ భూతములవలె ఇంద్రియములు కూడా బ్రహ్మమునుండియే పుట్టినవని శ్రుతి స్పష్టముగ చెప్పుచున్నది.

#### గౌణ్యసంభవాత్. 2

ఇంద్రియములు ఎల్లప్పుడును ఉండునవి గావున వాటికి పుట్టుక యని చెప్పుట ఔపచారికము గదా? యనిన అట్లు కాదని తెలుపు చున్నారు. బ్రహ్మతత్త్వము నొకటి నెఱింగినచో సమస్తమును దెలిసి నట్టే యను నీ శ్రుతి ప్రతిజ్ఞ జేసి ఈ ప్రపంచ మంతయు పరబ్రహ్మ కార్యమై యున్నదని తెలుపుచుండగా వేఱని చెప్పుటకు వీలు లేదు. కావున ఇంద్రియ ప్రాణోత్పత్తిని చెప్పు శ్రుతి గౌణము గాదు.

#### తత్ప్రాక్ శ్రుతేశ్చ. 3

పంచ భూతములకంటెను మొదటనే ఇంద్రియములయొక్క ఉత్పత్తి చెప్పబడి యుండుట వలన అది ముఖ్యమే. అట్లు లేకున్న పంచ భూతములయొక్క పుట్టుక గూడా గౌణమే కావలసి వచ్చును.

#### తత్పూర్వకత్వా ద్వాచః. 4

"అన్నమయం హి సౌమ్య మనః" అను మొదలగు శ్రుతుల వలన మనస్సు, ప్రాణములు, ఇంద్రియములు ఉత్పత్తి గలవని స్పష్ట ముగా చెప్పబడినది. ఇంద్రియములు సంతతము ఉండునవి యని చెప్పరాదు.

### ౨. సప్తగత్యధికరణము

#### సప్తగతేర్విశేషితత్వాచ్చ. 5

శ్రోత్ర, త్వక్, చక్షుర్, జిహ్వా, ఘ్రాణములు, వాక్కు, మఱియు ఈ అంతఃకరణ మనునవి యేడు పరలోక గమన మొనర్చునవి

యేడింద్రియములే నని శ్రుతియందు చెప్పబడినది గదా? అనిన, సమాధానము.

హస్తాదయస్తు స్థితేఽతో నైవమ్. 6

పాణి, పాదము, పాయువు, ఉపస్థ ఇవియును జీవునితో గూడ శరీరమునం దుండుకొని, లోకాంతరమునకు వెళ్ళును. మొత్తము ఇంద్రియములు పదునొక్కటి.

3. ప్రాణాణుత్వాధికరణము

అవ: ఇంద్రియములు వ్యాపకము లని సాంఖ్యమతస్థులు చెప్పుదురు. అట్లు చెప్ప రాదని చెప్పుచున్నారు.

అణవశ్చ. 7

ఇంద్రియములు సర్వ వ్యాపకము లనినచో ఎంతో దూరమున నుండియు మాటలాడవలయును. తాక వలయును. ఇత్యాది కార్యము లగపడవు. అందువలన ఇంద్రియములు పరిచ్ఛిన్నము లని, సూక్ష్మము లని చెప్పుట యుక్తము. శ్రుతికి విరుద్ధమును కాదు.

౪. శ్రేష్ఠాధికరణము

శ్రేష్ఠశ్చ. 8

శ్రేష్ఠమగు ముఖ్య ప్రాణమున్ను బ్రహ్మము నుండియే పుట్టెనని శ్రుతి కలదు.

౫. నవాయురధికరణము

నవాయుక్రియే పృథగుపదేశాత్. 9

సాంఖ్యులు ఇంద్రియ వ్యాపారములే ప్రాణ మని చెప్పుదురు. కాబట్టి వాయువును మఱి తక్కిన ఇంద్రియములును చేరి చేయు క్రియయే ప్రాణమా? అనిన, సమాధానము: వాయువుకంటెను ఇంద్రియ క్రియల కంటెను వేఱగునది ప్రాణ మని తదుత్పత్తి శ్రుతి యందు చెప్పబడినది.

చక్షురాదివత్తు తత్సహశిష్ట్యాదిభ్యః. 10

శంక :- వాయు వన్న, ప్రాణ మన్న వేఱు వేఱు అర్థమని చెప్పి నట్లయిన ప్రాణ మనునది దేనినుండి కలిగిన దనిన, సమాధానము మహాభూతములనుండి పుట్టిన నేత్రాది ఇంద్రియములవలె ప్రాణమును వాయువుచే పుట్టిన ఒక వస్తువే. ప్రాణముయొక్క పుట్టుక ఇంద్రియముల పంక్తియందే వచ్చి యుండినందువలన ప్రాణము భౌతికమైనదని భావము.

శంక : ప్రాణము ఇంద్రియముల పంక్తియందే ఒకటియైనపట్ల నేత్రాదీంద్రియములకు విషయము లుండినట్లు ప్రాణమునకుగూడా విషయము ఉండవలయును గదా? అనిన,

అకరణత్వాచ్చ న దోషస్తథాహి దర్శయతి. 11

సమా : ప్రాణము ఇంద్రియము గాదు. అందుచే దాని కొక విషయ ముండవలసిన పని లేదు. జీవునకు ఉపకరణ మాత్రమై శరీర ధారణ చేయు చున్నది. ఇట్లున్నందువలన ప్రాణము వ్యర్థమున్ను కాదు.

పంచవృత్తిర్మనోవద్వ్యపదిశ్యతే. 12

ప్రాణ మనునది ఒక్కటే. అంతఃకరణ మొక్కటే యయినను ఎట్లు మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకార మని వేఱువేఱు వృత్తులచే నాలుగు విధము లయియున్నదో ఒక్కటి యగు ప్రాణమున్ను వేఱువేఱు వృత్తులచే ప్రాణ అపాన వ్యాన ఉదాన సమానములని అయిదు విధము లయియున్నది.

౬. శ్రేష్ఠాణుత్వాధికరణము

అణుశ్చ. 13

ప్రాణము సూక్ష్మ మైనది. పరిచ్ఛిన్న మైనది. ప్రత్యక్షముగ అగపడునది కాదు. అరూపము.

౭. జ్యోతిరాద్యధికరణము

అవ : ఇంద్రియములు తత్తదభిమాన దేవతల సహాయమున తమ తమ పనులను చేయునని చెప్పు చున్నారు.

## జ్యోతిరాద్యధిష్ఠానం తు తదామననాత్. 14

"అగ్నిర్వాగ్భూత్వా" ఇత్యాది వాక్యములచే నేత్రాది ఇంద్రియములు సూర్యాది అధిదేవతల వాస స్థానము లనియు, ఆ యా స్థానములందు తత్తదధిదేవత లుందురనియు శ్రుతి చెప్పుచున్నది. కాబట్టి ఇంద్రియములు అధిదేవతాప్రేరణచే తమ తమ కార్యములను చేయు చున్నవి.

శంక : ఇంద్రియములచే సాధింప బడిన సుఖ దుఃఖాదుల ననుభవించువారు ఇంద్రియాధిదేవతలేనా? కాదా? యనిన సమాధానము.

## ప్రాణవతా శబ్దాత్. 15

ఆ యా ఇంద్రియములు జీవునితో సంబంధము గలవియే గాని అధిదేవతలతో సంబంధముగలవి గావు. జీవుని కర్మానుసారము ఇంద్రియములను ప్రేరణ యొనర్చునే గాని స్వతంత్రముగ తమ ఇచ్ఛ వచ్చినట్లు గాదు. జీవుడే సుఖ దుఃఖాద్యనుభవి యగు భోక్త.

## తస్య చ నిత్యత్వాత్. 16

ఇంద్రియములచేత నగు సుఖ దుఃఖాద్యనుభవముల ననుభవించువాడు జీవుడే గాన ఇంద్రియములను ప్రేరణ యొనర్చుట యందును అతడే స్వతంత్రుడని అర్థము.

### ౮. ఇంద్రియాధికరణము

## త ఇంద్రియాణి తద్వ్యపదేశాదన్యత్ర శ్రేష్ఠాత్. 17

ప్రాణమును ఇంద్రియములతోగూడ చేర్చుకొని ఇంద్రియము లన్నియు పండ్రెండు గదా? యని అనెదరు. కాని అట్లు గాదు, ప్రాణమును విడచి నేత్రాది ఇంద్రియములనే సర్వ శ్రుతులును చెప్పుచున్నవి.

## భేదశ్రుతేః. 18

ప్రాణోత్పత్తిని దెలిపి తద్భిన్నముగ ఇంద్రియోత్పత్తి చెప్పబడి యున్నందువలన ప్రాణము ఇంద్రియము కాదని అర్థము.

## వైలక్షణ్యాచ్చ. 19

మంత్రములయందు ఈ ప్రాణము, ఇంద్రియములు వేఱు వేఱని చెప్పియుండుట వలన విచారించి చూడగా ప్రాణము ఇంద్రియము గాదని తెలియు చున్నది.

### ౯. సంజ్ఞామూర్తిక్లృప్త్యధికరణము

## సంజ్ఞామూర్తిక్లృప్తిస్తు త్రివృత్కుర్వత ఉపదేశాత్. 20

పంచభూతములను మాత్రమే బ్రహ్మము కలుగ జేసెను. చరాచరాత్మకము లగు నీ శరీరముల నన్నిటిని హిరణ్యగర్భుడు కలుగ జేసెనని చెప్పుదురు గదా! యనిన, అట్లు గాదు.

ఆ పరమాత్మయే అయిదు భూతములను ఒకదానియందొకటి జేర్చి పంచీకరించి సర్వవిధములచే నొప్పారు చరాచరాత్మకము లైన శరీరములను పుట్టించెను. అనగా పరబ్రహ్మమే హిరణ్యగర్భుని శరీరమునం దుండుకొని సమస్తమును కలుగ జేసెనని భావము.

## మాంసాదిభౌమం యథా శబ్దమితరయోశ్చ. 21

మాంసము మొదలగునవి, భూమినుండి కలిగినవి. జలమునుండి రక్తము మొదలగునవి, అగ్నినుండి ఎముకలు మొదలగునవి, వాయువు నుండి ప్రాణమును, ఆకాశమునుండి ఈ సమస్తమునకు అవకాశమిచ్చు స్థితియును ఈ ప్రకారముగా శరీర మంతయు పంచ మహాభూతములచే తయారయినది.

## వైశేష్యాత్తు తద్వాదస్తద్వాదః. 22

పంచీకరణ మన్నిటియందును సమానమై యుండినను శరీరమునందు పృథివిచే గలిగిన మాంసము మొదలగు ధాతువులు ఎక్కువగా నుండినందున పామరులు శరీరములను పృథివినుండి కలిగిన వని తెలియుదురు.

ఇది రెండవ అధ్యాయమున నాల్గవ పాదము.

# వైయాసికీ శారీరక మీమాంసా

# బ్రహ్మ సూత్రములు

## అథ తృతీయోధ్యాయః

## 3-వ అధ్యాయము-1-వ పాదము

ఈ అధ్యాయమున సంసారము దుఃఖ భాజనమని తెలిపి ఇక చాలుననిపించు లోక లోకాంతర గమనమును తెలుపుచున్నారు.

### ౧. తదంతరప్రతిపత్త్యధికరణము

అవ: స్మృతుల వలన గాని, యుక్తుల వలన గాని, పరమత సిద్ధాంతముల వలన గాని వేదాంత మతమున కేవిధముగను భంగము రాదు. పరస్పరము శ్రుతులకు విరోధమును లేదని బ్రహ్మజ్ఞాన సాధనములగు వైరాగ్యాదులను ఈ మొదటి పాదమున వర్ణించుచున్నారు.

**తదంతరప్రతిపత్తౌ రంహతి సంపరిష్వక్తః ప్రశ్ననిరూపణాభ్యామ్. 1**

ఈ జీవుడు శరీరమునకు కారణ మగు సూక్ష్మ భూతములతో సహా పరలోకమునకు పోవును.

పుణ్యము చేసిన వారు మరణానంతరము స్వర్గమునకు పోవుదురని చెప్పబడి యున్నది. అదెట్లనిన, లోకాంతరమునకు పోవునపుడు సూక్ష్మశరీరముతో కూడిన జీవుడు తాను ఈ లోకమున అగ్నియందు జేసిన హోమము, సమిత్తు, నేయి మొదలగు ద్రవ్యములతో గూడి సూక్ష్మరూపమున (వాసనా విశిష్టుడై) స్వర్గమునకు బోవును. ఇతడు ఈ లోకమునందు అగ్నిలో హోమము చేసిన సమిత్తు నేయి మొదలగు సూక్ష్మరూపములతో గూడ ద్యులోక మను నా అగ్నియందు హోమము చేయ బడును. అప్పుడు దేవతాకార మైన శరీరముచే నతడు ప్రకాశించును. ఆ దేవశరీరము స్వర్గమున కొంతకాలము సుఖమనుభవించి పుణ్య క్షయనాంతర మది వెన్నవలె కరగి పోవును. అప్పుడతనిని పిలిచికొని పోవు దేవతలు పర్జ మను అగ్నియందు హోమము చేతురు. అప్పుడు జల మగును. అనంతర మా జలమును పిలిచికొని పోవువారు పృథివి యను అగ్నియందు హోమము చేతురు. అంతట, జీవుడు వడ్లు, గోధుమలు మొదలగు ధాన్యరూపుడగును. ఆ

ధాన్యము అన్న రూపమున పురుషుడను అగ్నియందు హోమ మగును. అచ్చట రేతోరూపు డగును. రేతస్సు స్త్రీ యను అగ్నియందు హోమ మగును. అప్పుడా రేతస్సు గర్భమునందు పిండమై శిశు వగును. ఇట్లు పంచాగ్ని క్రమముచే గర్భ మేర్పడును. దీనినిబట్టి చూచిన జీవుడు సూక్ష్మ భూతములచే గూడియే శరీరమునుండి వెడలి పోవు చున్నాడని తెలియ వలయును. (ఛాందోగ్యోపనిషత్తున ప్రవాహణు డను రాజునకును, శ్వేతకేతువునకును జరిగిన సంవాదమునందీ పంచాగ్ని విద్యావిషయము గలదు.)

## త్ర్యాత్మకత్వాత్తు భూయస్త్వాత్. 2

త్రివృత్కరణ మనినను, పంచీకరణ మనినను ఒక్కటే. 'తాసాం త్రివృతమ్' అను మొదలగు శ్రుతులవలన ప్రతిభూతము భూతత్రయాత్మక మైనదే యని తెలియ వచ్చు చున్నది. అనగా హోమద్రవ్యములైన సమిధలు మొదలగునవి భూభాగము ఎక్కువగా గలవి. పాలు, పెరుగు మొదలగునవి జలభాగము ఎక్కువగా గలవి. నేయి అగ్నిభాగము ఎక్కువగా గలది. ఇట్లు హోమద్రవ్యములయందును మూడు భాగములు గలవు. అటులయిన జలము పురుష డగునని చెప్పినది ఎట్లు పొసగును? అనిన, సమాధానము హోమ ద్రవ్యముల యందు జలాంశమే అధికముగా యుండుట వలన జలము పురుషుడాయెనని చెప్పబడినది. ఇచ్చట జల మను మాటచే పృథివిని జలమును అగ్నిని ఈ మూడింటిని గ్రహించుకొన వలయును. ఆపః అను శబ్దమొక్కటే ప్రయోగింప బడినను పంచ భూతములను గురించి చెప్పినట్లే యని అర్థము. పంచ భూతములతో కూడియే జీవుడు శరీరమునుండి నిర్గమించును.

## ప్రాణగతేశ్చ. 3

ఇంద్రియములు, ముఖ్యప్రాణము వీటియొక్క నిర్గమనము చెప్పబడి యుండుటవలన పంచభూతములును జీవునితో కూడ పోవునుటయే సమ్మత మని తెలియ వలెను.

## అగ్న్యాదిగతిశ్రుతేరితి చేన్న భాక్తత్వాత్. 4

శంక: 'యత్రాస్య పురుషస్య మృతస్యాగ్నిం వాగప్యేతి'

ఈ పురుషుడు మృతుడైనపుడు వాక్కు అగ్నిని చేరును అని యీవిధముగ చెప్పు శ్రుతులచే మరణ కాలమునందు వాగింద్రియము అగ్ని యందును, చక్షురింద్రియము సూర్యుని యందును, మనస్సు చంద్రుని యందును, ఇంద్రియములు తమ తమ అధిదేవతల యందును చేరి పోవునని చెప్పబడి యున్నందువలన ఇంద్రియములు జీవునితో గూడ పరలోకమునకు పోవునని చెప్పు మాట ఎట్లు పొసగును? అనిన,

సమా : ఇంద్రియములు జీవునితో గూడి శరీరమునుండి నిర్గమించునని అనేక శ్రుతులు చెప్పుచున్నందువలన అవి తమ అభిమాన దేవతను పొందునని చెప్పిన మాట గౌణము. ఇంతవఱకు జీవునకు ఉపకారము చేయుచున్న అధిదేవతలు మరణ కాలమునందు ఆ యా ఇంద్రియములను విడిచి పోవుననియే ఆ శ్రుతికి తాత్పర్యము. అందుచేత ఆత్మేతర మగు దేవతలకు ఎచ్చటను చోటు లేదు. దేవ దేవుడు ఒక్కడే. అట్టియాత్మ తానె (నేనే) యని తెలియవలయును.

ప్రథమేఽశ్రవణాదితి చేన్న తాఏవ హ్యుపపత్తేః. 5

శంక : "తస్మిన్నేతస్మిన్నగ్నౌ దేవాః శ్రద్ధాం జుహ్వతి" ద్యులోకాగ్నియందు దేవతలు శ్రద్ధను హోమము చేయుదురను ఇత్యాది వచనములనుబట్టి ద్యులోకమను మొదటి అగ్నియందు శ్రద్ధను హోమము చేయుదు రనుమాటచే పాలు, పెరుగు మొదలగునవి హోమ మగునను విషయము పొసగదు గదా? యనిన,

సమా : ఇచ్చట శ్రద్ధ యనగా శ్రద్ధచే హోమము చేయబడిన ద్రవ్యములని మాత్రమే అర్థము. లోకమునందు పాలు, పెరుగు మొదలగు ద్రవ్యములనే హోమము చేతురు గాని నిరాకార మైన శ్రద్ధను హోమము చేయుట అను మాట కర్థము లేదు.

అశ్రుతత్వాదితి చేన్నేష్టాదికారిణాం ప్రతీతేః. 6

శంక : హోమ ద్రవ్యములు మాత్రము స్వర్గమునకు పోవునని వింటిమి గాని జీవుడు స్వర్గమున కెట్లు పోవు ననిన,

సమా : యజ్ఞయాగాదులను చేసిన వారు ధూమాది మార్గ

మున స్వర్గలోకమునకు పోవుదురని శ్రుతి చెప్పి యున్నది. కావున జీవు లచ్చటికి వెళ్ళుదురని తెలియవలెను.

### భాక్తం వాఽనాత్మవిత్త్వాత్తథాహి దర్శయతి. 7

"ఏష సోమో రాజా తద్దేవానామన్నం తం దేవా భక్షయంతి" ఈ సోమరాజు దేవతలకు అన్నము గావున వీనిని దేవతలు భుజింతురు.

"జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" అను వాక్యములచే జ్యోతిష్టోమాది యజ్ఞములవలన జీవులు స్వర్గమునకు పోవుదురని చెప్పబడి యున్నది. ఇట్లు స్వర్గ లోకమునకు పోయిన అచ్చట వారి భోగానుభవ మేమి? ఏమున్నది? ఆ కర్మఠులు దేవతలకు అన్న మగుదురని శ్రుతి చెప్పుచున్నది. అటులయిన పులులకు మృగములు ఎట్లో అటువలెనే ఈకర్మఠులు దేవతలకు ఆహార మగుదురు. అపుడు ఆ లోకాదులయందు వీరికి భోగ మెట్లు సంప్రాప్తించును? అనిన, సమాధానము. వారు దేవతల కాహార మగుదు రను మాటకు అర్థము వేఱు.

సోమయాజి శబ్దము ముఖ్యముగా యజ్ఞము చేసిన వానియందే ప్రయోగింప బడినది. పురుషులకు భార్యాపుత్రాదులవలె దేవతలకు ఆత్మ జ్ఞానము లేని ఈ జీవులు భోగ్యు లగుదురను విషయమును తెలుపుటకొఱకై పై శ్రుతి దేవతలు జీవులను భక్షింతు రని చెప్పుచున్నది.

ఆత్మజ్ఞానము లేని జీవులు దేవతలకు భోగ్యు లయ్యెదరు. కర్మఠులకు ఆత్మ జ్ఞానము లేదు. కావున వారు దేవతలకు దాసులై సేవకులై పని చేయువారై యుందురు. "అథ యోన్యాం దేవతాముపాస్తే అన్యోఽసావన్యోఽహమస్మీతి న స వేద యథా పశుః" తాను వేఱనియు, ఉపాసన చేయబడు దేవత వేఱనియు ఎవరు ఉపాసించెదరో వారు దేవతలచే పశువువలె నియోగింప బడిన వారగుదురని శ్రుతులు దెలుపుచున్నవి. దేవతలు పులులై కర్మఠులు వారికి ఆహారమగు రక్తమాంసపదార్థములవలె తినబడువారు గారు. దేవతలు అమృతమును తిందురట. కర్మఠుల మాంస మని అర్థము గాదు. జీవుడు సూక్ష్మరూపమున చంద్రలోకమునకు బోయి తన పుణ్యఫలమ ననుభవించి తత్క్షయానంతరము తిరిగి వచ్చునని తాత్పర్యము.

## ౨. కృతాత్యయాధికరణము

### కృతాత్యయేఽనుశయవాన్ దృష్టస్మృతిభ్యాం యథేతమనేవం చ. 8

చచ్చిన పిదప చంద్రలోకమునకు అనగా స్వర్గమునకు పోయిన జీవుడు అచ్చట అనుభవింప వలసినవియును, మనుష్యలోకమునందు దొరకనివియునగు సుఖముల ననుభవించి పుణ్య క్షయానంతరము ఈ లోకమునకు వెనుదిరుగును అని శ్రుతి చెప్పు చున్నది గదా? ఇట్లుండగా అతడు మరల ఈ లోకమున జన్మించుటకు కారణమేమి? అనిన,

ఏ కర్మలకు ఫలముగా అతనికి స్వర్గము దొరకినదో వాటి నను భవించి తీర్చును. ఆ పుణ్యము క్షయించుచు రాగా సాతిశయ క్షయ పతనాది దుఃఖ తాపముచే జలమయ మగు అతని శరీరము నీరగును (కరగును) ఆ పిదప ఈ లోకమునందు అనుభవింప వలసిన పుణ్య పాపముల శేషము గలవాడై వాడు వెనుదిరిగి పునరపి భూలోకమున పుట్టును. దీనికంతయు కారణము కర్మ శేషము. అజ్ఞాన కారణ మని అర్థము. అజ్ఞాననివృత్తి కానిది కర్మవాసనలు పోవు. వాసనలు వీడక కర్మ మానదు. కర్మతులు ఏతపు బానవలె ఇట్లు క్రిందు మీదుగ లోక లోకాంతరములను దిరుగుట తప్పదు.

### చరణాదితి చేన్నోపలక్షణార్థేతి కార్ష్ణాజినిః. 9

శంక: స్వర్గమునకు పోయిన వారు వెనుదిరుగుదురని చెప్పుట యందాధారముగల శ్రుతియందు 'రమణీయచరణాః' అని చెప్పు శ్రుతియందు మంచి ఆచరణ గలవారు మంచి జన్మమునకు, చెడ్డ ఆచరణ గలవారు చెడ్డ జన్మకు వచ్చెదరని యున్నందున జన్మమునకు కారణము శీలమే అన్నట్లాయెను గాని కర్మశేషము కారణ మెట్లగును? అనిన,

సమా: అయ్యా ఇచ్చట చరణ మనగా లక్షణార్థముచే కర్మ శేష మనియే అర్థమని కార్ష్ణాజినిఆచార్యుల అభిప్రాయము.

ఆనర్థక్యమితి చేన్న తదపేక్షత్వాత్. 10

కర్మ శుభాశుభ జన్మములకు కారణమై యుండినను చరణ. శ్రుతి నిరర్థక మేమియు గాదు. ఆచారమువలన ప్రయోజనము లేక పోలేదు. ఆచారము కర్మకు ప్రధానమగు నొక అంగము. ఎట్టి ఉత్తమ ఫలము నిచ్చు కర్మ మైనను సదాచారవంతునిచే చేయబడి నపుడే సంపూర్ణమగు ఫలము నిచ్చును. కావున చరణ శ్రుతియు కర్మశేషమే కారణ మను అర్థమును తెలుపు చున్నది.

సుకృత దుష్కృతే ఏవేతితు బాదరిః. 11

బాదరిమహాముని యన్నను పుణ్యపాపములే ఈ పదముల కర్థ మని చెప్పు చున్నారు.

3. అనిష్టాదికార్యాధికరణము

అనిష్టాదికారిణామపి చ శ్రుతమ్. 12

శంక: పాపకర్మలు చేసిన వారును చంద్రలోకమునకు పోవుదు రని శ్రుతియందు చెప్పబడి యున్నది. ఈ లోకమును విడిచి వెళ్ళువా రెల్లరు చంద్రలోకమునకు పోవుదురని ఇట్లు శ్రుతి చెప్పుచున్నందు వలన పాపులు, పుణ్యాత్ములు అందఱును స్వర్గమునకు బోవుదురన్న ట్టాయెను. అటులయినచో పుణ్యవంతులకు మాత్రమే స్వర్గమనుమాట ఏమి? అనిన,

సంయమనే త్వనుభూయేతరేషామారోహావరోహౌ తద్గతి దర్శనాత్. 13

సమా: ఈ లోకమును విడిచి వెళ్ళు పాపులు నరక మునందు దుఃఖము ననుభవించి ఆ పిదప వెనుదిరుగుదురని శ్రుతి యున్నది. "న సాంపరాయః ప్రతిభాతి బాలం పునః పునర్వశమాపద్యతే మే" అజ్ఞాని యగు వానికి సత్కర్మాపేక్ష పుట్టదు. వాడు మాటిమాటికి యముడనగు నా స్వాధీన మగుచుండును. ఈ విధముగ శ్రుతులయందు నై అర్థమే చెప్పబడి యున్నది. కాబట్టి పాపులకు స్వర్గమున ప్రవేశము లేదు. సర్వులు స్వర్గమునకు పోవుదురని చెప్పు మాటకు పుణ్యాత్ము లనియే అర్థము గ్రహింపవలెను.

స్మరంతి చ. 14

పాపులకు నరకము గలుగునని స్మృతియు జెప్పుచున్నది.

అపిచ స_ప్త. 15

పాపులకు నరకమే గతి యనియు, అది ఏడు విధములై యున్న దనియు పౌరాణికులును చెప్పుదురు.

తత్రాపిచ తద్వ్యాపారాదవిరోధః. 16

ఆ నరకలోకమున చిత్రగుప్తుడు మొదలగువా రున్నారు గదా. వారును పాపులేనా? లేక, నరకలోకమున కత డధిపతియా? అనిన, నరకమునకు చిత్రగుప్తాదులు అధికారు లయినను యముని ఆజ్ఞానుసారముగ వ_ర్తించు అధికారులే కాని యాతనానుభవ మనుభవించుటకు వచ్చిన పాపులు కాదు.

విద్యాకర్మణోరితి తు ప్రకృతత్వాత్. 17

కర్మఠులు పితృయాన మను మార్గమున స్వర్గమునకు, ఉపాసకులు దేవయాన మను మార్గముచే బ్రహ్మలోకమునకు వెళ్ళుదురని అన్ని శ్రుతులు చెప్పుచున్నవి. పాపులు ఏ త్రోవను బోవక క్రిమి కీటకాదులై పునరావృ_త్తి బహుళమైన సంసారమున పుట్టుచు జచ్చుచుందురు.

న తృతీయే తథోపలబ్ధేః. 18

శంక: వెనుదిరిగి రావలసినవా రెల్లరు తమకు ప్రా_ప్తమగు దేహమునకై ఐదవ అగ్నియగు స్త్రీయందు హోమము గావలసిన స్థితికి రావలయునన్న చంద్ర లోకమునకు బోవలయును గదా? యనిన,

సమా: పాపులు 'పునరపి జననం పునరపి మరణం' సారెసారెకు పుట్టుట చచ్చుట యను మూడవ త్రోవ కలిగి యుందురు. మనుష్య శరీరమును పొందు వారికి మాత్రమే స్త్రీ యను పంచమాగ్నియందు హోమము కావలసి యుండును. సస్యములైనో, క్రిమికీటకములైనో పుట్టువారికి పై అయిదవ అగ్ని అవసరము లేదు. కొందఱు పాపులు

ఇట్లుకూడా జన్మింతురు. అందుచేత వారు చంద్రలోకమునకు పోవల సిన అగత్యము లేదు.

స్మర్యతేஉపి చ లోకే. 19

మఱియు ఐదవ అగ్నియందు హోమమైన వారు మాత్రమే మనుష్యు లగుదురు. అట్లు గానిపట్ల మనుష్యులు గారు అను నీ నియమము సర్వత్రా అన్వయము గాదు. మహాభారతాది గ్రంథముల యందు ఇట్లు తెలియ బడుచున్నది. ద్రోణుడు, ధృష్టద్యుమ్నుడు, సీత, ద్రౌపది మొదలగు వారందఱు అయిదవ అగ్నియందు హోమము కాబడిన వారు కారని తెలియుచున్నది. కావున అవతార జన్మలకు గూడా ఈ నియమము లేదు. మఱియు పాపాత్ముల శరీరప్రాప్తి విషయమునందును ఈ ఐదవ ఆహుతి లేదనుటలో విరోధము లేదు.

దర్శనాచ్చ. 20

ప్రత్యక్షముగ ఈ లోకమునందు అండజ, స్వేదజ, జరాయుజ, ఉద్భిజ్జము లని నాలుగు విధములైన ప్రాణుల ఉత్పత్తి గలదు. అందు చెమటచే పుట్టు క్రిమికీటకాదులందును భూమిని వ్రయ్యలు చేసికొని పుట్టు వృక్షాదులయందును పై ఐదవ అగ్నియం దాహుతి లేదు. కాబట్టి శరీరోత్పత్తికి అయిదాహుతు లనుట నియమము కాదు. కాబట్టి పాపాత్ములగు దుశ్శీలురు సోమరాజులు కావలయు ననుటకు ఈ ఆహుతిపద్ధతు లేమియు ఆధారము కాదు.

తృతీయశబ్దావరోధః సంశోకజస్య. 21

శంక: గ్రుడ్డునుండి పుట్టుట, జర యను గర్భకోశమునుండి వెలు వడుట, భూమిని వ్రయ్యలు చేసికొని వెలువడుట ఇట్లు అండజ, జరా యుజ, ఉద్భిజ్జము లనునవి మూడే గదా? అందులో స్వేదజము లని నాలుగవదిగా జెప్పితిరి. అదేమి యనిన?

సమా: మూడే సంఖ్య గలవి. నిజమే. ఆ మూడవ సంఖ్యను చెప్పినప్పుడు ఉద్భిజ్జములను వాటియందే స్వేదజములు, అంతర్గత మైనవని ఎఱుగ వలయును. ఎందుచేత ననగా, భూమినుండి పైకి లేచుట మఱియు నీటినుండి పైకి లేచుట యను నింతమాత్రమే భేదము.

## ౪. సాభావ్యాపత్త్యధికరణము

### సాభావ్యాపత్తిరుపపత్తేః. 22

శంక: స్వర్గమునకు పోయిన వారు వెనుదిరుగు నపుడు స్వర్గము నుండి ఆకాశము, ఆకాశమునుండి వాయువు, ధూమము, అభ్రము, మేఘము, మొదలగు లోకముల మూలమున వచ్చెదరు గదా? వచ్చు నప్పుడు ఆ మార్గ మధ్యమున వారి కేమైనను భోగమున్నదా? లేదా? అనిన,

సమా: వారికి ఆ లోక సంబంధమగు అచ్చటి భోగమే తప్ప మఱి భోగ మేమియు లేదు. పరలోక సాధన మగు పుణ్య మంతయు తీరిపోవుటవలన మరల స్త్రీగర్భమును చేరునంత పర్యంతము శరీరము లేనందుచే కేవల సూక్ష్మ శరీర మాత్రులై యుండుట వలన భోగాను భవ సామర్థ్య ముండదని అర్థము.

## ౫. నాతిచిరాధికరణము

జీవుడు మరల ఈ లోకమునకు తిరిగి వచ్చు మార్గ విషయమున ఎచ్చటనుండి ఎంతవఱకు త్వరగా వచ్చును? ఎచ్చటనుండి ఆలస్యముగ వచ్చుననిన,

### నాతిచిరేణ విశేషాత్. 23

ఆకాశము మొదలుకొని ఒక లోకమునుండి ఇంకొక లోకమునకు వచ్చుటలో తడవుండదు. కాని వడ్లు, గోధుమలు మొదలగు ధాన్యములందు చేరిన పిదప పురుషునితో సంబంధ మొందుటయందు కొంత ఆలస్య ముండును.

## ౬. అన్యాధిష్ఠితాధికరణము

### అన్యాధిష్ఠితే పూర్వవదభిలాపాత్. 24

'వ్రీహి యవా ఓషధివనస్పతయ స్తిలమాషా ఇతి జాయంతే' ఆ జీవులు ఈ లోకమునందు వడ్లు, యవలు, నానావిధములగు ఓషధులు, చెట్లు, నువ్వులు, మినుములు ఇత్యాది అనేక విధములుగా ఏర్పడు చున్నను అచ్చట కర్మానుభవము లేదు. కాబట్టి ధాన్యాది

జన్మముల పొందిన జీవులు వేఱుగా గలరు. స్వర్గమునుండి దిగి వచ్చు వారు ఆ యా పదార్థరూపులై బహుకాల ముండుటయే గాని సుఖ దుఃఖము లేమాత్రమును లేవు. కావున జీవులకు వృక్షాదులచే సంబంధము కలదు గాని సుఖ దుఃఖాద్యనుభవము లేదు. వృక్ష ధాన్యాది రూప జన్మములయందుండునపుడు ఎండ, గాలి, వర్షము మొదలగు వాటిచే గలుగు సుఖ దుఃఖములు మాత్ర ముండును. స్వర్గమునుండి వచ్చు కర్మఠులు పై వృక్షాది జన్మసంబంధమును మాత్రము పొంది వెళ్ళుదురు. అచ్చట పరిణామము లేదు.

శంక: చంద్రలోకమునుండి మఱల వచ్చు జీవులు అనగా కర్మఠులు యజ్ఞమును జేయునపుడు దేవ పూజాత్మకమైన పుణ్యముతో సహా పశు హింసా రూప మగు పాపమును చేసి యుందురు. ఆ రెంటి యందు పుణ్యము స్వర్గలోకానుభవముచే తీరి పోవును. మిగిలిన పాప ఫలానుభవము కొఱకై ధాన్యాది జన్మముల నెత్తి తత్ఫల మనుభవించిన తప్పేమి?

## అశుద్ధమితి చేన్న శబ్దాత్. 25

సమా: శ్రుతి చెప్పు మాటకు పాపము కలుగునని అర్థము కాదు. యజ్ఞమునందు పశుహింస యనునది అంగీకరింప బడినది. కాబట్టి కర్మఠులకు ధాన్యాది జన్మము లొందిన ఈ జీవత్వమునందు కేవల సంబంధ మాత్రమే గాని భోగానుభవము లేదు.

## రేతఃసిగ్యోగోఽథ. 26

ధాన్య సంబంధము నొందిన జీవులు అన్నమై పురుషుని పొట్ట చేరి రేతోరూపు లగుదురు.

## యోనేశ్శరీరమ్. 27

పురుషుని గర్భమును పొందిన కర్మఠులు రేతో (వీర్యము) మూలమున స్త్రీగర్భమును చేరుదురు.

ఇది మూడవ అధ్యాయమున మొదటి పాదము

—o—

## మూడవ అధ్యాయము-రెండవ పాదము

అవ: జీవుని అవస్థ లన్నియు అసత్యము లను మూలమున జీవేశ్వరుల విమర్శను దెలుపు చున్నారు. అనగా త_త్త్వంపద విచారణ చేయబడును.

### ౧. సంధ్యాధికరణము

### సంధ్యే సృష్టిరాహ హి. 1

'అథ తత్ర రథాన్ రథయోగాన్ పథ స్సృజతే' స్వప్నావస్థయందు రథములును రథములతో సంబంధించిన వారును మఱియు ఆ యా మార్గములును సృష్టి యగుచున్నవని ఆ పదార్థములను గుఱించి శ్రుతి చెప్పుచున్నది. కాబట్టి స్వప్నజగత్తువలె ఈ జాగ్రజ్జగత్తు కేవలము దృశ్యమాత్రమే యని చెప్పుటకు రాదు.

### నిర్మాతారం చైకే పుత్రాదయశ్చ. 2

జీవుడు స్వప్నమునందు తన మనస్సునకు వచ్చినట్లు స్వప్న ప్రపంచమును పుట్టించునని శ్రుతి యుండుట వలన "య ఏషు సు_ప్తేషు జాగ_ర్తి కామం పురుషో నిర్మిమాణః" అను శ్రుతి ఉన్నందువలన అచ్చట నగపడు భార్యబిడ్డ లందఱు నిజ మనియే అంగీకరింప వలయును. వారందఱు కేవల ప్రతిభాసమాత్రులే యనిన, జీవుడు తన మనస్సునకు వచ్చినట్లు సృష్టించుననుమాట రి_క్త యగును. శు_క్తిరజతము, రజ్జుసర్పము కల్పించిన వారి ఇచ్ఛకు అధీనమై యుండినట్లు లోకమునం దగపడుచున్నది. ఇట్టి జీవుడు స్వప్నమునందు జాగ్రత్తును సృష్టించును. కావున అతడెప్పుడును ప్రపంచముతో కూడిన వాడే యగును గాని ప్రపంచముయొక్క సంబంధము లేని బ్రహ్మము కాడు. అని ఈ విధమున రెండు సూత్రములచే చేయబడిన పూర్వపక్షమును ఖండించు చున్నారు.

### మాయామాత్రంతు కా_ర్త్స్న్యే నానభివ్య_క్తస్వరూపత్వాత్. 3

స్వప్నజగత్తు అసత్య మెట్లనగా చేయువాడు, చేయు సాధనము ఇత్యాది కార్య కారణములతో కూడి పదార్థము అగపడుట లేదు. స్వప్నమునందు జగదుత్ప_త్తికి తగిన సాధనములు లేవు. స్వప్నమున

అగపడు రథ గజాశ్వము లెల్లయు శుక్తి రజతమువలె మిథ్యాప్రతీతి మాత్రములు; స్వప్నమునందు రథ గజాశ్వాదులు పుట్టునని శ్రుతియం దొకమాట ఉన్నంత మాత్రముననే అది నిజము గాదు. అచ్చట ఆ పదార్థముల ఉత్పత్తికి తగు దేశకాలాదులును లేవు. ఈ చెప్పిన శ్రుతియొక్క తాత్పర్యమును వేఱే. జీవుడు తన ఇష్టానుసారము సృష్టించు ననుటయు అంతమాత్రమే. అది లోకానుభవమునకును విరోధము. జీవుడు తన ఇచ్ఛ చొప్పున స్వప్నము సృష్టించునదైన దుష్ట స్వప్నము లెందుకు గలుగ వలెను? కాబట్టి ఈ స్వప్నపదార్థములు కేవల ప్రతీతి మాత్రములే. జీవులు చూచు వారగుటచే ఆ పదార్థముల కంటె వేఱని అర్థము.

శంక : అది శుభాశుభ సూచక మని చెప్పుదురే? స్వప్నమును అసత్యమని చెప్పుట ఎట్లు? అనిన,

సూచకశ్చ హి శ్రుతేరాచక్షతే చ తద్విదః. 4

సమా : ఆ స్వప్న పదార్థములు స్థిరములు గావు. జీవకల్పితము లగుటచే అసత్యములు. ముత్యపు చిప్పయందు భ్రాంతిచే కల్పింపబడిన వెండి స్వయముగా అసత్య మయ్యును నిత్యమగు సంతోష బుద్ధిని క్షణ కాలము కలిగించునట్లు ఈ స్వప్న పదార్థములు కూడా స్వయముగా అసత్యము లైనను సత్య పదార్థములవలె అగపడును. అంతియే కాని శుభాశుభ సూచక సంబంధములు కావు. ఏది శుభము ? ఏది అశుభమని చెప్పుదురో, ఆ రెండును స్వరూపమునందు కల్పితములు. తత్త్వనిష్ఠను యథార్థమును తెలుపుటకొఱకై స్వప్నోదాహరణము చెప్ప బడినది. కాబట్టి స్వప్నజగత్తువలె జాగ్రద్రూప మగు నీ ప్రపంచమును అసత్యమని తెలియుటే ఇందులకు ప్రయోజనము. వస్తుతః జీవుడు ఈ ప్రపంచముయొక్క సంపర్కము లేక అసంగాద్వయమగు బ్రహ్మమైయే యున్నాడు. బుద్ధిపరిణామ మగు స్వప్నము మిథ్యయని నిరూపించిన పిదప, మిగిలిన గాఢనిద్ర గాని మెలకువ గాని మూర్ఛ గాని సంధియము ఈ మొదలగు సమస్తము మిథ్య యనుట కావంతయు సందియము లేదు.

శంక : జీవబ్రహ్మ లొక్కటే యనిన ఈశ్వర సంకల్ప రూప

మగు ప్రపంచ మెట్లు సత్యమో జీవుని సంకల్పముచే సృష్టింప బడిన స్వప్నము మాత్ర మెందుకు సత్యమని చెప్ప రాదు? జీవునకును, పరమేశ్వరునకును భేదము లేక పోయినను జీవుడు మాయచే ఆవృతమై యున్నందువలన అట్లు గాదేమో? కాని ఈశ్వరుని ధ్యానించుట వలన మోక్ష మగును. మఱియు జీవబ్రహ్మలు ఒక్కటే యగుచు జీవుని యందు సంతతము ఆనంద మెందుకు భానము కాదు? అనిన,

పరాభిధ్యానాత్తు తిరోహితం తతో హ్యస్య బంధవిపర్యయౌ. 5

సమా : అతడు దేహేంద్రియాదులే తానని అధ్యాస నొందుచు ఈశ్వరత్వము నెఱుగ కున్నందువలన అతని స్వరూపానందమునకు ఆవరణమై నేను కర్తను, భోక్తను అనునట్టి అవిద్యావృత్తిచే బంధము కలిగి నట్లున్నది కాని వస్తుతః అట్లు లేదు. ఈశ్వర (బ్రహ్మ) జ్ఞాన మొందిన మోక్షము స్వయంసిద్ధము.

దేహయోగాద్వా సోఽపి. 6

తత్త్వతః జీవుడు జ్ఞానానందరూపుడే అయినను దేహేంద్రియములను తాననుకొను అతద్బుద్ధివలన జీవభావము పెనగొని యున్నది. విచారించిన ద్వైతప్రతీతి యనునది అసత్యము. జీవుడు పరబ్రహ్మమే.

౨. తదభావాధికరణము

అవ : ఇంతవఱకు స్వప్నము మిథ్యయని చెప్పి ఇప్పుడు సుషుప్తిని గుఱించి చెప్పు చున్నారు.

తదభావో నాడీషు తచ్ఛ్రుతేరాత్మని చ. 7

జీవుడను రాజు జాగ్రదవస్థయందు దేహేంద్రియాద్యభిమానముతో గూడి వర్తించుచు గాఢ నిద్రయందు తదభిమానమును వీడి నాడులు, హృదయము అను నీ మొదలగు కోటలను దాటి బ్రహ్మమను పై శిఖరమునందు (మహలునందు) పరుండు చున్నాడు. జీవుడను రాజు జాగ్రత్స్వప్నములయందు అచ్చటచ్చట చూచిన దేశకాలాది విషయ వాసనలచే శరీరమను పట్టణమును జేరి, సూక్ష్మ మగు నాడీమూలమున హృదయ స్థానమును జేరి బ్రహ్మమయుడై యుండును.

అతః ప్రబోధోఽస్మాత్. 8

'ఏతస్మాదాత్మాన స్సర్వే ప్రాణా వ్యుచ్చరంతి' పరబ్రహ్మము నుండియే అందఱు జీవులు బయలుదేఱి వచ్చు చున్నారని శ్రుతి చెప్పు చున్నది. దీనిని బట్టి విచారించిన నాడులు అను నీ మొదలగు స్థానములను చెప్పుటలో పరబ్రహ్మమే నని శ్రుతిచే చెప్పబడినదిగా తెలియుచున్నది. కాబట్టి బ్రహ్మమునందు నిద్రించిన జీవుడు నిద్రానంతరము దేహేంద్రియాదులయం దభిమానమునొంది జాగ్రద్విశ్వప్రపంచమును చూచుటకై హృదయము, నాడి యను నీ ప్రదేశములనుండి శరీరమను పురమునకు వచ్చి అసంగముగ నుండును. కాబట్టి స్థానభేదమును జెప్పు శ్రుతులకు పరస్పర భేదములేదు. జీవుడు పరబ్రహ్మమేనని తెలియ వలయును.

3. కర్మానుస్మృతిశబ్దవిధ్యధికరణము

స ఏవతు కర్మానుస్మృతిశబ్ద విధిభ్యః. 9

శంక: గాఢమగు సుషుప్తియందు జీవుడు బ్రహ్మమున లీనమై మఱుసటి దినము మరల అతడే లేచునా? లేక వేఱొకడు లేచునా! బ్రహ్మమునందు అభేద మొంది ఒక్కటిగ నున్నాడు. కావున వేఱొక జీవుడై లేచునేమో కదా? యనిన,

సమా: వెనుకటి దినమున బ్రహ్మమునందు లీనమైనవాడే మఱుసటి దినమున లేచును. అందువల్లనే అతనికి వెనుకటి పను లన్నియు జ్ఞప్తికి వచ్చును. దినమునకు ఒక జీవుడు వేఱై లేచినచో 'యజేత' యజ్ఞాదులను చేసినవా డొకడు, దాని ఫలము ననుభవించు వాడు వేఱొకడు కావలసి వచ్చును. కాబట్టి అట్లు గాదు.

4. ముగ్ధేఽర్ధసంపత్త్యధికరణము

ముగ్ధేఽర్ధసంపత్తిః పరిశేషాత్. 10

మూర్ఛ యనునది జాగ్రదాది ఏ అవస్థలయందు చేరదు. మూర్ఛితు డగు జీవుడు బ్రహ్మమునందు సగము చేరి యున్నట్టుగ నుండును. కాని గాఢ నిద్రితునివలె పూర్ణుడై ఒక్కటిగా నుండడు. మూర్ఛితునకు వెలుపలి పదార్థముల జ్ఞానము లేకుండినను లోలోపల దేహమును పురస్కరించుకొని కించిద్దుఃఖానుభవముండియే యుండును.

వణకుట, చొంగ వేయుట తన్నుకొనుట మొదలగు మరణ ధర్మము లుండుటచే ఈ మూర్ఛ యనునది జాగ్రత్స్వప్నసుషుప్తు లను మూడ వస్థలలో దేనియందును చేరదు. ఇది మరణోన్ముఖ మైన ప్రత్యేక మగు అవస్థ యని తెలియవలెను.

## ౫. ఉభయలింగాధికరణము

అవ: ఇంతవఱకు జీవుని యదార్థ స్వరూపమును నిరూపించుచు ఉపాధివలననే గాని స్వభావముగా దేనితోను జీవునకు సంబంధము లేదనియు స్వప్రకాశుడనియు నిర్ణయింప బడినది. ఇక పరబ్రహ్మమును గుఱించి తెలుపుచున్నారు.

### న స్థానతోఽపి పరస్యోభయలింగం సర్వత్ర హి. 11

బ్రహ్మమునకు సగుణ నిర్గుణత్వము లున్నవా? లేవా? యనిన, జీవుడు ప్రపంచ సంబంధము లేని వాడని తెలుపుట మైనది. ఇపుడు బ్రహ్మము జగత్సంబంధము లేని దనియు సగుణత్వము నిర్గుణత్వ మనునవి రెండును విరుద్ధ ధర్మములు గావున నొకచోట ఉండ వని యును ఉపాధిచే కల్పింప బడిన సగుణత్వము సత్యము కాదు. పృథి వ్యాది భూతము లన్నియు బ్రహ్మమునందు మిథ్య (లేనివి) కాబట్టి అగపడు ఈ సగుణత్వ మసత్య మనియు, పరబ్రహ్మ మద్వితీయ మనియు, 'అశబ్ద మస్పర్శం' అను మొదలగు శ్రుతులచే బ్రహ్మము నిర్వికారము, అద్వయ మనియు బోధింప బడుచున్నది.

### న భేదాదితి చేన్న ప్రత్యేకమతద్వచనాత్. 12

శంక: అతడు సర్వకర్త, సర్వకాము డను మొదలగు సగుణ త్వమును తెలుపు శ్రుతు లుండుటవలన సగుణుడే యనవలసి వచ్చును గదా? యనిన,

సమా: ఉపాధి మూలమున భిన్నభిన్నముగ నగపడుచున్నను ఆకాశమువలె ఆ చేతనము అనంతము అను అర్థముగల శ్రుతు లనంత ములుగా ఉన్నవి. మఱియు నది నిరుపాధిక మగు బ్రహ్మ మనియే తెలుపుచున్నవి.

## అపి చైవమేకే. 13

మఱి కొందఱు ఈ విధముగా పరబ్రహ్మమునందు భేదమేమియు లేదని చెప్పుచున్నారు. "మనసైవ వేదమాప్తవ్యం నేహ నానాస్తి కించన, మృత్యోస్స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి" ఆ పరబ్రహ్మమును గురూపదిష్ట శ్రుత్యర్థావలంబన పూర్వకముగా నిర్మల మనస్సుచే నెఱుగ వలయును. అప్పుడు భేద మేమియును భానము కాదు. భేదము అసలు లేదు. బ్రహ్మమునందు భేద మున్నదని ఎవడు తలంచునో అతడు జనన మరణ రూప సంసారమును సారెసారెకు పొందు చుండును.

## అరూపవదేవ హి తత్ప్రధానత్వాత్. 14

పరబ్రహ్మము నిర్గుణము నిర్విశేష మనియే చెప్పవలయును. శ్రుతులయందు సగుణ నిర్గుణ లక్షణములు రెండును చెప్పబడి యుండినను అందు నిర్గుణ శ్రుతులే ప్రధానము. ఉపక్రమాది లింగములచే విచారించి చూచిన శ్రుతు లన్నిటికి నిర్గుణ పరబ్రహ్మమునందే తాత్పర్య మని తెలియు చున్నది. అది సగుణ మను మాటలు గౌణములు. ఔపాధికములు. అందుచే పరబ్రహ్మము నిర్గుణము, నిర్విశేష మని సిద్ధాంతము.

## ప్రకాశవచ్చావైయర్థ్యాత్. 15

సగుణ మనిత్య మనిన, సగుణోపాసకులకు బ్రహ్మ లోకము ప్రాప్తించు నను విషయము ఏమి కావలయును? అనిన, సమాధానము.

సూర్యప్రకాశము సర్వవ్యాపక మై ఒక్కటై యుండినను గవాక్షములు, నానాఛిద్రములు మొదలగు ఆ యా ఉపాధుల భేదమువలన ఆకార భేదమును చెందునట్లు సర్వవ్యాపక మగు బ్రహ్మము మాయోపాధిభేదము వలన వివిధము లగు నామ రూపాదులు గలదిగ దోచినను తన నిర్గుణత్వమునకు అద్వయత్వమునకు భంగము లేదు. ఇందువలన బ్రహ్మము సాకార మని ఉపాసకుల అనుగ్రహార్థమై అట్లు వర్ణింప బడినది. ఉపాసనాపర మగు శ్రుతులు వ్యర్థములు కావు.

## ఆహ చ తన్మాత్రమ్. 16

వేదము బ్రహ్మమును చైతన్యమాత్ర మని చెప్పుచున్నది. "స యథా సైంధవఘనోఽనంతరోఽబాహ్యః కృత్స్నో రసఘన ఏవ. ఏవం వా అరేఽయ మాత్మాఽనంతరోఽబాహ్యః కృత్స్నః ప్రజ్ఞానఘన ఏవ". ఇత్యాది శ్రుతులు బ్రహ్మమును నిర్గుణ మనియే తెలుపుచున్నవి. సైంధవ ఘనమునందు లోను, వెలిని ఉప్పదనమే యున్నట్లు బ్రహ్మము బహిరంతరములను భేదము లేక అంతటను ఏకమై యున్నది.

## దర్శయతి చాథో అపి స్మర్యతే. 17

'జ్ఞేయంయత్తత్ప్రవక్ష్యామి యత్ జ్ఞాత్వాఽమృతమశ్నుతే, అనాదిమత్పరం బ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే." అని స్మృతులు కూడా బ్రహ్మము నిర్విశేషము, నిర్గుణ మని తెలుపు చున్నవి.

## అత ఏవ చోపమా సూర్యకాదివత్. 18

సగుణ స్వరూపము నీటియందు ప్రతిబింబించిన సూర్య చంద్రులకు సమానమైన దని శ్రుతిస్మృతులు చెప్పుచున్నవి. జలమునందగపడు ప్రతిబింబమునకు జలముయొక్క పొడుగు వెడల్పు మొదలగు ధర్మములు ఆరోపింప బడునట్లు పృథివ్యాది భూతములందు ప్రతిబింబితుడైన పరమాత్మకు గంధ రసత్వాది గుణముల నారోపించుట యగును. కాని ఆరోపితము లన్నియు అసత్యములు గావున బ్రహ్మమునకు సగుణత్వము నిజము కాదు.

## అంబువదగ్రహణాత్తు న తథాత్వమ్. 19

శంక: ఈ చెప్పిన దృష్టాంతము విరుద్ధ మైనది. ఎందుకనగా, సావయవ పదార్థమునకు ప్రతిబింబ మగును. మఱియు నీటివలె పృథివి మొదలగునవి స్వచ్ఛ ద్రవ్యములు గావు. అందుచేత బ్రహ్మము ప్రతిబింబించు ననుట పొసగదని ఆక్షేపము.

## వృద్ధిహ్రాసభాక్త్వమంతర్భావాదుభయసామంజస్యాదేవమ్. 20

సమా: ఉపమాన మేకదేశీయ మని తెలియవలెను. జలమునందువలె బ్రహ్మమునకు ప్రతిబింబము లేక పోయినను అయ్యది పృథి-

వ్యాదు లన్నిటిని ప్రకాశింప జేయునదై అధిష్ఠానమై యున్నది. అందు చేత పృథివ్యాది గుణ ధర్మములు అందారోపించినను అధిష్ఠాన మగు బ్రహ్మమునకు బాధ లేదు. ఇంతమాత్రమున ఉదాహరణ సరియైనది కాదని చెప్పరాదు. బ్రహ్మప్రతిబింబ మనుమాట గౌణముగ తెలియ వలెను. అస్తి భాతి ప్రియాత్మక మగు బ్రహ్మము ఆధార మని భావము.

దర్శనాచ్చ. 21

శ్రుతివలన కూడా ఈ దృష్టాంతము సరియైనదని చెప్పబడినది. "పురస్స పక్షీ భూత్వా పురః పురుష ఆవిశత్" ఆ పరబ్రహ్మము సూక్ష్మ శరీరాభిమానియై ఇంద్రియోత్పత్తికంటె పూర్వము తాను సృజించిన శరీరములను ప్రవేశించెను అను శ్రుతులచేత బ్రహ్మము సూక్ష్మ శరీరము ద్వారా దేహమున ప్రవేశించెనని తెలియుచున్నది. సర్వజీవుల అంతః కరణములు సత్త్వ గుణమునందు బుట్టినందుచే స్వభావముగా స్వచ్ఛ మైనవి. అందు ప్రతిబింబించిన బ్రహ్మమునకు సత్యకామేచ్ఛాది మిథ్యాధర్మములు ఆరోపించుటవలన, సూర్యచంద్రులకువలె బ్రహ్మము నకు ప్రతిబింబమును అంగీకరించినంత మాత్రమున తన్నిర్విశేషత్వమున కేమాత్రమును భంగము రాదు.

౬. ప్రకృతైతావత్త్వాధికరణము

ప్రకృతైతావత్త్వం హి ప్రతిషేధతి తతో బ్రవీతి చ భూయః. 22

"అథాత ఆదేశో నేతి నేతి." అను నీ శ్రుతి ప్రపంచ నిషేధ ముఖమున బ్రహ్మమును దెలుపు చున్నది గదా. ఇచ్చట సంపూర్ణ నిషేధమును జెప్పిన శ్రుత్యర్థ మెట్లు సమంజస మగునని శంకించిన,

సమా: 'అథాతః' అను శ్రుతి బ్రహ్మస్వరూపమును దెలుపుటకు ప్రయత్నించి దృశ్యమగు నామ రూపములను 'ఇది కాదు; ఇది కా' దని వేఱు పరచి నిషేధించి తద్ద్వారా, ఆధారమగు సచ్చిదానంద స్వరూప మైన పరబ్రహ్మమును దెలుపుచున్నది.

పృథివి, జలము, అగ్ని, అనునవి రూపము గల భూతములు. వాయువు; ఆకాశము ఈ రెండును రూప రహిత నామ మాత్రము

లయినవి. ఈ నామ రూపములను బాధించి (నిషేధించి) ఆధారమగు అస్తి భాతి ప్రియాత్మకం బైన బ్రహ్మమును శ్రుతి తెలుపు చున్నది.

## తదవ్యక్తమాహహి. 23

శంక: జగదాధారము బ్రహ్మ మనియు, అది వ్యాపక మనియు నిరూపింప బడినది. అట్లు బ్రహ్మము సర్వత్ర ఉండినపట్ల సమస్త జీవుల కెందుకు గోచరము కాదనిన,

సమా: "న చక్షుషా గృహ్యతే నాపి వాచా" పరబ్రహ్మ తత్త్వము కంటిచే చూడబడునది గాదు. వాక్కుచే చెప్పుటకు వచ్చునది కాదు. అందువలన బ్రహ్మతత్త్వము ఇంద్రియములకు గోచరము గాదని శ్రుతి చెప్పుచున్నది. అజ్ఞాన నివృత్త్యనంతరము తన స్వరూపము సుసంవేద్య మగును. ఇది స్వానుభవము. అర్థాత్ ప్రత్యక్షాది ప్రమాణ ములకు బ్రహ్మ మవిషయ మని తాత్పర్యము.

## అపి సంరాధనే ప్రత్యక్షానుమానాభ్యామ్. 24

ఎవరు స్వస్వరూప విషయక మగు మఱపు లేక అంతర్ముఖ వృత్తిచే పరబ్రహ్మమును సదా ధ్యానింతురో అట్టి పరిశుద్ధ మనస్కు లగు జ్ఞానులకు ఆత్మ (బ్రహ్మ) సాక్షాత్కార మగునని శ్రుతి స్మృతులు జెప్పెను. అయితే బ్రహ్మతత్త్వము వాఙ్మనస్సులకు గోచరము గాదని తెలిపిన పై శ్రుత్యభిప్రాయము ప్రాకృత మగు అశుద్ధ బుద్ధికి వేద్యము గాదనియే. ఏలన, అచ్చట ఆవరణ భంగమును, స్వరూప విషయక మగు అనుభవమును కలుగ జాలదు.

## ప్రకాశాదివచ్చావై శేష్యం ప్రకాశశ్చ కర్మణ్యభ్యాసాత్. 25

శంక : పైన చెప్పబడిన అర్థము సరికాదు. పరబ్రహ్మము నిర్వి శేష మైనది గదా. ఇట్లుండగా ఇతడు ధ్యాత, ఇది ధ్యానము అను మొదలగు త్రిపుటీ భావము లెట్లు పొసగును? అనిన,

సమా : గవాక్ష ద్వారము నుండి వచ్చిన వెలుతురు, వెలుపలి వెలుతురును ఒక్కటే యయినట్టు, ఆకాశ మొక్కటే యయినను ఉపాధుల మూలమున అనేకాకారములు గలదిగా అగపడినను ఈ

యాకాశ, ప్రకాశముల ఏకత్వమునకు ఉపాధులవలన గలిగిన భిన్నత్వము లేదు. అటువలె మాయికములగు బుద్ధ్యాది స్థూల సూక్ష్మరూపోపాధుల సంబంధమువలన, బ్రహ్మముకూడా ధ్యాత, ధ్యానము, ధ్యేయమను భేదములు తోఁచవచ్చును. కాని స్వభావసిద్ధమగు నిర్విశేష పరబ్రహ్మతత్వమునందు భేదము లేదు. 'తత్త్వమసి' ఆ పరబ్రహ్మము నీవైయున్నావను శ్రుతి సారెసారెకు చెప్పుచు వివిధ దృష్టాంతముల నొసగి జీవ బ్రహ్మభేదమును వక్కాణించు చున్నది. అందుచేత ఒక విషయమునే పలుమాఱు చెప్పుటయను అభ్యాసమునుగూడ ఒక హేతువుగా ఈ సూత్రము దెలిపినదని భావించవలెను. భేదముపాధికల్పితము. అభేదము స్వయంసిద్ధము.

### అతోఽనంతేన తథా హి లింగమ్. 26

జీవుడు స్థూల సూక్ష్మ శరీరాభిమానములను వీడి అజ్ఞాన నివృత్తుడై భేదమును బాధించి అభేదమగు బ్రహ్మమే తానని ఎఱిగినపుడు శుద్ధమగు జలము శుద్ధజలమునం దభేదము పొందునట్లు జీవుడు తన స్వరూప జ్ఞానమును పొందిన శుద్ధమగు అద్వితీయ బ్రహ్మమునకంటె వేఱు గాదు.

### ఉభయవ్యపదేశాత్త్వహికుండలవత్. 27

శ్రుతులు భేదమును చెప్పుచున్నవి. మఱియు అభేదమును చెప్పుచున్నవని భట్టభాస్కరుల అభిప్రాయము.

ఎట్లు సర్పము చుట్టజుట్టికొని యుండుటయు మఱి యొకప్పుడు పొడుగై సరళముగ నుండుటయు కలదో ఇట్లు ఒకటైన తనయందే భేదమును అభేదమును గలిగియుండునట్లు జీవుడు, బ్రహ్మము స్వభావమున ఒకటే యయినను పరిమాణమున జీవుడు అణువు, బ్రహ్మము వ్యాపకము. కాబట్టి మోక్షమగు పర్యంతము జీవబ్రహ్మలకు భేదముండి మోక్షసమయమునందు ఆ జీవబ్రహ్మ లిద్దఱు ఒకటే యగుదురని భట్టభాస్కరాచార్యులు మొదలగు కొందఱు చెప్పుదురు. ఇట్లు శ్రుతి భేదాభేదమును జెప్పునని వారి అభిప్రాయము.

ప్రకాశాశ్రయవద్వా తేజస్త్వాత్. 28

గవాక్షముగుండా వచ్చిన వెలుతురును వెలుపలి వెలుతురును వస్తుతః ఒకటే యైనను వెలుపలి వెలుతురు విశాలము; గవాక్షపు వెలుతురు ఒక కొలతకు లోబడిన చిన్న ప్రకాశమై యున్నది. కాబట్టి భేదాభేదము లనునవి ఉన్నవని అంగీకరింపవలెను.

అవ: ఇంతవఱకు చెప్పిన పూర్వపక్షమగు భేదాభేదవాది మతమును ఖండించుచున్నారు.

పూర్వవద్వా. 29

గవాక్షముగుండా వచ్చిన వెలుతురు, వెలుపలి వెలుతురు ఒకటే యయినను భేదముచే ఏర్పడిన ఈ పరిమాణములు రెండును అసత్యములు. ఈ ప్రత్యక్ష సిద్ధమగు భేదము ఉపాధివలన కలిగినదే కాని తత్వతః లేదు. జీవ బ్రహ్మ లొక్కటే. జీవునకు మిథ్యయైన సూక్ష్మ శరీరముచే కల్గిన అణుత్వము, బ్రహ్మమునకు మిథ్య యయిన మాయచే కలిగిన మహత్త్వము ఈ రెండు అత్యంతాభావరూపములు.

ప్రతిషేధాచ్చ. 30

'నాన్యోతోఽస్తి ద్రష్టా' ఆ పరబ్రహ్మమునకంటె వేఱగు ద్రష్ట లేడు. మఱియు నేతి నేతి ఇత్యాది శ్రుతివలన దృశ్యమగు ప్రపంచము యొక్క నిషేధము కాగా చైతన్య స్వరూపుడగు జీవుడు పరబ్రహ్మమునకంటె వేఱు కాడని, జీవ బ్రహ్మలకు భేదము లేదని సిద్ధాంతమయినది.

౭. పరాధికరణము

పరమతస్సేతూన్మానసంబంధభేదవ్యపదేశేభ్యః. 31

శంక: పరబ్రహ్మ మెప్పటికిని అద్వితీయ మని చెప్పుటకు వీలు లేదని భేదవాదులగు నైయాయికులు చెప్పుదురు. పరబ్రహ్మము ఆజ్ఞ చేయును. జీవుడు దానిని తల దాల్చి ఆచరించును. పరబ్రహ్మమును సేతువుగను మఱియు జీవుడు కేశాంశమునందు శతాంశమంత పరిమాణము గలవాడనిన్నీ బ్రహ్మము సర్వత్ర వ్యాపక మగు మహా

త్పరిమాణము కలదని చెప్పుటయు రెండవది; గాఢనిద్రయందు జీవుడు బ్రహ్మముతో చేరునని చెప్పుట మూడవది; రెండు పక్షులను రూపకాలంకారముచే చెప్పు శ్రుతియందు బ్రహ్మముకంటె జీవుడు వేఱని చెప్పు ఇంకొక కారణమును ఇట్లు నాలుగు కారణములచే జీవ బ్రహ్మలు వేఱు వేఱు అని చెప్పుదురు. ఇది పూర్వపక్షము.

## సామాన్యాత్తు. 32

సమా: ఉపమానము ఏకదేశీయము. సమస్త ధర్మముల యందును పోలిక యుండవలయు నను నియమము లేదు. పూర్వపక్ష మతవాదులు బ్రహ్మము అద్వితీయము గాదని చెప్పిన ప్రమాణములు అయోగ్యములు. సేతువువలె నున్నదని చెప్పిన మాట యోగ్యమే. వంతెన నీటిని ఎట్లు నియమముచే ఆపునో అటువలె పరబ్రహ్మము లోకమునందలి సమస్త ధర్మకర్మాది మర్యాదలను నియమించునదని చెప్పు పోలికయందు దృష్టాంత విషయ మేమియును లేదు. అన్ని విషయములయందు పోలిక ఉండవలసిన అగత్యము లేదు. 'స సేతుః' అను శ్రుతిని ఆధారము చేసికొని పూర్వపక్షి చేసిన ఆక్షేపము తగదని భావము.

## బుద్ధ్యర్థః పాదవత్. 33

పై సూత్రమునందు సేతువని చెప్పి యుండుట వలన పరబ్రహ్మమునకు పరిమాణము గలదని చెప్పినట్టు గాదు. రెండవ వస్తువు ఉన్నదని తెలుపుటయు గాదు. బుద్ధిని లక్ష్యమునం దుంచుకొని చెప్పిన మాట, బ్రహ్మాండ మెల్ల ఒక పాదమని ఆపై బ్రహ్మము మూడు పాదములు గలిగి యున్నదని శ్రుతి చెప్పిన మాటకు జీవ బ్రహ్మలను చక్కగా తెలిసి కొనుటకై చెప్ప బడిన విభాగమే గాని వస్తుతః భేదము లేదు. అంతఃకరణ సంబంధముచే జీవునకు అణుత్వము, మాయా సంబంధముచే ఈశ్వరునకు మహత్త్వము ఈ రెండును కల్పితోపాధులే గాని సత్యములు గావు. శ్రుతికి జీవ బ్రహ్మల భిన్న పరిమాణమును తెలుపుట తాత్పర్యము గాదు. ఉపాసనార్థమై బ్రహ్మమునకు పాదములు గలవని చెప్ప బడినదంతే గాని బ్రహ్మాతర మగు పదార్థ మున్నదని చెప్పుటకు గాదు.

## స్థానవిశేషాత్ ప్రకాశాదివత్. 34

ఈ జీవ బ్రహ్మలకు గల సంబంధమును విచారించి చూచిన అదియు ఔపాధికమే. జీవుడు గాఢమగు సుషుప్తియందు సూక్ష్మమగు అంతఃకరణముచే కూడి యున్నందువలన అచ్చట బ్రహ్మముతో సంబంధమని చెప్పబడి యున్నది. సుషుప్త్యావస్థయందు ఉపాధి యనగా బుద్ధి కారణమగు అజ్ఞానమునందు లీనమగుటయే. అప్పుడు ఏమియు లేక పోవుటచే జీవ బ్రహ్మలు ఒక్కటే యగుదురు. ఔపాధిక భేదమును బట్టి చెప్పిన సుషుప్తి కాలమునందు కలుగు అభేదము సంబంధ మని చెప్పుట యుక్తమే. "సతా సోమ్య తదా సంపన్నో భవతి" అని శ్రుతి చెప్పుచున్నది. కాబట్టి ఇంతమాత్ర మగు ఔపాధిక భేదమువలన వాస్తవ భేద మున్నదని చెప్పరాదు. ఈ జీవ బ్రహ్మలకు గల అవిద్య, మాయ యను సంబంధములు రెండును అసత్యములు. ఇవి మోక్ష పర్యంతము ప్రతీతి మాత్రములై యుండినట్లుండును. జ్ఞానానంతర మేమియును లేదు. ఇక,

## ఉపపత్తేశ్చ. 35

ఇతర శ్రుతులనుబట్టి చూచినను బ్రహ్మాద్వితీయత్వమునందు సంబంధమును భేదమును చెప్పుట అప్రధానము. బ్రహ్మము వ్యాపకమైనందువలన, క్షణ దిన వార పక్షములను నీ మొదలగు భేదము లుండినను కాల మొకటియే అయియున్నది. ఘటాకాశము మహాకాశ మను భేదము ఉండినను అందాకాశ మెట్లు ఏకమో అట్లే వ్యాపకమగు బ్రహ్మము ఒకటే. కావున జీవ బ్రహ్మలకు భేదము లేదు.

## తథాఽన్యప్రతిషేధాత్. 36

"యస్మాత్ పరం నాపరమస్తి కించిత్" ఏ వస్తువునకంటె అధిక మైనది గాని, అల్ప మయినది గాని మఱొక వస్తువు లేదో అను మొదలగు శ్రుతులు బ్రహ్మమునకంటె వేఱైె చూచువాడు వేఱొకడు లేడని శ్రుతు లుద్ఘోషించు చున్నందువలన జీవ బ్రహ్మలకు భేదము లేదని తాత్పర్యము.

## అనేన సర్వగతత్వమాయామశబ్దాదిభ్యః. 37

"ఆకాశవత్సర్వగతశ్చ" "నిత్యస్సర్వగతః స్థాణుః" శ్రుతి ఈ

విధముగా జీవ బ్రహ్మలకు భేదము లేదని, బ్రహ్మము సర్వాత్మ స్వరూప మని విస్పష్టముగ దెలుపు కారణమువలన సజాతీయ విజాతీయ స్వగత భేద రహితమై, రెండవది లేక ఏకమై వ్యాపించి యున్నదని తెలియ వలయును. ఏకము, అద్వితీయమునగు వస్తువునందు వ్యాపించుట యను నది ఎట్లనిన, అవిద్యచే అనేక విధములుగ దోచు ప్రపంచమే అతని వ్యాపించుటకు స్థలమని శ్రుతి వ్యావహారిక మగు భేదమును బట్టి బ్రహ్మము సర్వవ్యాపక మని చెప్పుచున్నది.

౮. ఫలాధికరణము

ఫలమత ఉపపత్తేః. 38

కర్మలు జడము లైనందువలన స్వయముగా ఫలముల నివ్వ జాలవు. కర్మలచే పూజింపబడిన ఈశ్వరునివలననే కర్మఫలములు దొరకును. జడమగు కర్మల కా శక్తి లేదు.

శ్రుతత్వాచ్చ. 39

ఈశ్వరుడు కర్మాధ్యక్షుడు, కర్మఫలదాత యని శ్రుతులు చెప్పు చున్నందువలన కర్మానుగుణ్యముగా ఈశ్వరుడే ఫలము నొసగును.

ధర్మం జైమినిరత ఏవ. 40

జైమినిఋషి కర్మయే స్వతంత్రముగ ఫలము నిచ్చుననియు, కర్మలు ఫలమునకు సాధనములై యున్నవనియు, ఈశ్వరుడు ఫలప్రదాత కాడనియు చెప్పును.

పూర్వంతు బాదరాయణో హేతువ్యపదేశాత్. 41

వెనుక చెప్పినట్లు కర్మానుగుణముగ ఈశ్వరుడు ఫలము నిచ్చు నని బాదరాయణాచార్యుల అభిప్రాయము. జీవులు చేయు సత్కర్మ, దుష్కర్మ ఈశ్వరప్రేరణచేతనే జరుగునని చెప్పు శ్రుతియే ఆధారము. ఇట్లు జీవుల పుణ్యాపాపకర్మఫలములు ఈశ్వరప్రేరణచే కలుగుచున్నందు వలన ఈశ్వరుడే కర్మ ననుసరించి ఫలముల నొసగును. అతనికి వైష మ్యము లేదు.

ఇది మూడవ అధ్యాయమున రెండవ పాదము

## 3-వ అధ్యాయము – 3-వ పాదము

అవ : సగుణ నిర్గుణ విద్యలను గుఱించి ఈ అధ్యాయమున దెలుపుచున్నారు.

### ౧. సర్వవేదాంత ప్రత్యయాధికరణము.

### సర్వవేదాంతప్రత్యయం చోదనాద్యవిశేషాత్. 1

ఉపాసన లన్నియు ఒకటే అయియున్నను వాటిని వేఱువేఱుగా చెప్పునప్పుడు ఆ యా నామ రూప ద్రవ్య దేవతాది విభిన్నత లగపడుచున్నవిగదా! అన్నియును ఒక్కటే యని ఎట్లు చెప్పవచ్చును? అనిన,

సమా : ఉపాసనయొక్క నామరూపము లేమియు వేఱుగాదు. ఒకచోట, పంచాగ్నివిద్య యని పేరుండినను, మఱొకచోట వైశ్వానరవిద్య, శాండిల్యవిద్య అని చెప్పబడినను ఆ ఉపాసనయొక్క గాని, ఉపాస్యదేవతయొక్క స్వరూపముగాని అన్ని శాఖలయందును ఒక్కటిగానే ప్రయోజనము చెప్పబడియున్నది.

### భేదాన్నేతి చేన్నైకస్యామపి. 2

వివిధ శాఖలయందు వివిధ ప్రకారములు చెప్పబడి యుండుట వలన పై సూత్రమునందు చెప్పినది సరికాదు. ఛాందోగ్యశ్రుతియందు ఐదగ్నుల ఉపాసన చెప్పబడియున్నది. ఇక వాజసనేయీ శాఖయందో ఆఱవ అగ్నికూడా చెప్పబడినది. కాబట్టి ఈ రెండు రెండే గాని (వేఱు వేఱేగాని) ఏక మెట్లగు ననిన, అట్లు కాదు. ఆ రెండు శాఖలయందు చెప్పిన విద్య ఒక్కటే. ఛాందోగ్యమునందు ఐదని చెప్పినంత మాత్రమున ఆఱవది అక్కఱలేదని అర్థము కాదు. కాబట్టి ఆ రెండు విద్యలను ఒకటియే. వాజసనేయీ శాఖయందు చెప్పబడిన ఆఱవ అగ్నినే ఛాందోగ్య శ్రుత్యనుసారము చెప్పుకొనిన తప్పు కాదు.

### స్వాధ్యాయస్య తథాత్వేన హి సమాచారేఽధికారాచ్చ సవవచ్చ తన్నియమః. 3

శంక : ముండకోపనిషత్తునందు బ్రహ్మవిద్య చెప్పునపుడు శిరోవ్రతమని ఒక ధర్మము చెప్పబడినది. అనగా అగ్నిని తలదాల్చినవాడై

అని ఆ యథర్వణ శాఖయందు చెప్పబడియున్నది. కాబట్టి ఈ ఉపనిషత్తునందలి విద్యకు, (ఉపాసనకు) ఇతర ఉపనిషత్తులలో నున్నదానికి భేదమేమైన నున్నదా ? అనిన,

సమా : ముండకోపనిషత్తునందు చెప్పిన ఆ వ్రతము వేదాధ్యయనమునకై తదంగముగా చెప్పబడినదే గాని బ్రహ్మవిద్యాంగము కాదు. లేక ఉపాసనాంగమును కాదు. సౌరహోమము మొదలుకొని శతౌదనమను క్రతువే అంతముగాగల ఏడు హోమము లున్నవి. ఇంకొక వేదమునందు చెప్పబడిన మూడు అగ్నులు అచ్చట లేవు. అక్కడ అగపడునది ఏకర్షి అను పేరుగల అగ్నిమాత్రమే. అందుచే ఈ ఏడు హోమములు అథర్వణులకు మాత్రమేయని అర్థము. అటువలె శిరస్సున అగ్నిని ధరించియని చెప్పబడిన శిరోవ్రతము వేదాధ్యయనాంగముగ చెప్పబడినదేగాని బ్రహ్మవిద్యాంగము కాదని తెలియవలయును.

## దర్శయతి చ. 4

శ్రుతి ఈ విషయమును తెలుపుచున్నది. సమస్త వేదాంతములు దేనినిగురించి చెప్పునో? అను మొదలగు వేదవాక్యములను చూచినను వివిధ ప్రకారములచే వేఱువేఱుగా చెప్పబడినంత మాత్రమున దేవతాభేదము లేదు. మఱియు ఉపాసనాభేదమును లేదని అర్థము.

## ౨. ఉపసంహారాధికరణము

## ఉపసంహారోఽర్థాభేదాద్విధిశేషవత్సమానే చ. 5

విద్య ఆ యా స్థలములయందు నానా తెఱగుల చెప్పబడినను అది ఒకటే యని నిర్ణయమైన పిదప ఒక చోట చెప్పిన కొన్ని గుణములను వేఱొక చోట చెప్పినంత మాత్రమున తప్పు కాదు. అచ్చట ఆ గుణములు అనుసంధేయములు. అగ్నిహోత్రము ఎచ్చట చెప్పబడియున్నను ఒక భాగమున చెప్పబడిన తదంగములను ఇంకొక భాగమునందు గ్రహించుకొని చేయవచ్చును. విహితమే ఉపాసనయందు కూడ ఇంతే.

## 3. అన్యథాత్వాధికరణము

### అన్యథాత్వం శబ్దాదితి చేన్నావిశేషాత్. 6

(బృహదారణ్యకోపనిషత్తునందును ఛాందోగ్యోపనిషత్తునందును చెప్పబడిన ఉద్గీథోపాసన లొక్కటియేనా?) వాజసనేయీశాఖయందు వాగాది ఇంద్రియములను నిందించి ముఖ్యప్రాణమును పొగడి ఉద్గాన కర్తయని చెప్పబడియున్నది. ఛాందోగ్య శ్రుతియందు ముఖ్యప్రాణమే ఉద్గీథము. అనగా సామగాన విశేషమని అర్థము చెప్పబడినది. ఇచ్చట ఒకచోట ఉద్గాన కర్తఅనియు మఱొకచోట 'ఉద్గీథ ముపాసీత' యనియు కర్మవాచకము ప్రయోగింపబడినది. కాబట్టి ఇవి పరస్పరభిన్నములా? లేక ఒకటియా? అనిన, సమాధానము. అట్లేమియు గాదు. దేవాసురులకు యుద్ధము జరిగినదనుపట్ల వాగాదీంద్రియముల అపజయమును ముఖ్యప్రాణముయొక్క జయమును ఈ మొదలగు అనేకగుణములు రెండు పక్షములయందు సమానముగ చెప్పబడియున్నందున ఆ విద్య ఒక్కటేయని తెలియవలెను. (ఇది పూర్వపక్ష సూత్రము.)

### న వా ప్రకరణభేదాత్పరోవరీయస్త్వాదివత్. 7

ఛాందోగ్యమునందు ఓంకారమును ఉపాసించవలయునని ప్రారంభించి, అద్దానికి రసతమత్వాది గుణములను జెప్పి, వాగాదీంద్రియముల అపజయానంతరము ప్రాణజయమును వివరించి, ముఖ్యప్రాణమే ఉద్గీథమని, తెలుపబడియున్నది. ఇక వాజసనేయీ శాఖయందన్నో ఉద్గానము చేయు ఋత్విజుడే ముఖ్యప్రాణమని చెప్పబడియున్నది. కాని ఈ రెండింటికి పరస్పర సంబంధము లేదు. పరోవరీయస్త్వము (శ్రేష్ఠత), సర్వాత్మకత్వము మొదలగు గుణములచే కూడిన ఉద్గీథోపాసన, హిరణ్యశ్మశ్రుత్వాది గుణములచే గూడిన ఉద్గీథోపాసన వేఱు వేఱయినట్లు పైన జెప్పబడినవియును విభిన్నములే యని భావము.

### సంజ్ఞాతశ్చేత్తదుక్తమస్తి తు తదపి. 8

ఛాందోగ్య, బృహదారణ్యకోపనిషత్తులందు చెప్పబడిన విద్యలకు ఉద్గీథమని రెండిటికిని ఒకే నామముగదా? యనిన, సమాధానము. అత్యంత భిన్నమగు అగ్నిహోత్ర దర్శపూర్ణమాసములను వీటికి

కారక మని సంజ్ఞ కలదు. కాబట్టి ఒకే పేరున్నంతమాత్రమున విద్య ఒకటియే యని గాదు.

౮. వ్యాప్త్యధికరణము

వ్యాప్తేశ్చ సమంజసమ్. 9

ఓంకారము వేదస్వరూపము. ఇది వేదమునం దంతటను వ్యాపించియున్నది. కావున ఉద్గీథ మనుమాట దీనికి విశేషణమనుటయే సరియైనది. తాత్పర్య మేమనగా ఉద్గీథమునందు ఓంకారము ఆరో పింపబడినది కాదు. అట్లు చెప్పిన విరోధమగును. కాబట్టి ఉద్గీథపదము ఓంకారమునకు విశేషణమనియే తెలియవలెను.

౯. సర్వాభేదాధికరణము

సర్వాభేదాదన్యత్రేమే 10.

ఛాందోగ్య బృహదారణ్యములయందు చెప్పబడిన వశిష్ఠత్వాది గుణములు కౌషీతకీ బ్రాహ్మణోపనిషత్తునందలి ప్రాణవిద్య యందు కూడా సంగ్రహింప దగినవై యున్నవి. సమస్త శాఖలయందును ఈ ప్రాణవిద్య ఒకటే (దీనికి ఉద్గీథ విద్యతో పోలిక లేదు.)

౧౦. ఆనందాద్యధికరణము

శంక: ప్రాణము సవిశేషాత్మకము కావున ఒక శాఖయందు చెప్పబడిన ధర్మములు మఱియొక శాఖయందు అన్వయించుకొన వచ్చును కాని నిర్విశేషమగు బ్రహ్మవిషయమునం దిదెట్లు పొసగును? అనిన,

ఆనందాదయః ప్రధానస్య. 11

సమా: పరబ్రహ్మ తత్త్వము సమస్త శాఖలయందును ఒకే విధ ముగా చెప్పబడి యున్నందువలన తత్స్వరూపమును చక్కగా తెలి యుట కొఱకై సత్యం జ్ఞాన మనంత మానందేత్యాది పదముల నన్ని టిని సంగ్రహించుకొన వచ్చును. ఈ లక్షణము లన్నియు స్వరూప మును గ్రహించుటకు మాత్రమే చెప్పబడి యున్నవి. బ్రహ్మతత్త్వము కేవల నిర్విశేషాసంగ చిన్మాత్ర స్వరూపమని తెలియవలయును.

శంక: అట్లయిన తైత్తిరీయోపనిషత్తునందు చెప్పబడిన 'తస్య ప్రియమేవ శిరః' ప్రియమే శిరస్సుగా గలిగిన అను మొదలగు వాక్యములచేత మోదము కుడిరెక్క అనియు ప్రమోదము ఎడమరెక్కయనియు చెప్పిన ఈ శ్రుతి పలుకుల అర్థము. భేదముగల వస్తువులయం దుండవచ్చునే గాని నిర్విశేషమగు బ్రహ్మమునందు ఎట్లు పొసగును? అనిన,

ప్రియశిరస్త్వాద్యప్రాప్తిరుపచయాపచయౌ హి భేదే. 12

సమా: ప్రియ మోద ప్రమోదము లనునవి వ్యత్యస్త స్వభావములు గలవి. బ్రహ్మము సమము కాబట్టి పై వాక్యములను బ్రహ్మపరముగా అర్థము చేయరాదు. అవన్నియు కోశ ధర్మములు. పరబ్రహ్మమును తెలుపుటకు నిమిత్తమగు ఉపాయములు మాత్రమే.

ఇతరే త్వర్థసామాన్యాత్. 13

ప్రియ మోద ప్రమోదములను చెప్పు వాక్యములను బ్రహ్మసంబంధముగా చేర్చుకొనక పోయినను సత్య జ్ఞానానందాది పదములను మాత్రము అన్ని స్థలములయందు ఉపాసనార్థమై గాని, లేక జ్ఞానార్థమై గాని పరబ్రహ్మమును గుఱించి చెప్పు స్థలములయందు గ్రహించుకొనవలయును. ఎందుకనగా, ఈ స్వరూప లక్షణ వాక్యములు బ్రహ్మమును నిస్సంశయముగాబోధించును.

౭. ఆధ్యానాధికరణము

ఆధ్యానాయ ప్రయోజనాభావాత్. 14

'ఇంద్రియేభ్యః పరాహ్యర్థాః' ఈ మొదలగు వాక్యములు సర్వోత్కృష్టమగు పరబ్రహ్మ తత్త్వమును చెప్పు నుద్దేశ్యముచే మనస్సు మొదలగు విషయములు ఒకదానికంటె నొకటి అధికమని చెప్పబడినవే కాని విషయాదులను అధికమని తెలుపు నుద్దేశ్యము గాదని తెలియవలెను. కావున పై శ్రుత్యర్థము ప్రత్యేకముగా విషయాద్యుపాసనలను దెలుపునది కాదనియు, కేవల పరబ్రహ్మ తత్త్వమునే నిరూపించు ననియు తాత్పర్యము.

ఆత్మశబ్దాచ్చ. 15

"ఏష సర్వేషు భూతేషు గూఢోత్మా న ప్రకాశతే" ఈ సర్వ శ్రేష్ఠుడగు పురుషుడే ఆత్మ, సర్వభూతములయందు గూఢముగా నుండి ప్రకాశించు వాడును, ప్రత్యక్షాది ప్రమాణ వేద్యుడు గాడనియును చెప్పు వాక్యమునందు ఆ పరమ పురుషునే ఆత్మయను పేర నుడివి నందువలన విషయములు అనాత్మలని ప్రత్యేకముగా చెప్పకయే చెప్పి నట్టు లయినది. అందుచేత తెలియ వలసిన విషయాదు లేవియును లేవని తెలిసినది. ఆత్మ మాత్రమే తెలియదగిన దని తాత్పర్యము.

౮. ఆత్మగృహీత్యధికరణము

ఆత్మగృహీతిరితరవదుత్తరాత్. 16

'ఆత్మా వా ఇదమేక ఏవాగ్ర ఆసీత్' అని తైత్తిరీయ శ్రుతి యందు ఆత్మశబ్దము ఉపయోగింపబడినది. 'స ఐక్షత' ఆ యాత్మ సంకల్పించెనను మొదలగు ముందు చెప్పబడబోవు సందర్భముల ఆత్మ పదమునకు బ్రహ్మమనియే (పరమేశ్వరుడనియే) అర్థము. ఇక బృహ దారణ్యకోపనిషత్తునందు 'కతమ ఆత్మా' ఆత్మయనగా ఎవరు? అను మొదలగు వాక్యములచే ఆత్మశబ్దము జీవపరముగా ప్రయోగింపబడి అతడే పరబ్రహ్మమని నిరూపింపబడియున్నది. ఛాందోగ్యోపనిషత్తు నందు 'సదేవ సోమ్యేదమగ్రమాసీత్' అను వాక్యముచే ఆత్మశబ్ద మును ప్రయోగింపక 'సత్'శబ్దము ప్రయోగింపబడినది. అచ్చట ఉనికి యని తెలియుచున్నది. ఇట్లు పరస్పరముగా చెప్పబడిన విషయములు భిన్నములా? లేక అభిన్నములా? 'స ఇమాఀల్లోకానసృజత' ఆయన ఈ లోకములను సృజించెనని ఆరంభించి భూలోకాదుల సృష్టి చెప్పబడి యున్నది. కాబట్టి సృష్టికి మొదట ఆత్మ యొకడే యుండెనను ఈ ఆత్మశబ్దార్థమునకు చతుర్ముఖబ్రహ్మ యనియా అర్థము? లేక హిరణ్య గర్భుడనియా? హిరణ్యగర్భుడేయని కొన్ని స్థలములయందు చెప్పబడి యున్నది. అతడే ఇంద్రియాభిమాన దేవతలకు గోవులను జూపించెను. ఆ పిదప గుఱ్ఱములను, అనంతరము పురుషుని జూపించెను అని చెప్ప బడియుండుటవలన లోకమునందు గోవులు, గుఱ్ఱములు మొదలగు భోగ్యవస్తువులను పెట్టుకొనియుండు ధనికుల వ్యవహారమువలె నుండు

ఈ ఆత్మ (శబ్దమునకు) హిరణ్యగర్భుడనియే అర్థమగుచున్నది. ఆత్మ నుండి ఆకాశము పుట్టెను. ఇత్యాదిగా చెప్పియుండు తైత్తిరీయము మొదలగు శ్రుతులవలె ఇచ్చటను ఈ లోకములను పుట్టించినవాడు ఆత్మ, అనగా పరమాత్మయనియే అర్థముగాని హిరణ్యగర్భుడు కాడు.

## అన్వయాదితి చేత్స్యాదవధారణాత్. 17

శంక : 'స ఇమాన్ లోకానసృజత' ఆయన ఈ లోకమును సృజించెనను ఈ విషయము హిరణ్యగర్భునకే సంబంధించి యుండుట వలన ఆత్మశబ్దముచే చెప్పబడునది బ్రహ్మమని అర్థము కాదుగదా? అనిన,

సమా: అట్లుగాదు 'సఇమాన్' అను వాక్యముచే చెప్పబడునది పరబ్రహ్మవిషయమునందే సమన్వయమయి యున్నది. సృష్టికి మొదట ఆత్మ యొకటే ఉండెననుచోట అవధారణ యున్నందువలన ఆత్మయను మాటకు పరమాత్మ అనియే అర్థము. ఇక హిరణ్యగర్భుడని అర్థము చెప్పినట్లయిన సృష్టికి పూర్వము పరబ్రహ్మ మున్నందువలన అతడొక్కడే యనుమాట పొసగదు. కాబట్టి పరమాత్మ మహాభూతములను పుట్టించి ఆ పిదప లోకములను కలుగజేసె ననుట విరోధము కాదు. పైపెచ్చు ఇదేమి ధనవంతుల వ్యవహారమువలె నున్నదా? యను మాటలు కేవలము అర్థవాదముమాత్రమే. అవన్నియు ఆ పరబ్రహ్మమును తెలుపు ఉపాయాంతరములే యని పై సూత్రమున కుత్తరార్థము.

### ౯. కార్యాఖ్యానాధికరణము

## కార్యాఖ్యానాదపూర్వమ్. 18

ఛాందోగ్య, బృహదారణ్యకోపనిషత్తులయందు ప్రాణవిద్యను చెప్పు సందర్భమున "తస్మాద్వా ఏతదశిష్యంతః పురస్తాచ్చోపరిష్టాచ్చాద్భిః పరిదధతి తద్విద్వాం సః శ్రోత్రియా అశిష్యంత ఆచామంతి" అను మొదలగు వాక్యములచేత జలము ప్రాణమునకు వస్త్రమని ధ్యానము చేసి శ్రోత్రియులు పూర్వోత్తరములయం దాచమనము జేసి భుజింతురని శ్రుతి స్మృతులందు ప్రసిద్ధమైన ఆచమన రూప కార్యమునే ఇచ్చటకూడా చెప్పి యున్నందున, అనువదింపబడి యున్నందున

## ఆత్మశబ్దాచ్చ. 15

"ఏష సర్వేషు భూతేషు గూఢోత్మా న ప్రకాశతే" ఈ సర్వ శ్రేష్ఠుడగు పురుషుడే ఆత్మ, సర్వభూతములయందు గూఢముగా నుండి ప్రకాశించు వాడును, ప్రత్యక్షాది ప్రమాణ వేద్యుడు గాడనియును చెప్పు వాక్యమునందు ఆ పరమ పురుషునే ఆత్మయను పేర నుడివి నందువలన విషయములు అనాత్మలని ప్రత్యేకముగా చెప్పకయే చెప్పి నట్టు లయినది. అందుచేత తెలియ వలసిన విషయాదు లేవియును లేవని తెలిసినది. ఆత్మ మాత్రమే తెలియదగిన దని తాత్పర్యము.

### ౮. ఆత్మగృహీత్యధికరణము

## ఆత్మగృహీతిరితరవదుత్తరాత్. 16

'ఆత్మా వా ఇదమేక ఏవాగ్ర ఆసీత్' అని తైత్తిరీయ శ్రుతి యందు ఆత్మశబ్దము ఉపయోగింపబడినది. 'స ఐక్షత' ఆ యాత్మ సంకల్పించెనను మొదలగు ముందు చెప్పబడబోవు సందర్భముల ఆత్మ పదమునకు బ్రహ్మమనియే (పరమేశ్వరుడనియే) అర్థము. ఇక బృహ దారణ్యకోపనిషత్తునందు 'కతమ ఆత్మా' ఆత్మయనగా ఎవరు? అను మొదలగు వాక్యములచే ఆత్మశబ్దము జీవపరముగా ప్రయోగింపబడి, అతడే పరబ్రహ్మమని నిరూపింపబడియున్నది. ఛాందోగ్యోపనిషత్తు నందు 'సదేవ సోమ్యేదమగ్రమాసీత్' అను వాక్యముచే ఆత్మశబ్ద మును ప్రయోగింపక 'సత్' శబ్దము ప్రయోగింపబడినది. అచ్చట ఉనికి యని తెలియుచున్నది. ఇట్లు పరస్పరముగా చెప్పబడిన విషయములు భిన్నములా? లేక అభిన్నములా? 'స ఇమాꣳ లోకానసృజత' ఆయన ఈ లోకములను సృజించెనని ఆరంభించి భూలోకాదుల సృష్టి చెప్పబడి యున్నది. కాబట్టి సృష్టికి మొదట ఆత్మ యొకడే యుండెనను ఈ ఆత్మశబ్దార్థమునకు చతుర్ముఖబ్రహ్మ యనియా అర్థము? లేక హిరణ్య గర్భుడనియా ? హిరణ్యగర్భుడేయని కొన్ని స్థలములయందు చెప్పబడి యున్నది. అతడే ఇంద్రియాభిమాన దేవతలకు గోవులను జూపించెను. ఆ పిదప గుఱ్ఱములను, అనంతరము పురుషుని జూపించెను అని చెప్ప బడియుండుటవలన లోకమునందు గోవులు, గుఱ్ఱములు మొదలగు భోగ్యవస్తువులను పెట్టుకొనియుండు ధనికుల వ్యవహారమువలె నుండు

ఈ ఆత్మ (శబ్దమునకు) హిరణ్యగర్భుడనియే అర్థమగుచున్నది. ఆత్మ నుండి ఆకాశము పుట్టెను. ఇత్యాదిగా చెప్పియుండు తైత్తిరీయము మొదలగు శ్రుతులవలె ఇచ్చటను ఈ లోకములను పుట్టించినవాడు ఆత్మ, అనగా పరమాత్మయనియే అర్థముగాని హిరణ్యగర్భుడు కాడు.

## అన్వయాదితి చేత్స్యాదవధారణాత్. 17

శంక : 'స ఇమాన్ లోకానసృజత' ఆయన ఈ లోకమును సృజించెనను ఈ విషయము హిరణ్యగర్భునకే సంబంధించి యుండుట వలన ఆత్మశబ్దముచే చెప్పబడునది బ్రహ్మమని అర్థము కాదుగదా ? అనిన,

సమా: అట్లుగాదు 'సఇమాన్' అను వాక్యముచే చెప్పబడునది పరబ్రహ్మవిషయమునందే సమన్వయమయి యున్నది. సృష్టికి మొదట ఆత్మ యొకడే ఉండెననుచోట అవధారణ యున్నందువలన ఆత్మయను మాటకు పరమాత్మ అనియే అర్థము. ఇక హిరణ్యగర్భుడని అర్థము చెప్పినట్టయిన సృష్టికి పూర్వము పరబ్రహ్మ మున్నందువలన అతడొ క్కడే యనుమాట పొసగదు. కాబట్టి పరమాత్మ మహాభూతములను పుట్టించి ఆ పిదప లోకములను కలుగజేసె ననుట విరోధము కాదు. పై పెచ్చు ఇదేమి ధనవంతుల వ్యవహారమువలె నున్నదా ? యను మాటలు కేవలము అర్థవాదముమాత్రమే. అవన్నియు ఆ పరబ్రహ్మ మును తెలుపు ఉపాయాంతరములే యని పై సూత్రమున కుత్త రార్థము.

### ౫. కార్యాఖ్యానాధికరణము

## కార్యాఖ్యానాదపూర్వమ్. 18

ఛాందోగ్య, బృహదారణ్యకోపనిషత్తులయందు ప్రాణవిద్యను చెప్పు సందర్భమున "తస్మాద్వా ఏతదశిష్యంతః పురస్తాచ్చోపరిష్టా చ్చాద్భిః పరిదధతి తద్విద్వాం సః శ్రోత్రియా అశిష్యంత ఆచామంతి" అను మొదలగు వాక్యములచేత జలము ప్రాణమునకు వస్త్రమని ధ్యానము చేసి శ్రోత్రియులు పూర్వోత్తరములయందాచమనము జేసి భుజింతురని శ్రుతి స్మృతులందు ప్రసిద్ధమైన ఆచమన రూప కార్య మునే ఇచ్చటకూడా చెప్పి యున్నందున, అనువదింపబడి యున్నందున

ఇతర శ్రుతులయందు చెప్పబడక ప్రస్తుత ప్రాణవిద్యయందు మాత్రమే చెప్పబడి యుండు ధ్యానవిధి ప్రాణోపాసనాంగ మనియే తెలియవలెను. ఇట్లు పైనుదహరించిన ఛాందోగ్య శ్రుతియొక్క తాత్పర్య మేమనగా ఆహార మంతయు ప్రాణమునకే యని చెప్పబడి యున్నది. అందుచేత భోజనము చేయువారు ప్రాణమునకు జలము వస్త్ర మగుట వలన భోజనమునకు మొదటను పిదపను ఆచమన మొనర్తురు. అందుచేత ప్రాణమును దిగంబరముగ నుండ నివ్వక జలమను వస్త్రము నిచ్చి (అనగా కప్పి) శ్రోత్రియులు భుజింతురని పై శ్రుతియొక్క అర్థము, ఈ వాక్యమును జూడ ప్రాణోపాసనయందు తాత్పర్యము గలదై యున్నదని తెలియుచున్నది.

## ౧౦. సమానాధికరణము

## సమాన ఏవం చాభేదాత్. 19

ఉపాస్య దేవత ఒకటియే యగుట వలన విభిన్నమగు ఇతర శాఖలయందును భేద మెట్లు చెప్పబడదో, మఱియు అధ్యయనపదులు వేఱు వేఱు అయినను విద్య ఒక్కటే యనుటయందు సంశయ మెట్లు లేదో అటువలె చెప్పినదే మరల చెప్పుట పునరుక్తి యయినను ఈ రెండు స్థలములయందు చెప్పబడిన శాండిల్యవిద్య ఒకటే యని తెలియవలెను.

## ౧౧. సంబంధాధికరణము

## సంబంధాదేవమన్యత్రాపి. 20

శంక: బృహదారణ్యకోపనిషత్తునందు ఆదిత్య మండలాంతర్వర్తి యగు పురుషుని, అనగా ఆధిదైవికోపాసనను, కుడి నేత్రమునందుండు పురుషుని అనగా ఆధ్యాత్మికోపాసనను తెలిపి యున్నది. అచ్చట ఆదిత్య పురుషునకు అహః యను నామమును, నేత్రమునందుండు పురుషునకు అహం యను నామమును వేదము చెప్పినది. ఈ రెండు స్థలములయందు ఉపాస్యుడు హిరణ్యగర్భుడే. అందుచేత ఈ రెండిటిని రెండు స్థానములయందు అనుసంధానము చేయ వలయునని తోచుచున్నదిగదా? యనిన,

## న వా విశేషాత్. 21

సమా: అట్లు చెప్పుట సరికాదు. ఆదిత్య మండల (స్థాన) మును గుఱిగా పెట్టుకొని అహః యను నామమును, నేత్రమును ధ్యేయముగా నుంచుకొని అహం అనియును చెప్పి యుండుటవలన అచ్చట చెప్పిన చొప్పుననే ఒక్కొక్క నామమును ఆయా ఉపాసన లను చేయునపుడు భావించవలెను.

## ధర్మయతి చ. 22

శ్రుతియును ఇట్లే చెప్పుచున్నది. ఆధిదైవిక, ఆధ్యాత్మికము లగు నీ ఉపాసనలయందు ఒకదాని ధర్మము నొకదానియందు చింతింప రాదు. విద్య ఒక్కటే అయినను స్థానభేదము వలన ఆదిత్యాక్షి పురుషులను గుఱించి చెప్పబడిన సర్వవిషయములు భిన్నము లయినందు వలన అహః, అహం అను నామముల నొకచోట నుండి మఱొకచోటు నకు సంగ్రహించుకొన రాదని అభిప్రాయము.

### ౧౨. సంభృత్యధికరణము

## సంభృతిద్యువ్యాప్త్యపి చాతః. 23

శాండిల్యాది విద్యలయందు పరమాత్మకు హృదయము మొద లగు స్థానములు నిర్దేశించి చెప్పబడి యున్నవి. వ్యాపకమై నిండి యుండుట మొదలగు ధర్మములు ఆధిదైవిక విభూతులు. కాబట్టి వాటికి ఆధ్యాత్మికోపాసనలయందు అవకాశము లేదు. అందుచేత శాండిల్యాది విద్యలయందు ఉపసంహరించుకొన నవసరము లేదని భావము.

### ౧౩. పురుషవిద్యాధికరణము

## పురుషవిద్యాయామివ చేతరేషామనామ్నానాత్. 24

ఛాందోగ్య, తైత్తిరీయోపనిషత్తులయందు చెప్పబడిన పురుష విద్యలు ఒకటి కావు. అచ్చట చెప్పబడిన ధర్మములు పరస్పర విరు ద్ధములు. ఛాందోగ్య శ్రుతియందు పురుషుడే యజ్ఞమని చెప్పి అతని ఆయుస్సును మూడు విధములుగా విభజించి ఆ భాగములే సవనము

లని చెప్పబడి యున్నవి. ఇక తైత్తిరీయమునందు ఆత్మే యజమానుడు, శ్రద్ధయే పత్ని అను మొదలగు అత్యంత విభిన్న విషయములు చెప్పబడి యున్నవి. అందుచేత ఆ విద్యలు రెండును వేఱువేఱని భావము.

౧౮. వేధాద్యధికరణము

## వేధాద్యర్థభేదాత్. 25

ఉపనిషదాదియందు పఠింపబడు మంత్రములు ప్రతిబంధ నాశనోపాయార్థమై చెప్పబడినవే కాని ఉపనిషదర్థమునందు ఆ మంత్రములకు ఏలాటి సంబంధమును లేదు. భేదించుట, సుఖము నిచ్చుట మొదలగు మంత్రార్థములు ఉపనిషత్తులయందు చెప్పబడు విద్యలకంటె వేఱై యున్నందువలన ఈ ఉపనిషదాదియందు పఠింపబడు మంత్రములకు ఉపనిషత్తులందు చెప్పబడు విద్యకు సంబంధము లేదు. ("శంనో మిత్రః సర్వం ప్రవిధ్య, హృదయం ప్రవిధ్య" ఇత్యాది)

౧౯. హాన్యధికరణము

## హానౌ తూపాయనశబ్దశేషత్వాత్కుశాచ్ఛందఃస్తుత్యుపగానవత్తదుక్తమ్. 26

కొన్ని శ్రుతులయందు విద్వాంసుడు పాపమును విడుచునని మాత్రము చెప్పబడినది. ఇంకొకచోట విద్వాంసుని పాపము వాని శత్రువులును, అతని పుణ్యమును అతని మిత్రులును పంచుకొందురని చెప్పబడినది. పాపమును విడుచును అనుమాట అచ్చట లేదు. కొన్ని స్థలములందు విద్వాంసుడు పాప పుణ్యములను విడుచును. అతని శత్రువులు పాపమును మిత్రులు పుణ్యమును గైకొందురని పాపము యొక్క త్యాగమును ఇతరులు దానిని పంచుకొనుట అనునదిన్ని చెప్పబడి యున్నది, ఇట్లు పాపములను విడుచుట అనునది మాత్రమే చెప్పి యుండిన తాత్పర్యము వేఱొక వేదవాక్యము ననుసరించి విద్యను చక్కగా స్తుతించుట కొఱకై శత్రువులు విద్వాంసుని పాపమును దీసికొందురను నీ యంశమును జేర్చుకొని గ్రహింపవలయునని అర్థము. తత్త్వతః విద్వాంసునకు పుణ్యమును లేదు. పాపమును లేదు.

పంచుకొనుటయు లేదు. దూషించినవాడు పాపము గట్టుకొనుననునది భయానకవాక్యము; స్తుతించిన వాడు పుణ్యమును పంచుకొనుననునది రుచ్యుత్పాదకవాక్యము.

## ౧౬. సాంపరాయాధికరణము

### సాంపరాయే తర్తవ్యాభావా త్తథాహ్యన్యే. 27

విద్వాంసునకు పుణ్య పాపములను దాటి పొంద వలసిన దేదియును లేదు. అందుచేత అతడు దేహ వియోగ సమకాలమునందే పుణ్య పాపములను పోగొట్టుకొని యుండును. కౌషీతకీ బ్రాహ్మణోపనిషత్తునందు విరజానదీ తరణానంతరము కర్మక్షయ మగునని చెప్పబడియున్నది. కాని ఛాందోగ్య శ్రుతి ననుసరించి ఈ విషయమును సమన్వయించుకొన వలయును. అనగా దేహ త్యాగమునకు ముందే జ్ఞానికి పుణ్య పాప కర్మ క్షయమై యుండునని దీని అర్థము.

### ఛందత ఉభయావిరోధాత్. 28

శ్రుతికిని, యుక్తికిని విరోధము లేకపోవుట వలన బ్రతికి యుండగనే ఉపాసనలు సాధించు స్వాతంత్ర్యముగల వానికి జీవించి యున్న ఆ సమయమునందే కర్మలు నశించు ననుట యుక్తము. దేహ త్యాగమునకు పూర్వమే విద్యాప్రభావము వలన కర్మక్షయము కలుగు ననుటయందును, అదియే విద్యకు ఫల మనుట యందును విరోధము లేదని భావము.

## ౧౭. గతేరర్థవత్త్వాధికరణము

### గతేరర్థవత్త్వముభయథాఽన్యథాహి విరోధః. 29

కొన్ని విద్యా ప్రసంగములయందు దేవయాన మార్గమును మఱికొన్ని స్థలములయందు నిర్గుణ బ్రహ్మవిద్యను చెప్పునపుడు ఆ దేవయాన మార్గపు ప్రసంగమే లేదు. కావున ఏది గ్రహింపదగును? అనిన, సమాధానము.

అది అగ్రాహ్యము. దేవయాన మార్గము కొందఱికి మాత్రమే చెప్పవలయును, అట్లుగాక సమస్తవిద్యలకు అదే మార్గమును చెప్పిన

పుణ్యపాపములను పోగొట్టుకొని ప్రత్యగ్బ్రహ్మాభిన్నత్వము నొందు నను మొదలుగా చెప్పు శ్రుతులకు భంగము వచ్చును. బ్రహ్మజ్ఞాని ఏ మార్గము ననుసరించ వలసినది లేదు. అతడు సద్యోముక్తుడని తత్త్వార్థము.

## ఉపపన్నస్తల్లక్షణార్థోపలబ్ధేర్లోకవత్. 30

ఉక్త సూత్రమునందు వివరింప బడిన సిద్ధాంతము నిర్దోషము, ఎల యనగా, సగుణ మగు పర్యంక విద్యలయందు ఉపాసకుడు ఒక మార్గము ననుసరించి నడచి సాధింప వలసిన దివ్యమగు భోగ్య పదార్థములను సాధించి తత్ఫలానుభవమును పొందుట సగుణ విద్యల యందే పొసగును గాని ప్రత్యగభిన్న పరబ్రహ్మ తత్త్వమునందు ఒక చోటనుండి మఱొక చోటునకు వెళ్ళి పొంద వలసిన పని లేదు. నిర్గుణ బ్రహ్మవిద్యయందు ఒక మార్గము ననుసరించి వెళ్ళి పొందవలసిన ఫలానుభవములు లేవు. కావున ఇచ్చట దేవయాన మార్గమును గ్రహింపరాదు. లోకమున ఎవరైన నొక గ్రామమునకు వెళ్ళవలసి యుండినచో అతనిని అచ్చటికి మర్యాదచే పిలిచికొని పోయి చేర్చుట కద్దు. ఈ విషయమో అట్లుగాక దేశాంతర, కాలాంతర, వస్త్వంతరముల వ్యవధానమే లేక ఉత్పత్తి ప్రాప్తి వికార సంస్కారములను పరిణామము లేక నిత్యసిద్ధమై స్వాత్మరూపమున నున్నందున దేవయానాది మార్గము లచ్చట అగ్రాహ్యములు. కాశీక్షేత్రమునందుండియే కాశీక్షేత్రము వెళ్ళవలసి యుండునా? లేదు. అటువలె పుణ్యపాపములనుండి విడువబడి నిత్య సిద్ధానుభవము నొందిన తాను పొంద వలసిన స్థానాంతరము గాని ఫలాంతరము గాని లేదని అర్థము.

## ౧౮. అనియమాధికరణము

## అనియమః సర్వే సామవిరోధశ్శబ్దానుమానాభ్యామ్. 31

శంక : సగుణవిద్యను చెప్పు కొన్ని ప్రసంగములయందు దేవయాన మార్గము చెప్పబడినది. మఱి కొన్ని చోటుల చెప్పబడలేదు. అట్టి స్థలములయందీ దేవయాన మార్గమును సమన్వయించుకొన వచ్చునా? యనిన,

సమా: అవును. అచ్చట సమన్వయ పఱచుకొన వలసినదే. ఒక్కొక్క స్థలమునందు చెప్పబడినంత మాత్రముననే విరోధము లేదు. శ్రుతి స్మృతులను చూచిన సమస్త సగుణ విద్యలయందు దేవయాన మార్గ సంబంధ మున్నదని తెలియబడుచున్నది.

౧౯. యావదధికారాధికరణము

యావదధికారమవస్థితిరాధికారికాణామ్. 32

శంక: నిర్గుణ విద్యయందు దేవయానమును సంగ్రహించుకొన వలసిన అవసరము లేదని సిద్ధాంతము చేసి యున్నారు. అదెట్లు పొసగును? ఇతిహాస పురాణాదులయందు విద్వాంసులని చెప్పబడువశిష్ఠ సనత్కుమారాదులు కూడా మరల జన్మించినట్లు స్మృతులచే తెలియబడు చున్నదికదా. కాబట్టి జ్ఞానముచే మోక్షము కలుగునన్నమాట పొసగదు అనిన,

సమా: జ్ఞానముచే మోక్ష మనుమాట పరమ సత్యము. వశిష్ఠాదులు ప్రారబ్ధ కర్మచే లోకానుగ్రహార్థమై ఈశ్వరునిచే నియమింప బడినవారై యున్నారు. ప్రారబ్ధకర్మ తీరిన పిదప వారు విదేహ కైవల్యము నొందుదురు. బ్రహ్మజ్ఞానులకు పునర్జన్మము కలదనుట తప్పు. నిర్గుణ విద్యలయందు దేవయాన మార్గము గ్రహించుకొన వలసిన పనిలేదు.

౨౦. అక్షరాధ్యధికరణము

అక్షరధియాంత్వవరోధస్సామాన్యతద్భావాభ్యామౌపసదవత్తదుక్తమ్. 33

శంక: పరమార్థ తత్త్వ మనగా అట్లు కాదు. ఇట్లని చెప్పునపుడు బృహదారణ్యకాది ఉపనిషత్తులయందు 'అస్థూలం అనణు' అను మొదలగు కొన్ని గుణములను నిషేధించి పరబ్రహ్మతత్త్వ ముపదేశింప బడినది. ఇక ముండకోపనిషత్తునందు 'యత్తదద్రేశ్యమగ్రాహ్య' మ్మని ఇట్లు కొన్ని విశేషణములు లేనిదిగను చెప్పబడి యున్నది. ఈ పదములను సర్వత్ర అన్వయించుకొన వలయునా? లేదా? అనిన,

సమా: ఏ యొక్క విశేషణమును లేని పరబ్రహ్మతత్త్వమును తెలియుటకు అన్ని పదములు అనుకూలములై యున్నందున అన్నిటిని గ్రహించుకొనవచ్చును. ఈ నిర్గుణ విద్యయందు కొన్ని విశేషణములను ఒకచోట చెప్పకుండినను మఱియొక స్థానమునుండి వాన్ని గ్రహించుకొనవచ్చునని తాత్పర్యము.

### ౨౧. ఇయదామననాధికరణము

## ఇయదామననాత్. 34

శంక: "ద్వా సుపర్ణా సయుజా సఖాయా ఋతం పిబంతౌ సుకృతస్య లోకే" ఒక చెట్టుపైన రెండు పక్షులు ఉన్నవి ఇత్యాదిగా శ్రుతి ఒకచోట చెప్పినది వేఱొకచోట బుద్ధియందు ఇద్దఱున్నారు అని ఈ విధముగా చెప్పబడి యున్నది. ఇట్లు ద్వివిధముగా చెప్పబడిన విద్యలు వేఱువేఱా? ఒకటియా? అనిన,

సమా: అట్లు గాదు. ఒక్కటియనియే చెప్పవలెను. ఇరువైపులందును ఇద్దఱని చెప్పి యున్నందువలన అట్లు దోచును. ఆ రెండు వైపులయందును ఆది అంత్య భాగములను జూచిన జీవునికంటె వేఱై అసంసారియై యుండు ఈశ్వరుని తెలుపుట కొఱకై చెప్పబడినదని అర్థ మగుచున్నది. అందుచే రెండు స్థలములయందు ఉల్లేఖింపబడిన విద్య ఒక్కటే యని తాత్పర్యము.

### ౨౨. అంతరాధికరణము

## అంతరా భూతగ్రామవత్స్వాత్మనః. 35

బృహదారణ్యకోపనిషత్తునందు ఉషస్తిఋషియొక్క ప్రశ్నకు ఉత్తరముగా సర్వాంతర మగు ఆత్మను జెప్పి మరల కహోళఋషికి అదే ఉత్తరము జెప్పి యున్నందువలన ఒకే స్థలమున రెండు సారులు జెప్పి యున్నందువలన అచ్చట చెప్ప బడిన విద్య విభిన్నమని అర్థము గాదు. ఆత్మ అన్నింటికంటెను ఆంతరమను విషయము ఏకమైనందువలన అచ్చట ముచ్చటింప బడిన విద్య ఒక్కటే యని గ్రహించవలయును. ఇద్దఱు సర్వాంతరులని ఎట్లు చెప్ప నగును? పోసగదు. అదే ఆత్మే సర్వాంతరమగు పదార్థము అద్వితీయమై యుండవలెను. (అదే నీవు).

అన్యథా భేదానుపపత్తిరితి చేన్నోపదేశాంతరవత్. 36

పునరపి వారం వారం చెప్పినంత మాత్రమున విద్య వేఱు గాజాలదు. ఛాందోగ్యోపనిషత్తునందు ఉద్దాలక మహర్షి శ్వేతకేతువునకు "తత్త్వమసి" (నీవు సద్రూప బ్రహ్మమై యున్నావు) అని తొమ్మిదిసారులు బోధించి నట్లుగా వినుచున్నాము. విద్య ఒకటియే యైనను అనేక సారులు ఉపదేశించ వచ్చును. అభ్యంతరము లేదు.

౨౩. వ్యతిహారాధికరణము

వ్యతిహారో విశింషంతి హీతరవత్. 37

శంక: ఆదిత్య మండలాంతర్గతు డగు హిరణ్యగర్భుడు నేనే (అనగా జీవుడే బ్రహ్మము, బ్రహ్మమే జీవుడు) అని తెలిసిన (ఉపాసించిన) ఈశ్వరుని చిన్నవానినిగా దెలిసికొన్నట్టాయెనుగదా? యనిన,

సమా: అట్లేమియు గాదు. దోషమును లేదు. వేద మావిధముగ జెప్పి యుండిన దోషి యగుచుండెడిది. అట్లుగాక వేదమే 'హిరణ్యగర్భుడు నేనే' యని ధ్యానింప వలసినదిగా జెప్పినది. కాబట్టి తప్పేమియు గాదు. ధ్యానింపబడు దేవత చిన్నది గాదు. రెండునూ ఒక్కటే. పరమాత్మను సంసారి యని ఉపాసించుట కాదు గదా. అందుచేత అభేదమే సిద్ధమగును. కాషీతకీ శాఖయందు "ఓ దేవతా! నీవే నేను. నేనే నీవు"అని చెప్పబడి యున్నది. కావున ఇట్లు వ్యతీహారోపాసన అనగా "జీవుడే బ్రహ్మము; బ్రహ్మమే జీవు"డని పరస్పరము విశేషణ విశేష్య భావముచే అనుసంధానము చేయవచ్చును.

౨౪. సైవహిసత్యాద్యధికరణము

సైవహి సత్యాదయః. 38

పూజ్యుడగు హిరణ్యగర్భు నెవరు సత్యస్వరూపునిగ నెఱుగుదురో ఆ సత్యమగు తత్త్వస్వరూప మేదియో? ఇత్యాదిగా ఆ యనియు, ఏది యనియు సర్వనామ పద ప్రయోగముచే రెండు వాక్యముల యందును చెప్పబడిన విద్య ఒక్కటే. కాబట్టి ఈ రెండు విద్యల యందును అగపడుచున్న సత్యాది గుణములను పరస్పరము గ్రహించుకొన వచ్చును. రెండింటియందు భేదము లేదు.

౨౫. కామాద్యధికరణము

## కామాదీతరత్ర తత్ర చాఽఽయతనాదిభ్యః. 39

శంక: ఒకచోట ప్రాదేశ మాత్రాకాశమును (చిన్నదిగా) చెప్పి అది సత్య సంకల్పాది యుక్తమనియు, ఇంకొక చోట హృదయాకాశమునందుండు పరమాత్మ సమస్తమును వశపఱచుకొని యున్నాడనియు చెప్పబడి యున్నది, ఇట్లీ రెండు వాక్యముల యందలి విద్యా విషయము విభిన్నమైనదా? కాదా? అనిన,

సమా: అచ్చట ఈ రెండు వాక్యములకు హృదయ మనునది ఒకే స్థానమని సమాధానము. ఉపాస్యుడగు పరమాత్మ రెండు స్థలములయందును సమానముగా అగపడుటవలన విద్య ఒక్కటే యని చెప్పవలయును. సర్వ ప్రపంచ మర్యాదలను మేర దప్పక జరుపువాడని ఉభయత్ర సమానమై యున్నది. ప్రయోజనము సమానము, మఱియు విద్యయు సమము. కాబట్టి తద్విద్యాస్తుత్యర్థమై గుణసంగ్రహము విరోధము గాదు.

౨౬. ఆదరాదలోపాధికరణము

## ఆదరాదలోపః. 40

శంక: వైశ్వానర విద్యను జెప్పునపుడు ఉపాసకుడు మొదట తీసికొను ప్రాణాహుతులను అగ్నిహోత్రమని చెప్పబడి యున్నది. కాబట్టి మొదటనే యగు అతిథుల భోజన కర్మను అంగీకరింపని వేదమునకు ఉపాసకుడు భోజనము చేయకున్నను అన్నమునకు బదులుగా మఱి దేనినైన నుంచుకొని ప్రాణాగ్ని హోత్రము చేసియే తీరవలయును గదా? అనిన,

## ఉపస్థితేఽత స్తద్వచనాత్. 41

సమా: అట్లు గాదు. భోజనము చేయవలసి వచ్చినపట్ల యని వేదమునం దున్నందున ఈ వాక్యముచే భోజనము లేకున్న అగ్నిహోత్రమే లేదని తాత్పర్యము గ్రహింపవలెను.

## ౨౭. తన్నిర్ధారణానియమాధికరణము

తన్నిర్ధారణానియమ స్తద్దృష్టేః పృథగ్ఘ్యప్రతిబంధః ఫలమ్. 42

శంక: కర్మాంగములగు ఉద్గీథము మొదలగు వాటి నవలంబించి వేదమునందు అనేకోపాసనలు చెప్పబడినవి. వాటిని చేసినట్టయిన ఆ కర్మకు ఫలము లేదనియా అర్థము? అదెట్లు? అనిన,

సమా: వాటిని చేయకుండినను కర్మఫలము రాక మానదు. చేసిన ఫల మధికముగా నుండును. వాటిని ఉపాసించు వాడు, మఱియు ఉపాసింపనివాడు ఇద్దఱు కర్మను చేసియే చేయుదురను నీ విషయము చెప్పబడియున్నందువలన ఉపాసన చేయకున్నను కర్మకు లోపము లేదు.

## ౨౮. ప్రధానాధికరణము

ప్రధానవదేవ తదుక్తమ్. 43

శంక: సంవర్గవిద్యను చెప్పునపుడు అంత్యకాలమునందు సమస్తము తన్ననుసరించు విషయమున అధిదైవ వస్తువులలో వాయువు సంవర్గమని, అనగా తనయందు దడగించుకొనునదని అధ్యాత్మ వస్తువులందు ప్రాణము సంవర్గమని చెప్పబడి యున్నది. అందుచేత వాయువును, ప్రాణమును రెండింటిని ఒకటిగ నుపాసింప వలయునని అగపడుచున్నది. మఱియు ఏది ప్రాణమో అదే వాయువని ఇత్యాదిగా చెప్పియున్నారు. కాబట్టి పైన జెప్పినట్లే ఇచ్చట గ్రహింప వలయును గదా? అనిన,

సమా: అట్లు గాదు. వాటిని వేఱు వేఱుగా ఉపాసన చేయవలెను. ఎందుకనగా, వాయు ప్రాణములు వేఱు వేఱుగా చెప్పబడియున్నవి. తత్త్వము ఒకటే అయినను ధ్యానానుకూలతకై ఆధ్యాత్మికమనియు, ఆధిదైవిక మనియు ద్వివిధముగా చెప్పబడి యుండుట వలన విడి విడిగానే ధ్యానింపవలెను. రాజగు ఇంద్రుని కనియు ఆదిరాజగు ఇంద్రుని కనియు స్వర్గరాజగు ఇంద్రుని కనియు వేఱు వేఱుగా మూడు వాక్యములందు ఇంద్రుని గుఱించి యాగము చెప్పబడి యున్నది. అచ్చట ఇంద్రుడు ఒక్కడే అయినను ఇట్లు మూడు వాక్యములందు

ఇంద్రుని గుఱించిన యాగము చెప్పబడి యున్నది. గుణములు వేఱు వేఱయినందున దానితో కూడిన దేవతయు వేఱు వేఱని అర్థమగును. అందుచేత ఆ యాగము వేఱనియే అర్థము గదా. అటువలె వాయు ప్రాణములు వేఱు వేఱని చింతింప వలయును. ఇందలి సారసంగ్రహ మేమనగా, ఈశ్వరోపాధి వాయువు; జీవోపాధి ప్రాణ మని భావము.

౨౫. లింగభూయస్త్వాధికరణము

లింగభూయస్త్వాత్తద్ధి బలీయస్తదపి· 44

శంక: వాజసనేయిశాఖ అగ్నిరహస్యమునందు మనస్సుచే దొరకబడు అగ్నులు, మఱియు వాగింద్రియముచే దొరకబడు అగ్నులు అను నీ మొదలగు మాటలు గలవు. ఆ యగ్నులు కర్మలను చెప్పు ప్రసంగమునందు వచ్చినవి గావున అవి కర్మాంగము లనియేనా అర్థము! అనిన,

సమా: అవి కర్మాంగములు కాదు. మనోవృత్తులనే అగ్ని యని ఉపాసన చేయు వానికి లోకమునందు జనులు చేయు సంకల్పము లెల్ల కర్మాంగ మగు అగ్నికి అంగమైన ఇటికెల కొఱకై పరిణ మించు నను నీ మొదలగు గుఱుతులను చూచిన, మనోమయము మొదలగు అగ్నులు స్వాతంత్రము లేగాని కర్మాంగములు గావు.

పూర్వవికల్పః ప్రకరణాత్స్యాత్క్రియా మానసవత్· 45

కర్మను జెప్పు ప్రకరణమునందు జూచిన క్రియామయమగు అగ్నులతో ఈ అగ్నులను వికల్పముగా జెప్పిన ట్టగపడు చున్నది. మీరు చెప్పిన గుఱుతులు అంత బలిష్ఠములు కావు. దానిని చూపు వాక్యము కల్పితాగ్నులను పొగడుటకొఱకై మాత్రము వెలువడినదని తెలియుచున్నది. దశరాత్రమను క్రతువునందు అవివాక్యమను 11-వ హవిస్సునందు ఒక మానసిక యాగము చెప్ప బడినది. ఆ అహస్సు నందు వేఱు వేఱు అనేక వాక్యముల పురశ్చరణ లేనందువలన దానికి అవివాక్యమను పేరు వచ్చినది. ఆ మానసయాగము దశరాత్రము నకు అంగమని నిర్ధరింపబడి యున్నది. అటువలె ఈ అగ్నులు క్రియా మయమగు అగ్నికి అంగము లైనవని తెలియవచ్చు చున్నదని పూర్వ పక్ష సూత్రము.

## అతిదేశాచ్చ. 46

మనోమయాగ్నులు, సూర్యులును 36,000. వాటియందు ఒక్కొక్క అగ్నియు ఇప్పు డగపడు సూర్యానంత పరిమాణము గలవై యున్నవి. కర్మాంగ మయిన సూర్యుని సాదృశ్యమును మనోమయాగ్నులతో చెప్పి యుండుటవలన అవి కర్మాంగములని అగపడుచున్నది. ఇదియు పూర్వపక్ష సూత్రమే.

అవ : పై పూర్వపక్షమును ఖండించుచున్నారు.

## విద్యైవ తు నిర్ధారణాత్. 47

మనోమయాగ్నులు స్వతంత్రము లైనవి. ఎందుకనగా, శ్రుతియందు విద్యచేతనే దొరకబడిన అగ్నులని నొక్కి వక్కాణింప బడియున్నది. మఱియు నివి విద్యామయములును స్వతంత్రములునై యున్నవి. కర్మాంగములు గాదు.

## దర్శనాచ్చ. 48

శ్రుతివలనగూడా ఆ యగ్నులు స్వతంత్రములే నని ఏతద్విషయక మగు లింగములను మొదటనే చెప్పియున్నాము.

## శ్రుత్యాదిబలీయస్త్వాచ్చ న బాధః 49

క్రియామయమగు అగ్నులను గుఱించిన ప్రకరణమునందు చెప్పినంత మాత్రమున అవియును విద్యచేతనే సంలబ్ధ మైనవను నీ మొదలగు శ్రుతి వాక్యములను ధిక్కరింపరాదు. ఎందుకనగా, ప్రకరణమున కంటె శ్రుతి బలీయము.

## అనుబంధాదిభ్యః ప్రజ్ఞాంతరపృథక్త్వవద్దృష్టశ్చ తదుక్తమ్. 50

క్రియామయమగు అగ్నియొక్క అవయవముల ననేకములను ఇచ్చట ధ్యానార్థమై చెప్పవలసి వచ్చినందున క్రియా ప్రకరణమునందు చెప్పబడినదియే గాని వేఱు కాదు. తమ తమ ఉపాస్యదేవతలచే కూడిన శాండిల్యాద్యుపాసనలు కర్మాంగ మైనట్లు ఈ మనోమయాగ్నులు కర్మాంగములు గావు. రాజసూయమును చెప్పు ప్రకరణమునందు అవేష్టి యను ఇష్టిని గుఱించి చెప్పుట యయినది. ఆ అవేష్టి

బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులను నీ మూడు వర్ణములకే సంబంధించినదై యున్నది. రాజసూయ మన్ననో రాజగువాడు మాత్రము చేయ దగినదై యున్నది. అందుచేత ఆ ప్రకరణమునందు చెప్పి యున్న అవేష్టిని తత్ప్రకరణమునుండి వేఱు చేయుట వాడుకమై యున్నది. అటువలె మనోమయాగ్నులు క్రియామయాగ్ని ప్రకరణమునందు చెప్ప బడి యున్నను వాటికి అంగములు కావు. కావున ఆ ప్రకరణమునుండి అవి విడువ దగినవై యున్నవి. కాబట్టి మనశ్చిదాదులు స్వతంత్రము లనియే అర్థము.

న సామాన్యాదప్యుపలబ్ధేర్మృత్యువన్నహి లోకాపత్తిః. 51

4 -వ సూత్రమునందు మనోమయమని చెప్పబడిన పాత్ర ఎట్లు కర్మాంగమో అట్లే ఈ మనశ్చిదాది అగ్నులు కర్మాంగములని చెప్ప బడిన పూర్వ పక్షమును ఖండించు చున్నారు.

మానసయాగముయొక్క సాదృశ్యముచే మనోమయాగ్నులు కర్మాంగమని చెప్పుట తప్పు. లోకమునందు సర్వపదార్థములు ఏదో రూపమున అన్ని వస్తువులతో గూడి సమానము లైయే యున్నవి. అంతమాత్రముచేత తనయందుండు విభిన్న భావము నెట్లు విడుచును! ఆదిత్య మండలమునం దుండు పురుషునకు, అగ్నికి మృత్యువని పేరు న్నది. అంతమాత్రముననే వారిద్దఱు ఒకఁడే యని యెట్లగును? కాదు.

పరేణ చ శబ్దస్య తాద్విధ్యం భూయస్త్వాత్త్వనుబంధః. 52

చివర సమస్త కామము లెచ్చట లుప్త మగునో అట్టి ఉత్తమ స్థితిని పొందుదురని ఉపాసనా ఫలము చెప్పబడియున్నది. అందుచేత మనోమయాగ్నులు స్వతంత్రము లైనవే యని అర్థము. కర్మాంగములు గాదు.

## 30. ఐకాత్మ్యాధికరణము

ఏక ఆత్మనశ్శరీరే భావాత్. 53

శరీరముకంటె వేఱగు ఆత్మే లేనందువలన చచ్చిన పిదప ఎవరు ఏ ఫలము లనుభవించ వలయును? కాబట్టి ఉపాసనలు వ్యర్థము. ఈ శరీర శరీరమే ఆత్మ యని మేమెందుకు చెప్పుచున్నామనగా

ముండుటవలనే జ్ఞానము, సుఖము, ఇచ్ఛ మొదలగునవి అగపడు చున్నవి గదా! అసలు శరీరమే లేకపోయిన అవి అగపడవు. కాబట్టి శరీరమే ఆత్మ యని లోకాయత చార్వాక మతస్థుల పూర్వపక్షము.

వ్యతిరేకస్తద్భావాభావిత్వాన్నతూపలబ్ధివత్. 54

శరీరమునకంటె వేఱగు ఆత్మ త్రికాలాబాధితమై యున్నది. పై లోకాయత చార్వాక మతములు సరియైనవి కావు. శరీర ముండినను గాఢనిద్ర మొదలగు సమయములందు జ్ఞానేచ్ఛా సుఖాదులు అగపడుట లేదు. అందుచేత శరీర మాత్మ కాదు. జ్ఞానమునకు ఉపకరణము మాత్రము. కాని అదియు అప్రధానము. స్వప్నావస్థయందు దీ శరీరము జడమై కదలక పడి యున్నను జ్ఞానమో కలుగు చున్నది. కావున ఆత్మ శరీరమునకంటె విలక్షణుడు. విద్యయే మోక్షము నిచ్చు ననుటలో విరోధ మేమియు లేదని గ్రహింప వలెను.

3౧. అంగావబద్ధాధికరణము

అంగావబద్ధాస్తు న శాఖాసు హి ప్రతివేదమ్. 55

సర్వ వేదములందు ఉద్గీథాద్యవయవములను గుఱించి చెప్పబడిన ఉపాసనలు అన్ని శాఖల యందును వర్తించు నవియై యున్నవి. కారణ మేమన, తద్విషయమున శ్రుతియందు భేదము లేదు.

మంత్రాదివద్వాఽవిరోధః. 56

మంత్రాదులవలె ఉపాసనలను గూడా ఇతర శాఖలనుండి గ్రహించుకొన వచ్చును. విరోధ మేమియు లేదు.

3౨. భూమ జ్యాయస్త్వాధికరణము

భూమ్నః క్రతువజ్జ్యాయస్త్వం తథాహి దర్శయతి. 57

శంక: యజ్ఞమునకువలె సమస్తోపాసనకు ప్రాధాన్యము కలదు. ఇట్లని శ్రుతియును చెప్పుచున్నది. వైశ్వానర విద్యయందు వైశ్వానరునకు ఒక్కొక్క అవయవమగు ద్యులోకాదులను వైశ్వానరుడని తెలిసి ఉపాసించిన ప్రాచీనశాలుడు మొదలగు వారి అభిప్రాయములను తప్పనియు, సర్వావయవములతో గూడిన వైశ్వానరోపాసన విహిత

మనియు చెప్పబడి యున్నది కదా. అట్లుగాక ఒక్కొక్క అవయవమునే వైశ్వానరుడని తెలిసికొన్న తప్పేమి? అనిన,

సమా: ఒక్కొక్క అవయవమునే వైశ్వానరుడని తెలియుట సరికాదు. ఎందుకనగా, ఉపనిషత్తులయందు అది నిందింపబడి యున్నందు వలన సర్వావయవములచే గూడిన ఉపాసనయే గొప్పదని తెలియ వలెను. సర్వావయవములచే గూడిన అగ్నిహోత్ర దర్శ పూర్ణమాస ములు ఫలవంతము లగునట్లు సర్వాంగములచే కూడిన వైశ్వానరో పాసన పూర్ణ ఫలకారి యని అర్థము. ఒక్కొక్క అవయవమును ఉపాసించుట వలన స్వల్ప ఫలమైనను లభించునా? యని తెలియరాదు. ఎందుకనగా, వేఱు వేఱగు అవయవ మాత్రోపాసన వేదబాహ్య మని వేదమే చాటు చున్నది.

## 33. శబ్దాదిభేదాధికరణము

### నానాశబ్దాదిభేదాత్. 58

శంక: అటులైన దహర శాండిల్యాద్యుపాసనాది విద్య లన్నిటిని చేర్చి ఉపాసించ వలెనని చెప్పినట్లాయెను గదా. సర్వత్ర ఉపాస్యు డగు పరమాత్మ ఒక్కడే గావున అవన్నియు ఒకే యుపాసన గాదా? అనిన,

సమా: అట్లు గాదు. దహరాద్యుపాసనలు మొదలగు విద్య లను నిర్ణయించు శబ్దములు వేఱు వేఱయి యున్నవి. శబ్దము వేఱు వేఱయిన కర్మ వేఱగునని పూర్వ మీమాంసకులు చెప్పుదురు. మనో మయత్వము మొదలగు గుణములు, విధులు, ఉపాస్య దేవతలు వేఱు వేఱై యుండుటవలన ఆ విద్యలు ఒకటే కాదు. పరస్పర భిన్నములని తెలియవలెను.

## 34. వికల్పాధికరణము

### వికల్పోఽవిశిష్టఫలత్వాత్. 59

పై విద్యలలో పరస్పరము భేదముకలదని సిద్ధాంతము చేయ బడి యున్నను అందు ఉపాసకు డగువాడు ఏదొక విద్యను సమాశ్ర యించి అనుష్ఠానము చేయవలెను గాని రెండు మూడు విద్యలు కాదు.

ఆ ఉపాసనలు ఒకే ఫలము నిచ్చునవి యయినందువలన ఏదొక దానిని మాత్రము అనుష్ఠాన మొనర్చిన ఫలము దొరకును. కాబట్టి మఱొక దానిని సంక్రమింప జేసికొన వలసిన అగత్యము లేదు. అట్లు వేఱొకటి నుపాసించుటకై ఆయత్తుడైన చిత్తవిక్షేపమే ఫలమగును.

### 39. కామ్యాధికరణము

## కామ్యాస్తు యథాకామం సముచ్చీయేరన్నవా పూర్వహేత్వభావాత్. 60

కామ్యములగు ఉపాసన లెన్నియో గలవు గదా. వాటిని ఉపాసించుట తప్పా? అనిన, అట్లు గాదు. మనుష్యుని యందుండు కామవాసనలను బట్టి వేఱు వేఱు ఫలముల నిచ్చు ఉపాసనలు చెప్పబడి యున్నవి. మనుష్యుడు తన ఇచ్ఛ ననుసరించి ఎన్నియైనను చేసికొన వచ్చును. కాని పై సూత్రమునందు చెప్పినది అట్లుగాదు. అచ్చట ఫలము ఒకటే గావున ఒక ఉపాసనచేతనే ఫలము వచ్చుచుండ మఱొక ఉపాసన వ్యర్థమని అభిప్రాయము. ఇచ్చట వేఱు వేఱు ఫలము లుండుట వలన మానవుని ఇచ్ఛ ననుసరించి చేర్చుకొన వచ్చునని భావము.

### 38. యథాశ్రయాధికరణము

## అంగేషు యథాశ్రయభావః. 61

కర్మాంగమగు ఉద్గీథమును అవలంబించి వేఱు వేఱు శాఖల యందు అనేక ఉపాసనలు చెప్పబడి యున్నవి. కర్మాంగమగు ఉద్గీథము అన్ని వేదములయందు వచ్చుట వలన దాని ననుసరించి యున్న ఉపాసన లన్నిటిని చేర్చి అనుష్ఠింపవలయు ననియా? లేక కర్మాంగోపాసన స్వాతంత్ర్యము లేదనియా? అని పూర్వపక్షము మఱియు,

## శిష్టేశ్చ. 62

కర్మలను ఆధారము చేసికొని తదంగము లెట్లు విధింపబడి యున్నవో అటువలె ఈ ఉపాసనల నాధారముగా గైకొని విధింపబడినవి. కావున ఒక చోట చెప్పబడిన అంగములైనను మఱొకచోట నుండి సంగ్రహించి కర్మలతో ఎట్లు చేర్తురో అటువలె ఈ యుపాసన

లను గూడా సముచ్చయముగ నుపాసింపవలెనని తెలియుచున్నది. ఇదియును పూర్వపక్ష సూత్రమే.

సమాహారాత్. 63

ఉద్గాత తాను ఉద్గీథమును అపస్వరముచే ఉచ్చరించి ఉద్గీథమును దూషితముగావించి యుండినను ఓంకారము ఉద్గీథమని ధ్యానము చేసి యుండిన హోతయొక్క చక్కని శంసనము (స్తుతి) చే చక్క జేసికొనునని చెప్పబడి యున్నందుచేత ఇంకొక వేదమునందు చెప్పబడి యుండినను అద్దానిని చేర్చుకొన వచ్చునని తెలియ బడుచున్నది. (ఇది పూర్వ పక్షసూత్రము)

గుణసాధారణ్యశ్రుతేశ్చ. 64

అన్ని వేదములందును ఉద్గీథమను ఆశ్రయము ఉండియే ఉన్నది. ఆశ్రయము సమమై యుండగా వాటి నవలంబించి వచ్చు ఉపాసనలన్నియు ఒక్కటిగాక మరెట్లుండును? ఒకటే యని భావము (ఇదియును పూర్వ పక్షసూత్రమే.)

అవ: పై పూర్వపక్షమును ఖండించి సిద్ధాంతము చేయుచున్నారు.

న వా తత్సహభావాశ్రుతేః. 65

పైన చెప్పిన పూర్వ పక్షములు సరియైనవి కావు. ఆశ్రయములగు కర్మలతో జేర్చి సముచ్చయముగా తదంగములను అనుష్ఠింపవలయునని శ్రుతి యందున్నది గాని అంగములతో జేర్చి ఉపాసనల నుపాసింప వలయునని ఎచ్చటను లేదు. అట్లు చేర్చుట యనునది ఉపాసకుని ఇచ్ఛ ననుసరించి చెప్పబడినదే గాని వస్తుతః లేదు. ఉపాసనలు స్వతంత్రములే.

దర్శనాచ్చ. 66

పై విధముగా ఉపాసన చేసియుండు బ్రహ్మ యను ఋత్విజుడు యజ్ఞమును, మఱియు యజమానుని, ఇతరులగు ఋత్విజులను కాపాడును. పైన చెప్పిన ఉపాసనల నన్నిటిని ఒకటిగా చేర్చ వలయునని నియమ ముండినచో ఇతర ఋత్విజులును అటువలె ఉపాసకులుగ

గావలసి వచ్చును. ఇట్లు అందఱు సములై యుండగా బ్రహ్మయను ఋత్విజుడు ఇతరులను రక్షించు ననుమాట పొసగదు. అందుచేత పైని ఉపాసనల నన్నిటిని ఒక్కటిగా నైనను చేసికొని ఉపాసింప వచ్చును. లేక విడువ నైనను విడువ వచ్చును. చేయుట విడుచుట ఉపాసకుని యిష్టము.

ఇది మూడవ అధ్యాయమున మూడవ పాదము



## 3-వ అధ్యాయము 4-వ పాదము

### ౧. పురుషార్థాధికరణము

### పురుషార్థోఽతశ్శబ్దాదితి బాదరాయణః 1

బ్రహ్మవిద్య స్వతంత్రముగానే మోక్షము నిచ్చును గాని కర్మాంగముగా గాని, జ్ఞానము అంగముగా గలిగిన కర్మగాని కాదు. 'తరతి శోక మాత్మవిత్' 'బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి' 'బ్రహ్మవిదాప్నోతి పరమ్' ఇత్యాది శ్రుతులవలన బ్రహ్మసాక్షాత్కారముచేతనే మోక్షమని వేదములును చెప్పుచున్నవి. మఱియు సూత్రకారులగు వ్యాసమహామునియొక్క అభిప్రాయము నిదియే యని తెలియ వలెను. కాబట్టి బ్రహ్మవిద్య స్వతంత్రమై అసహాయ శూరుని వలె మోక్షప్రద మగునని తాత్పర్యము.

### శేషత్వాత్పురుషార్థవాదో యథాన్యేష్వితి జైమినిః 2

శంక: 'తరతి శోకమాత్మవిత్' ఇత్యాదిగా ఆత్మజ్ఞానము వలననే మోక్షమగు ననునది కేవలము అర్థవాదము. ద్రవ్యము, దేవతారూపాద్యంగములు గలిగి కర్మను ప్రశంసించు అర్థవాదములు ఎట్లున్నవో అటువలె బ్రహ్మజ్ఞానమును గుఱించి చేయబడిన ఫలవాదమే బ్రహ్మజ్ఞానమువలన మోక్షము కలుగునని చెప్పు మాటనై యున్నది. ఈ విధముగ పూర్వమీమాంసకుడగు జైమిని ముని 7-వ సూత్రమువఱకు తన పూర్వపక్షమును దెలుపును.

## ఆచారదర్శనాత్. 3

ఆత్మసాక్షాత్కారము నొందిన జనకుడు మొదలుగాగల వాసు, ఋషులు కూడా కర్మల నాచరించినట్లు 'జనకోహ వై దేహో బహు దక్షిణేన యజ్ఞే నేజే' విదేహు డనబరగిన జనకుడు భూరి దక్షిణలుగల యజ్ఞము చేసెనను ఈ వాక్యముచే బ్రహ్మవేత్త యగువాడును కర్మల నాచరించినట్లు తెలియ బడుచున్నది. కాబట్టి ఆత్మజ్ఞానము కర్మకు అంగమే గాని స్వతంత్రముగ ఫలము నిచ్చునది గాదు. (జైమినిఋషి పూర్వపక్షము).

## తచ్ఛ్రుతేః. 4

'య దేవ విద్యయా కరోతి' అను మొదలగు శ్రుతులు ఉపాసనతోగూడి చేయబడిన కర్మ అధిక ఫలదాయక మని తెలుపుచుండుటవలన ఆత్మజ్ఞానము కర్మకు అంగమే గాని స్వతంత్రముగా మోక్షము నివ్వజాలదు.

## సమన్వారంభణాత్. 5

'తం విద్యాకర్మణీ సమన్వారభేతే' అను శ్రుతిచేత జీవుడు పరలోకమునకు పోవునపుడు వానితోగూడ అతని ఉపాసన, కర్మ, పూర్వజన్మయందలి విషయ భోగ వాసనయు వానిని వెంబడించి పోవునని చెప్పబడి యున్నందువలన ఈ ఆత్మజ్ఞానమే స్వతంత్రముగా మోక్షమను మహాఫల మొసగునని చెప్పరాదు. ఆత్మజ్ఞానమే మోక్షమునకు సాధన మైనచో, మఱియునది జీవించి యుండగనే మోక్షము నిచ్చునదై యున్నచో వాని వెంబడి పోవలసిన అవసరమే మున్నది?

## తద్వతో విధానాత్. 6

'ఆచార్యకులా ద్వేదమధీత్యేతి' గురుసన్నిధి నుండుచు సాంగ వేదాధ్యాయియై అను మొదలగు శ్రుతులవలన సమస్త వేదార్థ జ్ఞానము గలవారే కర్మ నాచరించ వలయునని తెలియవచ్చుచుండుట వలన బ్రహ్మజ్ఞానము స్వతంత్రము కాదని స్పష్ట మగుచున్నది. ఆత్మను దేహేంద్రియాది సంఘాతమునకంటె వేఱని తెలిసిన వారు చేసిన

కర్మలకు సత్వరమున ఫలము గలుగునని శాస్త్రము చెప్పు చున్నందు వలన ఈ ఆత్మజ్ఞానము కర్మకు అంగమే గాని స్వతంత్రముగా మోక్షము నివ్వజాలదు.

## నియమాచ్చ. 7

"కుర్వన్నేవేహ కర్మాణి" ఇత్యాది శ్రుతులచే జీవిత పర్యంతము జ్ఞానులు, అజ్ఞానులు, అందఱును తప్పని సరిగా కర్మలు చేయవలసిన దేనని (శ్రుతి) చెప్పి యున్నందువలనను ఆత్మజ్ఞానము స్వతంత్రముగా మోక్షము నిచ్చునది గాదని తెలియు చున్నది. మఱియు ఆత్మజ్ఞానము మోక్షమునకు సాధన మని చెప్పినచో జ్ఞానానంతరము కర్మలన్నియు వ్యర్థమై పోవునట్లగును గదా? యనిన సమాధానము,

అవ: ఇంతవఱకు చెప్పబడిన పూర్వపక్షరూపమగు జైమిని మతమును ఖండించి సిద్ధాంతమును జూపుచున్నారు.

## అధికోపదేశాత్తు బాదరాయణస్యైవం తద్దర్శనాత్. 8

జైమినిమతము సమ్మతము కాదు. దేహేంద్రియాదులకంటె విలక్షణమగు ఆత్మను బ్రహ్మమునకంటె వేఱని తెలియరాదు. అభేద జ్ఞానము మోక్షమునకు పరమైక సాధనము. ఇది వ్యాసమహాముని మతము కావున మొదటి సూత్రమునందు చెప్పబడిన వ్యాస సిద్ధాంతమునకు జైమినిమతము ఏ విధముగను భంగకారకము కాదు. 'యస్సర్వజ్ఞస్సర్వవిత్' ఎవడు సామాన్యముగను విశేషముగను ఎఱుగుచున్నాడో అను మొదలగు శ్రుతుల వలన ఈ ఆత్మ దేహేంద్రియాది సర్వప్రపంచమునకంటె వేఱను జ్ఞానమాత్రముచే మోక్షము కాదు. ఈ ఆత్మ వ్యాపకమగు బ్రహ్మమునకంటె వేఱు గాదు. ఆత్మ బ్రహ్మమే యను అభేద జ్ఞానముచే మోక్షము స్వయంసిద్ధమని అర్థము. సుతరాం కర్మ అంగముగా గలది కాదు. జ్ఞానము కర్మాంగమని శ్రుతియందు ఎచ్చటను చెప్పబడ లేదు. ఇది పరమ సిద్ధాంతము.

అవ: బ్రహ్మవేత్తలుకూడా కర్మ చేయవలయు ననియు, అందుచే జ్ఞానము కర్మాంగమని చెప్పబడి యాకారణమును విశదీకరించుచు పై పూర్వపక్షమును ఖండించుచున్నారు.

## తుల్యం తు దర్శనమ్. 9

మూడవ సూత్రమునందు జెప్పిన విషయము సరికాదు. జ్ఞానియగు జనకుడును కర్మ నాచరించు చుండె ననియు మఱియు జ్ఞానులగు శుక వామ దేవాదులు కర్మను విడిచి యుండి రనియు ఇట్లు రెండు విధములుగా చెప్పబడి యుండుట వలన ఈ జ్ఞానులకు కర్మ కర్తృత్వక మగు అజ్ఞానము స్వస్వరూప జ్ఞానముచే నివృత్త మైనందున శేష ప్రారబ్ధముచే జరుపబడు ఆ కర్మ వ్యవహారములు కేవలము లీలా మయములు. లోకానుగ్రహ కారకములు. ఆదర్శ జీవనము లంతేకాని మఱేమియు గాదు. ఇంతమాత్రమున వారి జీవబ్రహ్మాభేదజ్ఞానమునకు బాధ లేదు. కర్మకు జ్ఞానము అంగమును గాదు. అర్థాత్ వేదాంత సిద్ధాంతమే పరమ ప్రమాణ మని గ్రహించ వలెను.

అవ: ఇప్పుడు నాల్గవసూత్రార్థమును ఖండించు చున్నారు.

## అసార్వత్రికీ. 10

'యదేవ విద్యయా' అను శ్రుతి అన్ని విద్యలకు సంబంధించినది కాదు. ఉపాసన యనగా ఈ స్థానమున గ్రహింప దగినది బ్రహ్మలోకమును కలిగించు దహర శాండిల్య వైశ్వానరవిద్యలు సగుణ బ్రహ్మోపాసనలు గావు. ఇచట కేవలము ఉద్గీథవిద్యను గుఱించి చెప్పినదే కాని సర్వవిద్యలను గుఱించి చెప్పినది కాదు.

## విభాగశ్శతవత్. 11

పరలోకగతుడగు పురుషునితో పూర్వజన్మ విషయ భోగ వాసనలు ఆ జీవుని వెంబడించి లోకాంతరమునకు పోవునను వెనుకటి పూర్వపక్షముచే ఆత్మజ్ఞానము స్వతంత్రముగా మోక్షప్రదమని చెప్పు విషయమునందు పూర్వపక్షవాది చెప్పు విద్యాకర్మల సముచ్చయము పొసగదు. అచ్చట ఉపాసన యని చెప్పబడిన మాటకు నిర్గుణబ్రహ్మమని అర్థము కాదు. నిర్గుణబ్రహ్మజ్ఞానానుభవులైన వారికి ఇచ్చటనే లింగ శరీరము భంగమై పోయి యుండును. కావున వారు ప్రత్యగభిన్న బ్రహ్మస్వరూపులై యుందురని శ్రుతి చెప్పుచున్నది. నిజమగు జ్ఞానమునకు లోకాంతర గమనము లేదు. ఇక అచ్చట ఉపాసన

యను మాట కర్థము సగుణ బ్రహ్మోపాసన యని భావము. అప్పుడు మాత్రమే ఉపాసన, మఱియు నా కర్మవాసనలచే గమనాగమనములు పొసగును. అర్చిరాది మార్గముద్వారా బ్రహ్మలోకమునకు పోవు సగుణోపాసకుని వెంబడి సగుణబ్రహ్మోపాసనావిషయకమగు వాసన పోవును. ఇక ధూమాదిమార్గమున స్వర్గమునకు పోవు కర్మి వెంబడి అతని జ్యోతిష్టోమాది కర్మవాసన వెన్నంటును. వంద రూపాయలు ఇద్దఱికి ఇవ్వవలెనని చెప్పిన ఒక్కొక్కరికి ఏబది ఏబది వంతున ఇవ్వ వలయునని అర్థమగు చున్నది గదా. అటువలె సగుణబ్రహ్మోపాసన బ్రహ్మలోక ప్రాప్తికి సాధనము. జ్యోతిష్టోమాదులు స్వర్గ సాధన కర్మలు. ఈ రెండును చేరి ఒక్కదానికి సాధనములు గావు. ఇవి రెండును వేఱువేఱు ప్రయోజనములు గలవనియే తెలియ వలయును. విద్యాకర్మల సముచ్చయ మెప్పుడును పొసగదు.

అవ: ఆఱవసూత్రార్థమును ఖండించు చున్నారు.

## అధ్యయనమాత్రవతః. 12

వేదాధ్యయన మొనర్చిన వానికి మాత్రమే కర్మ విధింప బడినది గాని బ్రహ్మజ్ఞానము గలవానికి కాదు. బ్రహ్మజ్ఞానము కలవాడు కర్మప్రవృత్తి నొందుటకు వీలు లేదు. అనగా కర్తయై అజ్ఞతచే వర్తింపడు. కాబట్టి సాంగ వేదాధ్యయన మనునది కర్మకాండ వఱకేనని గ్రాహ్యము. కర్మజన్యములగు ఫలములను గుఱించియే కర్మ విధింప బడినది. బ్రహ్మానుభవముచే బరగు బ్రహ్మజ్ఞానికి లేశ మైనను కర్మవిధి లేదు.

## నావిశేషాత్. 13

ఏడవసూత్రమునందు చూపబడిన 'కుర్వన్నేవేహ కర్మాణి' అను శ్రుతి జ్ఞానులు, అజ్ఞానులు జీవిత పర్యంతము కర్మ చేయవలయునని చెప్పలేదు. ఆ శ్రుతికి కర్మలను చేయ వలయు ననియే అర్థము గాని జ్ఞానులుగూడా కర్మలను చేయవలయునను అర్థముతో చెప్పలేదు. కార్యసహిత కారణాజ్ఞాన నివృత్తి యైన పిదప జ్ఞాని కర్మ నేమని యాచరింపవలెను? తత్వవిదుని కడకు ఆకర్మ ఏ రూపమున వచ్చి

చేరును? వస్తుతః అత్యంతాభావము. కావున పై శ్రుతి అజ్ఞానులను గుఱించి చెప్పబడినదే గాని జ్ఞానుల విషయమై చెప్పబడినది కాదు. బ్రహ్మాత్మాభేద జ్ఞానము నొందిన తత్త్వవిదుని కర్మ లంటునా? అంట వని సిద్ధాంతము.

## స్తుతయేఽనుమతిర్వా. 14

జీవిత పర్యంతము కర్మల నాచరించ వలయునని చెప్పిన మాట జ్ఞానులకు సంబంధించినది కాదు. ఈ మాట నీవు ఒకవేళ జ్ఞానులను గుఱించినదియేయని హఠము బూనినను జ్ఞానిచే ఆచరింపబడు కర్మలు అతని నంటవు. అది లోకానుగ్రహార్థమై యుండును, లేదా విద్యా ప్రభావ స్తోత్రము మాత్రమే యని గ్రహింప వలెను. పై వాక్యము నందలి పూర్ణాభిప్రాయ మేమన కర్మానుష్ఠానము అగత్యమని తెలిసి నదే గాని జ్ఞానులును అజ్ఞానులును కర్మలు చేసియే తీరవలయునను విధ్యర్థము గాదు.

## కామకారేణ చైకే. 15

మఱియు జ్ఞానులగు కొందఱు మహాత్ములు మనఃపూర్వకముగా కర్మసంన్యాస మొనర్చిరని శ్రుతి చెప్పుచున్నది 'ఏతద్ధర్మవైతత్పూర్వే' అందుచే పరబ్రహ్మతత్త్వమే ఆత్మరూపమున ప్రత్యక్షఫలమై యుండ పరోక్షమగు కర్మ ఫలముతో నేమి పని? సంతానాదులతో నేమి పని? యని చెప్పు నీ వాక్యములను జూచిన బ్రహ్మజ్ఞానులు కర్మల నెల్ల విడిచి నిర్మలముగా బ్రహ్మాత్మనా సంస్థితి రూపులై యుండినట్లు తెలియు చున్నది. అందుచేత ఎల్లప్పుడు కర్మలు చేయుచుండ వలయునను వాక్యము అజ్ఞానులకొఱకై చెప్పబడినదే కాని ప్రత్యక్ష ఫలదాయి యగు విద్య పరోక్షఫలము నిచ్చు కర్మకు అంగము గాదు.

## ఉపమర్దం చ. 16

'యత్రత్వస్య సర్వమాత్మైవాభూత్తత్కేన కం పశ్యేత్' అనగా సర్వము ఆత్మ స్వరూపమే యైనపుడు జ్ఞాని దేనితో దేనిని చూచును? అను మొదలగు వాక్యములచేత జీవుడు బ్రహ్మమే యను జ్ఞానమువలన కర్మలనెల్ల కాల్చి భస్మ మొనర్చును. అందుచే నది కర్మాంగము కాదు. జీవ బ్రహ్మాభేదము కలిగిన వెంటనే (జ్ఞానో

త్తర సమకాలమునందే) జీవుడు కర్త, భోక్త అను మొదలగు ధర్మములును, అగ్నిహోత్రాది కర్మలును, స్వర్గాది తత్తత్ఫలములును, అసత్యములని అపరోక్షముగ తెలియును.

## ఊర్ధ్వరేతస్సు చ శబ్దే హి. 17

'ఏతమేవ ప్రవ్రాజినో లోకమిచ్ఛంతః ప్రవ్రజంతి' పరబ్రహ్మానుభవమును కోరువారై సన్న్యాసులు సన్న్యసింతురు. ఇట్లని శ్రుతియందు బ్రహ్మవిద్యను విని తెలిసికొనుటకు సన్న్యాసులే అధికారులని చెప్పబడినది. ఈ కారణముచేతను విద్య కర్మాంగము గాదని అర్థము. అయితే ఈ సన్న్యాసాశ్రమమును గుఱించి వేదమునందు చెప్పబడలేదే! అని కొందఱు ఆక్షేపింతురు. కాని అది తప్పు. 'త్రయో ధర్మస్కంధాః' ధర్మమును సాధించుటకై ఏర్పడిన ఆశ్రమములు మూడు ఇట్లని ఆరంభించి, 'సర్వ ఏతే పుణ్యలోకా భవంతి బ్రహ్మసంస్థోఽమృతత్వమేతి' ఈ మూడు ఆశ్రమముల వారును పుణ్యలోకము పొందుదురు. పరబ్రహ్మ నిష్ఠగల సన్న్యాసి మోక్షము నొందును అని చెప్పబడి యున్నది. కాబట్టి సన్న్యాస మనగా జ్ఞానానుభవమనియే అర్థము. ఈ విషయము అనేక స్థలములయందు చెప్పబడి యున్నది. దీనినే తురీయమని, తురీయాశ్రమ మనియు పిలుతురు. అందువలన ఎట్లు చూచినను జ్ఞానము కర్మాంగము కాదని స్పష్టముగా సిద్ధాంతీకరింప బడినది.

### ౨. పరామర్శాధికరణము

అవ: ఈ అధికరణమున సన్న్యాసము వేదచోదిత మగునా? కాదా? యని విమర్శింపబడును.

## పరామర్శం జైమినిరచోదనాచాపవదతి హి. 18

అయ్యా! సన్న్యాసాశ్రమము కలదని చెప్పితిరి కదా? అది యోగ్యము కాదు. 'మూడు ధర్మములుగల' అను మొదలగు వాక్యములందుండిన తపస్సను మాటచే సన్న్యాసాశ్రమమేమో యని తెలియుట నిజము. కాని అది అచ్చట విధింప బడలేదు. దాని ప్రక్కనే చెప్పబడి యుండు బ్రహ్మచర్యము మొదలగు మూడు ఆశ్రమములను స్పష్టముగా విధించు వేదవాక్యము లున్నందువలన అవి మేమాచరించ

వలసినవై యున్నవి. సన్న్యాస మైననో 'బ్రహ్మమునందే దృష్టి (మనస్సు) గల మానవుడు మోక్షము నొందు' నను నీ వాక్యమునందు చెప్పబడి యుండు బ్రాహ్మీస్థితిని పొగడుట కొఱకు మాత్రమే వెలువడి నదై యున్నది. ఆచారమునందును, స్మృతియందును ఉండు సన్న్యాసాశ్రమమును ఇచ్చట అనువాదము చేసినను 'వీరహా వా ఏష దేవానాం యోగ్నిముద్వాసయతి' సమస్త దేవతలలో ముఖ్యుడగు అగ్ని నెవ్వడు ఉద్వాసనము చేయునో అతడు వీరహత్య చేసిన వాడు అను మొదలగు వాక్యమునందు సన్న్యాసము నిందింపబడి యున్నది. కాబట్టి కర్మకు అనధికారులగు కుంటి, గ్రుడ్డి మొదలగు అంగహీనులకు మాత్రమే సన్న్యాసము విధింప బడినదని తెలియ వలయును (ఇట్లని పూర్వ పక్షసూత్రము).

అనుష్ఠేయం బాదరాయణ స్సామ్యశ్రుతేః. 19

జైమినిమతము సరియైనది కాదు. 'వీరహా' అను మొదలైన శ్రుతికి విరోధము వచ్చునని చెప్పు నతని తలంపు తప్పు. ఆ శ్రుతి అశ్రద్ధ వలన అగ్నిని ఉద్వాసన మొనర్చిన (విడిచిన) పురుషుని గుఱించి చెప్పునే గాని నిజమగు ఆత్మజ్ఞాని యయిన సన్న్యాసిని గుఱించి చెప్పిన మాట కాదు. బ్రహ్మచర్యము మొదలగు ఆశ్రమములతో గూడ చెప్ప బడియున్న సన్న్యాసము పై ఆశ్రమములవలె అనుష్ఠేయమే నని అర్థము. ఇతర శ్రుతులయందు విస్పష్టముగా విధింప బడియున్న బ్రహ్మచర్యాద్యాశ్రమములచే పైన చెప్పబడిన వాక్యమునందు అనువాదము చేయబడినవై యుండినట్లు, వేఱు శ్రుతుల యందును స్పష్టముగా విధింప బడియున్న సన్న్యాసాశ్రమమే ఇచ్చట అనువాదరూపమం దున్నదని గ్రాహ్యము. సన్న్యాసాశ్రమమునందే తపస్సు చక్కగా జరుగును. 'సన్న్యస్య శ్రవణం కుర్యాత్', అనియు చెప్పబడి యున్నది. తపస్సను పదముచే సన్న్యాసాశ్రమమును స్వీకరించుటయందు సందేహము లేదు. కాబట్టి నాలుగవ ఆశ్రమ మాచరింప దగినదే. ఇది వేదవ్యాస మతము.

విధిర్వా ధారణవత్. 20

పైన చెప్పిన శ్రుతి సన్న్యాసాశ్రమమును గుఱించి అనువాద

మాత్రమే యని తెలియరాదు. 'సమిధలను ధరించుట యను క్రియ వలె' సన్న్యాసము విధి యన్నను తప్పు గాదు. ఇతర ప్రమాణముల వలన సిద్ధించిన ఒక విషయమును ఒకానొక కార్యార్థమై మఱొకసారి చెప్పుట అనువాద మగును. అట్లు గాక, శ్రోత్రవిషయమును చెప్పుట అనువాదము కాదు. తపస్సను శబ్దము కూడి పై వాక్యముచే విధింప బడుచున్నది గాన విధి యనియే అంగీకరింప వలయును.

## 3. స్తుతిమాత్రాధికరణము

### స్తుతిమాత్రముపాదానాదితి చేన్నాపూర్వత్వాత్. 21

శంక : ఉద్గీథము అన్ని రసములకు ఉత్కృష్టమగు రసతమమైనదను ఇత్యాది వాక్యములచే కర్మాంగమగు ఉద్గీథాదులను మాత్రమే స్తుతించినట్లగపడు చున్నది గదా? యనిన,

సమా : ఆ వాక్యమును స్తుతిమాత్రముగా చెప్పుట తప్పు. 'సఏష' అను మొదలగు స్తుతులు కర్మాంగ శ్రుతి పరములు కావు. ఆ శ్రుతియందు విధింప బడిన రసతమత్వాది గుణములు అంతకు పూర్వము ఇతర ప్రమాణములచే చెప్ప బడినవి కావు. రసతమత్వాది గుణములతో కూడిన ఉద్గీథోపాసన ఇతర ప్రమాణములచే గోచరము కాదు. కాబట్టి విధింప బడిన దనియే చెప్పవలయునని తాత్పర్యము.

### భావశబ్దాచ్చ. 22

అంతే కాదు. ఉద్గీథము నుపాసించుమని విధించు పదములు విస్పష్టముగ నున్నందువలన ఉద్గీథము రసతమమైనది యను మొదలగు వాక్యములు ఉద్గీథోపాసనను విధించుటకొఱకై వెలువడినవి గాని స్తుతి పరములు కావు.

## ౪. పారిప్లవాధికరణము

### పారిప్లవార్థా ఇతి చేన్న విశేషితత్వాత్. 23

అశ్వమేధమునకు అంగమై పారిప్లవ మను నొక కర్మ గలదు. 'వైవస్వత మనువు రాజ్య మేలుచుండెను, ఇత్యాదిగా చెప్పబడు కొన్ని కథాసందర్భములను పారిప్లవ మందురు. కాని ఉపనిషత్తుల

యందు చెప్పబడు ఉపాఖ్యానములు (కథలు) పారిప్లవార్థములు కావు. అవి బ్రహ్మవిద్యకు సంబంధించినవి. కర్మాంగభూతమగు మంత్రములను పారిప్లవమునందు చెప్ప వలయునని చెప్పబడి యుండుటచే అవి జ్ఞానకాండయందుండు యాజ్ఞవల్క్య మైత్రేయి ఇత్యాది ఉపాఖ్యానములతో సంబంధముగలవి గావు. వీనిని పారిప్లవాంగములని చెప్పరాదు.

## తథాచైకవాక్యతోపబంధాత్. 24

ఉపాఖ్యానములు పారిప్లవాంగములై యుండినను బ్రహ్మవిద్యాప్రకరణమునందు వచ్చి యుండుటచే అవి బ్రహ్మవిద్యాంగములనియే గ్రహింపవలెను. ఉపాఖ్యానముల మూలకముగా బ్రహ్మవిద్యను తెలుపుటచే అత్యంత మందబుద్ధులకు కూడా సులభముగా తెలియునను దృష్టిచే చెప్పబడినవే కాని అన్యములు కావు.

### ౫. అగ్నీంధనాధికరణము

## అత ఏవ చాగ్నీంధనాద్యనపేక్షా. 25

బ్రహ్మవిద్య కర్మలతో సంబంధము లేక స్వతంత్రమై యున్నందువలన మోక్ష విషయమున కర్మల సహాయ మక్కఱ లేదు. అంతేగాక ఈ బ్రహ్మవిద్య (యతులకు) వివేక వైరాగ్యములుగల అధికారులకు సంబంధించిన ప్రసంగ మైనందున బ్రహ్మసాక్షాత్కృతికై అగ్నిహోత్రాదికర్మ లపేక్షణీయములు కావు.

### ౬. సర్వాపేక్షాధికరణము

## సర్వాపేక్షా చ యజ్ఞాదిశ్రుతేరశ్వవత్. 26

శంక: 'తమేతం వేదానువచనేన బ్రాహ్మణావివిదిషంతి యజ్ఞేన దానేన తపసా' వేదాధ్యయన యజ్ఞ దాన తపస్సులచే మోక్షార్థులగువారు బ్రహ్మమును దెలిసికొన నిచ్ఛయించుచున్నారనునీ శ్రుతిచేత బ్రహ్మసాక్షాత్కారమునకు యజ్ఞ దాన తపస్సులే సాధనములై యుండగా కర్మలు అపేక్షణీయములు కావనిన, అదెట్లు పొసగును?

సమా: బ్రహ్మసాక్షాత్కారమునకు కర్మలు మొదలగునవి పరంపరాసాధనములై యున్నవి. అంతేగాని జ్ఞానసమకాలమునందు కర్మల

వలని ప్రయోజనము లేదు. క్రమసముచ్చయ మంగీకారమే గాని సమ సముచ్చయము గాదు. గుఱ్ఱము నడుచుచు అడుగును ముందు వేయుటవలన ముందు గ్రామము చేరుటకు సాధన మగునట్లు నిష్కామ కర్మోపాసనలచే చిత్తశుద్ధి, అందుచే వైరాగ్యము, ఆపిదప కర్మతాదాత్మ్యమునుండి విడువడు సన్న్యాసము, తరువాత బ్రహ్మజిజ్ఞాసారూప శ్రవణ మనన నిదిధ్యాసనేత్యాది పరంపరచే నిష్కామములగు యజ్ఞ దాన తపస్సులు ఈవిధముగ బ్రహ్మసాక్షాత్కారమునకు సాధనము లగునని గ్రహింప వలయును.

శమదమాద్యుపేతస్స్యాత్తథాపి తు తద్విధే స్తదంగతయా తేషామవశ్యానుష్ఠేయత్వాత్. 27

సాధకుడు బ్రహ్మసాక్షాత్కారముకొఱకై కర్మలు చేయకపోయినను అంతర్బహిరింద్రియముల నిగ్రహ మవశ్యము చేయవలయును. నిష్కామ కర్మయుక్తమగు శమదమాదులు జ్ఞానమునకు బహిరంగ సాధనములు. శ్రవణ మనన నిదిధ్యాసనములు అంతరంగ సాధనములు.

౭. సర్వాన్నానుమత్యధికరణము

సర్వాన్నానుమతిశ్చ ప్రాణాత్యయే తద్దర్శనాత్. 28

పురుషుడు ప్రాణము పోవు పరిస్థితియందు ఏవిధమగు ఆహారమునైనను భుజింప వచ్చునని శ్రుతి చెప్పుచున్నది. ఈ విషయమున ఛాందోగ్యాది శ్రుతులయందు కొన్ని దృష్టాంతములు కలవు. కాని స్వస్థులగువారు సర్వానుకూలము లుండియు అయోగ్యమగు అభక్ష్యమును భక్షణము జేయుట తప్పు. ఇది ప్రాణోపాసకుని గుఱించి విద్యాస్తోత్రరూపమగు అర్థవాదమే గాని విధికాదు.

అబాధాచ్చ. 29

సర్వాన్నములను భుజింప వచ్చునను మాట విద్యావిషయము కాదు. కొన్ని పదార్థములను తినకూడదు. అర్థాత్ దుష్టాన్నములను భుజింప గూడదను నీవిషయము శ్రుతిసమ్మతము.

అపిచ స్మర్యతే. 30

(ఇటువలె) స్మృతియందుగూడ తినదగిన, తినరాని పదార్థములను గుఱించిన విభాగము చెప్పబడి యున్నది.

శబ్దశ్చాతోఽకామకారే. 31

తాత్పర్య మేమనగా, స్వేచ్ఛాచారము వలదు; సర్వాన్నభక్షణశ్రుతి అర్థవాదము. హిత మిత పవిత్రాన్నములు భక్షణీయములని గ్రాహ్యము.

౮. విహితత్వాధికరణము

విహితత్వాచ్చాశ్రమకర్మాపి. 32

బ్రహ్మచారి, గృహస్థు మొదలగు అన్ని ఆశ్రమముల వారును స్నాన శౌచాది బహిరంగ సాధనములను అవశ్య మాచరింప వలయును. వేదము ఇట్లు విధించు చున్నది.

సహకారిత్వేన చ. 33

విధ్యుక్తములగు ఆ యా ఆశ్రమ ధర్మములు చిత్తశుద్ధిని కలుగజేసి తన్మూలమున బ్రహ్మసాక్షాత్కారమునకు సాధనము లగునని భావము.

సర్వథాఽపి త ఏవోభయలింగాత్. 34

శ్రుతిస్మృతులయందు జ్ఞానార్థమగు కర్మ అనుష్ఠేయమని, పరస్పర విరోధము లేదని చెప్పబడి యున్నది.

అనభిభవం చ దర్శయతి. 35

"ఏషహ్యాత్మా న నశ్యతి యం బ్రహ్మచర్యేణానువిందతే" ఏ ఆత్మను బ్రహ్మచర్యముచే తెలిసికొనుచున్నాడో ఆ యాత్మ దుఃఖాదులచే నశింపదు అనగా బ్రహ్మచర్యము గలవానికి దుఃఖాదులచే ఆత్మజ్ఞానము కుంఠితము గాదని శ్రుతి చెప్పు చున్నది. కామక్రోధాది గుణోద్వేగము లేక ఆత్మయందు నిలుకడ నొంద సహాయమని అర్థము.

౯. విధురాధికరణము

అంతరాచాపితు తద్దృష్టేః. 36

భార్య వియోగమైనవారు ఏ ఆశ్రమమునకును చెందిన వారు గాకపోయినను వివేకులై బ్రహ్మవిద్యాపేక్ష కలిగి వర్తించిన వారు గూడా బ్రహ్మవిద్యాధికారులే యగుదురు. అగ్నిహోత్రాది కర్మల నుండి వారి మనస్సు దూరమై యుండును. ఇట్టి బహుజనులు బ్రహ్మ సాక్షాత్కారము నొందినవా రున్నారు. రైక్వ మహారాజు మొదలగు విధురులు అనేకులు బ్రహ్మసాక్షాత్కారమును పొంది యున్నట్లు శ్రుతి యందు వర్ణింపబడి యున్నది.

అపిచ స్మర్యతే. 37

మఱియు స్మృతియందును ఇట్లే చెప్పబడి యున్నది. అనేకులు బ్రహ్మసాక్షాత్కారము నొంది యుండిరని మహాభారతేత్యాది ఇతి హాసములయందును మన్వాది స్మృతుల యందును చెప్పబడి యున్నది.

విశేషానుగ్రహశ్చ. 38

జ్ఞానము గలుగుటకు హేతువగు కొన్ని జన్మాంతర సుకృత కర్మ విశేషములచేత ఇపుడే యాశ్రమ విధులును లేకపోయినను స్నాన జప తప ఆది సామాన్య కర్మలచేతనే జన్మాంతర శుభ సంస్కార ముప్పతిల్ల జ్ఞానము కలుగ వచ్చును.

అత స్త్వితరజ్జ్యాయో లింగాచ్చ. 39

బ్రహ్మవిద్యయం దధికారము అందఱికి ఉన్నను విధురుల కంటెను ఆశ్రమ యుక్తులైనవారు ఉత్తములు, పుణ్యాధికులు. అయితే ఇంత మాత్రమున విధురుల కధికారము లేదని తలపరాదు. ఆశ్రమము కలిగి యుండుట పరమ శ్రేష్ఠమని తాత్పర్యము.

౧౦. తద్భూతాధికరణము

తద్భూతస్యతు నాతద్భావో జైమినేరపి నియమాతద్రూపా భావేభ్యః. 40

పై అధికరణమునందు ఆశ్రమము లేని వాఱికి కూడా బ్రహ్మ

విద్యయం దధికారము: గలదని చెప్పబడినది అన్నపుడు ఇక ఉత్తమా
శ్రమము పొందియు మరల పూర్వాశ్రమమునకు వచ్చిన వారికి బ్రహ్మ
విద్యాధికారము కలదా? యని శంకించుకొని సమాధానము చెప్పు
చున్నారు.

ఉత్తమాశ్రమము నవలంబించి మరల పూర్వాశ్రమమునకు
రాకూడదు. అనగా సన్న్యాసాశ్రమ స్వీకరణానంతరము మరల వెను
తిరుగరాదు. అది తప్పు. అప్పుడు చేయబడిన కర్మలు జ్ఞాన సాధన
ములు కావు. ఉత్తమాశ్రమము వారు మరల పూర్వాశ్రమమునకు
వచ్చుట నిషేధము. అనాచారము, అయోగ్యమని అర్థము.

### ౧౧ ఆధికారికాధికరణము

### నచాధికారికమపి పతనానుమానాత్తదయోగాత్. 41

నైష్ఠిక బ్రహ్మచర్యాశ్రమముచే అనగా ఆజన్మ బ్రహ్మచారులై
సన్న్యాసాశ్రమమునం దుండుచు కర్మలను జరుపుకొను చుండిన వారికి
ఒకప్పుడు బ్రహ్మచర్యాది నియమములు చెడినచో అనేకవిధములగు
మజ్జనాది (స్నానములు), వేలాది ఓంకార జపము, ప్రాణాయామము
మొదలగు ప్రాయశ్చిత్తములు గలవని మనుస్మృతి మొదలగు వాటి
యందు చెప్పబడినది. కాని అది చెల్లదు. ఆశ్రమమునుండి భ్రష్టుడైన
వానికి ప్రాయశ్చిత్తము లేదు. వారు పతితులే. వారు క్రింద జాతి
పడిపోయిన వారే అని (పూర్వపక్ష సూత్రము.)

### ఉపపూర్వమపిత్వేకే భావమశనవత్తదుక్తమ్. 42

పై పూర్వపక్షము సరియైనది కాదు. నైష్ఠిక బ్రహ్మచారి
యొనర్చిన దోషములకు ప్రాయశ్చిత్తము కలదు. అటువలె సన్న్యాసి
విషయము నందు కూడా ప్రాయశ్చిత్తము కలదు. కాబట్టి ఉత్తమాశ్ర
మస్థులు ఒకానొకప్పుడు ప్రమాదము వలన దోషులైనను ప్రాయశ్చి
త్తముచేత పరిశుద్ధులై బ్రహ్మజ్ఞాను లగుటకు సందేహము లేదని
తాత్పర్యము. ఇది యథార్థమగు బ్రహ్మజ్ఞానానుభవులకు సంబంధించిన
మాట కాదు. అచ్చట పాపము, ప్రాయశ్చిత్తము లనునవి అత్యంతా
భావములు. వారు నిజ నిష్ఠా గరిష్ఠులు.

## ౧౨. స్మృత్యాచారాధికరణము

బ్రహ్మచర్య, సన్న్యాసములనుండి భ్రష్టుడైన వానిని సమాజము దూరీకరించును.

### బహిస్తూభయథాపి స్మృతేరాచారాచ్చ. 43

ఆశ్రమ భ్రష్టుడు చేసిన మహాపాపమో, ఉపపాపమో, ఏదైన నేమి? అది ప్రాయశ్చిత్తములచే పరిశుద్ధీకరింప బడినను శిష్టులగువారు అతనిని బహిష్కరింతురు. ఇందలి రహస్య మేమన, ప్రాయశ్చిత్తముచే పరలోక దండన లేదు. అనగా పాపము నశించినను ఇహమున అతనిని బహిష్కరింపగల పాపాంశము నశింపదు. లోక మెప్పటికి పామరజన బహుళమై యుండును. ప్రాయశ్చిత్తముచే కల్గిన అతని మానసిక పవిత్రతను తెలిసికొన జాలదు. ప్రసిద్ధమైన దోషమునే చూచుచుందురు. కావున శిష్టులగువారు ఇట్టి వారిని పరిగ్రహించుటచే కడకు శిష్టులపై యుండు అభిమానము మఱియు అతనిచే చెప్పబడు ధర్మమును కూడ అనాదరముగ జూతురు. ఇది లోకముయొక్క పోకడ. ఎట్లయిననేమి? సన్న్యాసమునుండి వెను దిరిగిన వారు సమాజమునుండి దూరమగుదురు.

## ౧౩. స్వామ్యాధికరణము.

### స్వామినః ఫలశ్రుతేరిత్యాత్రేయః. 44

ఉద్గీథ, ఆహవనీయాది, కర్మాంగములను బ్రహ్మముగా చూచు ఆ యజమానుడు ఉపాసన చేయ దగునని ఆత్రేయ మహాముని తలంచు చున్నాడు. కారణ మేమనిన, తత్ఫలము యజమానునకు చెందునని శ్రుతి గలదు. (ఇది పూర్వ పక్షసూత్రము.)

### ఆర్త్విజ్యమిత్యౌడులోమి స్తస్మై హి పరిక్రియతే. 45

ఉపాసనలను ఋత్విక్కులు చేయ వచ్చునని ఔడులోమ్యాచార్యుల మతము. ఎందుకనగా కర్మలను సాంగముగ అనుష్ఠానము చేసినందులకు యజమానుడు ఋత్విజునకు దక్షిణ యొసగును. ఋత్విజుడు చేసిన కర్మఫలము యజమానునకు ఎట్లో, అటువలె ఋత్విజుడు చేసిన కర్మాంగమగు ఉపాసనా ఫలమును యజమానునకే చెందును.

## శ్రుతేశ్చ. 46

ఋత్విజులు చేసిన అంగోపాసన యజమానునకు ఫల మొసగు నని శ్రుతియు గలదు.

### ౧౪. సహకార్యంతరవిధ్యధికరణము.

## సహకార్యంతరవిధిః పక్షేణ తృతీయం తద్వతో విధ్యాదివత్. 47

కర్మకాండశ్రుతులయందు స్వర్గమను ఫలముకొరకై గృహస్థులకు అగ్నిహోత్రాది అనేక కర్మలను విధించియుండునట్లు, జ్ఞానకాండ శ్రుతులయందు అంతర్బహిరింద్రియ నిగ్రహములతో గూడి బ్రహ్మసాక్షాత్కారార్థమై శ్రవణ మనన నిదిధ్యాసలను చేయవలయునని నియమము గలదు. ఈ శ్రవణ మననాది మూడు సాధనములయందు మొదటి రెండు బ్రహ్మసాక్షాత్కారము నపేక్షించు ముముక్షువులెల్లరు బహుకాలము ఆచరింప వలెను. మూడవదియగు నిదిధ్యాసమునకు ఆ నియమము లేదు. కాని ఎవరికి శ్రవణ మనాదులైన పిదప వర్ణాశ్రమాద్యభిమానములచే దేహేంద్రియ మనోభావము లుండునో అనగా విపరీతభావన గలవారు బహుకాలము నిదిధ్యాసమును చేయవలెను. ఎవరి చిత్తము శుద్ధమై దేహాద్యభిమానము శ్రవణ మననాదులచే నివృత్తమై యుండునో వారు నిదిధ్యాసమును అత్యల్పకాలము చేసినను చాలును. మఱియు చిత్తశుద్ధి యుండి బలమైన ఈశ్వరానుగ్రహము, శ్రీ గురుకృపయును గలవారికి శ్రవణ మననాదులు కూడా అత్యల్పదినములే చాలునని తాత్పర్యము.

## కృత్స్నభావాత్తు గృహిణోపసంహారః. 48

శంక : బ్రహ్మచర్యమునుపూర్ణము గావించి ఆ పిదప గృహస్థుడై బహుకుటుంబియై యుండుచు జీవిత పర్యంతము వేదాధ్యయనము జేసికొనుచు ఉండవలయునని శ్రుతియందు బ్రహ్మచర్యము, గృహస్థాశ్రమము ఇవి మాత్రమే గణ్యములై యున్నవి. అచ్చట సన్న్యాసమను మాటయే లేదు. కాబట్టి అగ్నిహోత్రము మొదలగు కర్మలకును శ్రవణ మననాదులకు గూడా గృహస్థులే తగిన అధికారులని అర్థమగుచున్నదిగదా? యనిన,

సమా : అట్లు గాదు. గృహస్థాశ్రమము నందు సమస్తాశ్రమముల ధర్మములు అడగి యున్నవి. అంతమాత్రము చెప్పుట చాలు. మఱియు సన్యాసమును విధించు శ్రుతులును పెక్కులు గలవు. కాబట్టి ఇందుపై గృహస్థులకు తమ కర్మలతో సహ శ్రవణ మననాదులకు విశేషముగు అవకాశ ముండదు కాబట్టి, శ్రవణ మననాదులు చేయుటకు సన్న్యాసులకు అవకాశ మెక్కువనియు జీవితపర్యంతము కుటుంబియై సంసార లంపటచే నుండు ననుమాట వైరాగ్యవిహీనులగు వారిని గుఱించి చెప్పిన మాటయే గాని అన్యము కాదు.

## మౌనవదితరేషామప్యుపదేశాత్. 49

శంక : బ్రహ్మచర్య, గృహస్థ, సన్న్యాసములను ఈ మూడాశ్రమములు శాస్త్ర సమ్మతములే. ఇక వానప్రస్థ మనున దేమి? అది శాస్త్ర ప్రసిద్ధముగ లేదే? దానిని ఎవరును ఆచరించిన ట్లగపడదు గదా? యనిన,

సమా : మౌనమే ముఖ్య ధర్మముగా గలిగిన సన్న్యాసులకు, బ్రహ్మచారులకు ఇతరులకంటెను వేఱుగా శ్రవణ మననాదులను విధించునట్లు వానప్రస్థులకుకూడా వివిధ ధర్మోపదేశములు గలవు. వారు విశేషముగ ఉపాసనాపరులై దేహదండన మొనర్చుదురు. పంచాగ్నివిద్య, తపస్సు మొదలగు వాటి నాచరించుకొను చుందురని శ్రుతి స్మృతి ప్రసిద్ధము.

## ౧౫. అనావిష్కారాధికరణము

## అనావిష్కుర్వన్నన్వయాత్. 50

సన్న్యాసియగు బ్రహ్మవిదుడు బాలుడు కాదు. బాలు డనగా విద్యా విహీనుడగు అల్ప వయస్సుగల అప్రసిద్ధ వ్యక్తి. ఇచ్చటనో అట్లుగాక తన జ్ఞాన వైరాగాద్యులచే అహంకార మమకార దంభ దర్పాదుల నొందక సంతతాత్మారాధనరతుడై స్వేచ్ఛ నుండువాడే కాని అజ్ఞుడగు బాలునివలె ఒప్పువాడు కాడని అర్థము.

## ౫౮. ఐహికాధికరణము

### ఐహికమప్యప్రస్తుతప్రతిబంధే తద్దర్శనాత్. 51

దేహేంద్రియాద్యభిమాన సంయుక్తమగు కర్తృత్వరూప ప్రతిబంధము లేకున్నచో శ్రవణ మనన నిదిధ్యాసనాదులచే ఈ జన్మమునందే బ్రహ్మసాక్షాత్కార మగును. ఇంకను యత్కించిత్ ఆ యభిమాన ముండినచో భావిజన్మమునందు శ్రవణ మననాదులైన పిదప తత్వసాక్షాత్కార మగును. ఇట్లని శ్రుతి స్మృతులు చెప్పుచున్నవి. చిత్తశుద్ధియై దేహాభిమానము తొలగి కేవల ఈశ్వరానుగ్రహముచే గురుకృపకు పాత్రుడైన వానికి ఈ జన్మమునందే ఇపుడే జరిగిన శ్రవణ మననములే, అతని బ్రహ్మసాక్షాత్కారమునకు చాలును అని తాత్పర్యము.

## ౫౯. ముక్తిఫలాధికరణము

### ఏవం ముక్తిఫలానియమ స్తదవస్థావధృతే స్తదవస్థావధృతేః. 52

బ్రహ్మాత్మనా సంస్థితి రూప అభేద జ్ఞానానుభవస్థితియే మోక్షము. ఇది కేవలము గురూపదిష్ట శ్రుత్యర్థావలంబన పూర్వకముగా సంప్రాప్తమగు బ్రాహ్మీస్థితి. గల గురుకృపకు పాత్రులైన వారికి శ్రవణాదులచే ఈ జన్మమునందే మోక్ష మగును. ఇందులకు సందియము లేదు. మిగిలినవారు ముందు జన్మములను నిరీక్షించ వలసివచ్చును. మోక్షము స్వయంసిద్ధము.

ఇతి వైయాసిక్యాం శారీరకమీమాంసాయాం తృతీయాధ్యాయస్య చతుర్థపాదః

ఇది మూడవ అధ్యాయమున నాల్గవ పాదము.

ఓం తత్ సత్

—ooo—

# వైయాసికీ శారీరక మీమాంసా
# బ్రహ్మ సూత్రములు

## అథ చతుర్థోధ్యాయః

## 4-వ అధ్యాయము 1-వ పాదము

అవ: జీవన్ముక్తి విషయము ఈ అధ్యాయమున వివరింప బడును.

### ౧. ఆవృత్త్యధికరణము

### ఆవృత్తిరసకృదుపదేశాత్. 1

బ్రహ్మజ్ఞాన విషయకమగు వాక్యార్థ శ్రవణ మనన నిదిధ్యాసములను సారెసారెకు జేయ వలయునని అనేక శ్రుతులు జెప్పు చున్నవి. శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః.

### లింగాచ్చ. 2

సువర్ణ, రత్న, ముక్తాదుల (ముత్యము) జ్ఞానము గావలెనన్న తద్విషయకమగు విచారము (అనుభవము) చక్కగ నుండవలయును గదా! అటువలె బ్రహ్మజ్ఞానానుభవము గావలెనన్న సారెసారెకు విచార మవసరమై యున్నది.

### ౨. ఆత్మత్వోపాసనాధికరణము

### ఆత్మేతి తూపగచ్ఛంతి గ్రాహయంతి చ. 3

బ్రహ్మము ఆత్మయేనని తత్త్వమసీత్యాది వాక్యములచే తెలియబడు చున్నది. సగుణ నిర్గుణాది ఏ విద్యలే యగుగాక! ఉపాస్యమగు పరబ్రహ్మమును తానుగానే భావించి ఉపాసింప వలెను. "త్వమేవాహ మస్మి భగవో దేవతే" ఓ, దేవతా! నీవు నేనే, అను మొదలగు వాక్యములచే తెలియు చున్నది. ఉపాసనలయం దన్నో మూడు విధములు. తనకు, సగుణబ్రహ్మకు భేదము లేదను అహంగ్రహోపాసన ఒకటి, నామాది పదార్థములను బ్రహ్మముగా భావించు ప్రతీకోపాసన ఒకటి, కర్మాంగములగు ఉద్గీథాదులను బ్రహ్మముగా జూచు

అంగావబద్ధోపాసన ఒకటి ఇట్లు దహర వైశ్వానరోపాసనాదులు, అహంగ్రహోపాసనాదులు అనగా పరబ్రహ్మమును తన్నుగా ధ్యానించుట జీవునకు, సగుణబ్రహ్మమునకు అభేదమును దెలుపు శ్రుతియు కలదు గావున నేను వైశ్వానరుడను. నేను దహరాకాశ స్వరూపుడను, నేత్రమునందుండు పురుషుడు నేనే. మహత్పదార్థము నేనే. ఈ ప్రకారముగా సగుణోపాసనలు గలవు.

### 3. ప్రతీకాధికరణము

### న ప్రతీకేనహి సః. 4

ఉపాధియందు ఆత్మభావన చేయరాదు. ఉపాసకుడు ఉపాధి స్వరూపుడు కాదు గదా! నామమును బ్రహ్మమని ఉపాసన జేయుము. మనస్సును బ్రహ్మమని ఉపాసింపుమను నీ ప్రకారమైన ఇవి యెల్ల ప్రతీకోపాసనలు. ఇవన్నియు జీవ బ్రహ్మ భేదములని ధ్యానింపరాదు. అచ్చట శ్రుతికి ఈ ఉద్దేశము లేదు. కేవలము నామమునకు బ్రహ్మమునకు భేదము లేదని ధ్యానింప దగును.

### ౪. బ్రహ్మదృష్ట్యధికరణము.

### బ్రహ్మదృష్టిరుత్కర్షాత్. 5

శంక: ఆదిత్యాది మండలములయందు బ్రహ్మభావన యుంచి ధ్యానింప వలెనా? లేక బ్రహ్మమునందు ఆదిత్య మండలాదులను భావించి ధ్యానింప వలెనా? అనిన,

సమా: నికృష్టమగు ఆదిత్యాది మండలములందు ఉత్కృష్టమగు బ్రహ్మభావన యుంచవలెను. ఎందుకనగా, అట్లు చేసిన అధిక ఫలము కలుగును. లోకమునందు నికృష్టుడైన వానిని ఉత్కృష్టునిగా చూచిన ఫల మధికము. ఉత్కృష్టమును నికృష్టముగా ఎంచిన ఫలమల్పము. అయోగ్యము. అది అనర్థదాయకమని తెలియ వలెను. మూడు నాలుగు అధికరణములయందు ప్రతీక మనగా ఉపాధియను అర్థము చెప్ప బడినది. వైకుంఠవాసుడగు విష్ణువును పూజింప వలయు ననిన అతడు ఇచ్చటికి వచ్చువాడు కాడు. కాబట్టి అట్టివానిని భావించుటకు తగు విగ్రహమును విష్ణువని చెప్పుదుము. విష్ణువను

భావన కాధారమగు దానినే ఉపాధియందురు. ఇందుచే ప్రతీక మనగా విగ్రహమువంటిది. నిర్గుణ బ్రహ్మము నెఱుగ (దెలియ) శక్తి లేని వారికి చెప్ప బడినదని మాత్రము అర్థము.

౫. ఆదిత్యాదిమత్యధికరణము

ఆదిత్యాదిమతయశ్చాంగఉపపత్తేః. 6

ఉద్గీథమును బ్రహ్మమని ఉపాసించుము. ఆహవనీయమును బ్రహ్మమని ఉపాసన చేయుము అను మొదలగు కర్మాంగోపాసనల యందు అంగములైన ఉద్గీథ ఆహవనీయాదులయందు బ్రహ్మమను భావము నుంచవలయును.

౬. ఆసీనాధికరణము

ఆసీనస్సంభవాత్. 7

తనకు సుఖముగా నుండు ఆసనమున గూర్చుండి ధ్యానించ వలయును. ఎందుకనగా కూర్చుండిననే చిత్త మేకాగ్రత జెందును.

ధ్యానాచ్చ. 8

ధ్యానమను మాటచే కూర్చుండి యుండ వలయు నని అర్థము. మఱియు నిర్విషయమై మనస్సు బ్రహ్మమునందు తైలధారవలె ఆయత్తమై యుండుట యనియు భావము. ధ్యానము పరుండిన వానికి గాని, నిలబడిన వానికిగాని, పారాడు వానికి గాని సాధ్యము గాదు. కూర్చుండి నెమ్మదిగా ధ్యానము చేయ వలయును.

అచలత్వంచాపేక్ష్య. 9

కదలక నిశ్చలుడై కూర్చుండి ధ్యానము చేయ వలయును.

స్మరంతి చ. 10

స్మృతియు ఇట్లే చెప్పుచున్నది. 'శుచౌదేశే ప్రతిష్ఠాప్య'.

౭. యత్రైకాగ్రతాధికరణము

యత్రైకాగ్రతా తత్రావిశేషాత్. 11

ప్రశస్తమైన నదీతీరమో లేక దేవాలయమో పుణ్యక్షేత్రమో లేక తన స్వస్థానమునందో ఎచ్చట మనస్సు నిర్మలమై ఏకాగ్రత

నొందునో అచ్చట ధ్యానము చేయవలెను. కాని పవిత్రతగల వారికి ఎచ్చటైనను మనస్సు ఏకాగ్రత నొందును. అందుచే వారిని గుఱించిన విషయము గాదిది.

౮. ఆప్రాయణాధికరణము

ఆప్రాయణాత్తత్రాపిహి దృష్టమ్. 12

జీవిత పర్యంతము ధ్యానము చేయు చుండవలెను. ఎందుకనగా మరణ సమయమున ఆ స్మృతి గలిగి అతనిని కాపాడునని స్మృతి చెప్పు చున్నది. "యంయంవాపిస్మరఙ్ భావం..."

౯. తదధిగమాధికరణము

తదధిగమ ఉత్తరపూర్వాఘయోరశ్లేషవినాశౌ తద్వ్యపదేశాత్. 13

బ్రహ్మసాక్షాత్కార రూపమగు జ్ఞానాగ్నిచే దగ్ధమైనందు వలన పూర్వోత్తర పాపము లతనికి లేవు. ♦సంచితాగామి ప్రారబ్ధ రూప కర్మలు జ్ఞానము కలిగిన తక్షణమే దగ్ధమగునని ఈ అర్థమునే శ్రుతిస్మృతులు చెప్పుచున్నవి. "భిద్యతేహృదయగ్రంధిః....." "జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతేర్జున".

౧౦. ఇతరాధికరణము

ఇతరస్యాప్యేవమసంశ్లేషః పాతే తు. 14

అజ్ఞాన నివృత్తియై బ్రహ్మసాక్షాత్కారము నొందిన మహా పురుషునిచే ఆచరింప బడిన పుణ్యముల సంబంధము అతనికి లేదు. పర్వతాకృతులై యొప్పు పుణ్యరాసు లతని నంటవు. క్రీగంటనైన అవి వానిచే చూడబడవు. తనకంటె అన్యముగ నతని కగపడవని భావము. ఇక పాప సంబంధ మెచ్చటిది? పుణ్యపాపములు అజ్ఞాన కల్పనలు. అజ్ఞాన నివృత్తియైన ఆత్మజ్ఞానియందు ఇవి అత్యంతాభావము.

---

♦ వ్యావహారికముగా ప్రారబ్ధము నంగీకరించినను పరమార్థతః ప్రారబ్ధము లేదు. "ప్రారబ్ధమసతః కుతః" అని శ్రుతి.

## ౧౧. అనారబ్ధకార్యాధికరణము

### అనారబ్ధకార్యే ఏవ తు పూర్వే తదవధేః. 15

ఈ జన్మయందు ఫలోన్ముఖమై యున్న ప్రారబ్ధము మాత్ర ముండును. అదియు పరదృష్టికే గోచరము. అనుభవ రూపమున తీరి పోవును.

## ౧౨. అగ్నిహోత్రాధికరణము

### అగ్నిహోత్రాదితు తత్కార్యాయైవ తద్దర్శనాత్. 16

జ్ఞానమును పొంద వలయు నను ఉద్దేశముచే చేసిన అగ్నిహోత్రాది నిత్య నైమిత్తిక కర్మలు మోక్ష ప్రదములే యని శ్రుతి యందు చెప్పబడి యుండుట వలన నిత్య నైమిత్తిక కర్మలు సంచిత పుణ్య పాపాదులవలె బంధ హేతువులు గావు. అందుచేత వాటిని విడువ కున్నంతమాత్రమున తప్పేమియు లేదు. లోక సంగ్రహార్థమై చెప్ప బడినవని భావము.

### అతోఽన్యాఽపి హ్యేకేషాముభయోః. 17

'తస్య పుత్రా దాయముపయంతి సుహృదస్సాధుకృత్యాం ద్విషంతః పాపకృత్యామ్' కుమారు లాదాయ భాగమును, మిత్రులు పుణ్యమును, శత్రువులు పాపమును పంచుకొనెదరు. అను నీ శ్రుతి కామ్యకర్మలను గుఱించి చెప్పు చున్నదని అర్థము. శత్రు మిత్రు లిరువురు కామ్యములగు పుణ్య పాపములను పంచుకొనెదరు. ఈ విషయ మును వ్యాస జైమిను లిరువురును అంగీకరింతురు. కాబట్టి ఉక్త శ్రుతి నిత్య నైమిత్తికములకు వేఱగు కామ్య కర్మలను గుఱించి చెప్పు చున్న దని గ్రహింప వలయును.

## ౧౩ విద్యాదీర్యవత్తరాధికరణము.

### యదేవ విద్యయేతిహి 18.

ఉద్గీథావహనీయాది కర్మాంగములు బ్రహ్మమను దృష్టిచే ఉపా సన చేసిన అగ్నిహోత్రాది కర్మలు ఈ జన్మమునందే తడవు లేక

బ్రహ్మజ్ఞానమును కలుగ జేయును. ఉపాసన లేక చేయ బడిన కర్మలు సావకాశముగ ముందు జన్మయందు బ్రహ్మజ్ఞానము కలుగ జేయును.

౧౮ ఇతరక్షపణాధికరణము

**భోగేన త్వితరే క్షపయిత్వా సంపద్యతే 19.**

ప్రారబ్ధము జ్ఞానమువలన నశింపక పోయినను జ్ఞానమునకు అడ్డు గాదు. అనుభవముచే తీరిపోవును. కాబట్టి ప్రారబ్ధక్షయానంతరము విదేహ కైవల్యమని "తస్య తావదేవ చిరం" అను శ్రుతియును ఈ విషయమునే స్పష్టము చేయు చున్నది.

ఇది నాల్గవ అధ్యాయమున మొదటి పాదము.

—o—

## 4 వ అధ్యాయము 2 వ పాదము

౧ వాగధికరణము

**వాఙ్మనసి దర్శనాచ్ఛబ్దాచ్చ 1.**

వాక్కు మనస్సునందు అడగును. లోకమునందు మరణింపనున్న వారికి మాటలాగి మనస్సు మాత్ర మగపడు చుండునని శ్రుత్యర్థము.

**అత ఏవ చ సర్వాణ్యను 2.**

ఇచ్చట వాక్కని చెప్పుటచే సర్వేంద్రియములని గ్రాహ్యము. అన్ని ఇంద్రియములు వాక్కు ననుసరించి మనస్సునందు చేరునని తాత్పర్యము.

౨ మనోధికరణము

**తన్మనః ప్రాణ ఉత్తరాత్ 3.**

సర్వేంద్రియ వృత్తులను లీన మొనర్చుకొన్న మనస్సు ప్రాణము నందు వృత్తులతోసహా లీన మగునని ముందు చెప్పబడు వాక్యముచే అన్వయము.

### 3. అధ్యక్షాధికరణము

### సోఽధ్యక్షే తదుపగమాదిభ్యః. 4

యజమానుడగు జీవునితో చేరి ప్రాణాది సర్వేంద్రియములు పరలోకము వెళ్ళును.

### భూతేషు తచ్ఛ్రుతేః. 5

యజమానుడగు జీవుడు తేజస్సుతో కూడుకొనును. 'ప్రాణ స్తేజసి' ఈ శ్రుతియందు తేజశ్శబ్దముచే ఉత్తర దేహమును కలిగించుటకై జీవునిచే కొని పోబడుచున్న పంచీకృత పంచమహాభూత సూక్ష్మావయవములు సూక్ష్మ శరీరముతో గూడ వెళ్ళునని అర్థము.

### నైకస్మిన్ దర్శయతో హి. 6

శ్రుతిస్మృతులు తేజశ్శబ్దముచే పంచమహాభూతములను చెప్పుచున్నవని తెలియ వలయును.

### ४. అసృత్యుపక్రమాధికరణము

### సమానాచాసృత్యుపక్రమాదమృతత్వం చానుపోష్య. 7

సూక్ష్మశరీర భూతేంద్రియ మనః ప్రాణములు జీవుడు ఇంద్రియములు మనస్సు, ఇవి యన్నియు హృదయమున గూడుకే చచ్చు విధము. ఇది నిర్గుణ బ్రహ్మసాక్షాత్కారము చేసికొన్న వారికిని సగుణ బ్రహ్మోపాసకులకును కర్మఠులకును ఎల్ల వారికిని ఒకే విధము. సైన్య సమేతుడగు రాజు స్వర్గ నరక బ్రహ్మలోకాదులను చూడ వలయునని వెళ్ళినట్లు సామాన్యులు, కర్మఠులు, ఉపాసకులగు జీవులు తమ తమ మార్గమును బట్టుదురు. వీరు నాడుల మూలమున దేహమను పట్టణము నుండి వెలువడి పోవుదురు. కాని జ్ఞానులకు మాత్రము లోపలనుండి వెలుపలకు, వెలుపలనుండి లోపలకను గమనాగమనము లేదు. కాని దేహపతన విధానము మాత్రము గలదు. ఉపాసకులకు అజ్ఞానము పూర్ణముగ నివృత్తి కానందువలన వారు లోకాంతరమున ఫలానుభవము నొంద వలసి యున్నందున వారు తప్పక ఆమార్గముబట్టి పయనము పెంచుదురని భావము. తత్త్వవిదుడు కృతకృత్యుడు. అతనికి గమనాగమనములు లేవు.

౫. తదాపీతేస్సంసారవ్యపదేశాధికరణము

తదాపీతేస్సంసారవ్యపదేశాత్. 8

ఉపాసకుల లింగశరీరము భంగమై యుండదు. హృదయస్థమగు ఆత్మను (తమను) బ్రహ్మమేనని వారు తెలియ జాలరు. హృదయ గ్రంథి (అహంకారము) వీడి యుండదు. మరల ఉత్తర శరీరముల యందు వారి వారి కర్మానుగుణ్యాముగా జ్ఞాన ముద్బుద్ధ మగును.

సూక్ష్మం ప్రమాణతశ్చ తథోపలబ్ధేః. 9

లింగశరీరము సూక్ష్మ నాడులయందు సంచరించుట వలన అత్యంతము సూక్ష్మమై యున్నది. అది వెలుపల ఇతరుల కగపడునది కాదు. ఇంద్రియములకు గోచరింపదు.

నోపమర్దేనాతః. 10

లింగశరీరము సూక్ష్మమై యుండుట వల్లనే మూర్ఛాదుల యందు స్థూల శరీరమునకు దెబ్బ సోకినను దానికి బాధ లేదు.

అస్యైవ చోపపత్తేరేష ఊష్మా. 11

చచ్చిన పిదప శరీర మెల్ల చల్లబడి పోవుట వలన అప్పుడు లింగ శరీరము వెళ్ళిపోయినదని తెలిసికొన వలయును.

౬. ప్రతిషేధాధికరణము

ప్రతిషేధాదితి చేన్న శారీరాత్. 12

శంక: జ్ఞానులకు ప్రాణోత్క్రమణము లేదని చెప్పు శ్రుతికి ప్రాణములు ఆ జీవుని విడిచి పోవనియా అర్థము? అటులైన జీవునితో సహ ప్రాణములు వెలువడునని అర్థ మాయెను. లింగశరీరము జీవుని విడిచి స్వతంత్రముగా తనకు తానే ఉత్క్రమణ మొందదని గదా తెలియ వలెను?

స్పష్టో హ్యేకేషామ్. 13

జ్ఞానియొక్క ప్రాణములు లేచిపో వనుటను శ్రుతి విస్పష్టముగా చెప్పి యున్నది. అజ్ఞానులకు ప్రాణోత్క్రమణము గలదు. ఈ విధముగ జ్ఞానివిషయమును ప్రసంగించుచు అతని ప్రాణములు ఉత్క్రమణ

మొందునని చెప్పిన ఇది అత్యంత విరుద్ధము. శ్రుతియందు యాజ్ఞ వల్క్యముని బ్రహ్మజ్ఞానము కలవారి శరీరమునుండి ప్రాణములు నిర్గ మింపవని చెప్పెను. అందులకు ఆర్తభాగుడను నతడు అట్లైన బ్రహ్మ జ్ఞాని మృతుడు కాడనియా అర్థమని యడుగ అయ్యా! జ్ఞాని యొక్క ప్రాణములు ఎచ్చటి వచ్చటనే తమ తమ కారణమునందు లీన మగును. అనగా ఉపాదానమగు భూతములలో కలిసి పోవునని చెప్పె నని శ్రుత్యర్థము.

## స్మర్యతే చ. 14

జ్ఞానులకు సూక్ష్మ శరీరోత్క్రమణము లేదని స్మృతులు కూడ చెప్పు చున్నవి.

### ౭. పరసంపత్త్యధికరణము

అవ: జ్ఞానుల లింగశరీరము పరబ్రహ్మాభేదము నొందును. లింగ శరీరము మిథ్య. పరమాత్మ సత్యమనెడి ప్రమాణమును జూపు చున్నారు.

## తాని పరే తథా హ్యాహ. 15

జ్ఞానుల సూక్ష్మశరీరము బ్రహ్మాభేదము నొందునని వేదము చెప్పుచున్నది.

### ౮. అవిభాగాధికరణము

## అవిభాగో వచనాత్. 16

జ్ఞానుల లింగశరీరము పరబ్రహ్మమున నిర్విశేషముగ లయ మొందును. ఎందుకనగా అవిద్యచే కలిగినది, బ్రహ్మవిద్యచే-బ్రహ్మ జ్ఞానముచే, పూర్ణ నివృత్తి-కార్య సహిత కారణాజ్ఞాన నివృత్తి, యగు నని శ్రుతి యుండుట వలన అవిద్యా సంజనితమగు లింగశరీరము అత్యంతాభావము.

### ౯. తదోకోధికరణము

అవ: సగుణోపాసకుల సూక్ష్మశరీరము సుషుమ్నానాడినుండి ఉత్క్రమణ మొందును.

తదోకోऽగ్రజ్వలనంతత్ప్రకాశితద్వారో విద్యాసామర్థ్యాత్తచ్ఛేష గత్యనుస్మృతియోగాచ్చ హార్దానుగృహీతశ్శతాధికయా. 17

ప్రాణేంద్రియాదులతో గూడిన ఉపాసకులకు హృదయ కమలా గ్రమున జ్యోతి కలదు. అప్పుడది వికసింపగా అతనికి దేవయానము భాన మగును. సుషుమ్నా నాడీమూలమున దేహమునుండి వెలువడును. హృదయ కమలాగ్ర వికసనమునకు సగుణ బ్రహ్మోపాసనయొక్క సామ ర్థ్యము తదంగభూతమైన దేవయాన మార్గానుచింతనమునకు కార ణమై యున్నది. ఆ సమయమునందు అతనికి హృదయస్థమగు సగుణ బ్రహ్మప్రేరణమై సహస్రారమునుండి వెలువడి బ్రహ్మలోకమును పొందును. ఇక కర్మఠులు హృదయ కమలముయొక్క నాలుగు దిక్కుల యందుండు ఇతరమగు నాడుల మూలమున వెళ్ళుదురు.

## ౧౦. రశ్మ్యధికరణము

### రశ్మ్యనుసారీ. 18

సుషుమ్నా నాడినుండి వెలువడిన ఉపాసకుడు తన్నాడీసంబంధ మగు సూర్యకిరణములద్వారా బ్రహ్మలోకము నొందును.

నిశి నేతి చేన్న సంబంధస్య యావద్దేహభావిత్వాద్దర్శయతి చ. 19

శంక : పగటియందు మరణించిన ఉపాసకునకు పై జెప్పిన విధ ముగ నుండవచ్చును. రాత్రియందు మరణించిన వానికి బ్రహ్మలోక మని చెప్పుట ఎట్లు పొసగు ననిన,

సమా : అట్లు గాదు. నాడులకు, సూర్యకిరణములకు సంబంధము దేహ మున్నంత కాలమే యుండును. ఇట్లని శ్రుతియు జెప్పుచున్నది. రాత్రియందు సూర్యునకు మేరుపర్వతము అడ్డమైనందున ప్రత్యక్ష ముగ సూర్యకిరణములు అగపడక పోయినను ఇంద్రియములకు గోచ రము కాని సామాన్యమగు సూర్యకిరణములు రాత్రియందును ఉండియే యుండును. అట్లు లేకున్న గ్రీష్మ ఋతు రాత్రులయందు ఉక్క పోయుట మొదలగునవి లేక యుండ వలసి యుండును గదా. కావున అటువలె గాదని తెలియ వలయును.

## ౧౧. దక్షిణాయనాధికరణము

అవ : అందుచేత ఉపాసకుడు ఎప్పుడు దేహము విడిచినను బ్రహ్మలోకము పోవునని చెప్పుచున్నారు.

### అతశ్చాయనేఽపి దక్షిణే. 20

రాత్రులయందు దేహము వీడిన ఉపాసకునకు బ్రహ్మలోకమే దొరకును. ఈ కారణము వలననే దక్షిణాయనమునందు పోయినను బ్రహ్మలోక మతనికి లబ్ధమగును. కృష్ణపక్షమున గతించినను సూర్య కిరణముల మూలమున అర్చిరాది మార్గముచే బ్రహ్మలోకమును చేరియే తీరునని అర్థము.

### యోగినః ప్రతిచ స్మర్యతే స్మార్తే చైతే. 21

స్మృతులయందు చెప్పి యుండిన ఉత్తరాయణ, దక్షిణాయనము లనెడి మార్గములు ప్రాణాయామాది యోగము నభ్యసించువారికి చెప్పినవియే గాని సగుణోపాసకులకు చెప్పిన మాట గాదు. యోగాభ్యాసకులు దక్షిణాయనమున దేహము విడిచిన స్వర్గము దొరకును. ఉత్తరాయణమున గతించిన బ్రహ్మలోకము దొరకును. ఉపాసకులు మఱియు జ్యోతిష్టోమాది కామ్య కర్మతులును ఏ కాలమునందు దేహము విడిచినను, ఉపాసకులకు బ్రహ్మలోకము, కర్మతులకు స్వర్గలోకమని తెలియవలయును. యథార్థముగ విచారించి చూచిన అవి (అహః శుక్లః ఇత్యాది పదములు) కాలమును చెప్పు మాటలు కావు. అభిమాన దేవతల విషయమైన అర్థమే యని అంతరార్థము.

ఇది నాల్గవ అధ్యాయమున రెండవ పాదము.

---

## 4-వ అధ్యాయము— 3-వ పాదము

అవ: ఇచ్చట ఉత్తరాయణ మార్గమును గుఱించిన విషయములు వివరింపబడును.

## ౧. అర్చిరాద్యధికరణము

### అర్చిరాదినా తత్ప్రథితేః. 1

ఉపాసకులు అర్చిరాది మార్గము ద్వారా అనగా దేవయాన

మార్గమున బ్రహ్మలోకము నొందుదురని ఛాందోగ్యాది శ్రుతులయందు చెప్ప బడినది. అదెట్లనిన, (అర్చిః) పగలు, శుక్లపక్షము, ఉత్తరాయణము, సంవత్సరము, సూర్యుడు, చంద్రుడు, విద్యుత్తు, వీని యభిమాన దేవతలుండు లోకములద్వారా నేరుగా వెళ్ళి బ్రహ్మలోకమును పొందుదురు.

౨. వాయ్వధికరణము

వాయుమబ్దాదవిశేషవిశేషాభ్యామ్. 2

శంక: బృహదారణ్యకోపనిషత్తునందు ఉపాసకుడు వాయులోకమును, వరుణలోకమును, ఇంద్రలోకమును, ప్రజాపతిలోకమును గుఱించి వెళ్లునని ఈ విధముగ నాలుగు చెప్పబడి యున్నవిగదా. అటులయిన ఈ నాలుగింటిని చేరి వెళ్ళవలయు ననియా అర్థము? అనిన,

సమా: సంవత్సర లోకము, ఆ పిదప వాయులోకము చెప్పవలయును. ఎందుకనగా ఉపాసకులకు వాయు, సూర్య, మండలముల మధ్యస్థమున త్రోవ చేసి ఇవ్వ వలయునని చెప్పి యుండుటవలన సంవత్సరమునకు, ఆదిత్యునకు మధ్య వాయువును చెప్ప వలయునని తెలియు చున్నది.

3. తడిదధికరణము

తడితోఽధివరుణస్సంబంధాత్. 3

విద్యుల్లోకమైన పిదప వరుణలోకమును చెప్పవలెను. ఎందుకనగా, అవి ఒకదానితో నొకటి సంబంధము గలవియై యున్నవి. మెఱుపు గలిగిన పిదప వర్షము వచ్చుటకు అదే కారణము. ఇక ఇంద్రలోకమును, ప్రజాపతి లోకమును చివర చెప్పవచ్చును. కారణమేమన వరుణలోకమునుండి ఇంద్రలోకమును, ఆ పిదప ప్రజాపతి లోకమును చేరును అని భావము.

౪. ఆతివాహికాధికరణము

ఆతివాహికాస్తల్లింగాత్. 4

అర్చిరాది లోకములందు వెనుక లోకాల దేవతలు ముందు లోకముల దేవతలవఱకు ఆ ఉపాసకులను పిలుచుకొని పోవుదురు

(సహాయపడుదురు). విద్యుల్లోకమును పొందిన పిదప మానవుడు కాని ఒక అపూర్వపురుషుడు ఉపాసకుని బ్రహ్మలోకమునకు పిలుచుకొని పోవునని యున్నందువలన వెనుకటి లోకమువారును పిలుచుకొని పోదగిన వారే యని తెలియ వలయును.

### ఉభయవ్యామోహాత్తత్సిద్ధేః. 5

ఉపాసకులకు బ్రహ్మలోకము పోవునంత వఱకు స్థూల శరీర ముండుట లేదు. కావున వారి జ్ఞాన కర్మేంద్రియములకు త్రోవను తెలియుశక్తి లేనందుచే పిలుచుకొని పోవు దేవతలవలననే వారు ముందుకు సాగి పోవుదురు.

### వైద్యుతేనైవ తతస్తచ్ఛ్రుతేః. 6

విద్యుల్లోకమును పొందు లోపల అచ్చటికి బ్రహ్మలోకమునుండి అమానవ పురుషుడు ఒకడు వచ్చి యుండును. అతడు ఆ ఉపాసకుని బ్రహ్మలోకమునకు పిలుచుకొని పోవును. కాబట్టి వరుణ లోకమునకు, ఇంద్ర లోకమునకు, ప్రజాపతి లోకమునకు, పిలుచుకొని పోవువారు వేఱొకరు అవసరము లేదు.

## ౫. కార్యాధికరణము

### కార్యం బాదరిరస్య గత్యుపపత్తేః. 7

పరబ్రహ్మమునుండి పుట్టినవాడై హిరణ్యగర్భుడను నామము గలిగి యుండు కార్యబ్రహ్మమును సగుణోపాసకులు పొందుదురని బాదరిముని అభిప్రాయము. ఎందుకనగా, అట్లైనపుడే ఉపాసకుని ప్రయాణము సార్థక మగును. పరబ్రహ్మము సర్వత్ర నిండియుండుట వలన అతనిని పొందుటకు త్రోవయందు ముందు సాగి వెళ్ళ వలసినది యుండదు.

### విశేషితత్వాచ్చ. 8

ఉపాసకులకు బ్రహ్మలోకము దొరకునని ఆ లక్షణములను వివరించి చెప్పినందువలన వారు బ్రహ్మమును పొందుదురు. అనగా హిరణ్యగర్భుడను కార్యబ్రహ్మను పొందుదురు. అతని భోగములకు సమమైన భోగములతో కూడినవారై అతని వద్ద నుందురని అర్థము.

సామీప్యాత్తు తద్వ్యపదేశః. 9

శంక: బ్రహ్మశబ్దమునకు ముఖ్యముగా పరబ్రహ్మ మనియే అర్థమయి యుండగా హిరణ్యగర్భుడని చెప్పుట ఎట్లు సంభవించును? అనిన,

సమా : హిరణ్యగర్భుడు పరబ్రహ్మమునుండి కలిగిన వారిలో మొదటి వాడు. అందుచే అతనిని బ్రహ్మమని చెప్పుట యైనది.

కార్యాత్యయే తదధ్యక్షేణ సహాతః పరమభిధానాత్. 10

శంక: బ్రహ్మలోకమును పొందినవారికి ఎప్పుడు మోక్షము కలుగును? అనిన,

సమా: మహాప్రళయ మయినపుడు బ్రహ్మలోకము అంత మొందును. అప్పుడు ఆ లోకాధిపతియైన హిరణ్యగర్భునితో సహ ఉపాసకులు ఆ హిరణ్యగర్భ తత్వమున కంటెను అతీతమగు పర బ్రహ్మభావము నొందుదురని శ్రుతి తెలుపు చున్నది.

స్మృతేశ్చ. 11

ఈ అభిప్రాయమును స్మృతియు అనువదించు చున్నది.

పరం జైమినిర్ముఖ్యత్వాత్. 12

శంక: బ్రహ్మశబ్దమునకు పరబ్రహ్మమే అర్థమని జైమిని మహర్షి అభిప్రాయ మున్నప్పుడు ఇక హిరణ్యగర్భుడను గౌణార్థము నెందుకు చెప్పవలెను? (పూర్వపక్షసూత్రము).

దర్శనాచ్చ. 13

బ్రహ్మశబ్దమునకు కేవల పరబ్రహ్మ మనియే అర్థము. శ్రుతుల యందును ఆలాటి ప్రయోగములే అగపడుచున్నవి.

న చ కార్యే ప్రతిపత్త్యభిసంధిః. 14

ఉపాసకులు హిరణ్యగర్భుని పొందెద రనుమాట చెల్లదు. బ్రహ్మలోకాది శబ్దములకు కూడ లక్షణచే పరబ్రహ్మ మనియే అర్థము చేయవలసి వచ్చును. ప్రజాపతియొక్క సభాంగణమును పొందుదును అను మొదలగు ఉపనిషత్తులయందలి మాటలు హిరణ్యగర్భుని గృహ

మును గుఱించి చెప్పుటకు ప్రవర్తించినవి కావు. ఇది కేవలము నామ రూప సంబంధ రహిత పరమాత్మతత్త్వ నిరూపణ ప్రకరణము.

౬ అప్రతీకాలంబనాధికరణము.

అప్రతీకాలంబనాన్నయతీతి బాదరాయణ ఉభయథాఽదోషాత్త త్క్రతుశ్చ. 15

బ్రహ్మమునకు ప్రతినిధిగా దేనినైన నుంచుకొని ఉపాసించు ఉపాసకులను విడిచి తాను ధ్యానించు వస్తువు తన స్వరూపమే యని ఉపాసించు ఉపాసకులను మాత్రము అమానవుడగు ఒకపురుషుడు బ్రహ్మలోకమునకు పిలుచుకొని పోవునని వ్యాసముని అభిప్రాయము. ఇచ్చట ప్రతీకోపాసనలను గుఱించి చెప్పుట కాదని తెలియ వలయును. అమానవుడగు ఆ పురుషు డనగా సిద్ధుడని భావము.

విశేషం చ దర్శయతి. 16

నిజమగు బ్రహ్మము నుపాసించు వారికి మాత్రమే బ్రహ్మ లోకము దొరకును. మిథ్యయగు నామాదులను బ్రహ్మమని ఉపాసించు వారి కది సాధ్యము గాదు.

ఇది నాల్గవ అధ్యాయమున మూడవ పాదము

---

## 4-వ అధ్యాయము 4-వ పాదము

అవ: ఈ పాదమునందు సగుణోపాసకులకు బ్రహ్మలోకప్రాప్తి యనియు నిర్గుణ బ్రహ్మజ్ఞానులకు విదేహముక్తి యనియు నీ విషయము ప్రతిపాదింప బడును.

## ౧. సంపద్యావిర్భావాధికరణము

### సంపద్యావిర్భావః స్వేన శబ్దాత్. 1

దేహేంద్రియ మనః ప్రాణములయందు చిక్కువడి యున్న జీవుడు జ్ఞానమువలన లింగశరీరము (హృదయగ్రంథి) నాశ మైన వెంటనే సర్వత్ర వ్యాపకమై యుండు ప్రత్యగభిన్న బ్రహ్మానుభూతి నొందును. అప్పు డతనికి "నేను సత్య సనాతనుడను; త్రికాలాబాధిత మగు అజర అమృత స్వరూపుడను; ఏ దోషములయొక్క సంస్పర్శ లేని జ్ఞానానంద స్వరూపుడను నేనే" యను స్వస్వరూప స్మృతి ఏర్పడును.

### ముక్తః ప్రతిజ్ఞానాత్. 2

శంక: జ్ఞానులకును ఉత్క్రమణము గలదని వేఱొక శ్రుతి యున్నది. ఎట్టకేలకు కల్పితమగు అవిద్యా సంబంధమువలన గలిగిన బంధమైనను కలదు గదా! ఇట్లుండ లింగశరీరము భంగమైన వెంటనే బ్రహ్మత్వము నొందుదు రనుమాట ఎట్లు సమంజసమగు ననిన,

సమా: ఆ శ్రుతియందు శరీరమునుండి ఉత్క్రమణ మొందుట యను స్థలమునందలి అర్థము శరీరేంద్రియాద్యభిమానమును వీడుటని తెలియ వలయును. ఇంతే. ఆ తత్క్షణమే యతనికి తన నిజ స్వరూపము భానమగును. అది వ్యాపకము. పూర్ణము.

### ఆత్మా ప్రకరణాత్. 3

శంక: ఇచ్చట శరీరమునుండి లేచి విశేషమగు జ్యోతిని పొందును అని శ్రుతియందు ఉన్నందువలన ఉపాసకులవలె వారును సూర్యలోక మూలమున బ్రహ్మలోకమునకు పోవుదురనియా? అర్థ మనిన,

సమా: అట్లు గాదు. విశేష మనునది జ్యోతిశ్శబ్దమునకు అర్థము కాదు. జ్యోతి యనియే అర్థము. ఎందుచేత ననగా ఇంద్రుడు, విరోచనుడు పరబ్రహ్మ తత్త్వవిషయమై అడిగిన ప్రశ్నలకు ఉత్తరముగా

హిరణ్యగర్భుడు చెప్పిన మాటలయం దీవిషయ మున్నది. దీని యర్థము స్వయంప్రకాశ మనియే.

## ౨. అవిభాగేనదృష్టత్వాధికరణము

## అవిభాగేన దృష్టత్వాత్. 4

శ్రుతిచే చెప్పబడి యుండుటవలన ఆ ముక్తజీవులు పరబ్రహ్మముతో భేదము లేని వారు. పరబ్రహ్మాభిన్ను లనియే అర్థము. 'బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి' పూర్వమును బ్రహ్మముగానే యుండుటచే మోక్షావస్థయందును వారు బ్రహ్మమే యనుటకు సందియము లేదు.

## 3. బ్రహ్మాధికరణము

## బ్రాహ్మేణ జైమినిరుపన్యాసాదిభ్యః 5

శంక: బ్రహ్మతత్త్వమును దెలుపుట కొఱకై వెలువడిన వాక్యములయందు ఈ విషయము గలదను బలముచే అచ్చట పరబ్రహ్మ మనియే అర్థ మైనను లక్షణచే చక్కగా పరికించిన లీలామయ శరీరముచే గూడిన హిరణ్యగర్భుడను సగుణబ్రహ్మమే అచ్చట కూడా విషయమని తెలియబడుచున్నది. కాబట్టి జ్ఞానులకు బ్రహ్మలోక ప్రాప్తి యగును గాని సర్వ వ్యాపకమగు బ్రహ్మమే తామగుట సంభవింపదని జైమిన్యాచార్యుల అభిప్రాయము. మఱియు ఇట్లు చెప్పుటకు కారణము గలదు. ఆ జ్ఞానులు భోజన భాజనాదులచే ఆడుచు, పాడుచు వినోదముగ నుందురను మాట ముందు ప్రసంగమునందు వచ్చును. వారు నిర్గుణ బ్రహ్మమునందు అభేద స్థితి నొందిన అదెట్లు పొసగును? కాదు. విశేషమగు జ్యోతిని పొందుదు రను మాటనుబట్టి లాక్షణికముగా హిరణ్యగర్భుని పొందుదు రనియే చెప్పవలెను. ఇక వీరికి వెంటనే తను నిజరూపము భానమగు ననుటకు వారు హిరణ్యగర్భునకు సమానమగు దేహముతో గూడి అతని సమీపమునందు ఉందు రనియే విశద

మగుచున్నది. మఱియు ఇదే సమంజసము. కాబట్టి జ్ఞానులకును ఉపాసకులకువలె బ్రహ్మలోకప్రాప్తి కలుగునే గాని బ్రహ్మాభిన్నత యను నది పొసగదు. (ఇది పూర్వ పక్షసూత్రము.)

మఱియొక పూర్వపక్షసూత్రము:

చితి తన్మాత్రేణ తదాత్మకత్వాదిత్యౌడులోమిః. 6

నిర్గుణ బ్రహ్మమే తామను జ్ఞానులు శుద్ధ చైతన్య మాత్ర స్వరూపముచే నిర్గుణ బ్రహ్మస్వరూపులై యుందురని ఔడులోమి అభి ప్రాయము. ఎందుకనగా వారు ఎల్లప్పుడును శుద్ధచైతన్యమునే ధ్యానము చేసిన వారై యున్నారు. కావున తద్ధ్యాన ఫలమైన శుద్ధ చేతన స్వరూపులై యున్నా రను మాట అంగీకరింప దగి యున్నది.

ఏవమప్యుపన్యాసాత్పూర్వభావాదవిరోధం బాదరాయణః. 7

సమా: ముక్త దృష్టికి బ్రహ్మము నిర్విశేషముగానే యున్నను ఇతరుల దృష్టికి సర్వజ్ఞత్వాది గుణయుక్తముగా నుండవచ్చును. కాబట్టి సర్వజ్ఞత్వాది గుణములు వ్యావహారికములే యనియు వానితో బ్రహ్మమునకు గాని, ముక్త జీవునకు గాని సంబంధము లేదు. సంబంధము కలదని ఒకప్పుడు హాతముచే చెప్పినను వేదాంత సిద్ధాంత మునకు భంగము రాదని వేదవ్యాసుల అభిప్రాయము.

పైన నిరూపింప బడిన అనగా తిండి తీర్థముల నారగించి ఆడుచు పాడుచు వినోద మొందుదురని చెప్పిన మాట వారి వ్యవ హారమును చూచి చెప్పినదే కాని వారు శుద్ధ చైతన్యాత్మ స్వరూపు లనునది వారి పారమార్థికస్థితిని చూచి చెప్పిన మాట. కాబట్టి వాటికి విరోధము లేదని బాదరాయణాచార్యుల అభిప్రాయము.

## ४. సంకల్పాధికరణము

## సంకల్పాదేవతు తచ్ఛ్రుతేః. 8

ఉపాసకుడై కార్యబ్రహ్మలోకమునకు పోయిన జీవునకు సంకల్ప మాత్రముననే స్రక్చందన వనితాది సమస్త విషయ భోగములు దొరకును. వానికి పితరులు, మఱియు దేవతలు, గంధర్వులు మొదలగువారు సేవకులై యుందురని శ్రుతి చెప్పుచున్నది.

## అత ఏవ చానన్యాధిపతిః. 9

కాబట్టి ఆ ఉపాసకునకు అచ్చట తనపై యజమానులు మఱొక్కరు లేనందువలన స్వతంత్రుడై యున్నాడని అర్థము. మఱియు ఆ ఉపాసకులకు భోగము లన్నియు సంకల్పమాత్ర జన్యములని అర్థము.

## ५. అభావాధికరణము

## అభావం బాదరిరాహ హ్యేవమ్. 10

లింగశరీర మాత్రుడైన ఉపాసకునకు స్థూల శరీరమే లేదని బాదరిముని చెప్పుచున్నాడు. ఈ అర్థము శ్రుతియందును విదితమై యున్నది.

## భావం జైమినిర్వికల్పామననాత్. 11

స్థూలశరీర మున్నదని జైమిని అభిప్రాయము. బ్రహ్మలోకమునకు పోయిన ఉపాసకులకు స్థూలశరీరము లేకనే కేవల లింగ శరీర మాత్రమున భోగానుభవము కాదని బహుశ్రుతులు చెప్పినవి. మనస్సు చేతనే తమ ఇచ్ఛలను అనుభవించుచు వినోదముచే ఉందురని చెప్పిన మాటను మనస్సుతో గూడి అనుభవింతు రనియే తెలిసికొన వలయును. ఇది పూర్వపక్షసూత్రము.

అవ: పై విషయమునందు సిద్ధాంతమును చూపు చున్నారు.

ద్వాదశాహవదుభయవిధం బాదరాయణోఽతః. 12

రెండు దినముల క్రతువునకు అహీన మని పేరు. రెండు, మరి అనేకములగు దినముల క్రతువునకు సత్రమని చెప్ప వలెను. అటువలె పండ్రెండు దినముల క్రతువునందు రెండు దినములు అడగి యున్నందు వలన అది అహీన మనిపించును. ఎక్కువ దినము లున్నందువలన సత్రమని చెప్ప బడును. ఇటువలె పై వారు తమ అపూర్వమైన ఇచ్ఛా బలముచే కొన్ని సమయములందు స్థూలశరీరముతో గూడినవారయ్యును కొన్ని వేళలయందు కేవల లింగ శరీరులై యును, కాలభేదముచేత రెండు విధము లై యును ఉందురని వ్యాసమహాముని అభిప్రాయము. (వీర స్వర్గమున అభిమన్యు మొదలగు వారివలె ఆ యా శరీరములతో నని భావము.)

తత్వభావే సంధ్యవదుపపత్తేః. 13

స్థూలశరీరము లేని కేవల మనోమాత్రమగు స్వప్న శరీరముచే భోగానుభవమువలె అచ్చట ఇంద్రియాదులు లేక మనోమాత్రులై ఆ యా భోగములను అనుభవించుట యుక్తమే నని భావము.

భావే జాగ్రద్వత్. 14

శరీరాదు లున్నప్పుడు జాగ్రదవస్థ యందువలె సుఖ దుఃఖాది భోగానుభవమున్ను కలుగును.

౬. ప్రదీపవదావేశాధికరణము.

ప్రదీపవదావేశ స్తథా హి దర్శయతి. 15

నూనెయందు తడుప బడిన వేలాది వత్తులయందు దీపము ఒకే కాలమున ప్రవేశము జేసినట్లు బ్రహ్మలోకమునందుండు ఉపాసకులు తమ ఇచ్ఛాబలముచే ఒక్క సమయమున అనేక శరీరములను పొంది వాటియందు ప్రవేశము చేతురని శ్రుతి చెప్పు చున్నది.

స్వాప్యయసంపత్త్యోరన్యతరాపేక్షమావిష్కృతం హి. 16

జ్ఞానికి శరీర మున్నదనుటయే యుక్తము. 'తత్కేన కం పశ్యేత్' జ్ఞాని యగువాడు ఏ ఇంద్రియముచే దేనిని చూచును? అను మొదలగు శ్రుతులచే అతనికి శరీరము లేదనియు, స్వభావముగా తన కంటె రెండవది లేకపోవుట వలన మఱి ఏ వస్తువునను అనుభవించ డనియు శ్రుతి తెలుపు చున్నది. ఇట్టి వారు నిర్గుణ బ్రహ్మయే యగుదు రను విషయము సుషుప్తావస్థనో లేక మోక్షావస్థను గురించియో చెప్పినదై యున్నది. కాని ఉపాసకులు బ్రహ్మ లోకమును పొందిన వెంటనే సర్వవ్యాపకమగు బ్రహ్మ మగుదురని శ్రుత్యభిప్రాయము గాదు. దేహేంద్రియాది సమస్తాభిమానములు పోయిన పిదప జీవులు బ్రహ్మమునకంటె భిన్నస్వరూపులు కారు. బ్రహ్మ లోకమును పొందినంత మాత్రమున దేహేంద్రియాద్యభిమానములు పోవు. కారణ మేమనిన, గురుముఖమున వాక్యార్థ శ్రవణ మనన నిది ధ్యాసానుష్ఠాన సంజనితమగు బ్రహ్మాకార వృత్తి పుట్టనిది దేహేం ద్రియాద్యభిమానములు తొలగవు. కాబట్టి పై వారు కొంతకాలము బ్రహ్మలోకమునందుండి అచ్చటి విషయానుభవముల ననుభవించి ఆ పిదప బ్రహ్మకడ బ్రహ్మసాక్షాత్కారానుభవ జ్ఞానము నొంది బ్రహ్మతో సహ ముక్తి నొందుదురు.

౭. జగద్వ్యాపారవర్జాధికరణము

జగద్వ్యాపారవర్జం ప్రకరణదసన్నిహితత్వాచ్చ. 17

శంక: ఉపాసకులు తమకు కావలసినట్లు దేహములను కలుగ జేసికొందురని అంగీకరించిన, ఇక దేవతలు, గంధర్వులు, మనుష్యేత రాది అనేక శరీరములుగల వారిని వారు పుట్టించు వారు కావచ్చును గదా? అనిన,

సమా: వారు దేవ, గంధర్వాది దేహములుగల జగత్తును

పుట్టించు పనిని తప్ప తమభోగమునకు సాధనమగుశరీరముల మాత్రము పుట్టించుకొను సామర్థ్యమును పొంది యుందురు. దేవతలు మొదలగు వారిని సృష్టించుపని హిరణ్యాగర్భునిదే. ఎందుకనగా హిరణ్యాగర్భుని విషయమును దెలుపు ప్రకరణమునందు అతని సృష్టి ప్రసంగము వచ్చినది. ఉపాసనాప్రకరణమునం దెచ్చటను ఉపాసకులు తమ శరీరముల కంటె వేఱగు దేవతా శరీరములను పుట్టింతురను ప్రసంగము లేదు. దేవతలు మొదలగు వారి ఉత్పత్తికంటెను పూర్వమే సాక్షాత్ సచ్చిదానంద పరబ్రహ్మము నుండి హిరణ్యాగర్భుడు పుట్టెనని చెప్పబడి యున్నది. ఈ విధముగ నతడు పరబ్రహ్మమున కత్యంత సామీప్యముగ నుండుటవలన తక్కిన సమస్తమును సృష్టించు సామర్థ్యము అతనియందగపడుచున్నది. మన్వాదులు ఎందఱో ప్రజలైన పిదప హిరణ్యాగర్భునిచే జన్మను బడసి యున్న ఉపాసకుడు పరబ్రహ్మమునకెంతో దూరము. కావున అతనికి జగత్తును కలుగ జేయు శక్తి లేదు.

ప్రత్యక్షోపదేశాదితి చేన్నాధికారికమండలస్థోక్తేః. 18

శంక: పురుష సూక్తమునందు పరమాత్మయే దేవతలు మొదలగు వారిని పుట్టించెనని చెప్పబడి యున్నందువలన ఉపాసకులకెటువలెనో అటువలె హిరణ్యాగర్భునకు జగత్తును కలుగ జేయు సామర్థ్యములేదనిన,

సమా: అట్లు గాదు. పరబ్రహ్మాజ్ఞను తలదాల్చి నడపువాడై, బ్రహ్మాండమండలాభిమానియై, బ్రహ్మలోకమునందు చతుర్ముఖములచే కూడిన లీలామయుడగు హిరణ్యాగర్భుడు జగత్తును పుట్టించు ననుటకు సందియము లేదు.

వికారావర్తి చ తథాహి స్థితిమాహ. 19

నిత్యముక్తమగు పరబ్రహ్మ స్వరూపము సూర్యమండలాధారమై ఏ విధమగు మార్పు లేక త్రికాలాబాధ్యమై యున్నది. ఈ బ్రహ్మాండమంతయు వానియందొక అంశమాత్రము. త్రిపాదములు బ్రహ్మమై

అను నీ శ్రుతి బ్రహ్మమునకు రెండు రూపములని చెప్పి యున్నది. ఎట్టి వికారములను పొందని పరబ్రహ్మ, సాన్నిధ్యము నాశ్రయించిన ప్రతి వారికి దక్కునది గాదని తెలియ నలయును. ఎందుకనగా నిరాలంబ మగు తత్స్వరూప ధ్యానము వారికి పొసగదు. పరమాత్మయొక్క రెండు రూపములయందు నిర్గుణానుభవము పొందకనే సగుణమునందే యుండువారు ఆ సగుణమునందును ఏయొక ఆటంకము లేని ఐశ్వర్య మును పొందక అనేక ప్రతిబంధములచే గూడిన ఐశ్వర్యమున నుందురు. "ఏతావానస్య మహిమా అతో జ్యాయాగ్ంశ్చ పూరుషః" సహస్ర శీర్షత్వము మొదలగునది పరమేశ్వరుని విభూతియై యున్నది. పర బ్రహ్మతత్త్వము ఈ విభూతికంటెను ఉత్తమోత్తమమై నిర్గుణమై యొప్పుచున్నదను వాక్య మున్నందుచేత ఉపాసకుడు అనగా సగుణ బ్రహ్మమునుపాసించిన వాడు ఆ సగుణ బ్రహ్మమునే చెందును. అణిమా ద్యైశ్వర్యములును పొందును. నిర్గుణ బ్రహ్మము కూడా అచ్చటనే అదియేమై యుండినను ఆధార ఆధేయరూపమున విలసిల్లు ఆ పర మార్థ తత్త్వమునందు వారికి వృత్తివ్యాప్తి లేనందున ఉపాసించ లేరు. కాబట్టి సగుణ బ్రహ్మముతో అభిన్నముగా నున్నను ఆ యుపాసకుడు నిర్గుణ బ్రహ్మము నెట్లు పొందనేరడో అటువలె ఆయనకు గల సామ ర్థ్యమును పొంద నేరడని భావము.

## దర్శయతశ్చైవం ప్రత్యక్షానుమానే. 20

పరమాత్మ హిరణ్యగర్భునికంటె వేత్తై యున్నాడను అర్థమును పురుష సూక్త మొక్కటే కాదు. అనేక శ్రుతిస్మృతు లీయర్థమునే తెలుపు చున్నవి. అందుచేత పంచమహాభూతములను కలుగ జేసిన వాడు పరమాత్మయే. హిరణ్యగర్భుడు ఆ పరమాత్మ యాజ్ఞ చొప్పున చరాచరాత్మకమగు భూత భౌతిక సర్వ శరీరములను కలుగ జేసెనని తెలియ వలెను. కాబట్టి సగుణస్వరూపమునందు నిర్గుణ బ్రహ్మ మున్నదనుట నిర్వివాదాంశము.

## భోగమాత్రసామ్యలింగాచ్చ. 21

ఉపాసకుడు హిరణ్యగర్భునితో సమానుడను మాటకు భోగా నుభవ మాత్రమున సమానమని శ్రుత్యభిప్రాయము. ఈ ఉపాసకు

లెల్ల విధములచేత హిరణ్యగర్భునితో సములు కారు. ఉత్పత్త్యాది మహాకార్యములందు సములు కాజాలరని అర్థము.

## అనావృత్తిశ్శబ్దాదనావృత్తిశ్శబ్దాత్. 22

శంక: బ్రహ్మలోకమునకు పోయిన సర్వులకును బ్రహ్మతోడనే ముక్తియా? లేక కొందఱికి ముక్తియై కొందఱికి ముక్తిగాక అచటనే కొంత కాలముండి భోగానుభవము నొంది మరల భూలోకమునకు వత్తురా? అనిన,

సమా: బ్రహ్మలోకమునకు పోయిన వారందఱికిని ముక్తియే. భూలోకమునకు రావలసిన యగత్యము లేదని శ్రుతి స్పష్టముగా చెప్పుచున్నది. అర్చిరాది మార్గమున సగుణబ్రహ్మము నొందిన ఉపాసకులకు జన్మ లేదు. వారు కల్పాంతమున బ్రహ్మతో సహ ముక్తి నొందుదురని క్రమముక్తిని గుఱించి శ్రుతి చెప్పుచున్నది.

సగుణోపాసకులగు వారికే ముక్తి లభించుచుండ ఇక నిర్గుణ బ్రహ్మానుభవులగు తత్త్వవేత్తలను గుఱించి చెప్పవలసిన దేమున్నది? అని కైముతిక న్యాయము. నిత్యశుద్ధ బుద్ధ ముక్తఅఖండాద్వితీయ పరమానంద స్వరూప బ్రహ్మమే తామయి విరాజిల్లుచున్నారని తత్త్వార్థము.

ఇతి వైయాసిక్యాం శారీరకమీమాంసాయాం

చతుర్థాధ్యాయస్య చతుర్థః పాదః

ఇది నాల్గవ అధ్యాయమున నాల్గవ పాదము

శారీరకమీమాంసాదర్శనం సమాప్తమ్

ఓం తత్ సత్



ఓం నమో భగవతే శ్రీమదుమామహేశ్వరాయ

# అథ దశోపనిషదః

## ౧. ఈశావాస్యోపనిషత్తు

ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే,
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే.

ఓం శాంతిః శాంతిః శాంతిః

ఓమ్. అది అనగా బ్రహ్మము పూర్ణము. దేశ కాల వస్తు పరిచ్ఛేద రహితము. సర్వవ్యాపకము. ఈ యగపడు విశ్వమెల్ల ఆ పూర్ణవస్తువే. పూర్ణముచే పూర్ణముయొక్క ఉత్పత్తి అనగా ఉపాధిచే జీవరూపము. స్వరూపతః జీవుడు పరమాత్మయే. పూర్ణము నుండి పూర్ణమును దీసినను అవిభాజ్యముగా పూర్ణవస్తువే మిగులును. ఓం శాంతిః శాంతిః శాంతిః అని ఆధ్యాత్మికాది తాపత్రయోపశమనార్థమై ముమ్మారు శాంత్యుచ్చారణము.

అవతారిక : ఈ ప్రపంచ మెల్ల ఈశ్వరునిచే వ్యాపింపబడి యున్నది. అహం మమాభిమానముల నొందక ఇదంతయును ఈశ్వర ప్రసాదమను బుద్ధిచే వాడుకొనుము.

హరిః ఓమ్. ఈశావాస్యమిదగ్ంసర్వంయత్కించ జగత్యాంజగత్,
తేన త్యక్తేన భుంజీథా మా గృధః కస్యస్విద్ధనమ్. 1

ఇదం వృత్తికి వేద్యమగు విశ్వమునందలి సమస్త పదార్థములు సచ్చిదానంద స్వరూపమగుపరమాత్మయొక్క వాసస్థానములు. సచ్చిదానందాధారమున నామరూపాత్మకమగు నీజగత్కల్పన. "సర్వజంతూనా మాత్మా సన్ ప్రత్యగాత్మతయా" పరమాత్మయే అందఱి యందును ప్రత్యగాత్మ రూపముచే నుండుచు పాలించుచున్నాడు.

కావున ఉన్నది తత్పదలక్ష్యమగు బ్రహ్మమనియే పరమ తాత్పర్యము. ఇట్లు పరమాత్మాశ్రయమున కల్పింపబడి భోక్తృ భోజ్య వ్యవహారములచే నొప్పారు యావత్ పదార్థములు ఈశ్వర ప్రసాదములను దివ్యాధ్యాత్మిక జ్ఞానదృష్టిచే నుపయోగించుకొనుము. నీయొక్క యితరునియొక్క ధనాది విషయముల యందలి తీపిని (ఆసక్తిని) వీడుము. విషయాసక్తిని వీడి సుఖము నా స్వరూపమైయే యున్నదను అనుభవమును బొంది ధన్యత నొందుము.

క్షేత్రములు అనేకము లైనను క్షేత్రజ్ఞాత్మ ఏకము. వృత్తులు నానా యైనను వృత్త్యుపహితమగు చేతన మేకము. ఆభరణము లనేకము లయినను సువర్ణ మొక్కటియే యై యుండినట్లు అధిష్ఠానాత్మజ్ఞానముచే ఆరోపిత ప్రపంచోపాధి త్యజింపబడి ఆత్మ వ్యాపకమగు బ్రహ్మమే యను అద్వితీయానుభవము కలుగునని ఈ మంత్ర తాత్పర్యము.

అవ : అకర్త్రాత్మబుద్ధిచే కర్తవ్య కర్మ నాచరింపుము. అపుడు కర్మలేపము లేదు.

కుర్వన్నే వేహ కర్మాణి జిజీవిషేచ్ఛతగ్ం సమాః,
ఏవం త్వయి నాన్యథేతోఽస్తి న కర్మ లిప్యతే నరే. 2

ఈ జగత్తునందు మానవుడు ఉత్తమ కర్మశీలుడై వంద వత్సరములు బ్రతుకుటకు ఇచ్ఛయించుగాక! ఇదే మార్గము. ఏమన నిష్కామకర్మాచరణయే ఆత్మజ్ఞానానుభవ మూలమున ముక్తికి సాధనము. ఇట్టి సత్కర్మపరుడగు మానవునకు కర్మలేపము లేదు. కర్మకారణము అజ్ఞానము. అజ్ఞానకార్యము కర్మఫలాసక్తి. కర్మఫలాసక్తిని వీడిన మనస్సు నిర్మల మగును. నిర్మల మానసమునకు పరబ్రహ్మతత్త్వము నరయు శక్తి గలుగునని భావము.

అవ : ఈ సత్య పథము ననుసరింపనివారు అజ్ఞానులై అసుర లోకముల నొందుచు ఆత్మహత్య యొనర్చుకొనిన వారగుదురు.

అసుర్యా నామ తే లోకా అంధేన తమసా వృతాః,
తాగ్ంస్తే ప్రేత్యాభిగచ్ఛంతి యే కేచాత్మహనో జనాః. 3

అజ్ఞానముచే ఆవరింపబడిన అజ్ఞులగు జనులు అసుర లోకము

లను పొందుదురు. అనగా జనన మరణ ప్రవాహమున గూలుదురు. యథార్థమగు ఆత్మతత్త్వమును దెలియని అజ్ఞులు తమ్ము తాము చంపుకొన్న ఆత్మఘాతకులని చెప్పబడెదరు. ఇందుచే వీరు దేహ పాతానంతరము సారెసారెకు శునక సూకరాది జన్మల నొందుచు దుఃఖము ననుభవింతురు. నీచమగు జన్మలయందు ఏ జ్ఞానమును లేక కేవల మంధకార బంధురమగు పరిస్థితిలో బడి ముక్తికి దూరులై యుందురు.

అవ: ఎట్టి ఆత్మతత్త్వము నెఱుగనిచో ఇట్టి మహానర్థము సంప్రాప్త మగునో అట్టి ఆత్మస్వరూపానుకథనము.

అనేజదేకం మనసో జవీయో
నైనద్దేవా ఆప్నువన్ పూర్వమర్షత్,
తద్ధావతోఽన్యానత్యేతి తిష్ఠ
త్తస్మిన్నపో మాతరిశ్వా దధాతి. 4

ఈయాత్మ అచలము, ఏకము. మనస్సునకంటె వేగము గలది. మనస్సు విషయమున ప్రవేశింపక మునుపే తాను వెళ్ళి యుండునది. అనగా ఇంద్రియాతీతము. ఇది కూటస్థమె యుండియు కదలనిదై యుండియు అన్నిటికంటెను మొదటనే వెళ్ళి యుండును. తదాధారమున ప్రాణాది వాయువులు ఆయా కర్మలను జేయుచున్నవి.

తదేజతి తన్నైజతి తద్దూరే తద్వంతికే,
తదంతరస్య సర్వస్య తదు సర్వస్యాస్య బాహ్యతః. 5

అది (ఆత్మ) చలించును. మఱియు చలించదు. అది దూరముగను మఱియు సమీపమునను జగదంతర్బాహ్యములయందును వ్యాపించి యున్నది. తాత్పర్య మేమనగ, ఉపాధిమూలమున చలన వలనాది నానా విధముల బ్రకాశించునదియు ఉపహితానుభవముచే ఏకమును అద్వితీయమునై యున్నది. అజ్ఞుని దృష్టికి అత్యంత దూరముగ నున్నట్లును తజ్జ్ఞుని దృష్టికి స్వరూప సిద్ధమునై యున్నదిగ వేద్య మగుచున్నది.

ఆత్మానుభవియొక్క దృక్పథము.

యస్తు సర్వాణి భూతాన్యాత్మన్యేవానుపశ్యతి,
సర్వభూతేషు చాఽఽత్మానం తతో న విజుగుప్సతే. 6

అందువలన ఎవడు సర్వ భూతములను ఆత్మయగు తనయందును, తనను సర్వ భూతములయందును జూచునో అనగా ఆత్మమాత్రముగ దెలియునో అతడు ఏప్రాణియందును జుగుప్స నిందాబుద్ధి నొందడు. జగత్తాదాత్మ్యబుద్ధి (అధ్యాస) వీడినందున విజాతీయ ప్రత్యయము లేనందుచే విజ్ఞునకు విపరీతబుద్ధి లేదని భావము.

యస్మిన్ సర్వాణి భూతాన్యాత్మైవాఽభూద్విజానతః,
తత్ర కో మోహః కః శోక ఏకత్వ మనుపశ్యతః. 7

ఆత్మయగు తానే సర్వ నామరూప ప్రతిభాస మాత్రుడను జ్ఞానముచే అద్వితీయ సాక్షాత్కారము నొందిన జ్ఞాని శోక మోహ ముల నొందడు. కారణము? అతని దృక్పథమున ద్వైత ప్రతీతి లేదు.

పునరపి ఆత్మస్వరూప వర్ణన.

స పర్యగాచ్ఛుక్రమకాయమవ్రణ
మస్నావిరగ్‌ం శుద్ధ మపాపవిద్ధమ్,
కవిర్మనీషీ పరిభూః స్వయంభూ
ర్యాథాతథ్యతోఽర్థాన్వ్యదధాచ్ఛాశ్వతీభ్య స్సమాభ్యః. 8

ఆత్మయే అన్ని దిక్కుల యందును వ్యాపించి యున్నది. అది అత్యంత తేజస్సంపన్నము. శరీరము లేనిది. అనగా సూక్ష్మశరీరము లేనిది. అయ్యది వ్రణము (ఆఘాతము) లేనిది. నాడులు లేనిది. అనగా దానికి స్థూలశరీరమున్నూ లేదు. అది శుద్ధము. పాపరహితము. సర్వజ్ఞము. ప్రజ్ఞాయుక్తము. సర్వవ్యాపి. స్వయంభువు. అనాదినుండియు సమస్త విశ్వమును వ్యవస్థాబద్ధముగ నుంచిన అధిష్ఠాన వస్తువు.

అవ: జ్ఞాన కర్మ సముచ్చయము పొసగదని వ్యక్తావ్యక్తోపాసనముల ఖండన పూర్వకముగ జ్ఞానసాధ్యమే ముక్తి యని తెలుపుట.

అంధంతమః ప్రవిశంతి యేఽవిద్యాముపాసతే,
తతో భూయ ఇవ తే తమో య ఉ విద్యాయాగ్‌ంరతాః. 9

కేవలము అవిద్యను అనగా అగ్నిహోత్రాది కర్మలను విడిచి, వ్యక్తమగు దేవతాజ్ఞానము గలవారగుదురో వారు అజ్ఞానాంధకారమున మునిగిన వారగుదురు. అట్లు గాక కేవల విద్యను దేవతాజ్ఞానము మాత్రము ఉపాసింతురో వారును పైదానికంటెను అధికమగు గాఢాంధకారమున మునిగిన వారగుదురు.

అన్యదేవాహుర్విద్యయాఽన్యదాహురవిద్యయా,
ఇతి శుశ్రుమ ధీరాణాం యే నస్తద్విచచక్షిరే. 10

మాకు సత్యోపదేశము చేసిన ధీరులగు మహాత్ములు విద్యా (ఉపాసనా) ఫలము వేఱనియు అవిద్యా (కర్మ) ఫలము వేఱనియు జెప్పిరి.

విద్యాంచావిద్యాం చ యస్తద్వేదోభయగ్ం సహ,
అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయాఽమృతమశ్నుతే. 11

విద్యావిద్య లనునీ రెంటి తత్త్వమును దెలిసి పరమగు ఆత్మానుభవమును బడసిన తత్త్వవిదుడు అవిద్యారూపమగు మృత్యువును అనగా వ్యక్తమగు సృష్టిజ్ఞానకర్మలను దాటి విద్యవలన గలుగు అమృతత్వమును పొందును. అవ్యక్తమునకు పరమగు ఆత్మతత్త్వమును దెలియునని అర్థము.

అంధం తమః ప్రవిశంతి యేఽసంభూతిముపాసతే,
తతో భూయ ఇవ తే తమో య ఉ సంభూత్యాగ్ం రతాః. 12

కేవలము అసంభూత్యుపాసన అనగా వ్యక్త సృష్టికర్మకలాపోపాసనల జేయువారు దాని వెనువెంట జనుచు అజ్ఞానాంధకారమున మునుగుదురు. కేవల సంభూతియందే-అవ్యక్తమునందే, మునిగినవారు మఱియు నధికమగు అజ్ఞానముననే ప్రవేశించిన వారగుదురు. తాత్పర్యమేమనగా కేవలము ప్రకృతినిగాని కేవల కార్యబ్రహ్మమునుగాని ఉపాసించుట యోగ్యము గాదని భావము.

అన్యదేవాహుః సంభవాదన్యదాహురసంభవాత్,
ఇతి శుశ్రుమ ధీరాణాం యే నస్తద్విచచక్షిరే. 13

సంభూతి (కార్యబ్రహ్మోపాసన) చే గలుగు ఫలము అసంభూతి (ప్రకృతిఉపాసనము) చే గలుగు ఫలము వేఱు వేఱని ఈ రెండిటియొక్క సముచ్చయముచే గలుగు ఫల మధిక మనియు ఈ రెండు ఉపాసనల తత్త్వము నెఱిగిన పండితులు చెప్పుదురు.

సంభూతిం చ వినాశం చ యస్తద్వేదోభయగ్ం సహ,
వినాశేన మృత్యుం తీర్త్వా సంభూత్యాఽమృతమశ్నుతే. 14

అవ్యాకృతమగు ప్రకృతిని వ్యాకృతమగు కార్యబ్రహ్మమును ఈ రెండిటి నొక్కటిగా దెలిసిన వాడు కార్యబ్రహ్మోపాసనచే ఐశ్వర్యమునుబొంది కామాది దోషములనుండి విడువబడును. అవ్యాకృతో పాసనముచే ప్రకృతియందు లయము నొందును.

సాధకుని సూర్యప్రార్థన.

హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపిహితం ముఖమ్,
తత్త్వం పూషన్నపావృణు సత్యధర్మాయ దృష్టయే. 15

అమృతత్వమును బొందుటకు మార్గ మేదనగా సూర్యప్రార్థన. సత్యముయొక్క ముఖము బంగారుపాత్రచే మూయబడి యున్నది. ఓ సూర్యభగవంతుడా! ఓ జ్ఞానసూర్యుడా! సత్యధర్ముడనైన నేను నిన్నుచూచుటకై పై మూతను దీయుము. అనగా నామరూప సౌందర్యములచే నిగనిగలాడు మోహముద్రితమగు బుద్ధియను తెరను తొలగించుము.

పూషన్నేకర్షే యమ సూర్య ప్రాజాపత్య వ్యూహ రశ్మీన్ సమూహ,
తేజో యత్తే రూపం కల్యాణతమం తత్తే పశ్యామి యోఽసావసౌ
పురుషః సోఽహమస్మి. 16

ఓ సర్వపోషకుడా! ఓ సూర్యభగవంతుడా! ఓ బ్రహ్మపుత్రుడా! నీ కిరణములను ఒక ముఖమున ఏకీభవింప జేయుము. నీ దివ్య మంగళ మయ తేజోరూపము నా ముంగిట మెఱయుచున్నది.

అచ్చట వెలుగొందు ఆ పురుషుడే నేను. అనగా సూర్య మండలాంతర్గతుడగు పరమాత్మ.

వాయురనిలమమృతథేదం భస్మాన్తగ్ం శరీరమ్,
ఓం క్రతో స్మర కృతగ్ం స్మర క్రతో స్మర కృతగ్ం స్మర. 17

వాయువు అనగా ప్రాణవాయువు స్వతంత్రమును అమృతమయముసై యున్నది. అది సర్వాత్మకమగు సూత్రాత్మను పొందుగాక! పిదప ఈ శరీరము భస్మీభూతమై నాశ మొందును. ఓ క్రతూ! ఓ సంకల్పాత్మశక్తీ! పరమాత్మను స్మరింపుము. నీ పూర్వకర్మలను దలంచుకొనుము. ఓంకారమును స్మరింపుము.

మనస్సునకు తా జేసిన కర్మానుస్మరణరూప హితబోధ.

అగ్నే నయ సుపథా రాయే అస్మాన్
విశ్వాని దేవ వయునాని విద్వాన్,
యుయోధ్యస్మజ్జుహురాణమేనో
భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ. 18

ఓ అగ్నిదేవతా! సత్ఫలముల నిచ్చు సన్మార్గముచే మమ్ము దీసికొని పొమ్ము. ఓ దేవా! కర్మఫలములను సమస్త విశ్వమును నీవు తెలిసిన వాడవై యున్నావు. మా పాపములను, దోషములను బాపుము. ఓ అగ్నీ! మేము నిన్ను అనేక నమస్కారములచే స్తోత్రము చేయుదుము.

ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే.
ఓం శాంతిః శాంతిః శాంతిః
ఈశావాస్యోపనిషత్తు సమాప్తము
ఓం తత్ సత్

—o—

# ౨. కేనోపనిషత్తు

ఈ కేనోపనిషత్తు సామవేదీయ తలవకార శాఖాంతర్గతమైనది. కావున దీనికి తలవకారోపనిషత్తనియు పేరు. మఱియు ఉపనిషదారంభమ్ము 'కేన' యను పదముచే ప్రారంభింప బడినందువలన కేనోపనిష

త్తనియు చెప్పబడుచున్నది. ఇందు 4 ఖండములు, 34 మంత్రములు గలవు. (విరోధాభాసాలంకార రూపకమై యొప్పుచున్నది.)

ఓమ్. ఆప్యాయంతు మమాంగాని వాక్ప్రాణశ్చక్షుః శ్రోత్రమథో బలమింద్రియాణి చ. సర్వాణి సర్వం బ్రహ్మౌపనిషదం మాహం బ్రహ్మ నిరాకుర్యాం మా మా బ్రహ్మ నిరాకరోదనిరాకరణమస్త్వనిరాకరణం మేఽస్తు. తదాత్మని నిరతే య ఉపనిషత్సు ధర్మాస్తే మయి సంతు తే మయి సంతు.

ఓం శాంతిః శాంతిః శాంతిః

నా అవయవములు నేత్ర శ్రోత్ర వాక్ప్రాణాది సర్వేంద్రియములు బలము గలిగి యుండుగాక! సమస్తము ఉపనిషదుక్త పరబ్రహ్మమై యున్నది. నేను బ్రహ్మమును నిరాకరింపకుందునుగాక! నన్ను బ్రహ్మము నిరాకరింపకుండుగాక! ఉభయ పక్షములయందు నిరాకరణ లేక యుండుగాక! నిరాకరణ గాకుండుగాక! ఉపనిషత్తునందు చెప్పబడిన గుణము లెల్ల ఆత్మనిరతుడనగు నాయందు ఇల్లుగా గలిగి భద్రముగ నుండునుగాక!

ఓం శాంతిః శాంతిః శాంతిః

అవ : సచ్చిదానంద స్వరూపమగు పరమాత్మయే (బ్రహ్మమే) సర్వకర్మ ప్రేరకుడు (సన్నిధాన మాత్రమున) సర్వేంద్రియ ప్రేరకుడు. అతడు తానే యైనను ఇంద్రియాద్యగోచరుడు, అతీతుడు. మానవులు మూర్తామూర్త పదార్థములయందు నానా దేవతా భావములను జేయుదురు. కాని పరబ్రహ్మము సర్వ విలక్షణము, సర్వాతీతమని ఈ ప్రథమ ఖండము దెలుపుచున్నది—

ఓం కేనేషితం పతతి ప్రేషితం మనః కేన ప్రాణః ప్రథమః ప్రైతి యుక్తః. కేనేషితాం వాచమిమాం వదంతి చక్షుః శ్రోత్రం క ఉ దేవో యునక్తి. 1

ఎవరి ప్రేరణచే ఎవరి ఇచ్ఛానుసారము ఈ మనస్సు ఆయా విషయములయందు ప్రవృత్తి నొందుచున్నది? ప్రప్రథమమున ప్రాణము ఎవరి ఆజ్ఞచే తన కర్మ నారంభించును? ఎవరి ఇచ్ఛచే

జనులు మాటలాడెదరు? చక్షుశ్శ్రోత్రములకు ఆజ్ఞచేయు దేవు డెవరు?

పై ప్రశ్నలకుత్తరము.

శ్రోత్రస్య శ్రోత్రం మనసో మనో యద్వాచో హ వాచగ్ం స ఉ ప్రాణస్య ప్రాణః. చక్షుషశ్చక్షురతిముచ్య ధీరాః ప్రేత్యాస్మాల్లోకాదమృతా భవంతి. 2

ఏ పరబ్రహ్మావస్తువు చెవులకు చెవియై, మనస్సునకు మనస్సై, వాక్కునకు వాక్కై, ప్రాణమునకు ప్రాణమై, కన్నులకు కన్నై యున్నదో అట్టి తత్త్వమును ధీరు లెఱుగుదురు. ఇంద్రియములకు అవ్వల వెళ్ళుదురు. ఈ లోకమును విడిచి అమృతత్త్వమును పొందుదురు. అనగా ఇంద్రియార్థ సన్నికర్ష జన్య జ్ఞానము కాని అతీంద్రియమగు అపరోక్షమైన బ్రహ్మానుభవము నొందుదురని భావము.

న తత్ర చక్షుర్గచ్ఛతి న వాగ్గచ్ఛతి నో మనో న విద్మో న విజానీమో యథైతదనుశిష్యాదన్యదేవ తద్విదితాదథో అవిదితాదధి ఇతి శుశ్రుమ పూర్వేషాం యే నస్తద్వ్యాచచక్షిరే. 3

పరబ్రహ్మసన్నిధికి మన దృష్టి పోజాలదు. అది వాక్కునకందదు. దానిని మనస్సు తెలిసికొనజాలదు. ఇట్టిదని విషయీకరింపజాలదు. శిష్యులకు తెలియ జెప్పుటకు వచ్చునంత సులభ సాధ్యము కాదు. అది ఇంతవఱకు తెలిసిన, తెలియఁబడని వస్తువుల కావల నున్నది. అట్టి జ్ఞానప్రబోధకులగు పూర్వులచే ఈ విధముగ మేము వింటిమి.

యద్వాచాఽనభ్యుదితం యేన వాగభ్యుద్యతే
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే. 4

ఏది వాక్శక్తిచే వ్యక్తముగాదో కాని ఏశక్తివలన వాక్కు ప్రకటిత మగునో అదే బ్రహ్మమని నీవు దెలియుము. జనసామాన్యులు దేనిని బ్రహ్మమని ఉపాసింతురో అది బ్రహ్మము కాదు. అనగా ప్రత్యక్షాది ప్రమాణ విషయము గాదు.

యన్మనసా న మనుతే యేనాహుర్మనో మతమ్
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే. 5

ఏది మనస్సుచే తెలియబడ జాలదో దేనివలన మనస్సు విషయములను విషయీకరింప సమర్థమగునో అదే బ్రహ్మమని తెలియుము. జనులు దేనిని బ్రహ్మమని ఉపాసింతురో అది బ్రహ్మము కాదు (బ్రహ్మాభాసము).

యచ్చక్షుషా న పశ్యతి యేన చక్షూగ్ంషి పశ్యతి,
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే. 6

ఏది కన్నులచే చూచుటకు రాదో దేనిచేత కన్నులు చూచుటకు శక్తిమంతము లగునో అది బ్రహ్మమని తెలియుము. జనసామాన్యులు దేనిని బ్రహ్మమని ఉపాసింతురో అది బ్రహ్మము కాదు. అది రూపవిషయము గాదు. పరమగు దృక్కని అర్థము.

యచ్ఛ్రోత్రేణ న శృణోతి యేన శ్రోత్రమిదగ్ం శ్రుతమ్,
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే. 7

ఏది చెవులచే వినబడదో దేనిచేత చెవులు వినగలుగునో అది బ్రహ్మమని తెలియవలెను. దేనిని సామాన్య జనులు బ్రహ్మమని ఉపాసింతురో అది బ్రహ్మము కాదు. అది కేవలము శబ్దమాత్రమే. "నిశ్శబ్దం బ్రహ్మముచ్యతే" యని చెప్పబడును. కాన బ్రహ్మము శబ్ద విషయము గాదు.

యత్ప్రాణేన న ప్రాణితి యేన ప్రాణః ప్రణీయతే,
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే. 8

ఇతి ప్రథమః ఖండః

ఏది ప్రాణ సహాయమున ఉఛ్వాస ప్రశ్వాసములను చేయ జాలదో దేనిచే ప్రాణమునకు ఉఛ్వాస ప్రశ్వాస వంతమగు శక్తి కలుగునో అదే బ్రహ్మమని తెలియుము. జనులు దేనిని బ్రహ్మమని ఉపాసింతురో అది బ్రహ్మము కాదు. తాత్పర్య మేమనిన, బ్రహ్మము ఇంద్రియాద్యవిషయమని అర్థము. "అప్రాణో హ్యమనాః శుభ్రః"

---

## ద్వితీయ ఖండము

అవ.: బ్రహ్మానుభవము ఎవరి కగును? అను నీ విషయము

నందు నిరభిమానముచే వినమ్ర భావము గలిగి నాకు తెలియదని పలుకువాని కది తెలియును. వస్తుతః అది ప్రమేయ పదార్థము గాదు. అహంకృతిచే నాకు తెలియునని అభిమానించు వానికి తెలియదు. అట్టి బ్రహ్మానుభవమును ఈ జన్మయందే ఇప్పుడే పొందవలయు నను మొదలగు విషయము లీఖండమున చెప్పబడును.

యది మన్యసే సువేదేతి దభ్రమేవాపి నూనం త్వం వేత్థ బ్రహ్మణో రూపమ్. యదస్యత్వం యదస్య చ దేవేష్వథ ను మీమాంస్య మేవ తే మన్యే విదితమ్. 9

గురుడు శిష్యునకు చెప్పిన దేమనిన, బ్రహ్మమును నేను చక్కగా తెలిసి యున్నాననినచో ఆ బ్రహ్మస్వరూపముయొక్క అల్పాంశమును మాత్రమే నీవు తెలిసిన వాడవని అర్థము. ఏ బ్రహ్మ జ్ఞానము నాకు కలిగినదని తెలిసి యున్నావో ఆ స్వరూపము నీ విషయ మున నేమి. దేవతల విషయమున నేమి, అదెట్లున్నదను ప్రసంగము ఇంకను తెలియ వలసిన దనియే అర్థము. అహంవృత్తిచేత ఆత్మతత్త్వము వేద్యము గాదని భావము.

నాహం మన్యే సువేదేతి నో న వేదేతి వేద చ,
యో నస్తద్వేద తద్వేద నో న వేదేతి వేద చ. 10

శిష్యుడు: నేను బ్రహ్మమును చక్కగా తెలిసితి నని గాని, తెలియ నని గాని తలంపను.

గురువు: మనయందు ఎవరతనిని తెలిసి యున్నామని భావింతురో వారికి యథార్థ జ్ఞానము లేదని తెలియవలెను. ఎవరైతే నమ్రమగు భావముచే తెలియదని అంగీకరింతురో వారు తమ నిజస్వరూపము నెఱిగినవారు. అహంకారము లేని చోట ఆత్మానుభవమని అర్థము.

యస్యామతం తస్య మతం మతం యస్య న వేద సః,
అవిజ్ఞాతం విజానతాం విజ్ఞాత మవిజానతామ్. 11

ఎవరు మాకిది తెలియదని భావింతురో వారికి తెలియును. అనగా బ్రహ్మము ప్రమాణ వేద్యమగు ప్రమేయ (దృశ్య) పదార్థము కాదు. మాకు తెలిసి యున్నదని ఎవరు భావింతురో వారికి తెలియదు.

కారణ మేమన, అది తెలియ బడునది కాదు. స్వయం సిద్ధము, స్వయంప్రకాశమునై యున్నది. తెలిసితి మనువారికి తెలియదు, తెలియదను వారికి స్వరూప మాత్రమై తెలియబడును (స్వసంవేద్యము).

ప్రతిబోధవిదితం మతమమృతత్వం హి విందతే,
ఆత్మనా విందతే వీర్యం విద్యయా విందతేఽమృతమ్. 12

ఈ జ్ఞానము గురు ప్రబోధవలన గాక అన్యోపాయములచే కలుగ జాలదు. ఈ నిజనిష్ఠచే అమృతత్వ ప్రాప్తి యగును. ఈ ఆత్మ నుండియే వీర్యము అనగా జ్ఞానశక్తి సంప్రాప్త మగును. ఆ జ్ఞానముచే అమృతత్వము సిద్ధించును. ఇట్టి సత్యజ్ఞానానుభవము ఈ లోకమునందే కాని ఇతర లోకములయందు కాదు.

ఇహ చేదవేదీదథ సత్యమస్తి
న చేదిహావేదీన్మహతీ వినష్టిః,
భూతేషు భూతేషు విచిత్య ధీరాః
ప్రేత్యాస్మాల్లోకాదమృతా భవంతి. 13

ఇతి ద్వితీయః ఖండః

ఇట్టి బ్రహ్మజ్ఞానమును ఈ లోకముననే పొందవలయును. అదే సత్యమగు జ్ఞానము. అట్టి బ్రహ్మానుభవమును పొందక పోయినవారు మహానష్టమునకు పాత్రు లగుదురు. ధీరులు సర్వభూతములయందు బ్రహ్మసాక్షాత్కారము నొంది మృత్యువునుండి అమృతత్వమును పొందుదురు.

---

## తృతీయ ఖండము

అవ: పరబ్రహ్మతత్త్వమే సర్వాధారము, సర్వము, సర్వశ్రేష్ఠ మునై యున్నది. కావున నేనను తాదాత్మ్యబుద్ధిచే నహంకరించుట కిందు తావు లేదు. ఆ పరబ్రహ్మముయొక్క మహిమయే ఈ సర్వస్వ మునై యున్నదను అనుభవము నొసగుటకై చిన్నదొక చక్కని కథ ఈ ఖండమున చెప్పబడును.

బ్రహ్మ హ దేవేభ్యో విజిగ్యే. తస్య హ బ్రహ్మణో విజయే దేవా అమహీయంత త ఐక్షంతాస్మాకమేవాయం విజయో౽స్మాకమేవాయం మహిమేతి. 14

ఒకానొకప్పుడు దేవాసురుల యుద్ధమునందు దేవతలకొఱకై బ్రహ్మమే జయము నొందెను. కాని జయము మాదే యని ఆ దేవతలు అహంకరించిరి.

తద్ధైషాం విజజ్ఞౌ. తేభ్యో హ ప్రాదుర్బభూవ. తన్నవ్యజానంత కిమిదం యక్షమితి. 15

ఇది బ్రహ్మమునకు తెలిసెను. అప్పుడు విలక్షణమగు ఆ బ్రహ్మము దేవతల యెదుట యక్షరూపమున ప్రత్యక్ష మయ్యెను. ఇదేమి? యని దేవతలకు తెలియదయ్యెను.

తే౽గ్నిమబ్రువన్ జాతవేద ఏతద్విజానీహి కిమేతద్యక్షమితి తథేతి. 16

దేవత లెల్లరు గలసి అగ్నిదేవుని కిట్లు చెప్పిరి. ఓ జాతవేదా! ఓ జ్ఞానీ! ఈ యక్షరూపమున అగపడున దేమియో దానిని తెలిసికొనుమని చెప్పిరి. అగ్ని అందులకు సమ్మతించెను.

తదభ్యద్రవత్తమభ్యవదత్ కో౽సీత్యగ్నిర్వా అహమస్మీత్యబ్రవీజ్జాతవేదా వా అహమస్మీతి. 17

అగ్ని యక్షుని సమీపము జేరగా యక్షరూపమున నున్న బ్రహ్మము ఓయీ! నీవెవడవని అడిగెను? నేను అగ్నిని; నన్ను జాతవేదు డందురని అగ్ని జవాబు చెప్పెను.

యస్మింస్త్వయి కిం వీర్యమిత్యపీదగ్ం సర్వం దహేయం యదిదం పృథివ్యామితి. 18

అయ్యా! ప్రసిద్ధుడవగు నీయందలి శక్తి ఏమని మరల బ్రహ్మమా యగ్నిని ప్రశ్నించెను? అందుల కాతడు నేను యావద్భూతలమునందలి సమస్త పదార్థములను భస్మీభూత మొనర్చెదనని పలికెను.

తస్మై తృణం నిదధావేతద్దహేతి. తదుపప్రేయాయ సర్వజవేన

తన్న శశాక దగ్ధుం. స తత ఏవ నివవృతే. నైతదశకం విజ్ఞాతుం యదేతద్యక్షమితి. 19

అప్పుడు యక్షరూపమున నున్న బ్రహ్మము ఈ తృణమును గాల్చుమని యతని చేతికి గడ్డిపోచ నొకటి నిచ్చెను. అగ్ని తన స్వరూపముచే దానిని దగ్ధ మొనర్ప బ్రయత్నించి విఫలత నొందెను. పిదప వెంటనే అగ్ని దేవతల కడకు వెళ్ళి ఆ యక్షరూపమున నున్న దేదియో అది నాకు తెలియ సాధ్యము కాలేదని చెప్పెను.

అథ వాయుమబ్రువన్. వాయవే తద్విజానీహి కిమేతద్యక్షమితి తథేతి. 20

(మరల) ఈ యక్ష రూపమున నున్న దేదియో తెలిసికొని రమ్మని దేవతలు వాయువునకు చెప్పగా సరి యని సమ్మతించి వాయు దేవుడు అ యక్షునికడకు వెళ్ళెను.

తదభ్యద్రవత్తమభ్యవదత్. కో௨సీతి వాయుర్వా అహమస్మీత్యబ్రవీన్మాతరిశ్వా వా అహమస్మీతి. 2

వాయు దేవుడు యక్ష సమీపమున జేర ఓయీ! నీవెవర వని మరల యక్ష రూపమున నున్న బ్రహ్మ మడిగెను. నేను వాయువు నన్ను మాతరిశ్వుడని పిలుతురు.

తస్మింస్త్వయి కిం వీర్యమిత్యపీదగ్ం సర్వమాదదీయ యదిదం పృథివ్యామితి. 22

అట్లైన నీయందుండు శక్తి ఏమని యక్షు డడుగగా యీ ప్రపంచము నందలి చరాచర వస్తువుల నెల్ల అపహరింతును. చెదర గొట్టెద నని వాయువు చెప్పెను.

తస్మై తృణం నిదధావేతదాదత్స్వేతి. తదుపప్రేయాయ సర్వజవేన తన్నశశాకాదాతుం స తత ఏవ నివవృతే నైతదశకం విజ్ఞాతుం యదేతద్యక్షమితి. 23

అట్లైన దీనిని చెదరగొట్టుమని బ్రహ్మ మతని చేతికి ఒక గడ్డిపోచ నొసగెను. తన యావద్బలమును ప్రయోగించి చూచినను వాయు వా తృణమును కదల్పలేక పోయెను. (అప్పుడు). వాయువు

మణిలి దేవతల కడకు జేరి ఆ యక్షు డెవరో తెలియుటకు నాకు శక్తి లేదని చెప్పెను.

అథేంద్రమబ్రువన్ మఘవన్నేతద్విజానీహి కిమేతద్యక్షమితి తథేతి తదభ్యద్రవత్తస్మాత్తిరోదధే. 24

దేవతలు, హే మఘవన్! ఓ ఇంద్రుడా! ఆ యక్షరూప మేమై యున్నదో? తెలిసికొనుమని ఇంద్రునకు చెప్పిరి. అట్లే యగుగాక! యని ఇంద్రుడు యక్ష రూపమున నున్న బ్రహ్మకడకు చేర బోవ వెంటనే అది అంతర్ధాన మొందెను.

స తస్మిన్నేవాకాశే స్త్రియమాజగామ. బహుశోభమానా ముమాం హైమవతీం తాగ్ంహోవాచ కిమేతద్యక్షమితి. 25

ఇతి తృతీయః ఖండః

అప్పుడదే స్థలమున ఇంద్రునకు మహాకాంతితో ఒక స్త్రీ యగపడెను. ఉమ యను పేరు గలదియును విశేషముగ శోభిల్లు నదియును స్త్రీరూపధారిణియు నగు దేవిని (పార్వతిని) గాంచెను. దేవీ! ఇంతవఱకు యక్షరూపముచే అగపడిన దేమి? యని ప్రశ్నించెను.

---

## చతుర్థ ఖండము

అవ : సుందరమగు స్త్రీవేషధారిణియైన ఉమాదేవి సాక్షాత్ (జ్ఞానస్వరూపిణి) ప్రత్యక్షమై దేవతలకు తత్త్వజ్ఞానము నుపదేశించి ఆధ్యాత్మికము, ఆధిదైవికమను రెండు ఉదాహరణలచే బ్రహ్మస్వరూప వర్ణనము జేయుచు తపశ్శమదమాదికర్మలు బ్రహ్మజ్ఞాన సాధనములని ఉపదేశించుచున్నది—

సా బ్రహ్మేతి హోవాచ. బ్రహ్మణో వా ఏతద్విజయే మహీ యధ్వమితి తతో హైవ విదాంచకార బ్రహ్మేతి. 26

అయ్యా! ఆ యక్షరూపమున ప్రత్యక్ష మైనది సాక్షాద్బ్రహ్మమే. మీకు కలిగిన విజయము అతని గొప్పతనము వలననే యని తెలియుడి. (మేమే యని అహంకరింప వలదు) ఈ పలుకులు విని ఇంద్రుడు యక్ష

రూపమున ప్రత్యక్ష మైనది బ్రహ్మమే నని తెలిసికొనెను.

తస్మాద్వా ఏతే దేవా అతితరామివాన్యా౯ దేవా౯ యదగ్ని ర్వాయురిన్ద్ర)_స్తేన హ్యేనన్నేదిష్ఠం పస్పర్శు_స్తే హ్యేనత్ప్రథమో విదాంచకార బ్రహ్మేతి. 27

అందుచేతనే ఇతర దేవతలకంటెను అగ్ని, వాయువు, ఇంద్రుడు గొప్పవారు. ఈ ముగ్గురు బ్రహ్మమున కత్యంత సమీపము వెళ్ళి స్పృశించిరి. అనగా తెలిసికొనిరి. ఇందలి తాత్పర్య మేమనిన, బ్రహ్మ త_త్త్వమును ఇతర దేవతలకంటె మొట్టమొదట తెలిసికొన్నవారు వీరే యని అర్థము.

తస్మాద్వా ఇంద్రో ఽతితరామివాన్యా౯ దేవా౯ స హ్యేనన్నేదిష్ఠం పస్పర్శ సహ్యేనత్ప్రథమో విదాంచకార బ్రహ్మేతి. 28

ఈ కారణముచేతనే సమ_స్త దేవతలయందును ఇంద్రుడు గొప్పవాడు. అతనికి అత్యంత సన్నిహితమై బ్రహ్మసంస్పర్శ మైనది. అందరి కంటెను మొదట బ్రహ్మత_త్త్వ మిది యని ఇంద్రు డరసెను.

తస్యైష ఆదేశో యదేతద్విద్యుతో వ్యద్యుతదా3ఇతీతి న్న్యమీమిషదా3ఇత్యధిదై_వతమ్. 29

ఇది బ్రహ్మవిషయకమగు ఆదేశము (గుర్తు) నిదర్శనాత్మకమగు లక్షణము. విద్యుల్లతవలెను కనురెప్పలు మూయుట తీయుట వలెను అవినాభావ సంబంధమున వెలుగొందు బ్రహ్మముయొక్క ఆధిదైవిక లక్షణము. బ్రహ్మమును, తచ్ఛ_క్తియును వేఱు గాదు. ఒకటే!

ఇక ఆధ్యాత్మికాదేశము

అథాధ్యాత్మం యదేతద్గచ్ఛతీవ చ మనో ఽనేన చైతదుప స్మరత్యభీక్ష్ణం సంకల్పః. 30

మనోగతివలె సంకల్పశ_క్తియు మనస్సుచే ఇష్టవస్తు స్మరణ చేసి నట్లు బ్రహ్మము ఉపాసింప దగినది. (బ్రహ్మజ్ఞానము గలుగునని భావము).

తద్ధ తద్వనం నామ తద్వనమిత్యుపాసితవ్యం స య ఏతదేవం వేదాఽభిహైనం సర్వాణి భూతాని సంవాంఛంతి. 31

ఆ బ్రహ్మము ఆనందస్వరూపము. ఆనంద స్వరూపుడే యని అతని నుపాసింపవలెను. ఇట్టి బ్రహ్మజ్ఞానము గలవాని కృపను బడయుటకై సమస్త భూతమాత్రులు, సర్వప్రాణులును ఇచ్ఛయింతురు.

ఉపనిషదం భో బ్రూహీత్యుక్తాయ ఉపనిషద్బ్రాహ్మీం వావ త ఉపనిషదమబ్రూమేతి. 32

శిష్యుడనినది : ఓ సచ్చిదానందమూర్తీ! నాకు ఉపనిషత్తులను అనగా ఆత్మతత్త్వమును చెప్పుము.

గురువులు : ఇంతవఱకు చెప్పిన జ్ఞానము బ్రహ్మవిషయకమగు జ్ఞానమే! మేము నీకు ఉపనిషత్తునే చెప్పియున్నాము.

తస్యై తపో దమః కర్మేతి ప్రతిష్ఠా వేదాః సర్వాంగాని సత్యమాయతనమ్. 33

తపస్సు, ఇంద్రియనిగ్రహము, మఱియు సత్కర్మ ఇవి ఆ జ్ఞానమునకు ప్రతిష్ఠ (ఆధారములు). సర్వవేదములు ఆ జ్ఞానముయొక్క అంగములు. సత్యమే దాని ఆశ్రయస్థానము.

యో వా ఏతామేవం వేదాపహత్య పాప్మాన మనంతే స్వర్గే లోకే జ్యేయే ప్రతితిష్ఠతి ప్రతితిష్ఠతి. 34

ఇతి చతుర్థః ఖండః

ఈ విధముగ తత్త్వమును ఎవరు తెలియుదురో వారు సమస్త పాపములనుండి విడువబడి చివర శ్రేష్ఠమగు స్వర్గమున ప్రతిష్ఠ నొందుదురు. అనగా బ్రహ్మమునందు వసింతురు. మోక్షము నొందుదురని తెలియవలయును. బ్రహ్మతత్త్వము బుద్ధిగోచరము కాకపోయినను బ్రహ్మానుచింతనముచే బుద్ధి శుద్ధమయిన ఆ బ్రహ్మము తనకంటె అన్యము గాదను యథార్థ తత్త్వము సుసంవేద్య మగును.

ఓం ఆప్యాయంత్వితి శాంతిః

కేనోపనిషత్తు సమాప్తము

ఓం తత్ సత్.

# 3. కఠోపనిషత్తు

ఓం సహ నావవతు. సహ నౌ భునక్తు. సహ వీర్యం కరవావహై తేజస్వి నావధీతమస్తు మా విద్విషావహై.

ఓం శాంతిః శాంతిః శాంతిః

(ఇది ముముక్షువగు శిష్యుడు పఠించునట్టి మంత్రము)

అతడు (పరమాత్మ) మా యిరువురను (గురుశిష్యులను) కాపాడు గాక! మాయిరువురను పోషించునుగాక! మాకు విద్యావిషయమునందు చక్కని సామర్థ్యము గలుగుగాక! మేము అధ్యయనము చేసినట్టిది తేజస్సంపన్నమై తనరునుగాక! బ్రహ్మవిద్యమాకు లెస్సగా అవగాహనమగునుగాక! పరస్పరము మాలో విద్వేషవృత్తి కలుగకుండునుగాక!

అవ: వాజశ్రవసు డను నతడు విశ్వజిద్యాగ మొనర్చి అయోగ్యమగు దానము నొసగు చుండుటను గాంచి అతని పుత్రుడగు నచికేతుడు నాయనా! నన్నెవరికి దాన మిచ్చెదవని యడుగుట, యమునికిచ్చెదనని తండ్రి బదులు చెప్పుట యను మొదలగు విషయములు ఇందు 6-వ మంత్రమువఱకు చెప్పబడును.

ప్రథమాధ్యాయము-ప్రథమవల్లి

ఓమ్. ఉశన్ హ వై వాజశ్రవసః సర్వవేదసం దదౌ తస్య హ నచికేతా నామ పుత్ర ఆస. 1

వాజశ్రవస్సను ఋషి (ఫలాపేక్షచేత) విశ్వజిద్యాగ మొనర్ప నిశ్చయించి తన సర్వసంపదను దాన మొసగెను. అతనికి నచికేతుడను కుమారు డొకడుండెను.

తగ్ంహ కుమారగ్ం సంతం దక్షిణాసు నీయమానాసు శ్రద్ధావివేశ సోఽమన్యత. 2

కుమారునకు వయస్సు చిన్నదైనను దాన మొసగిన పదార్థములు (చిక్కిపోయిన గోవులను) బ్రాహ్మణులు గొంపోవు చుండుటను గాంచి అతనియం దొక సద్భావన యుప్పతిల్లి ఇట్లు విచారించెను.

పీతోదకా జగ్ధతృణా దుగ్ధదోహా నిరింద్రియాః,
అనందా నామ తే లోకా స్తాన్ స గచ్ఛతి తా దదత్. 3

గడ్డిని నీళ్ళను తినుటకుగాని త్రాగుటకుగాని శక్తి లేనివియు శిథిల మొందిన అవయవములు గలవియు నగు గోవులను దానము చేయు వానికి ఆనంద రహితమగు లోకములు ప్రాప్త మగును.

అవ: నానుండి కదా నా తండ్రి కీలోభము గలిగినది? స్వాత్మార్పణచేత నైనను నా తండ్రియొక్క పాపమును బాపవలయు నని ఆలోచించి తండ్రికడకు వెడలి ఇట్లు బలికెను.

సహోవాచ పితరం తత కస్మై మాం దాస్యసీతి. ద్వితీయం తృతీయం తగ్ంహోవాచ. మృత్యవే త్వా దదామీతి. 4

తండ్రీ! నన్నెవరికిచ్చెద వని అడిగెను? ఇట్లని రెండు మూడు సారు లడుగగా (తండ్రి కుపితుడై) నిన్ను మృత్యుదేవత కొసగెద నని పలికెను.

బహూనామేమి ప్రథమో బహూనామేమి మధ్యమః,
కిగ్ంస్విద్యమస్య కర్తవ్యం యన్మయాద్య కరిష్యతి. 5

(ఇది విని) బహు జనులయందు నేను ప్రథమ శ్రేణికి చెందిన వాడను; లేక ప్రథముడను గాక పోయినను నా తండ్రికి గల పుత్రులు శిష్యులు మొదలగు అనేకులయందు నేను మధ్యముడ ననుటకు సందియము లేదు. యమునకు నావలని ప్రయోజన మేమి? కోపముచే తండ్రి ఇట్లు పలికి యుండవచ్చును. అయిన నేమి? వారి మాట యసత్యము కా గూడదని ఆలోచించి సామాన్య జనులవలె వినష్ట కర్మఫల భోగానుభవము కొఱకై యముని కడకు వెళ్ళక నేను శిష్యవృత్తిచే వెడలెదనుగాక యని తలపోయుచు తండ్రిని చూచి మరల ఇట్లు బలికెను.

అనుపశ్య యథా పూర్వే ప్రతిపశ్య తథాఽపరే,
సస్యమివ మర్త్యః పచ్యతే సస్యమివాజాయతే పునః. 6

తండ్రీ! పూర్వికులగు పెద్ద లెట్లుండిరి? ఇప్పటివా రెట్లున్నారని విచారించి చూచిన పెద్దలు సత్యసంధులై యుండిరని తెలియుచున్నది.

మానవుడు పైరువలె పుట్టి పండి యెండి పడిపోవును (చచ్చును) మరల పుట్టును. అనిత్యమగు ఈ జీవనేచ్ఛచే సత్యము:నుండి జాఱుట తగదు. నన్ను యమ పట్టణమునకు బంపు విషయమున జంక వలదు.

అవ : ఇట్లు పుత్రుని సత్యంపు పలుకులను విని తండ్రి యముని కడకు పంపెను. యముడు ఇంటియందు లేనందు వలన మూడు దినముల వఱకు అన్నోదకములు లేక ఈ వటువు (బ్రహ్మచారి) అతని యింట నుండెను. యమునకీ విషయమును అతని మంత్రు లిట్లు దెలిపిరి.

వైశ్వానరః ప్రవిశత్యతిథిర్బ్రాహ్మణో గృహాన్,
తస్యైతాగ్ం శాంతిం కుర్వంతి హర వైవస్వతోదకమ్. 7

అయ్యా! వచ్చిన బ్రాహ్మణాతిథి అగ్నివలె ఇల్లు ప్రవేశించెను. కాబట్టి అతనిని అర్ఘ్య పాద్యాదులచే శాంత మొనర్చుటకై ఓ వైవస్వతా! జలము తీసికొని రమ్ము. (అగ్నికి ఉపశాంతి జలము ఇంటికి వచ్చిన అతిథి అగ్నిరూపుడు గావున అతనికి జల మిచ్చి సత్కరించుట విధానమని భావము.)

అవ : ఇంటికి వచ్చిన అతిథిని సత్కరించనిచో కలుగు నష్టములు.

ఆశాప్రతీక్షే సంగతగ్ం సూనృతాం
చేష్టాపూర్తే పుత్రపశూగ్ంశ్చ సర్వాన్,
ఏతద్వృంక్తే పురుషస్యాల్పమేధసో
యస్యానశ్నన్ వసతి బ్రాహ్మణో గృహే. 8

ఏ అల్పబుద్ధి గల మానవుని ఇంట మాన్యుడగు బ్రాహ్మణుడు (ముముక్షువు) భుజింపబడక వసించునో అతడు ఆ ఇంటియజమాని యొక్క ఆశాప్రతీక్షలు, అనగా సత్యసంకల్ప ఫలమును, ఉత్తమ వాక్కులచే కల్గిన మహాపుణ్యమును, యాగ ఫలమును, ఆశ్రమ ధర్మ కర్మ ఫలములును, సమస్త పుత్ర పౌత్ర పశ్వాదులను నాశ మొందును. పెద్దలచే ఆర్జింపబడిన సుకృతము క్షయము నొందును.

అవ : అప్పుడు వైవస్వతుడు వచ్చి అర్ఘ్య పాద్యాదులచే నచికేతుని సత్కరించి ఇట్లు పలికెను.

తిస్రో రాత్రీర్యదవాత్సీర్గృహే మే
ఽనశ్నన్ బ్రహ్మన్నతిథిర్నమస్యః,
నమస్తేఽస్తు బ్రహ్మన్ స్వస్తి మేఽస్తు
తస్మాత్ప్రతి త్రీన్ వరాన్ వృణీష్వ. 9

హే బ్రహ్మన్! వందనార్హుడగు అతిథివైన నీవు ఆహారమును గైకొనక నా ఇంటియందు మూడు దినము లుపవసించి యున్నాడవు. అందుచే నాకు అశుభము గాకుండ శుభ మగునట్లు అభయ మొసగి క్షమింతువు గాక! నానుండి నీవు మూడు వరములను గోరుకొను మని చెప్పెను.

అవ : అప్పుడు నచికేతు డీ క్రింది విధముగ మూడు వరముల నడిగెను.

శాంతసంకల్పః సుమనా యథా స్యా
ద్వీతమన్యుర్గౌతమో మాభి మృత్యో,
త్వత్ప్రసృష్టం మాభివదేత్ప్రతీత
ఏతత్త్రయాణాం ప్రథమం వరం వృణే. 10

ఓ మృత్యుదేవా! నా విషయమై కలిగిన నా తండ్రియొక్క తాపము శాంతించుగాక! అతని మనస్సు స్వాస్థ్య మొందుగాక! అతని కుండిన నా విషయిక మగు చింత దూర మగునుగాక! నీనుండి వెను దిరిగి వెళ్ళిన నన్ను జూచి (ప్రేతమని) భయపడక గుర్తించి నాతో పుత్రప్రేమచే సంభాషించుగాక! మూడు వరములయందు మొదటి వరముగ దీని నడుగుచున్నాడను.

యథా పురస్తాద్భవితా ప్రతీత
ఔద్దాలకిరారుణిర్మత్ప్రసృష్టః,
సుఖగ్ం రాత్రీః శయితా వీతమన్యు
స్త్వాం దదృశివాన్ మృత్యుముఖాత్ప్రముక్తమ్. 11

యమరాజు : అరుణ పుత్రుడగు ఔద్దాలకి యైన నీ తండ్రి నానుండి వెడలిన నిన్ను మొదటివలె ప్రీతితో గ్రహించును. మృత్యు ముఖముచే విముక్తమైన నిన్ను చూచి అతనికి కోప ముడిగి శాంత

మగును. రాత్రులు చక్కగ నిద్రపట్టును. (చింత గల వారికి రాత్రులు చక్కగా నిద్రపట్టదని ఇచ్చటి భావము.)

స్వర్గే లోకే న భయం కించ నాస్తి
న తత్ర త్వం న జరయా బిభేతి,
ఉభే తీర్త్వాశనాయాపిపాసే
శోకాతిగో మోదతే స్వర్గలోకే. 12

ఓ నచికేతా! స్వర్గమునందు భయ మనునది లేదు. తన్నామమే అచ్చట పొసగదు. అచ్చట మనుష్యునకు వృద్ధాప్యముయొక్క భయమును లేదు. ఆకలిదప్పుల కలతయును లేక స్వర్గమున ఆనందముగ నుండును.

నచికేతుడు స్వర్గసాధనమగు అగ్నివిద్య నడుగుట

స త్వమగ్నిగ్ం స్వర్గమధ్యేషి మృత్యో
ప్రబ్రూహి తగ్ం శ్రద్దధానాయ మహ్యమ్,
స్వర్గలోకా అమృతత్వం భజంత
ఏతద్ద్వితీయేన వృణే వరేణ. 13

ఓ యమరాజా! అట్టి స్వర్గ సాధనమగు అగ్నిజ్ఞానము నీకు కలదు. శ్రద్ధాళువైన నాకా జ్ఞానము నుపదేశింపుము. స్వర్గమును చేరిన వారు అమృతత్వమును బడయుదురు. ఇదే నా రెండవ వరము.

యమరాజీక్రింది విధముగ జెప్పెను.

ప్రతే బ్రవీమి తదుమే నిబోధ
స్వర్గమగ్నిం నచికేతః ప్రజానన్,
అనంతలోకాప్తిమథో ప్రతిష్ఠాం
విద్ధి త్వమేతన్నిహితం గుహాయామ్. 14

ఓ నచికేతా! స్వర్గసాధనమగు అగ్నిజ్ఞానము గల నేను నీకు దానిని చెప్పెదను. ఏకాగ్ర చిత్తముచే వినుము. ఇది సమస్త లోకములను ప్రాప్తింప జేయునది. ఇది స్వర్గమునకు ఆధారభూతము. హృదయ గుహాయందున్న దీనిని నీవు తెలిసికొనుము.

లోకాదిమగ్నిం తమువాచ తస్మై
యా ఇష్టకా యావతీర్వా యథా వా,

స చాపి తత్ప్రత్యవదద్యథోక్త
మథాస్య మృత్యుః పునరేవాహ తుష్టః. 15

అపిడప యమరాజు సకల లోకములకు ఆదియగు అగ్నిజ్ఞానము నతనికి బోధించెను. అచ్చట ఎట్లు ఎన్ని ఇటుకలు ఆ వేదికకు కావలయును? వేదికను ఎట్లు సిద్ధపఱచ వలెనను ఇత్యాది విషయములనెల్ల యముడు చెప్పెను. సమస్త విధులను యథోక్తముఁగ యము డుపదేశించెను. ఆ ప్రకారము నచికేతుడు మరల ఒప్పజెప్పి చూపింపగా యముడు సంతసించెను.

తమబ్రవీత్ప్రీయమాణో మహాత్మా
వరం తవేహాద్య దదామి భూయః,
తవైవ నామ్నా భవితాఽయమగ్నిః
సృంకాం చేమా మనేకరూపాం గృహాణ. 16

అమ్మహాత్ముడు ప్రసన్నుడై నచికేతుని గుఱించి ఇట్లు చెప్పెను. ఓనచికేతా! నేను మరల ఇంకొక వరము నీకొసగెదను. ఇక మీాదట ఈ అగ్ని నీ పేర ప్రసిద్ధినొందును. వివిధ రూపములచే నొప్పు సమస్త ఫలముల నొసగు ఈ విచిత్రమైన మాలను గైకొనుము. ఈ కర్మవిషయమైన జ్ఞానమును నీకు తెలిపెదను. గ్రహింపుము.

మరల కర్మలను స్తుతించుచున్నాడు

త్రిణాచికేతస్త్రిభిరేత్య సంధిం
త్రికర్మకృత్తరతి జన్మమృత్యూ,
బ్రహ్మజజ్ఞం దేవమీాడ్యం విదిత్వా
నిచాయ్యేమాగ్ం శాంతిమత్యంతమేతి. 17

మూడు అగ్నులు అనగా ఆహవనీయ అన్వాహార్య గార్హపత్యము లను మూడు అగ్నులు గల అగ్నిహోత్రి తద్ జ్ఞానాధ్యయనానుష్ఠానముల జేసికొని యజ్ఞ దాన అధ్యయనాది కర్మలయందు నిరతుఁడగువాడు మాతాపితృ గురువు లను నీ ముప్పూరి మాటను వినువాడు జన్మ మృత్యువులను గెలుచును. ఇట్టి తేజస్సంపన్నమగు బ్రహ్మపుత్రుని అగ్ని నెఱిగినవాడు తన సంపూర్ణ జ్ఞానమును పొంది అత్యంతమగు శాంతి ననుభవించును.

త్రిణాచికేతస్త్రయమేతద్విదిత్వా
య ఏవం విద్వాగ్ంశ్చినుతే నాచికేతమ్,
స మృత్యుపాశాన్ పురతః ప్రణోద్య
శోకాతిగో మోదతే స్వర్గలోకే. 18

పై జెప్పబడిన మూడు యజ్ఞములు చేసి ఆ మూటి పూర్ణ బోధను పొంది నాచికేత మను నీ అగ్నిచయనాద్యనుష్ఠానము నెవడు చేయునో అతడు చచ్చుటకు ముందే మృత్యుపాశమును నశింప జేయును. దుఃఖములను దాటి స్వర్గమున ఆనందము ననుభవించును.

ఏష తేఽగ్నిర్నచికేతః స్వర్గ్యో యమవృణీథా ద్వితీయేన వరేణ ఏతమగ్నిం తవైవ ప్రవక్ష్యంతి జనాస స్తృతీయం వరం నచికేతో వృణీష్వ. 19

నీవు రెండవదిగా గోరుకొన్న నాచికేతాగ్నిజ్ఞాన మిదే. ఈ అగ్నిని జనులు ముందు నీపేర పిలుతురు. ఓ నచికేతా! ఇక మూడవ వరమును గోరుకొనుము. ఇంతవఱకు చెప్పబడినది కర్మోపాసనా ఫల మగు స్వర్గవిద్య యని భావము.

అవ: దేహమునకంటె వేఱగు ఆత్మవిద్యోపదేశమును నచికేతుడు మూడవ వరముగ నడుగుట.

యేయం ప్రేతే విచికిత్సా మనుష్యే
(అ) స్తీత్యేకే నాయమస్తీతి చైకే,
ఏతద్విద్యామనుశిష్ట స్త్వయాహం
వరాణామేష వర స్తృతీయః. 20

మనుష్యుడు మరణించిన పిదప అతని ఆత్మ ఉండునని కొందఱు ఉండదని కొందఱు చెప్పుదురు. ఈ విషయమై నీనుండి యథార్థ జ్ఞానమును బడయ నే నపేక్షించు వాడను. వరములయందు ఇది మూడవది.

దేవైరత్రాపి విచికిత్సితం పురా
నహి సువిజ్ఞేయమణు రేష ధర్మః,
అన్యం వరం నచికేతో వృణీష్వ
మా మోపరోత్సీరతి మా సృజైనమ్. 21

పూర్వకాలమునందు దేవతలుకూడ ఈ విషయమును విమర్శించి సంశయగ్రస్తులయిరి. కావున ఇది చక్కగా తెలియబడు విషయము కాదు. పరమ సూక్ష్మధర్మము. నచికేతా! వేఱొక వరమును గోరుకొనుము. ఈ విషయమున హఠము బట్టవలదు. ఈ నీ యపేక్షను విడువుము. నన్ను బాధింపకుము.

నచికేతు డిట్లనెను

దేవైరత్రాపి విచికిత్సితం కిల
త్వం చ మృత్యో యన్న సువిజ్ఞేయమాత్థ,
వక్తా చాస్య త్వాదృగన్యో న లభ్యో
నాన్యో వరస్తుల్య ఏతస్య కశ్చిత్. 22

ఈ నాప్రశ్న విషయమై దేవతలుకూడ చర్చ జేసిరనియు, ఇది చక్కగా తెలియ బడదనియు నీవే చెప్పుచున్నావు. (కాబట్టి) అట్టి ఈ ప్రశ్నయొక్క చక్కని ఉత్తరమును దెలుపువారు నీకంటె అన్యులు నాకు దొరకరు. ఈ వరమునకు సమమగు వరము మఱొకటి లేదు.

అవ: నచికేతుని అధికార పరీక్షార్థమై ధన వనితా పుత్రపౌత్రాది సంపదలను గోరుకొనుమని యముడు ప్రలోభింప జేయుచున్నాడు.

శతాయుషః పుత్రపౌత్రాన్ వృణీష్వ
బహూన్ పశూన్ హస్తిహిరణ్యమశ్వాన్,
భూమేర్మహదాయతనం వృణీష్వ
స్వయం చ జీవ శరదో యావదిచ్ఛసి. 23

వంద సంవత్సరములు బ్రతికి వర్ధిల్లి పుత్ర పౌత్రాదులను గోరుకొనుము. చాల పశువులను అశ్వ గజాదులను సువర్ణము నడుగుము. విశాలమగు భూమిని పొందుము. నీకు కావలసినంత ఆయుస్సు నిచ్చెదను. వర్ధిల్లుము.

ఏతత్తుల్యం యది మన్యసే వరం
వృణీష్వ విత్తం చిరజీవికాం చ,
మహాభూమౌ నచికేతస్త్వమేధి
కామానాం త్వా కామభాజం కరోమి. 24

దీనికి సమమగు నీ యిష్టమయిన వరము నడుగుము. సంపదను చిరంజీవిత్వము నడుగుకొనుము. నచికేతా! ఈ లోకమునకు నీవే రాజుగా నుండుము. సర్వకామముల నుపభోగించు సామర్థ్యమును నీ కొసగెదను.

యే యే కామా దుర్లభా మర్త్యలోకే
సర్వాన్ కామాంగ్శ్ఛందతః ప్రార్థయస్వ,
ఇమా రామాః సరథాః సతూర్యా
నహీదృశా లంభనీయా మనుష్యైః,
ఆభిర్మత్ప్రత్తాభిః పరిచారయస్వ
నచికేతో మరణం మానుప్రాక్షీః. 25

మానవలోకమునందు దుర్లభమైన సమస్త కామములను నీ ఇష్టము వచ్చినట్లడుగుము. రథ వాద్య విశేషములచే నొప్పు మనోహర సుందరీమణులు మనుష్యుల కలభ్యములు. నేను బంపు యీ రమణుల సేవను స్వీకరించుము. నచికేతా! మరణ విషయక మగు ప్రశ్నను మాత్రము నన్నడుగకుము.

నచికేతసు డిట్లు పలికెను.

శ్వో భావా మర్త్యస్య యదంతకైతత్
సర్వేంద్రియాణాం జరయంతి తేజః,
అపి సర్వం జీవితమల్పమేవ
తవైవ వాహాస్తవ నృత్యగీతే. 26

ఓ నరాంతకా! అవెల్ల క్షణికములగు వస్తువులు. దర్శన స్పర్శన సంభాషణాదులచే సర్వేంద్రియ శక్తులు హరింపజేయునవి. మఱియు ఈ జీవిత మన్ననో అల్పకాల ముండునది. మానవుకు చచ్చిన పిదప ఈ వాహనాది విశేష భోగము లెల్ల మరల నీవియే యగును. ఈ క్షణ భంగురము లగు భోగముల నే నొల్లను. ఈ వాహనములు ఈ నృత్యగీతాదులు నీకే యుండుగాక!

న విత్తేన తర్పణీయో మనుష్యో
లప్స్యామహే విత్తమద్రాక్ష్మ చేత్త్వా,

జీవిష్యామో యావదీశిష్యసి త్వం
వరస్తుమే వరణీయః స ఏవ. 27

మనుష్యు డెప్పటికిని సంపదచే సంతుష్టుడగువాడు కాడు. నీ దర్శన మాత్రముననే నాకు సంపద దొరకును. నీ ఏలికయందుండు వఱకు నా ఆయుస్సునకు కొఱత లేదు. వేఱొండు నే గోరను. అడుగుటకు యోగ్యమగు ఆత్మవిద్యనే అడుగుచున్నాను. కోరుచున్నాను.

అజీర్యతామమృతానాముపేత్య
జీర్యన్మర్త్యః క్వధః స్థః ప్రజానన్,
అభిధ్యాయన్ వర్ణరతిప్రమోదా
నతిదీర్ఘే జీవితే కో రమేత. 28

అజీర్యమగు ముదిమి లేని అమృత రూపులగు దేవతల కడకు వచ్చి వివేకి యగు మానవుడు క్షణికము లగు సుఖములను మరల కోరదగునా? సంగీతము, రతి మొదలగు వాటి యందలి క్షణికములైన మిథ్యాసుఖములను చక్కగా తెలిసిన నరుడు మరల దీర్ఘాయుస్సును గోరునా? కోరడు.

యస్మిన్నిదం విచికిత్సంతి మృత్యో
యత్సాంపరాయే మహతి బ్రూహి నస్తత్,
యోఽయం వరో గూఢమనుప్రవిష్టో
నాన్యం తస్మాన్నచికేతా వృణీతే. 29

ఓయమరాజా! ఏ తత్త్వవిషయమై చర్చ జరిగి యున్నదో ఏది పరమున గొప్పదై యున్నదో అట్టి ఆత్మతత్త్వమును నాకు దెలుపుము. గోప్యమగు ఈ వరమునకంటె అన్యము నీ నచికేతు డపేక్షించువాడు కాడు.

ఇది మొదటి అధ్యాయమున మొదటి వల్లి

—o—

ప్రథమాధ్యాయము - ద్వితీయవల్లి

అవ: నచికేతుడు బ్రహ్మవిద్యోపదేశార్హుడని తెలిసి శ్రేయస్సు, ప్రేయస్సను రెండు మార్గములను దెలుపుచు అందు ఉత్తమోత్తమ

మగు శ్రేయస్సునే గోరి నీవు జ్ఞానోపదేశార్హుడవైతివని యమరాజు పలుకుచున్నాడు.

అన్యచ్ఛ్రేయోఽన్యదుతైవ ప్రేయస్తే ఉభే నానార్థే పురుషగ్ం సినీతః, తయోః శ్రేయ ఆదదానస్య సాధు భవతి హీయతేఽర్థాద్య ఉ ప్రేయో వృణీతే. 1

శ్రేయస్సనునది వేఱు. ప్రేయస్సనునది వేఱు. మానవుడీ రెండిటి యందు ఏదో కదానిచే ప్రేరితుడై కర్మ చేయును. విభిన్న ఫలములచే నొప్పు ఈ రెండిటియందు మానవు డాసక్తి నొందును. శ్రేయోమార్గ మున వెళ్ళువానికి ముక్తి యగును. ప్రేయోమార్గమున పోవువానికి ముక్తి దూర మగును. శ్రేయస్సనగా నిరాశ, లేక మోక్షము. ప్రేయస్సనగా ఆశ, లేక సంసారమని అర్థము.

శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్యమేత<br>
స్తౌ సంపరీత్య వివినక్తి ధీరః,<br>
శ్రేయోహి ధీరోభిప్రేయసో వృణీతే<br>
ప్రేయో మందో యోగక్షేమాద్ వృణీతే. 2

శ్రేయఃప్రేయస్సులు రెండును ఒక్క సారిగా వచ్చి మానవుని ముంగిట నిలుచును. చక్కగ విచారించి బుద్ధిమంతుడు ప్రేయస్సు కంటెను శ్రేయస్సు శ్రేష్ఠమని గ్రహించును. ప్రాకృత బుద్ధి గల అజ్ఞులు యోగక్షేమముల యాకాంక్షచే ఐహిక సుఖానుభవము కొఱకై ప్రేయస్సునే (గోరుదురు) గ్రహింతురు.

స త్వం ప్రియాన్ ప్రియరూపాగ్ంశ్చ కామా<br>
నభిధ్యాయన్నచికేతోఽత్యస్రాక్షీః,<br>
నైతాం సృంకాం విత్తమయీమవాప్తో<br>
యస్యాం మజ్జంతి బహవో మనుష్యాః. 3

ఓ నచికేతా! నీవు ప్రియ పదార్థములను, పరమ ప్రియములగు అనేక కామములను వివేకపూర్వకముగా విసర్జించితివి. బహుజనులు ఏ మార్గమున వెళ్ళి దేనియందు మునుగుదురో ఆ అజ్ఞులు ఆపే క్షించు ధన ధాన్యాది సంప్రాప్తిమార్గమును నీ వపేక్షించ లేదు.

దూరమేతే విపరీతే విషూచీ
అవిద్యా యా చ విద్యేతి జ్ఞాతా,
విద్యాభీప్సినం నచికేతసం మన్యే
నత్వా కామా బహవో లోలుపన్తః. 4

ఈ విద్యావిద్య లనునవి రెండు పరస్పర విరుద్ధ ధర్మములు గలవి (అయితే) నీవు విద్య నపేక్షించు వాడవై యున్నావు. ఎందుకన, వివిధ కామములచే నీవు మోహితుడవు కాలేదు.

అజ్ఞానుల వర్ణన

అవిద్యాయా మంతరే వర్తమానాః
స్వయం ధీరాః పండితం మన్యమానాః,
దంద్రమ్యమాణాః పరియంతి మూఢా
అంధేనైవ నీయమానా యథాంధాః. 5

అజ్ఞానముచే ఆవృతులైన వారు తామే బుద్ధిమంతుల మనియు, పండితుల మనియు భావింతురు. ఈ మూఢులు గ్రుడ్డివానిని వెన్నంటి పోవు గ్రుడ్డివానివలె కుపథమున త్రోవ దప్పి తిరిగి చెడుదురు.

అజ్ఞులకు పరలోకసాధన ప్రకాశింపదు

న సాంపరాయః ప్రతిభాతి బాలం
ప్రమాద్యంతం విత్తమోహేన మూఢమ్,
అయం లోకో నాస్తి పర ఇతి మానీ
పునః పునర్వశమాపద్యతే మే. 6

సంసారము నందలి యాసక్తిచే సంపద యందలి మోహమున మునిగి మూఢుడై ప్రమాద కార్యముల నాచరించు బాలబుద్ధి గల మనుష్యునకు పరలోక సాధనమగు (సాంపరాయము) ముక్తి మార్గ మగపడదు. ఉన్నది ఒకటే. అది ఈ లోకము మాత్రమే. పరలోక మనునది లేనే లేదు ఇట్లని తెలియుచు ఐహిక విషయ లోలురై సారెసారెకు యముడ నగు నా వశ మగుదురు. అనగా మృత్యు పాశ మున చిక్కుదురు.

అవ: జన్మాంతర సుకృత విశేషమువలననే నేడు మోక్షేచ్ఛయు సద్గురు సంప్రాప్తియును గలుగును.

శ్రవణాయాపి బహుభిర్యో న లభ్యః
శృణ్వంతోఽపి బహవో యం న విద్యుః,
ఆశ్చర్యో వక్తా కుశలోఽస్య లబ్ధా
ఆశ్చర్యో జ్ఞాతా కుశలానుశిష్టః. 7

ఏ ఆత్మతత్త్వము (జ్ఞానము) బహు జనులకు వినుటకు కూడ సంభవించదో అట్టి ఆత్మజ్ఞాన తత్త్వమును చక్కగ బోధించువాడు దొరకుటయు దుర్లభము. ఆశ్చర్యము. ఒకవేళ అట్టి చక్కని బ్రహ్మనిష్ఠుడగు బోధకుడైన సద్గురుడు దొరకినను అతనిచే ఉపదేశ మొంది దానిని తెలియువాడు దొరకుట అత్యంత దుర్లభము. ఇదియును ఆశ్చర్యమే.

అవ: శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుడు గాని సామాన్య గురుడు ఆత్మతత్త్వము నుపదేశించుట కర్హుడు గాడు.

న నరేణావరేణ ప్రోక్త ఏష
సువిజ్ఞేయో బహుధా చింత్యమానః,
అనన్యప్రోక్తే గతిరత్ర నాస్తి
అణీయాన్ హ్యతర్క్యమణుప్రమాణాత్. 8

ఈ విషయమునందు వివిధాభిప్రాయము లుండుటచే సామాన్య మానవుడు చెప్పిన ఇది చక్కగా తెలియబడునది కాదు. కాని శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుడగు సద్గురువు బోధింపగా బోధ్య మగునదై యున్నది. ఇది అణువుకంటెను అణువును (సూక్ష్మము) అతర్క్యమునై యున్నది.

ఆత్మజ్ఞానము కేవలము తర్కమువలన కలుగదు

నైషా తర్కేణ మతిరాపనేయా
ప్రోక్తాన్యేనైవ సుజ్ఞానాయ ప్రేష్ఠ,
యాం త్వమాపః సత్యధృతిర్బతాసి
త్వాదృఙ్నో భూయాన్నచికేతః ప్రష్టా. 9

ఓ ప్రియుడా! రెండవ వాడు అనగా ఆప్తుడు (తత్త్వవిదుడు) తెలుపుటవలననే ఇది చక్కగా గ్రాహ్యమగును. అట్టిది నీకు సంప్రాప్తమై యున్నది. నిజముగా నీవు సత్యనిష్ఠుడవై యున్నావు. నచికేతా! నా కింతవఱకు నీవలె ప్రశ్నించు వాడగపడ లేదు. నీ బోటి శిష్యుడు దొరకుట దుర్లభము.

అవ : నాచికేతాగ్ని చయన మొనర్చి ఈ యామ్య స్థానము నలంకరించి యున్నాననుట.

జానామ్యహగ్ం శేవధిరిత్యనిత్యం
న హ్యధ్రువైః ప్రాప్యతే హి ధ్రువం తత్,
తతో మయా నచికేతశ్చితోఽగ్ని
రనిత్యైర్ద్రవ్యైః ప్రాప్తవానస్మి నిత్యమ్. 10

సంపద అనిత్య మనునది నే నెఱుగుదును. ఈ అనిత్య వస్తు సహాయమువలన నిత్యవస్తు ప్రాప్తి కాజాలదు. కాబట్టి అనిత్య ద్రవ్యములచే అగ్నియాగము చేయబడినది. అట్టి నాచికేతాగ్నిని సంతుష్టి నొందింపగా నాకీ సాపేక్షక నిత్యమగు యామ్య స్థానము ప్రాప్తించినది.

నిష్కాముడగు నచికేతుని (శిష్యుని) కొనియాడుట

కామస్యాప్తిం జగతః ప్రతిష్ఠాం
క్రతోరానంత్య మభయస్య పారమ్,
స్తోమం మహదురుగాయం ప్రతిష్ఠాం
దృష్ట్వా ధృత్యా ధీరో నచికేతోఽత్యస్రాక్షీః. 11

ఓ నచికేతా! సర్వ కామముల పూర్ణతయు జగత్తుయొక్క ప్రతిష్ఠయు సర్వ సంకల్పములయొక్క సమాప్తియు యాగఫలమును అభయ స్థానమును స్తుత్యర్హమును విస్తీర్ణము నగు పరమ పదమును అనగా బ్రహ్మలోకాది పదవులను నీవు ధీరుడవై ధిక్కరించితివి. దృష్టనష్ట స్వభావము లగు సుఖముల నపేక్షింప వైతివి.

ఇందు వలననే శ్రీశంకరభగవత్పూజ్యపాదులు తమ భాష్య పీఠికారంభమున "ఓం నమో భగవతే వైవస్వతాయ మృత్యవే బ్రహ్మ

విద్యాచార్యాయ నచికేతసే చ" యని బ్రహ్మవిద్యా బోధకుడగు యమరాజునకును, తద్విద్యా ప్రాపకుడగు శిష్యుడైన నచికేతస్సునకును నమస్కరించి భాష్య రచనారంభము చేసినట్లున్నది. ఉత్తమ అధికారియగు శిష్యుడు, అధికృతుడగు మహాబోధకుడైన గురువని భావము.

ఆత్మజ్ఞాన ఫల వర్ణన

తం దుర్దర్శం గూఢమనుప్రవిష్టం
గుహాహితం గహ్వరేష్ఠం పురాణమ్,
అధ్యాత్మయోగాధిగమేన దేవం
మత్వా ధీరో హర్షశోకౌ జహాతి. 12

దర్శింప నశక్యమై లోపల హృదయ గుహయందు గూఢమై యుండు సనాతనమైన తేజస్సంపన్నాత్మను అధ్యాత్మయోగ బలముచే కలుగు జ్ఞానమువలన సాక్షాత్కార మొందిన బుద్ధిమంతుడు హర్ష శోకములను దాటును.

ఏతచ్ఛ్రుత్వా సంపరిగృహ్య మర్త్యః
ప్రవృహ్య ధర్మ్యమణుమేతమాప్య,
స మోదతే మోదనీయగ్ం హి లబ్ధ్వా
వివృతగ్ం సద్మ నచికేతసం మన్యే. 13

దీనిని (బ్రహ్మవిద్యను) చక్కగా విని తెలిసికొని ధర్మమును వేఱుపఱచి అనగా సత్యాసత్య వివేచన పూర్వకముగ ఈ పరమ సూక్ష్మమగు ఆత్మను తన్నుగా తెలిసికొన్న మానవుడు పూర్ణానందమును పొందును. ఇట్టి ఆనంద స్థానముయొక్క ద్వారము నచికేతునకై తెఱవబడి యున్నదని నేను తెలియుచున్నాను.

అవ : సత్యాసత్య ధర్మాధర్మ విలక్షణ మగు ఆత్మతత్త్వము నుపదేశించు మని నచికేతు డడుగుట.

అన్యత్ర ధర్మాదన్యత్రాధర్మా దన్యత్రాస్మాత్కృతాకృతాత్,
అన్యత్ర భూతాచ్చ భవ్యాచ్చ యత్తత్పశ్యసి తద్వద. 14

ఏది ధర్మాధర్మములకంటె భిన్న మనియు కార్య కారణముల

కంటె అన్యమనియు. భూత భవిష్యత్తులకంటె వేఱనియు నీవు తెలిసి యున్నావో అట్టి తత్త్వమును నాకు తెలుపుము.

అవ : పరమ దయామతిచే యమరాజు మంద మధ్యమాధికారుల ఉద్ధరణార్థమై మొదట సవిశేషముగా పరాపర బ్రహ్మతత్త్వమును ప్రణవాలంబన పూర్వకముగ నుపదేశించుట.

సర్వే వేదా యత్పదమామనంతి
తపాగ్ంసి సర్వాణి చ యద్వదంతి,
యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి
తత్తే పదగ్ం సంగ్రహేణ బ్రవీ మ్యోమిత్యేతత్. 15

యమరాజు చెప్పుచున్నాడు : సమస్త వేదములు ఏ పరమ పదమును ప్రతిపాదించు చున్నవో ఏ ధ్యేయ సిద్ధికొఱకై ఎల్ల తపస్సులు ఏర్పడినవో, ఏ పదము నపేక్షించి జనులు బ్రహ్మచర్యము నవలంబించినారో ఆ పరమగు తత్త్వవిషయమై నేను సంక్షేపముగా జెప్పెదను. అదియే "ఓమ్" అను పదముచే నుచ్చరింప బడుచున్నది.

ఏతద్ధ్యేవాక్షరం బ్రహ్మ ఏతద్ధ్యేవాక్షరం పరమ్,
ఏతద్ధ్యేవాక్షరం జ్ఞాత్వా యో యదిచ్ఛతి తస్య తత్. 16

ఈ అక్షరమే బ్రహ్మము. అత్యంత శ్రేష్ఠమగు అక్షర మన్నను ఇదే అనగా పరవస్తువు. ఇట్టి అక్షర జ్ఞానమును పొందిన వాడు ఏ పదము నిచ్ఛయించునో ఆ పదమును బడయును.

ఏతదాలంబనగ్ం శ్రేష్ఠమేతదాలంబనం పరమ్,
ఏతదాలంబనం జ్ఞాత్వా బ్రహ్మలోకే మహీయతే. 17

ఇది శ్రేష్ఠమగు సాధనము. అన్నిటికంటెను ఎక్కువైనది. ఈ సాధనము నెఱిగిన వాడు బ్రహ్మలోకమునందు మహిమ నొందును.

న జాయతే మ్రియతే వా విపశ్చి
న్నాయం కుతశ్చిన్న బభూవ కశ్చిత్,
అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే. 18

జ్ఞాన స్వరూపమగు ఆత్మకు పుట్టు చావులు లేవు. ఆత్మ మఱి దేనిచేతను పుట్టినది కాదు. అది తత్త్వతః ఉత్పన్నమైన వస్తువే కాదు, అజము, నిత్యము, శాశ్వతము, సనాతనము. శరీరము చంపబడినను ఆత్మ చంపబడదు.

హంతా చేన్మన్యతే హంతుం హతశ్చేన్మన్యతే హతమ్,
ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే. 19

నేను చంపువాడనని తలంచి చంపువాడును, నేను చంపబడు వాడనని తలంచి చంపబడు వాడును (ఈ ఇద్దఱు) అజ్ఞానులే. ఆత్మ చంపునదియు కాదు. చంప బడునదియును కాదు.

అణోరణీయాన్మహతో మహీయా
నాత్మాఽస్య జంతోర్నిహితో గుహాయామ్,
తమక్రతుః పశ్యతి వీతశోకో
ధాతుఃప్రసాదాన్మహిమాన మాత్మనః. 20

ప్రాణుల గుహయందుండు ఆత్మ అణువుకంటెను అణువై యున్నది. మహత్తుకంటెను మహత్తై యున్నది. నిష్కాముడగు వానికి ఆత్మదర్శన మగును. శోక రహితుడగు వాడు పరమాత్మానుగ్రహముచే ఇంద్రియోపశమమువలన ఆత్మయొక్క మహిమను దెలియును.

ఆత్మతత్త్వము ప్రాకృత బుద్ధి కందరానిది

ఆసీనో దూరం వ్రజతి శయానో యాతి సర్వతః,
కస్తం మదామదం దేవం మదన్యో జ్ఞాతుమర్హతి. 21

ఆత్మ ఉండిన చోటనే యుండి అచలమై దూరము పోవుచున్నది. పరుండిన దానివలె నుండి అన్ని స్థలముల యందును వ్యాపించి యున్నది. మఱియు ఆనందము గలదియు ఆనందము లేనిదియునై యున్నది. అట్టి దేవుని తేజస్సంపన్నమగు ఆత్మతత్త్వమును నేను వినా అన్యులు దెలియరు.

ఆత్మజ్ఞానముచే సమస్త దుఃఖములు నశించును

అశరీరగ్ం శరీరేష్వనవస్థేష్వవస్థితమ్,
మహాంతం విభుమాత్మానం మత్వా ధీరో న శోచతి. 22

శరీరములయందు అశరీరియై అనిత్యములయందు నిత్యమై యుండు ఈ సర్వవ్యాపి యైన పరమ శ్రేష్ఠమగు ఆత్మతత్త్వ సాక్షాత్కారము నొందిన బుద్ధిమంతుడు శోక రహితుడు.

అవ: ఆత్మతత్త్వము దుర్విజ్ఞేయ మైనను శ్రుతియుక్త్యనుభవములచే దెలియనగును.

నాయమాత్మా ప్రవచనేన లభ్యో
న మేధయా న బహునా శ్రుతేన,
యమేవైష వృణుతే తేన లభ్య
స్తస్యైష ఆత్మా వివృణుతే తనూగ్ం స్వామ్. 23

ఆత్మజ్ఞానము ప్రవచనముచే లభ్య మగునది కాదు. మేధాశక్తిచే గాని, లేక బహుళ మగు శ్రవణమువలన అర్థాత్ పాండిత్యము వలన గాని లభ్య మగునది కాదు. ఎవనికి ఈ ఆత్మ ప్రసన్న మగునో గురువనుగ్రహ మగునో అతనికి మాత్ర మిది లభ్యము. ఆత్మ అఖండాద్వితీయమగు నిజస్వరూపముచే ప్రకట మగును. అనగా బ్రహ్మాకార వృత్తి ఏర్పడును.

నావిరతో దుశ్చరితాన్నాశాంతో నాసమాహితః,
నాశాంతమానసోవాపి ప్రజ్ఞానేనైనమాప్నుయాత్. 24

ఎవడు దుష్కర్మలను విడువడో, ఎవడు అశాంతుడో, ఎవడు ఏకాగ్ర చిత్తము లేనివాడో, ఎవని మనస్సు నందు శాంతి యునికి పట్టే లేదో అట్టి వానికి ఒకప్పుడు ఆత్మజ్ఞానము కలిగినను అనగా బౌద్ధిక విజ్ఞాన మేర్పడినను ఆత్మసాక్షాత్కారానుభవరూప నిజశాంతి జీవన్ముక్తి యలవడదు.

యస్య బ్రహ్మ చ క్షత్రం చోభే భవత ఓదనః,
మృత్యుర్యస్యోపసేచనం క ఇత్థా వేద యత్ర సః. 25

బ్రాహ్మణ క్షత్రియు లను నీ ఉభయులు ఏ యాత్మకు ఆహారమో (భుజించెడి అన్నమై యున్నదో) మృత్యువు ఎవనికి ఉపఖాద్యమై యున్నదో (ఊరుగాయగా నున్నదో) అతడు ఎచ్చట నున్నాడనునది అనాయాసముగ నెవరు తెలిసికొనగలరు? అర్థాత్ సాధన సంపద్వి

శిష్యుడగు అధికారికి దప్ప సర్వాధిష్ఠానమగు ఆత్మతత్త్వము చపల చిత్తులగు ఇంద్రియ విషయ లోలురకు తెలియరానిదని అర్థము.

ఇది మొదటి అధ్యాయమున రెండవ వల్లి

---

## ప్రథమాధ్యాయము-తృతీయవల్లి

అవ: విద్యావిద్యల నిరూపణార్థమై జీవేశ్వరుల విలక్షణతను ఛాయాతపముల ఉదాహరణచే తెలుపుచున్నారు.

ఋతం పిబంతౌ సుకృతస్య లోకే
గుహాం ప్రవిష్టౌ పరమే పరార్థే,
ఛాయాతపౌ బ్రహ్మవిదో వదంతి
పంచాగ్నయో యే చ త్రిణాచికేతాః. 1

యముడు చెప్పుచున్నాడు— హృదయ గుహను ప్రవేశించి లోకమునందు కర్మఫలముల ననుభవించుచు ఉత్తమమగు స్థానము నందు రెండు ఆత్మలు గలవు. ఒకటి కర్మఫలము ననుభవించు జీవాత్మ రెండవది పరమాత్మ. ఈ పరమాత్మ జీవసంబంధము లేనిది యైనను ఛత్రిన్యాయము ననుసరించి ఉపాధిమూలమున గుహాయందు ప్రవేశించి నట్లు చెప్పబడి యున్నది. ఈ ఇరువురు ఛాయాతపముల వలె (నీడ యెండ వలె) పరస్పర భిన్నములై నీడవలె నొకడవిద్యాకల్పితుడు ఎండవలె శుద్ధచైతన్య స్వరూపుడొకడని అంగీకరించి యున్నారు. ఒకడు సంసారి. ఇంకొకడు అసంసారియని బ్రహ్మజ్ఞానులు, నాచికేతాగ్ని యజ్ఞమును ముమ్మారు చేసిన గృహస్థులును చెప్పుదురు.

యః సేతురీజానానామక్షరం బ్రహ్మ యత్పరమ్,
అభయం తితీర్షతాం పారం నాచికేతగ్ం శకేమహి. 2

కర్మానుష్ఠాన పరులగు యాజికులకు సేతువు వలె నున్న నాచికేతాగ్నిని (అనగా విరాట్పురుషుని) మఱియు ఏది అక్షరమై పరమై అభయమై సంసారగతి దాట నిచ్ఛగల వారికి గమ్యమై యున్నదో అట్టి బ్రహ్మతత్త్వమును ఎఱుగుటకు శక్తి గలిగి యున్నాము. తాత్పర్య మేమన, పర అపర యను రెండు రూపములు గల బ్రహ్మ

తత్త్వము నెఱుగ వలయునని ఈ మంత్రముయొక్క అర్థము. ఈ అర్థమే "ఋతం పిబంతౌ" అని ఉపాసనార్థమై అపర బ్రహ్మమనియు జ్ఞానార్థమై పరబ్రహ్మ మనియు చెప్పబడి జీవునితో సహా ఉండువాడనిన బ్రహ్మమే నని ఇచ్చట తెలియవలయును.

శరీరమును రథరూపముగ వర్ణించుట

ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవ తు,
బుద్ధిం తు సారథిం విద్ధి మనః ప్రగ్రహమేవ చ. 3

ఈ శరీర మొక రథ మనియు ఆత్మ అందలి రథికు డనియు తెలియుము. బుద్ధి సార్థ యనియు మనస్సు పగ్గమని (కళ్ళెమనియు) ఎఱుంగుము.

ఇంద్రియాణి హయానాహుర్విషయాం స్తేషు గోచరాన్,
ఆత్మేంద్రియ మనోయుక్తం భోక్తేత్యాహుర్మనీషిణః. 4

ఇంద్రియములు గుఱ్ఱములు. ఇంద్రియార్థము లగు విషయములు అవి వెళ్ళు మార్గములు. మానసేంద్రియ యుక్తుడగు ఆత్మ (జీవుడు) సుఖదుఃఖానుభవి యగు భోక్త యని బుద్ధిమంతులు చెప్పుదురు.

యస్త్వవిజ్ఞానవాన్ భవత్యయుక్తేన మనసా సదా,
తస్యేంద్రియాణ్యవశ్యాని దుష్టాశ్వా ఇవ సారథేః. 5

మనస్సు సంతతము సంచలనము గలది యైనందున పరిశుద్ధ జ్ఞానము లేని వాని ఇంద్రియములు దుష్టాశ్వములు సారథికి వశము గానియట్లు వాని యధీనములు గావు.

వివేకావివేకఫలవర్ణనము

యస్తు విజ్ఞానవాన్ భవతి యుక్తేన మనసా సదా,
తస్యేంద్రియాణి వశ్యాని సదశ్వా ఇవ సారథేః. 6

ఎల్లప్పుడు మనస్సు యోగయుక్తమై యుండుటవలన విజ్ఞాని యగు వాని ఇంద్రియములు మంచి గుఱ్ఱములు సారథివశమున నుండునట్లు అతని వశమై యుండును.

యస్త్వవిజ్ఞానవాన్ భవత్యమనస్కః సదాఽశుచిః,
న స తత్పద మాప్నోతి సంసారం చాధిగచ్ఛతి. 7

ఎవడు విజ్ఞాన రహితుడో, చపల చిత్తుడో, సదా అపవిత్రుడో అతనికి ఆ పరమ పదము దొరకదు. మరల సంసార ప్రాప్తి యగును.

యస్తు విజ్ఞానవాన్ భవతి సమనస్కః సదా శుచిః,
సతు తత్పద మాప్నోతి యస్మాద్భూయో న జాయతే. 8

విజ్ఞానియు, స్థిరచిత్తుడును, సర్వదా పవిత్రుడు నగువాడు కైవల్యము నొందును. అచ్చటినుండి అతనికి మరల పుట్టుక లేదు.

విజ్ఞాన సారథిర్యస్తు మనః ప్రగ్రహవాన్నరః,
సోఽధ్వనః పార మాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్. 9

ఏ మనుష్యుడు, విజ్ఞానమే స్వరూపనిశ్చయాత్మికమైనబుద్ధియే, సారథిగా గలిగి మనోనిగ్రహయుక్తుడై యుండునో అతడే సంసారమును దాటి పోవును. అదే, విష్ణుపదము— వ్యాపకమగు శ్రేష్ఠమైన పదవి.

ఇంద్రియాదుల తారతమ్యము, ఆత్మయొక్క పరమ సూక్ష్మత

ఇంద్రియేభ్యః పరా హ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః,
మనసస్తు పరా బుద్ధిర్బుద్ధేరాత్మా మహాన్ పరః. 10

దేహమున కంటె ఇంద్రియములు, ఇంద్రియములకంటె విషయములు, విషయములకంటె మనస్సు, మనస్సునకంటె బుద్ధి, బుద్ధికంటె మహత్తత్త్వము (సమష్టిబుద్ధి) అతీత మైనది.

మహతః పర మవ్యక్త మవ్యక్తాత్ పురుషః పరః,
పురుషాన్న పరం కించి త్సా కాష్ఠా సా పరా గతిః. 11

మహతత్త్వముకంటె పరమైఅవ్యక్తము (ప్రకృతి), దానికి పరమై పురుషుడు (పరమాత్మ) గలడు. ఆ పురుషుని కంటె అతీతము (శ్రేష్ఠమగునది) ఏదియు లేదు. అదే అన్నింటికిని హద్దు. అదే పరమగతి.

ఆత్మ సూక్ష్మబుద్ధిగ్రాహ్యము

ఏష సర్వేషు భూతేషు గూఢోత్మా న ప్రకాశతే,
దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయాసూక్ష్మదర్శిభిః. 12

సర్వభూతములయందు గుప్తమై యుండు ఈ యాత్మ ప్రకటమగునది (దృశ్యము) కాదు కాని ఇది శాస్త్రాచార్యోపదేశాదులచే

సంస్కరింప బడిన అంతఃకరణము గల వారి పరమ సూక్ష్మబుద్ధికి వేద్య మగును.

ఆత్మజ్ఞానోపాయ చింతనము—అధ్యాత్మయోగము

యచ్ఛేద్వాఙ్మనసీ ప్రాజ్ఞ స్తద్యచ్ఛేజ్జ్ఞాన ఆత్మని,
జ్ఞాన మాత్మని మహతి నియచ్ఛే త్తద్యచ్ఛే చ్ఛాంత ఆత్మని. 13

బుద్ధిమంతు డగువాడు వాక్శక్తిని మనస్సునందు లయము చేయవలెను. మనస్సును జ్ఞానమునందు (బుద్ధియందు) లీన మొనర్ప వలయును. జ్ఞానమును మహదాత్మ (సమష్టిబుద్ధి) యందు మహదాత్మను శాంతాత్మయందు లీనము జేయ వలయును. ఇట్లు పరబ్రహ్మమునందు లయ మొనర్చు నట్లు చేయవలెనని లయచింతన చెప్పబడినది.

మేలుకొలుపు—హెచ్చరిక

ఉత్తిష్ఠత. జాగ్రత. ప్రాప్య వరాన్నిబోధత.
క్షురస్య ధారా నిశితా దురత్యయా
దుర్గం పథ స్తత్కవయో వదంతి. 14

ఓ జీవులారా! ఆత్మజ్ఞానార్థమై అజ్ఞాన నిద్రనుండి మేల్కొనుడి. శ్రోత్రియ బ్రహ్మనిష్ఠులగు శ్రేష్ఠుల కడకు వెళ్ళి తత్త్వమును తెలిసికొనుడి. అనగా సద్గురువు నాశ్రయించి ఆత్మతత్త్వము నరయుడి. ఈ మార్గమున నడచుట వాడి యగు కత్తి కొనపై నడచుట వలె కఠిన మని కవులు (సర్వజ్ఞులగు జ్ఞానులు) చెప్పుదురు.

బ్రహ్మజ్ఞానము సాధనదశయందు కఠినముగ దోచినను నిజముగా అది భయరహితము. అభయప్రాప్తిబోధక మని శ్రద్ధచే గ్రహింప వలయునని భావము.

అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం
తథాఽరసం నిత్య మగన్ధవచ్చ యత్,
అనాద్యనంతం మహతః పరం ధ్రువం
నిచాయ్య తన్మృత్యుముఖాత్ ప్రముచ్యతే. 15

ఈ యాత్మ, శబ్ద స్పర్శ రూప రస గంధ రహితము. నిత్యము, అవ్యయము. ఆద్యంతరహితము. మహత్తత్వాతీతము. (అనగా విరాట్పురుషునకు అతీతము) సత్యము. దీని నెఱిగిన వాడు మృత్యు ముఖమునుండి విడువ బడును. ముక్తు డగును.

నాచికేత ముపాఖ్యానం మృత్యుప్రోక్తం సనాతనమ్,
ఉక్త్వా శ్రుత్వా చ మేధావీ బ్రహ్మలోకే మహీయతే. 16

భగవానుడగు యమునిచే చెప్పబడిన ఈ పురాతన మగు నాచికేతోపాఖ్యానమును చెప్పినను వినినను అట్టి మేధావి బ్రహ్మ లోకమున మహిమ నొందును.

య ఇమం పరమం గుహ్యం శ్రావయేత్ బ్రహ్మసంసది,
ప్రయతః శ్రాద్ధకాలే వా తదానంత్యాయ కల్పతే
తదా నంత్యాయ కల్పత ఇతి. 17

ఇతి ప్రథమోఽధ్యాయః

శుద్ధబుద్ధి గల ఏ మనుష్యుడు పరమ రహస్య మగు దీని చక్కగా అర్థమును జేసికొను శక్తి గల బ్రాహ్మణసభ (బ్రహ్మసభ) యందుగాని, శ్రాద్ధాది సమయమున భోజన సమయమునందు గాని శ్రవణము గావింప జేయునో (వినిపించునో) అపుడది (శ్రాద్ధ కార్యము) అనంత ఫలము గలది యగును.

ఇది ప్రథమాధ్యాయము

—o—

ద్వితీయాధ్యాయము-ప్రథమవల్లి

అవ: ఆత్మదర్శనమునకు ఇంద్రియములు బహిర్ముఖత (బాహ్య ప్రవృత్తి) యే ప్రతిబంధము.

పరాంచి ఖాని వ్యతృణత్స్వయంభూ
స్తస్మాత్ పరాఙ్ పశ్యతి నాన్తరాత్మన్,
కశ్చిద్ధీరః ప్రత్యగాత్మాన మైక్ష
దావృత్తచక్షు రమృతత్వ మిచ్ఛన్. 1

యముడు చెప్పుచున్నాడు–స్వయంభువు (బ్రహ్మ) ఇంద్రియ శక్తులను బహిర్ముఖములనుగా నుంచెను. అందుచేత నేత్ర శ్రోత్రాది ఇంద్రియములు శబ్ద స్పర్శాది బాహ్యవస్తు విషయములను మాత్రము చూడ గలవు. వీటిచే ఆంతరమగు ఆత్మ గోచరము గాదు. ఏ ఒకా నొక బుద్ధిమంతుడగు ధీరుడో అమృత పదవి (మోక్షము) నొందు ఇచ్ఛచే తన దృష్టిని అంతర్ముఖ మొనర్చి ఆత్మసాక్షాత్కారము నొందును.

అవ: ధీరులగు వారీ ప్రతిబంధమునుండి దూరు లగుదు రని వివేకి అవివేకులయొక్క వ్యత్యాసమును దెలుపుట.

> పరాచః కామా ననుయంతి బాలా
> స్తే మృత్యోర్యన్తి వితతస్య పాశమ్,
> అథ ధీరా అమృతత్వం విదిత్వా
> ధ్రువ మధ్రువేష్విహ న ప్రార్థయంతే. 2

బాల బుద్ధిగల అవివేకులు అనాత్మభూతము లైన వెలుపలి విషయముల వెంట బడి విశాలమగు మృత్యుపాశమున జిక్కుదురు. కాని బుద్ధిమంతులు అమృత పదవి నెఱిగి ఐహిక మగు ఈ అనిత్య పదార్థములయందు నిత్యత్వమును జూడరు. వెదకరు.

ఆత్మజ్ఞానియొక్క సర్వజ్ఞత్వము

> యేన రూపం రసం గంధం శబ్దాన్ స్పర్శాగ్ంశ్చ మైథునాన్,
> ఏతేనైవ విజానాతి కిమత్ర పరిశిష్యతే. ఏతద్వై తత్. 3

శబ్ద స్పర్శ రూప రస గంధ మైథునాది యీ సమస్త విషయ ముల జ్ఞానము దేనిచేత నేర్పడుచున్నదో అదే ఆత్మ. అన్య మింకేమి గలదు? "అది, ఇది" యని దేనివలన ఈ సమస్త జ్ఞాన మగునో అదే (నీవు అడిగినట్టి) ఆత్మ యని అర్థము.

అవ: ఆత్మజ్ఞానికి దుఃఖాభావ మని వివిధ ప్రకారములచే ఆత్మ నిరూపణము జేయుట.

> స్వప్నాంతం జాగరితాంతం చోభౌ యేనానుపశ్యతి,
> మహాంతం విభు మాత్మానం మత్వా ధీరో న శోచతి. 4

స్వప్న జాగరములయందు గలుగు సర్వ వ్యాపారములు దేని ఆశ్రయమున (బలమువలన) జరుగుచున్నవో శ్రేష్ఠమగు సర్వవ్యాపి యయిన అట్టి ఆత్మను దెలిసి బుద్ధిమంతులు శోక రహితు లగుదురు.

ఆత్మతత్త్వానుభవి అభయస్వరూపుడు

య ఇమం మధ్వదం వేద ఆత్మానం జీవ మంతికాత్,
ఈశానం భూతభవ్యస్య న తతో విజుగుప్సతే. ఏతద్వై తత్. 5

కర్మఫలానుభవి, కాలత్రయమున కధిపతియు నగు జీవాత్మ నెవ డెఱుగుచున్నాడో అతడు తన యథార్థ స్వరూపమును తెలిసిన పిదప జీవుని సంరక్షించుకొనుటకు ఇచ్ఛయింపడు. అనగా కర్మ ఫలము ననుభవించు జీవుడు భూత భవిష్యత్తుల కధిపతి యగు పరమాత్మయే యని తెలిసి భయరహితు డగును. అదే ఇది (నీవడిగిన ఆత్మ ఇదియే అని అర్థము).

యః పూర్వం తపసో జాత మద్భ్యః పూర్వ మజాయత,
గుహాం ప్రవిశ్య తిష్ఠంతం యో భూతేభి ర్వ్యపశ్యతే. ఏతద్వై తత్. 6

ఏది ఎల్ల తపస్సులకంటెను ఆదియందును జలము మొదలగు తత్త్వముల ఉత్పత్తికి పూర్వమే యుండినదై బుద్ధిరూప హృదయ గుహను ప్రవేశించి భూతములతో గూడ ప్రకాశించుచున్నదో దానిని జ్ఞానులు జూచెదరు. (గ్రహింతురు.) అదే ఇది. ఇదే నీవడిగిన ఆత్మ

యా ప్రాణేన సంభవత్యదితి ర్దేవతామయీ,
గుహాం ప్రవిశ్య తిష్ఠంతీం యా భూతేభిర్వ్యజాయత. ఏతద్వై తత్. 7

సర్వ దేవతల నంతర్భూత మొనర్చుకొన్న అదితి ప్రాణశక్తి సహితముగ (మాయ) పుట్టినది. హృదయ గుహను ప్రవేశించి అచ్చట స్థిరురాలైన ఆమె ఆ మాయాదేవి లేక హిరణ్యగర్భుడు సర్వభూత సహితముగ పుట్టెను. ఇట్టి మాయను ఎవడు తెలిసికొను చున్నాడో వాడే పరబ్రహ్మమును తెలిసినవాడు. అదే ఇది.

అరణి కట్టెలయం దణగి యుండు అగ్నియందు బ్రహ్మదృష్టి

అరణ్యోర్నిహితో జాతవేదా
గర్భ ఇవ సుభృతో గర్భిణీభిః,

దివే దివ ఈడ్యో జాగృవద్భి
ర్హవిష్మద్భిర్మనుష్యేభిరగ్నిః. ఏతద్వై తత్. 8

గర్భిణీస్త్రీయొక్క గర్భము సురక్షితముగ రక్షింపబడి యుండునట్లు, రెండు కట్టెల మధ్య అగ్ని యుండునట్లు హవిర్భాగము నొసగు జాగృతి గల మనుష్యులచే అనుదినము స్తుతింపబడు అగ్ని ఏది గలదో ఇదియు అదే. అనగా ఈ అగ్ని పరబ్రహ్మమే.

ప్రాణమునందు బ్రహ్మదృష్టి

యతశ్చోదేతి సూర్యోఽస్తం యత్ర చ గచ్ఛతి,
తం దేవాః సర్వేఽర్పితా స్తదు నాత్యేతి కశ్చన ఏతద్వై తత్. 9

ప్రాణాత్మకుడగు హిరణ్యగర్భునినుండియే సూర్యుడు ఉదయించును; అస్తమించును. సమస్త దేవతలును అచ్చటనే యున్నారు. ఎవరును దానికి ఆవల వెళ్ళజాలరు. ఇదే అది. అనగా అగ్న్యాది దేవతలు వాగాది ఇంద్రియములు సర్వాత్మకుడగు ఏ హిరణ్యగర్భుని యందు గ్రుచ్చబడి యున్నవో అది బ్రహ్మమని మోక్షసాధన మగు సర్వాత్మభావమును దెలుపుట యని గ్రహించవలెను.

భేదదృష్టియొక్క అయోగ్యత

యదేవేహ తదముత్ర యదముత్ర తదన్విహ,
మృత్యోః స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి. 10

ఇచ్చట ఏది గలదో అచ్చటను (పరమునను) అదే గలదు. అచ్చట ఉండిన రీతిగ ఇచ్చటను ఉన్నది. ఇచ్చట నానాత్వమును దర్శించువాడు (భేదదృష్టిగలవాడు) సారెసారెకు మృత్యువాత బడును.

మనసైవేద మాప్తవ్యం నేహ నానాస్తి కించన,
మృత్యోః స మృత్యుం గచ్ఛతి య ఇహ నానేవ పశ్యతి. 11

ఈ ఆత్మ శుద్ధ మనస్సుచే ప్రాప్త మగునదై యున్నది. ఇందు ఏ విభిన్నతయును లేదు. భిన్నమని భావించువాడు పునఃపునః (సారెసారెకు) మృత్యువగు నా నోట కబళ మగును. (జన్మ మరణముల నొందును.)

## హృదయమున బ్రహ్మము

అంగుష్ఠమాత్రః పురుషో మధ్య ఆత్మని తిష్ఠతి,
ఈశానో భూతభవ్యస్య న తతో విజుగుప్సతే. ఏతద్వై తత్. 12

మానవుని అంతఃకరణమునందు (హృదయమునందు) అంగుష్ఠ మాత్ర పరిమాణము గలిగి అద్వితీయుడగు నీ పురుషుడు స్థితుడై యున్నాడు. అతడే భూత భవిష్యద్వర్తమానాది కాలకర్త యగు ఈశుడు. ఇతడే బ్రహ్మమని తెలిసినవాడు భయము నొందడు. ఇదే అది. బ్రహ్మతత్త్వమునకు వస్తుతః పరిమాణము లేదు. ఆత్మసాక్షాత్కార స్థానము, లేక అభివ్యక్తస్థానము హృదయమని తెలుపుట. అంతే ఈ శ్రుతికి తాత్పర్యము.

అంగుష్ఠ మాత్రః పురుషో జ్యోతిరివాధూమకః,
ఈశానో భూతభవ్యస్య స ఏవాద్య స ఉ శ్వః. ఏతద్వై తత్. 13

ఈ అంగుష్ఠ పరిమాణ పురుషుడు పొగచే స్పృశింప బడని పరం జ్యోతియై యున్నాడు. అనగా కర్మల సంబంధము లేనివాడు. త్రికాలములను శాసించువాడునై యున్నాడు. నేడున్నాడు. అతడే రేపును ఉండును. ఇదే అది. త్రికాలాబాధితమగు సద్రూపాత్మ.

యథోదకం దుర్గే వృష్టం పర్వతేషు విధావతి,
ఏవం ధర్మాన్ పృథక్ పశ్యం స్తానేవానువిధావతి. 14

ఉన్నతమగు పర్వతాగ్రమున పడిన వర్షజలము చెదరి చుట్టు ముట్టు ప్రవహించి నశించు పగిది ఇచ్చట (ఆత్మయందు) నానాత్వము నను చూచువాడు తనకంటె జీవులను అన్యముగ తెలియువాడు ఆ ధర్మాధర్మముల ననుసరించుచు జనన మరణములను పొందును. ప మగు పరబ్రహ్మతత్త్వమును తెలియ జాలక పూర్వపక్ష శ్రుత్యర్థము లకు చిక్కువడి చెడును.

యథోదకం శుద్ధే శుద్ధ మాసిక్తం తాదృగేవ భవతి,
ఏవం మునేర్విజానత ఆత్మా భవతి గౌతమ. 15

ఓ గౌతమా! శుద్ధోదకమునందు శుద్ధోదకము చేర్చిన అది తద్రూపమే యగునట్లు బ్రహ్మజ్ఞాని యగు మునియొక్క ఆత్మ శుద్ధము

తత్పద లక్ష్యమగు బ్రహ్మమే అయియున్నది. ఇట్లు అభేదము నిత్య సిద్ధ మనియు భేదము ఉపాధికృత మనియు తెలియును.

ఇది రెండవ అధ్యాయమున మొదటి వల్లి

—o—

## ద్వితీయ వల్లి

అవ : బ్రహ్మతత్త్వము దుర్విజ్ఞేయార్థము గావున ప్రకారాంతర ముచే బ్రహ్మానుసంధానమును దెలుపుట.

పుర మేకాదశద్వార మజస్యావక్రచేతసః,
అనుష్ఠాయ న శోచతి విముక్తశ్చ విముచ్యతే. ఏతద్వై తత్ .1

పదునొకండు ద్వారములచే గూడిన శరీరమను నీ పురము అజు డగు శుద్ధచైతన్యాత్మునిదై యున్నది. అనగా ఆత్మాధిష్ఠితమై సర్వేం ద్రియ వ్యవహారములు ప్రకాశింపబడు చున్నవని విషయాసక్తిని వీడి ఈ ప్రకార మాత్మధ్యానము చేయువాడు శోక రహితు డగును. అతడు జీవన్ముక్తుడై విదేహ ముక్తు డగును. ఇదే అది. పదునొకండు ద్వారము లనగా ప్రసిద్ధములు 9, తక్కినవి బ్రహ్మరంధ్రము, నాభి.

హగ్ంసః శుచిషద్వసురన్తరిక్షసద్ధోతా వేదిషదతిథిర్దురోణసత్, నృషద్వరసదృతసద్వ్యోమసదబ్జా గోజా ఋతజా అద్రిజా ఋతం బృహత్. 2

అది ఆకాశము నందు సూర్యరూపమునను అంతరిక్షమున వాయు రూపమునను వేదికయందు అగ్నిరూపమునను అనగా యాజకాగ్ని గను ఇంటియందు అతిథిరూపమునను ఉన్నది. (మఱియు) మానవుల యందును సత్యమునందును ఆకాశమునందును వ్యాపించి యున్నది. (అటువలె) నీటియందు బుట్టిన శుక్తిశంఖాదులు, భూమియందు పెరిగిన వ్రీహి యవాదులు, యజ్ఞకర్మచే యజ్ఞాంగ రూపమునను పర్వతము లపై మొలచిన (లేక) కలిగిన నదుల రూపమునను ఉన్నది. సర్వ పదార్థములును అదే. అది సత్యమై యున్నది. అత్యంత విశాలమై యున్నది.

## ఆత్మను దెలియుటకు గుఱుతులు

ఊర్ధ్వం ప్రాణ మున్నయత్యపానం ప్రత్యగస్యతి,
మధ్యే వామన మాసీనం విశ్వే దేవా ఉపాసతే. 3

అది ప్రాణవాయువును పట్టి పైకెత్తును. అపాన వాయువును క్రిందికి నెట్టును. ఇట్లు ఈ శరీర మధ్యమందు నివసించి యుండు వామనుని (ఆత్మను) పూజ్యుడని సమస్త దేవతలు ఉపాసింతురు.

అవ: దేహియగు ఆత్మయే దేహోపాధి మూలమున జీవుడని చెప్పబడును.

అస్య విస్రంసమానస్య శరీరస్థస్య దేహినః,
దేహాద్విముచ్యమానస్య కిమత్ర పరిశిష్యతే. ఏతద్వైతత్. 4

(ఒకప్పుడు) దేహి దేహమును వీడి వెళ్ళిన పిదప ఇచ్చట మిగులున దేమి? (ఏమియును లేదు). ఇదే అది. దేహేంద్రియములు నాశమైనను నాశము గాని వేఱొక్కటి సత్సామాన్యమగు ఆత్మ గలదని సిద్ధ మగును.

న ప్రాణేన నాపానేన మర్త్యో జీవతి కశ్చన,
ఇతరేణ తు జీవంతి యస్మిన్నేతా వుపాశ్రితౌ. 5

మనుష్యుడు జీవించు చుండునది ప్రాణవాయు బలముచే కాదు. అపాన వాయు బలముచేతనూ కాదు. ఈ రెండును ఎవని ఆశ్రయమున నున్నవో వాని (ఆ యాత్మ) యొక్క బలముచేతనే, దాని అస్తిత్వమువల్లనే జనులు జీవించుచున్నారు.

### మరణానంతరము జీవునియొక్క గతిని దెలుపుట

హంత త ఇదం ప్రవక్ష్యామి గుహ్యం బ్రహ్మ సనాతనమ్,
యథా చ మరణం ప్రాప్య ఆత్మా భవతి గౌతమ. 6

ఓ నచికేతా! ఇదే నీకు సనాతన బ్రహ్మతత్త్వ రహస్యమును చెప్పెదను వినుము. మరణానంతరము ఆత్మ ఏ స్థితియందుండు నని...

యోనిమన్యే ప్రపద్యంతే శరీరత్వాయ దేహినః,
స్థాణుమన్యేఽనుసంయంతి యథాకర్మ యథాశ్రుతమ్. 7

తమ తమ కర్మానుసారముగ, జ్ఞానానుసారముగ కొందఱు దేహులు మూఢులు (అవిద్యాయుక్తదేహులు) శరీర పరిగ్రహణార్థమై నానా యోనులను (గర్భములను) ప్రవేశింతురు. కొందఱు జడరూపత్వము నొందుదురు. వృక్షములు, శిలలు మొదలగు స్థావరాది రూపముల నొందుదురు.

గోప్యమగు బ్రహ్మోపదేశము

య ఏష సుప్తేషు జాగర్తి
కామం కామం పురుషో నిర్మిమాణః,
తదేవ శుక్రం తద్బ్రహ్మ తదేవామృతముచ్యతే,
తస్మింల్లోకాః శ్రితాః సర్వే తదు నాత్యేతి కశ్చన. ఏతద్వై తత్. 8

ప్రాణాదులు నిద్రించినవి కాగా ఏది నిద్రింపదో మేల్కొనియే ఉండునో మఱియు నేది ఆయా కోరికల ననుసరించి ఆయా పదార్థములను అవిద్యచే భావనామాత్రమున నిర్మాణము చేయునో, ఆ ఆత్మయే—ఆ పురుషుడే-బ్రహ్మము. అదే అమృతము. సర్వలోకములు తదాశ్రయమునందే యున్నవి. ఎవరును దాని నతిక్రమింప జాలరు. అదే ఇది. స్వప్నప్రపంచమంతయు సాక్షిభాస్యము. స్వప్నసాక్షియగు ఆత్మచైతన్యమే స్వప్నప్రపంచమునకు కారణమని అర్థము.

అగ్నిర్యథైకో భువనం ప్రవిష్టో
రూపం రూపం ప్రతిరూపో బభూవ,
ఏకస్తథా సర్వభూతాంతరాత్మా
రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ. 9

ప్రపంచమున ప్రవేశించిన ఒకే అగ్ని ఆయా వస్తువుల ననుసరించి ఋజు వక్రాది రూపములచే నుండుచు. తత్తదాకృతు లొందినట్లు సర్వభూతాంతరాత్మ యగు ఒకే చేతనము వివిధోపాధులచే నానారూపములను ధరించి ఆయా పదార్థముల వెలుపలను వ్యాపించి యున్నది.

వాయుర్యథైకో భువనం ప్రవిష్టో
రూపం రూపం ప్రతిరూపో బభూవ,
ఏకస్తథా సర్వభూతాంతరాత్మా
రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ. 10

ప్రపంచమున ప్రవేశించిన ఒకే వాయువు ఆయా వస్తువుల కను గుణమైన రూపములను ధరించునట్లు సర్వభూతాంతరాత్మ యగు ఒకే చేతనము (పరమాత్మ) నానారూపముల ధరించి సమస్త వస్తువుల వెలుపలను వ్యాపించి యున్నాడు.

ఆత్మ అసంగమని తెలుపుట

సూర్యో యథా సర్వలోకస్య చక్షు
ర్న లిప్యతే చాక్షుషై ర్బాహ్యదోషైః,
ఏక స్తథా సర్వ భూతాంతరాత్మా
నలిప్యతే లోకదుఃఖేన బాహ్యః. 11

జగచ్చక్షు వగు సూర్యుడు కంటి కగపడు బాహ్య దోషము నుండి నిర్లిప్తుడై యుండునట్లు ఒక్కడగు సర్వ భూతాంతరాత్మ లోకముయొక్క దుఃఖాదులచే నిర్లిప్తుడై యున్నాడు. జగత్తునకు వెలుపలను ఉన్నాడు.

ఆత్మదర్శియగు అనుభవి నిత్యసుఖస్వాంతుడు

ఏకో వశీ సర్వభూతా న్తరాత్మా
ఏకం రూపం బహుధా యః కరోతి,
తమాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరా
స్తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్. 12

ఒకే రూపమును నానా ప్రకారముల ప్రకట మొనర్చు సర్వ భూతా న్తరాత్మ యగు వ్యాపకమైన స్వామిని ఏ బుద్ధిమంతులు తమ ఆత్మగా జూతురో తమ్ము తాము దెలియుదురో వారికి అక్షయ సుఖ మలవడును, ఇతరులకీ సుఖము లభ్యము గాదు.

నిత్యోఽనిత్యానాం చేతన శ్చేతనానా
మేకో బహూనాం యో విదధాతి కామాన్,
తమాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరా
స్తేషాం శాంతిః శాశ్వతీ నేతరేషామ్. 13

అనిత్య వస్తువులయందు నిత్యుడును చేతనములయందు చైత న్యైకస్వరూపుడును సమస్త జనుల ఇచ్ఛల నీడేర్చువాడు నగు

ఆత్మను తమ స్వరూపముగా ఏ బుద్ధిమంతులు దెలియుదురో వారికి అక్షయ సుఖము కలుగును. ఇతరుల సుఖ మక్షయము గాదు. నాశ శీలము.

తదేతదితి మన్యంతే ఽనిర్దేశ్యం పరమం సుఖమ్,
కథంను తద్విజానీయాం కిము భాతి విభాతి వా. 14

ఇట్టిదని చెప్పుటకు రాని అనిర్దేశ్యమగు పరమ సుఖ మిదియే యని పెద్దలు దెలిసి చెప్పుదురు. దానిని నేనెట్లు దెలియవలెను? అవాఙ్మానస గోచర మగు తత్త్వము అనుభవమునకు వచ్చునా? రాదా? ఎవరికి తెలియును? నేనెట్లు తెలిసికొందును? అయ్యది తెలియ బడక దృఙ్మాత్రమై విరాజిల్లు చుండునని భావము.

ఆత్మ సర్వప్రకాశకము

న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం
నేమా విద్యుతో భాంతి కుతోఽయమగ్నిః,
తమేవ భాంతమనుభాతి సర్వం
తస్య భాసా సర్వమిదం విభాతి. 15

అచ్చట అనగా స్వస్వరూప భూతమగు పరబ్రహ్మమునందు సూర్యుడు ప్రకాశించుట లేదు. చంద్రనక్షత్రాదుల ప్రకాశము లేదు. విద్యుత్తు అచ్చట మెఱయుట లేదు. ఇక అగ్నిని గుఱించి చెప్పవలసిన దేమున్నది? ఆ పరమ ప్రకాశమునందే ఈ సమస్తము ప్రకాశించును. అద్దాని వెలుతురిచే ఇదంతయును వెలుగొందును.

ఇది రెండవ అధ్యాయమున ద్వితీయవల్లి

---

## తృతీయవల్లి.

అవ : జగత్కారణము బ్రహ్మమను అర్థమునందు సంసారరూప అశ్వత్థ వృక్ష వర్ణనము.

ఊర్ధ్వమూలోఽవాక్శాఖ ఏషోఽశ్వత్థః సనాతనః,
తదేవ శుక్రం తద్బ్రహ్మ తదేవామృతముచ్యతే,
తస్మింల్లోకాః శ్రితాః సర్వే తదు నాత్యేతి కశ్చన. ఏతద్వై తత్. 1

ఇది (సంసారము) సనాతనమగు అశ్వత్థ వృక్షము. దీని వ్రేళ్లు పైనున్నవి. కొమ్మలు క్రిందికి వ్రాకి యున్నవి. అదే శుద్ధవస్తువు. అదే బ్రహ్మము. బ్రహ్మమునుండి మాయావిద్యలచే అనిత్యమగు ఈ సంసార వృక్షము వృద్ధి నొందినదని భావము. దానినే అమృత మనెదరు. అన్ని లోకములు దాని ఆశ్రయముచే నున్నవి. దాని కవ్వల ఎవ్వరును పోజాలరు. ఇదే అది. నీ వడిగిన బ్రహ్మతత్త్వము.

అవ: పరబ్రహ్మమే సర్వజగత్కారణమును తన్నియామకమునై యున్నది.

యదిదం కించ జగత్సర్వం ప్రాణ ఏజతి నిఃసృతమ్,
మహద్భయం వజ్రముద్యతం య ఏతద్విదురమృతాస్తే భవంతి. 2

ప్రత్యక్షమగు ఈ విశ్వ మంతయు ప్రాణమునందే సంచలన మొందు చున్నది. అనగా పరబ్రహ్మమునందే యని అర్థము. అది ఈ విశ్వకారణమగు భూమ. పైకెత్తబడిన వజ్రాయుధము వలె భయమును కలుగ జేయునదై యున్నది. దీని నెఱిగినవారు అమృత స్వరూపులౌదురు.

అవ: ప్రభువగు అతని భయమువలననే జగద్వ్యాపారము వ్యవస్థా బద్ధముగ జరుగుచున్నది.

భయాదస్యాగ్నిస్తపతి భయాత్తపతి సూర్యః,
భయాదింద్రశ్చ వాయుశ్చ మృత్యుర్ధావతి పంచమః. 3

విశ్వకారణ మగు వాని భయముచేతనే అగ్ని కాలును, సూర్యుడు ప్రకాశించును. ఇంద్రుడు, వాయువు, ఐదవ వాడగు యముడును వాని భయముచే తమ తమ కర్మల నాచరింతురు.

అవ: బ్రహ్మతత్త్వ జ్ఞానమును జీవితముండగనే ఈ లోకమునందే పొందవలెను.

ఇహ చేదశకద్బోద్ధుం ప్రాక్శరీరస్య విస్రసః,
తతః సర్గేషు లోకేషు శరీరత్వాయ కల్పతే. 4

ఈ శరీరము పడిపోవుటకు మొదటనే ఆత్మజ్ఞానమును బొంది యుండుట మంచిది. లేకున్న జీవుడు సృష్టిలో నానా లోకములయందు జన్మ మెత్తవలసి వచ్చును. ప్రయత్న పూర్వకముగ ఆత్మప్రబోధము నొందవలయునని భావము. జీవన పరమ లాభ మాత్మజ్ఞానము.

అవ: స్థాన భేదమువలన ఆత్మదర్శనముగూడ తారతమ్యము గలదిగ భానమగునని తెలుపుట.

యథా ఽఽదర్శే తథాఽఽత్మని
యథా స్వప్నే తథా పితృలోకే,
యథాఽప్సు పరీవదదృశే తథా గంధర్వలోకే
ఛాయాఽఽతపయోరివ బ్రహ్మలోకే. 5

అద్దమునందు ప్రతిబింబము చక్కగా అగపడునట్లు తనయందు ఆత్మయందు అనగా మానవోపాధియగు శుద్ధ బుద్ధియందు "ఆదర్శ వన్నిర్మలీభూతాయాం వివిక్తమాత్మనో దర్శనం భవతి." బ్రహ్మ దర్శన మగును. స్వప్నమునందు వలె అవ్యక్తమై పితృలోకమున అగ పడును. జలమునందు ప్రతిబింబము వలె అవ్యక్తమై గంధర్వలోకమున కన నగును. ఇక నీడ యెండల వలె విస్పష్టముగ విడి విడిగ బ్రహ్మ లోకమున గాన నగును. కాని బ్రహ్మలోకమును పొందుట మిక్కిలి కష్టము. అనేక పుణ్య కర్మలచే గాని అది సాధ్యము గాదు. ఇక పైన చెప్పిన లోకములయందు, పరబ్రహ్మతత్త్వము చక్కగ వేద్యము కాదు. కాబట్టి ఇప్పుడే ఈ లోకముననే జ్ఞానమును బొందుట సులభము. కావున చక్కగా రేపు మాపనక ఇప్పుడే ప్రయత్నము జేయ వలయు నని తాత్పర్యము.

ఆత్మజ్ఞాన విధానము, తత్ప్రయోజనము

ఇంద్రియాణాం పృథగ్భావ ముదయాస్తమయౌ చ యత్,
పృథగుత్పద్యమానానాం మత్వా ధీరో న శోచతి. 6

వివిధములగు తన్మాత్రలచే శబ్దాదివిషయములచే గలుగు ఆయా ఇంద్రియముల విభిన్నానుభవములను, వాటి పుట్టు చావులను తెలిసి బుద్ధిమంతుడు దుఃఖ రహితు డగును.

ఇంద్రియేభ్యః పరం మనో మనసః సత్త్వ ముత్తమమ్,
సత్త్వాదధి మహానాత్మా మహతోఽవ్యక్త ముత్తమమ్. 7

ఇంద్రియములకంటెను మనస్సు శ్రేష్ఠ మైనది. మనస్సుకంటెను

శుద్ధబుద్ధి గొప్పది. బుద్ధికవ్వల మహత్తత్త్వము పెద్దది. మహత్తత్త్వమున కావల గొప్పదై అవ్యక్తము (ప్రకృతి) గలదు.

అవ్యక్తాత్తు పరః పురుషో వ్యాపకోఽలింగ ఏవ చ,
యం జ్ఞాత్వా ముచ్యతే జంతు రమృతత్వం చ గచ్ఛతి. 8

అవ్యక్తమునకంటెను పురుషుడు (పరమాత్మ) శ్రేష్ఠుడు. అతడు సర్వవ్యాపకుడు. ఏ గుఱుతులును లేనివాడు. అట్టి పరమాత్మను తన్నుగా దెలిసి మానవుడు ముక్తుడగును. అమృతత్త్వము బడయును.

న సంద్రుశే తిష్ఠతి రూపమస్య
న చక్షుషా పశ్యతి కశ్చనైనమ్,
హృదా మనీషీ మనసాఽభిక్లృప్తో
య ఏతద్విదురమృతాస్తే భవంతి. 9

అతని స్వరూపము దృగ్గోచరము గాదు. నేత్రవృత్తిచే అతని నెవరును చూడజాలరు. మనస్సంయమముగల విశుద్ధాంతఃకరణమునకే గోచర మగును. దీనిని దెలిసిన వారు అమృత స్వరూపు లగుదురు.

ఆత్మజ్ఞానమున కుపయుక్త మగు యోగప్రతిపాదన

యదా పంచావతిష్ఠంతే జ్ఞానాని మనసా సహ,
బుద్ధిశ్చ న విచేష్టతి తామాహుః పరమాం గతిమ్. 10

మనస్సుతో సహ ఎపుడు పంచేంద్రియములు స్థిరమై, బుద్ధియు నిశ్చలమై యుండునో అప్పుడాస్థితిని పరమగతి యని పెద్దలు చెప్పుదురు. సర్వేంద్రియ వృత్తులు అణగగా బుద్ధియు నిశ్చల మైనపుడు ఆత్మ చిన్మాత్రముగా భాన మగునని భావము. ఆ చిన్మాత్రస్థితియే అన్నిటికి పరాకాష్ఠ.

తాం యోగమితి మన్యంతే స్థిరామింద్రియధారణామ్,
అప్రమత్తస్తదా భవతి యోగో హి ప్రభవాప్యయౌ. 11

స్థిరమగు ఈ ఇంద్రియ ధారణనే తెలిసినవారు యోగమని చెప్పుదురు. అయితే అతడు ఇట్టి సమయమునందు జాగరూకుడై యుండవలెను; ఎందుచేత ననగా యోగస్థికి ఆరోహణావరోహణములు

శలవు. బుద్ధీంద్రియముల వ్యాపార మాగుటకు మునుపే ఇతడు జాగరూకుడై ప్రమాదమును పొందనివాడై యుండవలెను. ఇది కేవల సమాధి కాదు. సమాధి (స్వరూపస్థితి) యందు ప్రమాద మేమియు నుండదని అర్థము.

అవ: బ్రహ్మము బుద్ధీంద్రియాద్యవిషయము గావున ఆత్మానుభవమునకు సద్బుద్ధి సాధన మని తెలుపుట.

నైవ వాచా న మనసా ప్రాప్తుం శక్యో న చక్షుషా,
అస్తీతి బ్రువతోఽన్యత్ర కథం త దుపలభ్యతే. 12

ఆ బ్రహ్మతత్త్వము వాక్శక్తిచే గాని మనస్సుచే గాని నేత్రాదీంద్రియములచే గాని ప్రాప్త మగునది కాదు. ఆ యాత్మ నేనై యున్నానను– ఉన్నది యను– సద్బుద్ధి గల వారికి తప్ప అన్యులకెట్లు లభించును? తాత్పర్య మేమనిన, ఆత్మ బ్రహ్మమే యను శ్రద్ధాళువులకు తప్ప అన్యులకు గ్రాహ్యము గాదు.

అస్తీత్యేవోపలబ్ధవ్య స్తత్త్వభావేన చోభయోః,
అస్తీత్యేవోపలబ్ధస్య తత్త్వభావః ప్రసీదతి. 13

పరబ్రహ్మము ఆత్మయేమై యున్నదను శ్రద్ధచే మాత్రము లబ్ధమగునది. కార్య కారణములయొక్క సత్యజ్ఞానముచే పొంద బడునదై యున్నది. అస్తిత్వ భావోపలబ్ధిచే అనగా అది నేనను వృత్తి కలిగెనా ఆ యుత్తర క్షణముననే సత్యానుభవ మగును. నిరుపాధిక మగు బ్రహ్మానుభవ మగునని భావము.

అవ: అమరు డెప్పుడగు ననగా చెప్పుచున్నారు–

యదా సర్వే ప్రముచ్యంతే కామా యేఽస్య హృది శ్రితాః,
అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే. 14

మానవుని అంతఃకరణమునం దుండు సర్వ కామములు కాలిపోయిన వన్న ఆ మానవు డమరు డగును. ఇచ్చటనే బ్రహ్మపదము పొందును.

యదా సర్వే ప్రభిద్యంతే హృదయస్యేహ గ్రంథయః,
అథ మర్త్యోఽమృతో భవత్యేతావద్ధ్యనుశాసనమ్. 15

అంతఃకరణమునం దిల్లుగా గలిగి యున్న "ఈ శరీరము నేను, ఈ ధనమునాది" అనునిట్టి ఎల్ల మిథ్యాబంధములు ఎపుడు భగ్నమై పోవునో అపుడే తత్క్షణమే ఆ మానవుడు బ్రహ్మమే యగును. ఇదియే ఉపదేశము. సర్వోపనిషత్తుల సందేశము.

శతం చైకా చ హృదయస్య నాడ్య
స్తాసాం మూర్ధాన మభినిఃసృతైకా,
తయోర్ధ్వమాయన్నమృతత్వమేతి
విష్వఙ్ఙన్యా ఉత్క్రమణే భవంతి. 16

హృదయమునగల నాడులు 101. అందు ఒకటి పై భాగమున తలవైపు పోయి యున్నది. దానినే సుషుమ్నానాడి యని యందురు. తద్ద్వారా ప్రాణోత్క్రమణ మొందిన మానవుడు అమృతత్వమును పొందును. ఇతర మగు నాడులద్వారా, లేక ప్రాణవాయువుల ననుసరించి పోయినచో నానా జన్మలు సంప్రాప్త మగును. ఇది మంత్రకారుల కొఱకై యోగదృష్టి ననుసరించి చెప్పబడినది.

అంగుష్ఠమాత్రః పురుషోఽంతరాత్మా
సదా జనానాం హృదయే సన్నివిష్టః,
తం స్వాచ్ఛరీరాత్ప్రవృహేన్ముంజాదివేషీకాం ధైర్యేణ,
తం విద్యాచ్ఛుక్రమమృతం తం విద్యాచ్ఛుక్రమమృతమితి.17

అంగుష్ఠ పరిమాణము గల పురుషుడగు అంతరాత్మ సంతతము జనుల అంతఃకరణమున వసించును. ఆ యంతరాత్మని మహత్తరమగు ధైర్యముచే విషయ విరక్తి గలిగి ముంజగడ్డి మధ్యనుండు సన్నని ఈనెను పై పొర లొలిచి వేఱుగ దీయునట్లు అన్వయ వ్యతిరేకములచే వేఱు జేయ వలయును. చిన్మాత్రమైన అదే తేజస్సంపన్న మగు అమృత వస్తువు.

మృత్యుప్రోక్తాం నచికేతోఽథ లబ్ధ్వా
విద్యామేతాం యోగవిధిం చ కృత్స్నమ్,
బ్రహ్మ ప్రాప్తో విరజోఽభూద్విమృత్యు
రన్యోఽప్యేవం యో విదధ్యాత్మమేవ. 18

యము డుపదేశించిన ఈ (అమృత) విద్య నెఱిగి నచికేతస్సు ధన్యు డయ్యెను. పాపరహితుడును, అమృత స్వరూపుడు నయ్యెను. అటులే ఈ అధ్యాత్మవిద్య నెఱిగిన వారందఱు నచికేతస్సువలె ముక్తు లగుదురు.

ఓం సహ నావవతు సహ నౌ భునక్తు సహ వీర్యం కరవావహై తేజస్వి నావధీతమస్తు మా విద్విషావహై.

ఓం శాంతిః శాంతిః శాంతిః

ఇది రెండవ అధ్యాయమున మూడవ వల్లి

కఠోపనిషత్తు సమాప్తము

ఓం తత్ సత్

# ౪. ప్రశ్నోపనిషత్తు

ఓం భద్రం కర్ణేభిః శృణుయామ దేవాః. భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః. స్థిరైరంగైస్తుష్టువాగ్ంసస్తనూభిః. వ్యశేమ దేవహితం యదాయుః. స్వస్తి న ఇంద్రో వృద్ధశ్రవాః. స్వస్తి నః పూషా విశ్వవేదాః. స్వస్తి నస్తార్క్ష్యో అరిష్టనేమిః. స్వస్తి నో బృహస్పతిర్దధాతు.

ఓం శాంతిః శాంతిః శాంతిః

ఓ దేవతలారా! మా చెవు లెల్లప్పుడు మంగళ మయమగు మాటలనే వినుగాక! పూజ్యులగు ఓ దేవతలారా! మా నేత్రము లఖండమగు శుభమునే చూచుగాక! బలోపేతమగు శరీరేంద్రియములు గలిగి ఆయుస్సంతయు ఈశ స్మరణచే (స్తోత్రముచే) గడచుగాత! శ్రేష్ఠుడగు జ్ఞాని యైన ఇంద్రుడు మాకు శుభ మొసగుగాత! సర్వద్రష్ట యగు సూర్యుడు మమ్మనుగ్రహించుగాత! సర్వారిష్ట నాశకుడగు గరుడుడు మమ్ము కృపాదృష్టి జూచుగాత! దయామయుడగు బృహస్పతి మమ్ము బ్రోచుగాత!

ఓం శాంతిః శాంతిః శాంతిః

## 1-వ ప్రశ్న

అవతారిక: సుకేశాదు లాఱుగురు ఋషులు పిప్పలాద మహర్షి యను గురువుకడకు వచ్చి శరణాగతు లగుట.

ఓమ్. సుకేశా చ భారద్వాజః శైబ్యశ్చ సత్యకామః సౌర్యాయణీ చ గార్గ్యః కౌశల్య శ్చాశ్వలాయనో భార్గవో వైదర్భిః కబంధీ కాత్యాయన స్తే హైతే బ్రహ్మపరా బ్రహ్మనిష్ఠాః పరం బ్రహ్మాన్వేష మాణా ఏష హ వై తత్సర్వం వక్ష్యతీతి తే హ సమిత్పాణయో భగవంతం పిప్పలాద ముపసన్నాః. 1

భరద్వాజ పుత్రుడగు సుకేశఋషి, శిబిపుత్రుడైన సత్యకామ ఋషి., గర్గవంశోత్పన్నుడైన సౌర్యాయణి, ఆశ్వలాయనుని కుమారుడు కౌశల్యుడు, విదర్భఋషికుమారుడగు భార్గవుడు, కత్యయను ఋషి పుత్రుడైన కబంధి యను నీ ఆర్గురు బ్రహ్మమునందు విశ్వాసము గల వారు. బ్రహ్మప్రాప్తికై యత్నించు వీరు పిప్పలాదఋషి మాకు సాంగోపాంగముగ బహ్మవిద్యను బోధించునని యెంచి చేతియందు సమిధలను పట్టినవారై శిష్యవృత్తిచే అతని కడకు వెళ్ళిరి.

తాన్ హ స ఋషి రువాచ. భూయ ఏవ తపసా బ్రహ్మచర్యేణ శ్రద్ధయా సంవత్సరం సంవత్స్యథ. యథాకామం ప్రశ్నాన్ పృచ్ఛత యది విజ్ఞాస్యామః. సర్వం హ వో వక్ష్యామ ఇతి. 2

వారిని గుఱించి యా ఋషి, శ్రద్ధాయుక్తులై మీరు బ్రహ్మ చర్య వ్రతముచే తపస్సు చేయుచు ఒక సంవత్సర కాలము ఇచ్చట నుండుడి. (ఆ పిదప) మీ ఇష్టప్రకారము అడిగి తెలిసికొనవచ్చును. తెలిసిన విషయమును తెలియ జేసెద నని చెప్పెను.

అథ కబంధీ కాత్యాయన ఉపేత్య పప్రచ్ఛ. భగవన్ కుతో హ వా ఇమాః ప్రజాః ప్రజాయంత ఇతి. 3

ఆ పిదప (కొంతకాలమైన తరువాత) కత్యయనువాని పుత్రుడైన కబంధి కాత్యాయనుడు పిప్పలాద ఋషికడకు వచ్చి భో భగవాన్ ఈ ప్రజలు ఏ తత్త్వమునుండి ఉత్పన్నమగుదురు?

### రయి ప్రాణముల ఉత్పత్తిని జెప్పుట

తస్మై స హోవాచ ప్రజాకామో వై ప్రజాపతిః. స తపోఽతప్యత స తపస్తప్త్వా స మిథున ముత్పాదయతే. రయిం చ ప్రాణం చేత్యేతౌ మే బహుధా ప్రజాః కరిష్యత ఇతి. 4

పిప్పలాదఋషి: ప్రజాపతి, అనగా పరమాత్మాభిన్నుడగు హిరణ్యాగర్భుడు సృష్టింప దలంచి తపస్సు చేసెను (సంకల్పించెను). రయి (అన్న) ప్రాణములనెడి మిథునమును సృష్టి గావించెను. అనగా రయిః శబ్దముచే చెప్పబడు అన్నరూపుడగు సోముని (చంద్రుని) ప్రాణశబ్దముచే చెప్పబడు సోమభోక్త యైన అగ్నిని వీని మూలమున నానావిధములైన సృష్టిని గావించెదనని తలంచి సూర్యచంద్ర రూపములైన యీ రెండింటిని సృజించెను.

### సూర్యచంద్రులయందు ప్రాణమును రయిని భావించవలెను

ఆదిత్యో హ వై ప్రాణో రయిరేవ చంద్రమా రయిర్వా ఏతత్సర్వం యన్మూర్తం చామూర్తం చ తస్మాన్మూర్తి రేవ రయిః. 5

ఆదిత్యుడే ప్రాణతత్త్వము, లేక భక్షించువాడగు అగ్ని. అన్నమనగా రయిశబ్ద వాచ్యుడగు చంద్రుడు. ఇట్లు భోక్తృ భోగ్య స్వరూపమున మూర్తామూర్తమగు స్థూల సూక్ష్మాత్మక ప్రపంచమంతయు రయియే యై యున్నది. కావున మూర్తియే రయియునై యున్నది.

అథాదిత్య ఉదయన్ యత్ప్రాచీం దిశం ప్రవిశతి తేన ప్రాచ్యాన్ ప్రాణాన్ రశ్మిషు సంనిధత్తే. యద్దక్షిణాం యత్ప్రతీచీం యదుదీచీం యదధో యదూర్ధ్వం యదంతరా దిశో యత్సర్వం ప్రకాశయతి తేన సర్వాన్ ప్రాణాన్ రశ్మిషు సంనిధత్తే. 6

తూర్పుదిక్కున సూర్యు డుదయించి ప్రాణులను తన కిరణములచే ప్రేరణ యొనర్చును. దక్షిణము, పశ్చిమము, ఉత్తరము, క్రిందను మీదను అంతరిక్షమునను ఈ అన్ని దిక్కులను సర్వ వస్తువులను ప్రకాశింపజేసి సమస్త ప్రాణశక్తులను తన కిరణములచే జాగృతి నొందించును. అందుచే సూర్యుడు ప్రాణశబ్ద వాచ్యుడై యున్నాడు.

స ఏష వైశ్వానరో విశ్వరూపః ప్రాణోఽగ్ని రుదయతే తదేత దృచాఽభ్యుక్తమ్. 7

అతడే ఆ యాదిత్యుడే ఈ విశ్వరూప వైశ్వానరుడు. (జీవ రూపాగ్ని) ప్రాణుడు. అతడు ఉదయించును. ఈ విషయము రాబోవు మంత్రమునందు చెప్పబడినది.

విశ్వరూపం హరిణం జాతవేదసం
పరాయణం జ్యోతిరేకం తపంతమ్,
సహస్రరశ్మిః శతధా వర్తమానః
ప్రాణః ప్రజానా ముదయత్యేష సూర్యః. 8

ఇది నానారూపములు గలది. కిరణ యుక్తమైనది. ఇదే అగ్ని. ఇది శ్రేష్ఠమైన స్థానము. ఇదొక్కటే ప్రకాశవంతమగు జ్యోతి. వేలాది కిరణములు గలిగి వందలాది ప్రకారములచే వర్తించు ప్రజల ప్రాణమై ఈ సూర్యుడు ఉదయించుచున్నాడు.

సంవత్సరాదులను ప్రజాపతి యని భావించవలెను

సంవత్సరో వై ప్రజాపతి స్తస్యాయనే దక్షిణం చోత్తరం చ తద్యేహవై తదిష్టాపూర్తే కృత మిత్యుపాసతే తే చాంద్రమస మేవ లోక మభిజయంతే తఏవ పునరావర్తంతే తస్మాదేతే ఋషయః ప్రజా కామా దక్షిణం ప్రతిపద్యంతే ఏష హ వై రయిర్యః పితృయాణః. 9

సంవత్సరమే ప్రజాపతి. దానికి దక్షిణాయనము, ఉత్తరాయణ మను రెండు గతులు గలవు. ఎవరు ఇష్టాపూర్త కర్మల నాచరించి దీని నుపాసింతురో వారు చంద్రలోకమును జయింతురు. మరల అచ్చటినుండి తిరిగి వచ్చెదరు. అందుచేత ప్రజల నిచ్ఛయించు ఈ ఋషులు దక్షిణమార్గము నాశ్రయింతురు. ఇదే 'రయి' యనియు పితృయాణ మనియు చెప్పబడును. లేక రయి యనగా చంద్రయాన మనియు అర్థము.

అథోత్తరేణ తపసా బ్రహ్మచర్యేణ శ్రద్ధయా విద్యయాఽఽత్మాన మన్విష్యాదిత్య మభిజయంత ఏతద్వై ప్రాణానా మాయతన మేత

థమృత మభయ మేతత్పరాయణ మేతస్మాన్న పునరావర్తంత ఇత్యేష నిరోధ స్తదేష శ్లోకః. 10

ఇక ఉత్తరమార్గము నవలంబించి తపస్సు, బ్రహ్మచర్యము, శ్రద్ధ, విద్య వీటిచేత ఆత్మ నెఱిగి ఆదిత్య లోకమును జయింతురు. ఇదే (సూర్యుడే) ప్రాణాధారము. ఇది అమృతము. భయరహితము. అన్నిటికంటెను శ్రేష్ఠమగు గతి. ఇచ్చటనుండి మరల తిరిగివచ్చుట లేదు. పునర్జన్మ లేదు. ఈ ప్రకార మగు నియమము గలదు. ఈ విష యము ముందు మంత్రమున వివరింపబడును.

## సూర్యుడే సర్వాధారము

పంచపాదం పితరం ద్వాదశాకృతిం దివ ఆహుః. పరే అర్ధే పురీషిణమ్. అథేమే అన్య ఉ పరే విచక్షణం స ప్త చక్రే షడర ఆహు రర్పిత మితి.

ఆ యర్ధ భాగమునం దుండు వానికి అనగా దక్షిణాయనము నందున్న సూర్యునకు దేవతలు ఐదు పాదములు గల వాడని, శిశిర హేమంత ఋతువులు కూడి ఒకటి యనిన్నీ తక్కిన నాలుగును ఇట్లు లెక్కించిన ఐదు ఋతువు లగును. ఇవి ఐదుపాదములు పండ్రెండు విధములగు ఆకృతులు లేక అవయవములు గల వాడుగను ఉన్నాడు. అందఱినిసృష్టించుట వలన పితయై యున్నాడు. తక్కిన సగమునం దుండు వానికి అనగా ఉత్తరాయణమునం దుండు నతనికి ఆఱాఱు అరలు (ఆకులు) కలవానిగను లేక, ఆఱు ఋతువులు ఆఱు అరలుగ గలిగి ఏడు (గుజ్జములు) చక్రములు గల రథమునం దుండు ఆదిత్యుని కాలాత్మ యని విద్వాంసులు చెప్పుదురు. తాత్పర్య మేమనిన, ప్రజా పతియై, కాలాత్మకమై సూర్యచంద్రుల మిథునమై యుండు బ్రహ్మ వస్తువే ప్రపంచమునకు కారణమని, ప్రథమ ప్రశ్నకు త్తరమని గ్రహింప వలయును.

## మాసాదులను ప్రజాపతి యని భావించవలెను

మాసో వై ప్రజాపతి స్తస్య కృష్ణపక్ష ఏవ రయిః శుక్లః ప్రాణ స్తస్మాదేతే ఋషయః శుక్ల ఇష్టం కుర్వంతీతర ఇతరస్మిన్. 12

మాసమే ప్రజాపతి. కృష్ణపక్షమే రయి యగు అన్నము. శుక్ల పక్షమే ప్రాణము. కాబట్టి ఇట్లు తెలిసిన పెద్దలు శుక్లపక్షమునందు యజ్ఞకర్మ జేతురు. ఇతరులు కృష్ణపక్షమునందు జేయుదురు.

రేయింబవళ్ళు ప్రజాపతియే యని తెలియవలెను

అహోరాత్రో వై ప్రజాపతి స్తస్యాహరేవ ప్రాణో రాత్రిరేవ రయిః. ప్రాణం వా ఏతే ప్రస్కందంతి యే దివా రత్యా సంయుజ్యంతే. బ్రహ్మచర్య మేవ తద్యద్రాత్రౌ రత్యా సంయుజ్యంతే. 13

రాత్రింబవళ్ళు (కూడి) ప్రజాపతి యగును. పగలే ప్రాణము, రాత్రియే రయి. పగలు స్త్రీసంగ మొనర్చువారు ప్రాణమును పాడు చేయుదురు. (ఆయుః క్షీణ మగునని భావము.) రేయి స్త్రీసంగ మొనర్చుట బ్రహ్మచర్యమే యనబడును. గృహస్థ ధర్మవిరుద్ధము గాక స్త్రీతో ప్రవర్తించుటవలన అతనికి బ్రహ్మచర్యఫల మేర్పడి ఆముష్మికము మున జ్ఞానము లభించును. ఈ నియమము ననుసరించుటచే నా గృహస్థాశ్రమమున్నూ బ్రహ్మచర్యాశ్రమ మనబడును.

అన్నము ప్రజాపతియై యున్నది

అన్నం వై ప్రజాపతి స్తతో హ వై తద్రేత స్తస్మాదిమాః ప్రజాః ప్రజాయంత ఇతి. 14

అన్నమే ప్రజాపతి. దానిచే రేతస్సు ఉత్పన్న మగును. దాని నుండియే ప్రజలు పుట్టుదురు.

ప్రజాపతివ్రతఫలము

తద్యే హ వై తత్ప్రజాపతివ్రతం చరంతి తే మిథున ముత్పాదయంతే. తేషామేవైష బ్రహ్మలోకో యేషాం తపో బ్రహ్మచర్యం యేషు సత్యం ప్రతిష్ఠితమ్. 15

అందుచేత ఏ గృహస్థులు ప్రజాపతివ్రతమును అనగా ఋతుకాలము నెఱిగి సృష్టిసాధనమైన ధర్మపత్నీ సంబంధ యుక్తు లగుదురో వారి మిథునమువలన పుత్రీ పుత్రులు సృష్టియగుదురు. ఎవరియందు బ్రహ్మచర్యము, తపస్సు స్థిరమై యున్నవో వారిదే ఈ బ్రహ్మలోకము. పితృయాణమున చంద్ర సంబంధమైన బ్రహ్మలోకమును పొందుదురని భావము.

## ఉత్తరమార్గావలంబుల గతివర్ణన

తేషామసౌ విరజో బ్రహ్మలోకో న యేషు జిహ్మ మనృతం న మాయా చేతి. 16

ఎవరియందు కుటిల భావము, అసత్యము, కపటము, ఇత్యాది దోషములు లేవో అట్టి వారిదే ఈ పవిత్రమగు బ్రహ్మలోకము. ఇందలి తాత్పర్యము కేవల కర్మఠులకు చంద్రలోకము. జ్ఞానముతో కూడి కర్మ చేయు వారికి సూర్యలోకము, అనగా ప్రజాపతి లోక ప్రాప్తి యని భావము.

ఇతి ప్రథమః ప్రశ్నః

---

## 2-వ ప్రశ్న

అథ హైనం భార్గవో వైదర్భిః పప్రచ్ఛ. భగవన్ కత్యేవ దేవాః ప్రజాం విధారయంతే. కతర ఏతత్ప్రకాశయంతే కః పున రేషాం వరిష్ఠ ఇతి. 1

ఆ పిదప విదర్భ దేశపు భార్గవుడు పిప్పలాద ఋషిని చూచి హేభగవన్! ఎందఱు దేవత లీ ప్రజలకు ఆధారమై నిలిచి యున్నారు? ఈ దేవతలయం దెవరీ శరీరమును ప్రకాశింప జేయుదురు? ఈ దేవతలలో శ్రేష్ఠు లెవరు?

అవ: శరీరమునకు ఆకాశాది పంచ భూతములు ముఖ్యాధారములు గావు అని చెప్పుచున్నారు.

తస్మై స హోవాచాకాశో హ వా ఏష దేవో వాయు రగ్ని రాపః పృథివీ వాఙ్మనశ్చక్షుః శ్రోత్రం చ తే ప్రకాశ్యాభివదంతి వయ మేతద్బాణమవష్టభ్య విధారయామః. 2

అతనిని గుఱించి పిప్పలాదు డిట్లు పలికెను—ఆకాశము, వాయువు, పృథివి, అగ్ని, జలము, వాక్కు, మనస్సు, నేత్రము, శ్రోత్రము ఇవియే ఆ దేవతలు. ఈ దేవతలు శరీరమును ప్రకాశింప జేసి అనగా చైతన్యమయ మొనర్చి తాము స్థిరముగా నిలిచి ఈ శరీరమున కాధారమై యున్నామని చెప్పుదురు.

## ప్రాణ ప్రాధాన్యమును గురించిన కథ

తాన్ వరిష్ఠః ప్రాణ ఉవాచ మా మోహ మాపద్యథాహ మేవైతత్పంచధాఽఽత్మానం ప్రవిభజ్యైతద్బాణ మవష్టభ్య విధారయామీతి తేఽశ్రద్దధానా బభూవుః. 3

ఈ దేవతలయందు శ్రేష్ఠుడగు ప్రాణు డిట్లు చెప్పెను. "మోహము నొందకుడి. నేనే ఐదు భాగములై స్థిరముగ నిలిచి ఈ శరీరమున కాధారుడనై యున్నానని నేను"

సోఽభిమానా దూర్ధ్వ ముత్క్రమత ఇవ తస్మిన్నుత్క్రామత్యథేతరే సర్వ ఏవోత్క్రామంతే తస్మింశ్చ ప్రతిష్ఠమానే సర్వ ఏవ ప్రాతిష్ఠంతే తద్యథా మక్షికా మధుకర రాజాన ముత్క్రామంతం సర్వా ఏవోత్క్రామంతే తస్మింశ్చ ప్రతిష్ఠమానే సర్వా ఏవ ప్రాతిష్ఠంత ఏవం వాఙ్మనశ్చక్షుః శ్రోత్రంచ తే ప్రీతాః ప్రాణం స్తున్వంతి. 4

కాని వారా మాటయందు విశ్వాస ముంచలేదు. అప్పుడు ప్రాణు డభిమానముచే శరీరమును విడిచి వెలుపలకు వెళ్ళ నుద్యమించెను. కాని వాడు వెలుపలకు వెళ్ళ నుద్యమించిన వెంటనే ఇతరులెల్లరు వెళ్ళవలసి వచ్చెను. అతడు ప్రతిష్ఠితుడైన (స్థితమైన) వెంటనే ఇతర దేవత లందఱును ప్రతిష్ఠ నొందుదురు. ఎట్లనిన, తేనెటీగల రాజు (అనగా రాణి) వెడలిన వెంటనే తక్కిన తేనెటీగ లన్నియు వెళ్ళును. అది స్థిరమై నిలిచిన వెంటనే అన్ని తేనెటీగలు స్థిరముగా నిలుచును. ఈ ప్రకారము వాఙ్మనఃచక్షుఃశ్రోత్రాదులు ప్రాణాధారముననే మేమున్నామని తెలిసికొని ప్రేమచే ప్రాణమును స్తుతించెను. ఇట్లని ఆఖ్యాయిక.

ఏషోఽగ్ని స్తపత్యేష సూర్య ఏష పర్జన్యో మఘవా ఏష వాయు రేష పృథివీ రయిర్దేవః సదసచ్చామృతం చ యత్. 5

ఇదే (ప్రాణమే) అగ్నిరూపమున జ్వలించుచున్నది. ఇదియే సూర్యుడును ఇదియే. వర్షించు పర్జన్య దేవత ఇదియే. ఇదియే చంద్రుడు. ఇదియే వాయువు. ఇదే పృథివి. ఇదే రయి. ఇతడే దేవుడు. సత్తు, అసత్తు, అమృతము, ఉండున దెల్ల ఇదే.

ప్రాణమే సర్వాశ్రయము, శ్రేష్ఠమునై యున్నది.

అరా ఇవ రథనాభౌ ప్రాణే సర్వం ప్రతిష్ఠితమ్,
ఋచో యజూగ్ంషి సామాని యజ్ఞః క్షత్రం బ్రహ్మ చ. 6

రథచక్ర కుంభమునందు (బండి కంటియందు) కూర్పబడిన ఆకుల వలె సర్వము ప్రాణమునందు స్థాపింప బడి యున్నది. ఇదే ఋగ్యాజుస్సామవేదములు. ప్రాణమే యజ్ఞము, అనగా పూజ. బ్రాహ్మణ్యాది సర్వము ప్రాణమునందే ప్రతిష్ఠితమై యున్నది.

అట్టి ప్రాణముయొక్క స్తోత్రము

ప్రజాపతిశ్చరసి గర్భే త్వమేవ ప్రతిజాయసే,
తుభ్యం ప్రాణ ప్రజా స్త్విమా బలిం హరంతి యః ప్రాణైః ప్రతితిష్ఠసి.7

ఓ ప్రాణమా! నీవే ప్రజాపతివి. గర్భమునందు నీవు చరింతువు. నీవే పుట్టుదువు. పంచ ప్రాణములచే గూడి యుండు ప్రాణుడవు నీవే. నీ ప్రీత్యర్థమై ఈ ప్రజలు బలియొనర్తురు. అనగా అన్నము నర్పింతురు.

దేవానామసి వహ్నితమః పితౄణాం ప్రథమా స్వధా,
ఋషీణాం చరితం సత్య మథర్వాంగిరసామసి. 8

నీవు దేవతలలో శ్రేష్ఠమైన అగ్నివి. పితృ (దేవతల) ప్రథమ ఆహుతివి. ఋషులు సత్యాచారము. అథర్వవేదము నీవే అయి యున్నావు. సర్వేంద్రియ శక్తులకు నీవే ఆధారమని భావము.

ఇంద్ర స్త్వం ప్రాణ తేజసా రుద్రోఽసి పరిరక్షితా,
త్వమంతరిక్షే చరసి సూర్య స్త్వం జ్యోతిషాం పతిః. 9

ఓ ప్రాణమా! తేజస్సుచే నీవు ఇంద్రుడవై యున్నావు. నీవే రుద్రుడవు. విశ్వరక్షకుడవు. నీవు ప్రకాశ మొసగు వస్తువులయందు సర్వ శ్రేష్ఠుడగు సూర్యుడవై యున్నావు.

యదా త్వమభివర్షస్యథేమాః ప్రాణ తే ప్రజాః,
ఆనందరూపా స్తిష్ఠంతి కామాయాన్నం భవిష్యతీతి. 10

ఓ ప్రాణమా! నీవు మేఘరూపుడవై వర్షించుట కారంభించిన వెంటనే విరివిగా ధాన్యము పండును. అప్పుడు జను లెల్లరు ఆనంద

భరితు లయ్యెదరు. ఇష్టానుసారము అన్నము లభించునని అర్థము.

వ్రాత్య స్త్వం ప్రాణైకఋషిరత్తా విశ్వస్య సత్పతిః,
వయమాద్యస్య దాతారః పితా త్వం మాతరిశ్వనః. 11

ప్రాణమా! నీవు నియమ రహితుడవు. ఏక ఋషివి. సంభక్ష గామివై యున్నావు. ఈశ్వరుడవు. మేము ఆజ్యములను అనగా ప్రథమాహుతులను ఇచ్చువారము. నీవు వాయువుయొక్క తండ్రివి. మాకును తండ్రివై యున్నావు.

యా తే తనూర్వాచి ప్రతిష్ఠితా యా శ్రోత్రే యా చ చక్షుషి,
యా చ మనసి సంతతా శివాం తాం కురు మోత్క్రమీః. 12

ఈ వాఙ్మనశ్చక్షుః శ్రోత్రాదులయందు వ్యాపించి యున్న ఆ నీ దివ్య స్వరూపముచే ఈ శరీరము మంగళమయ మగునట్లు చేయుము. ఆశీర్వదించుము. ప్రాణమును లేచి పోనివ్వవలదని భావము.

ప్రాణస్యేదం వశే సర్వం త్రిదివే యత్ప్రతిష్ఠితమ్,
మాతేవ పుత్రాన్ రక్షస్వ శ్రీశ్చ ప్రజ్ఞాం చ విధేహి న ఇతి. 13

ఇతి ద్వితీయః ప్రశ్నః

స్వర్గమునందు ప్రతిష్ఠిత మగు ఈ ప్రాణమునందే ప్రపంచము మఱియు దేవతలు వశులై యున్నారు. (కావున) తల్లి బిడ్డలను కాపాడునట్లు మమ్ము కాపాడుము. మాకు సంపదను, జ్ఞానమును ఇమ్ము.

## 3-వ ప్రశ్న

అథ హైనం కౌసల్యశ్చాశ్వలాయనః పప్రచ్ఛ. భగవన్ కుత ఏష ప్రాణో జాయతే. కథ మాయాత్యస్మిన్ శరీర ఆత్మానం వా ప్రవిభజ్య కథం ప్రతిష్ఠతే. కేనోత్క్రమతే. కథం బాహ్యమభిధత్తే. కథ మధ్యాత్మమితి. 1

ఆ పిదప అశ్వలాయనుని పుత్రుడగు కౌసల్యుడు పిప్పలాద ఋషిని ఇట్లు అడిగెను. భగవన్! ఈ ప్రాణము ఎచ్చటినుండి పుట్టును? ఈ శరీరములోపల కెట్లు వచ్చును? తన్ను విభజన మొనర్చుకొని

ఎట్లుండును? ఏ కారణముచే ఇది వెలుపలకు వెళ్ళును? వెలుపలి వస్తువులను ఎట్లు ధరించును? దేహము నాశ్రయించి ఎట్లు వసించును?

తస్మై స హోవాచాతి ప్రశ్నాన్ పృచ్ఛసి.
బ్రహ్మిష్ఠోఽసీతి తస్మాత్తేఽహం బ్రవీమి. 2

అంతట పిప్పలాదఋషియిట్లనెను—ఓయీ! నీవు అధికప్రశ్నలు వేయుచున్నావు. బ్రహ్మనిష్ఠుడవై యున్నావు గాన నీకుచెప్పెదను.

ప్రాణోత్పత్తిని దెలుపుట

ఆత్మన ఏష ప్రాణో జాయతే. యథైషా పురుషే ఛాయైతస్మిన్నేతదాతతమ్. మనోకృతేనాయాత్యస్మిన్ శరీరే. 3

ఆత్మచే ఈ ప్రాణము పుట్టును. పురుషునినుండి నీడ ఎట్లు వ్యాపించుచున్నదో అటువలె బ్రహ్మమునుండి ప్రాణము వ్యాపించుచున్నది. మనస్సునుబట్టి ప్రాణము ఈ శరీరములోనికి వచ్చుచున్నది. ఇది మొదటి రెండుప్రశ్నలకు సమాధానము.

ముఖ్యప్రాణముయొక్క గొప్పతనము

యథా సమ్రాడేవాధికృతాన్ వినియుంక్తే ఏతాన్ గ్రామాన్ ఏతాన్ గ్రామానధితిష్ఠస్వేత్యేవమేవైష ప్రాణ ఇతరాన్ ప్రాణాన్ పృథక్ పృథగేవ సంనిధత్తే. 4

రాజు తన ఉద్యోగులను ఈయీ గ్రామములను పాలించుడని నియమించు పగిది ఈ ప్రాణము ఇతర ప్రాణములను ఆయా స్థానములయందు నియమించుచున్నది.

పంచప్రాణముల స్థానములు

పాయూపస్థేఽపానం చక్షుః శ్రోత్రే ముఖనాసికాభ్యాం ప్రాణః స్వయం ప్రాతిష్ఠతే. మధ్యే తు సమానః ఏష హ్యేతద్ధుతమన్నం సమం నయతి తస్మాదేతాః సప్తార్చిషో భవంతి. 5

పాయూపస్థలయందు (గుద గుహ్యములయందు) అపానవాయువును నియమించును. నేత్ర శ్రోత్ర ముఖ నాసికములయందు ప్రాణము

స్వయముగ (తానే) నిలుచును. శరీర మధ్యమున సమానవాయు వున్నది. ఆహుతి ఒసగబడిన అన్నమును ఈ సమాన వాయువు సమముగా పంచును. అందుచేత ఈ ఏడు జ్వాలలు పుట్టును. జఠరాగ్ని యని భావము.

### లింగ (సూక్ష్మ) దేహముయొక్క స్థితి

హృది హ్యేష ఆత్మా. అత్రైతదేకశతం నాడీనాం తాసాం శతం శతమేకైకస్యాం ద్వాసప్తతిర్ద్వాసప్తతిః ప్రతిశాఖానాడీ సహస్రాణి భవంత్యాసు వ్యానశ్చరతి. 6

ఆత్మ హృదయమునం దున్నది. ఇచ్చట 101 నాడులు గలవు. ఒక్కొక్క దానియందు వంద వంద శాఖలు. ఆ శాఖానాడుల యందు మఱియు నొక్కొక్కటి 72 వేలు ప్రతిశాఖానాడులు గలవు. వాటియందు వ్యాన వాయువు సంచరించును. పైన అడుగబడిన ప్రశ్నలలో 3-వ నాడీవిభాగ ప్రశ్నకు సమాధాన మిది.

### ప్రాణోత్క్రమణపద్ధతి

అథైకయోర్ధ్వ ఉదానః పుణ్యేన పుణ్యం లోకం నయతి పాపేన పాప ముభాభ్యామేవ మనుష్యలోకమ్. 7

ఆ నాడులయందు ఒక నాడినుండి ఉదానవాయువు ఊర్ధ్వగమనము గలదియై పైకి బోవును. మానవుడు తా జేసిన పుణ్యమును బట్టి వానిని పుణ్య లోకమునకు గొంపోవును. పాపముచే పాప లోకమునకు తీసికొని వెళ్లును. పుణ్యపాపములు మిశ్రితమై యుండినచో మానవ లోకమునకు తీసికొనిపోవును. కౌసల్యుని 4-వ ప్రశ్నకు సమాధానము.

### బహిఃప్రాణములయొక్క నిరూపణ

ఆదిత్యో హవై బాహ్యః ప్రాణ ఉదయత్యేష హ్యేనం చాక్షుషం ప్రాణ మనుగృహ్ణానః పృథివ్యాం యా దేవతా సైషా పురుషస్యాపాన మవష్టభ్యాంతరా యదాకాశః స సమానో వాయుర్వ్యానః. 8

సూర్యుడు శరీరమునకు వెలుపలనుండు ప్రాణము. అతడు కంటి

యందు ప్రాణము ననుగ్రహించుచు ఉదయించును. పృథివియం దధిష్ఠితమై యుండు దేవత అపానవాయువు. అంతరిక్షము నందుండునది సమానవాయువు. వ్యానవాయువు. శరీరమున సర్వత్ర వ్యాపించునదై యున్నది.

ఇది 5 – వ ప్రశ్నకు సమాధానము.

తేజో హవా ఉదాన స్తస్మాదుపశాంత తేజాః పునర్భవ మింద్రియై ర్మనసి సంపద్యమానైః. 9

తేజస్సు ఉదానవాయువు. అందుచేతనే మృతి నొందిన వారు తేజో విహీను లగుదురు. మనస్సునం దంతర్గతమగు వాసనలచేగూడి చచ్చినవారు మరల జన్మ నొందుదురు.

మరణ సమయమున స్మరణానుసారమగు గతిని దెలుపుట

యచ్చిత్త స్తేనైష ప్రాణ మాయాతి. ప్రాణస్తేజసా యుక్తః సహాత్మనా యథా సంకల్పితం లోకం నయతి. 10

చిత్తముతో గూడి ఉదాన వాయువు ప్రాణముకడకు వచ్చును. ప్రాణము తేజోయుక్తమై మానవుని ఇచ్ఛానురూపమగు లోకములకు గొంపోవును.

య ఏవం విద్వాన్ ప్రాణం వేద. న హాస్య ప్రజా హీయతే ఒమృతో భవతి తదేష శ్లోకః. 11

ఈ ప్రకారము ప్రాణము నెఱిగిన (విద్వాంసుని) సంతతి నష్టము గాదు. అతడమృత స్వరూపు డగును. ఈ విషయమునందు ఈ క్రింది మంత్ర మనుసంధేయము.

ఉత్పత్తిమాయతిం స్థానం విభుత్వం చైవ పఞ్చధా,
అధ్యాత్మం చైవ ప్రాణస్య విజ్ఞాయామృతమశ్నుతే,
విజ్ఞాయామృతమశ్నుత ఇతి. 12

ప్రాణముయొక్క ఉత్పత్తియు, (అది) శరీరమునందు ప్రవేశించుటయు, (మఱియు) ఇందు ప్రవర్తించుటయు, పంచవిధములగు వ్యాపకత్వమును దానియొక్క ఆధ్యాత్మికత్వమును అనగా దేహసంబంధమును

ఈ మొదలగు ధర్మములను తెలిసికొనిన మానవుడు అమృత పదవిని బడయును. అమృతపదము నొందును.

ఇతి తృతీయః ప్రశ్నః

---

## 4 - వ ప్రశ్న

అవ: సుషుప్తియం దెవరు నిద్రించి యుందురు? ఎవరు మేల్కొంచి యుందురని అడుగుట.

అథ హైనం సౌర్యాయణీ గార్గ్యః పప్రచ్ఛ. భగవన్నేతస్మిన్ పురుషే కాని స్వపంతి కాన్యస్మిన్ జాగ్రతి కతర ఏష దేవః స్వప్నాన్ పశ్యతి కస్యైతత్సుఖం భవతి కస్మిన్ను సర్వే సంప్రతిష్ఠితా భవంతీతి.1

పిదప గర్గవంశోత్పన్నుడైన సౌర్యాయిణి అడిగిన దేమనిన, పురుషునియం దేయే శక్తులు పరుండును? ఏవి మేల్కొని యుండును! ఇందు ఏ దేవుడు స్వప్నములను గాంచును? ఏవనికి సుఖ మగును! దేనియందు సర్వము లయ మగును?

సర్వేంద్రియ వృత్తులకు లయస్థాన మాత్మయై యున్నది

తస్మై స హోవాచ యథా గార్గ్య మరీచయోఽర్కస్యాస్తం గచ్ఛతః సర్వా ఏతస్మింస్తేజోమండల ఏకీభవంతి తాః పునః పునరుదయతః ప్రచరంత్యేవం హవై తత్సర్వం పరే దేవే మనస్యేకీభవతి. తేన తర్హ్యేష పురుషో న శృణోతి న పశ్యతి న జిఘ్రతి న రసయతే న స్పృశతే నాభివదతే నాదత్తే నానందయతే న విసృజతే నేయాయతే స్వపితీత్యాచక్షతే. 2

పిప్పలాదిఋషి చెప్పినది—ఓ గార్గ్యా! అస్తమించు సూర్యుని అన్ని కిరణములు అతని తేజోమండలమునందు ఒక్కటియై పోవును. అతడు ఉదయించె ననిన మరల విస్తృత మగును. ఇదే విధముగ సర్వమునకు గొప్పది యగు దేవతయైన మనస్సునందు ఈ సమస్తము లీన మగును. అందుచేత నిద్రించినపుడు ఈ పురుషుడు వినుట లేదు. చూచుట లేదు. ఆఘ్రాణించుటయు లేదు. రుచి చూచుటయు లేదు.

స్మరించుటయు లేదు. మాటలాడుటయు లేదు. తీసికొనుటయు లేదు ఆనందించుటయు లేదు. విడుచుటయు లేదు. పోవుటయు లేదు. ఇట్టి స్థితియం దుండిన వానిని నిద్రించి యున్నాడని చెప్పుదురు.

అవ: నిద్రయందు మేల్కాంచి యుండునది ప్రాణముయొక్క రూపాంతరమైన గార్హపత్యాగ్ని యని తెలుపుట.

ప్రాణాగ్నయ ఏవైతస్మిన్ పురే జాగ్రతి. గార్హపత్యో హవా ఏషోఽపానో వ్యానోఽన్వాహార్యపచనో యద్గార్హపత్యాత్ ప్రణీయతే ప్రణయనాదాహవనీయః ప్రాణః. 3

సుషుప్తిలో ఈ శరీరపురమునందు ప్రాణాగ్నులు మాత్రము మేల్కొని యుండును. ఈ అపాన వాయువే అగ్నిహోత్రుల కుండము నందుండు గార్హపత్యాగ్ని. వ్యానవాయువు దక్షిణాగ్ని–అన్వాహార్యాగ్ని. ప్రాణవాయువు ఆహవనీయాగ్నియు పూర్వాగ్నియు గార్హపత్యాగ్నిచే ఇది రగుల్పబడును. గార్హపత్యాగ్నినుండి తీసికొని పోబడుటవలన ఇది ఆహవనీయమని చెప్పబడును. అపానము గార్హపత్యాగ్ని. ప్రాణము–ఆహవనీయాగ్ని. వ్యానము–దక్షిణాగ్ని. దీనినే అన్వాహార్యమని యందురు.

### ప్రాణాగ్నిహోత్రముయొక్క ఋత్విగ్వర్ణనము

యదుచ్ఛ్వాసనిఃశ్వాసా వేతా వాహుతీ సమం నయతీతి స సమానః మనో హ వావ యజమాన ఇష్టఫలమేవోదానః స ఏనం యజమాన మహరహర్బ్రహ్మ గమయతి. 4

ఏ వాయువు ఉచ్ఛ్వాస నిశ్వాసములను ఆహుతులను సమముగా జరుపునో అది సమాన వాయువు. మనస్సే యజమానుడు. ఆకాంక్షితమగు ఫలమే ఉదానవాయువు. ఇది యజమానుని (మనస్సును) అనుదినము బ్రహ్మమును పొందించును.

### స్వప్నదృశ్యములయొక్క వివరణ

అత్రైష దేవః స్వప్నే మహిమాన మనుభవతి యద్దృష్టం దృష్టమనుపశ్యతి. శ్రుతం శ్రుతమేవార్థ మనుశృణోతి. దేశ దిగంతరైశ్చ ప్రత్యనుభూతం పునః పునః ప్రత్యనుభవతి. దృష్టం చాదృష్టం చ

శ్రుతంచాశ్రుతం చానుభూతం చా నను భూతం చ సచ్చాసచ్చ సర్వం పశ్యతి సర్వః పశ్యతి. 5

ఈ దేవత (అనగా మనస్సు) స్వప్నమునందు వివిధములగు వై భవముల నుపభోగించును. చూచిన దాని నెల్ల మరల చూచును. వినిన దాని నెల్ల మరల వినును. దిగ్దేశములయందెల్ల అనుభవించిన దాని నంతయు మరల అనుభవించును. చూచినది, చూడనిది, విని నది, విననిది, అనుభవించినది అనుభవించనిది, సత్తును, అసత్తును, సర్వ మును చూచును. సమస్తము ఇదేయై చూచును.

సుషుప్తిని గుఱించిన విమర్శ

స యదా తేజసా ఒభిభూతో భవతి అత్రైష దేవః స్వప్నాన్న పశ్యత్యథ తదైతస్మిన్ శరీర ఏతత్ సుఖం భవతి. 6

జ్ఞానముచే అనగా మెలకువచే ఈ మనస్సునకు స్వప్నము లగ పడవు. అప్పుడు శరీరస్థమగు ఈ మనస్సు స్వస్థత జెందును. సుఖ ముండును.

స యథా సోమ్య వయాంసి వాసో వృక్షం సంప్రతిష్ఠంతే ఏవం హవై తత్సర్వం పర ఆత్మని సంప్రతిష్ఠతే. 7

ఓ సౌమ్యా! పిట్టలు తమ గూళ్ళు గల వృక్షముల నాశ్రయించు నట్లు ఈ సర్వము శ్రేష్ఠమగు ఆత్మయందు జేరును.

పృథివీ చ పృథివీమాత్రా చాపశ్చాపోమాత్రా చ తేజశ్చ తేజో మాత్రా చ వాయుశ్చ వాయుమాత్రా చాకాశశ్చాకాశ మాత్రా చ చక్షుశ్చ ద్రష్టవ్యం చ శ్రోత్రం చ శ్రోతవ్యం చ ఘ్రాణం చ ఘ్రాతవ్యం చ రసశ్చ రసయితవ్యం చ త్వక్చ స్పర్శయితవ్యం చ వాక్చ వక్తవ్యం చ హస్తౌ చాదాతవ్యం చోపస్థశ్చానందయితవ్యం చ పాయుశ్చ విసర్జయితవ్యం చ పాదౌ చ గంతవ్యం చ మనశ్చ మంతవ్యం చ బుద్ధిశ్చ బోద్ధవ్యం చాహంకారశ్చాహంకర్తవ్యం చ చిత్తం చ చేతయితవ్యం చ తేజశ్చ విద్యోతయితవ్యం చ ప్రాణశ్చ విధారయితవ్యం చ. 8

పృథివియు, దాని తన్మాత్ర అనగా సూక్ష్మరూపమగు గంధము

ఇటువలె జలము, తత్తన్మాత్రయు, అగ్నియు తత్తన్మాత్రయు, వాయువు, తత్తన్మాత్రయు, ఆకాశము, దాని తన్మాత్రయు, కన్ను రూపము, చెవి, శబ్దము, ఘ్రాణము, గంధము, జిహ్వా, రుచి, త్వక్కు, స్పర్శము, వాక్కు, మాట, చేతులు, గ్రహించుట, ఉపస్థ, ఆనందించుట, గుదము, విసర్జనము, పాదము, గమనక్రియయు, మనస్సు, సంకల్ప వికల్పములు, బుద్ధి, నిశ్చయము, అహంకారము, అహంకరించుట, చిత్తము, చింతించుట, తేజము, ప్రకాశింపబడునది, ప్రాణము, ప్రాణముచే ధారణచేయబడదగినది ఈ సమస్తము ఆత్మయందు లీనమగునని తాత్పర్యము.

సుషుప్తియందు జీవునకు పరమాత్మప్రాప్తి యగును

ఏష హి ద్రష్టా స్ప్రష్టా శ్రోతా ఘ్రాతా రసయితా మంతా బోద్ధా కర్తా విజ్ఞానాత్మా పురుషః స పరేఽక్షర ఆత్మని సంప్రతిష్ఠతే. 9

చూచువాడును స్పృశించువాడును వినువాడును ఆఘ్రాణించువాడును రుచి చూచువాడును విచారించువాడును తెలియువాడును చేయువాడును విజ్ఞానపూర్ణుడగుపురుషుడే (ఈ ఆత్మయే) ఇతడు శ్రేష్ఠముగు అక్షరాత్మయందు చేరును.

పరమేవాక్షరం ప్రతిపద్యతే స యోహ వై తదచ్ఛాయమశరీర మలోహితం శుభ్ర మక్షరం వేదయతే యస్తు సోమ్య స సర్వజ్ఞః సర్వో భవతి తదేష శ్లోకః. 10

నాయనా! ఛాయారహితుడును, శరీరరహితుడును వర్ణరహితుడునగు పరిశుద్ధమైన అక్షరము నెఱిగినవాడు పరమగు అవ్యయ పదమును బడయును. సర్వజ్ఞుడగు అతడు సర్వము తానెయై పోవును. ఈ విషయమున ముందు మంత్రము గలదు.

అక్షరబ్రహ్మముయొక్క జ్ఞానము, తత్ఫలము.

విజ్ఞానాత్మా సహ దేవైశ్చ సర్వైః
ప్రాణా భూతాని సంప్రతిష్ఠంతి యత్ర,
తదక్షరం వేదయతే యస్తు సోమ్య
స సర్వజ్ఞః సర్వమేవావివేశేతి. 11

సమస్త దేవతలతో గూడ విజ్ఞానాత్మయు ప్రాణములు మఱియు సర్వ భూతములును దేనియందు విలయ మొందునో ఆ అవ్యయ వస్తువు నెఱిగినవాడు సర్వజ్ఞుడు. అతడు సర్వవ్యాపకు డగునని తెలియవలయును.

ఇతి చతుర్థః ప్రశ్నః

---

## 5-వ ప్రశ్న

అవ: ఓంకారోపాసకుడు ఏ లోకమును బొందునని యడుగుట.

అథ హైనం శైబ్యః సత్యకామః పప్రచ్ఛ. స యోహ వై తద్భగవన్ మనుష్యేషు ప్రాయణాంత మోంకార మభిధ్యాయీత కతమం వావ స తేన లోకం జయతీతి. 1

ఆ పిదప శిబిపుత్రుడైన సత్యకాముడు పిప్పలాద ఋషిని ప్రశ్నించెను—హే భగవన్! జీవించి యున్నంత కాలము ఓంకార ధ్యానము చేసినవాడు ఏ లోకమును జయించును?

ఓంకారము పరాపర బ్రహ్మస్వరూప మయి యున్నది

తస్మై స హోవాచ ఏతద్వై సత్యకామ పరంచాపరం చ బ్రహ్మ యదోంకారః. తస్మాద్విద్వానేతేనైవాయతనేనైకతరమన్వేతి. 2

ఋషి ఇట్లనెను—ఓ సత్యకామా! ఈ ఓంకార మనునదే పరాపర బ్రహ్మమై యున్నది. అందుచేత విద్వాంసుడు ఏతదాధారమున ఈ రెండిటియందు ఏదో ఒక్కదానిని చెందును. (తన లక్ష్యమునను సరించి యని భావము.)

ఓంకారమునందు 3 మాత్రలు గలవు. అందు "అ" ఏకమాత్ర ప్రణవోపాసనచే గలుగు ఫలమును దెలుపుట.

స యద్యేకమాత్ర మభిధ్యాయీత స తేనైవ సంవేదితస్తూర్ణ మేవ జగత్యా మభిసంపద్యతే. తమృచో మనుష్యలోక ముపనయంతే స తత్ర తపసా బ్రహ్మచర్యేణ శ్రద్ధయా సంపన్నో మహిమాన మను భవతి. 3

ప్రణవోపాసకుడు ఏకమాత్ర గల ఓంకారమును అనగా అకారమును ఋగ్వేదమును ధ్యానించువాడు తద్ద్వారా సత్వరమున జగత్తునందు సంపన్నాత్మ యగును. వానిని ఋగ్వేద మంత్రములు అనగా తదభిమాన దేవతలు మనుష్యలోకమునకు దీసికొని వెళ్ళుదురు. (ఉత్తమ మానవజన్మ వచ్చును) అచ్చట తపస్సు, బ్రహ్మచర్యము, శ్రద్ధ మొదలగు వాటిచే కూడినవాడై వైభవము ననుభవించును.

రెండవమాత్ర—ఉకారోపాసనాఫలము

అథ యది ద్విమాత్రేణ మనసి సంపద్యతే సోఽంతరిక్షం యజుర్భి రున్నీయతే సోమలోకమ్. స సోమలోకే విభూతి మనుభూయ పునరావర్తతే. 4

ఇక మనస్సుచే రెండవ మాత్రయగు ఓంకారమును (ఉకారమును యజుర్వేదమును) ధ్యానించువాడు అంతరిక్షమగు చంద్రలోకమును పొందును. అతడు చంద్రలోకమున ఐశ్వర్యముల ననుభవించి మరల తిరిగి వచ్చును.

మాత్రాత్రయ సమన్వితమగు ఓంకారోపాసనాఫలము

యః పునరేతం త్రిమాత్రేణోమిత్యేతేనైవాక్షరేణ పరం పురుష మభిధ్యాయీత స తేజసి సూర్యే సంపన్నః. యథా పాదోదర స్త్వచా వినిర్ముచ్యత ఏవం హవై స పాప్మనా వినిర్ముక్తః స సామభి రున్నీయతే బ్రహ్మలోకం స ఏతస్మాజ్జీవఘనాత్ పరాత్పరం పురిశయం పురుష మీక్షతే తదేతౌ శ్లోకౌ భవతః. 5

ఎవడు త్రిమాత్రాత్మకమగు ఈ ఓంకారాక్షర మూలమున పరమ పురుషుని ధ్యానము చేయునో అతడు తేజఃపుంజమగు సూర్యలోకమును పొందును. కుబుసముచే విడువబడిన పామువలె పాపవిముక్తుడై సామవేద మంత్రములచే (తదభిమాన దేవతలచే) బ్రహ్మలోకము పొందింపబడును. అతడు జీవసాక్షి యగు శరీరస్థ పరమ పురుషుని సాక్షాత్కరించును. ఏతద్విషయమై క్రింది రెండు మంత్రములు గలవు.

అవ : త్రిమాత్రప్రణవానుసంధానముచే గలుగు మహాఫలవర్ణన.

తిస్రో మాత్రా మృత్యుమత్యః ప్రయుక్తా
అన్యోన్యసక్తా అనవిప్రయుక్తాః,
క్రియాసు బాహ్యాభ్యంతర మధ్యమాసు
సమ్యక్ప్రయుక్తాసు న కంపతే జ్ఞః. 6

అకార ఉకార మకారములను ఈ మూడు మాత్రలచే నొప్పారు ప్రణవమునందు బ్రహ్మదృష్టి లేక, విడి విడిగా చింతించుట వలన, ధ్యానించుట వలన ఫలము క్షణభంగుర మైన దగును. వాటిని ఒకటితో నొకటి చేర్చి ఆది మధ్యాంతములందు చక్కగా ప్రయోగించిన యెడల – పురశ్చర్య చేసిన యెడల, మృత్యుదోషము లేని అమృతత్వము నొందును. జ్ఞాని ఈ విషయమున జంకడు. మాత్రాత్రయాత్మక మైన ప్రణవమును చక్కగా నెవ డెఱుగునో అవస్థాత్రియమునందును కాలత్రయమునందును అతడు చలింపడు.

ఋగ్భి రేతం యజుర్భిరంతరిక్షం సామభిర్య త్తత్కవయో వేదయంతే తమోంకారేణై వాయతనేనాన్వేతి విద్వాన్ యత్తచ్ఛాంతమజర మమృత మభయం పరం చేతి. 7

ఋగ్వేదముచే ఈ లోకమును, యజుర్వేదముచే అంతరిక్షమును విద్వాంసుడు సంపాదించును. బ్రహ్మానుభవులగు సర్వజ్ఞులు చెప్పు ఆ పరమ శాంతిపదమును ముదిమి లేని అమృతమును అభయము నగు పరమ పదమును విద్వాంసుడు ఓంకారాశ్రయమున సామవేద మంత్రములచే జయించును. సామవేదముచే బ్రహ్మలోకమును పొందు నని భావము. ఇట్లు ప్రణవము నెవరు తెలియుదురో అట్టి వారు జన్మ జరా మరణములనుండి దూరులై శాశ్వతమగు బ్రహ్మపదము నొందుదురు.

ఇది ఐదవ ప్రశ్న

—o—

## 6-వ ప్రశ్న

అవ : షోడశ కళా పూర్ణుడను పురుషు డెవ్వడని యడుగుట.

అథ హైనం సుకేశా భారద్వాజః పప్రచ్ఛ. భగవన్ హిరణ్యనాభః కౌసల్యో రాజపుత్రో మాముపేత్యైతం ప్రశ్నమపృచ్ఛత.

షోడశకలం భారద్వాజపురుషం వేత్థ. తమహం కుమారమబ్రువం నాహమిమం వేద. యద్యహమిమమవేదిషం కథం తేనావక్ష్యమితి. సమూలో వా ఏష పరిశుష్యతి యోఽనృతమభివదతి తస్మాన్నార్హా మ్యనృతం వక్తుమ్. స తూష్ణీం రథమారుహ్య ప్రవవ్రాజ. తం త్వా పృచ్ఛామి క్వాసౌ పురుష ఇతి. 1

భరద్వాజ పుత్రుడగు సుకేశు డనువాడు ఇట్లు ప్రశ్నించెను— భగవన్! కోసలరాజ పుత్రుడగు హిరణ్యనాభుడు నా వద్దకు వచ్చి ఓ భారద్వాజా! షోడశ (16) కళలు గల భాగములుగా గల (అంశ ములుగా గల) పురుషు డెవ రనునది నీకు తెలియునా? యని యడి గెను. నాకది తెలియదనియు తెలిసి యుండిన తప్పక నీకు చెప్పి యుండెడి వాడను గదా. అబద్ధ మాడువాడు పూర్ణ నాశమునకు గురి యగును గదా. కావుననే నేను అసత్య మాడనని బదులు చెప్పెను. ఇట్లు విని అతడు మౌనముగా రథము నెక్కి వెడలి పోయెను. ఆ ప్రశ్ననే నేను నిన్ను ఇప్పు డడుగుచున్నాను. ఆ పురుషు డెచ్చట నున్నాడు?

అవ: అతడు శరీరస్థుడై యే యున్నాడని తెలుపుట.

తస్మై స హోవాచ ఇహైవాంతః శరీరే సోమ్య స పురుషో యస్మిన్నేతాః షోడశ కలాః ప్రభవంతీతి. 2

పిప్పలాదఋషి—ఎవనియందు ఈ 16కళలు ఉత్పన్న మగునో ఆ పురుషుడు ఈ శరీరానువర్తియై యున్నాడు.

ఈక్షణ పూర్వకమగు సృష్టిక్రమము

స ఈక్షాం చక్రే. కస్మిన్నహముత్క్రాంత ఉత్క్రాంతో భవిష్యామి కస్మిన్ వా ప్రతిష్ఠితే ప్రతిష్ఠాస్యామీతి. 3

ఆ పురుషుడు విచారించిన దేమనిన, ఏదీ శరీరము విడిచి వెళ్ళిన నేను వెడలవలసి వచ్చును? ఎవడు ప్రతిష్ఠితుడై యున్న నేను ప్రతి ష్ఠితుడ నయ్యెదను?

స ప్రాణ మసృజత ప్రాణాచ్ఛ్రద్ధాం ఖం వాయుర్జ్యోతిరాపః

పృథివీంద్రియం మనః. అన్నమన్నాద్వీర్యం తపో మంత్రాః కర్మ లోకా లోకేషు చ నామ చ. 4

అతడు ప్రాణమును సృజించెను. ప్రాణమునుండి శ్రద్ధను పంచ భూతములను మానసేంద్రియములను అన్నమును అన్నమునుండి వీర్య మును తపస్సును మంత్రమును కర్మను లోకములను లోకమునందలి పదార్థములను ఆయా నామములను సృజించెను.

అవ: ఈ సమస్తము పురుషాశ్రయమున నున్నదని ఉదాహరణ ముచే తెలుపుట.

స యథేమా నద్యః స్యందమానాః సముద్రాయణాః సముద్రం ప్రాప్యాస్తం గచ్ఛంతి భిద్యేతే తాసాం నామరూపే సముద్ర ఇత్యేవం ప్రోచ్యతే. ఏవమేవాస్య పరిద్రష్టురిమాః షోడశకలాః పురుషాయణాః పురుషం ప్రాప్యాస్తం గచ్ఛంతి భిద్యేతే చాసాం నామరూపే పురుష ఇత్యేవం ప్రోచ్యతే స ఏషోఽకలోఽమృతో భవతి తదేషశ్లోకః. 5

ఎట్లు సముద్రాభిముఖమై ప్రవహించు నదులన్నియు సముద్ర మును చేరి తమ నామరూపములను వీడి తద్రూపము లగునో ఇట్లు తత్వమును తెలిసిన వాని దృష్టిచే చూడ పురుషాభిముఖమై జరుగు ఈ 16 కళలు పురుషుని గూడి అతనియందు లయ మగును. అప్పుడే నామరూపము లనునవి లేక కేవల పురుషుడని మాత్రము చెప్పబడును. ఆ పురుషుడు కళారహితుడు అనగా విభాగ రహితుడు. (అఖండుడు) అమృతుడు. ఈ విషయమునందు ఈ దిగువ కనబడు మంత్రము గలదు.

మరణ దుఃఖ నివారణాత్మకమైన బ్రహ్మజ్ఞానము

అరా ఇవ రథనాభౌ కళా యస్మిన్ ప్రతిష్ఠితాః,
తం వేద్యం పురుషం వేద యథా మావో మృత్యుః పరివ్యథా ఇతి. 6

రథచక్ర కుంభమునందు ఆకుల వలె ఎవనియందు కళలు ప్రతి ష్ఠితములై యున్నవో తెలియుటకు యోగ్యమగు ఆ పరమ పురుషుని తెలియుడి! జ్ఞానానంతర మీ మృత్యువు బాధించదు. పురుషుడు అమృత స్వరూపు డనియే అర్థము.

తాఁ హోవాచైతావదేవాహమేతత్పరం బ్రహ్మ వేద. నాతః పరమస్తీతి. 7

వారందఱిని గుఱించి పిప్పలాద ఋషి అయ్యా! పరబ్రహ్మమును గుఱించి నా కింతవఱకే తెలియును. దీనికి భిన్నమైన మఱేమియు లేదనెను.

తే తమర్చయంతస్త్వం హి నః పితా యోఽస్మాక మవిద్యాయాః పరం పారం తారయసీతి. నమః పరమఋషిభ్యో నమః పరమఋషిభ్యః 8

ఆ ఋషిని పూజించుచు శిష్యు లిట్లనిరి. నీవు మా యందఱికి తండ్రివి. మమ్ము అజ్ఞానోత్తారణ మొనర్చినాడవు. ధన్యులము. ఋషి పుంగవులకు నమస్కారము. ఋషిశ్రేష్ఠులకు నమస్కారము.

ఓం భద్రం కర్ణేభి రితి శాంతిః

ప్రశ్నోపనిషత్తు సమాప్తము

ఓం తత్ సత్.

---

# ౫. ముండకోపనిషత్తు

ఓం భద్రం కర్ణేభిః శృణుయామ దేవాః. భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః. స్థిరై రంగైస్తుష్టువాగ్ంసస్తనూభిః. వ్యశేమ దేవహితం యదాయుః. స్వస్తి న ఇంద్రో వృద్ధశ్రవాః. స్వస్తి నః పూషా విశ్వవేదాః. స్వస్తి నస్తార్క్ష్యో అరిష్టనేమిః. స్వస్తినో బృహస్పతిర్దధాతు.

ఓం శాంతిః శాంతిః శాంతిః

ఓ దేవతలారా! మా చెవు లెల్లప్పుడు మంగళ మయమగు మాటలనే వినుగాక! పూజ్యులగు ఓ దేవతలారా! మా నేత్రము లఖండమగు శుభమునే చూచుగాక! బలోపేతమగు శరీరేంద్రియములు గలిగి ఆయుస్సంతయు ఈశస్మరణచే (స్తోత్రముచే) గడచు గాత! శ్రేష్ఠుడగు జ్ఞాని యైన ఇంద్రుడు మాకు శుభ మొసగుగాత! సర్వ

ద్రష్ట యగు సూర్యుడు మమ్మనుగ్రహించుగాత! సర్వారిష్ట నాశకు డగు గరుడుడు మమ్ము కృపాదృష్టి జూచుగాత! దయామయుడగు బృహస్పతి మమ్ముల బ్రోచుగాత!

ఓం శాంతిః శాంతిః శాంతిః

## 1–వ ముండకము — 1–వ ఖండము

### గురుపరంపర

ఓం బ్రహ్మా దేవానాం ప్రథమః సంబభూవ విశ్వస్య కర్తా భువనస్య గోప్తా. స బ్రహ్మవిద్యాం సర్వ విద్యాప్రతిష్ఠా మథర్వాయ జ్యేష్ఠపుత్రాయ ప్రాహ. 1

బ్రహ్మదేవుడు ఇంద్రాది దేవతలకంటె మొట్టమొదట పుట్టెను. అతడు విశ్వకర్త. అతడే లోకరక్షకుడు. అన్ని విద్యల కాధారభూత మగు బ్రహ్మవిద్యను తన జ్యేష్ఠపుత్రుడగు అథర్వునకు బోధించెను.

అథర్వణే యాం ప్రవదేత బ్రహ్మాఽథర్వా తాం పురోవా చాంగిరసే బ్రహ్మవిద్యామ్. స భారద్వాజాయ సత్యవహాయ ప్రాహ భారద్వాజోఽంగిరసే పరావరామ్. 2

బ్రహ్మచే బోధింపబడిన నేర్పబడిన యా బ్రహ్మవిద్యను పూర్వము అథర్వుడు అంగిరస్సు కుపదేశించెను. అంగిరస్సు భరద్వాజ కులోత్పన్నుడైన సత్యవాహునకు బోధించెను. సత్యవాహుడు ఈ పరా పర విద్యను అంగిరసునకు ఉపదేశించెను.

### శౌనకుడు గురుసాన్నిధ్యమునకు వచ్చుట

శౌనకో హవై మహాశాలోఽంగిరసం విధివదుపసన్నః పప్రచ్ఛ కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతీతి. 3

ఒకప్పుడు గొప్ప గృహస్థాశ్రమి యగు శౌనకుడు అంగిరసుని కడకు శిష్యుడై వెళ్ళి ప్రశ్నచేసెను. ఓ భగవంతుడా! దేనిని తెలిసి కొనుటవలన సమస్తమును తెలిసి కొనినట్లగునో అట్టి జ్ఞానమును బోధింపుము.

అవ : విద్య రెండు ప్రకారములని గురుడగు అంగిరస్సుఋషి తెలుపుట.

తస్మై స హోవాచ ద్వే విద్యే వేదితవ్యే ఇతి హస్మ యద్బ్రహ్మవిదో వదంతి పరా చైవాపరా చ. 4

అంగిరస్సు ఇట్లు చెప్పెను—నీవు దెలియ వలసిన విద్యలు రెండు గలవు. వాటినే బ్రహ్మజ్ఞానులు పరా యనియు అపరా యనియు చెప్పుదురు.

తత్రాపరా ఋగ్వేదో యజుర్వేదః సామవేదోఽథర్వవేదః శిక్షా కల్పో వ్యాకరణం నిరుక్తం ఛందో జ్యోతిషమితి. అథ పరా యయా తదక్షర మధి గమ్యతే. 5

వాటియందు అపరా యనునది ఋగ్యజుస్సామాథర్వణ వేదములు, శిక్షా, కల్ప, వ్యాకరణ, నిరుక్త, చ్ఛందస్సులు, మఱియు జ్యోతిషము అను వీటిచే కూడి యున్నది. ఇక ఏ విద్యచే నాశ రహితమైన అక్షరమగు ఆత్మను తెలియవచ్చునో అదే పరావిద్య.

పరా (నిర్గుణబ్రహ్మ) విద్యయొక్క ప్రబోధ

యత్తదద్రేశ్య మగ్రాహ్య మగోత్ర మవర్ణ మచక్షుఃశ్రోత్రం తదపాణిపాదమ్. నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం తదవ్యయం యద్భూతయోనిం పరిపశ్యంతి ధీరాః. 6

ఆత్మతత్త్వము చూచుటకు గాని పట్టుకొనుటకు గాని రానిది. సంబంధము లేనిది. వన్నె చిన్నెలు గాని కళ్ళు చెవులు గాని చేతులు కాళ్ళు గాని లేనిది. నిత్యము. సర్వవ్యాపకము. సర్వగతము. అత్యంత సూక్ష్మము. అవ్యయము. సర్వ భూతముల ఉత్పత్తిస్థానము. తెలిసిన తత్త్వజ్ఞానులు సర్వత్ర దీనినే చూచెదరు.

యథోర్ణనాభిః సృజతే గృహ్ణతే చ
యథా పృథివ్యా మోషధయః సంభవంతి.
యథా సతః పురుషాత్కేశలోమాని
తథాఽక్షరాత్సంభవతీహ విశ్వమ్. 7

సాలెపురుగు తన శరీరమునుండి దారమును విడిచి మరల దానిని తనలోనికి దీసికొనుభంగి, భూమియందు వనస్పతులు పుట్టు

తెరగునను శరీరముపై రోమములు వచ్చు పగిదిని విశ్వ మెల్ల ఆ అక్షరమునుండియే పుట్టును.

అవ: బ్రహ్మమునకు ప్రపంచమును సృష్టి చేయవలె ననెడి ఇచ్ఛ కలిగెను. నిర్గుణ బ్రహ్మము సగుణ బ్రహ్మమాయెనని సృష్టిక్రమమును దెలుపుచున్నారు.

తపసా చీయతే బ్రహ్మ తతోఽన్నమభిజాయతే,
అన్నాత్ప్రాణో మనః సత్యం లోకాః కర్మసు చామృతమ్. 8

తపస్సుచే బ్రహ్మ విస్తృత మాయెను. (వివర్త మొందెను). అతనినుండి అన్నము ఉత్పన్న మాయెను. ఆ యన్నమునుండి ముందు ప్రాణము మనస్సు, సత్యము, లోకములు, ఆయా లోకములకు దగిన కర్మలు, వానినుండి స్వర్గాది ఫల రూపమైన అమృతమును కలిగెను.

యః సర్వజ్ఞః సర్వవిద్యస్య జ్ఞానమయం తపః,
తస్మాదేతద్బ్రహ్మ నామ రూపమన్నం చ జాయతే. 9

ఇతి ప్రథమః ఖండః

ఎవడు సర్వజ్ఞుడో సమస్తమును తెలియువాడో అతని ఆ (యక్షరాత్మ) యొక్క తపస్సు జ్ఞానమయము. వానిచే ఈ బ్రహ్మ దేవుని ఉత్పత్తి, అతనినుండి నామరూపములు, వ్రీహియవాది రూపము అగు అన్నము ఇత్యాదులు కలిగెను.

ఇది ప్రథమ ఖండము

—o—

## 1-వ ముండకము—2-వ ఖండము

### కర్మస్వరూప నిర్ణయము

తదేతత్సత్యం మంత్రేషు కర్మాణి కవయో యాన్యపశ్యంస్తాని త్రేతాయాం బహుధా సంతతాని. తాన్యాచరథ నియతం సత్యకామా ఏష వః పన్థాః సుకృతస్య లోకే. 1

అది సత్యమైనది. వేద మంత్రములయందు సర్వజ్ఞులగు కవులు మహర్షులు కనుగొన్న అగ్నిహోత్రాది కర్మలు త్రేతాయుగమునందు

నానావిధములచే విస్తృత మొందెను. సత్యమును తెలియ నపేక్షచే మీరాకర్మలను నిత్యమాచరించుడి! ఇదే ఈలోకమున ధర్మమార్గము.

అగ్నిహోత్రమును గుఱించి-

యదా లేలాయతే హ్యర్చిః సమిద్ధే హవ్యవాహనే,
తదాజ్యభాగావంతరేణాహుతీః ప్రతిపాదయేచ్ఛ్రద్ధయా హుతమ్. 2

యజ్ఞకుండమునందు అగ్ని చక్కగా వెలిగి దాని జ్వాలలు సంచలింప నారంభించినప్పుడు రెండు ఘృతాహుతుల మధ్య శ్రద్ధాయుక్తుడై నీవు నియతమగు ఆహుతి నియ్యవలయును. జ్వలింప జేయ బడిన అగ్ని శిఖలతో వెలుఁగొందు నపుడు విధ్యుక్తమగు హోమము చేయవలయునని ఇందలి భావము.

విధిహీన మగు కర్మకు అయోగ్యఫలము

యస్యాగ్నిహోత్ర మదర్శ మపౌర్ణమాస
మచాతుర్మాస్య మనాగ్రయణ మతిథివర్జితం చ,
అహుత మవైశ్వదేవ మవిధినా హుత
మాసప్తమాంస్తస్య లోకాన్ హినస్తి. 3

ఏ అగ్నిహోత్రి అమావాస్య, పూర్ణిమ, చాతుర్మాస్యములందు ఇవ్వవలసిన ఆహుతులను ఇచ్చుట లేదో, వత్సరారంభ ఫలాహుతి నివ్వడో ఎవని అగ్నిహోత్ర వ్రతాహుతి అతిథి వైశ్వదేవ వర్జితమో, ఎవడు విధి విరుద్ధముగా ఆహుతి నొసగునో, అతడు సప్తవిధ స్వర్గములనుండియు దూరు డగును. భూలోకము మొదలు సత్యలోకమువఱకు గల ఈ ఏడు లోకములును అతడు పోగొట్టుకొనువాడగును.

అగ్నిహోత్రుని సప్తజిహ్వలు

కాలీ కరాలీ చ మనోజవా చ
సులోహితా యా చ సుధూమ్రవర్ణా,
స్ఫులింగినీ విశ్వరుచీ చ దేవీ
లేలాయమానా ఇతి సప్తజిహ్వాః. 4

నలుపైనది కాళి, భయానక మగునది కరాళి, మనస్సువలె చాపల్యముగలది మనోజవ, రక్తవర్ణము గలది సులోహిత, పొగవన్నె

గలది సుధూమ్రవర్ణ, నిప్పురవ్వలు గ్రక్కునది స్ఫులింగిని, సుందర రూపియగునది విశ్వరుచి. ఇవి అగ్ని దేవతయొక్క ఏడు నాలుకలు.

అవ: విధ్యుక్తముగ చేయబడు అగ్నిహోత్రాది కర్మలకు ఫలము స్వర్గము.

ఏతేషు యశ్చరతే భ్రాజమానేషు
యథాకాలం చాహుతయో హ్యాదదాయన్,
తం నయంత్యేతాః సూర్యస్య రశ్మయో
యత్ర దేవానాం పతిరేకోఽధివాసః. 5

అగ్నిజ్వాలలిట్లు వెలుగునపుడు యథా సమయమున ఆహుతులను సమర్పించు పురుషుని, ఆ జ్వాలలు సూర్యకిరణములై ఆ యజమానుని గ్రహించి దేవేంద్రుడుండు స్వర్గలోకమును జేర్చును.

ఏహ్యేహీతి తమాహుతయః సువర్చసః
సూర్యస్య రశ్మిభిర్యజమానం వహంతి,
ప్రియాం వాచమభివదంత్యోఽర్చయంత్య
ఏష వః పుణ్యః సుకృతో బ్రహ్మలోకః. 6

రా రండి! యని సంబోధించుచు ఈ యజమానుని ఆహుతులు మెఱయుచు సూర్యకిరణములతో గూడి పిలుచుకొని పోవును. ప్రియ వచనములచే ఆదరించుచు నీ సుకృత విశేషమైన పూర్ణ పుణ్యఫలమగు స్వర్గలోక మిదియే నని ఆ యజమానునకు చెప్పును.

జ్ఞాన హీనమైన కర్మ అయోగ్య మైనది.

ప్లవా హ్యేతే అదృఢా యజ్ఞరూపా
అష్టాదశోక్తమవరం యేషు కర్మ,
ఏతచ్ఛ్రేయో యేఽభినందంతి మూఢా
జరామృత్యుం తే పునరేవాపి యంతి. 7

పదునెనమంద్రచే అనగా 16గురు ఋత్విక్కులు, యజమానుడు మఱియు నతని పత్ని. ఇట్లు పదునెనమంద్రు చేరి చేయబడు యాగము (జ్ఞానమునకంటె) అవరము (నికృష్టమనబడును.) ఈ యజ్ఞరూపములగు ఓటి కుండలవంటి ఈ సాధనములు దుర్బలము లైనవి.

కావున యజ్ఞములే అత్యంత శ్రేష్ఠములని ఉప్పొంగి ఆనందించు మూఢులు సారెసారెకు జనన మరణములను బొందుదురు.

అవిద్యామధ్యమునుండి మాటలాడు కర్మఠుల దుర్గతి

అవిద్యాయామంతరే వర్తమానాః
స్వయం ధీరాః పండితం మన్యమానాః,
జంఘన్యమానాః పరియంతి మూఢా
అంధేనైవ నీయమానా యథాంధాః. 8

అవిద్యయొక్క మధ్య మునిగి యుండియు తమ్ము తాము పండితులమని ధీరులమని తలంచుకొను మూఢులు గ్రుడ్డివాని ననుసరించి పోవు గ్రుడ్డివానివలె తొట్రుపాటొంది పడుచు లేచుచు జనన మరణ చక్రమున దిరుగుచుందురు.

అవిద్యాయాం బహుధా వర్తమానా
వయం కృతార్థా ఇత్యభిమన్యంతి బాలాః,
యత్కర్మిణో న ప్రవేదయంతి రాగా
త్తేనాతురాః క్షీణలోకాశ్చ్యవంతే. 9

అనేక విధములచే నానాజన్మ లొందుచు గాఢమగు అజ్ఞానమునం దుండినను బాల బుద్ధి గలవారై తమ్ముతాము కృతార్థుల మని తెలియుదురు. కర్మఫలాసక్తు లగు వీరు కర్మలచే మోహితులై అందలి మక్కువ వలన సత్యమును దెలియక దుఃఖితాత్ము లగుదురు. సత్వరమున పుణ్యము తీరి స్వర్గమునుండి చ్యుతు లయ్యెదరు.

ఇష్టాపూర్తం మన్యమానా వరిష్ఠం
నాన్యచ్ఛ్రేయో వేదయంతే ప్రమూఢాః,
నాకస్య పృష్ఠే తే సుకృతేఽనుభూత్వా
ఇమం లోకం హీనతరం వా విశంతి. 10

ఇష్టాపూర్త కర్మలు అనగా శ్రౌతస్మార్త కర్మలే పరమశ్రేయో దాయకము లని ఎంచి వీటికంటె అన్యమింకేమియు లేదని తెలియువారై విశేషమగు పిచ్చిచే స్వర్గమునందు తమ పుణ్యఫలము ననుభవించి ఈ లోకమును, లేక దీనికంటెను నీచమగు లోకమును మరల

ప్రవేశింతురు. (శ్రౌతకర్మ లనగా అగ్నిహోత్రము, వేదాధ్యయనము, అతిథిపూజ, వైశ్వదేవము మొదలగునవి. వీటినే ఇష్టమనియు అందురు. ఇక స్మార్తకర్మ యనగా వాపీకూప తటాక దేవాలయ నిర్మాణాదులు. ఈ కర్మలే పూర్తమనియు చెప్పబడును.

తపః శ్రద్ధే యే హ్యుపవసంత్యరణ్యే
శాంతా విద్వాంసో భైక్ష్యచర్యాం చరంతః,
సూర్యద్వారేణ తే విరజాః ప్రయాంతి
యత్రామృతః స పురుషో హ్యవ్యయాత్మా. 11

అయితే ఏ విద్వాంసులు శ్రద్ధాయుక్తులై, తపసంతన్నులై, భిక్షాటన పరులై (అనగా సన్న్యాసులు) శాంత చిత్తమున అరణ్యమునం దుండుచున్నారో వారు అవ్యయమును అమృతమునగు పరమ పురుషుని, అర్చిరాది మార్గమున రజోవిరహితులై పొందుదురు. అద్వైతానుభవ జ్ఞానమే భిక్షయని భావము.

అవ : ఐహికాముష్మిక సుఖముల యసారత నెఱిగి మోక్షము నపేక్షించి గురుసన్నిధికి వచ్చు సచ్ఛిష్యుని లక్షణము.

పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో
నిర్వేదమాయాన్నాస్త్యకృతః కృతేన,
తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛే
త్సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్. 12

కర్మమార్గమునుండి లబ్ధమగు లోకములను పరీక్షించి విచారించి వాటి అనిత్యతను దెలిసి తత్వవిదుడు ఆ లోకముల విషయమునందు విరక్తు డగును. అపేక్షింపనివా డగును. ఎందుకనగా స్వయంసిద్ధమగు పరమాత్మ కర్మమార్గమున అలభ్యుడని అతడు తెలిసి యున్నాడు. అందుచే బ్రహ్మజ్ఞానార్థమై (జిజ్ఞాసువు) చేతియందు సమిధలను బట్టుకొని శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుడగు గురుని సన్నిధికి వెళ్ళవలయును. తాత్పర్య మేమన, ఈ నామనోవాక్కాయములు చేతియందున్న కట్టెల వలె జడములై యున్నవి. నీకడ బడవైచితిని. నన్ను ధన్యుని జేయుము అను నిత్యాది భావ సూచకము.

గురూపదేశము

తస్మై స విద్వానుపసన్నాయ సమ్యక్
ప్రశాంతచిత్తాయ శమాన్వితాయ,
యేనాక్షరం పురుషం వేద సత్యం
ప్రోవాచ తాం తత్త్వతో బ్రహ్మవిద్యామ్. 13

శమదమాదులచే శాంతచిత్తుడై తన వద్దకు వచ్చిన శిష్యునకు తత్త్వవిదుడగు బ్రహ్మనిష్ఠుడు ఏ బ్రహ్మవిద్యచే సత్యమును అక్షరము నగు పరమ పురుషుని యథార్థ జ్ఞాన మగునో అట్టి పూర్ణవిద్య నతడు (గురువు) బోధించును.

ఇది ప్రథమ ముండకము

---

2–వ ముండకము–1–వ ఖండము

అవ: అగ్నియందు విస్ఫులింగములవలె పరబ్రహ్మమునుండి జగదుత్పత్తి యని దెలుపుట.

తదేతత్సత్యం యథా సుదీప్తాత్పావకాద్విస్ఫులింగాః
సహస్రశః ప్రభవంతే సరూపాః,
తథాఽక్షరాద్వివిధాః సోమ్యభావాః
ప్రజాయంతే తత్రచైవాపి యంతి. 1

ఆ బ్రహ్మము సత్యము. చక్కగా ప్రజ్వలించుచున్న అగ్నినుండి వేలాది విస్ఫులింగములు (నిప్పుకణములు) వెలువడునట్లు అక్షయమగు బ్రహ్మమునుండి వివిధ వస్తువులు పుట్టి అచ్చటనే లయమొందును.

పారమార్థికమగు పరబ్రహ్మస్వరూపము

దివ్యో హ్యమూర్తః పురుషః స బాహ్యాభ్యంతరో హ్యజః,
అప్రాణో హ్యమనాః శుభ్రో హ్యక్షరాత్పరతః పరః. 2

ఆ పరమ పురుషుడు దివ్యుడు. అనాదియు రూప రహితుడు. మఱియు అంతర్బాహ్యములను భేదము లేక మనఃప్రాణముల కావల

నున్నాడు. అతడత్యంత శుద్ధుడు, నిర్మలుడు, శ్రేష్ఠుడు. అక్షరము కంటెను వరిష్ఠమగు బ్రహ్మము.

సర్వకారణము బ్రహ్మమేనని తెలుపుట

ఏతస్మాజ్జాయతే ప్రాణో మనః సర్వేంద్రియాణి చ,
ఖం వాయుర్జ్యోతిరాపః పృథివీ విశ్వస్య ధారిణీ. 3

మనఃప్రాణేంద్రియము లతనినుండి పుట్టును. జలము, అగ్ని, వాయువు, ఆకాశము, విశ్వాధారమగు పృథివి ఈ సర్వముయొక్క ఉత్పత్తి వానినుండియే.

అవ : పరబ్రహ్మతత్త్వమే విశ్వరూపమున సర్వభూతాంతరాత్మమై యున్నది.

అగ్నిర్మూర్ధా చక్షుషీ చంద్రసూర్యౌ
దిశః శ్రోత్రే వాగ్వివృతాశ్చ వేదాః,
వాయుః ప్రాణో హృదయం విశ్వమస్య
పద్భ్యాం పృథివీ హ్యేష సర్వభూతాంతరాత్మా. 4

అగ్ని అతని శిరస్సు, చంద్రసూర్యులు నేత్రములు. దిక్కులు చెవులు. వాక్కులు వేదములు. వాయువు అతని ప్రాణము. (సమస్త) విశ్వము అతని హృదయము. పృథివి అతని పాదములు. అతడే సర్వభూతాంతరాత్మ.

ఈ సమస్తము ఆ అక్షర పురుషునిచే అయిన సృష్టియే

తస్మాదగ్నిః సమిధో యస్య సూర్యః
సోమాత్పర్జన్య ఓషధయః పృథివ్యామ్,
పుమాన్ రేతః సించతి యోషితాయాం
బహ్వీః ప్రజాః పురుషాత్ సంప్రసూతాః. 5

అతనినుండి అగ్ని వెలుగును. ఆ అగ్నికి సమిధ సూర్యుడు. ద్యులోకాగ్నినుండి చంద్రుడు కలిగెను. చంద్రునినుండి పర్జన్యుడు (మేఘుము), పర్జన్యునివలన భూమియందుండి సమస్త ఓషధులు కలిగెను. ఓషధులవలన రేతస్సు, ఆ రేతస్సువలన సమస్త ప్రజలును పుట్టిరి.

తస్మాదృచః సామ యజూంషి దీక్షా
యజ్ఞాశ్చ సర్వే క్రతవో దక్షిణాశ్చ,
సంవత్సరశ్చ యజమానశ్చ లోకాః
సోమో యత్ర పవతే యత్ర సూర్యః. 6

ఋగ్యజుస్సామ వేదములు, అగ్నిహోత్రాది దీక్ష, దక్షిణలు, యజ్ఞము, క్రతువులు, సంవత్సరము, యజమానుడు, లోకములు, చంద్రసూర్యులు, పవిత్రమొనర్చు అన్నిస్థలములు అతనినుండియే ప్రకట మయ్యెను.

తస్మాచ్చ దేవా బహుధా సంప్రసూతాః
సాధ్యా మనుష్యాః పశవో వయాంసి,
ప్రాణాపానౌ వ్రీహియవౌ తపశ్చ
శ్రద్ధా సత్యం బ్రహ్మచర్యం విధిశ్చ. 7

ఆ బ్రహ్మమునుండియే నానా దేవతలు, సిద్ధ సాధ్యులు, మనుష్యులు, పశుపక్షులు, ప్రాణాపానములు, వ్రీహి యవాదులు, (వడ్లు, గోధుమలు), తపస్సు, శ్రద్ధ, సత్యము, బ్రహ్మచర్యము ఇత్యాదుల ఉత్పత్తి యని తెలియ వలయును.

సప్త ప్రాణాః ప్రభవంతి తస్మాత్
సప్తార్చిషః సమిధః సప్తహోమాః,
సప్త ఇమే లోకా యేషు చరంతి ప్రాణా
గుహాశయా నిహితాః సప్త సప్త. 8

సప్తప్రాణములు, చెవులు, కన్నులు, నాసికా (ముక్కు) పుటములు, నోరు, అగ్నియొక్క ఏడు నాలుకలు, సప్త విధములగు సమిధలు, అనగా విషయములు, సప్త హోమములు అనగా విషయ జ్ఞానములు, హృదయమునందుండు ప్రాణములు, సంచరించు ఏడు లోకములు ఇట్లు ఏడు ఏడుగా చెప్పబడిన ఈ సమస్తము వానినుండియే కలిగి యున్నవి.

అతః సముద్రా గిరయశ్చ సర్వే
ఽస్మాత్స్యందంతే సింధవః సర్వరూపాః,
అతశ్చ సర్వా ఓషధయో రసశ్చ
యేనైష భూతైస్తిష్ఠతే హ్యంతరాత్మా. 9

సర్వ సముద్రములును, ఎల్ల పర్వతములును వీనినుండియే కలుగుచున్నవి. అన్నివిధములగు నదులు ఇతనినుండియే ప్రవహించుచున్నవి. సర్వ ఓషధులు, రసములు ఇతని నుండియే కలుగును. ఏ ఆనందము మూలమున అంతరాత్మ అనగా జీవాత్మ ఈ భూత సంఘాతముతో గూడి వసించునో ఆ యానందమూలము నిరజ (బ్రహ్మమే) యని తెలియవలెను.

పురుష ఏవేదగ్ం విశ్వం కర్మ తపో బ్రహ్మ పరామృతమ్,
ఏతద్యో వేద నిహితం గుహాయాం
సోఽవిద్యాగ్రంథిం వికిరతీహ సోమ్య. 10

ఈ విశ్వమంతయు ఆ పరమ పురుషుడే. కర్మ, తపస్సు, బ్రహ్మము మఱియు శ్రేష్ఠమైన అమృతత్వము ఇతడే. ఓ సౌమ్యా! అట్టి పరమాత్మయే మానవుని అంతఃకరణమునందు అనగా హృదయమునందున్నాడు. ఈ సత్యము నెఱిగినవాడు ఇదే జన్మయందే విముక్తుడగును.

---

## 2-వ ముండకము - 2-వ ఖండము

### బ్రహ్మనిర్దేశ పూర్వకమైన జ్ఞానోపదేశము

ఆవిః సన్నిహితం గుహాచరం నామ మహత్పద మత్రైత త్సమర్పితమ్, ఏజత్ప్రాణన్నిమిషచ్చ యదేతజ్జానథ సదసద్వరేణ్యం పరం విజ్ఞానాద్యద్వరిష్ఠం ప్రజానామ్. 1

హృదయ గుహాయందు చక్షుఃశ్రోత్రాది ఇంద్రియ వృత్తులచే అభివ్యక్తమగుచు సంచరించు వ్యక్తావ్యక్త స్వరూపమైన బ్రహ్మమే సర్వమునకు మహాధారము. సంచరించు (ఉచ్ఛ్వాస నిశ్వాస మొనర్చు) దృష్టిగల సమస్త భూతములు ఆ వస్తువునందే వసించుచున్నది. ఇదే సత్తు మఱియు అసత్తు. ఇదే శ్రేష్ఠము. సర్వ ప్రజల విజ్ఞానము నతిక్రమించి శ్రేష్ఠమై పరమోత్కృష్టమై యున్నది. ఇట్టి తత్త్వమును తెలిసికొనుడి.

### బ్రహ్మమునందు మనస్సు నుంచు విధానము

యదర్చిమద్యదణుభ్యోఽణు చ యస్మింల్లోకా నిహితా లోకి నశ్చ, తదేతదక్షరం బ్రహ్మ స ప్రాణ స్తదు వాఙ్మనః తదేత త్సత్యం తదమృతం తద్వేద్ధవ్యం సోమ్య విద్ధి. 2

ఏది అన్నిటికంటెను తేజస్సంపన్నమో, అణువుకంటెను అణువై యున్నదో, సర్వలోకములును ఈలోకములోనున్న ప్రజలును దేనియందు స్థిరముగ నున్నారో అదియే అక్షరమగు పరబ్రహ్మము. అదే ప్రాణము. అదే మనస్సు, వాక్కు, సత్యము, అమృతమునై యున్నది. ఓశిష్యుడా! తెలియదగిన ఈ వస్తుతత్త్వమును తెలియుము.

ధనుర్గృహీత్వౌపనిషదం మహాస్త్రం
శరం హ్యుపాసానిశితం సంధయీత,
ఆయమ్య తద్భావగతేన చేతసా
లక్ష్యం తదేవాక్షరం సోమ్య విద్ధి. 3

దివ్యాస్త్రమగు ఉపనిషత్తను ధనుస్సును ఎత్తి, ఉపాసన యనెడి వాడియైన బాణమును సంధించి, చిత్తమును పరమాత్మయం దేకము జేసి, ఆయక్షరమునే గుఱిగా జేసికొని నీ బాణమును విడువుము. (అనగా) అక్షరమగు పరమాత్మ నీ స్వరూపమై యున్నదని అభేదము నొందుము.

### ధనుస్సను రూపకాలంకారముచే గుఱిని బోధించుట

ప్రణవో ధనుః శరో హ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్య ముచ్యతే,
అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్తన్మయో భవేత్. 4

ప్రణవమే ధనుస్సు. నీ ఆత్మయే అనగా జీవుడే బాణము. బ్రహ్మమే గుఱి. చిత్తైకాగ్రతచే లక్ష్య భూతమైన పరమాత్మను భేదింప వలయును. బాణమువలె ఆత్మ తన్మయత్వము నొంద వలయును.

### ఆత్మ సాక్షాత్కారవిషయము

యస్మిన్ ద్యౌః పృథివీ చాంతరిక్ష
మోతం మనః సహ ప్రాణైశ్చ సర్వైః,

తమేవైకం జానథ ఆత్మాన
మన్యా వాచో విముంచథామృతస్యైష సేతుః. 5

ఎవనియందు స్వర్గము, పృథివి, అంతరిక్షము, ప్రాణములతో సహ మనస్సు స్థితి నొంది యున్నవో ఏకమగు నా యాత్మనే ఎఱుగుము. ఇతరమగు మాటలను విడిచిపెట్టుము. ఎందుకనగా ఇదే అమృతపదమునొందు మార్గము; లేక సేతువు.

ప్రణవోపాసనాపూర్వకమైన బ్రహ్మానుచింతనము

అరా ఇవ రథనాభౌ సంహతా యత్ర నాడ్యః
స ఏషోఽంతశ్చరతే బహుధా జాయమానః,
ఓమిత్యేవం ధ్యాయథ ఆత్మానం
స్వస్తి వః పారాయ తమసః పరస్తాత్. 6

రథచక్ర కుంభమునందు కూర్పబడిన ఆకులు ఒకచోటైన రీతి శరీరముయొక్క సమస్త నాడులు ఎచ్చట ఒక్కటి యగునో అచ్చట ఈ ఆత్మ సంచరించును. మఱియు నానా రూపములచే వ్యక్తమగును. జీవునికంటె వేఱు గాని ఈ యాత్మను "ఓమ్" అని ధ్యానించుడు. అదే మిమ్ము తమస్సునకవ్వల తీసికొని వెళ్ళును. అజ్ఞాన నివృత్తిరూప పరమ శుభము మీకు కలుగజేయును.

అపరబ్రహ్మవర్ణన—తచ్చింతన విధానము

యః సర్వజ్ఞః సర్వవిద్యస్యైష మహిమా భువి,
దివ్యే బ్రహ్మపురే హ్యేష వ్యోమ్న్యాత్మా ప్రతిష్ఠితః
మనోమయః ప్రాణశరీరనేతా
ప్రతిష్ఠితోఽన్నే హృదయం సన్నిధాయ,
తద్విజ్ఞానేన పరిపశ్యంతి ధీరా
ఆనందరూపమమృతం యద్విభాతి. 7

ఎవడు సర్వజ్ఞుడో సర్వమును దెలియువాడో అతని మహిమయే ఈ పృథివియందు దగపడుచున్నది. అన్నమునందు అనగా అన్నమయ శరీరమునందు హృదయమును స్థాపించి తాను మనోమయుడై ప్రాణ శరీరములను నియమించుచు హృదయమున నిలిచి

యున్నాడు. ఆనంద రూపమున అమృతమయుడై బ్రకాశించు ఈ యాత్మను జ్ఞానులు సర్వత్ర గాంతురు.

బ్రహ్మసాక్షాత్కారఫలము

భిద్యతే హృదయగ్రంథిశ్ఛిద్యంతే సర్వసంశయాః,
క్షీయంతేచాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే. 8

ఇట్లు పరావర బ్రహ్మజ్ఞాన మైన యెడల (అనుభవ మైనచో) జ్ఞానియొక్క అంతఃకరణమునందలి గ్రంథులు ముళ్ళు (బంధములు) వీడి సర్వసంశయములు పరిహారింపబడి కర్మక్షయ మొందును. అనగా స్వరూపానుభవ మాత్రమున దేశకాలాద్యనపేక్షితముగా మనోనాశ వాసనాక్షయ తత్త్వజ్ఞానములు ఏక కాలమున గలుగునని భావము.

జ్యోతిర్మయమగు బ్రహ్మతత్త్వముయొక్క వర్ణన

హిరణ్మయే పరే కోశే విరజం బ్రహ్మ నిష్కలమ్,
తచ్ఛుభ్రం జ్యోతిషాం జ్యోతిస్తద్యదాత్మవిదో విదుః. 9

పరమ పవిత్ర మగు నిరవయవమైన బ్రహ్మవస్తువు సువర్ణమువలె తేజము గల కోశమునం దణగి యున్నది. అది. శుభ్రము. జ్యోతుల కెల్ల మహాజ్యోతియై యున్నది. దీనిని ఆత్మజ్ఞానులు తెలియుదురు. అది తమ స్వరూపమే యని అనుభవ మొందుదురు.

బ్రహ్మము సర్వప్రకాశకము

న తత్ర సూర్యో భాతి న చంద్రతారకమ్
నేమా విద్యుతో భాంతి కుతోఽయమగ్నిః,
తమేవ భాంతమనుభాతి సర్వం
తస్య భాసా సర్వమిదం విభాతి. 10

అచ్చట సూర్యుడు ప్రకాశించుటలేదు. చంద్ర నక్షత్రాదులు ప్రకాశించుట లేదు. విద్యుత్ప్రకాశమున్ను లేదు. ఇక అగ్నివిషయ మేమి చెప్పవలయును? అతడు ప్రకాశించిన పిదపనే తక్కిన సర్వ ప్రకాశములును ప్రకాశవంతము లగును. ఆ ప్రకాశముచేతనే ఈ సర్వము ప్రకాశింపబడుచున్నది.

బ్రహ్మము సర్వవ్యాపకము

బ్రహ్మైవేదమమృతం పురస్తా
ద్బ్రహ్మ పశ్చాద్బ్రహ్మ దక్షిణతశ్చోత్తరేణ,
అధశ్చోర్ధ్వం చ ప్రసృతం బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్ఠమ్. 11

ఇదందయు అమృతమగు బ్రహ్మమే. ముంగిటను వెను కను దక్షిణమున ఉత్తరమున పైభాగమున క్రింది భాగమున సర్వత్ర బ్రహ్మమే వ్యాపించి యున్నది. శ్రేష్ఠమగు నీ విశ్వము బ్రహ్మవస్తు మాత్రము గాక మఱేమియును గాదు. సర్వముయొక్క అస్తిత్వము బ్రహ్మాస్తిత్వమే. సర్వము పరబ్రహ్మమేనని తాత్పర్యము.

ఇది రెండవ ముండకము

---

3-వ ముండకము-1-వ ఖండము.

అవ: ప్రకారాంతరముగ బ్రహ్మనిరూపణము. వృక్షముపై నుండు రెండు పక్షులను నీవిషయమును చెప్పబడును.

ద్వా సుపర్ణా సయుజా సఖాయా
సమానం వృక్షం పరిషస్వజాతే,
తయోరన్యః పిప్పలం స్వాద్వ
త్త్యనశ్నన్నన్యో అభిచాకశీతి. 1

అత్యంత స్నేహముచే ఒప్పు అందమైన ఱెక్కలు గల రెండు పక్షులు ఒకే వృక్షముపై జంట గలిగి యున్నవి. ఇందు ఒకటి ఆచెట్టు యొక్క మంచి రుచియైన పండును తినును. రెండవది తాను తినక తన మిత్రుని చూచుచు కూర్చుండి యుండును.

ఈశ్వరుని సందర్శనముచే జీవునకు దుఃఖనివృత్తి యగును

సమానే వృక్షే పురుషో నిమగ్నో
నీశయా శోచతి ముహ్యమానః,
జుష్టం యదా పశ్యత్యన్యమీశమస్య
మహిమానమితి వీతశోకః. 2

పరమాత్మసహితముగ ఒకే సంసార వృక్షముపై అనగా శరీరమున నుండు జీవుడు విషయములయందు మునిగి పరవశుడై నందు వలన మోహముచే దుఃఖము ననుభవించును. కాని అతడు పూజ్యుడగు ఆ ఈశ్వరుని తన స్వరూపమగు ఆత్మయే యని తెలిసి ఇదంతయు అతని మహిమ యని ఎఱిగి దుఃఖమునుండి దూరమగునని అర్థము.

యదా పశ్యః పశ్యతే రుక్మవర్ణం
కర్తారమీశం పురుషం బ్రహ్మయోనిమ్,
తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ
నిరంజనః పరమం సామ్యముపైతి. 3

బంగారు మేని ఛాయగల, నశించని కాంతిచే నొప్పారు సర్వ జగత్కర్త యగు ఈశ్వరుని ఈ పురుషు డెప్పు డెఱుగునో అప్పుడు పుణ్య పాపములను వీడి పరమ పవిత్రుడై శ్రేష్ఠ మగు సామ్యావస్థను పొందును. ఈశ జీవుల భేదోపాధులను బాధింప (నివృత్తి పఱచగా) అభేదమగు ఆత్మ వ్యాపకమను అనుభవమున నిర్లిప్తుడై యుండునని అర్థము.

శ్రేష్ఠుడగు బ్రహ్మజ్ఞాని లక్షణము

ప్రాణో హ్యేష యః సర్వభూతైర్విభాతి
విజానన్ విద్వాన్ భవతే నాతివాదీ,
ఆత్మక్రీడ ఆత్మరతిః క్రియావా
నేష బ్రహ్మవిదాం వరిష్ఠః. 4

అన్ని భూతములయందు వెలయు ప్రాణు డితడే యని (బ్రహ్మమే నని) తెలిసిన విద్వాంసుడు అధికమగు వాదోపవాదములను, మాటలను విడిచి పెట్టును. ఆత్మరతి, ఆత్మక్రీడ నందుచు యథోచితమగు ప్రారబ్ధముచే విహరించుచు, క్రియావంతుడై యుండువాడే బ్రహ్మజ్ఞానులయందు శ్రేష్ఠుడు. ఇచ్చట క్రియావంతుడని చెప్పినందువలన జ్ఞాన కర్మ సముచ్చయ మని అర్థము కాదు. ఇతడు జ్ఞానము, ఆత్మానుసంధానము, వైరాగ్యము-వీనికి సంబంధించిన క్రియలు గలవాడనియే గ్రహింపవలయును. బ్రహ్మజ్ఞానమునకు, ప్రారబ్ధ వ్యవహారమునకు విరోధము లేదని భావము.

ఆత్మజ్ఞాన పరమ సాధనము.

సత్యేన లభ్య స్తపసా హ్యేష ఆత్మా
సమ్యక్ జ్ఞానేన బ్రహ్మచర్యేణ నిత్యమ్,
అంతఃశరీరే జ్యోతిర్మయో హి శుభ్రో
యం పశ్యంతి యతయః క్షీణదోషాః. 5

సత్యము, తపస్సు, నిత్యమగుబ్రహ్మచర్యము ఇవి ఆత్మజ్ఞాన మార్గములు. దోషములనెల్ల బోగొట్టుకొన్న యతులు (అధికారులు) జ్ఞానేచ్ఛ గలవారు నిత్య శుద్ధుడగు ఈ జ్యోతిర్మయాత్మను తమ హృదయమున జూతురు.

సత్యముయొక్క మహిమ

సత్యమేవ జయతి నానృతం
సత్యేన పంథా వితతో దేవయానః,
యేనాక్రమంత్యృషయో హ్యాప్తకామా
యత్ర తత్సత్యస్య పరమం నిధానమ్. 6

కడకు విజయము సత్యమునకేగాని అసత్యమునకు కాదు. ఈ దేవయానము సత్యమునకు స్థానమైన ఆశా విరహితులగు ఋషుల మార్గము. ఇది సత్యముచే నిర్మింపడి యున్నది. సర్వ కామములను వీడిన ఋషులు ఈ మార్గము ననుసరించి సత్యముయొక్క పరమ నిధానమైన మోక్షమను శ్రేష్ఠపదము నొందుదురు.

మోక్ష స్వరూపము

బృహచ్చ తద్దివ్య మచింత్యరూపం
సూక్ష్మాచ్చ తత్సూక్ష్మతరం విభాతి,
దూరాత్సుదూరే తదిహాంతికే చ
పశ్యత్స్విహైవ నిహితం గుహాయామ్. 7

అది అత్యంత విశాలము, దివ్యము, అచింత్యము, సూక్ష్మమున కంటె సూక్ష్మమునై యున్నది. అది దూరమున కంటెను అతి దూరము సమీపమున కంటెను అత్యంత సమీపమునై యుండి దివ్యదృష్టి గల జ్ఞానులకు వారి హృదయ గుహయందే గోచరమగును.

ఆత్మానుభవమునకు చిత్తశుద్ధి అత్యవసరము

న చక్షుషా గృహ్యతే నాపి వాచా
నాన్యైర్దేవై స్తపసా కర్మణా వా,
జ్ఞానప్రసాదేన విశుద్ధసత్త్వ
స్తతస్తు తం పశ్యతే నిష్కలం ధ్యాయమానః. 8

ఈ ఆత్మతత్త్వము నేత్రములచే గాని, వాక్ఛక్తిచే గాని, అన్య దేవతల (ఇంద్రియముల) సహాయముచే గాని, తపఃకర్మాదులచే గాని లభ్య మగునది కాదు. శుద్ధాంతఃకరణము గలవాడు తత్త్వనిష్ఠను బడయు, నిరవయవము, నిష్కళంకము నగు ఈ ఆత్మ తెలియబడును. అనుభవ మగును.

ఏషోఽణురాత్మా చేతసా వేదితవ్యో
యస్మిన్ ప్రాణః పంచధా సంవివేశ,
ప్రాణైశ్చిత్తం సర్వమోతం ప్రజానాం
యస్మిన్ విశుద్ధే విభవత్యేష ఆత్మా. 9

ఆత్మ అతిసూక్ష్మము. అయ్యది శుద్ధబుద్ధికి మాత్రము వేద్యము. ప్రాణము ఐదు రూపములు ధరించి ఈ దేహమున ప్రవేశించెను. సర్వ భూతములయొక్క చిత్తము ప్రాణములచే నిండి యున్నది. అనగా అంతఃకరణము ఇంద్రియములచే వ్యాప్తమై యున్నది. కాబట్టి ఈ చిత్తము ఇంద్రియ విషయములనుండి నివృత్తి నొంది శుద్ధమైనచో ఆత్మజ్ఞానము ప్రకాశమొందును. అనగా చిత్తశుద్ధిచే యథార్థ తత్త్వము భాన మగునని భావము.

ఆత్మజ్ఞానిని పూజించుటచే సర్వము చేకూరును

యం యం లోకం మనసా సంవిభాతి
విశుద్ధ సత్త్వః కామయతే యాంశ్చ కామాన్.
తం తం లోకం జయతే తాంశ్చకామాం
స్తస్మాదాత్మజ్ఞం హ్యర్చయేద్భూతికామః. 10

ఇతి ప్రథమః ఖండః.

తత్త్వవిదుడు పరిశుద్ధ స్వభావుడు. ఇతడు తన మనస్సుచే ఏయే లోకములను చూచునో ఏయే కామములను ఇచ్ఛయించునో ఆయా లోకములను ఆయా కామములను బడయును. ఇట్టి బ్రహ్మవిదుని కృపకు పాత్రులైన వారును అభ్యుదయమును పొందెదరు. కావున ఐశ్వర్యాభిలాష గలవాడు ఆత్మజ్ఞుని పూజింపవలయును.

ఇది మొదటి ఖండము

—o—

3–వ ముండకము – 2–వ ఖండము

ఆత్మజ్ఞానియొక్క పూజాఫలము

స వేదైతత్పరమం బ్రహ్మధామ
యత్ర విశ్వం నిహితం భాతి శుభ్రమ్,
ఉపాసతే పురుషం యే హ్యకామా
స్తే శుక్రమేతదతివర్తంతి ధీరాః. 1

ఎవనియందు ఈ విశ్వము నిలుకడ గలిగి వెలయుచున్నదో ఆ పరమ స్థానమును విశ్వప్రపంచాశ్రయమగు బ్రహ్మమును అతడు (జ్ఞాని) తెలియును. అందువలన నిష్కాములై ఇట్టి బ్రహ్మజ్ఞానిని సేవించు ధీరులు ఈ సృష్టిబీజము (జన్మము) నతిక్రమించెదరు. జనన మరణ రహితు లగుదురు.

నిష్కామముచే జేసిన కర్మలు పునర్జన్మ నియ్యవు

కామాన్ యః కామయతే మన్యమానః
స కామభి ర్జాయతే తత్ర తత్ర,
పర్యాప్తకామస్య కృతాత్మనస్తు
ఇహైవ సర్వే ప్రవిలీయంతి కామాః. 2

కోరికలు గల వాడు తన కోరికల ననుసరించి లాగబడుచు వెళ్ళవలసి వచ్చును. కాని కామములను (విషయాపేక్షలను) నిగ్రహించి

కృతకృత్యుడైన వానియొక్క సర్వ కామము లిచ్చటనే లయము నొందును. కామ కారణమగు అజ్ఞానము జ్ఞానాగ్నిచే దగ్ధమై యుండు నని తెలియవలయును.

ఆత్మతత్త్వము చక్కని విచారముచే సుసంవేద్యము

నాయమాత్మా ప్రవచనేన లభ్యో
న మేధయా న బహునా శ్రుతేన,
యమేవైష వృణుతే తేన లభ్య
స్తస్యైష ఆత్మా వివృణుతే తనుం స్వామ్. 3

ఈ ఆత్మ ప్రవచనాదులచేత గాని మేధాశక్తిచే గాని బహు శ్రవణములచే గాని పొందబడునది కాదు. ఎవడు ఆత్మానాత్మ-వివేచన-పూర్వకముగ ఆత్మ నేనని గురుకృపచే తెలియునో అట్టి వానిపై ఆత్మ ప్రసన్న మగును. వానికి తనకు తానై ఈ ఆత్మ స్వయమేవ బ్రహ్మమే యను వృత్తివ్యాప్తి యగును.

నాయమాత్మా బలహీనేన లభ్యో
న చ ప్రమాదాత్తపసో వాప్యలింగాత్,
ఏతై రుపాయై ర్యతతే యస్తు విద్వాం
స్తస్యైష ఆత్మా విశతే బ్రహ్మధామ 4

ఈ ఆత్మ బలహీనునకు లభ్య మగునది కాదు. కామములచే మోహితుడై సత్యసంధుడు గాని తపస్వికి స్వాధీన మగునది కాదు. కాని సాధకుడగు ఏ విద్వాంసుడు విమోహ మగు బుద్ధిచే సర్వవిధ ముల ప్రయత్నింప ఈ ఆత్మ (తాను) బ్రహ్మమే యని తెలియును. అనుభవ మగును.

ఆత్మజ్ఞానికగు బ్రహ్మప్రాప్తి విధానము

సంప్రాప్యైన మృషయో జ్ఞానతృప్తాః
కృతాత్మానో వీతరాగాః ప్రశాంతాః,
తే సర్వగం సర్వతః ప్రాప్య ధీరా
యుక్తాత్మానః సర్వమేవావిశంతి. 5

ఋషులు ఆత్మప్రాప్తిచే (ఆత్మానుభవము నొందుటవలన) జ్ఞానతృప్తులై, శాంతచిత్తులును, ఆసక్తిరహితులును, కృతకృత్యులు నగుదురు. ఇట్లు వ్యాపకాత్మానుభవమువలన ధీరులు ముక్తాత్ములై సర్వాత్మభావము నొందుదురు.

మోక్షస్వరూప వర్ణనము

వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థాః
సంన్యాసయోగా ద్యతయః శుద్ధసత్త్వాః,
తే బ్రహ్మలోకేషు పరాంతకాలే
పరామృతాః పరిముచ్యంతి సర్వే. 6

యతులు వేదాంతానుభవమువలన సమస్త వస్తు విశేష జ్ఞానముచే యథార్థము నెఱిగి, సన్న్యాసయోగ యుక్తాత్ములై అంత్యకాలమున, పూర్ణతను అమృతత్వమును బడసి బ్రహ్మలోకము వెళ్ళుదురు. పునర్జన్మ రహితమగు మోక్షము నొందుదురని అర్థము.

గతాః కలాః పంచదశ ప్రతిష్ఠా
దేవాశ్చ సర్వే ప్రతిదేవతాసు,
కర్మాణి విజ్ఞానమయశ్చ ఆత్మా
పరేఽవ్యయే సర్వ ఏకీభవంతి. 7

మోక్షమునందు 15 కళలు తమ తమ స్థానములయందు లీనమగును. ఇంద్రియములు, తత్తదధిదేవతలు, తమ తమ నెలవులను వెళ్ళుదురు. కర్మలు, విజ్ఞానమయాత్మ (అనగా జీవుడు) ఈ సర్వమును పరమగు, అవ్యయమైన పరబ్రహ్మమునందు అభేద మొంది పోవును.

బ్రహ్మప్రాప్తివిషయమున ఉదాహరణము

యథా నద్యః స్యందమానాః సముద్రేఽ
స్తం గచ్ఛంతి నామరూపే విహాయ,
తథా విద్వాన్నామరూపాద్విముక్తః
పరాత్పరం పురుష ముపైతి దివ్యమ్. 8

ఎట్లు ప్రవహించు ఎల్ల నదులు తమ తమ నామరూపములను వీడి సముద్రమునందు లీన మగునో అటువలె జ్ఞాని నామరూప విము క్తుడై పరమ పురుషుని పొందును. బ్రహ్మత్వము నొందును.

బ్రహ్మవేత్త బ్రహ్మమే

స యో హ వై తత్పరమం బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి. నాస్యాబ్రహ్మవిత్కులే భవతి. తరతి శోకం తరతి పాప్మానం. గుహా గ్రంథిభ్యో విముక్తోఽమృతో భవతి. 9

పరబ్రహ్మమును ఎఱిగిన వాడు పరబ్రహ్మమే యగును. దేవత లకు గూడ నితడాత్మ యగుటచే ఇతనికి వారడ్డు గారు. విఘ్నమును గలుగ జేయరు. ఇతని వంశమునందు బ్రహ్మజ్ఞాని కానివాడు పుట్టడు. ఇతడు దుఃఖమునుండియు పాపమునుండియు ముక్తుడగును. సంశయ ములనుండి విముక్తుడై అమృత స్వరూపుడగును.

తదేతదృచాఽభ్యుక్తమ్-

క్రియావంతః శ్రోత్రియా బ్రహ్మనిష్ఠాః
స్వయం జుహ్వత ఏకర్షిం శ్రద్ధయంతః,
తేషామేవైతాం బ్రహ్మవిద్యాం వదేత
శిరోవ్రతం విధివద్యైస్తు చీర్ణమ్. 10

ఈ బ్రహ్మవిద్య నెట్టివారి కుపదేశింప వలయు ననిన, ఆ సంప్ర దాయము నీక్రింది విధముగా ఋగ్వేద మంత్రము చెప్పుచున్నది. నిష్కామ కర్మానుష్ఠానముచే సుసంస్కృతాత్ములైన శ్రద్ధాళువులగు అధికారులకు ఈ బ్రహ్మవిద్యను బోధింప దగును. ఏకర్షి యను అగ్ని నుపాసించువారు శిరోవ్రతులు, అనగా గురువాక్యమును తలదాల్చి నడుచువారు ఈ బ్రహ్మవిద్యోపదేశార్హులని చెప్పబడుదురు.

తదేతత్సత్యమృషిరంగిరాః పురోవాచ నైతదచీర్ణవ్రతోఽధీతే నమః పరమఋషిభ్యో నమః పరమఋషిభ్యః.

ఇతి ద్వితీయః ఖండః

పూర్వము అంగిరస్సుఋషి చెప్పిన సత్య మిదియే. విధివదుప సన్నుడు గాని సంయమ వ్రతాచరణ రహితునకు ఈ విద్యాధ్యయనాధి కారము లేదు. పరమఋషులకు నమస్కారము. పరమఋషులకు నమ స్కారము.

ఓం భద్రం కర్ణేభిరితి శాంతిః

ఇది 3-వ ముండకము 2-వ ఖండము

ముండకోపనిషత్తు సమాప్తము

# ౬. మాండూక్యోపనిషత్తు

ఓం భద్రం కర్ణేభిః శృణుయామ దేవాః. భద్రం పశ్యేమాక్షి ర్యజత్రాః. స్థిరైరంగైస్తుష్టువాగ్ంసస్తనూభిః. వ్యశేమ దేవహితం యదాయుః. స్వస్తి న ఇంద్రో వృద్ధశ్రవాః. స్వస్తి నః పూషా విశ్వ వేదాః. స్వస్తి నస్తార్క్ష్యో అరిష్టనేమిః. స్వస్తి నో బృహస్పతిర్దధాతు.

ఓంశాంతిః శాంతిః శాంతిః

ఓ దేవతలారా! మా చెవు లెల్లప్పుడు మంగళమయ మగు మాటలనే వినుగాక! పూజ్యులగు ఓ దేవతలారా! మా నేత్రము లఖండమగు శుభమునే చూచుగాక! బలోపేతమగు శరీరేంద్రియములు గలిగి ఆయుస్సంతయు ఈశస్మరణచే (స్తోత్రముచే) గడచుగాత! శ్రేష్ఠు డగు జ్ఞానియైన ఇంద్రుడు మాకు శుభ మొసగుగాత! సర్వద్రష్టయగు సూర్యుడు మమ్మనుగ్రహించుగాత! సర్వారిష్ట నాశకుడగు గరుడుడు మమ్ము కృపాదృష్టి జూచుగాత! దయామయుడగు బృహస్పతి మమ్ము బ్రోచుగాత!

ఓం శాంతిః శాంతిః శాంతిః

అవ : "అయమాత్మ బ్రహ్మ" ఈ యాత్మ బ్రహ్మమే యను అపరోక్షదృష్టి బోధకమై ఈ ప్రథమ మంత్రము ఇది యను వృత్తికి వేద్యమగు సమస్తమును ఓంకార (ప్రణవ) వాచ్యమగు పరబ్రహ్మ స్వరూపమేయై యున్నదని నిరూపించుచున్నది.

హరిః ఓమ్. ఓమిత్యేతదక్షరమిదగ్ం సర్వం. తస్యోపవ్యాఖ్యానం భూతం భవద్భవిష్యదితి. సర్వమోంకార ఏవ. యచ్చాన్యత్త్రికాలాతీతం తదప్యోంకార ఏవ. 1

ఈ సమస్తము "ఓమ్" అను అక్షరము. ఈ ఉపనిషత్తు (నందు) ఓంకారముయొక్క వ్యాఖ్య చేయబడును. భూతకాలమున జరిగిపోయినదియు వర్తమానమునందు నడచుచున్నదియు భవిష్యత్కాలమున రాబోవునదియు ఈ సర్వమును ఓంకారమే. వీటి నన్నింటిని అతిక్రమించి త్రికాలాతీతమై యుండునదియు ఓంకారమే. అనగా ప్రణవమే. వాచ్య వాచకములచే నొప్పారు ఈ సర్వమును ఓంకారమే; బ్రహ్మమే నని భావము.

సర్వగ్ం హ్యేతద్బ్రహ్మాయమాత్మా బ్రహ్మ. సోఽయమాత్మా చతుష్పాత్. 2

ఇదంవృత్తికి వేద్యమగు సమస్తము బ్రహ్మము. అయం అని చెప్పబడు అపరోక్షమగు ఈ ఆత్మ బ్రహ్మము. ఆత్మ నాలుగు పాదములు గలది. అధ్యారోప దృష్ట్యా నాలుగు ప్రకారములగు అవస్థలను కల్పించి తెలుపుట యని భావము.

ఆత్మయొక్క ప్రథమపాదము వైశ్వానరుడు లేక విశ్వుడు

జాగరితస్థానో బహిష్ప్రజ్ఞః సప్తాంగ ఏకోనవింశతిముఖః స్థూలభుగ్వైశ్వానరః ప్రథమః పాదః. 3

బహిష్ప్రజ్ఞ గలవాడును ఏడు అవయవములు, 19 ముఖములును స్థూల భోక్తృత్వమును గలిగి జాగ్రదవస్థయందు వైశ్వానరుడని పిలువబడు ఈ స్థూలదేహాభిమాన యుక్తమగు చైతన్యము ప్రథమ పాదము (జాగ్రదవస్థ).

### ద్వితీయపాదము తైజసుడు

స్వప్నస్థానోఽన్తఃప్రజ్ఞః సప్తాంగ ఏకోనవింశతిముఖః ప్రవివిక్తభుక్తైజసో ద్వితీయః పాదః. 4

అంతఃప్రజ్ఞయు, ఏడు సూక్ష్మావయవములును, 19 ముఖములును, వాసనారూపమగు సూక్ష్మభోగమును స్వప్నావస్థ. తైజసుడని చెప్పబడుచు స్వప్నమునందు వ్యవహరించు చైతన్యము (ఆత్మ) రెండవ పాదము.

### ఆత్మయొక్క తృతీయపాదము ప్రాజ్ఞుడు

యత్ర సుప్తో న కంచన కామం కామయతే న కంచన స్వప్నం పశ్యతి తత్సుషుప్తమ్. సుషుప్తస్థాన ఏకీభూతః ప్రజ్ఞానఘన ఏవానందమయో హ్యానందభుక్చేతోముఖః ప్రాజ్ఞస్తృతీయః పాదః. 5

మనుష్యుడు నిద్రించినపుడు-ఏ అవస్థయందు-ఎట్టి కామములను కామించుటలేదో అది సుషుప్తావస్థయని చెప్పబడును. అచ్చట ఏకీభూతమగు ప్రజ్ఞాన ఘనము అనగా నిండు చైతన్యము ఆనందమయత. ఆనందభోక్తృత్వము. చేతోముఖము. చైతన్యమే ముఖముగా గలిగి ప్రాజ్ఞుడని చెప్పబడు సుషుప్తియందలి చైతన్యము ఆత్మయొక్క తృతీయ పాదము.

### ఈ ప్రాజ్ఞుడే సర్వకారణుడైన ఈశ్వరుడు

ఏష సర్వేశ్వర ఏష సర్వజ్ఞ ఏషోఽన్తర్యామ్యేష యోనిః సర్వస్య ప్రభవాప్యయౌ హి భూతానామ్. 6

ఇతడే సర్వేశ్వరుడు. ఇతడే సర్వజ్ఞుడు. ఇతడే అంతర్యామి. ఇతడే సమస్త వస్తువుల ఉత్పత్తిస్థానము. ఇతడే సర్వ భూతోత్పత్తి లయములకు కారణము.

### తురీయ (పాద) స్వరూపవర్ణనము

నాంతఃప్రజ్ఞంన బహిష్ప్రజ్ఞం నోభయతః ప్రజ్ఞం న ప్రజ్ఞానఘనం న ప్రజ్ఞంనాప్రజ్ఞమ్. అదృష్టమవ్యవహార్య మగ్రాహ్య మలక్షణ మచింత్య మవ్యపదేశ్య మేకాత్మప్రత్యయసారం ప్రపంచోపశమం శాంతం శివ మద్వైతం చతుర్థం మన్యన్తే స ఆత్మా స విజ్ఞేయః. 7

అది అంతర వస్తుజ్ఞానము గలది కాదు; అనగా తైజసుడు కాదు. బాహ్య వస్తువుల జ్ఞానము గలదియు గాదు. అనగా విశ్వుడు కాదు. అంతర్బాహ్య వస్తువుల జ్ఞానము గలదియును కాదు; కావున మధ్యప్రజ్ఞ గలది గాదు. ప్రజ్ఞాన ఘనము (ఏమియు తెలియనిది) కాదు; అందుచే ప్రాజ్ఞుడు కాదు. జ్ఞానము గలది కాదు; అనగా విషయ జ్ఞాత (తెలిసికొనునది) కాదని అర్థము. జ్ఞానము లేనిది కాదు; అనగా తెలిసికొనునది (జడము) కాదు; కాబట్టి అప్రజ్ఞము కాదు. అది. అదృష్టము–జ్ఞానేంద్రియములకు గోచరించనిది. అవ్యవహార్యము–క్రియారహితము. అగ్రాహ్యము – కర్మేంద్రియములచే గ్రహింపబడనిది. అలక్షణము – గుణుతులు లేనిది. అచింత్యము–ఆలోచించుటకు రానిది. ఇట్టిదని చెప్పుటకు రాని, అవ్యపదేశ్యము – వాక్కుచే బోధించుటకు రానిది. సర్వావస్థలయందు ఏకరసముగా ఉండెడి స్వరూపము అనెడి జ్ఞానముచే కనిపట్టదగినది ; అథవా ఆత్మైకత్వ బుద్ధియే ప్రమాణముగా గలది. అది ప్రపంచోపశమము అనగా దృశ్యప్రపంచము లేని యట్టిది.

శాంతము. మంగళమయము. అద్వైతము– రెండవది ఏదియు లేనిది. అదిసుబోధార్థమై విశ్వాది పాదత్రయమునకంటె విలక్షణముగా నున్నందున నాలుగవదిగా చెప్పబడినది. అదే శుద్ధమగు ఆత్మ. అదే తెలియుటకు యోగ్యమైన విషయము. నిత్యాపరోక్షమైన స్వస్వరూపము.

అవ : ఆత్మయొక్క పాదములకును, ఓంకారమునందలి మాత్రలకును సామ్యము (ఏకత్వము.)

సోఽయమాత్మాఽధ్యక్షరమోంకారోఽధిమాత్రం పాదా మాత్రా మాత్రాశ్చ పాదా అకార ఉకారో మకార ఇతి. 8

అట్టి ఈ యాత్మ అభిధాన ప్రాధాన్యముచే వర్ణింప బడుచున్నది. అది ఓంకారము. ఈ ఓంకారము మాత్రల నాశ్రయముగా జేసికొని వర్తించునట్టిది. ఎట్లన, ఆత్మకు ఏవి పాదములో అవే ఓంకారమునకు సంబంధించిన మాత్రలు. అవి అకార ఉకార మకారము లనునవి.

అవ : ప్రణవమునందలి అకార మాత్రకును ఆత్మపాదములయందలి విశ్వునకును సామ్యము. (అభేదము.)

జాగరితస్థానో వైశ్వానరోఽకారః ప్రథమా మాత్రాఽఽప్తే రాది మత్త్వాద్వాఽఽప్నోతి హ వై సర్వాన్ కామానాదిశ్చ భవతి య ఏవం వేద. 9

జాగ్రదవస్థయందు వైశ్వానరుడు అకారమువలెనే వ్యాపకమై యున్నందువలన మఱియు మొదటివాడై యున్నందువలన రెండిటి యందును ప్రాథమ్యముయొక్క సామ్యమున్నందుచే ప్రథమ మాత్ర యనబడును. ఇట్లు దెలిసినవానికి సమస్త కామములు పూర్ణ మగునని ఫలము. అతడు అందఱియందును మొదటి వాడగును.

ఉకారమునకును తైజసునకును సామ్యము

స్వప్నస్థానస్తైజస ఉకారో ద్వితీయా మాత్రోత్కర్షాదుభయ త్వాద్వోత్కర్షతి హ వై జ్ఞానసంతతిం సమానశ్చ భవతి నాస్యాబ్రహ్మ విత్కులే భవతి య ఏవం వేద. 10

స్వప్నావస్థయందలి తైజసుడు ఓంకారములోని ఉకారము అనబడు రెండవమాత్ర. విశ్వునికంటె జ్ఞానోత్కర్షతవలన తైజసుడు అకారమునకంటెఉత్కృష్టత గలది గావున ఉకారము సామ్యము గలది. మఱియు విశ్వ ప్రాజ్ఞులకు నడుమ తైజసుడు, అకార మకారములకు మధ్య ఉకారము; ఇట్లు సామ్యము గలదు. ఇది ఎఱిగినవాడు జ్ఞాన సంతతిని వృద్ధి పఱచును; లేక సామ్యదృష్టి గలవాడగును. ఇతని వంశ మునందు బ్రహ్మజ్ఞాని కానివాడు పుట్టడు. ఇది ఫలము.

మకారమునకు, ప్రాజ్ఞునకు సామ్యము

సుషుప్తస్థానః ప్రాజ్ఞో మకారస్తృతీయా మాత్రా మితేరపీ తేర్వా మినోతి హవా ఇదగ్ం సర్వమపీతిశ్చ భవతి య ఏవం వేద.11

సుషుప్తియందు ప్రాజ్ఞుడు సర్వమును లయింప జేసికొని అన్ని టికి కారణమై ఏకరూపమున విరాజిల్లును. అకార, ఉకారములు లయించుస్థానము మూడవ మాత్రమైన మకారము. ఇట్లు ప్రాజ్ఞ నకును, మకారమునకును, సామ్యము గలదు. దీని నెఱిగినవాడు సర్వ మును లయింపజేసికొనును. అనగా యథార్థము నెఱిగినవాడగును.

సర్వజ్ఞత్వము నొందును. మఱియు ఏకరూపముచే సర్వకారణత్వము నొందుట ఫలము.

### అమాత్రకును ఆత్మకును అభేదము

అమాత్రశ్చతుర్థోఽవ్యవహార్యః ప్రపంచోపశమః శివోఽద్వైత ఏవమోంకార ఆత్మైవ సంవిశత్యాత్మనాత్మానం య ఏవం వేద య ఏవం వేద. 12

నాల్గవ పాదము (అర్ధమాత్ర) మాత్రారహితము. అది అవ్యవహార్యము. ప్రపంచోపశమము. మంగళము. అద్వైతము. ఈ విధముగనుండు ఓంకారమే ఆత్మ. ఆత్మ దేశ కాల వస్తు పరిచ్ఛేద రహితమగు బ్రహ్మమే. ఇట్లు తెలిసిన వాడు పరమాత్మయందు ప్రవేశించును. అనగా ప్రత్యగభిన్న పరబ్రహ్మమే నేనని తన్నుదాను తెలియును.

ఓం భద్రం కర్ణేభిరితి శాంతిః.

మాండూక్యోపనిషత్తు సమాప్తము

---

# ౭. తైత్తిరీయోపనిషత్తు

హరిః ఓమ్. శం నో మిత్రశ్శం వరుణః. శం నో భవత్వర్యమా. శం న ఇంద్రో బృహస్పతిః శం నో విష్ణురురుక్రమః. నమో బ్రహ్మణే. నమస్తే వాయో. త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి. త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి. ఋతం వదిష్యామి. సత్యం వదిష్యామి. తన్మామవతు. తద్వక్తారమవతు. అవతుమామ్. అవతు వక్తారమ్.

ఓం శాంతిః శాంతిః శాంతిః

మిత్రుడు మాకు శుభప్రదుడగుగాక! వరుణుడు మాకు సుఖము నొసగుగాక! అర్యముడు మాకు మంగళప్రదుడగుగాక! ఇంద్రుడు

మాకు మంగళప్రదాత యగుగాక! బృహస్పతి మాకు కళ్యాణప్రదుడగుగాక! వ్యాపకుడగు విష్ణువు మాకు శుభ మొసగుగాక! బ్రహ్మకు నమస్కారము. ఓవాయూ! నీకు వందనము. నీవే ప్రత్యక్ష బ్రహ్మము. నిన్నే నేను ప్రత్యక్షమగు పరమాత్మ యందును. సత్యమును బలికెదను. ఆ సత్యము నన్ను గాచుగాక! గురువులను గాచుగాక! నన్ను బ్రోచుగాక! గురువులను బ్రోచుగాక!

ఓం శాంతిః శాంతిః శాంతిః

## శిక్షావల్లి 1-వ అనువాకము

హరిః ఓమ్. శంనో మిత్రశ్శం వరుణః. శం నో భవత్వర్యమా. శం న ఇంద్రో బృహస్పతిః శం నో విష్ణురురుక్రమః. నమో బ్రహ్మణే. నమస్తే వాయో. త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి. త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి. ఋతం వదిష్యామి. సత్యం వదిష్యామి. తన్మామవతు. తద్వక్తారమవతు. అవతు మామ్. అవతు వక్తారమ్. ఓం శాంతిః శాంతిః శాంతిః. సత్యం వదిష్యామి పంచ చ.

ఇది విద్యార్థి యగు శిష్యుడు అనర్థ నివృత్తికై చేయు ప్రార్థన. ఆధ్యాత్మికాది తాపత్రయోపశమనార్థమై శాంతి యని ముమ్మారు ఉచ్చరించుట విధి.

## 2-వ అనువాకము

అవ : శిక్షయొక్క వ్యాఖ్యానము—

శీక్షాం వ్యాఖ్యాస్యామః. వర్ణస్స్వరః. మాత్రా బలమ్. సామ సంతానః. ఇత్యుక్తశ్శీక్షాధ్యాయః. శీక్షాం పంచ. 1

ఓమ్. వర్ణోచ్చార విద్యను గురించి వ్యాఖ్యానము చేసెదము. వర్ణ మనగా అకారాది స్వరము (ఉదాత్తానుదాత్త స్వరితములు) మాత్ర యనగా హ్రస్వ దీర్ఘ ప్లుతములు. బలమనగా వర్ణోచ్చారణకై చేయు ప్రయత్నము. సామ మనగా ఉచ్చారణయొక్క సమత్వము. ఒకే విధ అనగా అతితీవ్రము, మందము, మధ్యమముగాక సమమగు వర్ణసంయోగమైన అక్షరోచ్చారణ యని భావము. సంతాన మనగా ఇట్టి గము. అక్షరములయొక్క విలంబనము లేక కలిపి చదువుట. ఈ శిక్షాధ్యాయ వర్ణోచ్చారణాత్మకము అధ్యాయము నిరూపింపబడినది.

యము నందు జ్ఞానమే ప్రధానముగా గలిగిన ఉపనిషత్తులను వర్ణ స్వరాది వ్యత్యాసము లేక పఠించుటకు గాను తదర్థావిష్కరణార్థమై వర్ణాద్యుచ్చారణ లక్షణాత్మకమైన శాస్త్రము చెప్పబడినదని తాత్పర్యము.

3-వ అనువాకము

అవ : ఐదు విధములగు సంహితోపాసనను దెలుపుట. ఇప్పుడు సంహితోపనిషత్తును చెప్పుచున్నారు. సంహిత యనగా అక్షర సముదాయము, లేక శబ్దములని గ్రహింపవలయును.

సహ నౌ యశః. సహ నౌ బ్రహ్మవర్చసమ్. అథాతస్సగ్ంహితాయా ఉపనిషదం వ్యాఖ్యాస్యామః. పంచస్వధికరణేషు. అధిలోక మధిజ్యౌతిష మధివిద్య మధిప్రజ మధ్యాత్మమ్. తా మహాసగ్ంహితా ఇత్యాచక్షతే. అథాధిలోకమ్. పృథివీ పూర్వరూపమ్. ద్యౌరుత్తర రూపమ్. ఆకాశస్సంధిః.

మా ఇరువురకు (గురు శిష్యులకు) ఉపాసన, జ్ఞానముచే గలుగు యశస్సు ప్రాప్తించుగాక! వేదాధ్యయనముచే కలుగు తేజస్సని భావము. ఇక సంహితవిషయమగు జ్ఞానమును గురించి చెప్పెదము. అనగా వర్ణ సముచ్చయాత్మకమగు తత్త్వమును తెలిపెదమని అర్థము. దీనిని 5 అధికరణములచే చెప్పుచున్నారు.

లోకమును గురించి, జ్యోతిని (తేజస్సును) గురించి, విద్యను గురించి, వ్యాఖ్యానము చేసెదను. వాటిని మహాసంహితలని చెప్పుదురు. ఇక లోకములను గురించిన సంహిత. అధిలోకము. పృథ్వి పూర్వరూపము. స్వర్గ ముత్తరరూపము, ఆకాశము సంధి.

వాయుస్సంధానమ్. ఇత్యధిలోకమ్. అథాధి జ్యౌతిషమ్. అగ్నిః పూర్వరూపమ్. ఆదిత్య ఉత్తరరూపమ్. ఆపస్సంధిః. వైద్యుత స్సంధానమ్. ఇత్యధి జ్యౌతిషమ్.

వాయువు సంధానము అనగా సంతానము. అధిలోకమును గురించి యిట్లు చెప్పబడినది. ఇక అధిజ్యోతిషమును గురించి ఎట్లనిన అగ్ని పూర్వరూపము. ఆదిత్యుడు ఉత్తరరూపము. జలము సంధి.

విద్యుత్తు సంధానము అనగా సంతానము. ఈ ప్రకారము జ్యోతిని గుఱించి చెప్పబడినది.

అథాధివిద్యమ్. ఆచార్యః పూర్వరూపమ్. అంతే వాస్యుత్తర రూపమ్. విద్యా సంధిః. ప్రవచనగ్ం సంధానమ్. ఇత్యధివిద్యమ్. అథాధిప్రజమ్. మాతా పూర్వరూపమ్. పితోత్తరరూపమ్. ప్రజాసంధిః. ప్రజననగ్ం సంధానమ్. ఇత్యధిప్రజమ్. 3

ఇక విద్యను గుఱించి యెట్లనిన, చెప్పెదము. ఆచార్యుడు పూర్వరూపము. శిష్యుడు ఉత్తరరూపము. విద్య సంధి. ప్రవచనము, వ్యాఖ్యానము సంధానము. ఇట్లు విద్యను గుఱించి చెప్పబడినది. ఇక ప్రజలను గుఱించి ఎట్లనిన, తల్లి పూర్వరూపము. తండ్రి ఉత్తరరూపము. ప్రజ సంధి. ప్రజననము – జన్మ, సంధానము.

అథాధ్యాత్మమ్. అధరాహనుః పూర్వరూపమ్. ఉత్తరాహనురుత్తరరూపమ్. వాక్సంధిః. జిహ్వా సంధానమ్. ఇత్యధ్యాత్మమ్. ఇతీమామహాసగ్ంహితాః. య ఏవమేతా మహాసగ్ంహితా వ్యాఖ్యాతా వేద. సంధీయతే ప్రజయా పశుభిః. బ్రహ్మవర్చసేనాన్నాద్యేన సువర్గేణ లోకేన. 4

(సంధి రాచార్యః పూర్వరూప మిత్యధిప్రజం లోకేన)

ఆ పిదప దేహమును గుఱించి ఎట్లనిన, క్రింది పెదవి పూర్వరూపము. పై పెదవి ఉత్తర రూపము. వాక్కు సంధి. నాలుక సంధానము. ఈ విధముగ దేహమును గుఱించి చెప్పబడినది. ఇట్లు మహాసంహితలు గలవని వ్యాఖ్య చేయబడినది. ఈ మహాసంహితలను దెలిసినవారు ప్రజలతోను పశువులతోడను బ్రహ్మ వర్చస్సుతోను సంపన్ను లగుదురు. ఇంకను అన్నము, సువర్ణము, సద్గతియును వీరికి కలుగునని భావము. జడసృష్టిని వీడి స్వర్గమునకు పోవును. తాత్పర్యమేమనగా, ఫలాపేక్షచే ఉపాసించువారికి పై జెప్పిన వన్నియు కలుగును. ఫలాభిసంధి లేని వారికి బ్రహ్మజ్ఞానము కలుగునని ఇందలి భావము.

## 4–వ అనువాకము

అవ : ఐశ్వర్యమును, జ్ఞానమును కోరువారికి జపహోమములు, మేధాసిద్ధ్యర్థములైన మంత్రములును తెలుపుదురు.

యశ్ఛందసామృషభో విశ్వరూపః. ఛందోభ్యోఽధ్యమృతాత్సంబభూవ. సమేంద్రో మేధయా స్పృణోతు. అమృతస్య దేవ ధారణో భూయాసమ్. శరీరం మే విచర్షణమ్. జిహ్వా మే మధుమత్తమా. కర్ణాభ్యాం భూరి విశ్రువమ్. బ్రహ్మణః కోశోఽసి మేధయా పిహితః. శ్రుతం మే గోపాయ. ఆవహంతీ వితన్వానా. 1

జ్ఞానార్థియగు ముముక్షువు చేయవలసిన జప మేది? విశ్వరూపుడును, వేదములయం దత్యంత శ్రేష్ఠుడనగు ఇంద్రుడు అమృతముచే యుక్తమగు ఛందస్సువలన పుట్టెను. అట్టి ఇంద్రుడు నన్ను మేధాసంపన్నునిగా చేయుగాక! అనగా వేదములకెల్ల వేదమైన అమృతమునుండి పుట్టినదై సర్వకామముల నొసంగు ఓంకారము నాకు బ్రహ్మజ్ఞాన మొసగుగాక! ఓ దేవా! నేను అమృతమును ధరించువాడ నౌదునుగాక! అమృత కారణమగు బ్రహ్మజ్ఞానము నొందుదును గాక! నా శరీరము ఆ జ్ఞానమును గ్రహించుటకు తగు యోగ్యతను పొందును గాక! నా జిహ్వా మృదు మధురములగు వాక్కుల నుచ్చరించునదగును గాక! నా చెవులు విశేషమగు జ్ఞాన తత్త్వామృతమును గ్రోలునుగాక! వినుగాక! బుద్ధి తద్వృత్తులచే మఱుగు పడినది. అర్థాత్, లౌకిక ప్రజ్ఞచే మూయబడినది. బ్రహ్మవాచకమైన ఓ ప్రణవమా! నేను విన్న దానిని భద్రముగ రక్షించుము. భేదవాది పామర పురుషుల సాంగత్యముచే నా ప్రజ్ఞ మఱపునకు రాకుండుగాక! జ్ఞానార్థినైన నాకు కావలసిన దానిని నీ వనుగ్రహింపుము.

కుర్వాణా చీర మాత్మనః వాసాంసి మమ గావశ్చ. అన్నపానే చ సర్వదా. తతో మే శ్రియమావహ. లోమశాం పశుభి స్సహ స్వాహా. ఆమాయంతు బ్రహ్మచారిణస్స్వాహా. విమాయంతు బ్రహ్మచారిణస్స్వాహా. ప్రమాయంతు బ్రహ్మచారిణస్స్వాహా. దమాయంతు బ్రహ్మచారిణస్స్వాహా. శమాయంతు బ్రహ్మచారిణస్స్వాహా.

అన్నోదకములను ఆవులను వస్త్రోపవస్త్రములను సంతతము పూర్ణముగ నిమ్ము. నాకు విశాలమగు సిరిని పశ్వాదుల నొసంగుము. స్వాహా యను ఆహుతిచే బ్రహ్మచారులు నాయింటికాగమితులుగాక! అనగా బ్రహ్మజ్ఞానుల మఱియు బ్రహ్మచారుల దర్శనము నాకు విరి

విగా గలుగునుగాక! బ్రహ్మచారులు బలిష్ఠులై యుందురుగాక! బ్రహ్మచారులు ఎక్కువగుదురు గాక! బ్రహ్మచారులు ఇంద్రియ దమనము గలవా రగుదురు గాక! బ్రహ్మచారులు శాంతియుక్తు లగుదురు గాక! స్వాహా యని హోమము చేయునపుడు పఠింపబడును.

యశోజనేఽసాని స్వాహా. శ్రేయాన్వస్యసోఽసాని స్వాహా. తం త్వా భగప్రవిశాని స్వాహా. సమాభగ ప్రవిశ స్వాహా. తస్మిం త్సహస్రశాఖే నిభగాహం త్వయి మృజే స్వాహా. యథాఽఽపః ప్రవతాఽయంతి, యథా మాసా అహర్జరమ్. ఏవం మాం బ్రహ్మచారిణః. ధాతరాయంతు సర్వతస్స్వాహా. ప్రతివేశోఽసి ప్రమా పాహి ప్రమాపద్యస్వ. 3

ప్రజలయంచు నేను కీర్తివంతుడ నగుదునుగాక! నేను సంపద్యుక్తుడను శ్రేయస్సు గలవాడ నౌదును గాక! ఓసుదైవమా! అతనిని అనగా బ్రహ్మచారిని అనుగ్రహించుము. ఓ మహాభాగ్యమా! నన్ను నను గ్రహించుము. ఓ తేజసంపన్నమా! అనీ అనంత సహస్ర కిరణముల యందు నేను స్నాన మాచరించి శుద్ధుడ నౌదునుగాక!

ఓవిశ్వకర్తా! పల్లమునకు నీరు ప్రవహించు పగిది నెలలు బాసి వత్సర మగునట్లు అన్ని వైపులనుండి నా కడకు బ్రహ్మచారులు వచ్చెదరు గాక! నీవు నా వాడవు. నన్ను రక్షింపుము. నావద్దకు రమ్ము. అటు యిటు చలించిన బ్రహ్మచారులు మనశ్శాంతి యుక్తులగుదురు గాక! (ఇచ్చట స్వాహా యనునది అన్ని వాక్యములయందు అన్వయించు కొనవలయునని అర్థము.)

## 5_వ అనువాకము

అవ : హిరణ్యగర్భుడను వ్యాహృతి శరీరము చెప్పబడుచున్నది. అనగా వ్యాహృతి బ్రహ్మోపాసనా పద్ధతి.

భూర్భువస్సువరితి వా ఏతా_స్తిస్రో వ్యాహృతయః. తాసాము హాస్మై తాం చతుర్థీమ్. మహాచమస్యః ప్రవేదయతే. మహ ఇతి. తద్బ్రహ్మ. స ఆత్మా. అంగాన్యన్యా దేవతాః. భూరితి వా అయం లోకః. భువ ఇత్యంతరిక్షమ్. సువరిత్యసౌ లోకః. 1

భూః, భువః, సువః (స్వాహా) ఈ మూడు మంత్రములు నాలుగవది యగు ఇంకొకటియు గలదు. ఇట్లు మహాచమస్యుడను ఋషి చెప్పెను. మహః యనునదే నాల్గవది. అదే బ్రహ్మము. అదే ఆత్మ. ఇతర దేవత లెల్లను దాని అవయవములు. భూః అనగా భూలోకము. భువః అనగా అంతరిక్షము. సువః (స్వాహా) యనగా స్వర్గలోకము. పై మూడును వ్యాహృతులు. నాల్గవది బ్రహ్మము. ఆత్మకు ఈ మూడు వ్యాహృతులు శరీరములుగా నున్నవి. నాల్గవదైన ఆత్మ సర్వవ్యాపి.

మహ ఇత్యాదిత్యః. ఆదిత్యేన వావ సర్వే లోకా మహీయంతే. భూరితి వా అగ్నిః. భువ ఇతి వాయుః. సువరిత్యాదిత్యః. మహ ఇతి చంద్రమాః. చంద్రమసా వావ సర్వాణి జ్యోతీగ్ంషి మహీయంతే. భూరితి వా ఋచః. భువ ఇతి సామాని. సువరితి యజూగ్ంషి. 2

మహః యనునది ఆదిత్యుడు. ఆదిత్యుని శక్తి వలననే సర్వలోకములు విస్తృతి నొందుచున్నవి. భూః అనగా అగ్ని. భువః యనునది వాయువు. సువః యనునది ఆదిత్యుడు. మహః యనగా చంద్రుడు. చంద్రుని నుండియే అన్ని జ్యోతులు విస్తరింపబడుచున్నవి. భూః ఋక్కులు. భువః సామములు. సువః యజుర్వేద మంత్రములు.

మహ ఇతి బ్రహ్మ. బ్రహ్మణా వావ సర్వే వేదా మహీయంతే. భూరితి వై ప్రాణః. భువ ఇత్యపానః. సువరితి వ్యానః. మహ ఇత్యన్నమ్. అన్నేన వావ సర్వే ప్రాణా మహీయంతే. తా వా ఏతాశ్చతస్రశ్చతుర్ధా చతస్రశ్చతస్రో వ్యాహృతయః. తా యో వేద. స వేద బ్రహ్మ. సర్వేఽస్మై దేవా బలిమావహంతి. 3

మహః యనునది బ్రహ్మము; లేక ప్రణవము. ప్రణవమువలననే సకల వేదములు మహిమ గలవగుచున్నవి. భూః అనునది ప్రాణము. భువః అపానము. సువః వ్యానము. మహః యనునది అన్నము. అన్నమునుండియే సర్వప్రాణులు మహిమ నొందుచున్నవి. ఇవి నాలుగు నాలుగుగ పదునాఱు మంత్రములు. వీటిని ఎఱిగినవాడు బ్రహ్మమును దెలియును. అందఱు దేవతలు అతనికి ఆహుతి నొసగుదురు.

## 6–వ అనువాకము

అవ : సాలగ్రామ శివలింగాదులను విష్ణ్వాదిభావముచే నెట్లు పూజించునో అట్లు హృదయమునందు బ్రహ్మము నుపాసింపవలెను. అనగా బ్రహ్మోపలబ్ధి స్థానమగు హృదయాకాశవర్ణన.

స య ఏషో౽ంతర్హృదయ ఆకాశః. తస్మిన్నయం పురుషో మనోమయః. అమృతో హిరణ్మయః. అంతరేణ తాలుకే, య ఏష స్తన ఇవావలంబతే. సేంద్రయోనిః. యత్రాసౌ కేశాంతో వివర్తతే. వ్యపోహ్య శీర్షకపాలే. భూరిత్యగ్నౌ ప్రతితిష్ఠతి. భువ ఇతి వాయౌ. 1

అంతర హృదయమునందు ఆకాశము ఉన్నది. అచ్చట నుండు ఈ పురుషుడు మనోమయుడు. అమృత స్వరూపుడు. హిరణ్మయుడు; లేక తేజస్సంపన్నుడు. రెండు తాలువులకు మధ్య స్తనాకృతిగ వ్రేలాడు మాంసపిండము కొండనాలుక ఇంద్రుని ఉత్పత్తిస్థానము. కపాలద్వయ మధ్యమున జేరి కేశాంత్యము వఱకు వ్యాపించియున్నది. భూః అని అగ్నియం దుండును. భువః యని వాయువునం దుండును.

సువరిత్యాదిత్యే. మహ ఇతి బ్రహ్మణి. ఆప్నోతి స్వారాజ్యమ్. ఆప్నోతి మనసస్పతిమ్. వాక్పతిశ్చక్షుష్పతిః. శ్రోత్రపతిర్విజ్ఞానపతిః. ఏతత్తతో భవతి. ఆకాశశరీరం బ్రహ్మ. సత్యాత్మప్రాణారామం మన ఆనందమ్. శాంతిసమృద్ధమమృతమ్. ఇతి ప్రాచీనయోగ్యోపాస్స్వ. 2

సువః యని ఆదిత్యునియందు, మహః యని బ్రహ్మమునందుం డును. స్వారాజ్యము అనగా బ్రహ్మపదమును సంపాదించును. మన స్స్వాతంత్ర్యమును సంపాదించును. అతడు వాక్పతి యగును. కన్ను లకు స్వామి యగును. శ్రోత్రముల యజమానియు విజ్ఞానాధిపతియు నగు అతడు బ్రహ్మమే యగును. బ్రహ్మము ఆకాశమువలె వ్యాపకమైన శరీరము (స్వరూపము) గలది. సత్యము, ఆత్మ, ప్రాణము, సుఖము ఇత్యాదులచే పూర్ణమగు మనస్సే ఆనందస్వరూపము. శాంతిచే సమృద్ధమైనదే అమృతము. ఇట్టి సనాతనమగు బ్రహ్మతత్త్వము నుపా సించువాడ వగుము. ఇది పారిభాషిక మంత్ర క్రమ మని ఎఱుగ వలయును.

## 7-వ అనువాకము

### బ్రహ్మ పాంక్తరూపోపాసనా పద్ధతి

పృథివ్యంతరిక్షం ద్యౌర్దిశోఽవాంతర దిశాః. అగ్నిర్వాయు రాదిత్యశ్చంద్రమా నక్షత్రాణి. ఆప ఓషధయో వనస్పతయ ఆకాశ ఆత్మా. ఇత్యధిభూతమ్. అథాధ్యాత్మమ్. ప్రాణో వ్యానోఽపాన ఉదానస్సమానః. చక్షుశ్శ్రోత్రం మనో వాక్త్వక్. చర్మమాగం సగ్ంస్నావాఽస్థి మజ్జా. ఏతదధివిధాయ ఋషిరవోచత్. పాంక్తం వా ఇదగ్ం సర్వమ్. పాంక్తేనైవ పాంక్తగ్ంస్పృణోతీతి.

పృథివి, అంతరిక్షము, ఆకాశము, దిక్కులు, నైఋత్యాది ఉప దిక్కులు. అగ్ని, వాయువు, నక్షత్రములు, ఇంద్రుడు, సూర్యుడు, ఓషధులు, వనస్పతులు, జలము, ఆత్మ, ఆకాశము, ఇవన్నియు అధి భూతములు. ఇక దేహ సంబంధముచే చెప్పబడుచున్నది. ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము, చక్షుస్సు, శ్రోత్రము, మనస్సు, వాక్కు, త్వక్కు, మాంసము, స్నాయువులు, అస్థి, మజ్జ. వీటిని విచారించి ఋషి యనిన దేమన, ఇవన్నియు ఐదైదు భాగ ములు గలవైనందువలననే పంచభూతములచే ఐదు భాగములు గల శరీరముగ బ్రహ్మ ఉత్పన్నము జేసెను. ఇదియును పారిభాషిక మంత్ర క్రమమే యని తెలియవలయును.

## 8-వ అనువాకము

### ఓంకారోపాసనాపద్ధతి

ఓమితి బ్రహ్మ. ఓమితీదగ్ం సర్వమ్. ఓమిత్యేతదనుకృతి స్మహ స్మవా అప్యోశ్రావయేత్యాశ్రావయంతి. ఓమితి సామాని గాయంతి. ఓగ్ంశోమితి శస్త్రాణి శగ్ంసంతి. ఓమిత్యధ్వర్యుః ప్రతిగరం ప్రతి గృణాతి ఓమితి బ్రహ్మా ప్రసౌతి. ఓమిత్యగ్నిహోత్రమనుజానాతి. ఓమితి బ్రాహ్మణః ప్రవక్ష్యన్నాహ బ్రహ్మోపాప్నవానీతి. బ్రహ్మైవో పాప్నోతి.

ఓం అను పదము (శబ్దము) బ్రహ్మరూపమని భావించి ఉపా సింపుము. ఓం అనునది బ్రహ్మము. ఈ జగత్తెల్ల ఓంకారస్వరూపమే.

ఓం అని మానవులు అనుకరణము (అంగీకారము) నొందుచున్నారు. ఎవరినైన సంబోధించి ఆజ్ఞాపించునపుడు ఓం అని పలుకుచున్నారు. ఓం అనుచు వినుమని చెప్పుచున్నారు. ఓం అనియే సామముల నుచ్చరించుచున్నారు. అనగా గానము చేయుచున్నారు. ఋగ్వేద మంత్రములు ఓం అని ఆరంభింప బడుచున్నవి. ఓం అని యజ్ఞమునందు ఋత్విజులు స్తోత్రము చేయుచున్నారు. ఋత్విజుడు ఓం అని ఆజ్ఞ నొసగుచున్నాడు. ఓం అని ఆహుతి నొసగుటకు అనుమతి నొసగుచున్నాడు. ఓం అని అగ్నిహోత్రము చేయుచున్నారు. ఓం అనియే వేదాధ్యయన మారంభించుచున్నారు. ఓంకారముచే బ్రహ్మానుభవము నొంద దలంచువాడు బ్రహ్మత్వమును పొందుచున్నాడు. ఓంకారమును బ్రహ్మముగా ఉపాసించువాడు బ్రహ్మమే యగును.

## 9-వ అనువాకము

అవ : బ్రహ్మవిజ్ఞానము వలన నే స్వారాజ్యము సిద్ధించుటవలన శ్రౌత స్మార్త కర్మలు అనగా శుభకర్మలు పురుషార్థ సాధకము లని తెలుపు చున్నారు.

ఋతంచ స్వాధ్యాయప్రవచనే చ. సత్యంచ స్వాధ్యాయప్రవచనే చ. తపశ్చ స్వాధ్యాయప్రవచనే చ. దమశ్చ స్వాధ్యాయప్రవచనే చ శమశ్చ స్వాధ్యాయప్రవచనే చ. అగ్నయశ్చ స్వాధ్యాయప్రవచనే చ. అగ్నిహోత్రంచ స్వాధ్యాయప్రవచనే చ. అతిథయశ్చ స్వాధ్యాయప్రవచనే చ. మానుషంచ స్వాధ్యాయప్రవచనే చ. ప్రజాచ స్వాధ్యాయప్రవచనే చ. ప్రజనశ్చ స్వాధ్యాయప్రవచనేచ. ప్రజాతిశ్చ స్వాధ్యాయప్రవచనే చ. సత్యమితి సత్యవచా రాథీతరః. తప ఇతితపో నిత్యః పౌరుశిష్టిః. స్వాధ్యాయప్రవచనే ఏ వేతి నాకో మౌద్గల్యః తద్ధి తప స్తద్ధి తపః.

యథాప్రకారమగు సత్యవాక్కు, స్వాధ్యాయప్రవచనములు అనగా చదువుట, ప్రవచించుట, సత్యమును గ్రహించి సత్యమును చెప్పుట, తపస్సు, అధ్యయనము, అధ్యాపనము, బాహ్యేంద్రియ సంయమము, మనస్సంయమము, అగ్నిహోత్రక్రియలు, అతిథుల సేవ, లౌకిక వ్యవహారము, అర్థాల్ వివాహాదికార్యములు, ప్రజ, ఋతుకాల

మరసి స్వభార్యయందు ప్రజోత్పాదనము, పౌత్రోత్పత్త్యర్థమై పుత్రుని వివాహాది కార్యములు (ఇట్లు) సత్యమును గ్రహించి అధ్యయన అధ్యాపనాదులు చేయ దగును. (ఇచ్చట పై ప్రతివాక్యమునందును అధ్యయన అధ్యాపనాదులని చేర్చుకొనవలయును) ఇది సత్యమని సత్యమును మాటలాడునట్టి రాథీరు డుపదేశించి యున్నాడు. నిత్యము తప మాచరించు పౌరుశిష్టి, ఇది తపస్సనియు బోధించి యున్నాడు. అధ్యయన అధ్యాపనములే ముఖ్యమని ముద్గల వంశీయుడగు నాద్గల్యుడు చెప్పెను. అదే తపస్సు. ఇదియు పారిభాషిక మంత్రక్రమమే యని భావము.

## 10-వ అనువాకము

## త్రిశంకుని వాక్యము (వేదానువచనము)

అహం వృక్షస్య రేరివా. కీర్తిః పృష్ఠం గిరేరివ, ఊర్ధ్వ పవిత్రో వాజినీవ స్వమృతమస్మి. ద్రవిణగ్ం సవర్చసమ్. సుమేధా అమృతోఽక్షితః. ఇతి త్రిశంకోర్వేదానువచనమ్.

నేను సంసారవృక్ష ప్రేరకుడను. అనగా అంతర్యామినై యున్నాను. నా కీర్తి పర్వత శిఖరమువలె ఉన్నతమై యున్నది. సూర్యుని పగిది నేను పరిశుద్ధుడను. నేను అమృత స్వరూపుడను. తేజఃపుంజమగు మహాశక్తిని. అమృతముచే మైదడిసిన శుద్ధ బుద్ధి గలవాడను. ఇట్లు త్రిశంకుయొక్క వేదానువచనము. వేద సమ్మతమగు వాక్యము. ఇదియును పారిభాషిక మంత్రక్రమమే.

## 11-వ అనువాకము

## వేదాలలో గల సకల ధర్మ సారము

అవ: వేదాధ్యయనానంతరము శిష్యుడు గురుకులమునుండి ఇంటికి దిరిగి వచ్చునపుడు ఆచార్యులు చేయు ధర్మోపదేశము –

వేదమనూచ్యాచార్యోఽన్తేవాసినమనుశాస్తి. సత్యంవద. ధర్మంచర. స్వాధ్యాయాన్మాప్రమదః. ఆచార్యాయ ప్రియం ధనమాహృత్య ప్రజాతంతుం మావ్యవచ్ఛేత్సీః. సత్యాన్నప్రమదితవ్యమ్.

ధర్మాన్న ప్రమదితవ్యమ్. కుశలాన్న ప్రమదితవ్యమ్. భూత్యై న ప్రమది తవ్యమ్. స్వాధ్యాయ ప్రవచనాభ్యాం న ప్రమదితవ్యమ్.

దేవపితృకార్యాభ్యాం న ప్రమదితవ్యమ్. మాతృదేవో భవ. పితృదేవో భవ. ఆచార్యదేవో భవ. అతిథిదేవో భవ. యాన్యనవద్యాని కర్మాణి. తాని సేవితవ్యాని. నో ఇతరాణి. యాన్యస్మాకగ్ం సుచరితాని. తాని త్వయోపాస్యాని. నో ఇతరాణి.

యే కేచాస్మచ్ఛ్రేయాగ్ంసో బ్రాహ్మణాః. తేషాం త్వయాఽఽసనేన ప్రశ్వసితవ్యమ్. శ్రద్ధయా దేయమ్. అశ్రద్ధయాఽదేయమ్. శ్రియా దేయమ్. హ్రియా దేయమ్. భియా దేయమ్. సంవిదా దేయమ్. అథ యది తే కర్మవిచికిత్సా వా వృత్తవిచికిత్సా వా స్యాత్.

యే తత్ర బ్రాహ్మణాః సమ్మర్శినః. యుక్తా ఆయుక్తాః. అలూక్షా ధర్మకామాస్స్యుః. యథా తే తత్ర వర్తేరన్. తథా తత్ర వర్తేథాః. అథాభ్యాఖ్యాతేషు యే తత్ర బ్రాహ్మణాస్సమ్మర్శినః. యుక్తా ఆయుక్తాః. అలూక్షా ధర్మకామాస్స్యుః. యథా తే తేషు వర్తేరన్. తథా తేషు వర్తేథాః. ఏష ఆదేశః. ఏష ఉపదేశః. ఏషా వేదోపనిషత్. ఏతదనుశాసనమ్. ఏవముపాసితవ్యమ్. ఏవముచైతదుపాస్యమ్.

వేదాధ్యయనము పూర్ణమయిన పిదప అధ్యయన మొనర్చిన యా శిష్యునకు ఆచార్యు లుపదేశించున దేమనగా, సత్యమును చెప్పుము. ధర్మము నాచరింపుము. అధ్యయన మొనర్చుటను వీడ వలదు. ఆచార్యులకు ప్రియముచే ధనము నిమ్ము. సత్సంతానోత్పత్తి (నిర్దోషమగు సంకరముగాని విచ్ఛిన్నముగాని ప్రజాతంతువు) కలుగ జేయుము. సత్యమునుండి తప్పి నడువ వలదు. నీ ఆత్మ నుద్ధరించుకొనుము. ధర్మయుక్తమైన ఐశ్వర్యమును సంపాదించుము. స్వాధ్యాయ ప్రవచనములను వీడకుము.

దేవ పితృకార్యముల నాచరించుటను విడువ వలదు. తల్లి దైవమని భావించుము. తండ్రి దైవమని భావించుము. ఆచార్యు

దేవుడని తెలియుము. అతిథి దేవుడని తెలియుము. పవిత్రమగు కర్మలను చేయుము. తదితరములను విడువుము. మంచిపద్ధతుల ననుసరించిన సత్కర్మల నాచరించుము. ఇతరములను విడువుము. మాయొక్క చక్కని ఆచరణలను మాత్ర మనుసరింప దగును. ఇతరములు వలదు.

శ్రేష్ఠులగు బ్రాహ్మణులయందు, శ్రోత్రియ బ్రహ్మనిష్ఠులగు పెద్దలయందు పూర్ణ విశ్వాసము నుంచుము. శ్రద్ధచే ఆదర బుద్ధిగలిగి దాన మివ్వవలెను. ఇచ్చుదానిని శ్రద్ధతో నిమ్ము. అశ్రద్ధగానివ్వకుము. సిగ్గుగలిగి వినయముచే నిమ్ము. భయమును ప్రేమయును గలిగి భక్తిచే నిమ్ము. ఆచార విషయమునందు నీకు సంశయము గలిగినచో,

ఆయా విషయములను చక్కగా విచారించి ఏకాగ్రచిత్తముగల బుద్ధిశాలురగు పెద్దలు ఎట్లాచరింతురో ఆ ప్రకార మాచరింపుము. నీ కర్తవ్య కర్మల యం దేదైన సంశయము సంభవించునేని గొప్పవారి నడిగి తెలిసికొని వారు చేయునట్లు చేయుము. ఇదే ఉపదేశము. ఇదే వేదోపనిషద్రహస్యము. ఇదే అనుశాసనము. ఈశ్వరవచనము. ఇట్లుపాసింప వలయును. ఇదే ఉపాస్యము.

## 12-వ అనువాకము

శం నో మిత్రశ్శం వరుణః. శం నో భవత్వర్యమా. శం న ఇంద్రో బృహస్పతిః. శం నో విష్ణురురుక్రమః. నమో బ్రహ్మణే. నమస్తే వాయో. త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి. త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మావాదిషమ్. ఋతమవాదిషమ్. సత్యమవాదిషమ్. తన్మామావీత్. తద్వక్తార మావీత్. ఆవీన్మామ్. ఆవీద్వక్తారమ్.

ఓం శాంతిః శాంతిః శాంతిః

(ఈ మంత్రార్థము మొదటివలె)

చతురాశ్రమములయందును బ్రహ్మవిద్యాధికారము గలదు. కాని మోక్షమునకు ఉత్తమమగు సాధనము జ్ఞానము. జ్ఞానమున్నదో వేదాంత వాక్య జన్యము. కేవల కర్మోపాసనాదులచే గాదు.

కర్మోపాసనలు జ్ఞానప్రాప్తికి అర్హతను గలిగించెడి చిత్తశుద్ధిని*గలుగ జేయును.

—೦೫೦೫೦—

## బ్రహ్మానందవల్లి

ఓం సహ నావవతు, సహనౌ భునక్తు, సహ వీర్యం కరవావహై. తేజస్వి నావధీతమస్తు. మా విద్విషావహై.

ఓం శాంతిః శాంతిః శాంతిః

అతడు (పరమాత్మ) మాయిరువురను కాపాడుగాక! మాయిరువురను పోషించునుగాక! మాకు విద్యావిషయమునందు చక్కని సామర్థ్యము గలుగుగాక! మేము అధ్యయనము చేసినది తేజోవంతమగుగాక! మాకు బ్రహ్మవిద్య అవగాహన మగునుగాక! పరస్పరము మాలో విద్వేష వృత్తి కలుగకుండునుగాక!

ఓం శాంతిః శాంతిః శాంతిః

### 1-వ అనువాకము

అవ : బ్రహ్మజ్ఞానముయొక్క ఫలము. సృష్టిక్రమము. మఱియు అన్నమయకోశ రూపమైన పక్షియొక్క వర్ణన.

బ్రహ్మవిదాప్నోతి పరమ్. తదేషాఽభ్యుక్తా. సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ. యో వేద నిహితం గుహాయాం పరమే వ్యోమన్. సోఽశ్నుతే సర్వాన్కామాంత్సహ. బ్రహ్మణా విపశ్చితేతి. తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః. ఆకాశాద్వాయుః. వాయోరగ్నిః. అగ్నేరాపః. అద్భ్యః పృథివీ. పృథివ్యా ఓషధయః. ఓషధీభ్యోఽన్నమ్. అన్నాత్పురుషః. స వా ఏష పురుషోఽన్నరసమయః. తస్యేదమేవ శిరః. అయం దక్షిణః పక్షః. అయముత్తరః పక్షః. అయమాత్మా. ఇదం పుచ్ఛం ప్రతిష్ఠా. తదప్యేష శ్లోకో భవతి.

బ్రహ్మజ్ఞాని పరమ పదమును (సర్వోత్కృష్టమైన స్థానమును) బడయును. బ్రహ్మము నెఱిగినవాడు బ్రహ్మమే యగును. ఈ విషయమీ దిగువ మంత్రముచే చెప్పబడును—

* "అనాత్మన్యరుచిః చిత్తే పరాత్మని రుచిర్భవేత్" అనెడి స్మృతి ననుసరించి *చిత్తశుద్ధి యనగా సర్వత్ర అప్రీతి, పరమాత్మయందు ప్రీతి యని అర్థము.

హృదయ గుహాయందుండు సత్యజ్ఞానానంత స్వరూపమగు బ్రహ్మము నెఱిగినవాడు ఆ బ్రహ్మానుభవముచే సమస్త కామములఁ బడసినవాడగును. ఇట్లు సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ యని వేదము చెప్పుచున్నది. బ్రహ్మము సత్యము, జ్ఞానము, అనంతమునైన పర వస్తువు. అట్టి ఈ ఆత్మనుండి ఆకాశ ముత్పన్న మాయెను. ఆకాశము నుండి వాయువు, వాయువునుండి అగ్ని, అగ్నినుండి జలము, జలము నుండి పృథివి, పృథివినుండి ఓషధులు, ఓషధులనుండి అన్నము, అన్నమునుండి పురుషుడు (జీవుడు-ప్రాణి) కలుగును. ఈ పురుషుడు అన్నరసమయుడు. అన్నముచే పూర్ణుడు. (అన్నమయకోశము.) ఇదే అతని శిరస్సు. ఇవే అతని కుడి ఎడమ భుజములు. ఇదే ఆత్మ. ఇదే ఆధారము. ఈ విషయమును ఈ మంత్రము చెప్పుచున్నది.

## 2-వ అనువాకము

అవ: అన్నముయొక్క మహిమ, మఱియు ప్రాణమయ కోశము యొక్క విచారణ.

అన్నాద్వై ప్రజాః ప్రజాయంతే. యాః కాశ్చ పృథివీగ్ం శ్రితాః. అథో అన్నేనైవ జీవంతి. అథైనదపి యంత్యంతతః. అన్నగ్ం హి భూతానాం జ్యేష్ఠమ్. తస్మాత్సర్వౌషధముచ్యతే. సర్వం వై తేన్న మాప్నువంతి. యేఽన్నంబ్రహ్మోపాసతే. అన్నగ్ంహిభూతానాం జ్యేష్ఠమ్. తస్మాత్సర్వౌషధముచ్యతే. అన్నాద్భూతాని జాయంతే. జాతాన్యన్నేన వర్ధంతే. అద్యతేఽత్తిచ భూతాని. తస్మాదన్నం తదుచ్యత ఇతి. తస్మాద్వా ఏతస్మాదన్నరసమయాత్. అన్యోఽంతర ఆత్మా ప్రాణమయః. తేనైష పూర్ణః. స వా ఏష పురుషవిధ ఏవ. తస్య పురుషవిధతామ్. అన్వయం పురుషవిధః. తస్య ప్రాణ ఏవ శిరః. వ్యానో దక్షిణః పక్షః. అపాన ఉత్తరః పక్షః. ఆకాశ ఆత్మా. పృథివీ పుచ్ఛం ప్రతిష్ఠా. తదప్యేష శ్లోకో భవతి. 1

పృథివిని ఆశ్రయించిన సమస్త ప్రజలును అన్నమునుండి పుట్టు చున్నారు. అన్నమునుండియే జీవింతురు. చివరకా యన్నమునందే లయమగుదురు. ఈ పంచమహాభూతములందు సృజింపబడిన వస్తువులలో అన్నమే సర్వమునకు పెద్ద. అందుచేతనే దానిని సర్వౌ

షధ మనియు పిలుతురు. అన్నరూప బ్రహ్మోపాసన చేయువారు సమస్తాన్నములను సంపాదింతురు. అన్నమే అన్ని భూతములకంటెను గొప్పది. అందుచేత సర్వౌషధమని చెప్పుదురు. అన్నమునుండియే భూతముల ఉత్పత్తి. పుట్టిన భూతము లన్నియు అన్నమునుండియే పెరుగును. అది తినబడుచున్నది. అటువలె భూతములను అది తినుచున్నది. అందుచేతనే దానిని అన్నమందురు. ఈ అన్నరసమయుడగు పురుషునికంటె ప్రాణమయుడను అంతరాత్మ వేఱొకడు గలడు. అతనినుండి అనగా ప్రాణమయాంతరాత్మచే ఈ అన్నమయపురుషుడు వ్యాపింపబడియున్నాడు. ఈ ప్రాణమయాత్మ పురుషునివలె నున్నాడు. అతడెట్లు పురుషునివలె నున్నాడనునది వివరింపబడును (అవయవముల యొక్క విభాగమును తెలుపుదురని భావము.) ప్రాణమే తల. వ్యానవాయువే కుడి భుజము. అపానవాయువే ఎడమ భుజము. ఆకాశమే ఆత్మ. పృథివియే ఆధారము. ఈవిషయమైయే ఈ మంత్రము.

### 3-వ అనువాకము

అవ: ప్రాణముయొక్క మహిమ, పిదప మనోమయకోశము యొక్క విచారణ చెప్పబడును.

ప్రాణం దేవా అనుప్రాణంతి. మనుష్యాః పశవశ్చ యే. ప్రాణో హి భూతానామాయుః. తస్మాత్సర్వాయుషముచ్యతే. సర్వమేవ త ఆయుర్యంతి యే ప్రాణం బ్రహ్మోపాసతే. ప్రాణో హి భూతానామాయుః. తస్మాత్సర్వాయుషముచ్యత ఇతి. తస్యైష ఏవ శారీర ఆత్మా. యః పూర్వస్య. తస్మాద్వా ఏతస్మాత్ప్రాణమయాత్. అన్యోఽంతర ఆత్మా మనోమయః. తేనైష పూర్ణః. స వా ఏష పురుషవిధ ఏవ. తస్య పురుషవిధతామ్. అన్వయం పురుషవిధః. తస్య యజురేవ శిరః. ఋగ్దక్షిణః పక్షః. సామోత్తరః పక్షః. ఆదేశ ఆత్మా. అథర్వాంగిరసః పుచ్ఛం ప్రతిష్ఠా. తదప్యేష శ్లోకో భవతి. 1

దేవతలు, మనుష్యులు, పశువులు, ప్రాణముచే రక్షింపబడుదురు. ప్రాణము భూతములయొక్క ఆయుస్సు. అందుచేత దానిని సర్వుల ఆయుస్సందురు. ప్రాణమును బ్రహ్మమని ఉపాసించువారు

పూర్ణాయుస్సు గలవా రగుదురు. ప్రాణమే సర్వ భూతముల ఆయుస్సు. అందుచేతనే అదే ఎల్లవారి ఆయుస్సనియు చెప్పబడును. అన్నమయ పురుషు నాత్మయై ఈ శరీరమునందుండు చైతన్యమే ప్రాణమయాత్మ. (ఇక) మనోమయాంతరాత్మ ఈ ప్రాణమయాత్మకంటెను వేత్తై యున్నాడు. ఈ మనోమయాత్మచే ప్రాణమయాత్మ వ్యాపింపబడి యున్నాడు. మనోమయాత్మ పురుషునివలె నున్నాడు. అవయవ సమన్వయ క్రమము చెప్పబడును. యజుర్వేదమే శిరస్సు. ఋగ్వేదమే కుడి భుజము. సామవేదమే ఎడమ భుజము. ఆదేశము (ఉపదేశము) ఆత్మ. అథర్వాంగిరసుడే పుచ్ఛము ఆధారము. ఈవిషయమున ఈ మంత్రము గలదు.

## 4-వ అనువాకము

అవ: మనోమయ కోశముయొక్క మహిమ, మఱియు విజ్ఞానమయకోశముయొక్క వివరణ.

యతో వాచో నివర్తంతే. అప్రాప్య మనసా సహ. ఆనందం బ్రహ్మణో విద్వాన్. న బిభేతి కదాచనేతి. తస్యైష ఏవ శారీర ఆత్మా. యః పూర్వస్య. తస్మాద్వా ఏతస్మాన్మనోమయాత్. అన్యోఽంతర ఆత్మా విజ్ఞానమయః. తేనైష పూర్ణః. స వా ఏష పురుషవిధ ఏవ. తస్య పురుష విధతామ్. అన్వయం పురుష విధః. తస్య శ్రద్ధైవ శిరః. ఋతం దక్షిణః పక్షః. సత్యముత్తరః పక్షః. యోగ ఆత్మా. మహః పుచ్ఛం ప్రతిష్ఠా. తదప్యేష శ్లోకో భవతి.

ఏ బ్రహ్మము నెఱుగుటకు వాక్ఛక్తి మనస్సుతో కూడా వెళ్ళినదై తనకు వేద్యము కానందువలన వెను దిరిగి వచ్చునో అట్టి యా బ్రహ్మానందము నెఱిగిన వాడు ఎప్పుడును భయపడడు. ప్రాణమయ పురుషాత్మయై ఈ శరీరమునం దుండు మనోమయాత్మకంటెను విజ్ఞానమయాత్మ వేఱు. ఆ విజ్ఞానమయాత్మచే మనోమయాత్మ వ్యాపింపబడి యున్నాడు. అతడును పురుషునివలె నున్నాడు, అదెట్లనిన శ్రద్ధయే అతని తల. యథార్థవచనమే కుడిభుజము. సత్యమే ఎడమ భుజము. యోగమే ఆత్మ. బుద్ధియే పుచ్ఛము ఆధారము. ఈ విషయమున ఈ మంత్రము గలదు.

## 5-వ అనువాకము

అవ : విజ్ఞానమయ కోశముయొక్క మహిమ, ఆనందమయ కోశముయొక్క కథ.

విజ్ఞానం యజ్ఞం తనుతే. కర్మాణి తనుతేఽపి చ. విజ్ఞానం దేవా స్సర్వే. బ్రహ్మ జ్యేష్ఠ ముపాసతే. విజ్ఞానం బ్రహ్మచే ద్వేద. తస్మాచ్చేన్న ప్రమాద్యతి. శరీరే పాప్మనో హిత్వా. సర్వాన్కామా న్సమశ్నుత ఇతి తస్యైష ఏవ శారీర ఆత్మా. యః పూర్వస్య. తస్మాద్వా ఏతస్మాద్విజ్ఞానమయాత్. అన్యోఽన్తర ఆత్మాఽఽనందమయః. తేనైష పూర్ణః. స వా ఏష పురుషవిధ ఏవ. తస్య పురుష విధతామ్. అన్వయం పురుషవిధః. తస్య ప్రియమేవ శిరః. మోదో దక్షిణః పక్షః. ప్రమోద ఉత్తరః పక్షః. ఆనంద ఆత్మా. బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా. తదప్యేష శ్లోకో భవతి.

ఈ విజ్ఞానమయాత్మ, లేక బుద్ధితత్త్వము యజ్ఞమును జేయును. కర్మలను విస్తరింప జేయును. సర్వదేవతులును, శ్రేష్ఠుడగు బ్రహ్మయు విజ్ఞానము నుపాసింతురు. విజ్ఞానమే బ్రహ్మమని తెలియుము. దీనిని తెలియు ప్రసంగమున ఎవడు పొరపడడో అతడు శరీరస్థమగు సమస్త పాపములను నశింప జేసికొని సర్వకామముల నుపభోగించును. మనోమయాత్మకంబైన విజ్ఞానమయాత్మ, ఈ విజ్ఞానమయాత్మకంబైన ఆనందమయాంతరాత్మ వేఱు. ఆనందమయాత్మచే విజ్ఞానమయాత్మ వ్యాప్తుడయి యున్నాడు. అతడును పురుషునివలె నున్నాడు. ఆ అవయవ విశేషము లేవి యనిన, ప్రియమే అతని తల. మోదమే అతని కుడిభుజము. ప్రమోదమే ఎడమభుజము. ఆనందమే ఆత్మ. బ్రహ్మమే పుచ్ఛము ప్రతిష్ఠ. ఈ విషయమై ఈ మంత్రము గలదు.

## 6-వ అనువాకము.

అవ : బ్రహ్మము సత్తని, మఱియు ఆసత్తనియు తెలియువారి యొక్క భేదమును, జ్ఞానజ్ఞానులయొక్క బ్రహ్మవిషయకమైన ఉనికి లేములను గుఱించిన విషయము, సమస్త ప్రపంచ రూపమునను బ్రహ్మమే యున్నదను నిరూపణ ఇత్యాదివిషయములు.

అసన్నేవ స భవతి. అసద్బ్రహ్మేతి వేద చేత్. అస్తి బ్రహ్మేతి చేద్వేద. సంతమేనం తతో విదురితి. తస్యైష ఏవ శారీర ఆత్మా. యః పూర్వస్య. అథాతో౽నుప్రశ్నాః. ఉతావిద్వానముం లోకం ప్రేత్య. కశ్చన గచ్ఛతీ. అహో విద్వానముం లోకం ప్రేత్య. కశ్చిత్సమశ్నుతా ఉ. సో౽కామయత. బహుస్యాం ప్రజాయేయేతి. స తపో౽తప్యత. స తప స్తప్త్వా. ఇదగ్ం సర్వమసృజత. యదిదం కించ. తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్. తదనుప్రవిశ్య. సచ్చ త్యచ్చాభవత్. నిరుక్తంచా నిరుక్తంచ. నిలయనం చానిలయనం చ. విజ్ఞానం చావిజ్ఞానం చ. సత్యం చానృతం చ సత్యమభవత్. యదిదం కించ. తత్సత్యమిత్యా చక్షతే. తదప్యేష శ్లోకో భవతి.

ఆత్మ, గోచరమగు స్థితియందు లేక పోయినను వ్యక్తమగుచునే యున్నది. అది గోచరము కాదను స్థితియందలి అస్తిత్వమే బ్రహ్మమని శ్రద్ధచే దెలియగా సర్వమును తెలిసిన వారగుదురు. బ్రహ్మము లేదను వాడు అసత్పురుషుడు. బ్రహ్మ మున్నదనువాడు సత్పురుషుడు. మొదటి ఆనందమయ పురుషుని ఆత్మయే ఈ శరీరమునందుండు ఆత్మయై యున్నది. ఈ విజ్ఞాన విషయమై కొన్ని ప్రశ్నలు గలవు. అవిద్వాంసుడు జ్ఞానము లేని అజ్ఞుడు దేహమును విడిచిన పిదప ఎచ్చటికి పోవును? విద్వాంసుడగు జ్ఞాని ఎట్టి స్థితిని పొందును? అతడు ఆత్మ (బ్రహ్మము) ప్రపంచమును సృష్టింప నెంచి తపస్సు చేసెను. తప మాచరించి (ఆలోచించి) ఈ సమస్తమును సృష్టించెను. సృష్టించిన యా సర్వమునందును తానే ప్రవేశించెను. మూర్తామూర్త పదార్థములను స్పష్టాస్పష్టములను ఆధార ఆధేయములను జ్ఞానాజ్ఞానములను సత్యాసత్యములను యచ్చావత్ సర్వ పదార్థములను సృష్టించి వాటియొక్క అస్తిత్వము తానె యయ్యెను. అందుచేత అతనిని సత్యమనియు చెప్పుదురు. ఈ విషయమున ఈ మంత్రము గలదు.

## 7–వ అనువాకము

అవ : బ్రహ్మవేత్తయొక్క అభయప్రాప్తి, అతని ఆనందము, మఱియు సుకృతవిశేషమును గుఱించిన వ్యాఖ్య.

అసద్వా ఇదమగ్ర ఆసీత్. తతో వై సదజాయత. తదాత్మా

సగ్గ్ం స్వయమకురుత. తస్మాత్తత్సుకృతముచ్యత ఇతి. యద్వై తత్సుకృతమ్. రసో వై సః. రసగ్గ్ంహ్యేవాయం లబ్ధ్వాఽఽనందీభవతి. కో హ్యేవాన్యాత్కః ప్రాణ్యాత్. యదేషఆకాశ ఆనందో న స్యాత్. ఏష హ్యేవానందయాతి. యదా హ్యేవైష ఏతస్మిన్నదృశ్యేఽనాత్మ్యేఽనిరుక్తేఽనిలయనేఽభయం ప్రతిష్ఠాం విందతే. అథ సోఽభయం గతో భవతి. యదా హ్యేవైష ఏతస్మిన్నుదరమంతరం కురుతే. అథ తస్య భయం భవతి. తత్త్వేవ భయం విదుషోఽమన్వానస్య. తదప్యేషశ్లోకో భవతి.

సృష్టికి, పూర్వము—ప్రప్రథమమున, అసత్తే యుండెను; అనగా అవ్యాకృత రూపమైన బ్రహ్మముగ నుండెను. దానినుండి ఇంద్రియగోచరమగు, సత్పదార్థము—నామరూప ప్రవిభక్తమైన జగత్తయ్యెను. ఇట్లు బ్రహ్మము తనకు తా—స్వయమేవ, జగద్రూప మయ్యెను. సుకృతమగు నా బ్రహ్మము రసస్వరూపము. ఆనందము నొసగు ఆత్మతత్త్వమునై యున్నది ఈ రసమును పొంది మానవు లానందము నొందుచున్నారు. ఈ ఆనందాకాశమే లేనియెడల ఎవడు బ్రతికి యుండగలడు? జీవింపగలడు? ఎవడీ అదృష్టమగు శరీరేంద్రియములు లేని నిరాలంబ వస్తువునందు నిర్భయముగా ప్రతిష్ఠ నొందునో అనుభవము నొందునో అతడభయ పదమును బడయును. ఎవడు తనకు (ఆత్మకు), బ్రహ్మమునకును భేదమును గాంచునో అతడు భయ గ్రస్తుడగును. యథార్థమగు పూర్ణ విచారము లేని విద్వాంసునకు ఈ భయము తప్పదు. (పరోక్ష జ్ఞానికని భావము.)

## 8–వ అనువాకము

### నిరతిశయ బ్రహ్మానందముయొక్క— నిరూపణము

భీషాఽస్మాద్వాతః పవతే. భీషోదేతి సూర్యః. భీషాఽస్మాదగ్నిశ్చేంద్రశ్చ. మృత్యుర్ధావతి పంచమ ఇతి.

సైషాఽఽనందస్య మీమాగ్ంసా భవతి. యువా స్యాత్సాధుయువాఽధ్యాయకః. ఆశిష్ఠో ద్రఢిష్ఠో బలిష్ఠః. తస్యేయం పృథివీ సర్వా విత్తస్య పూర్ణా స్యాత్. స ఏకో మానుష ఆనందః. శ్రోత్రియస్య చాకామహతస్య.

తే యే శతం మానుషా ఆనందాః. స ఏకో మనుష్య గంధర్వాణా మానందః. శ్రోత్రియస్య చాకామహతస్య.

తే యే శతం మనుష్య గంధర్వాణా మానందాః. స ఏకో దేవ గంధర్వాణా మానందః. శ్రోత్రియస్య చాకామహతస్య.

తే యే శతం దేవ గంధర్వాణా మానందాః. స ఏకః పితౄణాం చిరలోకలోకానా మానందః. శ్రోత్రియస్య చాకామహతస్య.

తే యే శతం పితౄణాం చిరలోకలోకానా మానందాః. స ఏక ఆజానజానాం దేవానా మానందః. శ్రోత్రియస్య చాకామహతస్య.

తే యే శత మాజానజానాం దేవానా మానందాః. స ఏకః కర్మదేవానాం దేవానా మానందః. యే కర్మణా దేవానపి యంతి. శ్రోత్రియస్య చాకామహతస్య.

తే యే శతం కర్మదేవానాం దేవానా మానందాః. స ఏకో దేవానా మానందః. శ్రోత్రియస్య చాకామహతస్య.

తే యే శతం దేవానా మానందాః. స ఏక ఇంద్రస్యానందః. శ్రోత్రియస్య చాకామహతస్య.

తే యే శతమింద్రస్యానందాః. స ఏకో బృహస్పతే రానందః. శ్రోత్రియస్య చాకామహతస్య.

తే యే శతం బృహస్పతే రానందాః. స ఏకః ప్రజాపతే రానందః. శ్రోత్రియస్య చాకామహతస్య.

తే యే శతం ప్రజాపతే రానందాః. స ఏకో బ్రహ్మణ ఆనందః. శ్రోత్రియస్య చాకామహతస్య.

స యశ్చాయం పురుషే. యశ్చాసా వాదిత్యే. స ఏకః. స య ఏవం విత్. అస్మాల్లోకాత్ప్రేత్య. ఏత మన్నమయ మాత్మాన ముపసంక్రామతి. ఏతం ప్రాణమయ మాత్మాన ముపసంక్రామతి. ఏతం మనోమయ మాత్మాన ముపసంక్రామతి. ఏతం విజ్ఞానమయ మాత్మాన ముపసంక్రామతి. ఏత మానందమయ మాత్మాన ముపసంక్రామతి. తదప్యేష శ్లోకో భవతి.

అతని భయమువలన వాయువు వీచుచున్నది. సూర్యుడుద యించు చున్నాడు. అగ్నియు, ఇంద్రుడు, అయిదవ వాడగు మృత్యువు తమ తమ కార్యములను జేయుచున్నారు. ఇక ఆనంద విచార పూర్వకమగు తత్వనిర్ణయము—

యువకుడును సద్గుణ సంపన్నుడును సచ్ఛిష్యుడును అనగా జ్ఞాన సంపాదనార్థమై ఉత్కటేచ్ఛ గలవాడును దృఢమగుబుద్ధి గలవాడును చక్కని బలము గలిగి ఆరోగ్యవంతుడై యుండు వానికి ధన పూర్ణమగు నీ భూమండలము నంతటిని పాలించు శక్తియును గలిగి, ఈ దృష్టా దృష్ట భోగసాధనములచే పూర్ణమయి యొప్పు ఇట్టి చక్రవర్తికి గలుగు ఆనందము మానవానందము అనబడును. ఇట్టి మనుష్యానందముక కంటెను నూటింత లధికమైనది మనుష్య గంధర్వానందము. ఇది నిష్కాముడగు వేదజ్ఞునకు ఉండును. మనుష్యగంధర్వానందము కంటె దేవగంధర్వానందము నూటింతలు అధికము. ఇదియు నిష్కాము డగు వేదజ్ఞునకుండును. దేవగంధర్వానందముకంటెను పితృదేవతల ఆనందము నూటింత లధికము. ఇదియును నిష్కామ వేదజ్ఞునకుండు ఆనందమే. పితృదేవతల ఆనందముకంటెను ఆజానజ దేవతలైయున్న వారి ఆనందము నూటింతలు అధికము. ఇదియు నిష్కామ వేదజ్ఞున కుండు ఆనందమే. ఆజానజ దేవతల ఆనందముకంటె నూటింత లధికమైన ఆనందము కర్మదేవతలకుండును. ఇదియు నిష్కాముడైన వేదజ్ఞున కుండును. కర్మదేవతలకంటె జన్మతః దేవతలై యుండువారి యానందము నూటింతలధికము. దేవతల ఆనందముకంటెను ఇంద్రుని ఆనందము నూటింతలధికము. ఇంద్రుని ఆనందముకంటెను బృహస్పతి ఆనందము నూటింతలధికము. బృహస్పతి ఆనందముకంటెను ప్రజాపతి ఆనందము నూటింతలధికము. ప్రజాపతి ఆనందముకంటెను నూటింత లధికము బ్రహ్మయొక్క ఆనందము. ఇదియు నిష్కామ వేదజ్ఞున కుండు ఆనందమే. ఈ పురుషుని యందు దానంద స్వరూపమగు నే బ్రహ్మము న్నదో అదే సూర్యమండలమునందున్న పరబ్రహ్మమై యున్నది. అది ఏకము.

ఈ విధముగా నెఱిగినవాడు ఈ లోకమునుండి

అన్నమయాత్మను దాటిపోవును. ఈ ప్రాణమయాత్మను దాటిపోవును. ఈ విజ్ఞానమయాత్మను దాటి వెడలును. ఈ ఆనందమయాత్మ నతిక్రమించి వెడలును. వీనిని ఆత్మ గాదని అతడు తెలియును. ఇచ్చట నిష్కాముడగు వేదజ్ఞుని ఆనందమని ప్రతి వాక్యమునను చెప్పబడిన దాని కభిప్రాయ మేమన, ఆముష్మిక సుఖము నుపేక్షించి ఐహిక వాంఛను వీడిన వాడని గ్రహింపవలయును.

## 9-వ అనువాకము

### బ్రహ్మానందానుభవి యగు విద్వాంసుని అభయప్రాప్తి

యతో వాచో నివర్తంతే. అప్రాప్య మనసా సహ. ఆనందం బ్రహ్మణో విద్వాన్. న బిభేతి కుతశ్చనేతి. ఏతగ్ం హ వావ న తపతి కిమహగ్ం సాధు నాకరవమ్. కిమహం పాప మకరవమితి. స య ఏవం విద్వానేతే ఆత్మానగ్గ్ం స్పృణుతే. ఉభే హ్యేవైష ఏతే ఆత్మానగ్గ్ం స్పృణుతే. య ఏవం వేద. ఇత్యుపనిషత్.

తనకు గోచరము కానందువలన వాక్ఛక్తి ఎచ్చటివఱకు వెళ్ళి వెనుదిరిగి వచ్చుచున్నదో ఆ బ్రహ్మముయొక్క ఆనంద స్వరూపము నరసిన విద్వాంసుడు దేనిచేతను భయభీతుడు గాడు. "నేను మంచి చేయలేదే! పాపము నాచరించితినే!" యను ఇత్యాదిగా గల చింత ఆ విద్వాంసునకు రాదు. దుఃఖించడు. తాత్పర్య మేమనిన, బ్రహ్మజ్ఞాన మొందిన విద్వాంసుడు ఈ పుణ్య పాపములను ఆత్మమయముగా జూచును. ఈ పుణ్యాపాపముల రెండింటిని అతడు బ్రహ్మమయ మొనర్చును. అనగానివి బ్రహ్మజ్ఞానాగ్నియందు భస్మమై పోవునని భావము. ఇట్లు ఉపనిషత్తు జ్ఞానబోధ.

ఓం సహ నా వవతు. స హ నౌ భునక్తు. సహ వీర్యం కరవావహై. తేజస్వి నా వధీతమస్తు. మా విద్విషావహై.

ఓం శాంతిః శాంతిః శాంతిః

ఆనందవల్లి సమాప్తము

## భృగువల్లి

హరిః ఓమ్. సహ నా వవతు. సహ నౌ భునక్తు. సహ వీర్యం కరవావహై. తేజస్వి నావధీతమస్తు మా విద్విషావహై.
ఓం శాంతిః శాంతిః శాంతిః.

### 1-వ అనువాకము

అవ : భృగు వను నతడు అతని తండ్రియగు వరుణుని కడకు వెడలి బ్రహ్మవిద్యా విషయక మగు ప్రశ్న నడుగుట. వరుణు డుపదేశము చేయుట అను నీ విషయ క్రమము చెప్పబడును—

భృగుర్వై వారుణిః. వరుణం పితర ముపససార. అధీహి భగవో బ్రహ్మేతి. తస్మా ఏతత్ప్రోవాచ. అన్నం ప్రాణం చక్షుశ్శ్రోత్రం మనో వాచమితి. తగ్ంహోవాచ. యతో వా ఇమాని భూతాని జాయంతే. యేన జాతాని జీవంతి. యత్ప్రయంత్యభిసంవిశంతి. తద్విజిజ్ఞాసస్వ. తద్బ్రహ్మేతి. స తపోఽతప్యత. స తపస్తప్త్వా.

వరుణ పుత్రుడగు భృగువు తన తండ్రి యగు వరుణుని కడకు వెళ్ళి పూజ్యా! నాకు బ్రహ్మోపదేశము చేయుమని అడిగెను. అతని తండ్రి ఇట్లు జెప్పెను.

అన్నము, ప్రాణము, చక్షుస్సు, శ్రోత్రము, మనస్సు, వాక్కు ఈ మొదలగునవి బ్రహ్మము నెఱుగుటకు మార్గము లని చెప్పి మరల ఇట్లనియె. ఎచ్చటినుండి ఈ భూతములు పుట్టునో, పుట్టిన భూతములెల్ల ఏ ఆధారమున జీవించుచున్నవో, మఱియు దేనియందు లయమగునో దానిని చక్కగా దెలిసికొను మనెను. అంత నా భృగు వద్దానినిగుఱించి తప మాచరించెను (విచారణ చేసెను.)

### 2-వ అనువాకము

అవ : అన్నమే బ్రహ్మమని భృగువు తలంచుట. అందు బ్రహ్మలక్షణములు లేవేయని మరల వరుణునికడకు వచ్చి అడుగుట. తపస్సు చేసి తెలిసికొనుమని చెప్పుట.

అన్నం బ్రహ్మేతి వ్యజానాత్. అన్నాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే. అన్నేన జాతాని జీవంతి. అన్నం ప్రయంత్యభిసంవిశంతీతి.

తద్విజ్ఞాయ. పునరేవ వరుణం పితర ముపససార. అధీహి భగవో బ్రహ్మేతి. తగ్ం హోవాచ. తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ. తపో బ్రహ్మేతి. స తపోఽతప్యత. స తప స్తప్త్వా.

అతడు తప మాచరించి అన్నము బ్రహ్మమని నిశ్చయించెను. నిజముగా ఈ భూతములు అన్నమునుండియే జీవించుచున్నవి. అన్నముకొఱకై చరించుచున్నవి. అన్నమునందే లయ మగు చున్నవని తెలిసికొనెను. కాని అంత మాత్రమున సంతుష్టుడు గాక సంశయముతో భృగువు మరల తండ్రికడకు వెళ్ళి పూజ్య గురువర్యా! నాకు బ్రహ్మోపదేశము జేయుమని యడిగెను. అందులకతనికి వరుణు డిట్లు తెలిపెను. తపస్సుచే చక్కగా బ్రహ్మమును దెలిసికొమ్ము. తపస్సే బ్రహ్మమని బోధించెను. భృగువు తప మాచరించెను.

## 3-వ అనువాకము

అవ : ప్రాణమే బ్రహ్మమని తలంచుటయు, భృగువు మరల అది బ్రహ్మము గాదే యని తిరుగ వచ్చుటయు మరల తప మాచరించుమని యాదేశించుటయు.

ప్రాణో బ్రహ్మేతి వ్యజానాత్. ప్రాణాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే. ప్రాణేన జాతాని జీవంతి. ప్రాణం ప్రయంత్యభిసంవిశంతీతి. తద్విజ్ఞాయ. పునరేవ వరుణం పితర ముపససార, అధీహి భగవో బ్రహ్మేతి. తగ్ం హోవాచ. తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ. తపో బ్రహ్మేతి. స తపోఽతప్యత. స తప స్తప్త్వా.

తపస్సు చేసిన పిదప ప్రాణమును బ్రహ్మమని భృగువు నిశ్చయించెను. ఈ భూతము లెల్ల ప్రాణమునుండియే ఉత్పన్న మగుచున్నవి. పుట్టిన భూతములు ప్రాణాధారముననే జీవించుచున్నవి. ప్రాణమునందు లయ మగుచున్నవి. ఈ ప్రకారముగ దెలిసి భృగువు మరల సంశయముచే తండ్రికడకు వెళ్ళి పూజ్యస్వామీ! నాకు బ్రహ్మోపదేశము చేయవలెనని అడిగెను. అందులకు వరుణుడు అయ్యా! తపస్సుచే బ్రహ్మమును చక్కగా నెఱుగుము. తపస్సే బ్రహ్మమని చెప్పగా భృగువు మరల తప మాచరించెను.

## 4-వ అనువాకము.

అవ : మనస్సే బ్రహ్మము. ... తపస్సు చేయుము.

మనో బ్రహ్మేతి వ్యజానాత్. మనసో హ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే. మనసా జాతాని జీవంతి. మనః ప్రయంత్యభిసం విశంతీతి. తద్విజ్ఞాయ. పునరేవ వరుణం పితర ముపససార. అధీహి భగవో బ్రహ్మేతి. తగ్ం హోవాచ. తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ. తపో బ్రహ్మేతి. స తపోఽతప్యత. స తపస్తప్త్వా.

భృగువు తప మాచరించి యా పిదప మనస్సు బ్రహ్మమని నిశ్చ యించెను. మనస్సుచే సమస్త భూతములు పుట్టును. పుట్టిన భూతములు మనస్సు నాధారముగా గైకొని జీవించును. మనస్సును గుఱించి పయన మొనర్చును. మనస్సునందే లయ మగును. ఈ విధముగ తెలిసికొని (మరల) సంశయముతో భృగువు తండ్రియైన వరుణునికడకు వెళ్ళెను. పూజ్య గురువర్యా! నాకు బ్రహ్మోపదేశము చేయు మని యడిగెను. అందులకు వరుణుడు తపస్సుచే బ్రహ్మమును చక్కగా నెఱుగుము. తపస్సే బ్రహ్మమని చెప్పగా అంత భృగువు తప మాచరించెను. తపస్సు చేసెను.

## 5-వ అనువాకము.

అవ : విజ్ఞానమే బ్రహ్మము ... తపస్సు చేయుము.

విజ్ఞానం బ్రహ్మేతి వ్యజానాత్. విజ్ఞానాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే. విజ్ఞానేన జాతాని జీవంతి. విజ్ఞానం ప్రయంత్యభిసం విశంతీతి. తద్విజ్ఞాయ. పునరేవ వరుణం పితరముపససార. అధీహి భగవో బ్రహ్మేతి. తగ్ం హోవాచ. తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ. తపో బ్రహ్మేతి. స తపోఽతప్యత. స తపస్తప్త్వా.

భృగువు అట్లే తప మాచరించి విజ్ఞానము బ్రహ్మమని నిశ్చయిం చెను. విజ్ఞానము నుండియే ఈ భూతములు పుట్టుచున్నవి. పుట్టిన భూత ములు విజ్ఞానాధారమున జీవించుచున్నవి. విజ్ఞానము ననుసరించి గమ నము జేయుచున్నవి. విజ్ఞానమునందే లయ మొందుచున్నవి. ఈ విధ ముగ దెలిసికొని సంశయముతో భృగువు మరల తండ్రియగు వరుణుని

కడకు వెళ్ళి పూజ్యస్వామీ! బ్రహ్మోపదేశము చేయుడని యడి గెను. అప్పుడు వరుణుడు తపస్సుచే బ్రహ్మమును చక్కగా తెలిసికొను ము. తపస్సే బ్రహ్మమని చెప్పెను. అంత భృగువు తపమాచరించెను.

## 6–వ అనువాకము

అవ : ఆనందమే బ్రహ్మమని చెప్పుట. భృగువు నిశ్చయ మొందుట. ఈ భార్గవీ వారుణీ విద్యయొక్క మహిమను తత్ఫలాదు లను దెలుపుట.

ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్. ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే. ఆనందేన జాతాని జీవంతి. ఆనందం ప్రయంత్యభి. సంవిశంతీతి. సైషా భార్గవీ వారుణీ విద్యా. పరమే వ్యోమన్ ప్రతి ష్ఠితా. య ఏవం వేద ప్రతితిష్ఠతి. అన్నవానన్నాదో భవతి. మహాన్భ వతి ప్రజయా పశుభిర్బ్రహ్మవర్చసేన. మహాన్కీర్త్యా.

ఇట్లు తప మాచరించి తుదకు ఆనందము బ్రహ్మమని నిశ్చయిం చెను. ఆనందము నుండియే ఈ భూతములు పుట్టుచున్నవి. పుట్టిన భూతములు ఆనందమునందే జీవించుచున్నవి. ఆనందమును గుఱిం చియే పయన మొనర్చుచున్నవి. ఆనందమునందే లయ మగుచున్నవి. ఇదే భార్గవీ వారుణీ విద్య. ఈ తత్త్వము శ్రేష్ఠమగు హృదయాకాశ మున ప్రతిష్ఠితము. దీనిని దెలిసిన వాడు బ్రహ్మరూపు డగును. అన్నము చేత సమృద్ధు డగును. అన్నము నుపభోగించు వాడగును. ప్రభావంతు డగును. పశువులు గలవాడును బ్రహ్మవర్చస్సు గలవాడును కీర్తివం తుడునై శ్రేష్ఠుడగుచున్నాడు.

## 7–వ అనువాకము

అవ : అన్నముయొక్క నింద చేయరాదు. ఇది వ్రతమనియు మఱియు అన్నవిషయక మగు ఉపాసన, వ్రతపద్ధతులును, తత్ఫలము నీ మొదలగు విషయములును 8, 9, 10 ఈ అనువాకములయందు చెప్ప బడును. మఱియు 10వ అనువాకాంత్యమున బ్రహ్మవేత్తచే చేయబడిన సామగానమును ఇందు గలదు.

అన్నం న నింద్యాత్. తద్వ్రతమ్. ప్రాణో వా అన్నమ్. శరీర మన్నాదమ్. ప్రాణే శరీరం ప్రతిష్ఠితమ్. శరీరే ప్రాణః ప్రతిష్ఠితః. తదేత

దన్నమన్నే ప్రతిష్ఠితమ్. స య ఏతదన్నమన్నే ప్రతిష్ఠితం వేద ప్రతిష్ఠతి. అన్నవానన్నాదో భవతి. మహాన్భవతి. ప్రజయా పశుభిర్బ్రహ్మవర్చసేన. మహాన్కీర్త్యా.

అన్నమును నిందించరాదు. అదొక వ్రతము. ప్రాణమే అన్నము శరీరము అన్నమును భక్షించును. ప్రాణమునందు శరీరము ప్రతిష్ఠితమై యున్నది. శరీరమునందు ప్రాణము ప్రతిష్ఠితమై యున్నది. అన్నము అన్నమునందు ప్రతిష్ఠింపబడి యున్నదని ఎవడు చక్కగా తెలియునో వాడు ప్రతిష్ఠ గలవాడగును. అన్నముచే సమృద్ధుడును అన్నమునుపభోగించువాడును అగును. ప్రజచేతను పశువులచేతను బ్రహ్మవర్చస్సుతోను సంపన్నుడై కీర్తి గలవాడును శ్రేష్ఠుడు నగును.

## 8-వ అనువాకము

అన్నం న పరిచక్షీత. తద్వ్రతమ్. ఆపో వా అన్నమ్. జ్యోతిరన్నాదమ్. అప్సు జ్యోతిః ప్రతిష్ఠితమ్. జ్యోతిష్యాపః ప్రతిష్ఠితాః. తదేతదన్నమన్నే ప్రతిష్ఠితమ్. స య ఏతదన్నమన్నే ప్రతిష్ఠితం వేద ప్రతితిష్ఠతి. అన్నవా నన్నాదో భవతి. మహాన్భవతి ప్రజయా పశుభిర్బ్రహ్మవర్చసేన. మహాన్కీర్త్యా.

అన్నమును నిందించవలదు. అదొక వ్రతము. జలము అన్నము. జ్యోతి అనగా తేజస్సు అన్నమును భక్షించును. జలమునందు జ్యోతి ప్రతిష్ఠితము; జ్యోతియందు జలము ప్రతిష్ఠితము. ఇట్లు అన్నమునందు అన్నము ప్రతిష్ఠితమై యున్నది. అన్నమునందు అన్నము ప్రతిష్ఠితమై యున్నదని తెలిసినవాడు ప్రతిష్ఠితు డగును. అన్నముచే సమృద్ధుడును అన్నము నుపభోగించువాడు నగును. ప్రజలు, పశువులు బ్రహ్మవర్చస్సు కీర్తియు నతనికి గలుగును. శ్రేష్ఠుడగును.

## 9-వ అనువాకము

అన్నం బహు కుర్వీత. తద్వ్రతమ్. పృథివీ వా అన్నమ్. ఆకాశోఽన్నాదః. పృథివ్యా మాకాశః ప్రతిష్ఠితః. ఆకాశే పృథివీ ప్రతిష్ఠితా. తదేతదన్నమన్నే ప్రతిష్ఠితమ్. స య ఏతదన్నమన్నే ప్రతిష్ఠితం వేద ప్రతితిష్ఠతి. అన్నవా నన్నాదో భవతి. మహాన్భవతి ప్రజయా పశుభిర్బ్రహ్మవర్చసేన. మహాన్కీర్త్యా.

ఆహార పదార్థములను చక్కగా పండించ వలయును. అదొక వ్రతము. పృథివియే అన్నము. ఆకాశము అన్నమును భక్షించును. పృథివి ఆకాశమునందు ప్రతిష్ఠితమై యున్నది. అన్నము అన్నమునందు ప్రతిష్ఠితమై యున్నదని తెలిసినవాడు ప్రతిష్ఠ నొందును. అన్న సమృద్ధి గలవాడగును. ప్రజా పశు బ్రహ్మవర్చస్సమన్వితుడై కీర్తి నొంది శ్రేష్ఠుడగును.

## 10-వ అనువాకము

న కంచన వసతౌ ప్రత్యాచక్షీత. తద్వ్రతమ్. తస్మాద్యయా కయా చ విధయా బహ్వన్నం ప్రాప్నుయాత్. అరాధ్యస్మా అన్న మిత్యాచక్షతే. ఏతద్వై ముఖతో ఽన్నగ్ం రాద్ధమ్. ముఖతో ఽస్మా అన్నగ్ం రాధ్యతే. ఏతద్వై మధ్యతోఽన్నగ్ం రాద్ధమ్. మధ్యతోఽస్మా అన్నగ్ం రాధ్యతే. ఏతద్వా అంతతో ఽన్నగ్ం రాద్ధమ్. అంతతో ఽస్మా అన్నగ్ం రాధ్యతే. య ఏవం వేద.

ఇంటిలో స్థలము లేదు పొమ్మని చెప్పరాదు. ఇదొక వ్రతము. అంతే కాదు. వచ్చినపుడు అన్నమును కూడా ఇవ్వవలెను. అందుచేత విశేషముగ అన్నమును సంపాదించవలెను. అన్న మడిగిన వారికి లేదనరాదని భావము. అత్యాదర పూర్వకముగ అన్నమును సిద్ధ మొనర్చవలయును. ఇదిగో అన్నము సిద్ధము చేయబడినది అని చెప్ప వలెను. శ్రద్ధకు తగిన విధమునసే అన్నదాతకు అన్నము లభించును. దీని నెవడు తెలియునో అతనికి అన్నము లభించును.

క్షేమ ఇతి వాచి. యోగక్షేమ ఇతి ప్రాణాపానయోః. కర్మేతి హస్తయోః. గతిరితి పాదయోః. విముక్తిరితి పాయౌ. ఇతి మానుషీ స్సమాజ్ఞాః.

వాక్కున క్షేమముగా, యోగక్షేమములుగా ప్రాణాపానముల యందును, కర్మగా హస్తములయందును, సంచారముగా పాదముల యందును, విసర్జనముగా గుదమునందును, బ్రహ్మము ప్రతిష్ఠింపబడినది. ఇది మానవ సంబంధమగు ఉపాసన.

అథ దైవీః. తృప్తిరితి వృష్టౌ. బలమితి విద్యుతి. యశ ఇతి పశుషు. జ్యోతిరితి నక్షత్రేషు. ప్రజాతి రమృత మానంద ఇత్యుపస్థే. సర్వమిత్యాకాశే. తత్ప్రతిష్ఠేత్యుపాసీత. ప్రతిష్ఠావాన్భవతి. తన్మహ ఇత్యుపాసీత. మహాన్భవతి. తన్మన ఇత్యుపాసీత. మానవాన్భవతి.

ఇక దేవతా సంబంధమైన యుపాసన—తృప్తిరూపమున వర్షము నందును బలరూపమున విద్యుత్తునందును యశోరూపమున పశువుల యందును జ్యోతిరూపమున నక్షత్రములయందును ప్రజారూపమునను అమృతత్వము, ఆనందము-వీనిరూపమున ఉపస్థయందును బ్రహ్మము నుపాసింపవలెను. సర్వరూపమున బ్రహ్మము ఆకాశమందున్నదని ఉపాసింపవలెను. ఆబ్రహ్మపదార్థమును ప్రతిష్ఠ (ఆధారము) యని ఉపాసింపవలెను. ఇట్లుపాసించు వాడు ప్రతిష్ఠ గలవాడగుచున్నాడు. దానిని మహః (తేజస్సు) యని ఉపాసించునాతడు మహిమ గలవాడగును. దానిని మనః అని ఉపాసించువాడు మర్యాద గలవాడగును.

తన్నమ ఇత్యుపాసీత. నమ్యంతేఽస్మై కామాః. తద్బ్రహ్మే త్యుపాసీత. బ్రహ్మవాన్భవతి. తద్బ్రహ్మణః పరిమర ఇత్యుపాసీత. పర్యేణ మ్రియంతే ద్విషన్తస్సపత్నాః. పరియేఽప్రియా భ్రాతృవ్యాః. సయశ్చాయం పురుషే. యశ్చాసావాదిత్యే. స ఏకః.

దానిని (బ్రహ్మమును) నమః (నమస్కార యోగ్యము) అని ఉపాసన చేయవలయును. అతనికి సర్వ కామములు నమస్కార మొనర్చును. దానిని బ్రహ్మమని యుపాసింపవలయును. ఇట్లుపాసించు వాడు బ్రహ్మజ్ఞుడగును. దానిని లయస్థాన మని ఉపాసించవలెను. అప్రియులును, విద్వేషులును, శత్రువులు నగు ఎల్లవారు సంపూర్ణ ముగ నాశమొందుదురు. ఈ పురుషునియందును ఆ ఆదిత్యునియందును ఉండువా డతడే.

స య ఏవం విత్. అస్మాల్లోకాత్ప్రేత్య. ఏతమన్నమయ మాత్మాన ముపసంక్రమ్య. ఏతం ప్రాణమయ మాత్మాన ముప సంక్రమ్య. ఏతం మనోమయ మాత్మాన ముపసంక్రమ్య. ఏతం విజ్ఞానమయ మాత్మాన ముపసంక్రమ్య. ఏత మానందమయ మాత్మాన ముపసంక్రమ్య. ఇమాంల్లోకాన్ కామాన్నీ కామరూప్యను

సంచరన్. ఏతత్సామగాయన్నాస్తే. హా౩ వుహా౩ వుహా౩ వుహా౩వు.

ఈ జ్ఞానము గలవాడు ఈ లోకము నుండి వెడలి అన్నమయాత్మ, ప్రాణమయాత్మ, మనోమయాత్మ, విజ్ఞానమయాత్మయను వీనిని అతిక్రమించి విద్యాధరుడై కామములననుభవించుచు ఈ క్రింది సామమంత్రములను పాడుచు సంచరించును. ఏంతటి ఆశ్చర్యము. ఆహా! ఆహా! ఆహా! హా!

అహమన్న మహమన్న మహమన్నమ్. అహ మన్నాదో౩౽హ మన్నాదో౩౽హ మన్నాదః. అహగ్గ్ం శ్లోకకృ దహగ్గ్ంశ్లోకకృదహగ్గ్ంశ్లోకకృత్. అహమస్మి ప్రథమజా ఋతా౩స్య. పూర్వం దేవేభ్యో అమృతస్య నా౩భా౩ఇ. యోమా దదాతి స ఇదేవ మా౩౽౽వాః. అహమన్న మన్న మదంత మా౩ద్మి. అహంవిశ్వం భువన మభ్యభ వా౩మ్. సువర్ణ జ్యోతీః. య ఏవం వేద. ఇత్యుపనిషత్.

నేను అన్నము. నేను అన్నము. నేను అన్నము. నేను అన్నము తినువాడను. నేను అన్నము తినువాడను. నేను అన్నమును భుజింతును. నేను స్తోత్రము చేయువాడను. నేను సత్యముకంటెను పూర్వమునందు పుట్టినవాడను దేవతలకంటెను పూర్వమున అమృత మధ్యమున (నాభియందు) పుట్టిన వాడను. ఎవడు నాకు అన్నము సమర్పించునో అతడు నా వలెనే యగును. నేను అన్నము. ఇతరులకు పెట్టకయే అన్నము తినువానిని నేను తినెదను. నేను విశ్వమును (సమస్త) భువనమును వ్యాపించి యున్నాను. ఇట్లు తెలిసినవాడు ఆకాశమున మహాప్రకాశవంతమగు జ్యోతి వ్యాపించునట్లు సర్వమును వ్యాపించును.

ఈ భృగువల్ల్యుపనిషత్తునందలి తాత్పర్య మేమన, ఇందు రెండే ఉపదేశవాక్యములు గలవు. ఒకటి అన్నము, ప్రాణము, చక్షుస్సు, శ్రోత్రము, వాక్కు ఇవి బ్రహ్మమును దెలియుటకు ద్వారము లనియును ఇక రెండవది దేనినుండి ఈ సమస్త భూతములు పుట్టుచున్నవో, పుట్టినవి దేనియందు వసించుచున్నవో, దేనియందు లయించుచున్నవో అదియే ఆనంద స్వరూపమగు బ్రహ్మమని చెప్పి, అది అవాఙ్మానసగోచరము. దానిని తపస్సుచే తెలిసికొనుమని అన్నప్రాణాదులను ద్వారములుగా జెప్పుటవలన పంచకోశరూపమైన గుహాంతర్వాసియగునది పరబ్రహ్మమే

సని ఇచ్చట అన్వయము. ఈ దృశ్యమగు అనాత్మాత్మభ్రాంతిని వీడి బ్రహ్మానంద స్వరూపమని గ్రహింపవలెను.

ఓం సహ నావవతు. సహ నౌ భునక్తు. సహ వీర్యం కరవావహై. తేజస్వి నావధీతమస్తు. మా విద్విషావహై.

ఓం శాంతిః శాంతిః శాంతిః.

తైత్తిరీయోపనిషత్తు సంపూర్ణము.

—ం॰॰ం—

# ౮. ఐతరేయోపనిషత్తు

హరిః ఓమ్. వాఙ్మే మనసి ప్రతిష్ఠితా. మనో మే వాచి ప్రతిష్ఠితమ్. ఆవిరావీర్మ ఏధి. వేదస్య మ ఆణీస్థః. శ్రుతం మే మా ప్రహాసీః. అనేనాధీతేనాహోరాత్రాంత్సందధామి. ఋతం వదిష్యామి. సత్యం వదిష్యామి. తన్మామవతు. తద్వక్తారమవతు. అవతుమామ్. అవతు వక్తారమవతు వక్తారమ్. ఓం శాంతిః శాంతిః శాంతిః

నాయొక్క వాక్ఛక్తి స్థిరముగా మనస్సునందు ప్రతిష్ఠితమై యున్నది. స్వయంప్రకాశస్వరూపా! నాయందు వ్యక్తమగుము. నన్ను సంపూర్ణ వేదవిద్యా సంపన్నునిగ జేయుము. అజ్ఞతను బాపుము. నా విద్యను హాస్యాస్పద మొనర్ప వలదు. అధ్యయనము చేసిన దానిని అహర్నిశ రేయింబవలు అనుసంధాన మొనర్తునుగాక! నేను యథార్థముగ మాటలాడెదను. నేను సత్యము నే పలికెదను. సత్యము నన్ను గాచుగాక! సత్యము సత్యమును బలుకు వానిని, గురుని రక్షించుగాక! గురుని రక్షించుగాక! గురుని రక్షించని! ఓం శాంతిః శాంతిః శాంతిః

## 1-వ అధ్యాయము-1-వ ఖండము

### ఆత్మయొక్క ఈక్షణ పూర్వకమైన సృష్టిక్రమము

ఆత్మా వా ఇదమేక ఏవాగ్ర ఆసీన్నాన్యత్కించన మిషత్. స ఈక్షత లోకాన్నుసృజా ఇతి. 1

సృష్టికి పూర్వము ప్రప్రథమమున అద్వితీయమగు నీ యాత్మ ఒక్కటే యుండెను. దీనికంటె వేఱుగా ఏమియు నుండలేదు. ఈయాత్మ లోకములను సృజింప వలెనని ఆలోచించెను.

స ఇమాంల్లోకానసృజత. అమ్భోమరీచీర్మరమాపోఽదోఽమ్భః పరేణ దివం ద్యౌః ప్రతిష్ఠాఽన్తరిక్షం మరీచయః. పృథివీ మరో యా అధస్తాత్తా ఆపః. 2

పిదప ఈ (క్రింద కనబఱచు) లోకములను సృజించెను. అంభస్సు, స్వర్గలోకము, దానికి మీాదనుండు మహర్లోకము, సత్య లోకము మొదలగునవి. మరీచి సూర్య కిరణములచే వ్యాపింపబడిన అంతరిక్ష లోకమును మరము - జీవుల నాశస్థానమగు భూలోకమును సృజించెను. ఆ లోకము అనగా స్వర్గలోకమే ఆశ్రయస్థానము అంతరిక్షము-మరీచిలోకము, పృథివి-మృత్యులోకము. ఆక్రింద ఆపోలోకము. ఈ సృష్టికల్పన యంతయును అధ్యారోప ప్రక్రియ యని గ్రాహ్యము.

స ఈక్షతేమే ను లోకా లోకపాలాన్ను సృజా ఇతి. సోఽద్భ్య ఏవ పురుషం సముద్ధృత్యామూర్ఛయత్. 3

ఈ విధముగ లోకములను సృష్టించిన పిదప లోక పాలకులను సృజింప వలెనని యాలోచించి అతడు జలమునుండి పురుషుని వేఱు పరచి అతని కొక యాకృతిని కల్పించెను.

అవ: ఇంద్రియములు ఇంద్రియాధిష్ఠాన దేవతలు మొదలగు వాటియొక్క సృష్టిక్రమము.

తమభ్యతపత్తస్యాభితప్తస్య ముఖం నిరభిద్యత యథాఽణ్డమ్. ముఖాద్వాగ్వాచోఽగ్నిర్నాసికే నిరభిద్యేతాం నాసికాభ్యాం ప్రాణః ప్రాణాద్వాయురక్షిణీ నిరభిద్యేతామక్షిభ్యాం చక్షుశ్చక్షుష ఆదిత్యః కర్ణౌ నిరభిద్యేతాం కర్ణాభ్యాం శ్రోత్రం శ్రోత్రాద్దిశస్త్వఙ్నిరభిద్యత త్వచో లోమాని లోమభ్య ఓషధివనస్పతయో హృదయం నిరభిద్యత హృదయాన్మనో మనసశ్చన్ద్రమా నాభిర్నిరభిద్యత నాభ్యా అపానోఽపానాన్మృత్యుః శిశ్నం నిరభిద్యత శిశ్నాద్రేతో రేతస ఆపః. 4

దానికి వేడి నొసగెను. తద్విషయకమై ధ్యానించెనని భావము.

ఇట్లు తప్తమైనందువలన గ్రుడ్డు పగులునట్లు బ్రహ్మాండమునకు ఒక ముఖ మేర్పడెను. ఆ ముఖమునుండి వాక్కు, వాక్కునుండి అగ్ని యును కలిగెను. అనంతరము నాసికా (ముక్కు) గోళములు కలిగెను. వాటి లోపలనుండి ప్రాణము, ప్రాణమునుండి వాయువు, తరువాత కన్ను లేర్పడెను. కన్నులనుండి చక్షురింద్రియములును వాటినుండి ఆదిత్యుడును (అటువలె) చెవులును కలిగెను. చెవులనుండి శ్రోత్రేంద్రియము పుట్టెను. తద్ద్వారా దిక్కులు (అనంతరము) చర్మేంద్రియ మగపడెను. చర్మమునుండి రోమములచే నుపలక్షితమగు స్పర్శేంద్రియమును దానినుండి ఓషధి వనస్పతులును హృదయమును పుట్టెను. హృదయమునుండి (అంతఃకరణము) మనస్సు, మనస్సునుండి చంద్రుడును (పిదప) నాభియు నుత్పన్న మాయెను. నాభినుండి అపాన వాయువు, అపానవాయువునుండి మరణమును, శిశ్నమునుండి రేతస్సు, రేతస్సునుండి జలమును గలిగెను. ఇట్లు ఇంద్రియములను ఇంద్రియ విషయములను మఱియు తదధిదేవతలను సృష్టించెనని ఈ మంత్రము నందలి అర్థము. కండ్లు చెవులు మొదలగునవి ఆకారవంతములై యుండినను వీటికి లోపలనుండు ఇంద్రియములు సూక్ష్మములు. గ్రహించుటకు శక్తిగల లోపలి ఇంద్రియములు లేక యుండిన ఇవి గ్రుడ్డివి చెవిటివియు నగును. అధిష్ఠాన దేవతల అనుగ్రహముచే ఇంద్రియములు వ్యవహార వంతములు.

## 1-వ అధ్యాయము - 2-వ ఖండము.

దేవతలు అనగా ఇంద్రియములు తమకు ఆశ్రయస్థానము నడుగుట

తా ఏతా దేవతాః సృష్టా అస్మిన్మహత్యర్ణవే ప్రాపతన్, తమ శనాపిపాసాభ్యామన్వవార్జత్. తా ఏన మబ్రువన్నాయతనం నః ప్రజానీహి యస్మిన్ ప్రతిష్ఠితా అన్న మదామేతి. 1

సృష్టింపబడిన ఆ సమస్త దేవతలు మహాసముద్రమువలెనున్న విరాట్పురుష శరీరమునందు జేరిరి. వారు ఆకలిదప్పులు గలవారైరి. అప్పుడు వారందఱు ఆత్మతో ఇట్లు జెప్పిరి. "మాకు ఆశ్రయస్థానమును జూపుము. దానియందుండి మేమన్నము తినెదము." మనిరి. నౌక శరీరమును కల్పించెను. అందు నిలిచి

అవ: గోవుల, అశ్వముల శరీరములనుజూపింప దేవతలు స్వీకరింపక అసమ్మతిని జూపుట.

తాభ్యో గామానయత్తా అబ్రువన్నవై నోఽయమలమితి:-
తాభ్యోఽశ్వమానయత్తా అబ్రువన్నవై నోఽయమలమితి.

అప్పుడు ఆత్మ అనగా ఈశ్వరుడు గోవును సృష్టించి తెచ్చి ఈ శరీరము మీకు తగునా? యని అడిగెను. ఇది మాకు యోగ్యము కాదని దేవతలు చెప్పిరి. ఆ పిదప గుఱ్ఱము నొకదానిని సృష్టించి వారికి చూపెను. ఇదియును మాకు సరికాదని వారు పలికిరి.

మానవ శరీరము నుత్పత్తిజేయ దానిని జూచి దేవతలు (ఇంద్రియములు) అంగీకరించుట.

తాభ్యః పురుషమానయత్తా అబ్రువన్ సుకృతం బతేతి పురుషో వావ సుకృతమ్. తా అబ్రవీద్యథాఽఽయతనం ప్రవిశతేతి. 3

అంత వారికి ఒక పురుషుని సృష్టించి చూపెను. ఔను; పురుషుడనిన పుణ్య రాశియే కదా! సుకృతవిశేషము కావున చాల బాగుగా నున్నదనిరి. అంత నా పురుషుని శరీరమునందు దేవత లెట్లు ప్రవేశింపవలయు ననునది ఆత్మ (ఈశ్వరుడు) వారికీవిధముగా దెలిపెను.

అవ: అప్పుడు దేవతలు (ఇంద్రియములు) తమ తమ స్థానములందు ప్రవేశించుట.

అగ్నిర్వాగ్భూత్వా ముఖం ప్రావిశత్, వాయుః ప్రాణో భూత్వా నాసికే ప్రావిశత్. ఆదిత్యశ్చక్షుర్భూత్వాఽక్షిణీ ప్రావిశత్. దిశః శ్రోత్రం భూత్వా కర్ణౌ ప్రావిశన్. ఓషధివనస్పతయో లోమాని భూత్వా త్వచం ప్రావిశన్. చంద్రమా మనో భూత్వా హృదయం ప్రావిశత్. మృత్యురపానో భూత్వా నాభిం ప్రావిశత్. ఆపో రేతో భూత్వా శిశ్నం ప్రావిశన్. 4

అగ్ని దేవత వాగ్రూపమున ముఖమున జేరెను. వాయువు ప్రాణమై నాసికా (ముక్కు) గోళములయందు జొచ్చెను. సూర్యుడు దృగ్రూపుడై కన్నులయందు ప్రవేశించెను. దిక్కులు శ్రోత్రమై చెవులయందు చేరినవి. ఓషధీవనస్పతులు వెండ్రుకలై చర్మమున బ్రవేశించెను

చంద్రుడు మనస్సై హృదయమున జేరెను. మృత్యువు అపాన వాయువై నాభియందు ప్రవేశించెను. జలము రేతస్సయి శిశ్నమునందు (ప్రజననము నందు) చేరెను.

ఆకలిదప్పులను గుఱించిన కథ

తమశనాపిపాసే అబ్రూతామావాభ్యామభిప్రజానీహీతి, తే అబ్రవీదేతాస్వేవ వాం దేవతాస్వాభజామ్యేతాసు భాగిన్యౌ కరోమీతి. తస్మాద్యస్యై కస్యైచ దేవతాయై హవిర్గృహ్యతే భాగిన్యావేవాస్యామశనాపిపాసే భవతః. 5

ఆకలిదప్పులు రెండును అయ్యా! మేముండుటకు స్థానమేర్పఱచి చూపుమని యడిగెను. ఈ దేవతలయందే మీకును విభాగ మొనర్చి స్థాన మిచ్చెదను. మిమ్ము వారి జతలో భాగస్థులనుగా చేసెదనని ఆత్మ పలికెను. అందువల్లనే ఏ దేవత కాహుతి యొసగ బడినను ఆ హవిస్సునందు ఆకలిదప్పులు భాగమును బడసియే యుండును.

1-వ అధ్యాయము - 3-వ ఖండము

అన్నమును గుఱించి సంకల్పించుట

స ఈక్షతేమేను లోకాశ్చ లోకపాలాశ్చాన్నమేభ్యః సృజా ఇతి.1

ఈ ప్రకార మీశ్వరుడు (ఆత్మ) లోకములను లోకపాలకులను సృష్టించి ఆకలిదప్పులను ఏర్పఱచినందువలన వారికొఱకై అన్నమును ఉత్పన్నము చేయవలయునని సంకల్పించెను.

సోఽపోఽభ్యతపత్ తాభ్యోఽభితప్తాభ్యో మూర్తిరజాయత. యా వై సా మూర్తిరజాయతాన్నం వై తత్. 2

జలమును గుఱించి సంకల్పించెను. నీటికి వేడి నొసగెను. ఆ ఉష్ణోదకమునుండి మూర్తిమంతమగు నొక యాకృతి ఉత్పన్నమాయెను. అట్లు ఉత్పన్నమైన మూర్తియే అన్నము.

అన్నమునే ముఖముగా గ్రహింపవలయునను విచారము.

తదేనత్సృష్టం పరాఙత్యజిఘాంసత్. తద్వాచాఽజిఘృక్షత్తన్నాశక్నోద్వాచా గ్రహీతుమ్. స యద్ధైనద్వాచాఽగ్రహైష్యదభివ్యాహృత్య హైవాన్నమత్రప్స్యత్. 3

ఇట్లు సృష్టింపబడిన ఆ యన్నము పురుషునినుండి దూరమగుటకు ప్రారంభించెను. దేవతలు భుజింపకుండిరి. అప్పుడా పురుషుడు వాక్కుచే మాటలతో అన్నమును భుజింప యత్నించెను; కాని గ్రహింప నది సాధ్యము కాలేదు. అట్లు వాక్కుచేతనే గ్రహింప శక్యమై యుండిన-యెడల ఒకడు అన్నమును గుఱించి మాటలాడినంత మాత్రముననే తృప్తినొందవలసి యుండెడిది. ఇది అసంభవము.

తత్ప్రాణేనాజిఘృక్షత్. తన్నాశక్నోత్ప్రాణేన గ్రహీతుమ్. స యద్ధైనత్ప్రాణేనాగ్రహైష్యదభిప్రాణ్య హైవాన్నమత్రప్స్యత్. 4

అనంతరము ప్రాణముచే అనగా ఘ్రాణేంద్రియముచే అన్నమును గ్రహింప యత్నించెను. అది సాధ్యము కాలేదు. అట్లు ప్రాణముచే గ్రహింప సాధ్యమై యుండిన ఒకడు అన్నము నాఘ్రాణించి (వాసన చూచి) నంత మాత్రమున తృప్తుడు కావలసి యుండెను. ఇదియును పొసగదు.

తచ్చక్షుషాఽజిఘృక్షత్ తన్నాశక్నోచ్చక్షుషా గ్రహీతుమ్. స యద్ధైనచ్చక్షుషా గ్రహైష్యద్దృష్ట్వా హైవాన్నమత్రప్స్యత్. 5

ఆ పిదప చక్షురింద్రియము చూచి గ్రహింప యత్నించెను. కాని సాధ్యము కాలేదు. అట్లు దృష్టిమాత్రమున గ్రహింప సాధ్యమై యుండినచో అన్నమును చూచినంత మాత్రముననే తృప్తి కావలసి యుండెడిది. అట్లగుట సాధ్యము కాదని అర్థము.

తచ్ఛ్రోత్రేణాజిఘృక్షత్. తన్నాశక్నోచ్ఛ్రోత్రేణ గ్రహీతుమ్. స యద్ధైనచ్ఛ్రోత్రేణాగ్రహైష్యచ్ఛ్రుత్వా హైవాన్నమత్రప్స్యత్. 6

చెవులచే దానిని గ్రహింప యత్నించెను. అదియును సాధ్యము కాలేదు. అట్లు చెవులచే గ్రహించుటకు సాధ్యమై యుండినవట్ల అన్నమును గుఱించి విన్నంత మాత్రముననే తృప్తి కావలసి యుండెను అట్లగుట లేదు.

తత్త్వచాఽజిఘృక్షత్. తన్నాశక్నోత్త్వచా గ్రహీతుమ్. స యద్ధైనత్త్వచాఽగ్రహైష్యత్స్పృష్ట్వా హైవాన్నమత్రప్స్యత్. 7

స్పర్శేంద్రియముచే దానిని గ్రహింప యత్నించెను; కాని ఆ యింద్రియమును గ్రహింప శక్తివంతము కాలేదు. అట్లు చర్మేంద్రియముచే గ్రహింప సమర్థమైనపట్ల అన్నమును తాకినంత మాత్రమున తృప్తి గావలసి యుండెడిది. అది కాదు.

తన్మనసాఽజిఘృక్షత్. తన్నాశక్నోన్మనసా గ్రహీతుమ్. స యద్ధైనన్మనసాఽగ్రహైష్యద్ధ్యాత్వా హైవాన్నమత్రప్స్యత్. 8

ఆ యన్నమును మనస్సు గ్రహింప యత్నించెను. అదియును సాధ్యము కాలేదు. మనస్సుచే గ్రహింప సాధ్యమై యుండినపట్ల అన్నమును ధ్యానము చేసినంత మాత్రమున తృప్తి కావలసి యుండెడిది. అదియో లేదు.

తచ్ఛిశ్నేనాజిఘృక్షత్తన్నాశక్నోచ్ఛిశ్నేన గ్రహీతుమ్. స యద్ధైనచ్ఛిశ్నేనాగ్రహైష్యద్విసృజ్య హైవాన్నమత్రప్స్యత్. 9

దానిని శిశ్నమునుండి గ్రహింప యత్నించెను. అది సాధ్యము కాలేదు. శిశ్నమునుండి గ్రహింప సాధ్యమే మైయుండిన యెడల అతడు అన్నమును విసర్జనముచేసి సంతుష్టుడు కావలసి యుండును. ఇది అయోగ్యము.

అపాన ద్వారముచే అన్నమును గ్రహింపవలెనని తెలుపుట

తదపానేనాజిఘృక్షత తదావయత్. సైషోఽన్నస్య గ్రహో యద్వాయురన్నాయుర్వా ఏష యద్వాయుః. 10

ఆ యన్నమును నోటిచేత గ్రహింప యత్నించెను. అది గ్రహించుటకు వచ్చెను. అనగా తినుటకు వచ్చెను. ఇదే అన్నమును గ్రహించునది. ఈ వాయువే అన్నమనియు లేక ఆయుస్సనియు అన్నమును గ్రహించి జీవించుచున్నదనియు చెప్పబడును.

అవ : పరమాత్మ ఈ శరీరమునందెట్లు ప్రవేశించెనను విషయము చెప్పబడును.

స ఈక్షత కథం న్విదం మదృతే స్యాదితి స ఈక్షత కతరేణ ప్రపద్యా ఇతి. స ఈక్షత యది వాచాభివ్యాహృతం యది ప్రాణే

నాభిప్రాణితం యది చక్షుషా దృష్టం యది శ్రోత్రేణ శ్రుతం యది త్వచా స్పృష్టం యది మనసా ధ్యాతం యద్యపానేనాభ్యపానితం యది శిశ్నేన విసృష్టమథ కో౽హమితి. 11

నేను వినా ఈ శరీర మెట్లు నిలిచి యుండ గలదు? నేను ఏ ముఖమున ప్రవేశము చేయవలెనని ఆత్మ ఆలోచించెను. వాక్కు మాటలాడిన, ప్రాణము ఆఘ్రాణించిన, కన్నులు చూచిన, చెవులు వినిన, చర్మము స్పృశించిన, మనస్సు ధ్యానించిన, అపానము త్రాగిన శిశ్నము విసర్జనము చేసిన ఇక నే నెవరై యుందునని విచారము చేసెను. అర్థాత్ నే నేమార్గమున ప్రవేశించ వలెనని ఆత్మ (తాను) యోజించెనని భావము.

కపాలద్వయ మధ్యస్థమగు బ్రహ్మరంధ్ర మనెడి దశమ ద్వారమున ప్రవేశించెనని తెలుపుట.

స ఏతమేవ సీమానం విదార్యైతయా ద్వారా ప్రాపద్యత. సైషా విదృతిర్నామ ద్వాస్తదేతన్నాందనమ్. తస్య త్రయ ఆవసథా స్త్రయః స్వప్నా అయ మావసథో౽యమావసథో౽యమావసథ ఇతి. 12

అప్పు డతడు మూర్ధ మను శిరోమధ్య భాగమును భేదించుకొని లోపల ప్రవేశించెను. దీనినే దశమ ద్వార మనియు చెప్పుదురు. ఈ ద్వారమునకే విదృతి యనియు నామము. ఇది ఆనంద నిలయము. దీని స్థానములు మూడు. స్వప్నావస్థలు మూడు. ఇట్లు మూడు తెఱగులై యున్నది. జాగ్రదవస్థయందు కుడికన్ను, స్వప్నావస్థయందు మనస్సు, సుషుప్త్యవస్థయందు హృదయము. తాత్పర్య మేమన, ఈ మూడవస్థలును అసత్యములు కాబట్టి వీటిని స్వప్నములని చెప్పుటయైనదని గ్రహింపవలయును.

జీవునియొక్క మోహము, తన్నివృత్త్యుపాయమును దెలుపుట.

స జాతో భూతాన్యభివ్యైఖ్యత్ కిమిహాన్యం వావదిషదితి. స ఏతమేవ పురుషం బ్రహ్మ తతమపశ్యత్. ఇదమదర్శమితీ. 13

ఇట్లు కార్య కారణ సముదాయోపాధితో కూడిన జీవుడు

దేహమునందు జేరి భూతేంద్రియాది విషయములను దెలియు నాకంటె అన్యులు మరెవ్వరున్నారు? సర్వము నేనే యని అహంకరించి ఈ పురుషుని బ్రహ్మము వ్యాపించినట్లుగ చూచెను. అధ్యాసచే దీనిని నేను చూచితిని. తెలియుచున్నాడను అను నిత్యాద్యభిమానమును పొంది అవివేకియై వర్తించుచుండగా ఒకప్పుడు పరమ దయామయుడగు ఆచార్యుని ఉపదేశమువలన మరల నితడు జాగ్రత్తనొంది ఆ పరమ పురుషుడగు బ్రహ్మము తనలో తాను నేనేయై యున్నానని తెలిసెను.

## ఇంద్రశబ్దముయొక్క అర్థము

తస్మాదిదంద్రో నామేదంద్రో హ వై నామ తమిదంద్రం సంత మింద్ర ఇత్యాచక్షతే పరోక్షేణ. పరోక్షప్రియా ఇవ హి దేవాః, పరోక్షప్రియా ఇవ హి దేవాః. 14

అందుచేత ఈ ఆత్మ చూచువాడు. ఇతని పేరు ఇంద్రుడు ఇంద్రుడనగా ఇది అని సాక్షాత్తుగా చూచువాడు. ఆ బ్రహ్మమును పరోక్షముగ ఇంద్రుడనియు బిలుతురు. పూజ్యుల నామములను పరోక్షముగ చెప్పుట విధ్యుక్తము. దేవతలు పరోక్ష ప్రియులు, దేవతలు పరోక్ష ప్రియులు.

## 2-వ అధ్యాయము-1వ ఖండము

## పురుషుని ప్రథమావస్థ (జన్మ)

ఓమ్. పురుషే హ వా అయమాదితో గర్భో భవతి. యదేత ద్రేత స్తదేత త్సర్వేభ్యోఽంగేభ్య స్తేజః సంభూత మాత్మన్యే వాత్మానం బిభర్తి తద్యదా స్త్రియాం సించత్యథై నజ్జనయతి తదస్య ప్రథమం జన్మ. 1

ఈ జీవుల పుట్టుక (గర్భము) మొదట పురుషునియం దుద్భవించును. శరీరముయొక్క సర్వావయవములచే ఉత్పన్న మయిన బలమే ఈ రేతస్సన బడును. పురుషుడు తనయందే తన్ను రేతోరూపమున ధరించుచున్నాడు. రేతస్సును స్త్రీపాత్రయందు సేచనమొనర్చుటచే గర్భము కలుగును. అదే పురుషుని మొదటి జన్మ. ఇది ప్రథమావస్థ

## పురుషుని ద్వితీయావస్థ

తత్ స్త్రియా ఆత్మభూయం గచ్ఛతి యథా స్వమంగం తథా తస్మాదేనాం న హినస్తి సాఽస్యైతమాత్మానమత్ర గతం భావయతి. 2

ఆ గర్భము ఆ స్త్రీతో అభేద మొంది పోవును. అందుచేత ఆమె దానిని హింసించుట లేదు. తాను స్వయముగా అందు చేరి యున్నానని ఆ స్త్రీ భావించును.

సా భావయిత్రీ భావయితవ్యా భవతి తం స్త్రీగర్భం బిభర్తి సోఽగ్ర ఏవ కుమారం జన్మనోఽగ్రేఽధిభావయతి స యత్కుమారం జన్మనోఽగ్రేఽధిభావయత్యాత్మానమేవ తద్భావయత్యేషాం లోకానాం సంతత్యా ఏవం సంతతా హీమే లోకాస్తదస్య ద్వితీయం జన్మ. 3

ఇట్టి భావనోపేతురాలగు గర్భిణీస్త్రీ ఉపచరింప బడుటకు యోగ్యురాలు. ఇట్టి గర్భమును స్త్రీ ధరించును. పుట్టుటకు పూర్వమే ఆమె పుత్రుని ఆహార నియమాదులచే పోషించుచు సత్పుత్ర సంతానోత్పాదన పూర్వకముగ మోక్షమును బడయుట యను ఇత్యాది మానవుల పరంపర ననుసరించి తన్ను తానే పోషించు కొనును. ఈ విధముగ విశ్వము విస్తృత మగును. అర్థాత్ పితయొక్క ఆత్మయే పుత్రుని రూపమై పుట్టుచున్నదనియు అప్పుడు జాతకర్మాది క్రియలచే తండ్రి తనవలె భావించుచున్నాడనియు, ఇదే పురుషుని రెండవ జన్మ యనియు తెలియవలెను.

## పురుషుని తృతీయావస్థ

సోఽస్యాయమాత్మా పుణ్యేభ్యః కర్మభ్యః ప్రతిధీయతే అథాస్యాయమితర ఆత్మా కృతకృత్యో వయోగతః ప్రైతి స ఇతః ప్రయన్నేవ పునర్జాయతే తదస్య తృతీయం జన్మ. 4

ఈ పురుషుని ఆత్మ అనగా పుత్రాత్మ తండ్రికి మాఱుగా నుండి పుణ్యకర్మాచరణకు ప్రతినిధి యగును. వృద్ధాప్యము వచ్చుటవలన ఈ తండ్రిద్వారా పుణ్యకర్మలు చేయబడుట ప్రతిరోధింప బడును. అప్పు

డియాత్మ అనగా తండ్రి కృతకృత్యుడై దేహము వీడును. కర్మవశ
ముచే మరల పునర్జన్మ నొందును. ఇదే పురుషుని మూడవ జన్మ.

వామదేవుని వాక్యము

తదుక్తమృషిణా. గర్భేను సన్నన్వేషామ వేదమహం దేవానాం జనిమానివిశ్వా. శతం మాపుర ఆయసీరరక్షన్నధః శ్యేనో జవసా నిర దీయమితి గర్భ ఏవైతచ్ఛయానో వామదేవ ఏవమువాచ. 5

వామదేవఋషి గర్భమునందుండి ఇట్లు చెప్పెను. గర్భమునం దుండు నపుడు నేను దేవతల సమస్త జన్మలను శోధించి తెలిసికొంటిని. వాగగ్న్యాది దేవతల జన్మములను దెలిసికొంటెని. వందలాది ఉక్కు కవచములవంటి కఠినములైన శరీరముల నెన్నెన్నియో బడసి రక్షింప బడితిని. వలనుండి తప్పించుకొన్న పక్షివలె తత్త్వజ్ఞాన బలముచే ఈ సంసార బంధమునుండి వేగముగ వీడు వడితి నని గర్భము నందుం డియే పలికెను.

వామదేవుని గతి

స ఏవం విద్వానస్మాచ్ఛరీరభేదా దూర్ధ్వ ఉత్క్రమ్యాముష్మిన్ స్వర్గే లోకే సర్వాన్ కామానాప్త్వాఽమృతః సమభవత్ సమభవత్. 6

ఈ విధముగ వామదేవఋషి ఆత్మతత్త్వము నెఱిగి జ్ఞానియై ప్రారబ్ధరూపమగు శరీరమును మాతృగర్భ నివాస మాత్రానుభవముచే నశింప సర్వబంధ విముక్తుడై అవాప్త కాముడై అమృత స్వరూపు డయ్యెను.

3-వ అధ్యాయము 1-వ ఖండము

ఆత్మతత్త్వ విషయకమగు ప్రశ్న

కోఽయమాత్మేతి వయముపాస్మహే. కతరః స ఆత్మా యేన వా పశ్యతి యేన వా శృణోతి యేన వా గంధానాజిఘ్రతి యేన వా వాచం వ్యాకరోతి యేన వా స్వాదు చాస్వాదు చ విజానాతి. 1

బ్రహ్మజిజ్ఞాసా పరులగు బ్రహ్మజ్ఞానులు పరస్పరము ఇట్లు ప్రశ్నించుకొనుచున్నారు.

ఎవనిని ఆత్మ యని మేము సాక్షాత్తుగా ఉపాసింపవలెను? ఎవని సహాయమువలన పురుషుడు రూపమును చూచునో శబ్దమును వినునో గంధము నాఘ్రాణించునో వాక్కుచే మాటలాడునో ఇది రుచి గలది రుచి లేనిదని రసనేంద్రియముచే దెలియునో ఆ యాత్మ ఎవరు?

యదేతద్ధృదయం మనశ్చైతత్. సంజ్ఞానమాజ్ఞానం విజ్ఞానం ప్రజ్ఞానం మేధా దృష్టిర్ధృతిర్మతిర్మనీషా జూతిః స్మృతిః సంకల్పః క్రతురసుః కామోవశ ఇతి సర్వాణ్యేవైతాని ప్రజ్ఞానస్య నామధేయాని భవంతి. 2

ఏది హృదయమో అదే మనస్సు. చేతనము, ఆజ్ఞానము విశేష జ్ఞానము, ప్రజ్ఞానము, బుద్ధి, దృష్టి, ధృతి, మతి, ఇచ్ఛ, వ్యగ్రత అనగా మానసిక దుఃఖావస్థ, స్మృతి, సంకల్పము, నిశ్చయము, ప్రాణము, కామము, ఆకాంక్ష ఇత్యాది అంతఃకరణవృత్తులు ప్రజ్ఞానము యొక్క అనగా ఏకమగు ఆత్మయొక్క ఉపాధులుగా నున్నవై ఉపాధి జనిత గుణములకు సంబంధించిన విభిన్న నామములు. చేతన వివర్త మగు అంతఃకరణవృత్తియొక్క భేదములని తెలియవలయును.

ప్రజ్ఞానమే సర్వరూపముగ నున్నది

ఏష బ్రహ్మైష ఇంద్ర ఏష ప్రజాపతిరేతే సర్వే దేవా ఇమాని చ పంచ మహాభూతాని పృథివీ వాయురాకాశ ఆపో జ్యోతీంషీత్యేతానీమాని చ క్షుద్రమిశ్రాణీవ. బీజానీతరాణి చేతరాణి చాండజాని చ జారుజాని చ స్వేదజాని చోద్భిజ్జాని చాశ్వా గావః పురుషా హస్తినో యత్కించేదం ప్రాణి జంగమం చ పతత్రి చ యచ్చ స్థావరం సర్వం తత్ప్రజ్ఞానేత్రం ప్రజ్ఞానే ప్రతిష్ఠితం ప్రజ్ఞానేత్రో లోకః ప్రజ్ఞా ప్రతిష్ఠా ప్రజ్ఞానం బ్రహ్మ. 3

ప్రజ్ఞానరూప మగు బ్రహ్మమే ఈ ఇంద్రుడు, ఈ ప్రజాపతి ఈ సమస్త దేవతలు. పంచమహాభూతములు, పృథివి, ఆకాశ వాయు జలములు; ఆకాశమునందలి సమస్త జ్యోతులు, ఉచ్చనీచములగు సమస్త పదార్థములు, అన్ని ధాన్యములు, విభిన్నమగు అండజ

జరాయుజ, స్వేదజాది ప్రాణులు, చెట్లు, చేమలు, గుఱ్ఱములు, ఆవులు పురుషులు, ఏనుగులు, చేతనము గల సమస్త ప్రాణులు, పక్షులు స్థావరములగు సర్వ వస్తువులు ఇవన్నియు ప్రజ్ఞానముచే ప్రవర్తింపు నవై యున్నవి. ప్రజ్ఞయే ఈ సమస్తమునకు నేత్రము. ఇదంతయు ప్రజ్ఞానమునందే ప్రతిష్ఠతమై యున్నది. ఈ విశ్వమంతయు ప్రజ్ఞానము నుండియే వెలువడి యున్నది. ప్రజ్ఞయే ఈ లోకముయొక్క కన్ను. ప్రజ్ఞయే జ్ఞానమే లేక చైతన్యమే దీని ఉనికియై యున్నది. ప్రజ్ఞానమే బ్రహ్మము.

ఆత్మజ్ఞానియొక్క అమృత తత్త్వానుభవస్థితి

స ఏతేన ప్రజ్ఞేనాత్మనాస్మాల్లోకాదుత్క్రమ్యాముష్మిన్ స్వర్గే లోకే సర్వాన్ కామానాప్త్వాఽమృతః సమభవత్. 4

అతడీ జ్ఞానమయాత్మతో ఈ లోకమునుండి వెడలి స్వర్గము (బ్రహ్మలోకమున) సమస్త కామములను పొంది అమృతానుభవము నొందును. తాత్పర్య మేమనిన, వామదేవాది బ్రహ్మవేత్తలు ప్రజ్ఞా నాత్మ నెఱింగి ఈ లోకమును వీడి స్వర్గమున సమస్త కామముల ననుభవించి అమృతత్వమును పొందిరని భావము. ఇచ్చట చెప్పబడిన విషయము నిర్గుణ బ్రహ్మోపాసనా పరమైనదే గాని జీవన్ముక్తి విషయము గాదని తెలియవలయును.

వాఙ్మే మనసి ప్రతిష్ఠితా ఇతి శాంతిః

ఐతరేయోపనిషత్తు సమాప్తము

# ౯. ఛాందోగ్యోపనిషత్తు

ఓమ్. ఆప్యాయంతు మమాంగాని. వాక్ప్రాణశ్చక్షుశ్శ్రోత్ర మథో బల మింద్రియాణి చ. సర్వాణి సర్వం బ్రహ్మౌపనిషదం మాహం బ్రహ్మ నిరాకుర్యామ్. మా మా బ్రహ్మ నిరాకరోదనిరాకరణ మస్త్వనిరాకరణం మేఽస్తు. తదాత్మని నిరతే య ఉపనిషత్సు ధర్మాస్తే మయి సంతు తే మయి సంతు.

ఓం శాంతిః శాంతిః శాంతిః

నా నేత్ర శ్రోత్ర వాక్ప్రాణాది సర్వేంద్రియములు బలోపేత ములై యుండుగాక! సర్వము ఉపనిషత్ప్రోక్తమగు బ్రహ్మమైయే యున్నది. బ్రహ్మమును నేను నిరాకరింప కుందునుగాత! ఆ బ్రహ్మము నన్ను నిరాకరింపకుండుగాత! (ద్విప్రకారములచేతను ఒకటే తత్త్వము వెలయుచున్నందున) నిరాదరణ గాకుండునుగాక! నిరాకరింపకుండును-గాత! ఉపనిషత్తునందు చెప్పబడిన సద్గుణ గణము లెల్ల ఆత్మనిరతుడ నగు నాయందిల్లుగా గలిగి భద్రముగ నిలిచి యుండుగాక!

ఓం. శాంతిః శాంతిః శాంతిః

1-వ ప్రపాఠకము-1-వ ఖండము

ఓంకారముయొక్క వ్యాఖ్య

హరిః ఓమ్. ఓమిత్యేతదక్షర ముద్గీథ ముపాసీత.

ఓమిత్యుద్గాయతి తస్యోపవ్యాఖ్యానమ్. 1

ఓం అను అక్షరమే ఉద్గీథము. దీని నుపాసించ వలెను. ఇందు చిత్తైకాగ్రత గావించవలయును. ఓం అనియే సామగాన మొనర్తురు. (అందుచే) ఇచ్చట దాని వివరణ గలదు.

ఏషాం భూతానాం పృథివీ రసః పృథివ్యా ఆపో రసః అపా మోషధయో రస ఓషధీనాం పురుషో రసః పురుషస్య వాగ్రసో వాచ ఋగ్రస ఋచస్సామరస స్సామ్న ఉద్గీథో రసః 2

ఈ చరాచర సృష్టియొక్క సారము పృథివి. పృథివి రసమై యున్నది. జలము పృథివియొక్క సారము. వనస్పతులు జలముయొక్క సారము. పురుషుడు వనస్పతులయొక్క సారము. వాక్కు పురుషుని యొక్క సారము. ఋక్కు ఋగ్వేదమంత్రము వాక్సారమై యున్నది.

సామము సామవేదమంత్రము ఋక్కుయొక్క సారము. ఓంకారము సామముయొక్క సారసర్వస్వమై యున్నది.

స ఏష రసానాగ్ం రసతమః పరమః పరార్ధ్యోఽష్టమో యదు ద్గీథః. 3

ఈ ఓంకారమే సర్వమునకు సారమై సర్వశ్రేష్ఠమై యున్నది. సారములందు ఎనిమిదవదైన ఈ ఓంకారము పరమాత్మస్థానమును దుండుటకు యోగ్యమై యున్నది. పరమ పూజ్యమై యున్నదని అర్థము.

కతమా కతమర్క్ కతమత్కతమత్సామ కతమః కతమ ఉద్గీథ ఇతి విమృష్టం భవతి. 4

ఋక్కనగా నేది? సామమేది? ఉద్గీథ మననేమి? అను నీవిష యము వివరింప బడును.

వాగేవర్క్ప్రాణస్సామ ఓమిత్యేతదక్షర ముద్గీథః. తద్వా ఏత న్మిథునం యద్వాక్చ ప్రాణశ్చర్క్చ సామ చ. 5

వాక్కే ఋక్కు. ప్రాణమే సామము. ఓంకారమే ఉద్గీథము. ఇదే మిథునము (కూడిక). ఋక్కుస్థానమగు వాక్కు మఱియు సామము యొక్క స్థానమగు ప్రాణము ఈ రెండిటియొక్క ఏకతయే మిథునము.

తదేతన్మిథున మోమిత్యేతస్మిన్నక్షరే సగ్ం సృజ్యతే యదా వై మిథునౌ సమాగచ్ఛత ఆపయతో వై తావన్యోన్యస్య కామమ్. 6

ఓంకారమునందు ఈ మిథునముయొక్క సంయోగ మగును. ఎట్లనిన, ప్రకృతి పురుషుల సమాగమమువలె పరస్పరేచ్ఛా పూర్ణత యగును.

ఆపయితా హ వై కామానాం భవతి య ఏతదేవం విద్వా నక్షర ముద్గీథ ముపాస్తే. 7

ఇట్లు తెలిసి ఓంకారోపాసన చేసిన (వాడు) సర్వ కామము లను పొందిన వాడగును.

తద్వా ఏత దనుజ్ఞాక్షరం యద్ధి కించానుజానాత్యోమిత్యే తదాహ ఏషో ఏవ సమృద్ధిర్యదనుజ్ఞా సమర్ధయితా హ వై కామానాం భవతి య ఏతదేవం విద్వా నక్షర ముద్గీథ ముపాస్తే. 8

లోకమునందు దేనికైనను ఓం అనియే అనుజ్ఞ నొసంగుట వలన దీనికి అనుజ్ఞాక్షరమనియు అందురు. అనుజ్ఞ యొసంగు నపుడు మనుష్యుడు ఓం అని యనును. అనుజ్ఞ చే వృద్ధి

అందుచే దీనికి సంవృద్ధి యనియు పేరు. ఈ విధముగా తెలిసి ఏ విద్వాంసుడు ఉపాసించునో అట్టి వాని సర్వేచ్ఛలు పూర్ణమగును.

తేనేయం త్రయీ విద్యావర్తతే ఓమిత్యాశ్రావయ త్యోమితి శగంసత్యోమిత్యుద్గాయ త్యేతస్యైవాక్షరస్యాపచిత్యై మహిమ్నా రసేన. 9

ఆ ఓంకారముచే ఈ త్రయీవిద్య అనగా ఋగ్యజుస్సామముల యొక్క ప్రవృత్తి యగును. ఓం అని అధ్వర్యుడు ఆశ్రవణకర్మ(అనగా) ఋగ్వేదకర్మ చేయును. ఓం అని హోత శంసనకర్మ (అనగా) యజుర్వేదకర్మ చేయును. మఱియు ఉద్గాత సామగాన మొనర్చును. ఈ అక్షరముయొక్క సంపూజనార్థమైయే దీని మహిమవలననే సర్వకర్మలును ప్రవృత్తి నొందుచున్నవి.

తేనోభౌ కురుతో యశ్చైతదేవం వేద యశ్చన వేద నానాతు విద్యా చావిద్యా చ యదేవ విద్యయా కరోతి శ్రద్ధయోపనిషదా తదేవ వీర్యవత్తరం భవతీతి ఖల్వేతస్యైవాక్షరస్యోపవ్యాఖ్యానం భవతి. 10

ఈ ఓంకారముయొక్క రహస్యము నెఱిగినవాడు మఱియు ఎఱుగనివాడు ఇరువురును కర్మ చేయుదురు. అయితే జ్ఞాన యుక్తముగను జ్ఞాన రహితముగను చేయు కర్మలు వేఱు వేఱై యున్నవి. ఎవడీ జ్ఞానము గలిగి శ్రద్ధచే నుపాసించునో అతని కర్మయే వీర్యవంత మైనది. (మఱియు) ఫలకారియు నగును. ఇది ఓంకారముయొక్క విచారణ.

## 2-వ ఖండము

### ఓంకారముయొక్క ఆధ్యాత్మికోపాసన

దేవాసురా హ వై యత్ర సంయేతిరే ఉభయే ప్రాజాపత్యాస్తద్ధ దేవా ఉద్గీథ మాజహ్రు రనేనైనానభిభవిష్యామ ఇతి. 1

ప్రజాపతి పుత్రులగు దేవాసురులు అనగా సత్ప్రవృత్తి దుష్ప్రవృత్తి యను నీ రెండును (ఇరువురు) ఒకసారి తమలో తాము పోరాటమారంభించి యుద్ధము చేయుచుండగా అసురులను ఓడించ వలెనని దేవతలు ఉద్గీథోపాసనను ముఖ్యమగు నీ ఓంకారోపాసనను చేసిరి.

తే హ నాసిక్యం ప్రాణ ముద్గీథ ముపాసాం చక్రిరే తగ్ంహా సురాః పాప్మనా వివిధుః. తస్మాత్తేనోభయం జిఘ్రతి సురభి చ దుర్గంధి చ పాప్మనా హ్యేష విద్ధః. 2

వారు ఘ్రాణేంద్రియమునందుండు ప్రాణము నవలంబించి యున్న ఉద్గీథమును ఉపాసించిరి. కాని అసురులు దానిని పాపముచేత వేధించిరి. బాధపెట్టిరి. అందువలన ఘ్రాణేంద్రియముచే సుగంధ దుర్గంధములను మిశ్ర కర్మలయొక్క అనుభవమును గలుగును. కాబట్టి ఇది నిష్పాపము గాక పాపముచే దూష్యమై యున్నదని తాత్పర్యము.

అథ హ వాచ ముద్గీథ ముపాసాం చక్రిరే తాగ్ంహాసురాః పాప్మనా వివిధుః. తస్మాత్తయోభయం వదతి సత్యంచానృతం చ పాప్మనా హ్యేషా విద్ధా. 3

అథ హ చక్షురుద్గీథ ముపాసాం చక్రిరే తద్ధాసురాః పాప్మనా వివిధుః. తస్మాత్తేనోభయం పశ్యతి దర్శనీయం చాదర్శనీయం చ పాప్మనా హ్యేతద్విద్ధమ్. 4

అథ హ శ్రోత్ర ముద్గీథ ముపాసాం చక్రిరే తద్ధాసురాః పాప్మనా వివిధుః. తస్మాత్తేనోభయగ్ం శృణోతి శ్రవణీయం చాశ్రవణీయం చ పాప్మనా హ్యేతద్విద్ధమ్. 5

అథ హ మన ఉద్గీథ ముపాసాం చక్రిరే తద్ధాసురాః పాప్మనా వివిధుః. తస్మాత్తేనోభయం సంకల్పతే సంకల్పనీయం చాసంకల్పనీయం చ పాప్మనా హ్యేతద్విద్ధమ్. 6

3-వ మంత్రమునుండి 6-వ మంత్రము వఱకు గల అర్థమేమనగా క్రమముగా వాక్కు, చక్షుస్సు, శ్రోత్రము మఱియు మనస్సు నవలంబించి ఉద్గీథోపాసన చేసిరి. కాని అసురులు ఈ అన్నిటిని పాపముచే కొట్టిరి. వేధించిరి. అదెట్లనిన, వాక్కు సత్యాసత్యములను బలుకును. నేత్ర మన్ననో సురూప కురూప వంతము లగు మంచి చెడ్డలను దర్శించును. శ్రోత్రము మంచి చెడ్డలను వినును. మఱియు మనస్సు మంచి చెడ్డల రెండింటిని సంకల్పించును. అందుచే ఇవన్నియు పాపముచే సంశ్లిష్టతాడన మొందునవియై యున్నవని పై మంత్రములయొక్క మగు అర్థమునుగా తెలియవలయును.

అథ హ య ఏవాయం ముఖ్యః ప్రాణ స్తముద్గీథ ముపాసాం చక్రిరే తగ్ంహాసురా ఋత్వా విదధ్వగ్ం సుర్యథాఽశ్మాన మాఖణ మృత్వా విధ్వగ్ంసేతైవమ్. 7

చివరకు దేవతలు ముఖ్య ప్రాణము నవలంబించి ఉద్గీథోపాసన చేసిరి. అనగా ఆత్మ నుపాసించిరి. అప్పుడు అసురులు దేవతలను జయింప లేక మట్టి ముద్దను ఱాతిపై కొట్టుటచే నాశ మొందునట్లు వినాశ మొందిరి.

యథాఽశ్మాన మాఖణమృత్వా విధ్వగ్ంసత ఏవగ్ం హైవ స విధ్వగ్ంసతే య ఏవం విది పాపం కామయతే యశ్చైన మభిదాసతి స ఏషోఽశ్మాఖణః. 8

ముఖ్య ప్రాణముయొక్క జ్ఞానము గల వానితో పాపమును గాని దూషించుటను గాని లేక వానికి కీడును గలిగించుటకు గాని ఆయత్తు డగువాడు ఱాతిపై కొట్టబడిన మృత్పిండమువలె నాశ మొందును. ఎందుకనగా, అతడు నిర్వికారమును అద్వితీయము నగు ఆత్మానుభవి గావున ఱాతివలె అచలుడని అర్థము.

నైవై తేన సురభి న దుర్గంధి విజానాత్యపహతపాప్మా హ్యేష తేన యదశ్నాతి యత్పిబతి తేనేతరాన్ ప్రాణా నవతి ఏతము ఏవాంతతోఽవిత్త్వోత్క్రామతి వ్యాదదాత్యేవాంతత ఇతి. 9

జనులకు సుగంధ దుర్గంధముల జ్ఞాన మగుటకు ముఖ్యప్రాణము కారణము గాదు. ఎందుకన, అది నిష్పాపము. మనుష్యుడు తన్ముఖమున భుజించు అన్నముచేతను త్రాగు నీటివల్లను ఇతర మగు అపాన వ్యానాది ప్రాణములను రక్షించును. అంత్యకాలమునందు ఈ అన్నపానములు దొరకనందువలన దేహమును విడిచి ప్రాణము పోవును. మఱియు చివరకు దేహము అన్నపానార్థమై నోరు తెఱచునని భావము.

ఇచ్చట ముఖ్యప్రాణ మనగా పుట్టినది మొదలు చచ్చు పర్యంతము అప్రయత్నమున నిష్పాపమై లోవెలి నాడుచు ఆత్మచే వ్యాప్తమై యుండునది. ప్రాణమే ఓంకారము. ఇక ప్రాణ మనగా ఈ ముఖ్య

ప్రాణముచే శక్తిమంతమై ఇంద్రియ గోళకములయందుండుచు తత్త
ద్విషయముల నెఱుగునదై యుండును.

తగ్ంహాంగిరా ఉద్గీథ ముపాసాంచక్ర ఏతము ఏవాంగిరసం
మన్యంతే. అంగానాం యద్రసః. 10

అంగిరస్సను ఋషి ప్రాణరూపోద్గీథోపాసన చేసెను. ప్రాణము
దేహముయొక్క సార సర్వస్వమై యున్నందువలన దానిని అంగిరస
మందురు.

తేన తగ్ంహ బృహస్పతి రుద్గీథ ముపాసాంచక్ర ఏతము ఏవ
బృహస్పతిం మన్యంతే వాగ్ఘి బృహతీ తస్యా ఏష పతిః. 11

అందుచేత బృహస్పతియు నా ఉద్గీథోపాసన (ప్రాణోపాసన)
చేసెను. ఈ ప్రాణమునకు బృహస్పతి యని చెప్పుదురు. ఎందుకనగా,
వాక్కు బృహద్రూపము (పెద్దది). మఱియు ప్రాణము అద్దాని పతియై
యున్నది.

తేన తగ్ంహాయాస్య ఉద్గీథ ముపాసాం చక్ర ఏతము ఏవా
యాస్యం మన్యంత ఆస్యాద్యదయతే. 12

అందుచేత ఆయాస్యుడను ఋషి ఈ ఉద్గీథోపాసన మొనర్చెను.
కాబట్టి ప్రాణమును ఆయాస్య మనియు నందురు. ఎందుచేత ననగా
అది ముఖము (నోరు) నుండి వెలుపలకు పోవును.

తేన తగ్ంహ బకో దాల్భ్యో విదాంచకార స హ నైమిశీ
యానా ముద్గాతా బభూవ స హ స్మైభ్యః కామానాగాయతి. 13

దాల్భ్యుని కుమారుడగు బకుడను ఋషియు ఉద్గీథ మిట్లని
తెలిసికొనెను. అతడు నైమిశారణ్యమునం దుండు ఋషులకు ఉద్గా
తయై యుండెను. అతడు వారి ఇచ్ఛాపూర్తి కొఱకై ఉద్గానము
చేయును. (నైమిశారణ్య సత్రయాగమునందని భావము.)

ఆగాతా హ వై కామానాం భవతి య ఏత దేవం విద్వా
నక్షర ముద్గీథ ముపాస్త ఇత్యధ్యాత్మమ్. 14



ఈ ఓంకారరూప ఉద్గీథమును జ్ఞానపూర్వకముగా నుపాసించు

వాడు సమస్త కామ పూర్ణు డగును. ఇది ఓంకారముయొక్క అధ్యాత్మము. ఆత్మాధారమున నుండు శరీరస్థమగు ప్రాణమే ఓంకారమని యర్థము.

---

3-వ ఖండము

ఓంకారముయొక్క ఆధిదైవికోపాసనా పద్ధతి

అథాధిదైవతం య ఏవాసౌ తపతి తముద్గీథ ముపాసీతోద్యన్ వా ఏష ప్రజాభ్య ఉద్గాయతి ఉద్యగ్ స్తమోభయ మపహంత్యపహంతా హ వై భయస్య తమసో భవతి య ఏవం వేద. 1

ఇక ఉద్గీథముయొక్క ఆధిదైవిక స్వరూపోపాసన చెప్పబడును. ఈ తపింప జేయుచుండు సూర్యుని ఉద్గీథమని ఉపాసించవలెను. ఇతడు ఉదయించి ప్రజల నిమిత్తమై ఉద్గాన మొనర్చును. అంధకారముయొక్క భయమును బారదోలును. దీని నెఱిగినవాడు అంధకారమును భయమును పోగొట్టు వాడగును.

సమాన ఉ ఏవాయం చాసౌ చోష్ణో య ముష్ణోసౌ స్వర ఇతీమ మాచక్షతే స్వర ఇతి ప్రత్యాస్వర ఇత్యముం తస్మాద్వా ఏత మిమ మముంచోద్గీథ ముపాసీత. 2

ఈ ప్రాణము శరీరస్థమగు ఉద్గీథము; మఱియు జగద్దీప్త యగు సూర్యుడను ఉద్గీథము, నీ రెండును సమమై యున్నవి. ఇవి గుణ సాదృశ్యముచేతను ఒకటియే. ఇదియు ఉష్ణమే అదియును ఉష్ణమే. ఈ ప్రాణమునకు 'స్వర' మనెదరు. ఆ సూర్యునకు 'స్వరప్రత్యాసర' మనెదరు. అందుచే ప్రాణము మఱియు సూర్యుడను నీ రెండు రూపములచే ఉద్గీథోపాసన చేయవలెను.

అథ ఖలు వ్యానమేవోద్గీథ ముపాసీత యద్వై ప్రాణితి స ప్రాణో యదపానితి సోఽపానః అథ యః ప్రాణాపానయోః సంధిస్స వ్యానో యో వ్యానస్సా వాక్. తస్మాదప్రాణన్ననపానన్వాచ మభివ్యాహరతి. 3

ఇక వ్యానరూప ఉద్గీథోపాసన చేయవలెను. ప్రాణి వెలుపలకు విడుచు వాయువునకు ప్రాణమనియు లోపలికి దీసికొను వాయువునకు అపాన మనియు, ఈ రెండిటి సంధియే వ్యానవాయువు. వ్యానవాయువు వాక్కే. అందుచే ఉచ్ఛ్వాస ప్రశ్వాస క్రియల నాపి ఊపిరి బిగియబట్టియే మాటలాడును.

యా వాక్స ర్క్తస్మాదప్రాణన్నన పానన్నృచ మభివ్యాహరతి య ర్క్తత్సామ తస్మాదప్రాణన్నన పానన్సామ గాయతి యత్సామ స ఉద్గీథ స్తస్మాదప్రాణన్నన పానన్నుద్గాయతి. 4

వాక్కే ఋక్కు. అందుచేత ఊపిరి యాడించకనే ఋక్కులను పలుకును. ఋక్కే సామము కాబట్టి శ్వాసోచ్ఛ్వాసములు చేయకనే మానవుడు సామగాన మొనర్చును. సామమే ఉద్గీథము. అందువలన ఊపిరి యాడించకనే మనుష్యుడు ఉద్గాన మొనర్చును.

అతో యాన్యన్యాని వీర్యవంతి కర్మాణి యథాఽగ్నేర్మంథన మాజేస్సరణం దృఢస్య ధనుష ఆయమన మప్రాణన్నపానగ్ స్తాని కరోత్యేతస్య హేతో ర్వ్యానమేవోద్గీథ ముపాసీత. 5

ఇదియును గాక కట్టెలను (రుద్ది) మథించుట పరుగెత్తుట దృఢమైన ధనుస్సును ఎత్తి వంచుట ఇత్యాది బలప్రయోగ కార్యములయందు మానవుడు ప్రాణము నాడించకయే ఊపిరి గట్టియే చేయును. కాబట్టి వ్యానవాయు రూపముచేతనే ఉద్గీథము నుపాసింపవలయును.

అథ ఖలూద్గీథాక్షరాణ్యుపాసీతోద్గీథ ఇతి ప్రాణ ఏవోత్ప్రాణేన హ్యుత్తిష్ఠతి వాగ్గీర్వాచో హ గిర ఇత్యాచక్షతే అన్నం థమన్నే హీదగ్ం సర్వగ్ంస్థితమ్. 6

ఇక ఉద్గీథమని ఉద్గీథాక్షరముల నుపాసింప వలయును. ప్రాణమే "ఉత్" ఎందుకనగా, ప్రాణముచేతనే మనుష్యుడు పైకి లేచును. వాక్కే "గీ" వాక్కునే "గీర్" అని యనెదరు. అన్నమే "థమ్" ఎందుకనగా, అన్నాధారము వల్లనే అన్నియు నిలిచి యున్నవి.

ద్యౌరేవోదంతరిక్షంగీః పృథివీ థమాదిత్య ఏవోద్వాయుర్గీరగ్నిస్థగ్ం సామవేద ఏవ యజుర్వేదో గీ ఋగ్వేదస్థం దుగ్ధేస్మై వాగ్దోహం

యోవాచో దోహః అన్నవా నన్నాదో భవతి య ఏతాన్యేవం విద్వా నుద్గీథాక్షరాణ్యుపా స్త ఉద్గీథ ఇతి. 7

ద్యులోకమే "ఉత్." వాయువే "గీ." అగ్నియే "థం." సామవేదమే "ఉత్." యజుర్వేదమే "గీ." ఋగ్వేదమే "థం." ఋగ్వేదాది అభ్యాసము తగిన ఫలముల నిచ్చును. ఉద్గీథాక్షరముల జ్ఞానము గల ఉపాసకుడు అన్నము గలవాడును అన్నము నుపభోగించు వాడు నగును.

అథ ఖల్వాశీస్సమృద్ధిరుపసరణానీత్యుపాసీత యేన సామ్నా స్తోష్యన్స్యా త్తత్సామోపధావేత్. 8

ఇక ఇష్టమగు కామముల పూర్ణతకై యుపాసించ వలెను. ఏ సామములచే ఉద్గాత స్తుతించుచున్నాడో ఆ సామములయొక్క ఉపాసన చేయవలయును.

యస్యామృచి తామృచం యదార్షేయం తమృషిం యాం దేవతామభిష్టోష్యన్స్యా త్తాం దేవతా ముపధావేత్. 9

ఏ ఋక్కులయందా సామము గలదో ఆ ఋక్కర్తయగు ఋషిని అధిష్ఠాత యగు దేవతను ధ్యానము చేయవలెను.

యేన ఛందసా స్తోష్యన్స్యా త్తచ్ఛంద ఉపధావేద్యేన స్తోమేన స్తోష్యమాణ స్యాత్తగ్ స్తోమముపధావేత్. 10

ఆ సామముయొక్క ఛందస్సును దాని స్తోమము అనగా మంత్రస్వరూపము నుపాసించవలెను.

యాం దిశ మభిష్టోష్యన్స్యాత్తాందిశ ముపధావేత్. 11

ఉద్గాత యే దిక్కును స్తుతి చేయువాడై యుండునో ఆ దిక్కును ధ్యానము చేయవలయును.

ఆత్మాన మంతత ఉపసృత్య స్తువీత కామం ధ్యాయన్నప్రమత్తో భ్యాశో హ యదస్మై స కామస్సమృధ్యేత యత్కామః స్తువీతేతి యత్కామః స్తువీతేతి. 12

చివరకు తన గోత్ర వర్ణాశ్రమాదుల నుచ్చారణ చేసి ధ్యానము చేయవలెను. తన కామముల స్మరించుచు (తత్పురశ్చరణ) తప్పు లేక

ధ్యానింపవలెను. ఉద్గాత యే కామముల యొక్క స్తుతి చేయునో ఆ కామము లతనికి సత్వరముగ సంప్రాప్తించును.

---

## 4-వ ఖండము

### ఓంకారాశ్రయముచే కలుగు అమృతపదవి

ఓమిత్యేతదక్షర ముద్గీథ ముపాసీతౌమితి హ్యుద్గాయతి తస్యోప వ్యాఖ్యానమ్. 1

ఓం అను అక్షరముయొక్క ఈ ఉద్గీథోపాసన చేయ దగును. ఓం అని సామవేద గాన మొనర్తురు. ఓంకారముయొక్క వ్యాఖ్యానమిది.

దేవావై మృత్యోర్బిభ్యతస్త్రయీం విద్యాం ప్రావిశగ్ంస్తే ఛందోభిరచ్ఛాదయన్యదేభిరచ్ఛాదయగ్ం స్తచ్ఛందసాం ఛందస్త్వమ్.

దేవతలు మరణమునకు భయ మొంది త్రయీవిద్యను ఋగ్యజు స్సామ మంత్రములను సముపాశ్రయించి వేదచ్ఛందస్సులచే వా [illegible] చ్ఛాదితులైరి. ఆ వేదమంత్రములచే కర్మల ననుష్ఠించుకొనుచు [illegible] తాము మఱచి ఆత్మ ఇట్టిదని తెలియ జాలక పోయిరి. వేదములకు ఛందస్సనియు పేరు. కర్తృత్వ మూలమున స్వరూపాచ్ఛాదనము చేయు స్వభావము గలవై యున్నవని అర్థము. అందుచే ఛందస్సని పిలువబడెను.

తాను తత్ర మృత్యుర్యథా మత్స్యముదకే పరిపశ్యేదేవం పర్యపశ్యదృచి సామ్ని యజుషి తే ను విదిత్వోర్ధ్వా ఋచస్సామ్నో యజుషస్స్వర మేవ ప్రావిశన్. 3

అయితే చేపలను నీటియందు స్పష్టముగా చూచునట్లు మృత్యువు, దేవతలను ఋగ్యజుస్సామ మంత్రములయందు [illegible] తించెను. అప్పుడు దీని నెఱిగిన యా దేవతలు ఈత్రయీవిద్యకంటె అనగా వేదోక్త కర్మలకంటెను శ్రేష్ఠమైన ఓంకారము నాశ్రయించిరి. [illegible] తాత్పర్యమేమనగా, చేపలు పట్టువాడు వల వేసి వేచి యుండు [illegible]

మృత్యుదేవత వేదోక్త కర్మల ననుష్ఠించుచు ఆత్మజ్ఞానము లేక యుండు వారిని చూచి నా కార్యసిద్ధి యయ్యెనని నవ్వుచుండునని భావము. దేవతలీ యభిప్రాయము నెఱిగి ఈ మూడు వేదముల కంటె నుత్తమోత్తమ మగు ఓంకారము నుపాసించిరని తెలియ వలయును.

యదా వా ఋచమాప్నోత్యోమిత్యేవాతి స్వరత్యేవగ్ం సామైవం యజురేష ఉస్వరో య ఏతదక్షర మేతదమృతమభయం తత్ప్రవిశ్య దేవా అమృతా అభయా అభవన్. 4

ఋగ్వేదమును అధ్యయనము చేయునప్పుడు "ఓం" అని అత్యాదరమున పలుకుచు. అదే విధముగా యజుస్సామములను ఓం అని యారంభము జేయుము. ఈ ఓంకారమే స్వరము. ఇదే అక్షరము. ఇది అమృతము. అభయము. దీని నాశ్రయించి దేవతలు అమృత స్వరూపులును అభయ స్వరూపులు నయిరి.

స య ఏతదేవం విద్వా నక్షరం ప్రణౌత్యేతదేవాక్షరగ్ం స్వర మమృత మభయం ప్రవిశతి తత్ప్రవిశ్య యదమృతా దేవాస్తద మృతో భవతి.5

ఈ విధముగా ఏ విద్వాంసుడు ఓంకారోపాసన జేయునో అతడు ఇయ్యమృతమును అభయము నగు ఓంకారమును ప్రవేశించును. దాని నాశ్రయించి దేవతలు అమృతాభయ స్వరూపులైనట్లు ప్రణవోపాసకుడును అమృత స్వరూపుడును అభయ స్వరూపుడు నగునని తెలియవలయును.

---

## 5–వ ఖండము

ఈ ఐదవ ఖండమునుండి ఈ ప్రపాఠకముయొక్క అంత్యము వఱకు అనగా 13–వ ఖండము వఱకు ఈ ఓంకారమే సామగానము ఉద్గీథముతో సమ మని చెప్పబడి యున్నందున ఈ సామముయొక్క గతి ఏది యనునది శిలకాదులు ముగ్గురు ఋషులచే చర్చింప బడిన కథ ఇందు గలదు. మఱియు ఆకాశమే చివరి ఆశ్రయము పరాయణ

మను నిత్యాది నిర్ణయమును చెప్పబడి యున్నది. ఇదే ప్రక్రియ ననుస రించి ఉషస్తి చాక్రాయణుని కథ ఇందు గలదు. ఓంకారోపాసనయే ప్రధానముగ తెలుపు విషయమై వివిధ విషయములను వివిధ ప్రకా రములచే చివరిదాక నిరూపింపబడి యున్నవని పాఠకులు గ్రహింప వలయును.

—o—

## రెండవ ప్రపాఠకము

ఈ ప్రపాఠకమునందు గూడా సామోపాసన, ఓంకారము యొక్క మహిమ, లోక లోకాంతరములను జెందు యాజమానము ఇత్యాది విషయములు చెప్పబడును. మొదటి ఖండమునందు సామ మనగా మంచి దనియు అసామ మనగా చెడ్డదనియు సామోపాసన చెప్పబడియున్నది.

ఇక ఈ రెండవ ఖండమునుండి 10-వ ఖండము వఱకు పంచా వయవ సామోపాసన ఏతత్క్రమాదులు చెప్పబడి యున్నవి. మఱియు వాగాదిత్యులయందు ప్రతిష్ఠితమై యుండు సప్తవిధములైన సామో పాసనలు 10-వ ఖండమునందు అతిమృత్యు సామోపాసనా వివరణ మున్నది.

పదునొకండవ ఖండమునుండి 21-వ ఖండము వఱకు గాయత్రి రథంతర, వామదేవ్య, బృహద్వైరూప, వైరాజ, శక్వర్య, రేవత్య యజ్ఞేత్యాది సామావయవములను వాటి ప్రతిష్ఠయు తత్ఫలాదులును చెప్పబడి యున్నది.

22-వ ఖండమునందు వినర్ది సామోపాసన స్వరోచ్చార ణాదులయం దధిష్ఠుతులై యుండు దేవతల ఉపాసన, తత్ఫలము చెప్ప బడి యున్నది.

23-వ ఖండమునందు ధర్మముయొక్క ముఖ్యాధారములు బ్రహ్మసస్థితి నుండువాడు ముక్తిని బొందుననియు, తదితరోపాసకు లెల్లను స్వర్గాధికారులు మాత్రమే యనియు అనంతరము ఓంకారముయొక్క ఉత్పత్తియు దానియొక్క వ్యాపకతను గూడ నియు చెప్పబడి యున్నది.

24-వ ఖండమునందు ఒకటవ మంత్రము మొదలు 16 మంత్రముల వఱకు గల ఈ యుపనిషద్భాగమునందు యాగము నందలి ప్రాతఃసవనము, మధ్యాహ్న సవనము, సాయంసవనము, మఱియు వీటిని అగ్ని, వాయు, ఆదిత్య దేవతల కొఱకు ఇచ్చెడి క్రమము మొదలగునవి చెప్పబడి యున్నవి.

---

## మూడవ ప్రపాఠకము

ఈ ప్రపాఠకమున మొదటి 11 ఖండములచే మధువిద్య వర్ణింపబడును. విషయమేమన, ఆదిత్యుడే మధువు. దేవతలందఱు ఆదిత్యునిచే జీవింతురు. ఋగ్యజుస్సామాథర్వాంగిరసమను నిత్యాది మంత్రములు ఆయా విహితమగు కాలములయందు తత్తత్కర్మల నాచరించుటవలన యశస్సు, తేజస్సు, వీర్యము ఈ మొదలగునవి ఉత్పన్నమై అవన్నియు ఆదిత్యుని వివిధ కిరణముల నాశ్రయించును. సూర్యునియందే ఇవన్నియు నున్నవని భావము. ఋగాది వేదములే గాక ఓంకారము మొదలగు గోప్యోపదేశములును ఇందు గలవు. ఇది బ్రహ్మనిర్దేశాత్మకమైన వేదముయొక్క సారమునై యున్నది. మఱియు ఆయా దేవతల ఉపాసనయు తత్తత్ఫలములను చెప్పుచు చివర ఆత్మజ్ఞాని యగువాడు ఈ సర్వోపాసనల నతిక్రమించునని అఖండజ్ఞాన జ్యోతి విషయక మగు మాహాత్మ్యమున్ను చెప్పబడియున్నది.

12, 13, ఖండములయందు హృదయము, దాని ఐదు ద్వారములు అనగా ప్రాణములు, అచ్చట అధిష్ఠితమై యున్న దేవతల హృదయాంతర్జ్యోతియే సర్వ లోకాతీత మగు ఉత్తమ తత్త్వమను విషయములు.

14-వ ఖండమునందు ఆత్మస్వరూప వర్ణన, తదుపాసన, తత్ఫలము చెప్పబడి యున్నది.

15-వ ఖండమునందు సర్వవస్తు సంగ్రహ స్థానమగు విశ్వవర్ణనము. విరాడ్రూప కోశోపాసన చెప్పబడి యున్నది.

16, 17 ఈ ఖండములయందు పురుషుని జీవితమే యొక యజ్ఞరూప మను మొదలగు విషయములు చెప్పబడి యున్నవి.

18. 19, ఖండములయందు ఆకాశము మఱియు మనస్సు వీటిని బ్రహ్మమని ఉపాసించుటయు తత్ఫలమును మఱియు ఆదిత్యుడే బ్రహ్మమని ప్రారంభించి అసత్తునుండియే సృష్ట్యుత్పాదన మనియు చెప్పి మఱియు ఆదిత్యోదయమును సర్వులు నిరీక్షింతు రనియు సమస్తము నతని నవలంబించి యున్నదను నిత్యాది విషయములు చెప్పబడి యున్నవి.

---

## చతుర్థ ప్రపాఠకము. 1-వ ఖండము.

### జానశ్రుతి మహారాజు రైక్వుడు వీరియొక్క కథ.

హరిః ఓమ్. జానశ్రుతిర్హ పౌత్రాయణః శ్రద్ధాదేయో బహుదాయీ బహుపాక్య ఆస సహ సర్వత ఆవసథాన్మాపయాంచక్రే సర్వత ఏవ మేఽత్స్యంతీతి. 1

జానశ్రుతి పౌత్రాయణుడు అనగా మనుమడు అధికమగు శ్రద్ధచే దాన మొనర్చు అన్నదాతయై యుండెను. తాను దానము చేసిన అన్నమునే జనులు సర్వత్ర భుజింతురుగాక! యను సద్భావనచే అతడెల్లెడల ధర్మశాలలను అన్న సత్రములను గట్టించెను.

అథ హ హగ్ంసా నిశాయామతిపేతు స్తద్ధైవగ్ం హగ్ంసో హగ్ంసమభ్యువాద హో హోయి భల్లాక్ష భల్లాక్ష జానశ్రుతేః పౌత్రాయణస్య సమం దివా జ్యోతి రాతతం తన్మా ప్రసాంక్షీ స్తత్త్వా మా ప్రధాక్షీరితి. 2

ఒక దినము రాత్రి రెండు హంస పక్షులు అతని ముంగిట ఎగిరి పోవుచుండెను. అప్పుడందులో ఒక పక్షి రెండవ పక్షిని గుఱించి ఇట్లనెను. ఓ భల్లాక్షుడా! లోపించిన దృష్టి గలవాడా! ఓ మందదృష్టి గలవాడా యని భావము. ద్యులోక జ్యోతి వలె జానశ్రుతి పౌత్రాయణుని తేజస్సు వ్యాపించి యున్నది. దానిని తాక వలదు. అది నిన్ను కాల్చగలదు. హెచ్చరిక!

తముహ పరహ ప్రత్యువాచ కమ్వర ఏనమేతత్సంతగ్ం సయుగ్వానమివ రైక్వమాత్థేతి యోను కథగ్ం సయుగ్వా రైక్వ ఇతి. 3

(అప్పుడు) రెండవ పక్షి ఇట్లనెను. ఓరి పిచ్చివాడా! ఇతని యం దేమి గొప్పతనము గలదని చెప్పెదవు? ఈ అల్పుని గుఱించియా! సయుగ్వాన్ అను బండి రైక్వుని చెప్పినట్లు శ్లాఘించి చెప్పెదవా ఏమి? అనెను. అంతనాపక్షి అయ్యా! ఆరైక్వు డెవరు? ఎట్టివాడు? చెప్పుమని రెండవ హంస మరల అడిగెను.

యథా కృతాయ విజితాయాధరేఽయాస్సంయంత్యేవమేనగ్ం సర్వం తదభిసమైతి యత్కించ ప్రజాస్సాధు కుర్వంతి యస్తద్వేద యత్సవేద స మయైతదుక్త ఇతి. 4

జూదమునందు కృతాయ మను దానిని గెలిచిన వాడు తక్కిన వాను గెలిచిన అన్నిటిని గెలిచినట్లే యగును. (మూడు, రెండు, ఒకటి చుక్కలు గల ఆయములు అనగా కాయలు (పాచికలు) నాలుగు చుక్కలు గల కృతాయముునందు అంతర్గతము.) ప్రజలు చేయు సమస్త పుణ్యములు ఆ రైక్వునే చెందును. అతని కుండిన జ్ఞాన మెవరికి గలదో అతడు జ్ఞాని యనిపించుకొనును. ఇట్టి వానినే గొప్పవాడని నేను చెప్పితినని పక్షి పలికెను. ఈవిధమగు పక్షుల సంభాషణను జాన శ్రుతి వినెను. ఇతని సత్రమునందు భుజించి సంతోష మొందిన మహ ర్షులే ఈ పక్షులు. జానశ్రుతిని రక్షించు నిమిత్తమై యథార్థమగు జ్ఞానము నితడు పొందుగాక! యను దయామతిచే హంసస్వరూపము లను దాల్చి అన్యాపదేశమున ఇట్లు సంభాషించిరి. దాన మహిమచే గల్గిన పుణ్యవిశేషము వలన పక్షుల యా భాషను అర్థము జేసికొను శక్తి జానశ్రుతికి గలిగియుండెనని భావము.

తదుహ జానశ్రుతిః పౌత్రాయణ ఉపశుశ్రావ స హ సంజిహాన ఏవ క్షత్తారము వాచాంగారేహ సయుగ్వానమివ రైక్వమాత్థేతి యోను కథగ్ం సయుగ్వా రైక్వ ఇతి. 5

ఈ సంభాషణను జానశ్రుతి విని పిదప సారథిని బిలిచి ఇట్లనెను. ఓ సారథీ! ఆ రైక్వుని బిలుచుకొని రమ్మనెను. సారథి ఆ రైక్వు డనువా డెవడనెను?

యథా కృతాయ విజితాయాధరేఽయాస్సంయంత్యేవమేనగ్ం

సర్వం తదభిసమేతి యత్కించ ప్రజాస్సాధు కుర్వంతి యస్తద్వేద యత్స వేద స మయైతదుక్త ఇతి. 6

జూదమునందు కృత యను ఆయమును (పాచికను) గెలిచిన వాడు మిగిలిన ఆయముల నెల్ల గెలిచినట్లు ఎల్ల ప్రజలు చేయు పుణ్య మెల్ల ఆ రైక్వునే చెందును. అతని కుండిన జ్ఞాన మెవరికి గలదో అతడే జ్ఞాని యనిపించుకొనును. అందఱికంటెను సుకృతాత్ముడును జ్ఞానవంతుడు నయి యున్నాడు. అతనిని దోడ్కొని రమ్మని చెప్పెను.

స హ క్షత్తాన్విష్య నావిదమితి ప్రత్యేయాయతగ్ం హోవాచ యత్రారే బ్రాహ్మణస్యాన్వేషణా తదేనమర్ఛేతి. 7

రాజాజ్ఞ మేరకా సేవకుడు రైక్వుని వెదకి చూడ ఎచ్చటను అగపడనందున మఱలి వచ్చి అయ్యా! నా కతడు దొరకలేదని తెలి పెను. అప్పుడు మరల రాజు బ్రాహ్మణుని లేక బ్రహ్మజ్ఞానులగు పెద్ద లను ఎచ్చట వెదక వలయునో ఆ స్థానమునకు వెళ్ళి వెదకుము చూడుమని చెప్పెను.

సో౽ధస్తాచ్ఛకటస్య పామానం కషమాణ ముపోపవివేశ తగ్ం హాభ్యువాద త్వంను భగవస్సయుగ్వా రైక్వ ఇత్యహగ్ం హ్యరా ఇతిహ ప్రతిజజ్ఞే స హ క్షత్తా౽విదమితి ప్రత్యేయాయ. 8

బండిక్రింద మూగ గజ్జిని రుద్దుకొనుచు కూర్చుండి యుండిన రైక్వుని కడకు వెళ్ళి, సేవకుడు భగవన్! సయుగ్వ రైక్వ లనువారు తామేనా? యని అడిగెను. అందులకు అవును. నేనే. ఎందుకని అ డడుగ సారథి గ్రహించి వెంటనే రాజుకడకు వచ్చి విషయము తెలిపెను.

---

### 2-వ ఖండము

జానశ్రుతి రైక్వుని కడకు ఉపదేశము కొఱకై వెడలుట

తదుహ జానశ్రుతిః పౌత్రాయణష్షట్ఛతాని గవాం నిష్కమశ్వతరీరథం తదాదాయ ప్రతిచక్రమే తగ్ంహాభ్యువాద. 1

సారథిపలుకులను విని జానశ్రుతి ఆఱువందలావులను ఆభరణము లను రథమును గైకొని సంపద్యుక్తుడై రైక్వుని కడకు వెళ్ళి, ఇట్లనెను.

రైక్వేమాని షట్ఛతాని గవామయం నిష్కోఽయమశ్వతరీ రథోఽను హ ఏతాం భగవో దేవతాగ్ంశాధి యాం దేవతా ముపాస్స ఇతి. 2

ఓ రైక్వా! 600 గోవులు, ఈ కంఠాభరణము ఈ రథమును స్వీకరించి నీవు ఏ దేవత నుపాసింతువో ఆ దేవతాజ్ఞానమును నాకు దెలుపు మనెను.

తముహ పరః ప్రత్యువాచాహ హారేత్వా శూద్ర తవైవ సహ గోభిరస్త్వితి తదుహ పునరేవ జానశ్రుతిః పౌత్రాయణ స్సహస్రం గవాం నిష్కమశ్వతరీరథం దుహితరం తదాదాయ ప్రతిచక్రమే. 3

రైక్వుడు: ఓరి శూద్రుడా! ఈ ఆవులు మొదలగు సంపదలు నీవద్దనే యుండనిమ్మనెను. ఇచ్చట జానశ్రుతి క్షత్రియుడైనను ఓరి శూద్రుడా యనుటకు కారణము బ్రహ్మజ్ఞానము లేక బాహ్య పదార్థముల సత్యత్వ దృష్టిచే కృశించుచు నశించువాడా! యని ఈ సంబోధన యొక్క భావము. మరల జానశ్రుతి వేయి గోవులను కంఠాభరణమును అశ్వరథములను తన కూతురు మొదలగు నీసామగ్రులతో గూడ నతని కడకు వెళ్ళెను.

తగ్ంహాభ్యువాద రైక్వేదగ్ం సహస్రం గవామయం నిష్కోఽయ మశ్వతరీరథ ఇయం జాయాఽయం గ్రామో యస్మిన్నాస్సేఽన్వేవమా భగవశ్శాధీతి. 4

ఓ రైక్వదేవా! ఈ వేయి గోవులను కంఠాభరణమును రథమును నా ఇల్లాలు నా బిడ్డయు నీవుండు గ్రామము ఈ సర్వస్వము నీకే. నీవియే. నన్ననుగ్రహించి నాకు జ్ఞానోపదేశము చేయు మనెను.

తస్యాహముఖముపోద్గృహ్ణన్నువాచాజహారేమాః శూద్రానేనైవ ముఖేనాలాపయిష్యథా ఇతి తేహైతే రైక్వపర్ణా నామ మహావృషేషు యత్రాస్మా ఉవాస తస్మై హోవాచ. 5

అప్పుడు రైక్వుడు జానశ్రుతియొక్క చిరంజీవిని కూతురి నిర్మల వదనమును చూచి ఇది విద్యాముఖ మని తెలిసి సంతసించి సర్వము నొసగుట. కాయత్తుడైన రాజును గుఱించి విద్యాదానము జేయ నంగీకరించినవాడై రైక్వు డిట్లనియె-

ఓశూద్రుడా! ఈ ధన మెల్ల నీకే యుండని నీవు నిజముగా విషయ విరహిత మగు నిర్మల ముఖము గల నీ కూతురి ముఖాంతరమున నన్ను ప్రసన్నుని గావించుకొని జ్ఞానభిక్ష నడిగితివి. పుణ్యఫలాపేక్షచే కర్మ జేసిన జానశ్రుతికంటెను పుణ్య పాప సంస్కారము లేనిదగు నిర్మల వదనమైన తన బిడ్డ ముఖాంతరమున తండ్రికి తత్త్వ జ్ఞానమును బోధింప రైక్వునకు ప్రసన్న వృత్తి కలిగెనని భావము. అప్పటినుండి మహావృష దేశమునందలి ఆ గ్రామమునకు రైక్వపర్ణ యను నామ మాయెను. ఇచ్చటనే రైక్వుడుండెను. ఈ క్రింది వి న్నముగా రాజునకు రైక్వుడు తెలిపెను.

---

### ౩-వ ఖండము

### వాయుప్రాణములయొక్క ఉపాసనను తెలుపుట

వాయుర్వావ సంవర్గో యదా వా అగ్నిరుద్వాయతి వాయుమేవాప్యేతి యదా సూర్యో౽స్తమేతి వాయుమేవాప్యేతి యదా చంద్రో౽స్తమేతి వాయుమేవాప్యేతి. 1

వాయువే సంవర్గము అనగా చివరి ఆశ్రయము. అగ్ని చల్లబడె ననిన వాయువునే ఆశ్రయించును. సూర్యు డస్తమించిన వాయునందే చేరును. చంద్రు డస్తమించిన వాయువునందే లీన మగును.

యదాప ఉచ్ఛుష్యంతి వాయుమేవాపి యంతి వాయుర్హ్యేవైతాంస్సర్వాంత్సం వృంక్త ఇత్యధిదైవతమ్. 2

జలమింకెననిన వాయువు నాశ్రయించును. వాయువే ఈసమస్తమును మ్రింగును. ఇది అధిదైవము. ఈ విషయము విశ్వమునందలి శక్తులను గుఱించినదని అర్థము.

అథాధ్యాత్మం ప్రాణోవావ సంవర్గ స్స యదా స్వపితి ప్రాణమేవ వాగప్యేతి ప్రాణం చక్షుః ప్రాణగ్ం శ్రోత్రం ప్రాణం మనః ప్రాణో హ్యేవైతాన్సర్వాంత్సం వృంక్త ఇతి. 3

ఇక అధ్యాత్మము అనగా శరీరస్థమైన శక్తుల గుఱించిన వి యము. ప్రాణమేసంవర్గము. మనుష్యుడు నిద్రించె ననిన అతని వాక్కు

నేత్ర, శ్రోత్ర, మానసాది ఇంద్రియము లన్నియు ప్రాణమునందు చేరును. ప్రాణమే ఈ సమస్తమును మ్రింగును.

తౌ వా ఏతౌ ద్వౌ సంవర్గౌ వాయురేవ దేవేషు ప్రాణః ప్రాణేషు. 4

దేవతలయందు అనగా విశ్వ శక్తులయందు వాయువు, జీవ శక్తులయందు ప్రాణమనీ ఈ రెండును సంవర్గములు. ఈ ఉపదేశము యొక్క తాత్పర్యము ప్రాణమును పరబ్రహ్మదృష్టిచే నుపాసించుమని భావము.

అథహ శౌనకం చ కాపేయమభిప్రతారిణం చ కాక్షసేనిం పరివిష్యమాణౌ బ్రహ్మచారీ బిభిక్షే తస్మా ఉహ న దదతుః. 5

ఒకప్పుడు కపి గోత్రస్థుడగు శౌనకుడును కక్షసేనుని పుత్రుడైన అభిప్రతారియును భోజనము జేయు సమయమున వంటవాడు వడ్డన చేయుచుండగా బ్రహ్మచారి యొకడు వచ్చి భిక్ష నడిగెను. వారతనికి భిక్ష పెట్టలేదు.

స హోవాచ మహాత్మనశ్చతురో దేవ ఏకః కస్సజగార భువనస్య గోపాః. తంకాపేయనాభిపశ్యంతి మర్త్యా అభిప్రతారిన్ బహుధా వసంతమ్. యస్మై వా ఏతదన్నం తస్మా ఏతన్నదత్తమితి. 6

అప్పుడు బ్రహ్మచారి ఇట్లనెను—"ఓ శౌనకా! అగ్న్యాది నలుగురు మహాత్ముల నెవ్వడు మ్రింగెనో ఆ భువన రక్షకుడగు ప్రజాపతిని మర్త్యులగు మీరు తెలియలేరు. ఓ అభిప్రతారీ! అనంత రూపములచే వసించు ఎవనికి అనగా ప్రజాపతికి అన్నము సంతతము యజ్ఞాదులయందు ఇవ్వబడుచున్నదో అట్టివాని కిప్పుడు మీరన్నము నివ్వలేదు. ఈ అన్న మంతయు నతనికై యే యుండగా అతనికే మీరన్నము నివ్వలేదు కదా! అనగా అట్టి సంవర్గ ప్రాణోపాసకుడ నైన నాకే మీరన్నము బెట్టలేదు గదా! నన్ను వినా మీరు భిక్ష మఱెవ్వరికి పెట్టుదురని భావము.

తదుహ శౌనకః కాపేయః ప్రతిమన్వానః ప్రత్యేయాయ ఆత్మా దేవానాం జనితా ప్రజానాగ్ం హిరణ్యదగ్ంష్ట్రో బభసోఽన సూరిః

మహాంతమస్య మహిమానమాహురనద్యమానో యదనన్నమత్తీతి వై వయం బ్రహ్మచారిన్నేదముపాస్మహే దత్తాస్మై భిక్షామితి. 7

ఆ పిదప శౌనకుడు విచారించి బ్రహ్మచారికడ కేగి ఇట్లనెను. అతడు ఆ ప్రజాపతి దేవతల ఆత్మ. ప్రజలను బుట్టించువాడు. బంగారు దంతములు గలవాడు. సర్వమును భుజించు సామర్థ్యము గలవాడు మహా మేధాసంపన్నుడని యతని మాహాత్మ్యమును చెప్పుదురు. అతని ఎవరును భక్షింప లేరు. అతడు అన్నమును మాత్రమే గాక అన్నము గాని దానిని కూడ భక్షింప గలడు. ఓ బ్రహ్మచారీ! మేమును అతనిని ఉపాసించెద మని పలుకుచు బ్రహ్మచారికి భిక్ష పెట్ట జెప్పిరి.

తస్మా ఉహ దదుస్తే వా ఏతే పంచాన్యే పంచాన్యే దశ సంత స్తత్కృతం తస్మాత్సర్వాసు దిక్ష్వన్నమేవ దశకృతగ్ంసైషా విరా డన్నాదీతయేదగ్ం సర్వం దృష్టగ్ం సర్వమస్యేదం దృష్టం భవత్య న్నాదో భవతి య ఏవం వేద య ఏవం వేద. 8

ఆ పిదప అతనికి భిక్ష పెట్టిరి. ఈ ఐదును అనగా భుజించువాడైన వాయు వొకటి, అన్నములైన అగ్ని, సూర్యుడు, చంద్రుడు, జలము అనునివి నాలుగు, మొత్తము చేరి ఐదు, తక్కినవి ఐదును అన్నము దినునట్టి ప్రాణ మొకటి, వాక్కు, నేత్రము, చెవి, మనసు అనునవి నాలుగు. ఈ విధముగా మొత్తము పది. ఇవన్నియు ప్రజాపతి అన్నము లని అర్థము. ఈ అన్నమే "కృతమై" యున్నది. ఈ విరాట్ ప్రజా పతియే అన్న భక్షకుడై, సమస్తమును చూచువాడై యున్నాడు ఇట్లెఱిగిన వాడు చక్కగా అన్నమును జీర్ణింప జేయువాడును అన్నా దుడు నగును.

## 4–వ ఖండము

అవ: జబాలా పుత్రుడగు సత్యకాముడు గౌతమ ఋషి యను గురువుకడకు వెడలి గురువు ఆజ్ఞను అనుసరించి వర్తించుట యను నీ కథ.

సత్యకామోహ జాబాలో జబాలాం మాతర మామన్త్రయాం చక్రే బ్రహ్మచర్యం భవతి వివత్స్యామి కింగోత్రో న్వహమస్మీతి

జాబాలుడను సత్యకాముడు గురుసన్నిధికి వెళ్ళుటకై తన తల్లి యగు జబాలయొక్క అనుమతి గోరెను. అమ్మా! బ్రహ్మచర్య వ్రతముచే గురుకుల వాసము జేయ నిచ్ఛించుచున్నాను. నా గోత్ర మేదని యడిగెను.

సా హైనముువాచ నాహమేతద్వేద తాత యద్గోత్ర స్త్వమసి బహ్వహం చరంతీ పరిచారిణీ యౌవనే త్వామలభే సాహమేతన్న వేద యద్గోత్ర స్త్వమసి జబాలా తు నామాహమస్మి సత్యకామోనా మత్వ మసి స సత్యకామ ఏవ జాబాలో బ్రువీథా ఇతి. 2

ఆమె కుమారున కీవిధముగ దెలిపెను. వత్సా! నీవు ఏ గోత్ర స్థుడ వనునది నాకు తెలియదు. యౌవనావస్థలో నేననేక స్థలముల యందు పరిచర్యావృత్తి చేయుచు దిరుగుచుండగా నీవు నాకు గలిగితివి. అందుచే నీ వేగోత్రస్థుడ వనునది నాకు దెలియదు. నా పేరు జబాల. నీ పేరు సత్యకాముడు. ఇంత మాత్రము నాకు తెలియును.

సహహారిద్రుమతం గౌతమమేత్యోవాచ బ్రహ్మచర్యం భగవతి వత్స్యామ్యుపేయాం భగవంతమితి. 3

అప్పు డతడు హారిద్రుమత గౌతముని వద్దకు వెళ్ళి భగవన్ "నేను బ్రహ్మచర్యవ్రతముచే ఉండ నిశ్చయించుచున్నాను. తమ కడకు శిష్యుడనై వచ్చి యున్నానని విన్నవించుకొనెను.

తగ్ంహోవాచ కిం గోత్రోను సోమ్యాసీతి స హోవాచ నాహమేతద్వేద భో యద్గోత్రోహమస్మ్యపృచ్ఛం మాతరగ్ం సా మాప్రత్యబ్రవీద్బహ్వహం చరంతీ పరిచారిణీ యౌవనే త్వామలభే సాహమేతన్న వేద యద్గోత్ర స్త్వమసి జబాలా తు నామాహమస్మి సత్యకామో నామ త్వమసీతి సోఽహగ్ం సత్యకామో జాబాలోఽస్మి భో ఇతి. 4

నాయనా! నీ గోత్ర మేదని గౌతము డడిగెను. అంత స్వామీ! నా గోత్ర మేది యనునది నాకు తెలియదు. ఈ విషయమున నా తల్లిని నే నడిగితిని. (నాయనా!) యౌవనావస్థయందు నే ననేక స్థలములలో పరిచర్యావృత్తిచే దిరుగు నపుడు నాకు నీవు గలిగితి వనియు

నీ గోత్ర మేది యనునది నే నెఱుగ ననియు నా పేరు జబాల; నీ పేరు సత్యకామ యని ఆమె ఇంత మాత్రము నాకు చెప్పెను. అందుచేత భగవన్! నేను సత్యకామ జాబాలుడనై యున్నాన నెను.

తగ్ంహోవాచ నైతదబ్రాహ్మణో వివక్తుమర్హతి సమిధగ్ం సోమ్యాహరోపత్వానేష్యేనసత్యాదగా ఇతి తముపనీయ కృశానామబలానాం చతుశ్శతాగాని రాకృత్యోవాచేమాస్సోమ్యానుసంవ్రజేతి తా అభిప్రస్థాపయన్నువాచ నాసహస్రేణావర్తేయేతి సహావర్ష గణం ప్రోవాస తాయదా సహస్రగ్ం సంపేదుః. 5

గౌతముడు ఈ మాటలను విని బ్రాహ్మణుడు దప్ప ఇతరులు ఇట్లు చెప్ప జాలరు. సత్యమును చెప్పుటవలన ఇతడు బ్రాహ్మణుడే అయి యుండునని గౌతముడు తెలిసికొనెను. సమిధలను తెమ్ము. నీకు నేను ఉపనయనమును జేతును. నీవు సత్యమునుండి జార లేదని చెప్పి ఉపనీతు నొనర్చెను. అనంతరము దుర్బలములగు నాలుగు వందల గోవుల నేరి వీటిని చక్కగా మేపుకొని వేయి గోవు లయిన పిదప రమ్మని ఆజ్ఞాపించెను. ఎన్నో వత్సరము లరణ్యమునం దుండుచుండ గోవులు వెయ్యి అయ్యెను.

---

### 5-వ ఖండము

అవ: సత్యకామునకు వృషభ మొకటి బ్రహ్మముయొక్క ఏక పాదము నుపదేశించుట.

అథ హైనమృషభోఽభ్యువాద సత్యకామా౩ ఇతి భగవ ఇతి హ ప్రతిశుశ్రావ ప్రాప్తాస్సోమ్య సహస్రగ్ంస్మః ప్రాపయ న ఆచార్య కులమ్. 1

ఇట్లు సత్యకాముడు అడవులయం దుండ ఆ పశువుల సమూహమునందలి వృషభ మొకటి అతనిని గుఱించి ఓసత్యకామా! యని సంబోధించెను. భగవన్ ఏమి? యని సత్యకాము డడుగ అయ్యా! మేము ఒక వేయి అయి యున్నాము. మమ్ము గురుకులమునకు ఆచార్యుల సన్నిధికి దోలుకొని పొమ్మనెను

బ్రహ్మణశ్చ తే పాదం బ్రువాణీతి బ్రవీతు మే భగవానితి తస్మై హోవాచ ప్రాచీదిక్కలా ప్రతీచీదిక్కలా దక్షిణా దిక్కలో దీచీదిక్కలైష వై సోమ్య చతుష్కలః పాదో బ్రహ్మణః ప్రకాశవాన్నామ. 2

అంత నా వృషభము మఱియు నిట్లు పలికెను. నేను బ్రహ్మ పాదమును గుఱించి నీకు దెలిపెద ననెను. అట్లే యగుగాక యని సత్యకాము డంగీకరింప అప్పుడా వృషభము పూర్వదిక్కు ఒక కళ. అటు పలె పశ్చిమ దక్షిణోత్తరములను నీ దిక్కులు నాలుగు కళలు. ఈ నాలుగు కళలు చేరి ఒక పాదము. ప్రకాశవాన్ అని దీనికి నామము.

స య ఏతమేవం విద్వాగ్ంశ్చతుష్కలం పాదం బ్రహ్మణః ప్రకాశవానిత్యుపాస్తే ప్రకాశవానస్మిన్ లోకే భవతి ప్రకాశవతో హ లోకాన్జయతి య ఏతమేవం విద్వాగ్ం శ్చతుష్కలం పాదం బ్రహ్మణః ప్రకాశవానిత్యుపాస్తే. 3

ఈ విధముగా దెలిసి ఉపాసించువాడు బ్రహ్మలోకమునందు ప్రకాశము గలవాడై ప్రకాశ పూర్ణమగు లోకములను జయించును.

## 6–వ ఖండము

### అగ్నిద్వారా బ్రహ్మతత్త్వముయొక్క ద్వితీయపాదోపదేశము

అగ్నిష్టే పాదం వక్తేతి సహ శ్వో భూతేగాఅభిప్రస్థాపయాంచకార తాయత్రాభిసాయం బభూవుస్తత్రాగ్నిముపసమాధాయగా ఉపరుధ్య సమిధ మాధాయ పశ్చాదగ్నేః ప్రాఙుపోపవివేశ. 1

ఇందొక పాదము అగ్ని దేవుడు నీకు జెప్పునని వృషభము తెలిపెను. మఱుదినము సత్యకాముడు ఆవులను గురుస్థానమునకు సాగించెను. సాయంసమయ మైన వెంటనే ఆవుల నొకచోట ఆపి సమిధలను వేసి అగ్నిని వెలిగించి పూర్వాభిముఖుడై సత్యకాముడు కూర్చుండెను.

తమగ్నిరభ్యువాద సత్యకామా3ఇతి భగవ ఇతి హ ప్రతిశుశ్రావ. 2

ఓ సత్యకామా! యని అగ్ని ఆతనిని సంబోధింప భగవః! ఏమి:? యని సత్యకాముడడిగెను.

బ్రహ్మణస్సోమ్య తే పాదం బ్రువాణీతి బ్రవీతు మే భగవానితి తస్మై హోవాచ పృథివీ కలాంతరిక్షం కలా ద్యౌః కలా సముద్రః కలైషవై సోమ్య చతుష్కలః పాదో బ్రహ్మణోఽనంతవాన్నామ. 3

బ్రహ్మపాదమును (నేను) నీకు దెలిపెదను. పృథివి, అంతరిక్షము, ద్యులోకము, సముద్రము ఇవి నాలుగు కళలు. ఈ నాలుగు కళలు చే రెండవ పాదము. దీనికి అనంతవాన్ అని పేరు. ఇది బ్రహ్మముయొక్క రెండవ పాదము.

స య ఏతమేవం విద్వాగ్ంశ్చతుష్కలం పాదం బ్రహ్మణోఽనంతవానిత్యుపాస్తేఽనంతవానస్మిన్ లోకే భవత్యనంతవతో హ లోకాన్జయతి య ఏత మేవం విద్వాగ్ంశ్చతుష్కలం పాదం బ్రహ్మణోఽనంతవానిత్యుపాస్తే. 4

బ్రహ్మము నాలుగు కళలచే నొప్పు అనంతవాన్ అని ఎవడిట్లు యుపాసించునో అతడనంత లోకములను జయించును.

## 7-వ ఖండము

### హంసమూలమున బ్రహ్మ తృతీయపాదోపదేశము

హగ్ంస స్తే పాదం వక్తేతి సహ శ్వో భూ తేగా అభిప్రస్థాపయాంచకార తా యత్రాభిసాయం బభూవు స్తత్రాగ్నిముపసమాధాయగా ఉపరుధ్య సమిధ మాధాయ పశ్చాదగ్నేః ప్రాఙుపోపవివేశ. 1

వేఱొక భాగమును హంస నీకు దెలుపునని అగ్ని దేవుడు పల్కి మిన్నకుండెను. మఱుదినమున సత్యకాముడు ఆవులను ఎప్పటివలె ముందు సాగించెను. సాయంకాలమున ఒకచోట నాపి అగ్ని వెలిగించి సమిధలు వేసి పూర్వాభిముఖుడై కూర్చుండెను.

తగ్ంహంస ఉపనిపత్యాభ్యువాద సత్యకామా3ఇతి భగవ ఇతి హ ప్రతిశుశ్రావ. 2

హంస యొకటి అతనివద్దకు వచ్చి సత్యకామా! యని సంబోధింప ఏమి? యనెను

బ్రహ్మణస్సోమ్య తే పాదం బ్రువాణీతి బ్రవీతు మే భగవానితి తస్మై హోవాచాగ్నిః కలా సూర్యః కలా చంద్రః కలా విద్యుత్కలైషవై సోమ్య చతుష్కలః పాదో బ్రహ్మణో జ్యోతిష్మాన్నామ. 3

నీకు బ్రహ్మముయొక్క ఒక పాదమును గుఱించి బోధింతునని చెప్పెను. అగ్ని, సూర్యుడు, చంద్రుడు, విద్యుత్తు ఇవి కళలు. ఈ నాలుగు చేరి బ్రహ్మమున కొక పాదము. జ్యోతిష్మాన్ అనబడు నిది బ్రహ్మముయొక్క మూడవపాదము.

స ఏతమేవం విద్వాగ్ంశ్చతుష్కలం పాదం బ్రహ్మణో జ్యోతిష్మానిత్యుపాస్తే జ్యోతిష్మానస్మిన్ లోకే భవతి జ్యోతిష్మతోహ లోకాన్జయతి య ఏతమేవం విద్వాగ్ంశ్చతుష్కలం పాదం బ్రహ్మణో జ్యోతిష్మానిత్యుపాస్తే. 4

ఈ విధముగ తెలిసి ఎవ డుపాసించునో అతడు జ్యోతిష్మాన్ లోకములను జయించును.

---

## 8-వ ఖండము

అవ: మద్గు అనగా నీటికోడి యొకటి బ్రహ్మముయొక్క చతుర్థపాదము నుపదేశించుట.

మద్గుష్టే పాదం వక్తేతి స హ శ్వోభూతే గా అభిప్రస్థాపయాంచకార తా యత్రాభిసాయం బభూవుస్తత్రాగ్నిముపసమాధాయ గా ఉపరుధ్య సమిధ మాధాయ పశ్చాదగ్నేః ప్రాఙుపోపవివేశ. 1

తం మద్గురుపనిపత్యాభ్యువాద సత్యకామా3 ఇతి భగవ ఇతి హ ప్రతిశుశ్రావ. 2

బ్రహ్మణస్సోమ్య తే పాదం బ్రువాణీతి బ్రవీతు మే భగవానితి తస్మై హోవాచ ప్రాణః కలా చక్షుః కలా శ్రోత్రం కలా మనః కలైష వై సోమ్య చతుష్కలః పాదో బ్రహ్మణ ఆయతనవాన్నామ.3

స య ఏతమేవం విద్వాగ్ంశ్చతుష్కలం పాదం బ్రహ్మణ ఆయతనవా నిత్యుపాస్త ఆయతనవా నస్మిన్ లోకే భవ త్యాయతనవతోహ

లోకాన్జయతి. య ఏతమేవం విద్వాగ్ంశ్చతుష్కలం పాదం బ్రహ్మణ ఆయతనవా నిత్యుపాస్తే. 4

మద్గు యను జలచర పక్షి యొకటి నీకు బ్రహ్మపాద విషయమగు జ్ఞానమును దెలుపు నని చెప్పి హంస మిన్నకుండెను. మిగత విషయము పై మంత్రములవలె. ఇక జలచర మగు ఆ నీటికోడి చెప్పిన దేమనిన, ప్రాణము, చక్షుస్సు, శ్రోత్రము, మనస్సు ఇవి నాలుగు కళలు. ఈ నాలుగు చేరి ఒక పాదము. ఇది ఆయతనవాన్ అనగా ఆశ్రయము గలదని చెప్పబడు బ్రహ్మముయొక్క నాలుగవ పాదము. ఈ విధముగ నెఱిగి ఎవడు ఉపాసించునో అతడీ లోకమున సర్వాశ్రయములు గలవాడగును. ఆయతనవాన్ లోకములను జయించును.

—o—

9-వ ఖండము

సత్యకాముడు ఆచార్యుల వలన మరల ఉపదేశము నొందుట

ప్రాపహాచార్యకులం తమాచార్యోభ్యువాద సత్యకామా3ఇతి భగవ ఇతి హ ప్రతిశుశ్రావ. 1

సత్యకాముడు గురుకులమును చేరెను. (అంత) నా యాచార్యులతనిని జూచి,

బ్రహ్మవిదివ వై సోమ్య భాసి కోనుత్వాఽనుశశాసేత్యన్యే మనుష్యేభ్య ఇతిహ ప్రతిజజ్ఞే భగవాంస్త్వేవ మే కామే బ్రూయాత్. 2

సత్యకామా! నీవు బ్రహ్మము నెఱిగిన వానివలె నగపడుచున్నావు. నీకెవరు జెప్పిరని యడిగెను. గురుదేవా! మనుష్యేతరులు జ్ఞానమును నాకు దెలిపిరి. అయిన నేమి? మీరు నాకుపదేశించి ధన్యుని జేయవలయునని నా ప్రార్థన.

శ్రుతగ్ంహ్యేవ మే భగవద్దృశేభ్య ఆచార్యాద్ధైవ విద్యా విదితా సాధిష్ఠం ప్రాపదితి తస్మై హైతదేవోవాచాత్రహ న కించన వీయాయేతి వీయాయేతి. 3

తమబోటి ఆచార్యుల వలన అనగా గురుముఖమున బడయని విద్య సాధుత్వమును పొందదు. గురువుచే పొందబడిన విద్య పరమ కళ్యాణ కారక మగునని వినియున్నాను. ఇట్లు సత్యకాముడు చెప్పగా అందులకు అయ్యాచార్యు డతనికి అదే విద్యను చెప్పెను. అందు సత్య కాముడు మొదట వినిన విద్యకంటె వేఱేమియు నుండలేదు. కాని అందు దృష్టి గలిగెను. వృత్తివ్యాప్తి నొందెను. గురువుచే షోడశ కళా విద్య చక్కగా నుపదేశింప బడినపుడే అయ్యది సాంప్రదాయికమై సాధుత్వమును బడసి నిత్యతృప్తి నొసగ సమర్థమైన బ్రహ్మజ్ఞాన మగు నని భావము.

10-వ ఖండమునుండి 17-వ ఖండము-ఈప్రపాఠకాంత్యము వఱకు ఉన్న విషయ మేమన, ఇందు ఉపకోసలుని యొక్క కథ గలదు. ఉపకోసలుడు ఉపోష్య వ్రతము నాచరించి గార్హపత్యాది అగ్నులచే విద్యను బడయుట అను మొదలగు విషయములు 15-వ ఖండమువఱకు, ఈ చివర 16, 17 ఖండములయందు యజ్ఞమున గలుగు క్షతదోషా దుల నేవిధముగా నివారింపవలె నను కర్మవిషయములను గుఱించి చెప్పబడి యున్నది.

### 5-వ ప్రపాఠకము-1-వ ఖండము

### ప్రాణముయొక్క సర్వోత్కృష్టత

యోహ వై జ్యేష్ఠం చ శ్రేష్ఠం చ వేద జ్యేష్ఠశ్చ హ వై శ్రేష్ఠశ్చ భవతి ప్రాణోవావ జ్యేష్ఠశ్చ శ్రేష్ఠశ్చ. 1

జ్యేష్ఠమును శ్రేష్ఠము నగు దానిని ఎవఁడెఱుగునో అతడే జ్యేష్ఠుడును శ్రేష్ఠుడు నగును. ప్రాణమే జ్యేష్ఠము, శ్రేష్ఠమునై యున్నది

యో హ వై వసిష్ఠం వేద వసిష్ఠో హ స్వానాం భవతి వాగ్వావ వసిష్ఠః. 2

వసిష్ఠుని (గొప్పవానిని) యెఱిగినవాడు తమ సమూహాములో వశిష్ఠు డగును. వాక్కే వశిష్ఠు డని అర్థము.

యో హ వై ప్రతిష్ఠాం వేద ప్రతి హ తిష్ఠత్యస్మిగ్ంశ్చ లోకే ఽముష్మిగ్ంశ్చచక్షుర్వావ ప్రతిష్ఠా. 3

ప్రతిష్ఠ నొంది యుండిన దానిని అనగా స్థిరమై యుండిన దాని నెఱింగినవాడు ఇహ పర లోకములందు ప్రతిష్ఠితు డగును. నేత్రమే ప్రతిష్ఠ కలదై యున్నది.

యో హ వై సంపదం వేద తగ్ంహాస్మై కామాః పద్యంతే దైవాశ్చ మానుషాశ్చ శ్రోత్రం వావ సంపత్. 4

సంపద గల దానిని, అనగా శ్రోత్రముచే వేదశ్రవణము చేయుట, పిదప కర్మానుష్ఠానము, తత్ఫలము నొందుట ఇత్యాది సంపద నెవడు తెలిసికొనుచున్నాడో దేవతలును మనుజులును అతని కోర్కెలు కొన సాగునట్లు చేయుదురు. కాబట్టి శ్రోత్రమే సంపద.

యో హ వా ఆయతనం వేదాయతనగ్ంహ స్వానాం భవతి మనో హ వా ఆయతనమ్. 5

ఆయతన మనగా ఆశ్రయ స్థానము నెఱిగినవాడు తన బంధువులకు ఆశ్రయ మగును; లేక తనతో జేరిన వారికి ఆశ్రయ స్థానమై యుండును. మనస్సే ఆయతనము.

అథ హ ప్రాణా అహగ్ం శ్రేయసి వ్యూదిరేఽహగ్ం శ్రేయానస్మ్యహగ్ం శ్రేయానస్మీతి తేహ ప్రాణాః ప్రజాపతిం పితర మేత్యోచుర్భగవన్కో నః శ్రేష్ఠ ఇతి. 6

అంత ప్రాణములు (ఇంద్రియములు) నేను శ్రేష్ఠుడను నేను శ్రేష్ఠుడ నని వాదముజేయ నారంభించెను.

తాన్ హోవాచ యస్మిన్ వ ఉత్క్రాంతే శరీరం పాపిష్ఠతర మివ దృశ్యేత స వః శ్రేష్ఠ ఇతి. 7

(అప్పుడు) ఇంద్రియములు తమ తండ్రియగు ప్రజాపతి కడకు వెళ్ళి భగవన్! మాయం దెవరు శ్రేష్ఠులని యడిగెను. మీలో నెవని ఎవరు వెడలి పోయిన శరీరము అత్యంత మశుచియై పాప భూయిష్ఠ మగునో అతడే శ్రేష్ఠుడని ప్రజాపతి చెప్పెను.

సా హ వాగుచ్చక్రామ సా సంవత్సరం ప్రోష్య పర్యేత్యో వాచ కథమశకత ర్తేమజ్జీవితుమితి యథా కలా అవదంతః ప్రాణంతః

ప్రాణేన పశ్యంతశ్చక్షుషా శృణ్వంత శ్రోత్రేణ ధ్యాయంతో మనసైవ మితి ప్రవివేశ హ వాక్. 8

అప్పుడు వాక్కు శరీరమునుండి వెడలిపోయి ఒక సంవత్సరము వెలుపల నుండి మరల వచ్చెను. నేను లేనందువలన ఈ శరీర మెట్లు జీవించి యుండెనని యడిగెను. మూగవానివలె మాటలాడక ప్రాణ ముంచుకొని యుండుచు, చెవులతో వినుచు, కన్నులతో చూచుచు, మనస్సుతో దలంచుచు ఈ శరీరము జీవించెనని బదులు చెప్పగా విని వాక్కు మఱి మాటాడక శరీరమునందు ప్రవేశించి స్వస్థత నొందెను.

చక్షుర్హోచ్చక్రామ తత్సంవత్సరం ప్రోష్య పర్యేత్యోవాచ కథమశకత ర్తే మజ్జీవితుమితి యథాంధా అపశ్యంతః ప్రాణంతః ప్రాణేన వదంతో వాచా శృణ్వంతశ్శ్రోత్రేణ ధ్యాయంతో మనసైవమితి ప్రవివేశ హ చక్షుః. 9

తరువాత నేత్రము వెడలి ఒక సంవత్సరము పాటు వెలుపల నుండి మఱలి వచ్చి చేరెను. నేను లేనందువలన మీరెట్లుంటిరని యడుగ గ్రుడ్డివాడుండునట్లుంటిమి అని తెలుప మరల ఆ నేత్రము శరీరమున జొచ్చెను.

శ్రోత్రగ్ం హోచ్చక్రామ తత్సంవత్సరం ప్రోష్య పర్యేత్యోవాచ కథమశకర ర్తే మజ్జీవితుమితి యథా బధిరా అశృణ్వంతః ప్రాణంతః ప్రాణేన వదంతో వాచా పశ్యంతశ్చక్షుషా ధ్యాయంతో మనసైవమితి ప్రవివేశ హ శ్రోత్రమ్. 10

అటువలె శ్రోత్రము వెడలి పోయెను. ఒక సంవత్సరము వెలుపల నుండి వచ్చి యడుగ చెవిటి వానివలె యుంటిమని బదులు చెప్పిన పిదప శ్రోత్రము మరల శరీరమున ప్రవేశించెను.

మనో హోచ్చక్రామ తత్సంవత్సరం ప్రోష్య పర్యేత్యోవాచ కథమశకత ర్తే మజ్జీవితుమితి యథా బాలా అమనసః ప్రాణంతః ప్రాణేన వదంతో వాచా పశ్యంతశ్చక్షుషా శృణ్వంతశ్శ్రోత్రేణైవమితి ప్రవివేశ హ మనః. 11

అనంతరము మనస్సు వెడలిపోయి ఒక వత్సరము వెలుపల

నుండి మరల వచ్చి నేను లేనిది మీరెట్లుంటిరని యడుగ మనస్సు లేని వానివలె నుంటిమని బదులు చెప్పగా మరల మనస్సు శరీరమును ప్రవేశించెను.

అథహ ప్రాణ ఉచ్చిక్రమిషన్ యథా సుహయః పడ్వీశశంకూన్ సంఖిదే దేవమితరాన్ ప్రాణాన్సమఖిదత్తగ్ంహాభిసమేత్యోచుర్భగవన్నేధిత్వం నశ్శ్రేష్ఠోఽసి మోత్క్రమీరితి. 12

ఆ పిదప ప్రాణము బయలుదేర నాయత్తమయ్యెను. కాని ఉత్తమమగు గుఱ్ఱము తనను కట్టి వేసిన గుంజ నూడ బెఱుకునట్లు (ప్రాణము) వెలుపలకు వెళ్ళుట కుద్యమించిన వెంటనే ముఖ్య ప్రాణము తక్కిన యావచ్ఛక్తులను శరీరమునుండి పెకలించి వైచెను. అపుడా శక్తులెల్ల ముఖ్యప్రాణము కడకు వచ్చి హేభగవన్! నీవే మా స్వామి వగుము. నీవే మాయందు శ్రేష్ఠుడవు. నీవు వెడలి పోవలదని ప్రార్థించుకొనెను.

అథ హైనం వాగువాచ యదహం వసిష్ఠోస్మి త్వం తద్వసిష్ఠోఽసీత్యథ హైనం చక్షురువాచ యదహం ప్రతిష్ఠాఽస్మి త్వం తత్ప్రతిష్ఠాఽసీతి. 13

అప్పుడువాక్కు ముఖ్య ప్రాణమునుగుఱించి నేను వశిష్ఠుడనై యుండినది (పెద్దవాడనై యుండినది) నిజముగా నీవు ప్రతిష్ఠితుడవై యున్నందు వలననే యని పలికెను.

అథ హైనగ్ం శ్రోత్రమువాచ యదహగ్ం సంపదస్మి త్వం తత్సంపదసీత్యథ హైనంమన ఉవాచ యదహ మాయతన మస్మి త్వం తదాయతనమసీతి. 14

నేను సంపద్విశిష్టుడనై యుండినది నీవు నిజమైన సంపద్యుక్తుడవై యుండినందు వలననే యని శ్రోత్రము చెప్పెను. అటువలె మనస్సును నేను ఆశ్రయస్థానమై యుండినది నిజముగా నీవు ఆశ్రయమై యుండినందువలననే యని చెప్పెను. ఇట్లు సర్వేంద్రియములును గుణములును ముఖ్యప్రాణమువలననే శక్తిమంతములై యున్నవని భావము.

న వై వాచో న చక్షూగ్ంషి న శ్రోత్రాణి న మనాంసి

సీత్యాచక్షతే ప్రాణా ఇత్యేవాచక్షతే ప్రాణో హ్యేవైతాని సర్వాణి భవతి. 15

వాక్కు, కన్నులు, చెవులు, మనస్సు ఇవి ప్రత్యేకమగు శక్తులని జను లనుట లేదు. వీటి నన్నిటిని ప్రాణము లనియే పిలుతురు. ప్రాణమే ఇదంతయు నయి యున్నది.

—o—

2-వ ఖండము

స హోవాచ కిం మేఽన్నం భవిష్యతీతి యత్కించిదిదమా శ్వభ్య ఆశకునిభ్య ఇతి హోచు స్తద్వా ఏతదనస్యాన్నమనో హ వై నామ ప్రత్యక్షం న హ వా ఏవం విది కించనానన్నం భవతీతి. 1

ఆ ముఖ్యప్రాణుడు నాకు అన్న మేది? యని అడిగెను. సర్వ ప్రాణులు ఏ యన్నమును భుజించుచున్నారో (ఇతర నుగు) పశు పక్షి శునకాదులును దేనిని భుజించుచున్నవో ఆ యన్న మెల్ల నీదే యని తక్కిన ప్రాణము లన్నియు అనగా చక్షురాదీంద్రియము లన్నియును చెప్పెను. అదే అన్నము "అన్నమ్" ఇది ప్రత్యక్షమగు ప్రాణముయొక్క నామమై యున్నది. దీనిని దెలిసిన వానికి ఏదియును అనన్నము గాదు. (సర్వము అన్నరూపమే యని భావము.)

స హోవాచ కిం మే వాసో భవిష్యతీత్యాప ఇతి హోచు స్తస్మాద్వా ఏతదశిష్యంతః పురస్తాచ్చోపరిష్టాచ్చాద్భిః పరిదధతి లంభుకో హ వాసో భవత్యనగ్నో హ భవతి. 2

అతడు (మరల) నాకు వస్త్రమేది? యని అడిగెను. జలమని ప్రాణాదులు చెప్పెను. అందువలన భుజించువారు భోజనమునకు ముందుగను చివరను నీటిచే అన్నము నాచ్ఛాదింతురు. ఆచమన మొనర్తురని భావము. ఇట్లు తెలిసినవానికి వస్త్రము (అక్షయముగ) దొరకును. అతడెప్పుడును దిగంబరుడై యుండుట సంభవింపదు.

తద్ధైతత్సత్యకామో జాబాలో గోశ్రుతయే వైయాఘ్రపద్యా

మోక్త్వోవాచ యద్యప్యేనచ్ఛుష్కాయ స్థాణవే బ్రూయాజ్జాయేరన్నే వాస్మింఛాఖాః ప్రరోహేయుః పలాశానీతి. 3

ఈ విద్య సత్యకామ జాబాలుడు వైయాఘ్రపద్య గోశ్రుతికి దెలుపుచు అనిన దేమన, "దీనిని ఎండిన మోటు మ్రానుకు చెప్పినను అది చిగుర్చును."

అథ యది మహజ్జిగమిషేదమావాస్యాయాం దీక్షిత్వా పౌర్ణమాస్యాం రాత్రౌ సర్వౌషధస్య మంథం దధి మధునో రుపమథ్య జ్యేష్ఠాయ శ్రేష్ఠాయ స్వాహేత్యగ్నా వాజ్యస్య హుత్వా మంథే సంపాత మవనయేత్. 4

వసిష్ఠాయ స్వాహేత్యగ్నావాజ్యస్య హుత్వా మంథే సంపాత మవనయేత్ప్రతిష్ఠాయై స్వాహేత్యగ్నావాజ్యస్య హుత్వా మంథే సంపాత మవనయేత్సంపదే స్వాహేత్యగ్నావాజ్యస్య హుత్వా మంథే సంపాతమవనయే దాయతనాయ స్వాహేత్యగ్నా వాజ్యస్య హుత్వా మంథే సంపాత మవనయేత్. 5

అథ ప్రతిసృప్యాంజలౌ మంథమాధాయ జపత్యమోనామాస్యమాహి తే సర్వమిదగ్ంస హి జ్యేష్ఠ శ్రేష్ఠో రాజాధిపతిస్సమా జ్యైష్ఠ్యగ్ం శ్రైష్ఠ్యగ్ం రాజ్యమాధిపత్యం గమయత్వహమేవేదగ్ం సర్వమసానీతి.6

అథ ఖల్వేతయార్చాపచ్ఛ ఆచామతి తత్సవితుర్వృణీమహ ఇత్యాచామతి వయం దేవస్య భోజన మిత్యాచామతి శ్రేష్ఠం సర్వధా తమమిత్యాచామతి తురంభగస్య ధీమహీతి సర్వం పిబతి.

నిర్ణిజ్య కగ్ంసం చమసం వా పశ్చాదగ్నేస్సంవిశతి చర్మణి వా స్థండిలే వా వాచం యమో౽ప్రసాహః స యది స్త్రియం పశ్యేత్సమృద్ధం కర్మేతి విద్యాత్. 8

తదేష శ్లోకః. యదా కర్మసు కామ్యేషు స్త్రియగ్ం స్వప్నేషు పశ్యతి. సమృద్ధిం తత్ర జానీయా త్తస్మిన్స్వప్న నిదర్శనే తస్మిన్ స్వప్న నిదర్శన ఇతి. 9

ఈ మంత్రము లన్నియు మహత్త్వసిద్ధి నొందుటకొఱకై చే

బడు మంథనమను యాగ విధానమును దెలుపుచున్నవని తెలియ వలయును.

3-వ ఖండము

శ్వేతకేతు ప్రవాహణుల సంవాదము

శ్వేతకేతుర్హారుణేయః పంచాలా నాగ్ంసమితి మేయాయ తగ్ంహ ప్రవాహణో జైబలిరువాచ కుమారానుత్వాశిషత్పితేత్య నుహి భగవ ఇతి. 1

శ్వేతకేతుడను ఆరుణేయుడు పాంచాల దేశమున జరుగుచున్న ఒక సభకు వచ్చెను. ఆ సభకు ప్రవాహణ జైబలి యను రాజు అధిపతియై యుండెను. అతడు (వచ్చిన) ఈ శ్వేతకేతువును చూచి నాయనా! నీ తండ్రి నీకు విద్య గరపి యున్నాడా? యని అడిగెను. ఔను ఔనని పలికెను.

వేత్థ యది తోఽధిప్రజాః ప్రయంతీతి న భగవ ఇతి వేత్థ యథా పునరావర్తంతా3 ఇతి న భగవఇతి వేత్థ పథో ర్దేవయానస్య పితృయాణస్య చ వ్యావర్తనా3 ఇతి న భగవ ఇతి. 2

ప్రవాహణు డీవిధముగ ప్రశ్నించెను. ఇచ్చట చచ్చి పోయిన ప్రజ లెచ్చటికి వెళ్ళుదురు? నీకు దెలియునా? యని అడిగెను. స్వామీ! నాకు తెలియదని చెప్పెను. (అనంతరము) దేవయాన పితృయాణము లను రెండు మార్గములు ఎచ్చటినుండి వేఱగును? వీని జ్ఞానము నీకు గలదా? అని యడిగెను. లేదు స్వామీ! తెలియదనెను.

వేత్థ యథాఽసౌ లోకో న సంపూర్యతా 3ఇతి న భగవ ఇతి వేత్థ యథా పంచమ్యామాహుతావాపః పురుషవచసోభవంతీతి నైవ భగవ ఇతి. 3

ఇచ్చటినుండి వెడలి పోయిన జనులచే ఆ పరలోక మెందులకు నిండి పోలేదు? ఇది నీకు దెలియునా? యని అడిగెను. లేదు స్వామీ! నాకు తెలియదు. (మఱియు) జలము అయిదవ ఆహుతియందు పురుషుడను సంజ్ఞ నెట్లు పొందును? తెలియునా? లేదుస్వామీ! తెలియదు

అథ ను కిమనుశిష్టోఽవోచథా యోహీమాని న విద్యాత్కథగ్ం

సోఽనుశిష్టో బ్రవీతేతి సహాయ స్తతః పితురర్ధమేయాయ తగ్ంహోవాచా ననుశిష్యవావకిలమాభగవానబ్రవీదనుత్వాఽశిషమితి. 4

ఇట్లుండియు నేను విద్యను నేర్చియున్నానని నీ వెందులకు చెప్పితివి? ఈ ప్రశ్నలకు తగు ఉత్తరములను దెలియని నీవు తెలిసిన వాడనని ఎట్లు చెప్పితివని ప్రవాహణు డడిగెను. (అంత) నాతడు మనస్సున నొచ్చుకొని తండ్రికడకు వచ్చి నాకు విద్యను నేర్పకనే నేర్పితినని ఎందులకు జెప్పితిరని తండ్రి నడిగెను.

పంచమారాజన్యబంధుః ప్రశ్నానప్రాక్షీత్తేషాం నైకం చ నాశకం వివక్తుమితి సహోవాచ యథా మా త్వం తదైతానవదో యథాహమేషాం నైకంచన వేద యద్యహమిమానవేదిష్యం కథం తేనావక్ష్యమితి. 5

క్షత్రియుడగు ఆ ప్రవహణుడు నన్ను ఐదు ప్రశ్నలడిగెను. వాటి యం దొక్క ప్రశ్నకైనను నేను ఉత్తరము జెప్ప శక్తుడను కాలేని అతడడిగిన ప్రశ్నలను తండ్రికి వినిపించెను. అందులకు తండ్రి, ఇప్పుడు నీవు నన్నడిగిన ప్రశ్నలను నేనును ఇప్పుడే వినుచున్నాను. ఇందులో ఒకటియు నాకు తెలియదు. ఈ సమాధానములు నాకు దెలిసి యుండిన నేను నీకెందులకు చెప్పకుందు ననెను.

స హ గౌతమో రాజ్ఞోఽర్ధమేయాయ తస్మై హ ప్రాప్తా ర్హాంచకార స హ ప్రాతస్సభాగ ఉదేయాయ తగ్ంహోవాచ మానుషస్య భగవన్గౌతమ విత్తస్య వరం వృణీథా ఇతి సహోవాచ తవైవ రాజన్మానుషం విత్తం యా మేవ కుమారస్యాంతే వాచ మభాషథాస్తామేవ మే బ్రూహీతి. 6

అపుడు తండ్రి యగు గౌతముడు రాజగు ప్రవాహణుని కడకు వెళ్ళెను. రాజతనికి యోగ్యమగు సత్కార మొనర్చెను. (మరునాడు) గౌతముడు మఱునటి దిన ముదయముననే రాజుకడకు వెళ్ళెను. రాజు ఓగౌతమా! మనుష్యులకు గావలసిన సమస్త సందలను నీవు గోరుకొన వచ్చు ననెను. అంత గౌతముడు మహారాజా! ఆ సంపద నీయొద్దనే యుండని. నా పుత్రు నడిగిన ప్రశ్నల కుత్తరమగు తత్వమునే నాకు దెలుపు మనెను. అందులకు రాజు ఆలోచించి

సహ కృఛ్రీ బభూవ తగ్ంహ చిరం వసేత్యాజ్ఞాపయాంచకార తగ్ంహోవాచ యథా మాత్వం గౌతమావదో యథేయం న ప్రాక్త్వత్తః పురా విద్యా బ్రాహ్మణాన్గచ్ఛతి తస్మాదు సర్వేషు లోకేషు క్షత్రస్యైవ ప్రశాసన మభూదితి తస్మై హోవాచ. 7

బ్రహ్మచర్యవ్రతముచే బహుకాల మిచ్చట వసింపవలెనని ఆజ్ఞాపించెను. కొంత కాలమునకు రాజు ఓ గౌతమా! ఇప్పుడు నీకు నేను తెలుప బోవు విద్య నాలకింపుము. మొట్టమొదట ఈ విద్య బ్రాహ్మణుల కుపదేశింప బడలే దనియు ఇది పరంపరగా క్షత్రియులకే ఉపదేశింపబడుచు వచ్చిన దనియు దెలియు చున్నది. అందుచేత లోకమునందు క్షత్రియుల తేజస్సే వ్యాప్తమై యుండెనని రాజు చెప్పి, ఆ పిదప అత డడిగినందులకై మరల బోధించెను.

—o—

## 4–వ ఖండము

### ద్యులోకము నగ్నిరూపముచే నుపాసించు విధానము

అసౌ వావ లోకో గౌతమాగ్ని స్తస్యాదిత్య ఏవ సమిద్రశ్మయో ధూమోఽ హరర్చిశ్చంద్రమా అంగారా నక్షత్రాణి విస్ఫులింగాః. 1

ఓ గౌతమా! ఈ లోకమే (ద్యులోకమే) అగ్ని. ఆదిత్యుడే సమిత్తులు, కిరణములే పొగ. దినమే జ్వాల. చంద్రుడే అగ్ని. నక్షత్రములే కిరణములు.

తస్మిన్నేతస్మిన్నగ్నౌ దేవాశ్శ్రద్ధాం జుహ్వతి తస్యా ఆహుతేస్సోమో రాజా సంభవతి. 2

ఈ అగ్నియందు దేవతలు అనగా ప్రాణాది ఇంద్రియాభిమాన దేవతలు శ్రద్ధ యను ఆహుతి నిత్తురు. ఆ యాహుతులచే సోమరాజు పుట్టును.

---

## 5–వ ఖండము

### పర్జన్యుని అగ్నిరూపముచే ఉపాసించుట

పర్జన్యో వావ గౌతమాగ్ని స్తస్య వాయురేవ సమిదభ్రం

ధూమో విద్యుదర్చిరశనిరంగారా హ్రాదనయో విస్ఫులింగాః. 1

గౌతమా! పర్జన్యుడే (వర్ష దేవతయే) లేక ఇంద్రుడే అగ్ని. వాయువే సమిత్తు. మేఘములే పొగ. మెఱుపే జ్వాల. (ప్రకాశము) పిడుగే అగ్ని. గడగడ యను శబ్దమే నిప్పు కిరణములు.

తస్మిన్నేతస్మిన్నగ్నౌ దేవాస్సోమగ్ం రాజానం జుహ్వతి తస్యా ఆహుతేర్వర్షగ్ం సంభవతి. 2

ఈ అగ్నియందు దేవతలు సోమరాజునకు ఆహుతి నొసగుదురు. ఆ యాహుతినుండి వర్షము పడును.

---

## 6-వ ఖండము

### పృథివిని అగ్నిరూపముచే నుపాసించుట

పృథివీవావ గౌతమాగ్ని స్తస్యా స్సంవత్సర ఏవ సమిదాకాశో ధూమో రాత్రిరర్చిర్దిశోఽంగారా అవాంతరదిశో విస్ఫులింగాః. 1

పృథివియే అగ్ని. సంవత్సరములే సమిత్తులు. ఆకాశమే పొగ. రాత్రియే జ్వాల. దిక్కులే అగ్ని. విదిక్కులే (దిక్కుల మూలలు) కిరణములు.

తస్మిన్నేతస్మిన్నగ్నౌ దేవా వర్షం జుహ్వతి తస్యా ఆహుతేరన్నగ్ం సంభవతి. 2

ఈ అగ్నియందు దేవతలు వర్షమును హవన మొనర్తురు. ఆ యాహుతులచే అన్నము ఉత్పన్న మగును.

---

## 7-వ ఖండము

### పురుషుని అగ్నిరూపముచే నుపాసించుట

పురుషో వావ గౌతమాగ్ని స్తస్య వాగేవ సమిత్ప్రాణో ధూమో జిహ్వార్చిశ్చక్షు రంగారాః శ్రోత్రం విస్ఫులింగాః. 1

గౌతమా! పురుషుడే అగ్ని. వాక్కే సమిత్తు. ప్రాణమే ధూమము. జిహ్వయే జ్వాల. కన్నులే అగ్ని. శ్రోత్రములే కిరణములు.

తస్మిన్నేతస్మిన్నగ్నౌ దేవా అన్నం జుహ్వతి తస్యా ఆహుతే రేతస్సంభవతి. 2

ఈ అగ్నియందు దేవతలు అన్నమును హోమము జేతురు. ఆ యాహుతులచే రేతస్సు ఉత్పన్న మగును.

---

8–వ ఖండము

స్త్రీని అగ్నిరూపముచే నుపాసించుట

యోషా వావ గౌతమాగ్ని స్తస్యా ఉపస్థ ఏవ సమిద్యదుప మంత్రయతే స ధూమో యోనిరర్చిర్యదంతః కరోతి తేఽంగారా అభి నందా విస్ఫులింగాః. 1

గౌతమా! స్త్రీయే అగ్ని, ఉపస్థయే సమిత్తు. సంకేతమే ధూమము. యోనియే జ్వాల. మైథునమే అగ్ని. ఆనందమే కిరణములు.

తస్మిన్నేతస్మిన్నగ్నౌ దేవా రేతో జుహ్వతి తస్యా ఆహుతే ర్గర్భస్సంభవతి. 2

ఈ అగ్నియందు దేవతలు (ఇంద్రియాధిదేవతలు) రేతస్సును హోమ మొనర్తురు. ఆ యాహుతినుండి గర్భ ముత్పన్నమగును.

---

9–వ ఖండము

పంచాహుతులచే పురుషునియొక్క ఉత్పత్తి

ఇతి తు పంచమ్యామాహుతావాపః పురుషవచసో భవంతీతి స ఉల్బావృతో గర్భో దశవా మాసానంతశ్శయిత్వా యావద్వాథ జాయతే. 1

ఇట్లు జలము పురుషుడను సంజ్ఞ నొందును. పలుచని సంచిచే (జరయును పొరచే) ఆవృతమైన యా గర్భము (శిశు) తొమ్మిది, లేక

పది మాసములు తల్లి పొట్టయందు పరుండి యుండి ఆ పిదప పుట్టును.

స జాతో యావదాయుషం జీవతి తం ప్రేతం దిష్టమితో౽గ్నయ ఏవహరంతి యత ఏవేతో యతస్సంభూతో భవతి. 2

పుట్టినవాడు ఆయుస్సున్నంత కాలము బ్రతుకును. చచ్చినవాని నచ్చటనుండి ఆ యా అగ్నులు వాని వాని కర్మానుసారము తత్తల్లోకములకు గొంపోవును. అతడు ఏ అగ్నినుండి వచ్చి యున్నాడో ఏ అగ్నులచే పుట్టి యున్నాడో ఆ యగ్నులే వానిని దీసికొని పోవు నని భావము.

—o—

## 10–వ ఖండము

### జీవులయొక్క మూడు విధములైన గతి

తద్య ఇత్థం విదుః యే చేమే౽రణ్యే శ్రద్ధా తప ఇత్యుపాసతే తే౽ర్చిషమభి సంభవంత్యర్చిషో౽హరహ్న ఆపూర్యమాణపక్ష మాపూర్యమాణపక్షాద్యాన్ షడుదఙ్ఙేతి మాసాగ్ంస్తాన్.1

మాసేభ్యస్సంవత్సరగ్ం సంవత్సరా దాదిత్య మాదిత్యాచ్చంద్రమసం చంద్రమసో విద్యుతం తత్పురుషో౽మానవస్స ఏనాన్బ్రహ్మ గమయత్యేష దేవయానః పంథా ఇతి. 2

ఈ పై చెప్పబడిన జ్ఞానము నొందినవారు మఱియు అరణ్యమునందు శ్రద్ధచే తప మాచరించువారు అర్చిరాది లోకములను (ప్రకాశవంతమగు) లోకములను పొందుదురు. అచ్చటినుండి అహర్లోక శుక్లపక్ష ఉత్తరాయణములు,

సంవత్సరము, ఆదిత్యుడు, చంద్రుడు, విద్యుత్తు ఈ మార్గమున వెళ్ళుదురు. అచ్చట అమానుషుడగు పురుషు డుండును. ఆతడు వానిని బ్రహ్మలోకమును చేర్చును. ఇది దేవయాన మార్గము.

అథ య ఇమే గ్రామ ఇష్టాపూర్తే దత్తమిత్యుపాసతే తే ధూమ మభిసంభవంతి. ధూమాద్రాత్రిం రాత్రేరపరపక్ష మపరపక్షాద్యాన్ షడ్దక్షిణైతి మాసాగ్ంస్తాన్నైతే సంవత్సర మభిప్రాప్నువంతి

ఇక ఉండిన చోటనే యుండి ఇష్టాపూర్త కర్మముల నాచరించుచు దానము మొదలగు వాటిని చేయువారు ధూమ లోకమునకు పోవుదురు. అచ్చటినుండి రాత్రి, కృష్ణపక్షము, దక్షిణాయనము,

మాసేభ్యః పితృలోకం పితృలోకా దాకాశమాకాశా చ్చంద్రమసమేష సోమోరాజా తద్దేవానామన్నం తం దేవా భక్షయంతి. 4

తరువాత పితృలోకము, ఆకాశము, చంద్రుడు ఈ మార్గమున వెళ్లుదురు. చంద్రుడు (మఱియు) తత్తదభిమాన దేవతలను పొందుదురు. చంద్రుడు అనగా సోమరాజు అతడు దేవతల అన్నము. దేవతలతనిని తిందురు. ఇంద్రియ విషయ లోలు రగువారిని తమ అధికారమునకు లోనుగా నుంచుకొందురు.

తస్మిన్ యావత్సంపాత ముషిత్వాऽథై తమేవాధ్వానం పునర్నివర్తంతే యథేత మాకాశ మాకాశాద్వాయుం వాయుర్భూత్వా ధూమో భవతి ధూమో భూత్వాऽభ్రం భవతి. 5

అచ్చట కర్మక్షయ మగు పర్యంత ముండి మరల వారీక్రింది మార్గమున తిరుగ వచ్చెదరు. ఆకాశము, అచ్చటినుండి వాయువు, పొగ, మేఘము,

అభ్రం భూత్వా మేఘో భవతి. మేఘో భూత్వా ప్రవర్షతి త ఇహ వ్రీహియవా ఓషధి వనస్పతయ స్తిలమాషా ఇతి జాయంతేऽతో వై ఖలు దుర్నిష్ప్రపతరం యో యో హ్యన్నమత్తి యో రేతస్సించతి తద్భూయ ఏవ భవతి. 6

తరువాత ఆ మేఘమునుండి వర్ష మగును. ఆ పిదప వ్రీహి (వడ్లు) గోధుమలు ఓషధి వనస్పతులు మున్నగునవి ఉత్పన్నమగును. అచ్చటినుండి ఆ యా పదార్థముల రూప మొంది జీవులు మరల వెలుపలకు వచ్చుటకు బహు ప్రయాసము నొందును. మనుష్యుడు ఏ యే అన్నమును దినునో మరల యా రేతస్సేచన మూలమున స్త్రీనుండి అదే అన్నగత ప్రాణియై (జీవుడై) పుట్టును.

తద్య ఇహ రమణీయ చరణా అభ్యాశో హ యత్తే రమణీయాం యోనిమాపద్యేరన్ బ్రాహ్మణయోనిం వా క్షత్రియయోనిం

వా వైశ్యయోనిం వాఽథయఇహ కపూయచరణా అభ్యాశో హ యత్తే కపూయాం యోని మాపద్యేరన్ శ్వయోనిం వా సూకర యోనిం వా చాండాలయోనిం వా. 7

మఱియు ఈ ధాన్యాది రూపముతో నుండిన జీవులు ఎవరిచ్చట మంచి యాచరణ శీలురై యుందురో వారుత్తమ యోనులందు మరల జన్మింతురు. అనగా బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులై పుట్టుదురు. ఎవరు దురాచారులై యుందురో వారు వెనువెంటనే నీచయోను లందు పుట్టుదురు. కుక్క, పంది లేక చండాలాదులై పుట్టుదురని అర్థము.

అథైతయోః పథో ర్నకతరేణ చ న తానీమాని క్షుద్రాణ్యస కృదావర్తీని భూతాని భవంతి. జాయస్వ మ్రియస్వేత్యేతత్తృతీయం స్థానం తేనాసౌ లోకో న సంపూర్యతే తస్మాజ్జుగుప్సేత తదేష శ్లోకః 8

ఎవరీ ధర్మ కర్మములను చేయరో వారీ రెండు మార్గము యందు నొక దానితోను చేరక సారెసారెకు పుట్టుట చచ్చుట యను నీ మూడవ గతినే పొందుదురు. అందుచేత పరలోకము పూర్ణము గాదు. అందువల్లనే నిషిద్ధ కర్మలను పూర్ణముగ వదల వలయునను నిది విధి. ఈ విషయమున మంత్రము గలదు.

స్తేనో హిరణ్యస్య సురాం పిబగ్ంశ్చ గురోస్తల్పమావసన్ బ్రహ్మహా చ ఏతే పతంతి చత్వారః పంచమశ్చాచరగ్ంస్తైరితి. 9

బంగారు దొంగిలించుట, సురాపానము చేయుట, గురు సంగమము, బ్రహ్మహత్య, ఈ దుష్కర్మలను ఆచరించు వారు వారికి సహాయ మొనర్చువారును మహాపాపులై పతితు లగుదురు. ఇవే పంచమహాపాతకములు.

అథ హ య ఏతానేవం పంచాగ్నీన్ వేద న సహ తైరప్యా చరన్పాప్మనా లిప్యతే శుద్ధః పూతః పుణ్యలోకో భవతి య ఏవం వేద య ఏవం వేద. 10

అయితే పంచాగ్ని జ్ఞానము గలవాడు (ఒకప్పుడు) అట్టి వారితో వ్యవహరించినను అతడు పాపముచే నంటబడడు.

దెలిసినవాడు శుద్ధుడును పవిత్రుడునై పుణ్యలోకమును బడయును.

## 11-వ ఖండము

అవ: ప్రాచీన శాలాది ఋషులు అశ్వపతిరాజు కడకు వచ్చి వైశ్వానరాత్మసంబంధమగు ప్రశ్న నడుగుట.

ప్రాచీనశాల ఔపమన్యవస్సత్యయజ్ఞః పౌలుషిరింద్రద్యుమ్నో భాల్లవేయో జనశ్శార్కరాక్ష్యో బుడిల ఆశ్వతరాశ్విస్తే హైతే మహాశాలా మహాశ్రోత్రియాస్సమేత్య మీమాగ్ంసాం చక్రుః కో న ఆత్మా కిం బ్రహ్మేతి. 1

ఉపమన్యు కుమారుడు ప్రాచీనశాలుడును, పులుషిని పుత్రుడు సత్యయజ్ఞుడును, భాల్లవి కుమారుడు ఇంద్రద్యుమ్నుడును, శర్కరాక్ష్యుని పుత్రుడు జనుడును, అశ్వతరాశ్వుని కుమారుడగు బుడిలుడను నీ మహాగృహస్థులగు వేదజ్ఞులు ఒక్కటిగా జేరి ఆత్మ యనగా నేమి? బ్రహ్మ మనగా నేమి? యని ఆలోచించి,

తే హ సంపాదయాంచక్రు రుద్దాలకో వై భగవంతో౽యమారుణిస్సంప్రతీమమాత్మానం వైశ్వానర మధ్యేతి, తగ్ం హంతా భ్యాగచ్ఛామేతి తగ్ంహాభ్యాజగ్ముః. 2

శ్రేష్ఠులగు నా ఐదుగురు గురువు నన్వేషించుచు అరుణ పుత్రుడగు ఉద్దాలకుడు వైశ్వానరాత్మను (విశ్వాత్మను) ధ్యానించువాడును తెలిసిన వాడునై యున్నాడు. అతని కడకు వెళ్ళుట మంచిదని అందఱు వెళ్ళిరి,

స హ సంపాదయాంచకార ప్రక్ష్యంతి మామిమే మహాశాలా మహాశ్రోత్రియా స్తేభ్యోన సర్వమివ ప్రతిపత్స్యే హంతాహమన్య మభ్యనుశాసానీతి. 3

(అప్పుడా యుద్దాలకుడు) విచారించిన దేమన, ఈ మహావేదజ్ఞులగు గృహస్థులు నన్ను బ్రహ్మవిద్యను గుఱించి యడుగుదురు. కాని వారికి సర్వ విషయములను నేను చెప్ప సమర్థుడను గాను. అందుచేత వారికి వేఱొక ఉపదేశకుని జూపి అతని కడకు పంపుట మంచిదని తలంచుకొని,

తాన్ హోవాచాశ్వపతిర్వై భగవంతో౽యం కైకేయస్సం
ప్రతీమమాత్మానం వైశ్వానరమధ్యేతి తగ్ం హంతాభ్యాగచ్ఛామేతి
తగ్ంహాభ్యాజగ్ముః. 4

ఉద్దాలకుని కడకు వచ్చిన వారిని జూచి "పూజ్యులగు
బ్రాహ్మణులారా! కేకయ పుత్రుడగు అశ్వపతి యను రాజు వైశ్వా
నరాత్మను చక్కగా దెలిసికొని యున్నాడు. అతని కడకు వెళ్ళుదుము
గాక" యని చెప్పి అందఱు గలసి యా రాజుకడ కేగిరి.

తేభ్యో హ ప్రాప్తేభ్యః పృథగర్హాణి కారయాంచకార స హ
ప్రాతస్సంజిహాన ఉవాచ న మే స్తేనో జనపదే న కదర్యో న మద్యపో
నానాహితాగ్నిర్నావిద్వాన్న స్వైరీ స్వైరిణీ కుతో యక్ష్యమాణో
వై భగవంతో౽హ మస్మి యావదేకైకస్మా ఋత్విజే ధనం దాస్యామి
తావద్భగవద్భ్యో దాస్యామి వసంతు భగవంత ఇతి.5

వచ్చిన యా గృహస్థులకు అతడు చక్కని స్వాగత మొసగి
సత్కరించెను. మఱుసటి దినము ప్రాతఃకాలమున రాజు అయ్యతిథు
లకు కావలసినంత ధన మొసగ బోయెను. అతిథులు దానికి సమ్మ
తింపమి అయ్యా! నా రాజ్యమున దొంగలు లేరు. లుబ్ధులు లేరు.
గ్రుడ్డివారు లేరు. అగ్నిహోత్రము చేయని వారు లేరు. బుద్ధిహీను
లగువారు లేరు. శత్రువులు లేరు. నాకు వైరభావము లేదు. నే
యజ్ఞమును చేయువాడనై యున్నాను. ఒక్కొక్క ఋత్విజున
ఎంత ధన మిచ్చెదనో తమకును ఒక్కొక్కరికి అంతే ధనము నొ
దను. కావున తా మిచ్చటనే యుండి నా యజ్ఞమును పూర్ణ
గావించి నాచే ఒసగబడు ధనము స్వీకరింపవలెనని కోరెను.

తే హోచుర్యేన హైవార్థేన పురుషశ్చరేత్తగ్ం హైవ వదే
దాత్మానమేవేమం వైశ్వానరగ్ం సంప్రత్యధ్యేషి తమేవ నో
బ్రూహీతి. 6

అందులకు వారిట్లు చెప్పిరి. దేని నడుగు నుద్దేశ్యమున మను
ష్యుడు తన కడకు వచ్చి యుండునో అద్దానినే అతనికివ్వవలెను.
వైశ్వానరాత్మవిద్యను నీవు చక్కగా దెలిసిన వాడవై యున్నావు

ఆ విషయమును మాకు జెప్పుము. ధనము నపేక్షించి మేము రాలేదు. విద్య నపేక్షించి వచ్చి యున్నార మని పలికిరి.

తాన్ హోవాచ ప్రాతర్వః ప్రతివక్తాస్మీతి తే హ సమిత్పాణయః పూర్వాహ్ణే ప్రతిచక్రమిరే తాన్ హానుపనీయైవై తదువాచ. 7

అటులైన ప్రాతఃకాలమున రండి! చెప్పెదనని రాజు చెప్పెను. మఱునటి దిన ముషఃకాలమున సమిత్పాణులై యతని కడకు జనిరి. (అప్పుడు) రాజిట్లు చెప్ప దొడగెను. ఉపనయనము చేయకనే వారికి జెప్పెను.

## 12-వ ఖండము

### అశ్వపతి-ఔపమన్యు-సంవాదము

ఔపమన్యవ కం త్వమాత్మాన ముపాస్స ఇతి దివమేవ భగవో రాజన్నితి హోవాచైష వై సుతేజా ఆత్మా వైశ్వానరోఽయం యం త్వమాత్మాన ముపాస్సే తస్మాత్తవ సుతం ప్రసుతమాసుతం కులే దృశ్యతే. 1

ఔపమన్య! నీవేయాత్మ నుపాసింతువో చెప్పుము. అనగా దేనిని వైశ్వానరాత్మగా నుపాసింతువని యడిగెను. మహారాజా! ద్యులోకమును (స్వర్గమును) ఉపాసింతు నని చెప్పెను. అశ్వపతిరాజు (అయ్యా!) నీవు పూర్ణాత్మ యని ఉపాసించునది సుతేజమను వైశ్వానరాత్మనే కాని అది పూర్ణాత్మ కాదు. అందువలన నీ కులమునందు సుతప్రసూత అసుత అనగా అగ్నిహోత్రము యజ్ఞము సత్రము మొదలగు వాటియందు తీయబడుచుండు సోమరసము అగపడును. ప్రియవస్తువులను చూచెదవు. నీ వంశజులు కర్మిష్ఠు లగుదురు (ఇంతే).

అత్స్యన్నం పశ్యసి ప్రియమత్త్యన్నం పశ్యతి ప్రియం భవత్యస్య బ్రహ్మవర్చసం కులే య ఏతమేవ మాత్మానం వైశ్వానరముపాస్తే మూర్ధా త్వేష ఆత్మన ఇతి హోవాచ మూర్ధా తే వ్యపతిష్యద్య న్మాం నాగమిష్య ఇతి. 2

నీవు అన్నమును భుజింతువు. కావలసినంత పచన మొనర్తువు.

ప్రియమైన దానిని బడయుదువు. ఈ సుతేజమను వైశ్వానరాత్మ నుపాసించువాడు అన్నమును తినును. ప్రియమును బడయును. అతని కాలమందు బ్రహ్మవర్చస్సగపడును. ఇది పూర్ణాత్మయొక్క శిరస్సు (మాత్రమే). నీవు నా కడకు రాక యుండినచో నీ తల పడిపోయి యుండెడిదని రాజు చెప్పెను. అపూర్ణ విద్యను పూర్ణమని భావింప రాదని అర్థము.

13-వ ఖండము

## అశ్వపతి సత్యయజ్ఞుల సంవాదము

అథ హోవాచ సత్యయజ్ఞం పౌలుషిం ప్రాచీనయోగ్య కం త్వమాత్మాన ముపాస్స ఇత్యాదిత్య మేవ భగవో రాజన్నితి హోవా చైష వై విశ్వరూప ఆత్మా వైశ్వానరో యం త్వమాత్మాన ముపాస్సే తస్మాత్తవ బహు విశ్వరూపం కులే దృశ్యతే. 1

రాజు సత్యయజ్ఞు నడిగెను. ఓ ప్రాచీనయోగ్యుడా! నీవు దేనిని ఆత్మయని ఉపాసింతువు? మహారాజా! నేను ఆదిత్యు నుపాసింతును. నీవు పూర్ణాత్మ యని ఉపాసించునది విశ్వరూపమను వైశ్వానరాత్మను మాత్రమే. అందువలన నీ కులమునందు సాధనసంపత్తి విపులముగ నుండును.

ప్రవృత్తో౽శ్వతరీరథో దాసీనిష్కోత్స్యన్నం పశ్యసి ప్రియము త్యన్నం పశ్యతి ప్రియంభవత్యస్య బ్రహ్మవర్చసం కులే య ఏతమేవ మాత్మానం వైశ్వానర ముపాస్తే చక్షుష్ట్వేతదాత్మన ఇతి హోవా చాంధో భవిష్య యన్మాం నాగమిష్య ఇతి. 2

గుఱ్ఱములు, రథములు, దాస దాసీ జనులు వెండి బంగారము నీకు ప్రాప్త మగును. నీవు సమస్త భోగముల ననుభవింతువు. ఇతని కులము నందు బ్రహ్మవర్చస్సగపడును. కాని ఇది విశ్వరూపాత్మయొక్క కన్ను మాత్రమే. నా కడకు రాకుండిన నీవు గ్రుడ్డి వాడవై పోవుచుంటివి వై కేయుడు చెప్పెను.

## 14-వ ఖండము

### అశ్వపతి ఇంద్రద్యుమ్నుల సంవాదము

అథ హోవాచేంద్రద్యుమ్నం భాల్లవేయం వైయాఘ్రపద్య కం త్వ మాత్మాన ముపాస్స ఇతి వాయుమేవ భగవో రాజన్నితి హోవాచైష వై పృథగ్వర్త్మాఽఽత్మా వైశ్వానరో యం త్వ మాత్మాన ముపాస్సే తస్మాత్త్వాం పృథగ్బలయ ఆయంతి పృథగ్రథ శ్రేణయోఽనుయంతి. 1

అనంతరము రాజు ఇంద్రద్యుమ్ను నడిగెను. ఓవైయాఘ్రపద్యుడా! నీ వేయాత్మ నుపాసింతువు? మహారాజా! నేను వాయువు నుపాసింతును. అయ్యా! నీ వుపాసించునది పృథగ్వర్త్మ అనగా నానా గతి గలదియను వైశ్వానరాత్మనే. అందువలన నీ కడకు నానా దిక్కులనుండి బలిదానములు వచ్చును. నీ వెనుక రథములు వరసలు వరసలుగా వచ్చి నడుచును.

అత్స్యన్నం పశ్యసి ప్రియ మత్త్యన్నం పశ్యతి ప్రియం భవ త్యస్య బ్రహ్మవర్చసం కులే య ఏత మేవ మాత్మానం వైశ్వానర ముపాస్తే ప్రాణ స్త్వేష ఆత్మన ఇతి హోవాచ ప్రాణ స్త ఉదక్రమిష్య ద్యన్మాం నాగమిష్య ఇతి. 2

నీవు అన్నభోక్తవును ప్రియమును బడయు వాడవు నగుదువు. వై మంత్రము నందువలె ఇచ్చటను ఫల మన్వయము. నీవుపాసించు నది ఆ యాత్మయొక్క ప్రాణమును మాత్రమే. నీవు నా కడకు రాకుండిన నీ ప్రాణము పోయి యుండెడిదని రాజు చెప్పెను.

## 15-వ ఖండము

### అశ్వపతి శర్కరాక్ష్యుల సంవాదము

అథ హోవాచ జనగ్ం శార్కరాక్ష్యకం త్వ మాత్మాన ముపాస్స ఇత్యాకాశమేవ భగవో రాజన్నితి హోవాచైష వై బహుళ ఆత్మా వైశ్వానరో యం త్వ మాత్మాన ముపాస్సే తస్మాత్త్వం బహుళోఽసి ప్రజయా చ ధనేన చ. 1

అనంతరము శర్కరాక్ష్యా! నీ వేయాత్మ నుపాసింతువు? మహారాజా! నే నాకాశము నుపాసింతును. నీవు ఆత్మయని ఉపాసించునది "బహుళ" యను వైశ్వానరాత్మను మాత్రమే. అందుచేత నీవు ధనసమృద్ధి నొందుదువు.

అత్స్యన్నం పశ్యసి ప్రియమత్త్యన్నం పశ్యతి ప్రియం భవత్యస్య బ్రహ్మవర్చసం కులే య ఏత మేవ మాత్మానం వైశ్వానర ముపాస్తే సందేహ స్త్వేష ఆత్మన ఇతి హోవాచ సందేహ స్తే వ్యశీర్యద్యన్మాం నాగమిష్య ఇతి. 2

అన్నమును భుజించువాడ వగుదువు. ప్రియమును బడయుదువు. ఈ వైశ్వానరాత్మ నుపాసించువాడు అన్నమును ప్రియమును బొందును. అతని కులము నందు బ్రహ్మవర్చ స్సగపడును. ఇది ఆత్మశరీర మధ్యభాగము మాత్రమే. నీవు నా కడకు రాకుండిన నీ శరీర మధ్యభాగము నష్టమై పోయి యుండెడి దని కైకేయుడు దెలిపెను.

## 16–వ ఖండము

### అశ్వపతి బుడిలుల సంవాదము

అథ హోవాచ బుడిల మాశ్వతరాశ్విం వైయాఘ్రపద్య కం త్వమాత్మాన ముపాస్స ఇత్యప ఏవ భగవో రాజన్నితి హోవాచైష వై రయి రాత్మా వైశ్వానరోఽయం త్వ మాత్మాన ముపాస్సే తస్మా త్త్వగ్ం రయిమాన్ పుష్టిమానసి. 1

పిదప బుడిలు నడిగెను. ఓవైయాఘ్రపద్యుడా! నీ వేయాత్మ నుపాసింతువు? మహారాజా! నేను అప్పు (జలము) నుపాసింతునని చెప్పెను. నీ వుపాసించు ఆత్మ "రయి" యను వైశ్వానరాత్మయే. ఉండెదవు అందుచేత నీవు ధనము గలవాడవును బలము గలవాడవునై

అత్స్యన్నం పశ్యసి ప్రియ మత్త్యన్నం పశ్యతి ప్రియం భవత్యస్య బ్రహ్మవర్చసం కులే య ఏత మేవ మాత్మానం వైశ్వానర ముపాస్తే వస్తి స్త్వేష ఆత్మన ఇతి హోవాచ వస్తిస్తే వ్యభేత్స్యద్యన్మాం నాగమిష్య ఇతి. 2

నీవు అన్నమును భుజింతువు. ప్రియము బడయుదువు. ఈ వైశ్వానరాత్మ నుపాసించు వా డన్నమును ప్రియమును బడయును. అతని కులమునందు బ్రహ్మవర్చ స్సగపడును. ఇది ఆత్మయొక్క వస్తి. (అనగా మూత్రపిండము) మాత్రమే. నా కడకు రాకుండిన నీ వస్తి పగిలిపోయి యుండెడిదని కైకేయు డనెను.

---

## 17–వ ఖండము

### అశ్వపతి ఉద్దాలకుల సంవాదము

అథ హోవాచోద్దాలక మారుణిం గౌతమ కం త్వ మాత్మాన ముపాస్స ఇతి. పృథివీ మేవ భగవో రాజన్నితి హోవాచైష వై ప్రతిష్ఠాఽఽత్మా వైశ్వానరో యం త్వ మాత్మాన ముపాస్సే తస్మాత్త్వం ప్రతిష్ఠితోఽసి ప్రజయా చ పశుభిశ్చ. 1

అనంతరము రాజు ఉద్దాలక ఆరుణి యను నతని నడిగెను. ఓ గౌతమా! నీవు దేనిని ఆత్మ యని ఉపాసింతువు? మహారాజా! నేను పృథివి నుపాసింతు ననెను. అయ్యా! నీవు ఉపాసించు ఆత్మ 'ప్రతిష్ఠా' యను వైశ్వానరాత్మయే. అందుచేత నీవు పశువులచేతను ప్రజలచేతను ప్రతిష్ఠితుడవై యుందువు.

అత్స్యన్నం పశ్యసి ప్రియమ త్త్యన్నం పశ్యతి ప్రియం భవత్యస్య బ్రహ్మవర్చసం కులే య ఏతమేవ మాత్మానం వైశ్వానర ముపాస్తే పాదౌ త్వేతా వాత్మన ఇతి హోవాచ పాదౌ తే వ్యమ్లాస్యేతాం యన్మాం నాగమిష్య ఇతి. 2

నీ వన్నమును భుజింతువు. ప్రియమును బడయుదువు. ఈ వైశ్వానరాత్మ నుపాసించువాడు అన్నమును ప్రియమును పొందును. అతని కులమునందు బ్రహ్మవర్చ స్సగపడును. ఇది ఆత్మయొక్క ఒకపాదము మాత్రమే. నీవు నా కడకు రాకుండిన నీ పాదములు ఎండిపోయెడివని కైకేయుడు చెప్పెను.

—o—

## 18-వ ఖండము

### అశ్వపతి వైశ్వానరాత్మవిద్యను ఉపదేశించుట

తాన్ హోవాచైతే వై ఖలు యూయం పృథగివేమ మాత్మానం వైశ్వానరం విద్వాగ్ంసోన్నమత్థయస్త్వే తమేవం ప్రాదేశ మాత్ర మభివిమాన మాత్మానం వైశ్వానర ముపాస్తే స సర్వేషు లోకేషు సర్వేషు భూతేషు సర్వేష్వాత్మస్వన్నమత్తి. 1

వచ్చిన వీరందఱిని గుఱించి ఆ రాజు అయ్యా! మీరీ వైశ్వానరాత్మను వేఱు వేఱుగా దెలిసి యున్నారు. అందుచేత విడివిగా ఇచ్చట అన్నమును భుజింతురు; కాని సర్వవ్యాపియగు వైశ్వానరాత్మ నెఱిగినవాడు సర్వ లోకముల యందును భూతముల యందును ఆత్మల యందును అన్నము నుపభోగించును.

తస్య హ వా ఏతస్యాత్మనో వైశ్వానరస్య మూర్ధైవ సుతేజాశ్చక్షుర్విశ్వరూపః ప్రాణః పృథగ్వర్త్మాత్మా సందేహో బహుళో వస్తిరేవ రయిః పృథివ్యేవ పాదా వుర ఏవ వేదిర్లోమాని బర్హిర్హృదయం గార్హపత్యో మనోన్వాహార్యపచన ఆస్య మాహవనీయః

ఈ వైశ్వానరాత్మశిరస్సే సుతేజము ద్యులోకము. నేత్రము విశ్వరూపము ఆదిత్యుడు. ప్రాణము పృథగ్వర్త్మ వాయువు. శరీర మధ్యభాగము ఆకాశము వస్తి. రయి జలము. పాదములు పృథివి. ఊరువులు వేది. రోమములు దర్భలు. హృదయము గార్హపత్యాగ్ని. మనస్సు (దక్షిణాగ్ని) అన్వాహార్యపచనము. నోరు (వాయువు) ఆహవనీయము.

## 19-వ ఖండము

### పంచప్రాణాహుతులు తత్తత్ఫలములు

తద్యద్భక్తం ప్రథమ మాగచ్ఛేత్తద్ధోమీయగ్ం స యాం ప్రథమా మాహుతిం జుహుయాత్తాం జుహుయాత్ప్రాణాయ స్వాహేతి ప్రాణస్తృప్యతి. 1

అందుచేత మొదట చేతికి వచ్చిన అన్నమును తినవలసినది. మొదటి యాహుతి ప్రాణాయ స్వాహా యని హోమము చేయవలెను. అందుచే ప్రాణమునకు తృప్తియగును.

ప్రాణే తృప్యతి చక్షుస్తృప్యతి చక్షుషి తృప్యత్యాదిత్యస్తృప్య త్యాదిత్యే తృప్యతి ద్యౌస్తృప్యతి దివి తృప్యంత్యాం యత్కించ ద్యౌశ్చాదిత్య శ్చాధితిష్ఠత స్తత్తృప్యతి తస్యానుతృప్తిం తృప్యతి ప్రజయా పశుభి రన్నాద్యేన తేజసా బ్రహ్మవర్చసేనేతి. 2

ప్రాణతృప్తిచే నేత్రమును, దాని తృప్తిచే ఆదిత్యుడును, అందుచే ద్యులోకము, ఆ మూలమున ఆదిత్యునియం దధిష్ఠితములై యుండు సర్వము తృప్తి నొందును. ఇవెల్ల తృప్తి జెందిన వెంటనే ఉపాసకుడు స్వయముగా యోగ్యమగు పశువులచేత ప్రజాన్నాదులచేత బ్రహ్మ వర్చసాది తేజస్సు గలవాడై తృప్తుడగును.

## 20–వ ఖండము

అథ యాం ద్వితీయాం జుహుయాత్తాం జుహుయాద్వ్యానాయ స్వాహేతి వ్యానస్తృప్యతి. 1

ఇక రెండవ ఆహుతిని వ్యానాయ స్వాహా యని హోమము చేయవలెను. ఇట్లనుట వలన వ్యానము సంతుష్ట మగును.

వ్యానే తృప్యతి శ్రోత్రం తృప్యతి శ్రోత్రే తృప్యతి చంద్ర మాస్తృప్యతి చంద్రమసి తృప్యతి దిశస్తృప్యంతి దిక్షు తృప్యంతీషు యత్కించ దిశశ్చంద్రమాశ్చాధితిష్ఠంతి తత్తృప్యతి తస్యానుతృప్తిం తృప్యతి ప్రజయా పశుభిరన్నాద్యేన తేజసా బ్రహ్మవర్చసేనేతి. 2

వ్యానముయొక్క తృప్తివలన శ్రోత్రము, దానివలన చంద్రుడు అందువలన దిక్కులు, మఱియు చంద్రునియం దధిష్ఠితములై యుండిన సర్వమును తృప్తి నొందును. ఇట్లన్నియు తృప్తి జెందిన వెంటనే ఉపా సకుడు పశువులు ప్రజలు యోగ్యమగు అన్నము తేజస్సు బ్రహ్మ వర్చస్సు ఈ మొదలగు వాటిచే సంపన్నుడై సంతుష్టు డగును.

## 21-వ ఖండము

అథ యాం తృతీయాం జుహుయాత్తాం జుహుయాదపానాయ స్వాహేత్యపానస్తృప్యతి. 1

ఇక మూడవ ఆహుతిని అపానాయ స్వాహా యని హోమము చేయవలయును. అప్పు డపానము సంతుష్ట మగును.

అపానే తృప్యతి వాక్తృప్యతి వాచి తృప్యంత్యామగ్నిస్తృప్యత్యగ్నౌ తృప్యతి పృథివీ తృప్యతి పృథివ్యాం తృప్యంత్యాం యత్కించ పృథివీచాగ్నిశ్చాధితిష్ఠత స్తత్తృప్యతి తస్యానుతృప్తిం తృప్యతి ప్రజయా పశుభిరన్నాద్యేన తేజసా బ్రహ్మవర్చసేనేతి. 2

అపానమునకు తృప్తియైన వాక్కున్ను తృప్తి నొందును. అందుచే అగ్నియు తద్ద్వారా పృథివియు అగ్నియం దధిష్ఠితమై యుండు సర్వము తృప్తి బొందును. ఇట్లన్నియు తృప్తి నొందిన వెంటనే ఉపాసకుడు పశువులు, ప్రజ, యోగ్యమైన అన్నము, బ్రహ్మవర్చస్సు వీటిచే గూడినవాడై తృప్తు డగును.

## 22-వ ఖండము

అథ యాం చతుర్థీం జుహుయాత్తాం జుహుయాత్సమానాయ స్వాహేతి సమానస్తృప్యతి. 1

ఇక నాలుగవ యాహుతిని సమానాయ స్వాహా యని హోమము చేయవలెను. అందుచే సమాన వాయువు తృప్తి నొందును.

సమానే తృప్యతి మనస్తృప్యతి మనసి తృప్యతి పర్జన్యస్తృప్యతి పర్జన్యే తృప్యతి విద్యుత్తృప్యతి విద్యుతి తృప్యంత్యాం యత్కించ విద్యుచ్చ పర్జన్యశ్చాధితిష్ఠత స్తత్తృప్యతి. తస్యానుతృప్తిం తృప్యతి ప్రజయా పశుభిరన్నాద్యేన తేజసా బ్రహ్మవర్చసేనేతి. 2

సమానవాయువుయొక్క తృప్తివలన మనస్సునకు తృప్తి యగును. అందువలన పర్జన్యుడు, తద్ద్వారా విద్యుత్తు, ఆ విద్యుత్తు మరియు పర్జన్యుని యం దధిష్ఠితమై యుండు సర్వము తృప్తి

నొందును; ఈ సర్వము తృప్తి జెందిన వెంటనే ఉపాసకుడు పశువులు, ప్రజ, యోగ్యమగు అన్నము బ్రహ్మవర్చస్సు గలవాడై వీటిచే తృప్తుడగును.

## 23-వ ఖండము

అథ యాం పంచమీం జుహుయాత్తాం జుహుయాదుదానాయ స్వాహేత్యుదాన_స్తృప్యతి. 1

ఇక అయిదవ ఆహుతిని ఉదానాయ స్వాహా యని హోమము చేయవలెను. అందుచే ఉదాన వాయువు తృప్తి నొందును.

ఉదానే తృప్యతి త్వక్ తృప్యతి త్వచి తృప్యంత్యాం వాయు_స్తృప్యతి వాయౌ తృప్యత్యాకాశ_స్తృప్యత్యాకాశే తృప్యతి యత్కించ వాయుశ్చాకాశశ్చాధితిష్ఠత_స్తత్తృప్యతి తస్యానుతృప్తిం తృప్యతి ప్రజయా పశుభిరన్నాద్యేన తేజసా బ్రహ్మవర్చసేనేతి. 2

ఉదానముయొక్క తృప్తివలన త్వక్కు (చర్మము), దానిచే వాయువు, ఆ మూలమున ఆకాశము, తద్ద్వారా వాయువు, మఱియు ఆకాశమునం దధిష్ఠితమై యుండు సర్వమునకు తృప్తి యగును. ఇవన్నియు తృప్తి నొందిన వెంటనే ఉపాసకుడు ప్రజలు, పశువులు, యోగ్యమగు అన్నము, తేజస్సు, వర్చస్సు వీటిచే తృప్తుడగును.

## 24-వ ఖండము

స య ఇదమవిద్వానగ్నిహోత్రం జుహోతి యథాంగారానపోహ్య భస్మని జుహుయాత్తాదృక్తత్స్యాత్.1

ఇట్లని వైశ్వానరాత్మయొక్క జ్ఞానము లేకనే అగ్నిహోత్రము జేసి హవన మొనర్చువాని హోమము నిప్పులను దీసి పారవైచి కేవలము బూడిదయందు హోమము జేసినట్లు వ్యర్థ మగును.

అథ య ఏతదేవం విద్వానగ్నిహోత్రం జుహోతి తస్య సర్వేషు లోకేషు సర్వేషు భూతేషు సర్వేష్వాత్మసు హుతం భవతి. 2

ఇట్లు వైశ్వానరాత్మజ్ఞానము గలిగి హవన మొనర్చువాని హోమము అన్ని లోకములయందు సర్వాత్మలయందు హోమ మొనర్చినట్లగును.

తద్యథేషీకాతూలమగ్నౌ ప్రోతం ప్రదూయేతైవగ్ంహాస్య సర్వే పాప్మానః ప్రదూయంతే య ఏతదేవం విద్వానగ్నిహోత్రం జుహోతి. 3

ఇట్లు దెలిసి అగ్నిహోత్ర హోమము చేయువాని పాపములు అగ్నియందు వేయబడిన ముంజగడ్డిదూది తత్క్షణము కాలిపోవునట్లు కాలిపోవును.

తస్మాదుహైవం విద్యద్యపి చండాలాయోచ్ఛిష్టం ప్రయచ్ఛేదాత్మని హైవాస్యతద్వైశ్వానరే హుతగ్ంస్యాదితి తదేష శ్లోకః 4

ఈ విద్య నెఱిగినవాడు చండాలునకు ఉచ్ఛిష్ట మొసగినను అది వైశ్వానరాత్మయందు హోమము చేసినట్లే యగును. అనగా శ్రేష్ఠమగు ఫలము వచ్చునని భావము. ఈ విషయమున మంత్రము గలదు.

యథేహ క్షుధితా బాలా మాతరం పర్యుపాసతే ఏవగ్ం సర్వాణి భూతాన్యగ్నిహోత్రముపాసత ఇత్యగ్నిహోత్రముపా ఇతి. 5

ఇందువలన ఆకలి గొన్న పసి పాపలు తల్లి నుపాసించునట్లు సమస్త భూతములు (ప్రాణులు) అగ్నిహోత్రోపాసన చేయవలెను.

—o—

## 6–వ ప్రపాఠకము–1–వ ఖండము

### ఉద్దాలక శ్వేతకేతువుల సంవాదము

హరిః ఓమ్. శ్వేతకేతుర్హారుణేయ ఆస తగ్ం హ పితోవాచ శ్వేతకేతో వస బ్రహ్మచర్యం న వై సోమ్యాస్మత్కులీనోఽనమ్య బ్రహ్మబంధురివ భవతీతి. 1

అరుణియొక్క కుమారుడు శ్వేతకేతు వనువాడొక డుండెను. అతనిని గుఱించి తండ్రి యగు ఉద్దాలకుడు ఓ శ్వేతకేతూ! నీవు గురువు నాశ్రయించి బ్రహ్మచర్యము ననుష్ఠించుచు అధ్యయన మొనర్చుము. ఎందుకనగా, మన కులమున అధ్యయనము చేయకనే బ్రహ్మబంధు

(నామమాత్రమగు బ్రాహ్మణ్యము గలవాడు) గలిగి యుండలేదు. అనగా పేరునకు మాత్రము బ్రాహ్మణుడుగా నుండువాడు అనిచెప్పగా

స హ ద్వాదశవర్ష ఉపేత్య చతుర్విగ్ంశతి వర్షస్సర్వాన్వేదా సధీత్య మహామనా అనూచానమానీ స్తబ్ధ ఏయాయ తగ్ం హ పితోవాచ. 2

పంద్రెండు సంవత్సరములు గల యా శ్వేతకేతువు 24 సంవత్సరములవా డగు నంతవఱకు గురుకులమునం దుండుచు వేదవిద్యల నన్నిటి నభ్యసించి కడకు నేను గొప్పవాడను పెద్ద విద్వాంసుడ నను అభిమానముచే గర్విష్ఠుడై ఇంటికి వచ్చెను. అతనిని జూచి తండ్రి ఓ. సౌమ్యా! నీవు చాల గొప్పవాడ ననియు విద్వాంసుడ ననియు దలచి గర్వివై యున్నావు. నీ ముఖము, మాట, హృదయమును బట్టి చూడ నీ వావిధముగ నగపడుచున్నా డవని భావము. అగుగాక! ముఖ్యమగు ఆత్మతత్త్వోపదేశమును పొందియున్నావా? అని ప్రశ్నించెను.

శ్వేతకేతో యన్ను సోమ్యేదం మహామనా అనూచానమానీ స్తబ్ధోఽస్యుత తమాదేశమప్రాక్ష్యో యేనాశ్రుతగ్ం శ్రుతం భవత్యమతం మతమవిజ్ఞాతం విజ్ఞాతమితి కథంను భగవస్స ఆదేశో భవతీతి. 3

ఏ యుపదేశముచేత సర్వాంతర మగునది వినబడుచున్నదో తర్కించుటకు రానిది తర్కవిషయ మగుచున్నదో ఏది దెలిసిన దెలియనిది తెలియబడుచున్నదో ఏది తెలిసికొన్న పిదప ఇక తెలిసికొన వలసినది యుండదో అట్టి తత్త్వము నేమైన గురువుల నడిగి తెలిసికొంటివా? య నెను. అందుకు శ్వేతకేతువు భగవన్! అట్టి ఉపదేశ మేదో నాకు తెలియదని చెప్పెను.

యథా సోమ్యైకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాద్వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్. 4

వత్సా! ఒక మట్టిముద్దయొక్క (చక్కని) జ్ఞానమైన (తక్కిన) అన్ని మట్టి పదార్థములయొక్క జ్ఞాన మగును. ఆ పిదప (మృణ్మయ మగు పదార్థము లన్నియు) కేవలము మాట మాత్రమే. మృద్వికార మగు (కుండ. గూన బాన యను సర్వ) పదార్థములు నామమాత్రములే. మన్నొక్కటే సత్యము.

యథా సోమ్యైకేన లోహమణినా సర్వం లోహమయం విజ్ఞాతగ్ం స్యాద్వాచారంభణం వికారో నామధేయం లోహమిత్యేవ సత్యమ్. 5

సౌమ్యా! లోకమునం దెట్లు లోహ మొక్కదానియొక్క జ్ఞానముచే అన్ని పదార్థముల జ్ఞాన మగునో కనక మొక్కటే కుండల కిరీటాదులుగ నగపడినట్లు కేవలము వాఙ్మాత్రములే. వికారములగు ఈ నామరూపము లన్నియు అసత్యములు. లోహ మొక్కటే సత్యము. ఆభరణ మసత్యము. బంగారొక్కటిమాత్రము సత్యము.

యథా సోమ్యైకేన నఖనికృంతనేన సర్వం కార్ష్ణాయసం విజ్ఞాతగ్ం స్యాద్వాచారంభణం వికారో నామధేయం కృష్ణాయసమిత్యేవ సత్యమేవగ్ం సోమ్య స ఆదేశో భవతీతి. 6

వత్సా! ఏ ప్రకారముగ నొక గోరుగల్లు (గోరుకత్తి) జ్ఞానమైన ఇనుముచే చేయబడిన సర్వ పదార్థముల జ్ఞాన మగునో మఱియు ఇనుముచే చేయబడిన వస్తువు లన్నియు కేవల వాఙ్మాత్రము ఉన్నది ఇనుమొక్కటే. వికారము లన్నియు నామమాత్రములు ఇను మనున దొక్కటే ఎట్లు సత్యమో నేను నిర్దేశించి తెలుపు ఉపదేశమును ఇదే విధ మయినదని ఉద్దాలకుడు దెలిపెను.

న వై నూనం భగవంతస్త ఏతదవేదిషుర్యద్ధ్యేతదవేదిష్యన్కథం మే నావక్ష్యన్నితి భగవాగ్ంస్త్వేవమేతద్బ్రవీత్వితి తథా సోమ్యేతి హోవాచ. 7

అప్పుడు శ్వేతకేతువు స్వామీ! నిజముగా ఈ యుపదేశము నా గురువులకు తెలియదు. తెలిసి యుండిన వారు నా కెందుకు జెప్పి యుండరు? దానిని మీరే నాకు చెప్పవలయు నని యడిగెను. తండ్రి అంగీకరించెను.

2-వ ఖండము

సద్రూప పరమాత్మచే జగదుత్పత్తి యని తెలుపుట

సదేవ సోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయం తద్ధైక ఆహుర సదేవేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయం తస్మాదసతస్సజ్జాయత. 1

ఓ సౌమ్యా! మొట్టమొదట సత్తనునది యొక్కటే యుండెను. అసత్తు ఉండినదని కొందఱు చెప్పెదరు.

కుతస్తు ఖలు సోమ్యైవగ్ం స్యాదితి హోవాచ కథమసతస్స జ్జాయేతేతి సత్త్వేవ సోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయమ్. 2

కాని అదెట్లు సంభవము? అసత్తునుండి సత్తు ఎట్లు గలుగును? పుట్టుట అసంభవము. కాబట్టి సద్రూపమగు బ్రహ్మ మొక్కటే మొట్ట మొదట ఉండెను. రెండవ దేమియు నుండలేదని తెలియుము.

తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి తత్తేజోఽసృజత తత్తేజ ఐక్షత బహు స్యాం ప్రజాయేయేతి తదపోఽసృజత తస్మాద్యత్ర క్వచ శోచతి స్వేదతే వా పురుష స్తేజస ఏవ తదధ్యాపో జాయంతే. 3

ఆ సత్తు (పరమాత్మ) నేను బహు ప్రకారము లయ్యెద నని సంకల్పించెను. అందుచే మొదట తేజస్సును పుట్టించెను. పిదప నా తేజ ఉపహితమైన సత్తు నేను బహురూపుడను కావలెనని యాలోచించి జలమును పుట్టించెను. అందుచే పురుషుడు ఎప్పుడు మఱి ఎచ్చట సంతప్తుడగునో లేక చెమట నొందునో అప్పుడచ్చట అగ్నినుండియే జలము గలుగును.

తా ఆప ఐక్షంత బహ్వ్యస్స్యామ ప్రజాయేమహీతి తా అన్న మసృజంత తస్మాద్యత్ర క్వచ వర్షతి తదేవ భూయిష్ఠమన్నం భవత్యద్భ్య ఏవ తదధ్యన్నాద్యం జాయతే. 4

ఆ జలము నేను బహు రూపములు గావలెనని యాలోచించి తద్ద్వారా అన్నమును పుట్టించెను. కాబట్టి ఎప్పుడెచ్చట వర్ష మగునో అప్పుడచ్చట విరివిగా అన్న ముత్పన్న మగును. జలమునుండియే తినుటకు యోగ్యమగు అన్నము పుట్టునని అర్థము.

3–వ ఖండము

అండజ, జరాయుజ, ఉద్భిజ్జములని సృష్టి మూడువిధములు

తేషాం ఖల్వేషాం భూతానాం త్రీణ్యేవ బీజాని భవంత్యాండజం జీవజ ముద్భిజ్జమితి. 1

యథా సోమ్యైకేన లోహమణినా సర్వం లోహమయం విజ్ఞాతగ్ం స్యాద్వాచారంభణం వికారో నామధేయం లోహమిత్యేవ సత్యమ్. 5

సౌమ్యా! లోకమునం దెట్లు లోహ మొక్కదానియొక్క జ్ఞానముచే అన్ని పదార్థముల జ్ఞాన మగునో కనక మొక్కటే కుండల కిరీటాదులుగ నగపడినట్లు కేవలము వాఙ్మాత్రములే. వికారములగు ఈ నామరూపము లన్నియు అసత్యములు. లోహ మొక్కటే సత్యము. ఆభరణ మసత్యము. బంగారొక్కటిమాత్రము సత్యము.

యథా సోమ్యైకేన నఖనికృంతనేన సర్వం కార్ష్ణాయసం విజ్ఞాతగ్ం స్యాద్వాచారంభణం వికారో నామధేయం కృష్ణాయసమిత్యేవ సత్యమేవగ్ం సోమ్య స ఆదేశో భవతీతి. 6

వత్సా! ఏ ప్రకారముగ నొక గోరుగల్లు (గోరుకత్తి) జ్ఞానమైన ఇనుముచే చేయబడిన సర్వ పదార్థముల జ్ఞాన మగునో మఱియు ఇనుముచే చేయబడిన వస్తువు లన్నియు కేవల వాఙ్మాత్రము ఉన్నది ఇను మొక్కటే. వికారము లన్నియు నామమాత్రములు ఇను మనున దొక్కటే ఎట్లు సత్యమో నేను నిర్దేశించి తెలుపు ఉపదేశమును ఇదే విధ మయినదని ఉద్దాలకుడు దెలిపెను.

న వై నూనం భగవంతస్త ఏతదవేదిషుర్యద్ధ్యేతదవేదిష్యన్కథం మే నావక్ష్యన్నితి భగవాగ్ం స్త్వేవ మేతద్బ్రవీత్వితి తథా సోమ్యేతి హోవాచ. 7

అప్పుడు శ్వేతకేతువు స్వామీ! నిజముగా ఈ యుపదేశము నా గురువులకు తెలియదు. తెలిసి యుండిన వారు నా కెందుకు జెప్పి యుండరు? దానిని మీరే నాకు చెప్పవలయు నని యడిగెను. తండ్రి అంగీకరించెను.

## 2-వ ఖండము

సద్రూప పరమాత్మచే జగదుత్పత్తి యని తెలుపుట

సదేవ సోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయం తద్ధైక ఆహురసదేవేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయం తస్మాదసతస్సజ్జాయత. 1

ఓ సౌమ్యా! మొట్టమొదట సత్తను నదొక్కటే యుండెను. అసత్తు ఉండినదని కొందఱు చెప్పెదరు.

కుతస్తు ఖలు సోమ్యైవగ్ంస్యాదితి హోవాచ కథమసతస్స జ్జాయేతేతి సత్త్వేవ సోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయమ్. 2

కాని అదెట్లు సంభవము? అసత్తునుండి సత్తు ఎట్లు గలుగును? పుట్టుట అసంభవము. కాబట్టి సద్రూపమగు బ్రహ్మ మొక్కటే మొట్ట మొదట ఉండెను. రెండవ దేమియు నుండలేదని తెలియుము.

తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి తత్తేజోఽసృజత తత్తేజ ఐక్షత బహు స్యాం ప్రజాయేయేతి తదపోఽసృజత తస్మాద్యత్ర క్వచ శోచతి స్వేదతే వా పురుషస్తేజస ఏవ తదధ్యాపో జాయంతే. 3

ఆ సత్తు (పరమాత్మ) నేను బహు ప్రకారము లయ్యెద నని సంకల్పించెను. అందుచే మొదట తేజస్సును పుట్టించెను. పిదప నా తేజ ఉపహితమైన సత్తు నేను బహురూపుడను కావలెనని యాలోచించి జలమును పుట్టించెను. అందుచే పురుషుడు ఎప్పుడు మఱి ఎచ్చట సంతప్తు డగునో లేక చెమట నొందునో అప్పు డచ్చట అగ్నినుండియే జలము గలుగును.

తా ఆప ఐక్షంత బహ్వ్యస్స్యామ ప్రజాయేమహీతి తా అన్న మసృజంత తస్మాద్యత్ర క్వచ వర్షతి తదేవ భూయిష్ఠమన్నం భవత్యద్భ్య ఏవ తదధ్యన్నాద్యం జాయతే. 4

ఆ జలము నేను బహు రూపములు గావలెనని యాలోచించి తద్వారా అన్నమును పుట్టించెను. కాబట్టి ఎప్పు డెచ్చట వర్ష మగునో అప్పు డచ్చట విరివిగా అన్న ముత్పన్న మగును. జలమునుండియే తినుటకు యోగ్యమగు అన్నము పుట్టునని అర్థము.

3-వ ఖండము

అండజ, జరాయుజ, ఉద్భిజ్జములని సృష్టి మూడువిధములు

తేషాం ఖల్వేషాం భూతానాం త్రీణ్యేవ బీజాని భవంత్యాండజం జీవజ ముద్భిజ్జమితి. 1

ఈ భూతములు అండజ, జరాయుజ, ఉద్భిజ్జములని మూడు తెరగులై యున్నవి. స్వేదజము లనునవి పై మూడిటియం దంతర్గతము లని తెలియ వలయును.

సేయం దేవతైక్షత హంతాహమిమాస్తిస్రో దేవతా అనేన జీవేనాత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణీతి. 2

ఈ సద్రూపమగు దేవత నేనిక జీవాత్మరూపమున ఈ ముగ్గురు దేవతలయందు అనగా అగ్ని జలాన్నములయందు ప్రవేశము చేసి నామరూపములను వ్యక్త పఱచ వలెనని ఆలోచించెను. వివిధ దృశ్యప్ర ములచే సృష్టించ వలెనని సంకల్పించెను.

తాసాం త్రివృతం త్రివృతమేకైకాం కరవాణీతి సేయం దేవతే మాస్తిస్రో దేవతా అనేన జీవేనాత్మనాఽనుప్రవిశ్య నామరూపే వ్యాకరోత్. 3

మఱియు నేనీ దేవతల త్రివృత్కరణముచేయ వలయును సత్తనునీ దేవత జీవాత్మరూపముచే ఈ ముగ్గురు దేవతలయందు అనగా భూతములయందు ప్రవేశించి నామ రూపములను కల్పించెను. ఇచ్చట త్రివృత్కరణ మనగా పంచీకరణమువలె అగ్ని జలము పృథివి ఈ మూడుభూతముల అన్యోన్య సమ్మిశ్రణముచే (కూడికచే) ఏర్పడిన సృష్టి విధానమని అర్థము. ఇచ్చట శ్రుతికి తాత్పర్యము సృష్టివర్ణన యందు లేదు. బ్రహ్మాత్వమును దెలుపుటయందే యని ముముక్షువులు గ్రహింపవలయును.

తాసాం త్రివృతం త్రివృతమేకైకామకరోద్యథా తు ఖలు సోమ్యేమాస్తిస్రో దేవతాస్త్రివృత్త్రివృదేకైకా భవతి తన్మే విజానీహీతి. 4

సద్దేవత ఆ ముగ్గురు దేవతల నొక్కొక్క దానిని త్రివృత్కరణము చేసెను. సదాధారమున సృష్టి కల్పింప బడెనని భావము. ఓసౌమ్యా! ముగ్గురు దేవతల త్రివృత్కరణ మే ప్రకార మనునది చెప్పెదను వినుము.

## 4-వ ఖండము

### త్రివృత్కరణమును తెలుపుట

యదగ్నే రోహితగ్ం రూపం తేజసస్తద్రూపం యచ్ఛుక్లం తదపాం యత్కృష్ణం తదన్నస్యాపాగాదగ్నే రగ్నిత్వం వాచారంభణం వికారో నామధేయం త్రీణి రూపాణ్యేవ సత్యమ్. 1

అగ్నియొక్క ఎఱుపుతనము తేజస్సు. తెలుపు వర్ణము జలము. నలుపు రూప మన్నము (పృథివి). వీటిని విడిచినచో అగ్నియొక్క అగ్నిత్వమే లేని దగును. తక్కినది వాచారంభణము. వికారము నామ మాత్రము. ముత్తెఱగులగు ఆ రూపములే సత్యము.

యదాదిత్యస్య రోహితగ్ం రూపం తేజసస్తద్రూపం యచ్ఛుక్లం తదపాం యత్కృష్ణం తదన్నస్యాపాగా దాదిత్యా దాదిత్యత్వం వాచారంభణం వికారో నామధేయం త్రీణి రూపాణ్యేవ సత్యమ్. 2

ఆదిత్యుని ఎఱుపు రూపమే తేజస్సు. తెలుపుదనమే జలము. నలుపు వన్నెయే అన్నము (పృథివి). వీటిని విడిచినచో ఆదిత్యునకు ఆదిత్యత్వమే లేదు. మిగిలిన దెల్ల వాగ్జాలము. వికారము కేవల నామ మాత్రము. ఆ మూడు రూపములే సత్యము.

యచ్చంద్రమసో రోహితగ్ం రూపం తేజసస్తద్రూపం యచ్ఛుక్లం తదపాం యత్కృష్ణం తదన్నస్యాపాగాచ్చంద్రాచ్చంద్రత్వం వాచారంభణం వికారో నామధేయం త్రీణి రూపాణ్యేవ సత్యమ్. 3

చంద్రుని ఎఱుపుదనమే తేజస్సు. తెలుపు రూపమే జలము. నలుపు రూపమే అన్నము (పృథివి). వీటిని విడిచినచో చంద్రుని రూపమే లేదు. తక్కిన దంతయు వాచామాత్రము. వికారము నామ మాత్రము. ఈ మూడు రూపములే సత్యము.

యద్విద్యుతో రోహితగ్ం రూపం తేజసస్తద్రూపం యచ్ఛుక్లం తదపాం యత్కృష్ణం తదన్నస్యాపాగాద్విద్యుతో విద్యుత్త్వం వాచారంభణం వికారో నామధేయం త్రీణిరూపాణ్యేవ సత్యమ్.4

విద్యుత్తుయొక్క ఎఱుపు రూపమే తేజస్సు. తెలుపు రూపమే జలము. నలుపు రూపమే అన్నము (పృథివి). వీటిని విడిచినచో

విద్యుత్తుయొక్క విద్యుత్త్వము లేదు. మిగిలిన దెల్ల వాచారంభణము, వికారము నామమాత్రము. మూడు రూపములే సత్యము.

ఏతద్ధస్మవై తద్విద్వాగ్ంస ఆహుః పూర్వే మహాశాలా మహాశ్రోత్రియా ననోద్యకశ్చనాశ్రుత మమత మవిజ్ఞాత ముదాహరిష్యతీతి హ్యేభ్యో విదాంచక్రుః. 5

విద్వాంసులును మహాగృహస్థులును సద్వస్తు తత్త్వ మిట్టిదే యని తెలిసికొని యున్నందువలన మన వంశమునం దెవరును వినని దియు విచారింపనిదియు తెలియనిదియు మఱేమియును లేదని తెలియుచున్నది. మన వారు సద్రూపమగు బ్రహ్మతత్త్వమును తెలిసినవారై యుండిరని భావము.

యదురోహిత మివాభూదితి తేజసస్తద్రూపమితి తద్విదాంచక్రుర్యదు శుక్లమివాభూదిత్యపాగ్ం రూపమితి తద్విదాంచక్రుర్యదు కృష్ణమివాభూదిత్యన్నస్య రూపమితి తద్విదాంచక్రుః. 6

ఎఱుపు గలది తేజస్సనియు తెలుపు గలది జలస్వరూప మనియు నలుపు అన్నముయొక్క రూపమనియు వారు తెలిసికొని సర్వజ్ఞులై యుండిరి.

యద్వవిజ్ఞాత మివాభూదిత్యేతాసామేవ దేవతానాగ్ం సమాస ఇతి తద్విదాంచక్రుర్యథా ను ఖలు సోమ్యేమాస్తిస్రో దేవతాః పురుషం ప్రాప్య త్రివృత్త్రివృదేకైకా భవతి తన్మే విజానీహీతి. 7

తెలియకుండినచో రూపము ఈ దేవతల (అగ్న్యాదిభూతముల) సంయోగముచేత నయినదని వారు తెలిసికొనిరి. మఱియు ఓ శ్వేతకేతూ! ఈ మువ్వురు దేవతలు పురుషునియందు జేరి ఎట్లు త్రివృద్రూపము నొందుదు రనునది నానుండి వినుము.

## 5-వ ఖండము

అవ: మనస్సు అన్నమయము, ప్రాణము జలమయము, వాక్కు అగ్నిమయమని తెలుపుట.

అన్నమశితం త్రేధా విధీయతే తస్య యః స్థవిష్ఠో ధాతుస్తత్పురీషం భవతి యో మధ్యమస్తన్మాగ్ంసం యోఽణిష్ఠస్తన్మనః.

తినిన అన్నము మూడు భాగము లగును. అన్నముయొక్క అత్యంత స్థూల భాగము మల మగును. మధ్య భాగము మాంస మగును. అత్యంత సూక్ష్మ భాగము మనస్సగును.

ఆపః పీతా స్త్రేధా విధీయంతే తాసాం యః స్థవిష్ఠో ధాతు స్త న్మూత్రం భవతి యో మధ్యమస్తల్లోహితం యోఽణిష్ఠః స ప్రాణః.2

త్రాగిన నీరు మూడు భాగము లగును. దాని అత్యంత స్థూల భాగము మూత్ర మగును. మధ్యభాగము రక్త మగును. అత్యంత సూక్ష్మ భాగము ప్రాణ మగును.

తేజోఽశితం త్రేధా విధీయతే తస్య యః స్థవిష్ఠో ధాతు స్తదస్థి భవతి యో మధ్యమస్స మజ్జా యోఽణిష్ఠస్సా వాక్. 3

భుజింపబడిన తైలము (తేజస్సు) మూడు భాగము లగును. దాని అత్యంత స్థూల భాగము ఎముక లగును. మధ్య భాగము మజ్జ యను జిగురు పదార్థ మగును. అత్యంత సూక్ష్మ భాగము వాక్కగును.

అన్నమయం హి సోమ్య మన ఆపోమయః ప్రాణ స్తేజో మయీ వాగితి భూయ ఏవ మా భగవాన్విజ్ఞాపయత్వితి తథా సోమ్యేతి హోవాచ. 4

ఓ సౌమ్యా! మనస్సు అన్నమయము. ప్రాణము జలమయము. వాక్కు తేజోమయ మని చెప్పెను. మరల శ్వేతకేతువు భగవన్! నా కింకను విశేషముగ జ్ఞానప్రబోధ జేయవలె నని యడుగగా మంచిదని తండ్రి చెప్పెను.

## 6–వ ఖండము

అవ: పెరుగును మథనము చేయుటచే వెన్న బయటికి వచ్చును గదా! యను నీ ఉపమానముయొక్క విశదీకరణము.

దధ్నస్సోమ్య మథ్యమానస్య యోఽణిమా స ఊర్ధ్వస్సము దీవతి తత్సర్పిర్భవతి.1

ఓ సౌమ్యా! చిలుక బడిన పెరుగుయొక్క సూక్ష్మాంశము మీగడ వలె పైకి తేలి వచ్చును. అదే ఘృత మగును.

ఏవమేవ ఖలు సోమ్యాన్నస్యాశ్యమానస్య యోఽణిమా స ఊర్ధ్వస్సముదీషతి తన్మనో భవతి. 2

ఓ సౌమ్యుడా! అదే విధముగ భుజింపబడిన అన్నముయొక్క అత్యంత సూక్ష్మ భాగము పైకి దేలియాడుచు వచ్చును. అదే మనస్సగును.

అపాగ్ం సోమ్య పీయమానానాం యోఽణిమా స ఊర్ధ్వస్సముదీషతి స ప్రాణో భవతి. 3

సౌమ్యుడా! త్రాగబడిన జలముయొక్క సూక్ష్మ భాగము పైకి వచ్చును. అదే ప్రాణ మగును.

తేజసస్సోమ్యాశ్యమానస్య యోఽణిమా స ఊర్ధ్వస్సముదీషతి సా వాగ్భవతి. 4

ఓ సౌమ్యా! భుజింపబడు తేజఃపదార్థము (నూనె, నేయి మొ॥) యొక్క సూక్ష్మ భాగము పైకి తేలి వచ్చును. అదే వాక్కగును.

అన్నమయం హి సోమ్య మన ఆపోమయః ప్రాణస్తేజోమయీ వాగితి. భూయ ఏవ మా భగవాన్విజ్ఞాపయత్వితి తథా సోమ్యేతి హోవాచ. 5

వత్సా! మనస్సు అన్నమయము. ప్రాణము జలమయము, వాక్కు అగ్నిమయము. హే భగవన్! నాకింకను అధికముగ జ్ఞాన విషయక మగు బోధ చేయ వలయు నని యడుగ మంచిదని ఉద్దాలకు డంగీకరించెను.

## 7-వ ఖండము

### మనస్సు అన్నమయమై యున్నదని బోధించుట

షోడశకలస్సోమ్య పురుషః పంచ దశాహాని మాశీః కామమపః పిబాపోమయః ప్రాణో న పిబతో విచ్ఛేత్స్యత ఇతి. 1

ఓ శిష్యా! పురుషుడు పదునారు కళలు గలవాడు. 15 దినములవఱకు నీవేమియు దినవలదు. నీరు మాత్రము కావలసినంత ప్రు

క్షీణను చుండుము. ప్రాణము జలమయమై యున్నది. (కావున) నీరు త్రాగ కుండిన ప్రాణము పోవును.

స హ పంచదశాహాని నాశాథహైన ముపససాద కిం బ్రవీమి భో ఇత్యృచస్సోమ్యయజూగ్ంషి సామానీతి స హోవాచ న వై మా ప్రతిభాంతి భో ఇతి. 2

కుమారుడు శ్వేతకేతువు 15 దినముల వఱకు ఉపవాసము చేసెను. పిదప తండ్రి కడకు వెళ్ళి స్వామీ! ఏమి చెప్పవలె నని యడుగగా (అప్పు డుద్దాలకుడు) ఋగ్యజుస్సామములను చెప్పు మనెను. భగవన్! అవి నాకు జ్ఞప్తికి రాకున్నవి అని శ్వేతకేతువు తెలిపెను. అనగా చెప్పుటకు శక్తి లేదని భావము.

తగ్ం హోవాచ యథా సోమ్య మహతోఽభ్యాహితస్యైకోఽంగారః ఖద్యోతమాత్రః పరిశిష్టస్స్యాత్తేన తతోఽపి న బహు దహేదేవగ్ం సోమ్య తే షోడశానాం కలానా మేకా కలాఽతిశిష్టా స్యాత్తయైతర్హి వేదాన్నానుభవస్యశానాథ మే విజ్ఞాస్యసీతి. 3

వత్సా! ప్రజ్వలితమగు విశేషాగ్ని చల్లబడి దాని ఒక్క నిప్పురవ మాత్రము మిగిలి యున్న అది ఎట్లు విశేషముగ కాల్పజాలదో అటువలె ఈ నీ 16 కళలయందు ఒక్కటే జీవకళ మిగిలి యున్నందు వలన నీకు వేదములు స్మృతికి రాలేదు. కావున భుజింపుము. మరల అన్నియు జ్ఞప్తికి వచ్చును.

స హాశాథహైన ముపససాద తగ్ంహ యత్కించ పప్రచ్ఛ సర్వగ్ంహ ప్రతిపేదే. 4

శ్వేతకేతువు భుజించి తండ్రి కడకు వచ్చి వినిన దెల్ల చెప్పుటకు సమర్థు డాయెను.

తగ్ం హోవాచ యథా సోమ్య మహతోఽభ్యాహితస్యైక మంగారం ఖద్యోత మాత్రం పరిశిష్టం తం తృణైరుపసమాధాయ ప్రాజ్వలయే త్తేన తతోఽపి బహు దహేత్. 5

ఓ సౌమ్యా! విశేషమగు అగ్ని చల్లారి ఒక్క నిప్పురవ మాత్రమే మిగిలి యుండినపుడు మరల దానిపై గడ్డి వేసి మంటను

రగుల్కొలిపి నట్లయిన అది విశేషమై కాల్చుటకు సమర్థ మగునట్లు

ఏవగ్ం సోమ్య తే షోడశానాం కలానా మేకా కలాఽతిశిష్టా భూత్సాఽన్నేనోపసమాహితా ప్రాజ్వాలీ తయైతర్హి వేదాననుభవ స్యన్నమయగ్ం హి సోమ్య మన ఆపోమయః ప్రాణస్తేజోమయీ వాగితి తద్ధాస్య విజజ్ఞావితి విజజ్ఞావితి. 6

శిష్యా! పదునాఱు కళలయందు మిగిలి యున్న ఒక్క కళను నీవు నురల అన్నముచే విశేష మొనర్చి యున్నావు. వెలిగించి యున్నావు. అందుచేత ఇప్పుడు వేదములను జెప్ప శక్తుడ వైతివి. మనస్సు అన్నమయము. ప్రాణము జలమయము. వాక్కు అగ్నిమయ మని ఇట్లు చెప్పగా శ్వేతకేతువునకు విషయ మర్థ మాయెను.

## 8-వ ఖండము

అవ: సద్రూపాత్మయే సర్వమునకు మూలమై యున్న ఆ సత్తే ఆనంద స్వరూప మగు బ్రహ్మము. అది నీవయి యున్న సుషుప్త్యుదాహరణముచే దెలుపుట.

ఉద్దాలకో హారుణిశ్శ్వేతకేతుం పుత్ర మువాచ స్వప్నాంతం మే సోమ్య విజానీహీతి యత్రైతత్పురుషస్స్వపితి నామ సతా సోమ్య తదా సంపన్నో భవతి స్వమపీతో భవతి తస్మాదేనగ్ం స్వపితీత్యాచక్షతే స్వగ్ం హ్యపీతో భవతి. 1

ఆరుణి యగు ఉద్దాలకుడు తన పుత్రుడగు శ్వేతకేతువు నుద్దేశించి ఓసౌమ్యా! నిద్రయొక్క స్వరూపమును చక్కగా నానుండి తెలిసికొనుము. ఈ పురుషుడు నిద్రించినపుడు సద్రూపాత్మతో అభేదము నొందు చున్నాడు. తనయందు (ఆత్మయందు) లయ మొందు చున్నాడు. అందువలన నిద్రించియున్నాడని చెప్పుదురు. ఎందుకనగా (స్వం అపీతః) ఇతడు తనయందు తా నొకటియై యున్నాడని అర్థము.

స యథా శకునిస్సూత్రేణ ప్రబద్ధో దిశం దిశం పతిత్వాఽన్యత్రాయతన మలబ్ధ్వాబంధన మేవోపశ్రయత ఏవ మేవ ఖలు సోమ్య తన్మనో దిశం దిశం పతిత్వాఽన్యత్రాయతన మలబ్ధ్వా ప్రాణమేవోపశ్రయతే ప్రాణబంధనగ్ం హి సోమ్య మన ఇతి. 2

సూత్రముచే (తాԁటిచే) కట్టబడిన పక్షి ఏ విధముగా దిక్కుల దిక్కుల దిరుగుచు ఎచ్చటను ఆశ్రయముగానక మరల తన్ను గట్టి బంధించిన ఆశ్రయము (పంజరము) నందే వచ్చి విశ్రాంతి నొందునో ఉండునో అదే విధముగ మనస్సు నానా దిక్కులకు వెళ్ళి ఎచ్చటను ఆశ్రయము గానక తన ప్రాణమునే మరల ఆశ్రయించును. ప్రాణమే మనస్సుయొక్క బంధము. సూత్రమై యున్నదని భావము.

అశనాపిపాసే మే సోమ్య విజానీహీతి యత్రైతత్పురుషోఽశిశిషతి నామాప ఏవ తదశితం నయంతే తద్యథా గోనాయోఽశ్వనాయః పురుషనాయ ఇత్యేవం తదప ఆచక్షతేఽశనాయేతి తత్రైతచ్ఛుంగ ముత్పతితగ్ం సోమ్య విజానీహి నేదమమూలం భవిష్యతీతి. 3

శ్వేతకేతూ! నానుండి ఆకలి దప్పులయొక్క స్వరూపమును దెలిసికొనుము. పురుషుడు భుజింప నిచ్ఛ గలవాడయిన నీళ్ళే, తినబడిన అన్నమును వ్యవస్థా బద్ధముగ తీసికొని వెళ్ళును. లోకమునం దెట్లు గో అశ్వ మనుష్యాదులను దీసికొని పోవువారు గోనాయ అశ్వనాయ పురుషనాయ యని చెప్ప బడెదరో అటువలె జలము అశనాయ యని చెప్పబడును. ఇట్లుండుట వలననే ఓ శ్వేతకేతూ! మొలచిన యంకురము వేరు లేనిదే అది లేదని తెలియుము. నీటిచే వృద్ధి నొందిన దీదేహ మని భావము.

తస్య క్వ మూలగ్ం స్యాదన్యత్రాన్నా దేవ మేవ ఖలు సోమ్యాన్నేన శుంగేనాపో మూల మన్విచ్ఛాద్భి స్సోమ్య శుంగేన తేజోమూల మన్విచ్ఛ తేజసా సోమ్య శుంగేన సన్మూల మన్విచ్ఛ సన్మూలాస్సోమ్యేమాస్సర్వాః ప్రజా స్సదాయతనా స్సత్ప్రతిష్ఠాః. 4

మఱియు ఓ సౌమ్యా! అన్నము వినా దేహముయొక్క మూలము మఱేమి గలదు? అదే విధముగ అన్నమను అంకురముచే జలమను వేరును ఈ జలమను అంకురముచే తేజమను వేరును తేజమను అంకురముచే సత్తను మూలమును (వేరును) తెలిసికొనుము. కాబట్టి సౌమ్యా! ఈ సమస్త ప్రజలు సత్తను వేరు గలిగి యున్నారు. సత్తే సర్వుల ఆశ్రయము ఆధారమునై యున్నది. ...

అథ యత్రైతత్పురుషః పిపాసతి నామ తేజ ఏవ తత్పీతం నయతే తద్యథా గోనాయోఽశ్వనాయః పురుషనాయ ఇత్యేవం తత్తేజ ఆచష్ట ఉదన్యేతి తత్రైతదేవ శుంగ ముత్పతితగ్ం సోమ్య విజానీహి. నేదమమూలం భవిష్యతీతి. 5

ఇక పురుషుడు దప్పి గొనె ననిన త్రాగబడిన నీటిని తేజము గొంపోవును. ఎట్లు గోనాయ అశ్వనాయ పురుషనాయ యను నామములుగలవో అదే విధముగ తేజస్సునకు "ఉదన్య" నీటిని గొంపోవు దని పేరు గలదు. అందుచే ఓ సౌమ్యా! ఈ యంకురము అనగా దేహము ఉత్పన్నమై యున్నది. మూలము లేక ఇది యుండ జాలదని తెలిసికొనుము.

తస్యక్వ మూలగ్ం స్యాదన్యత్రాద్భ్యోఽద్భి స్సోమ్య శుంగేన తేజోమూల మన్విచ్ఛ తేజసా సోమ్య శుంగేన సన్మూల మన్విచ్ఛ సన్మూలాస్సోమ్యేమాస్సర్వాః ప్రజా స్సదాయతనా స్సత్ప్రతిష్ఠా యథా ను ఖలు సోమ్యేమాస్తిస్రో దేవతాః పురుషం ప్రాప్య త్రివృత్త్రివృ దేకైకా భవతి తదుక్తం పురస్తాదేవ భవత్యస్య సోమ్య పురుషస్య ప్రయతో వాఙ్మనసి సంపద్యతే మనః ప్రాణేప్రాణ స్తేజసి తేజః పరస్యాం దేవతాయాం. 6

వత్సా! జలము వినా ఈ దేహముయొక్క మూలము మరెచట గలదు? జలమను అంకురముచే తేజస్సను మూలమును, తేజస్సను అంకురముచే సత్తను మూలమును తెలిసికొనుము. సౌమ్యా! సమస్త ప్రజలు సత్తను పేరు గలవారై యున్నారు. "సత్" ఇదే వారికి ఆశ్రయము (సర్వాశ్రయము), ఆధారము. పుత్రా! ఈ ముగ్గురు తేజోబన్నములను దేవతలు పురుషునియందు త్రివృత్కరణములై ఎట్లుండు వనునది నేను నీకు జెప్పి యున్నాను. ఇక ఆ విధముగనే మరణించు మనుష్యుని యొక్క వాక్కు మనస్సునందు, మనస్సు ప్రాణమునందు, ప్రాణము తేజస్సునందు, తేజస్సు పరమగు దైవమునందు, అనగా ఆత్మయందు లయము నొందును.

స య ఏషోఽణిమా ఐతదాత్మ్య మిదగ్ం సర్వం తత్సత్యగ్ం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో ఇతి భూయ ఏవ మా భగవాన్

జ్ఞాపయత్వితి తథాసోమ్యేతి హోవాచ. 7

అది ఆ పరబ్రహ్మతత్త్వము అత్యంత సూక్ష్మము. ఇదంతయు ఆ పరబ్రహ్మస్వరూపమే. అదే సత్యము. అదే ఆత్మ. ఓ శ్వేతకేతూ! అది నీవై యున్నావు. (తత్త్వమసి). మరల శ్వేతకేతువు భగవన్! నాకింకొక సారి ఈ జ్ఞాన విషయమును జెప్పవలెనని యడిగెను. అట్లే యగుగాక యని ఉద్దాలకు డంగీకరించెను.

## 9–వ ఖండము

అవ : తేనెటీగెల ఉపమానముచే ఆ సద్రూప బ్రహ్మము నీవై యున్నావని తెలుపుట.

యథా సోమ్య మధు మధుకృతో నిస్తిష్ఠంతి నానాత్యయానాం వృక్షాణాగ్ం రసాన్ సమవహారమేకతాగ్ం రసం గమయంతి. 1

ప్రియపుత్రా! తేనెటీగలు నానా దిక్కులనుండి నానా పుష్ప రసములను దెచ్చి ఒకచోట గూర్చి తేనె నెట్లు సిద్ధ మొనర్చునో, ఆ తేనెయందలి రసము,

తే యథా తత్ర న వివేకం లభంతేఽముష్యాహం వృక్షస్య రసోఽస్మ్యముష్యాహం వృక్షస్య రసోస్మీత్యేవ మేవ ఖలు సోమ్యేమాః సర్వాః ప్రజాస్సతి సంపద్య న విదుస్సతి సంపద్యామహ ఇతి. 2

నేనీ పుష్పముయొక్క రసమే యను వివేకము నేరీతిగా తెలియ కుండునో అదే విధముగ ఈ సమస్త ప్రజలు సత్తునందు లీనమై మేము సత్తునందు లీనమై యున్నామనునది తెలియరు.

త ఇహ వ్యాఘ్రోవా సిగ్ంహో వా వృకో వా వరాహో వా కీటో వా పతంగో వా దగ్ంశో వా మశకో వా యద్యద్భవంతి తదా భవంతి. 3

ఆ ప్రజలు (ప్రాణులు) మొదట జాగ్రదవస్థయందు ఏయే సంస్కారానుగుణ్యముగ నుందురో మరల నదే విధముగ ఆయా రూపమున పులి, సింహము, తోడేలు, వరాహము, కీటకము, మశకము, పతంగము వీటియందేదేనొకటియై యుండి మరల తత్తద్రూపములనే ధరించును.

స య ఏషోఽణిమైతదాత్మ్యమిదగ్ం సర్వం తత్సత్యగ్ం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో ఇతి భూయ ఏవ మా భగవాన్విజ్ఞాపయ త్వితి తథా సోమ్యేతి హోవాచ. 4

ఆ సద్రూపమగు పరమవస్తువు పరమ సూక్ష్మము. ఈ సర్వము బ్రహ్మమే. అదే సత్యము. అదే ఆత్మ. ఓ శ్వేతకేతూ! అది నీవై యున్నావు (తత్త్వమసి) భగవన్! ఈ జ్ఞానమును మరల నాకు బోధించ వలెనని యడుగ అటులనే యగుగాక యని తండ్రి అంగీకరించెను.

10-వ ఖండము

అవ : సముద్రమునందు నదులయొక్క విభిన్నత దెలియనట్లు సద్రూపబ్రహ్మమునందు లీన మయిన జీవుల విభిన్నత తెలియదు. ఆ సద్రూప బ్రహ్మమే జగద్రూపముగ నున్నదని తెలుపుట.

ఇమాస్సోమ్య నద్యః పురస్తాత్ప్రాచ్యస్స్యందంతే పశ్చాత్ప్రతీచ్యస్తాః సముద్రాత్సముద్ర మేవాపియంతి సముద్ర ఏవ భవతి తా యథా తత్ర న విదు రియ మహ మస్మీయమహ మస్మీతి. 1

ఓ సౌమ్యా! ఈ నదు లెల్ల పూర్వమునకు పూర్వ వాహినులై పశ్చిమమునకు పశ్చిమ వాహినులై పాఱుచు అన్నియు సముద్రము నుండి వెడలి మరల సముద్రమునకే పోయి చేరును. సముద్రమే యగును. ఇట్లు సముద్రమునందు జేరిన యా నదులు నేను ఈ యా నది యని ఎట్లు తెలియ జాలక విడి విడిగా తమ తమ నామ రూప మహిమలను వీడి సముద్ర రూపమే యగునో,

ఏవమేవ ఖలు సోమ్యేమాస్సర్వాః ప్రజాస్సత ఆగమ్య న విదుస్సత ఆగచ్ఛామహ ఇతి త ఇహ వ్యాఘ్రో వా సిగ్ంహో వా వృకో వా వరాహో వా కీటో వా పతంగో వా దగ్ంశో వా మశకో వా యద్యద్భవంతి తదా భవంతి. 2

అటువలె ఈ ప్రజలు సద్రూప బ్రహ్మము నుండియే పుట్టి సద్రూప బ్రహ్మమునే పొందుచున్నామని తెలియుట లేదు. పులి సింహము, తోడేలు, వరాహ, కీట, పతంగాది ప్రాణులు మరల మొదట తాము ఏ యే నామ రూపములచే నుండెనో ఆ యా నామ రూపములనే పొందును.

స య ఏషోఽణిమైతదాత్మ్యమిదగ్ం సర్వం తత్సత్యగ్ం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో ఇతి. భూయ ఏవ మా భగవాన్విజ్ఞాపయత్వితి తథా సోమ్యేతి హోవాచ. 3

ఆ సద్రూపమగు బ్రహ్మతత్త్వము పరమ సూక్ష్మము. ఇదంతయు పరబ్రహ్మస్వరూపమే. అదే సత్యము. అదే ఆత్మ. ఓ శ్వేతకేతూ! నీవదియై యున్నావు. (తత్త్వమసి) ఇట్లు విని మరల నాకు జ్ఞానమును బోధింపుమని శ్వేతకేతు వడుగగా మరల తండ్రి ఈ ప్రకారముగా తెలిపెను.

## 11-వ ఖండము

అవ: వృక్షముయొక్క దృష్టాంతముచే సద్రూపాత్మయే అనేక జన్మములను పొందినట్లున్నది. చిద్వివర్తమును దృష్టిచే జీవుడవినాశి యని తెలుపుట.

అస్య సోమ్య మహతో వృక్షస్య యో మూలేఽభ్యాహన్యా జ్జీవన్స్రవేద్యో మధ్యేఽభ్యాహన్యాజ్జీవన్స్రవేద్యోఽగ్రేఽభ్యాహన్యా జ్జీవన్స్రవేత్స ఏష జీవేనాత్మనానుప్రభూతః పేపీయమానో మోదమానస్తిష్ఠతి. 1

సౌమ్యా! ఈ గొప్ప వృక్షమునం దొక భాగమును కత్తితో గొట్టిన అది జీవించి రసమును స్రవించును. మధ్య భాగమున గొట్టినను అది జీవించి రసము స్రవించును. అదే విధముగా చివరి భాగమును కొట్టినను జీవించుచు రసమును స్రవించును. ఈ చెట్టు జీవించునదై ఆత్మచేత వ్యాప్తమై యున్నది. అది నీటిని ద్రాగుచు ఆనందించుచు నిలిచి యున్నది.

అస్య యదేకాగ్ం శాఖాం జీవో జహాత్యథ సా శుష్యతి ద్వితీయాం జహాత్యథ సా శుష్యతి తృతీయాం జహాత్యథ సా శుష్యతి సర్వం జహాతి సర్వశ్శుష్యత్యేవమేవ ఖలు సోమ్య విద్ధీతి హోవాచ. 2

జీవుడు ఆ చెట్టుయొక్క ఒక కొమ్మను విడిచిపెట్టి పోయినట్లైన

ఆ కొమ్మ ఎండిపోవును. రెండవ కొమ్మను విడచిన ఆ కొమ్మయును శుష్కించి పోవును. మూడవ కొమ్మను విడిచిన అదియును ఎండి పోవును. మొత్తము చెట్టు నంతయు విడిచి పోయినట్టయిన చెట్టెల్ల ఎండిపోవును. సౌమ్యా! ఈ విధముగా,

జీవాపేతం వావ కిలేదం మ్రియతే న జీవో మ్రియత ఇతి స య ఏషోఽణిమైతదాత్మ్యమిదగ్ం సర్వం తత్సత్యగ్ం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో ఇతి భూయ ఏవ మా భగవాన్విజ్ఞాపయత్వితి తథా సోమ్యేతి హోవాచ. 3

జీవునిచే విడువబడి నట్టయిన (దేహము) చచ్చి పోవును. కాని జీవుడు చచ్చువాడు కాడు. జీవత్వబుద్ధి బాధింపబడిన సదాత్మ బ్రహ్మమే అగుచున్నాడు. అది అత్యంత సూక్ష్మము. ఇదంతయు పర బ్రహ్మమయము. అదే సత్యము. అదే ఆత్మ. శ్వేతకేతూ! నీవు అదియై యున్నావు. భగవన్! నాకింకను జ్ఞానమును గురించి బోధింపవలె నని శ్వేతకేతు వడిగెను. ఉద్దాలకు డంగీకరించెను.

## 12-వ ఖండము

అవ: వట బీజముయొక్క ఉపమానముచే జగన్మూలమగు చైతన్యాత్మ అత్యంత సూక్ష్మమై యున్నదని చెప్పుచున్నారు.

న్యగ్రోధఫలమత ఆహరేతీదం భగవ ఇతి భింధీతి భిన్నం భగవ ఇతి కిమత్రపశ్యసీత్యణ్వ్య ఇవేమా ధానా భగవ ఇత్యాసామంగైకాం భింధీతి భిన్నా భగవ ఇతి కిమత్ర పశ్యసీతి న కించన భగవ ఇతి. 1

నాయనా! ఒక మఱ్ఱిపండును తెమ్ము. భగవన్! ఇదో తెచ్చితిని. దానిని చీల్చుము. ఇదో చీల్చినాడను. అందే మగపడుచున్నది? అత్యంత సూక్ష్మమగు బీజము లగపడుచున్నవి. అందులో ఒక దానిని చీల్చుము. చీల్చితిని. అందేమగపడును? భగవన్! ఏమియు అగ పడుట లేదు.

తగ్ం హోవాచ యం వై సోమ్యైతమణిమానం న నిభాల
యస ఏతస్య వై సోమ్యైషోఽణిమ్న ఏవం మహాన్యగ్రోధ స్తిష్ఠతి
శ్రద్ధత్స్వ సోమ్యేతి. 2

ఓసౌమ్యా! వటవృక్ష విత్తనముయొక్క ఏ సూక్ష్మఅంశమును
నీవిచ్చట చూడ జాలవో అద్దానినుండియే ఈ గొప్పదగు వటవృక్షమై
యున్నది. సౌమ్యా! ఈ సత్యమునందు శ్రద్ధ నుంచుము.

స య ఏషోఽణిమైతదాత్మ్యమిదగ్ం సర్వం తత్సత్యగ్ం స ఆత్మా
తత్త్వమసి శ్వేతకేతో ఇతి భూయ ఏవ మా భగవాన్విజ్ఞాపయత్వితి
తథా సోమ్యేతి హోవాచ. 3

అది పరమ సూక్ష్మము. ఇదంతయు పరబ్రహ్మస్వరూపము.
అదే సత్యము. అదే ఆత్మ. శ్వేతకేతూ! అదియే నీవై యున్నావు.
(తత్త్వమసి) అని ఇట్లు బోధించెను. ఆ పిదప భగవన్! ఆ సద్రూప
మగు వస్తువే ఈ ప్రపంచమునకు ఆధారమై యుండగా అది కనబడుట
లేదేమి? ఏతద్విషయకమగు జ్ఞానమును గుఱించి మరల నాకు బోధింప
వలెనని యడుగగా తండ్రి ఈ విధముగ జెప్పెను.

### 13–వ ఖండము

అవ: ఉప్పుగల్లుయొక్క ఉపమానముచే చైతన్యాత్మ పర
మాణురూపమై యున్నదని తెలుపుచున్నారు.

లవణమేతదుదకేఽవధాయాథ మా ప్రాతరుపసీదథా ఇతి స
హ తథా చకార తగ్ం హోవాచ యద్దోషా లవణముదకేఽ
వాధా అంగ తదాహరేతి తద్ధావమృశ్య న వివేద.1

ఈ ఉప్పుగల్లు ఇప్పుడు నీటియందు పడవైచి రేపు తెల్లవారి
నా కడకు తీసికొని రమ్మనెను. శ్వేతకేతు వటులనే జేసి తండ్రికడకు
వచ్చెను. పుత్రా! రాత్రి నీవు నీటియందు బడవైచిన ఉప్పుగల్లును
తీసి ఇమ్మని యడిగెను. పుత్రుడు దానిని వెదకి చూడ దొరకలేదు.

యథా విలీనమేవాంగ అస్యాం తాదాచామేతి కథమితి లవణమితి మధ్యాదాచామేతి కథమితి లవణమిత్యంతాదాచామేతి కథమితి లవణమిత్యభిప్రాశ్యైతదథ మోపసీదథా ఇతి తద్ధ తథా చకార తచ్ఛశ్వత్సంవర్తతే తగ్ం హోవాచాత్రవావ కిల సత్సోమ్య న నిభాలయసేఽత్రైవ కిలేతి. 2

సౌమ్యా! అది నీటియందు గలసి పోయినది. (అగుగాక) ఎట్లున్నదో (ఆ) నీటి పై భాగమును రుచి చూడుము. ఉప్పగానున్నదనెను. తరువాత మధ్య భాగము, అడుగు భాగమును చూడుమని చెప్పగా శ్వేతకేతువు పరీక్షించి చూచి ఉప్పగనే యున్నదనెను. ఈ జలమును పారబోసి నా కడకు రమ్ము. ఇట్లు సంవాదమైన పిదప ఉప్పు నీటియందెల్లెడల వ్యాపించి యున్నదని కుమారుడు తెలిసికొనెను. ఓసౌమ్యా! ఉప్పు నీటియం దుండినను నీవేవిధముగా చూడలేకపోతివో అదే ప్రకారము ఆ సద్రూపమగు బ్రహ్మము సర్వత్ర గలదు. ఇది స్థూలమగు ప్రత్యక్షాది ప్రమాణ వేద్యము గాదని భావము.

స య ఏషోఽణిమైతదాత్మ్యమిదగ్ం సర్వం తత్సత్యగ్ం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో ఇతి భూయ ఏవ మా భగవాన్విజ్ఞాపయత్వితి తథా సోమ్యేతి హోవాచ. 3

అది పరమ సూక్ష్మము. ఇదంతయు పరబ్రహ్మస్వరూపము. అదే సత్యము. అదే ఆత్మ. శ్వేతకేతూ! అదే నీవై యున్నావు (తత్త్వమసి). ఈ విధముగ నాలకించి (మరల) భగవన్! నాకింకను (ఆత్మ) జ్ఞానమును బోధింపవలెనని యడుగగా మంచిదని అతడంగీకరించెను.

## 14-వ ఖండము

అవ: కన్నులకు గంత కట్టబడిన పురుషుని దృష్టాంతమున గురు శాస్త్రముల చే సంస్కృతి నొందిన పరిశుద్ధమగు బుద్ధికి ఆత్మతత్త్వము వేద్య మగునని చెప్పుచున్నారు.

యథా సోమ్య పురుషం గంధారేభ్యోఽభినద్ధాక్షమానీయ తం తతోఽతిజనే విసృజేత్స యథా తత్ర ప్రాఙ్వోదఙ్వాధరాఙ్వాప్రత్యఙ్వా ప్రధ్మాయీతాభినద్ధాక్ష ఆనీతోఽభినద్ధాక్షో విసృష్టః. 1

వత్సా! ఒకానొక పురుషుని కన్నులకు గంత కట్టి, వానిని గాంధార దేశమునుండి తీసికొని వచ్చి నిర్జనారణ్యమున విడిచిన నతడు పూర్వ పశ్చిమ దక్షిణోత్తర దిక్కుల ముఖము చేసి తిరుగుచు అయ్యా! నన్ను కన్నులకు గంత కట్టి తెచ్చి ఇచ్చట విడిచి యున్నా రని రోదన మొనర్చు చుండగా,

తస్య యథాఽభినహనంప్రముచ్య ప్రబ్రూయాదేతాం దిశం గంధారా ఏతాం దిశం వ్రజేతి స గ్రామాద్గ్రామం పృచ్ఛన్ పండితో మేధావీ గంధారానేవోపసంపద్యేతైవమేవేహాచార్యవాన్పురుషో వేద తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యేఽథ సంపత్స్య ఇతి. 2

పథికు లెవరైన నతని యార్తధ్వని విని అతని కన్నులకు కట్టిన గంతను విప్పి ఈ దిక్కున గాంధార దేశము గలదు. ఇట్లు వెడలు మని చెప్పిన ట్లయిన చో వివేకియగు నతడు అడుగుచు నడుగుచు ఆయా గ్రామ ములనుండి గ్రామాంతరమునకు నడచి నడచి గాంధార దేశమును చేరు నట్లు ఆచార్యుల (గురువుల) సందర్శన మొందిన పురుషుడు సత్యము నరసి ముక్తియను స్వస్థానము నొందును. అనగా గురుశరణాగతి మూలమున సదూపమగు బ్రహ్మానుభవము నొందునని తాత్పర్యము.

స య ఏషోఽణిమైతదాత్మ్యమిదగ్ం సర్వం తత్సత్యగ్ం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో ఇతి భూయ ఏవ మా భగవాన్విజ్ఞాప యత్వితి తథా సోమ్యేతి హోవాచ. 3

అది పరమ సూక్ష్మము. ఇదంతయు పరబ్రహ్మస్వరూపము. అదే సత్యము. అదే ఆత్మ. శ్వేతకేతూ! అది నీవై యున్నావు (తత్త్వమసి). ఇట్లు విని భగవన్! నాకా జ్ఞానమును మరల బోధింప వలెనని శ్వేతకేతు వడిగెను. అగుగాక యని అతడంగీకరించెను.

## 15-వ ఖండము

అవ: లయక్రమముచే సత్యజ్ఞానానందరూప పరబ్రహ్మము నీవయి యున్నావు దాని యెడబాటు నీకు లేదని తెలుపుచున్నాడు.

పురుషగ్ంసోమ్యోతోపతాపినం జ్ఞాతయః పర్యుపాసతే జానాసి మాం జానాసి మామితి తస్య యావన్నవాఙ్మనసి సంపద్యతే మనః ప్రాణే ప్రాణస్తేజసి తేజః పరస్యాం దేవతాయాం తావజ్జానాతి. 1

ఓ శిష్యా! రోగముచే పీడితుడై మరణ శయ్యయం దుండు పురుషుని చుట్టు ప్రక్కల నతని బంధు బాంధవు లెల్లరు గూర్చుండి నన్ను గుఱుతించితివా? నా గుఱుతు నీకు కలదా యను నిత్యాది మాటలచే అతని నడుగుదురు. అతని వాక్కు మనస్సునందును, మనస్సు ప్రాణము నందును, ప్రాణము అగ్నియందును, అగ్ని పర దేవతయందును లీనమగు నంతకాల మతడు వారిని గుఱుతించును.

అథ యదా ఽస్య వాఙ్మనసి సంపద్యతే మనః ప్రాణే ప్రాణస్తేజసి తేజః పరస్యాం దేవతాయామథ న జానాతి. 2

అతని వాక్కు మనస్సునందును, మనస్సు ప్రాణమునందును, ప్రాణము తేజస్సునందును, తేజస్సు పర దేవతయందును లీనమైనదన్న అత డింకెవరిని గూడ కనుగొన లేడు.

స య ఏషోఽణిమైతదాత్మ్యమిదగ్ం సర్వం తత్సత్యగ్ం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో ఇతి భూయ ఏవ మా భగవాన్విజ్ఞాపయత్వితి తథా సోమ్యేతి హోవాచ. 3

అది పరమ సూక్ష్మము. ఇదంతయు పరబ్రహ్మస్వరూపము అదే సత్యము. అదే ఆత్మ. శ్వేతకేతూ! అది నీవయి యున్నావు (తత్త్వమసి). భగవన్! నాకింకను ఆ జ్ఞానమును బోధించ వలెనని అడుగగా తండ్రి మరల చెప్పెను.

## 16-వ ఖండము

అవ: మిథ్యాజ్ఞాని సత్యజ్ఞానులయొక్క లక్షణములను తెల్పాయు

పిండోపమానముచే సత్యవస్తువునందలి పూర్ణ విశ్వాసమే బ్రహ్మజ్ఞాన మని తెలుపుచున్నారు.

పురుషగ్ం సోమ్యోత హస్తగృహీతమానయంత్యపహార్షీ త్స్తేయమకార్షీత్పరశుమస్మై తపతేతి స యది తస్య కర్తా భవతి తత ఏవానృతమాత్మానం కురుతే సోఽనృతాభిసంధోఽనృతేనాత్మాన మంతర్ధాయ పరశుం తప్తం ప్రతిగృహ్ణాతి స దహ్యతేఽథ హన్యతే. 1

ఓ సౌమ్యా! చేతులు కట్టి పురుషుని పట్టుకొని వత్తురు. ఇతడు ధనాపహారము చేసి యున్నాడు. దొంగతనము చేసిన వాడై యున్నాడు. ఇనుప గొడ్డలిని కాలబెట్టుడని చెప్పుదురు. అతడా దొంగ తనమును చేసియు చేయలేదని చెప్పి యుండినచో తప్తాయఃపిండమును పట్టుకొనిన ఆతని హస్తములు కాలును. అప్పు డతడు దొంగ యని నిర్ణయింపబడి శిక్షార్హుడగును.

అథ యది తస్యాకర్తా భవతి తత ఏవ సత్యమాత్మానం కురుతే స సత్యాభిసంధస్సత్యేనాత్మానమంతర్ధాయ పరశుం తప్తం ప్రతి గృహ్ణాతి స న దహ్యతేఽథ ముచ్యతే. 2

మఱియు దొంగతనము చేయకుండి నేను చేయలేదని నిజము చెప్పి యుండిన సత్యసంధుడైన అతనిచే పట్టుకొనబడిన యా తప్తాయః పిండ మతనిని కాల్చదు. అప్పు డతనిని విడిచి పెట్టుదురు.

స యథా తత్ర నాదాహ్యేతైతదాత్మ్యమిదగ్ం సర్వం తత్స త్యగ్ం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో ఇతి తద్ధాస్య విజజ్ఞావితి విజ జ్ఞావితి. 3

సత్యసంధుడగు నాతడు కాల్చబడక యుండు తెఱగున సత్య మగు ఆత్మయే నేనని తెలిసిన తత్త్వవిదుడు దుఃఖములచే తప్తుడు గాడు. పునరావృత్తి నొందడు. ఇదంతయును పరబ్రహ్మస్వరూపము. అదే సత్యము; అదే ఆత్మ. ఓ శ్వేతకేతూ! అది నీవై యున్నావు. తత్త్వమసి. ఈ ప్రకారముగ గురుడగు (తండ్రి) ఉద్దాలకుడు బోధింపగా

శిష్యుడైన యా శ్వేతకేతువునకు పూర్ణతత్త్వము బోధ్యమై ధన్యు డాయెను.

---

7-వ ప్రపాఠకము-1-వ ఖండము

అవ: నారద సనత్కుమార సంవాదము. నామమును బ్రహ్మ ముగా నుపాసించుమని తెలుపుట.

అధీహి భగవ ఇతి హోపససాద సనత్కుమారం నారదస్తగ్ం హోవాచ యద్వేత్థ తేన మోపసీద తతస్త ఊర్ధ్వం వక్ష్యామీతి॥1

స హోవాచర్గ్వేదం భగవోఽధ్యేమి యజుర్వేదగ్ం సామవేద మాథర్వణం చతుర్థమితిహాసపురాణం పంచమం వేదానాం వేదం పిత్ర్యగ్ం రాశిం దైవం నిధిం వాకోవాక్యమేకాయనం దేవవిద్యాం బ్రహ్మవిద్యాం భూతవిద్యాం నక్షత్రవిద్యాం క్షత్రవిద్యాగ్ం సర్ప దేవ జన విద్యా మేతద్భగవోఽధ్యేమి.2

నారదుడు సనత్కుమారుని కడకు వచ్చి భగవన్! నాకు జ్ఞానోపదేశము చేయుడని యడిగెను. నీ కిపుడు తెలిసిన దంతయును జెప్పుము. పిదప నీకు జ్ఞానము నుపదేశించెద నని సనత్కుమారుడు పలికెను. భగవన్! ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణవేదము, ఐదవ వేదమని చెప్పబడు ఇతిహాస పురాణములును మఱియు వ్యాకరణము, పితృ సంబంధమైన శ్రాద్ధకల్పము, గణిత శాస్త్రము, దైవజ్ఞానము, ధూమకేతూత్పాతముల నెఱుంగు దైవ శాస్త్రము, నిధిశాస్త్రము, తర్కశాస్త్రము, ఏకాయనము, నీతి శాస్త్రము, వేదవిద్య, బ్రహ్మవిద్య అనగా శిక్షాకల్పాదులును, భూత విద్య, క్షత్రవిద్య, (ధనుర్వేదము) జ్యోతిషము, సర్పవిద్య, నృత్య గీతాది లలితకళలను దేవజనవిద్య, ఈ మొదలైన సర్వ విద్యలు నే నెఱుగుదును.

సోఽహం భగవో మంత్రవిదేవాస్మి నాత్మవిత్ శ్రుతగ్ం హ్యేవ మే భగవద్దృశేభ్య స్తరతి శోక మాత్మవిదితి సోఽహం భగవః

శోచామి తం మా భగవాంచ్ఛోకస్య పారం తారయత్వితి తగ్ం హోవాచ యద్వై కించైతదధ్యగీష్ఠా నామైవైతత్. 3

భగవంతుడా! నేను మంత్రవేత్తను మాత్రమై యున్నాను. కాని ఆత్మజ్ఞానిని కాదు. ఆత్మజ్ఞానము లేనివాడు దుఃఖాతీతుడు కాజాలడను విషయమును నేను తమబోటి మహానుభావులచే విని యున్నాను. నేను ఆత్మజ్ఞానిని కానందువలన శోకాకుల చిత్తుడనై యున్నాను. కాబట్టి తాము నన్ను దుఃఖాతీతుని జేయవలయు నని యడిగెను. ఈ విషయము నంతయు నాలకించి సనత్కుమార ఋషి (అయ్యా!) నీవభ్యసించినదెల్ల కేవలము నామ మాత్రమై యున్నది. వ్యక్తమగు సృష్టియొక్క అభివర్ణనాత్మకమైన మిథ్యాజ్ఞానమై యున్నది.

నామ వా ఋగ్వేదో యజుర్వేద స్సామవేద ఆథర్వణశ్చతుర్థ ఇతిహాస పురాణః పంచమో వేదానాం వేదః పిత్ర్యో రాశిర్దైవో నిధిర్వాకోవాక్యమేకాయనం దేవవిద్యా బ్రహ్మవిద్యా భూతవిద్యా క్షత్రవిద్యా నక్షత్రవిద్యా సర్ప దేవ జన విద్యా నామైవైతన్నామో పాస్స్వేతి. 4

ఋగ్యజుస్సామాథర్వణ వేదములు ఐదవదగు ఇతిహాసము పురాణాదులు, వ్యాకరణము, శ్రాద్ధకల్పము, గణితము, దైవజ్ఞానము, నీతిశాస్త్రము, తర్కము, నిరుక్తము, శిక్షాకల్పాదులు, భూత తంత్రము, ధనుర్వేదము, జ్యోతిషము మున్నగు ఈ తెలియజెప్పిన వన్నియు కేవల నామ మాత్రములే. కావున నామమున బ్రహ్మబుద్ధి గలిగి ఈ నామముయొక్క ఉపాసన చేయుము. నామమును ప్రతీకముగ నుంచుకొని తన్మూలమున బ్రహ్మత్వము నుపాసించు మని భావము.

స యో నామ బ్రహ్మేత్యుపాస్తే యావన్నామ్నో గతం తత్రాస్య యథాకామచారో భవతి యో నామ బ్రహ్మేత్యుపాస్తేఽస్తి

భగవో నామ్నో భూయ ఇతి నామ్నో వావ భూయోఽస్తీతి తన్మే భగవాన్బ్రవీత్వితి. 5

ఈ నామము బ్రహ్మమని ఉపాసించువాడు నామ విషయకమగు జ్ఞానమును బడసి దానియందు యథేచ్ఛగా విహరించుచు నామ మెంత వఱకు వ్యాప్తిగలదో అంతవఱకు వ్యాప్తిగలవాడై పూర్ణఫలమును బడయును. భగవన్! నామముకంటెను గొప్పదగు జ్ఞానము గలదా! యని నారదు డడిగెను. ఔను దానికంటెను గొప్పది వాక్కు గలదని సనత్కుమారుడు పలికెను. నారదుడు నాకది బోధింప వలెనని ప్రార్థించెను.

## 2–వ ఖండము

### వాక్కును బ్రహ్మముగా నుపాసించుమని తెలుపుట

వాగ్వావ నామ్నో భూయసీ వాగ్వా ఋగ్వేదం విజ్ఞాపయతి యజుర్వేదగ్ం సామవేద మాథర్వణం చతుర్థ మితిహాసపురాణం పంచమం వేదానాం వేదం పిత్ర్యం రాశిం దైవం నిధిం వాకోవాక్య మేకాయనం దేవవిద్యాం బ్రహ్మవిద్యాం భూతవిద్యాం క్షత్రవిద్యాం నక్షత్రవిద్యాగ్ం సర్పదేవ జనవిద్యాం దివం చ పృథివీంచ వాయుం చాకాశం చాపశ్చ తేజశ్చ దేవాగ్ంశ్చ మనుష్యాగ్ంశ్చ పశూగ్ంశ్చ వయాగ్ంసి చ తృణవనస్పతీంచ్ఛ్వాపదాన్యాకీట పతంగ పిపీలకం ధర్మం చాధర్మం చ సత్యం చానృతం చ సాధు చాసాధు చ హృదయజ్ఞం చాహృదయజ్ఞం చ. యద్వై వాఙ్నాభవిష్యన్న ధర్మో నాధర్మో వ్యజ్ఞాపయిష్యన్న సత్యం నానృతం న సాధు నాసాధు న హృదయజ్ఞో నాహృదయజ్ఞో వాగేవైతత్సర్వం విజ్ఞాపయతి వాచ ముపాస్స్వేతి. 1

వాక్కు నామమున కంటెను గొప్పది. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణవేదము, పంచమవేద మనబడెడి ఇతిహాస పురాణములు, మఱియు వ్యాకరణ, శ్రాద్ధ, కల్ప, గణిత శాస్త్రములు, దైవజ్ఞానము, నిధిశాస్త్రజ్ఞానము, తర్కము, నీతిశాస్త్రము,

నిరుక్తము, శిక్షాకల్పాదులు, భూత తంత్రవిద్య, ధనుర్వేదము; జ్యోతిషము, గారుడము, దేవజనవిద్య, ద్యులోకము, పృథివి, వాయువు; ఆకాశము, జలము, అగ్ని, దేవతలు. మనుష్యులు, పశువులు, పక్షులు; చెట్లు, చేమలు, గడ్డి; గాదము, పురుగు బుట్రలు, ధర్మాధర్మములు; సత్యాసత్యములు, మంచి చెడ్డలు, ప్రియాప్రియములు, ఈసర్వస్వమును వాక్కు గదా తెలుపుచున్నది. వాక్కు లేకున్న ధర్మాధర్మములు; సత్యము, అసత్యము, మంచి, చెడ్డ, ప్రియము, అప్రియము, అను మొదలగు వీటిని తెలియుటకు రాదు. వాక్కే ఈ సమస్తమును దెలుపును; అందుచే వాక్కును బ్రహ్మమని ఉపాసింపవలెను.

స యో వాచం బ్రహ్మేత్యుపాస్తే యావద్వాచో గతం తత్రాస్య యథా కామచారో భవతి యో వాచం బ్రహ్మేత్యుపాస్తేఽస్తి భగవో వాచో భూయ ఇతి వాచో వావ భూయోఽస్తీతి తన్మే భగవాన్బ్రవీత్వితి. 2

వాక్కును బ్రహ్మమని ఉపాసించువాడు వాగ్విషయకమగు జ్ఞానమును బడసి వాక్కు ఎంతవఱకు వ్యాప్తిగలదై యుండునో, అంతవఱకు యథేచ్ఛగా విహరించునని చెప్పెను. భగవన్! వాక్కుకంటెను అధికమగు జ్ఞానము గలదా? యని నారదు డడుగగా కలదని శ్రీ సనత్కుమారుడు చెప్పెను.

## 3-వ ఖండము

### మనస్సు బ్రహ్మముగా నుపాసించుమని చెప్పుట

మనో వావ వాచో భూయో యథా వై ద్వే వామలకే ద్వే వా కోలే ద్వౌ వాక్షౌ ముష్టిరనుభవత్యేవం వాచం చ నామ చ మనోఽనుభవతి స యదా మనసా మనస్యతి మంత్రానధీయీయేత్యథాధీతే కర్మాణి కుర్వీయేత్యథ కురుతే పుత్రాగ్ంశ్చ పశూగ్ంశ్చేచ్ఛేయేత్యథేచ్ఛత ఇమం చ లోక మముంచేచ్ఛేయేత్యథేచ్ఛతే మనో హ్యాత్మా మనో హి లోకో మనో హి బ్రహ్మ మన ఉపాస్స్వేతి. 1

మనస్సు వాక్కుకంటెను గొప్పది. రెండు ఉసిరిక కాయలు లేదా రెండు రేగుకాయలు లేదా రెండు తాండ్రకాయలు, ఒకే పిడికిటియందిమిడ్చుకొనబడినట్లు మనస్సునందు నామము, మఱియు వాక్కు ఇమిడ్చుకొనబడియున్నది. అనగా మనస్సునందు అంతర్భూతములై యున్నవి. మంత్రములను ఉచ్చరింపవలెనని మనుష్యుడు మనస్సునందు ఎపుడు ఇచ్ఛయించునో అప్పుడతడు మంత్రముల నుచ్చరించును. కర్మల నాచరించవలెనని ఎపుడు సంకల్పించునో అప్పుడా కర్మల నాచరించును. పశు పుత్రాదులను పొందవలెనని ఎపుడిచ్ఛయించునో అపుడు వాటిని పొందును. ఈ లోక పరలోకముల నెపుడిచ్ఛయించునో అపుడు వాటిని పొందగలుగును. మనస్సే ఆత్మ. మనస్సే లోకము. మనస్సే బ్రహ్మము. మనస్సును బ్రహ్మముగా నుపాసింపుము.

స యో మనో బ్రహ్మేత్యుపాస్తే యావన్మనసో గతం తత్రాస్య యథా కామచారో భవతి యో మనో బ్రహ్మేత్యుపాస్తేఽస్తి భగవో మనసో భూయ ఇతి మనసోవావ భూయోఽస్తీతి తన్మే భగవాన్బ్రవీత్వితి. 2

మనస్సు బ్రహ్మమని ఉపాసించువాడు మనస్సు ఎంతవఱకు వ్యాప్తి గలదో అంతవఱకు యథేచ్ఛగా విహరించును. భగవన్! మనస్సుకంటెను గొప్పదేమైన నున్నదా? యని మరల అడుగ కలదు. ఉన్నదని సనత్కుమారుడు చెప్పెను.

### 4-వ ఖండము

సంకల్పమును బ్రహ్మముగా ఉపాసింపుమని చెప్పుట

సంకల్పో వావ మనసో భూయాన్యదా వై సంకల్పయతేఽథ మనస్యత్యథ వాచ మీరయతి తాము నామ్నీరయతి నామ్ని మంత్రా ఏకం భవంతి మంత్రేషు కర్మాణి. 1

సంకల్ప మనునది మనస్సు కంటెను గొప్పది. మనుష్యుడు సంకల్పించునపుడు మనస్సుచే ఇచ్ఛయించును. వాక్కునకు ప్రేరణ

గూయొసగును. వాక్కు నామమునందు, నామము మంత్రములయందును, మంత్రములయందు కర్మలును చేరి యున్నవి.

తాని హ వా ఏతాని సంకల్పైకాయనాని సంకల్పాత్మకాని సంకల్పే ప్రతిష్ఠితాని సమక్లృపతాం ద్యావాపృథివీ సమకల్పేతాం వాయుశ్చాకాశం చ సమకల్పంతాపశ్చ తేజశ్చ తేషాగ్ం సంక్లృప్త్యై వర్షగ్ం సంకల్పతే వర్షస్య సంక్లృప్త్యా అన్నగ్ం సంకల్పతే అన్నస్య సంక్లృప్త్యై ప్రాణాస్సంకల్పంతే ప్రాణానాగ్ంసంక్లృప్త్యై మంత్రాస్సంకల్పంతే మంత్రాణాగ్ం సంక్లృప్త్యై కర్మాణి సంకల్పంతే కర్మణాగ్ం సంక్లృప్త్యై లోకః సంకల్పతే లోకస్య సంక్లృప్త్యై సర్వగ్ం సంకల్పతే స ఏష సంకల్పస్సంకల్పముపాస్స్వేతి. 2

ఆ నామాదులు, మనస్సు మొదలగునవి సంకల్పమే చివరి ఆశ్రయముగా గలవి. అవి సంకల్పాత్మకములైనవి. సంకల్పాధారమున నుండునవి. స్వర్గము, పృథివి, వాయువు, ఆకాశము, తేజస్సు, అన్నము, ప్రాణము, మంత్రము, కర్మఫలము ఇత్యాది సమస్తమును సంకల్పించును. జగత్తంతయును సంకల్ప మయమై యున్నది. సంకల్పమును బ్రహ్మముగ నుపాసింపుము.

స యస్సంకల్పం బ్రహ్మేత్యుపాస్తే క్లృప్తాన్ వై స లోకాన్ ధ్రువాన్ ధ్రువః ప్రతిష్ఠితాన్ ప్రతిష్ఠితోఽవ్యథమానానవ్యథమానోఽభిసిధ్యతి యావత్సంకల్పస్య గతం తత్రాస్య యథాకామచారో భవతి యస్సంకల్పం బ్రహ్మేత్యుపాస్తేఽస్తి భగవస్సంకల్పాద్భూయ ఇతి సంకల్పాద్వావ భూయోఽస్తీతి తన్మే భగవాన్బ్రవీత్వితి. 3

సంకల్పమును బ్రహ్మమని ఉపాసించువాడు నిర్మింపబడిన ధ్రువలోకములకు తాను ధ్రువుడై ప్రతిష్ఠితములగు లోకములకు తాను ప్రతిష్ఠితుడై దుఃఖ రహితమగు లోకములకు తానుదుఃఖము లేనివాడై పొందును. సంకల్పము ఎంతవఱకు వ్యాప్తిగలదో అంతవఱకు యథే

చ్ఛగా విహరింప గలవాడగును. భగవన్! ఈ సంకల్పమున కంటెను గొప్పదేమైనను గలదా? యని నారదుడడుగ సనత్కుమారుడు కలదని చెప్పుచున్నాడు.

5-వ ఖండము

చిత్తమును బ్రహ్మమని ఉపాసింపుమనుట

చిత్తం వావ సంకల్పాద్భూయో యదా వై చేతయతేఽథ సంకల్పయతేఽథ మనస్యత్యథ వాచమీరయతి తాము నామ్నీరయతి నామ్ని మంత్రా ఏకం భవంతి మంత్రేషు కర్మాణి. 1

చిత్తము సంకల్పమునకంటెను గొప్పది. మనుష్యుడు చిత్తముచే కూడుకొని యున్నపుడే సంకల్పము చేయును. ఇచ్ఛయించును. వాగింద్రియమును ప్రేరణ యొనర్చును. వాక్కు నామమునందు ప్రేరణ యగును. నామమునందు మంత్రము లేకమగును. మంత్రములయందు కర్మ లేకమగును.

తాని హ వా ఏతాని చిత్తైకాయనాని చిత్తాత్మని చిత్తే ప్రతిష్ఠితాని తస్మాద్యద్యపి బహువిధచిత్తో భవతి నాయమస్తీత్యేవైనమాహుర్యదయం వేద యద్వాయం విద్వాన్నేత్థమచిత్తస్యాదిత్యథయద్యల్పవిచ్చిత్తవాన్భవతి తస్మా ఏవోత శుశ్రూషంతే చిత్తగ్ం హ్యేవైషామేకాయనం చిత్తమాత్మా చిత్తం ప్రతిష్ఠా చిత్తముపాస్వేతి. 2

ఆ నామాది సర్వమునకు చిత్తమే చివరి ఆశ్రయము. చిత్తమే వాటి యాత్మ. అవన్నియు చిత్తమునందు ప్రతిష్ఠింపబడి యున్నవి. అందువలననే ఎక్కువగా దెలిసినవాడు కూడ అచిత్తుడయినచో అనగా ఏకాగ్రత లేనివాడైన యెడల అతడు తెలిసినవాడని ఎవరును అనరు. ఇతడు తెలిసినవాడై విద్వాంసుడై యుండిన యెడల ఈ విధముగా అజ్ఞుడై అచిత్తుడై యుండడని యందురు. కొంత తెలిసిన వాడై యుండినను జనులతని మాటను విననిచ్ఛయింతురు. అందుచేత చిత్తమే అన్నిటి యొక్క చివరి ఆశ్రయము (ఇదే) ఆత్మ (ఇదే) ఆధారము. చిత్తమును బ్రహ్మముగా నుపాసింపుము.

స యశ్చిత్తం బ్రహ్మేత్యుపాస్తే చిత్తాన్ వై స లోకాన్ ధ్రువాన్ ధ్రువః ప్రతిష్ఠితాన్ ప్రతిష్ఠితోఽవ్యథమానానవ్యథమానోఽభిసిధ్యతి యావచ్చిత్తస్య గతం తత్రాస్య యథా కామచారో భవతి యశ్చిత్తం బ్రహ్మేత్యుపాస్తేఽస్తి భగవశ్చిత్తాద్భూయ ఇతి చిత్తాద్వావ భూయోఽస్తీతి తన్మే భగవాన్బ్రవీత్వితి. 3

(ఫలము) ఇట్టి చిత్తోపాసకుడు ధ్రువమగు చిత్తము గలవాడగును. మిగిలిన విషయములన్నియు పై మంత్రమునందు వలెనని తెలియవలయును. ఆ పిదప చిత్తమునకంటెను గొప్ప దేమైనేనున్నదా? యని నారదుడు అడుగగా సనత్కుమారుడు ఔను కలదని చెప్పెను.

## 6-వ ఖండము

### ధ్యానమును బ్రహ్మమని ఉపాసింపుమనుట

ధ్యానం వావ చిత్తాద్భూయో ధ్యాయతీవ పృథివీ ధ్యాయతీవాంతరిక్షం ధ్యాయతీవ ద్యౌర్ధ్యాయంతీవాపో ధ్యాయంతీవ పర్వతా ధ్యాయంతీవ దేవమనుష్యాస్తస్మాద్య ఇహ మనుష్యాణాం మహత్తాం ప్రాప్నువంతి ధ్యానాపాదాంశా ఇవైవ తే భవంత్యథ యేఽల్పాః కలహినః పిశునా ఉపవాదినస్తేఽథ యే ప్రభవో ధ్యానాపాదాంశా ఇవైవ తే భవంతి ధ్యానముపాస్స్వేతి. 1

చిత్తమునకంటెను ధ్యానము గొప్పది. అంతరిక్షము, ద్యులోకము, జలము, పర్వతములు, దేవతలు, మనుష్యులు ఈ సర్వము ధ్యానము చేయుచున్నట్లే యున్నవి. అందుచేత ఇచ్చట మానవులయందు పొంద వలసిన గొప్ప యోగ్యతను బొందువారు ధ్యానముయొక్క ఫలలేశమువలననే ఆ స్థితిని బడయుదురు. తక్కిన వారు క్షుద్రులును కలహప్రియులును పరదోషాన్వేషకులును పరుల దోషములను చెప్పువారు నగుదురు. పరోపకార పరాయణులగు ప్రభా

సంపన్నులగు వారు ధ్యాన మహాఫలము నొందుదురు. కావున ధ్యానమును బ్రహ్మముగా నుపాసింపవలయును.

స యో ధ్యానం బ్రహ్మేత్యుపాస్తే యావద్ధ్యానస్య గతం తత్రాస్య యథాకామచారో భవతి యో ధ్యానం బ్రహ్మేత్యుపాస్తేఽస్తి భగవో ధ్యానాద్భూయ ఇతి ధ్యానాద్వావ భూయోఽస్తీతి తన్మే భగవాన్బ్రవీత్వితి. 2

ఫలము పై మంత్రములయందు వలె నని గ్రహింపవలెను. భో భగవన్! ధ్యానముకంటెను గొప్పది మరేమైనను గలదా? యని నారదు డడుగగా సనత్కుమారుడు కలదని చెప్పెను.

## 7-వ ఖండము

### విజ్ఞానమును బ్రహ్మమని ఉపాసింపుమనుట

విజ్ఞానం వావ ధ్యానాద్భూయో విజ్ఞానేన వా ఋగ్వేదం విజానాతి యజుర్వేదం సామవేద మాథర్వణం చతుర్థ మితిహాస పురాణం పంచమం వేదానాం వేదం పిత్ర్యగ్ం రాశిం దైవం నిధిం వాకోవాక్యమేకాయనం దేవవిద్యాం బ్రహ్మవిద్యాం భూతవిద్యాం క్షత్రవిద్యాం నక్షత్రవిద్యాగ్ం సర్పదేవజనవిద్యాం దివం చ పృథివీం చ వాయుంచాకాశంచాపశ్చ తేజశ్చ దేవాగ్ంశ్చ మనుష్యాగ్ంశ్చ పశూగ్ంశ్చ వయాగ్ంసి చ తృణవనస్పతీన్ శ్వాపదాన్యాకీటపతంగపిపీలకం ధర్మం చాధర్మంచ సత్యంచానృతం చ సాధు చాసాధు చ హృదయజ్ఞం చాహృదయజ్ఞం చాన్నం చ రసం చేమంచ లోకమముం చ విజ్ఞానేనైవ విజానాతి విజ్ఞాన ముపాస్వేతి. 1

విజ్ఞానము ధ్యానమునకంటెను గొప్పది. విజ్ఞానముచేతనే 2-వ ఖండమున ఋగ్యజుస్సామాథర్వణ వేదములు... ఈ విషయమున ఆ యన్నియు మొదటి మంత్రమున చెప్పబడిన ప్రకారమే ఇచ్చటను తెలియబడుచున్నవని గ్రహింప వలయును.ఇవన్నియును విజ్ఞానముచేతనే కాబట్టి విజ్ఞానమును బ్రహ్మమని ఉపాసింపుము.

స యో విజ్ఞానం బ్రహ్మేత్యుపాస్తే విజ్ఞానవతో వై స లోకాన్ జ్ఞానవతో ఽభిసిద్ధ్యతి యావద్విజ్ఞానస్య గతం తత్రాస్య యథా కామచారో భవతి యో విజ్ఞానం బ్రహ్మేత్యుపాస్తేఽస్తి భగవో విజ్ఞానాద్భూయ ఇతి విజ్ఞానాద్వావ భూయోఽస్తీతి తన్మే భగవాన్బ్రవీత్వితి.2

విజ్ఞానమును బ్రహ్మమని ఉపాసించువాడు విజ్ఞాన పూర్ణమును జ్ఞాన పూర్ణము నగు లోకములను బడయును. తక్కిన విషయములు పై మంత్రము నందు వలె నని గ్రహింపవలెను. ఇక విజ్ఞానమున కంటెను శ్రేష్ఠమైన దేది యైనను గలదా? యనిన, సనత్కుమారుడు కలదని చెప్పుచున్నాడు.

### 8-వ ఖండము

### బలమును బ్రహ్మమని ఉపాసింపుమనుట

బలం వా వ విజ్ఞానాద్భూయోఽపి హ శతం విజ్ఞానవతామేకో బలవానాకంపయతే స యదా బలీ భవత్యథోత్థాతా భవత్యుత్తిష్ఠన్ పరిచరితా భవతి పరిచరన్నుపసత్తా భవత్యుపసీదన్ద్రష్టా భవతి శ్రోతా భవతి మంతా భవతి బోద్ధా భవతి కర్తా భవతి విజ్ఞాతా భవతి బలేనవై పృథివీ తిష్ఠతి బలేనాంతరిక్షం బలేన ద్యౌర్బలేన పర్వతా బలేన దేవమనుష్యా బలేన పశవశ్చవయాగ్ంసి చ తృణవనస్పతయః శ్వాపదాన్యాకీట పతంగ పిపీలకం బలేన లోకస్తిష్ఠతి బలముపాస్వేతి.1

బలము విజ్ఞానముకంటెను గొప్పది. బలము గలవాడు వందలాది విద్వాంసుల నొక్క పెట్టున భయపెట్టును. మనుష్యుడు బలము గలవాడైనచో లేచి నిలుచును. భద్రముగ లేచి నిలిచినవాడు గురువుల సమీపించి పరిచయము నొందగలడు. (ఇట్టి) పరిచయము గలవాడు గురువుల కడకు పోవును. వారి వద్దకు వెళ్ళిన వాడు ద్రష్టయగు జ్ఞానతత్త్వము నెఱుగువాడగును. మఱియు శ్రోత-వినువా డగును. బుద్ధిమంతుడుగను కర్మలు చేయ సమర్థుడు నగును. విజ్ఞాన వంతుడగును. పృథివి, అంతరిక్షము, ద్యులోకము, దేవతలు, పర్వతములు,

మనుష్యులు, పశువులు, పక్షులు, క్షీరములు, వనస్పతులు క్రిమి కీట కాది సర్వ ప్రాణులు ఎల్ల లోకములు (ఈ) బలముయొక్క మూలము ననే నిలిచి యున్నవి. కావున బలమును బ్రహ్మముగ నుపాసింపుము.

స యో బలం బ్రహ్మేత్యుపాస్తే యావద్బలస్య గతం తత్రాస్య యథా కామచారో భవతి యో బలం బ్రహ్మేత్యుపాస్తేఽస్తి భగవో బలాద్భూయ ఇతి బలాద్వావ భూయోఽస్తీతి తన్మే భగవాన్బ్రవీత్వితి. 2

బలమును బ్రహ్మమని ఉపాసించువాడు మహాబలము నొందును. ఫలము వెనుక మంత్రముల యందు వలె (మహిమ) బలము కంటెను శ్రేష్ఠమైన దేమైనను గలదా? యని నారదు డడుగ సనత్కుమారుడు కలదని చెప్పెను.

9-వ ఖండము

అన్నమును బ్రహ్మమని ఉపాసింపుమనుట

అన్నం వావ బలాద్భూయ స్తస్మాద్యద్యపి దశ రాత్రీర్నాశ్నీయాద్యద్యుహజీవేదథ వాఽద్రష్టాఽశ్రోతాఽమంతాఽబోద్ధాఽకర్తా విజ్ఞాతా భవత్యథాన్నస్యాయై ద్రష్టా భవతి శ్రోతా భవతి మంతా భవతి బోద్ధా భవతి కర్తా భవతి విజ్ఞాతా భవత్యన్నముపాస్స్వేతి.

అన్నము బలముకంటెను గొప్పది. అందుచేత పది రాత్రు లన్నము విడిచి యుండినచో అట్టివాడు బలహీనుడై చచ్చును; బ్రతికినను చూచుట యందును వినుటయందును విచారించుటయందును బుద్ధి నుపయోగించుటయందును కర్మచేయుటయందును అశక్తు డై యుండును. అన్నము ప్రాప్తించినచో అట్టివాడు విన గలుగును, చూడగలుగును, విచారింపగలుగును, బుద్ధిచే నిశ్చయించును, కర్మ చేయగలుగును, విజ్ఞానము గలవా డగును. కాబట్టి అన్నము బ్రహ్మదృష్టిచే నుపాసించుము.

స యోఽన్నం బ్రహ్మేత్యుపాస్తేఽన్నవతో వై స లోకాన్ పానవతోఽభిసిద్ధ్యతి యావదన్నస్య గతం తత్రాస్య యథా కామచారో భవతి యోఽన్నం బ్రహ్మేత్యుపాస్తేఽస్తి భగవోఽన్నాద్భూయ ఇత్యన్నాద్వావ భూయోఽస్తీతి తన్మే భగవాన్బ్రవీత్వితి. 2

అన్నము బ్రహ్మమని ఉపాసించు నతడు అన్నోదకములను బడయును. తక్కిన అర్థము మొదటివలె. ఆ పిదప నారదుడు అన్నముకంటెను గొప్ప దేదైన కలదా? యనిన సనత్కుమారుడు ఉన్నదని చెప్పెను. భగవన్! దానిని నాకు జెప్ప వలె నని నారదు డడిగెను.

## 10–వ ఖండము

### జలమును బ్రహ్మమని ఉపాసించుమనుట

ఆపో వా వాన్నాద్భూయస్య స్తస్మాద్యదా సువృష్టిర్న భవతి వ్యాధీయంతే ప్రాణా అన్నం కనీయో భవిష్యతీత్యథ యదా సువృష్టిర్భవత్యానందినః ప్రాణా భవంత్యన్నం బహు భవిష్యతీ త్యాప ఏవేమా మూర్తా యేయం పృథివీ యదంతరిక్షం యద్ద్యౌర్యత్పర్వతా యద్దేవమనుష్యా యత్పశవశ్చ వయాగ్ంసి చ తృణవనస్పతయశ్శ్వాపదాన్యా కీట పతంగ పిపీలక మాపఏవేమా మూర్తా అప ఉపాస్స్వేతి. 1

జలము అన్నముకంటెను గొప్పది. అందుచేత వర్షము తక్కువమైన అన్నము తక్కువ యగునని ప్రాణులు దుఃఖము నొందుదురు. వర్షము చక్కగా పడిన ఇక అన్నము విరివిగా దొరకునని ప్రాణులానందింతురు. ఆకారముగల ఈ మూర్తి మంతములగు పదార్థములయందు జలమే గలదు. ఇవి జల మూలముననే ఉన్నవి. ఈ పృథివి, అంతరిక్షము, ద్యులోకము, పర్వతములు, దేవతలు, మనుష్యులు, పక్షి, క్రిమి కీటకాది తృణ పర్యంతమగు సమస్తము జలమయ మైయే యున్నది. జలమును బ్రహ్మముగా నుపాసింపుము.

స యోఽపో బ్రహ్మేత్యుపాస్తే ఆప్నోతి. సర్వాన్కామాగ్ంస్తృప్తిమాన్ భవతి యావదపాం గతం తత్రాస్య యథా కామచారో

భవతి యోఽపో బ్రహ్మేత్యుపాస్తేఽస్తి భగవోఽద్భ్యో భూయ ఇత్యద్భ్యో వావ భూయోఽస్తీతి తన్మే భగవాన్బ్రవీత్వితి. 2

జలమును బ్రహ్మమని ఉపాసించువాడు సర్వ కామములను పొందును. పూర్ణ తృప్తుడగును. తక్కినది పై మంత్రముల వలె. ఈ జలమునకంటెను గొప్ప దేమైన గలదా? యని అడుగ సనత్కుమారుడు కలదని చెప్ప దొడగెను.

## 11-వ ఖండము

### తేజస్సును బ్రహ్మమని ఉపాసింపుమనుట

తేజో వా అద్భ్యో భూయస్తద్వా ఏతద్వాయుమాగృహ్యాకాశమభితపతి తదాహుర్నిశోచతి నితపతి వర్షిష్యతి వా ఇతి తేజ ఏవ తత్పూర్వం దర్శయిత్వాఽథాపస్సృజతే తదేతదూర్ధ్వాభిశ్చ తిరశ్చీభిశ్చ విద్యుద్భిరాహ్రాదాశ్చరంతి తస్మాదాహుర్విద్యోతతే స్తనయతి వర్షిష్యతి వా ఇతి తేజ ఏవ తత్పూర్వం దర్శయిత్వాఽథాపస్సృజతే తేజ ఉపాస్స్వేతి· 1

తేజస్సు జలముకంటెను గొప్పది. ఆ తేజస్సు వాయువుని గ్రహించి నిశ్చలముగ జేసి ఆకాశమున వ్యాపించి వేడి గలుగనచో అప్పుడు ఉక్కబోయును. ఉష్ణమెక్కువ యైన వర్షము వచ్చునని జనులందురు. తేజస్సు మొదట దృగ్గోచరమై జలమును పుట్టించును. ఊర్ధ్వగామి మఱియు ఊర్ధ్వమున తిర్యగ్గామియై మెఱుముతో గడగడ యని చుట్టు జుట్టును. అందుచేతనే మెఱియుచున్నది. ఉఱుముచున్నది. వర్షము వచ్చుచున్నదని యందురు. ఇట్లు తేజస్సే మొదట గపడి జలమును కలిగించును. అందుచే తేజస్సును బ్రహ్మమనుపాసింపుము.

స య స్తేజో బ్రహ్మేత్యుపాస్తే తేజస్వీ వై స తేజస్వతో లోకాన్ భాస్వతోఽపహతతమస్కానభిసిద్ధ్యతి యావత్తేజసో గతం

తత్రాస్య యథా కామచారో భవతి య స్తేజో బ్రహ్మేత్యుపాస్తేఽస్తి భగవ స్తేజసో భూయ ఇతి తేజసో వావ భూయోఽస్తీతి తస్మే భగవాన్బ్రవీత్వితి. 2

తేజస్సును బ్రహ్మమని ఉపాసించువాడు తేజస్వియై తేజస్సంపన్నములగు లోకములకు ప్రకాశకుడై తమోరహిత లోకములకు వెళ్ళును. తక్కినది పూర్వ మంత్రము వలె.

## 12-వ ఖండము

### ఆకాశమును బ్రహ్మమని ఉపాసింపుమనుట

ఆకాశో వావ తేజసో భూయానాకాశే వై సూర్యాచంద్రమసావుభౌ విద్యున్నక్షత్రాణ్యగ్ని రాకాశే నాహ్వయత్యాకాశేన శృణోత్యాకాశేన ప్రతిశృణోత్యాకాశే రమత ఆకాశేన రమత ఆకాశే జాయత ఆకాశ మభిజాయత ఆకాశముపాస్వేతి. 1

ఆకాశము తేజస్సు కంటెను గొప్పది. ఆకాశమునందే సూర్యుడు, చంద్రుడు, విద్యుత్తు, నక్షత్రములు, అగ్ని మొదలగునవి గలవు. మనుష్యు డాకాశముయొక్క సహాయము వలననే పిలుచును, వినును, మాటలాడిన దానిని మరల వినగలుగును. మానవు డాకాశమునందే క్రీడించును. క్రీడ లేకయు నుండును. ఆకాశమునందే పుట్టును. కావున ఆకాశమును బ్రహ్మమునుగా నుపాసింపుము.

స య ఆకాశం బ్రహ్మేత్యుపాస్తే ఆకాశవతో వై స లోకాన్ ప్రకాశవతోఽసంబాధానురుగాయవతోఽభిసిద్ధ్యతి యావదాకాశస్య గతం తత్రాస్య యథా కామచారో భవతి య ఆకాశం బ్రహ్మేత్యుపాస్తేఽస్తి భగవ ఆకాశాద్భూయ ఇత్యాకాశాద్వావ భూయోఽస్తీతి తస్మే భగవాన్బ్రవీత్వితి. 2

ఆకాశము బ్రహ్మమని ఉపాసించువాడు ఆకాశవంతుడు ప్రకాశవంతుడు అగును. బాధ లేని విస్తీర్ణ లోకములను పొందును. తక్కినది వెనుకటి మంత్రములవలె.

## 13- ఖండము

### స్మరణను బ్రహ్మముగా నుపాసింపుమనుట

స్మరో వా వాకాశాద్భూయ స్తస్మాద్యద్యపి బహవ ఆసీరన్న స్మరంతో నైవ తే కంచన శృణుయుర్న మన్వీరన్న విజానీరన్ యదా వావ తే స్మరేయురథ శృణుయు రథ మన్వీరన్నథ విజానీరన్ స్మరేణ వై పుత్రాన్విజానాతి స్మరేణ పశూన్ స్మరముపాస్స్వేతి. 1

స్మరణశక్తి ఆకాశమునకంటెను గొప్పది. అందుచేతనే బహుజను లుండినను స్మరణ చేయకుండిన వారు ఏమియును విన జాలరు. విచారింప జాలరు. తెలిసికొన జాలరు. వారు స్మరించుట కారంభించినచో మరల వినగలరు. విచారింప గలుగుదురు. తెలిసికొన గలిగెదరు. స్మరణచేతనే (తండ్రి) తన పుత్రుని గుర్తించును. పశువులను గుఱుతు పట్టును. స్మరణశక్తిని పరబ్రహ్మముగ నుపాసింపుము.

స యస్స్మరం బ్రహ్మేత్యుపాస్తే యావత్స్మరస్య గతం తత్రాస్య యథా కామచారో భవతి యస్స్మరం బ్రహ్మేత్యుపాస్తేఽస్తి భగవః స్మరాద్భూయ ఇతి స్మరాద్వావ భూయోఽస్తీతి తన్మే భగవాన్బ్రవీత్వితి. 2

స్మరణ బ్రహ్మమని యుపాసించువాడు మహాఫలము నొందును. తక్కినది వెనుక మంత్రములవలె.

## 14-వ ఖండము

### ఆశను బ్రహ్మమని ఉపాసింపుమనుట

ఆశా వావ స్మరాద్భూయస్యాశేద్ధో వై స్మరో మంత్రానధీతే కర్మాణి కురుతే పుత్రాగ్ంశ్చ పశూగ్ంశ్చేచ్ఛత ఇమం చ లోకమముంచేచ్ఛత ఆశాముపాస్స్వేతి. 1

ఆశ స్మరణశక్తి కంటెను గొప్పది. ఆశచే ప్రేరేపింపబడిన స్మరణశక్తియే మంత్రములను అభ్యసించును. కర్మలను చేయును

పశు పుత్రాదులను ఇహ పర లోకముల నిచ్చుచుండును. ఆశను బ్రహ్మముగా నుపాసించుము.

స య ఆశాం బ్రహ్మేత్యుపాస్త ఆశయాఽస్య సర్వే కామా స్సమృధ్యంత్యమోఘా హాస్యాశిషో భవంతి యావదాశాయా గతం తత్రాస్య యథా కామచారో భవతి య ఆశాం బ్రహ్మేత్యుపాస్తే ఽస్తి భగవ ఆశాయా భూయ ఇత్యాశాయా వావ భూయోఽస్తీతి తన్మే భగవాన్బ్రవీత్వితి. 2

ఆశను బ్రహ్మమని యుపాసించువాని సమస్త కామములు ఆశ యొక్క బలముచే పూర్ణ మగును. అతని ప్రార్థన లన్నియు సఫల మగును. ఆశను బ్రహ్మమని ఉపాసింపుము. తక్కినది వెనుకటి మంత్ర ములవలె.

## 15–వ ఖండము

### ప్రాణమును బ్రహ్మమని ఉపాసింపుమనుట

ప్రాణో వా ఆశాయా భూయాన్యథా వా అరానాభౌ సమ ర్పితా ఏవమస్మిన్ప్రాణే సర్వగ్ం సమర్పితం ప్రాణః ప్రాణేన యాతి ప్రాణః ప్రాణం దదాతి ప్రాణాయ దదాతి ప్రాణో హ పితా ప్రాణో మాతా ప్రాణో భ్రాతా ప్రాణస్స్వసా ప్రాణ ఆచార్యః ప్రాణో బ్రాహ్మణః. 1

ప్రాణమే ఆశకంటెను గొప్పది. చక్రముయొక్క కుంభమునందు దాని యాకు లెల్ల చిక్కుకొని యుండునట్లు ఈ ప్రాణమునందు సర్వము గ్రుచ్చబడి యున్నవి. సర్వ సమర్పితములై యున్నవి. ప్రాణము ప్రాణ బలముచేతనే ముందు నడచును. ప్రాణమే ప్రాణమునకు ప్రాణము నిచ్చును. ప్రాణమే తండ్రి; ప్రాణమే తల్లి; ప్రాణమే అన్న; ప్రాణమే అక్క; ప్రాణమే ఆచార్యుడు; ప్రాణమే బ్రాహ్మణుడు.

స యది పితరం వా మాతరం వా భ్రాతరం వా స్వసారం వాఽఽచార్యం వా బ్రాహ్మణం వా కించిద్భృశమివ ప్రత్యాహ

ధిక్త్వాఽస్త్విత్యేవైనమాహుః పితృహా వై త్వమసి మాతృహా వై త్వమసి భ్రాతృహా వై త్వమసి స్వసృహా వై త్వమస్యాచార్యహా వై త్వమసి బ్రాహ్మణహా వై త్వమసీతి.2

ఎవడైనను తల్లి, తండ్రి, అన్న, అక్క, ఆచార్యుడు, బ్రాహ్మణుడు అనెడి వీరితో అయోగ్యముగా బాధాకరముగా మాట్లాడినచో నీకు ధిక్కారము అని అందురు. నీవు పితృఘాతకుడవు, ఆచార్య ఘాతకుడవు, బ్రాహ్మణ ఘాతకుడవు అని యందురు.

అథ యద్య ప్యేనానుత్క్రాంతప్రాణాన్ శూలేన సమాసం వ్యతిషందహేన్నైవైనం బ్రూయుః పితృహాఽసీతి న మాతృహాసీతి న భ్రాతృహాఽసీతి న స్వసృహాఽసీతి నాఽఽచార్యహాసీతి న బ్రాహ్మణాఽసీతి. 3

వారి ప్రాణములు పోయిన పిదప శూలముచే బొడిచి అన్నిటి నొకటిగా జేర్చి లేక ఒక్కొక్కటిగా అవయవములను గాల్చినను నీవు పితృఘాతకుడవు, మాతృఘాతకుడవు, భ్రాతృ ఘాతకుడవు, స్వసృ ఘాతకుడవు, ఆచార్య ఘాతకుడవు, బ్రాహ్మణ ఘాతకుడవై యున్నావని ఎవరును అనుట లేదు. తాత్పర్య మేమనగా, ప్రాణము పోయిన పిదప తండ్రి మొదలగువారి దహనాది కార్యములు చేసినను అవి పితృహత్యాది పాపకార్యములు కావు. ఎందువల్ల ననగా, ప్రాణము లేనందువల్ల. కాబట్టి ప్రాణమే సర్వాధిక మైనది.

ప్రాణో హ్యేవైతాని సర్వాణి భవతి స వా ఏష ఏవం పశ్యన్నేవం మన్వాన ఏవం విజానన్నతివాదీ భవతి తంచేద్బ్రూయురతివాద్యసీత్యతి వాద్యస్మీతి బ్రూయాన్నాపహ్నువీత. 4

పిత్రాది ఈ సర్వమును ప్రాణమేయై యున్నది. ఆ ప్రాణమే ఈ సమస్తమని - చూచువాడును, విచారించువాడును, తెలిసికొను వాడును అతివాది యగును. అనగా నామాదుల కతీతమై యుండు

ప్రాణమును గుఱించి మాటలాడు వాడగును. నీవు అతివాది వని జను లనునపుడు నేనతివాదిని కానని నిరాకరింప రాదు.

## 16-వ ఖండము

### సత్యమునే చక్కగా విచారింపదగు ననుట

ఏష తు వా అతివదతి యస్సత్యేనాతివదతి సోఽహం భగవ స్సత్యేనాతివదానీతి సత్యం త్వేవ విజిజ్ఞాసితవ్యమితి సత్యం భగవో విజిజ్ఞాస ఇతి. 1

సత్య జ్ఞాన మూలమున అతివాద మొనర్చువాడే నిజమగు నతివాది యని సనత్కుమారుడు చెప్పెను. భగవన్! నేను సత్యజ్ఞాన మును బడసి అతివాదమును చేయువాడ నగుదునని నారదుడు తన కోర్కెను తెలిపెను. అయ్యా! సత్యమునే తెలిసికొనుట కిచ్ఛయింప వలెనని సనత్కుమారు డనెను. అంత భగవన్! నేను సత్యమునే తెలిసికొన నిచ్ఛయించెద నని నారదుడు బదులు చెప్పెను.

## 17-వ ఖండము

### విజ్ఞానమునే విశేష రూపముచే జిజ్ఞాస చేయదగు ననుట

యదా వై విజానాత్యథ సత్యం వదతి నా విజానన్ సత్యం వదతి విజానన్నేవ సత్యం వదతి విజ్ఞానం త్వేవ విజిజ్ఞాసితవ్యమితి విజ్ఞానం భగవో విజిజ్ఞాస ఇతి. 1

మనుష్యుడు తెలిసినట్లైన సత్యమునే మాటలాడును. తెలియని వాడు సత్యమును మాటలాడ జాలడు. సత్యము నరసియే సత్యమును మాటలాడును. కావున విజ్ఞానమును దెలియ నిచ్ఛయింప వలెనని సనత్కుమారు డనెను.

## 18-వ ఖండము

### మతిని చక్కగా జిజ్ఞాస చేయవలయుననుట

యదా వై మనుతేఽథ విజానాతి నామత్వా విజానాతి

మత్వైవ విజానాతి మతి స్త్వేవ విజిజ్ఞాసితవ్యేతి మతిం భగవో విజిజ్ఞాస ఇతి. 1

మనుష్యుడు మనన మొనర్చినపైన తెలిసికొనును. మననము చేయకనే తెలిసికొన జాలడు. మనన శక్తియే తెలిసికొన దగినదని సనత్కుమారు డనెను. భగవన్! ఆ మనన శక్తిని దెలియ నిచ్ఛయింతునని నారదుడు పలికెను.

## 19-వ ఖండము

### శ్రద్ధను గురించిన జిజ్ఞాస

యదా వై శ్రద్దధాత్యథ మనుతే నాశ్రద్దధన్మనుతే శ్రద్దధదేవ మనుతే శ్రద్ధా త్వేవ విజిజ్ఞాసితవ్యేతి శ్రద్ధాం భగవో విజిజ్ఞాస ఇతి. 1

మనుష్యుడు శ్రద్ధాయుక్తుడైనచో మననము చేయగలుగును. శ్రద్ధ లేని యెడల మననము చేయ జాలడు. శ్రద్ధ తెలిసికొన దగినదై యున్నదని సనత్కుమారు డనెను. భగవంతుడా! నేనా శ్రద్ధను తెలియ నిచ్ఛయించుచున్నానని నారదు డనెను.

## 20-వ ఖండము

### నిష్ఠను గురించిన జిజ్ఞాస

యదా వై నిస్తిష్ఠత్యథ శ్రద్దధాతి నానిస్తిష్ఠఞ్ఛ్రద్దధాతి నిస్తిష్ఠన్నేవ శ్రద్దధాతి నిష్ఠా త్వేవ విజిజ్ఞాసితవ్యేతి నిష్ఠాం భగవో విజిజ్ఞాస ఇతి. 1

మనుష్యునకు గురు శుశ్రూషాది నిష్ఠ యుండిన నతడు శ్రద్ధాయుక్తు డగును. నిష్ఠ లేకుండిన శ్రద్ధ గలుగడు. నిష్ఠను దెలియ దగునని సనత్కుమారుడు చెప్పెను. భగవంతుడా! నేను నిష్ఠను దెలియ నిచ్ఛయించు వాడనని నారదు డనెను.

## 21-వ ఖండము

### కృతిని గురించిన జిజ్ఞాస

యదా వై కరోత్యథ నిస్తిష్ఠతి నాకృత్వా నిస్తిష్ఠతి కృత్వైవ

ని స్తిష్ఠతి కృతి_స్త్వేవ విజిజ్ఞాసితవ్యేతి కృతిం భగవో విజిజ్ఞాస ఇతి. 1

మనుష్యుడు కర్మ నాచరించు నపుడు నిష్ఠ గల వాడగును. కర్మ చేయక నిష్ఠ గలవాడు కాడు. కర్మ తెలిసికొన దగినదని సనత్కుమారు డనెను. భగవంతుడా! నేను కర్మను దెలియ నిచ్ఛయించుచున్నానని నారదు డనెను.

22-వ ఖండము

సుఖమును గుఱించిన జిజ్ఞాస

యదా వై సుఖం లభతేఽథ కరోతి నాసుఖం లబ్ధ్వా కరోతి సుఖమేవ లబ్ధ్వా కరోతి సుఖం త్వేవ విజిజ్ఞాసితవ్య మితి సుఖం భగవో విజిజ్ఞాస ఇతి.

సుఖము ప్రాప్త మగుచుండిన తన ఉద్దేశ్యము నెఱవేరుచుండిన మనుష్యుడు కర్మ చేయును. సుఖప్రాప్తి గాకున్న కర్మ చేయడు. సుఖ మనగా నేమి? దీనిని దెలిసికొన వలెనని సనత్కుమారు డనెను. భగవన్! సుఖము దెలియ నిచ్ఛయించు చున్నానని నారదు డడిగెను.

23-వ ఖండము

బ్రహ్మమును గుఱించిన జిజ్ఞాస

యో వై భూమా తత్సుఖం నాల్పే సుఖమ_స్తి భూమైవ సుఖం భూమాత్వేవ విజిజ్ఞాసితవ్య ఇతి భూమానం భగవో విజిజ్ఞాస ఇతి. 1

ఏది అత్యంత విపులమును అనంతమునై యున్నదో అదే సుఖమయము. అదే భూమ. అత్యంత వ్యాపకమై తెలిసికొన దగినదై యున్నదని సనత్కుమారు డనెను. భగవంతుడా! భూమతత్త్వమును దెలియ నిచ్ఛయించుచున్నానని నారదుడు అనెను.

24-వ ఖండము

బ్రహ్మమే అమృతమై యున్నది

యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి స భూమా అథ యత్రాన్యత్పశ్యత్యన్యచ్ఛృణోత్యన్యద్విజానాతి తదల్పం

యో వై భూమా తదమృతమథ యదల్పం తన్మర్త్యగ్ం స భగవః కస్మిన్ప్రతిష్ఠిత ఇతి స్వే మహిమ్నీతి యది వా న మహిమ్నీతి. 1

ఏ స్థితియందు మానవుడు తనకంటె వేఱగు (రెండవ) దానిని చూచుట లేదో, వినుట లేదో, తెలియుట లేదో, అదే భూమ యను బ్రహ్మస్థితి. ఏ స్థితియందు రెండవ దానిని చూచునో, తెలియునో, అది అల్పస్థితి (అనాత్మ). భూమ యనునదే అమృతము. అల్ప మను నదే మర్త్యము. మరణశీల మని సనత్కుమారుడు చెప్పెను. ఓ భగవంతుడా! ఆ భూమ యనునది దేనియందు ప్రతిష్ఠితమై యున్నదని నారదు డడిగెను. తన మహిమయందే తాను ప్రతిష్ఠిత మయి యున్నది. అది నిరాలంబము; గావున అన్యాశ్రయమని చెప్పరాదు. ఇట్లు సనత్కుమారుడు బోధించెను.

గో అశ్వమిహ మహిమేత్యాచక్షతే హస్తి హిరణ్యం దాసభార్యం క్షేత్రాణ్యాయతనానీతి నాహమేవం బ్రవీమి బ్రవీమీతి హో వాచాన్యో హ్యన్యస్మిన్ప్రతిష్ఠిత ఇతి. 2

ఆవు, గుఱ్ఱము, ఏనుగు, సువర్ణము, సేవకులు, భార్య, భూములు, గృహారామ క్షేత్ర విత్త పశు దాస దాసీ జను లిత్యాదిగా గల ఈ సర్వమునందు సుఖము గలదని జను లందురు. కాని నే నట్లనను. ఎందుకనగా, ఆత్మయొక్క మహిమ అన్యపదార్థము నవలంబించినది కాదు. ఆత్మ వల్లనే అన్యపదార్థములు కూడా మహిమ నొందినవై సుఖవంతములై భాసిల్లుచున్నవని తాత్పర్యము.

## 25–వ ఖండము

భూమయే (బ్రహ్మమే) సర్వత్ర సమస్తమునకు ఆత్మయై యున్నది

స ఏవాధస్తాత్స ఉపరిష్టాత్స పశ్చాత్స పురస్తాత్స దక్షిణతస్స ఉత్తరతస్స ఏవేదగ్ం సర్వమిత్యథాతోఽహంకారాదేశ ఏవాహమేవాధస్తాదహముపరిష్టాదహం పశ్చాదహం పురస్తాదహం దక్షిణతోఽహముత్తరతోఽహమేవేదగ్ం సర్వమితి. 1

అదియే (భూమయే) క్రింద, మీాద, వెనుక, ముందు, దక్షిణ మునను, ఉత్తరమునను, వేయేల! అదే ఇదంతయునై యున్నది. ఇక అహంకారాదేశము చెప్పబడుచున్నది. నేనే పై భాగమునను, దిగువ భాగమున, వెనుక. ముందు, దక్షిణోత్తరములయందున్నాను. నేనే ఈ సర్వమునై యున్నాను. ఇచ్చట అహ మనిన నేనను స్మృతిప్రత్యయాస్పద మగు భూమయే నని గ్రాహ్యము. అహంకార మని అర్థము గాదు.

అథాత ఆత్మాదేశ ఏవాత్మైవాధస్తాదాత్మోపరిష్టాదాత్మా పశ్చాదాత్మా పురస్తాదాత్మా దక్షిణత ఆత్మోత్తరత ఆత్మైవేదగ్ం సర్వమితి స వా ఏష ఏవం పశ్యన్నేవం మన్వాన ఏవం విజానన్నాత్మరతి రాత్మక్రీడఆత్మమిథునఆత్మానందఃస స్వరాడ్భవతి తస్య సర్వేషు లోకేషు కామచారో భవతి అథ యేఽన్యథాఽతో విదు రన్య రాజాన స్తే క్షయ్యలోకా భవంతి తేషాగ్ం సర్వేషు లోకేష్వ కామచారో భవతి. 2

ఇక ఆత్మయొక్క ఆదేశము: ఆత్మయే క్రిందను, ఆత్మయే మీాదను, వెనుక, ముంగిటను, దక్షిణమునను, ఉత్తరమునను ఉన్నది. అదే ఇదంతయును. అదే చూచునదియు, మననము చేయునదియు, తెలిసికొనునదియు. ఆత్మయందే రతుడై ఆత్మతో క్రీడించువాడును, ఆత్మయే తోడని తెలిసినవాడై, ఆత్మానంద మనుభవించువాడు స్వరాట్టగును. అతడు సర్వలోకములయందు యథేచ్ఛగా విహరించువాడగును. ఇందులకు విపరీత జ్ఞానము గలవారు అర్థాత్ ఈ యథార్థ జ్ఞానము లేనివారు అన్యుల కధీనులై యుందురు. వారి లోకములు వారి ఫలములు నాశ మొందును. అనృతాభిసంధి గలవారై అనిత్యములగు లోకములను బొంది అజ్ఞులు అస్వతంత్రులై యుందురని అర్థము.

## 26-వ ఖండము

అవ.: ఆత్మదర్శనముచే సర్వప్రాప్తి. ఆహారశుద్ధివలన చిత్త

శుద్ధి, తన్మూలమున అవిద్యానివృత్తి ఏర్పడుననుట.

తస్య హ వా ఏతస్యైవం పశ్యత ఏవం మన్వానస్యైవం విజానత ఆత్మతః ప్రాణ ఆత్మత ఆశాఽఽత్మతః స్మర ఆత్మతః ఆకాశ ఆత్మత స్తేజ ఆత్మత ఆప ఆత్మత ఆవిర్భావతిరోభావా వాత్మతోఽన్న మాత్మతో బల మాత్మతో విజ్ఞాన మాత్మతో ధ్యాన మాత్మతశ్చిత్త మాత్మతస్సంకల్ప ఆత్మతో మన ఆత్మతో వా గాత్మతో నా మాత్మతో మంత్రా ఆత్మతః కర్మాణ్యాత్మత ఏ వేదగ్ం సర్వమితి.1

ఇట్లు పై విధముగా సర్వాత్మ భావనచే చూచువాని, మనన మొనర్చువాని, తెలియువాని ఆత్మాధారముననే అనగా ఆయాత్మ నుండియే ప్రాణము, ఆశ, స్మరణ, ఆకాశము, తేజస్సు, జలము, ఆవిర్భావ తిరోభావములు, అన్నము, బలము, విజ్ఞానము, ధ్యానము, చిత్తము, సంకల్పము, మనస్సు, వాక్కు, నామము, మంత్రము, కర్మ ఈ సమస్తముయొక్క యుత్పత్తియై యున్నది. ఆత్మనుండియే ఇవన్ని యును కలిగినవని తెలియ వలయును.

తదేష శ్లోకః న పశ్యో మృత్యుం పశ్యతి న రోగం నోత దుఃఖతాగ్ం సర్వగ్ం హ పశ్యః పశ్యతి సర్వమాప్నోతి సర్వశ ఇతి స ఏకధా భవతి త్రిధా భవతి పంచధా సప్తధా నవధా చైవ పునశ్చైకాదశః స్మృతః శతం చ దశ చైకశ్చ సహస్రాణి చ విగ్ంశతిః. ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిస్సత్త్వశుద్ధౌ ధ్రువా స్మృతిః. స్మృతిలంభే సర్వ గ్రంథీనాం విప్రమోక్షః తస్మై మృదితకషాయాయ తమసః పారం దర్శయతి భగవాన్ సనత్కుమార స్తగ్ంస్కంద ఇత్యాచక్షతే తగ్ం స్కంద ఇత్యాచక్షతే. 2

ఈ విషయమున ఈ మంత్రము గలదు —

ఇట్టి బ్రహ్మసాక్షాత్కారానుభవికి మృత్యువు, రోగము, దుఃఖము ఇత్యాదులు అత్యంతాభావము. అతడు సర్వమును తెలిసికొనువాడు. అన్నియును బడయును. సర్వత్ర సర్వము పొందును, ఉండినవాడు ఆతఁ

యొక్కడే. తన లీలగా ఒక్కడే ఇద్దఱు, ముగ్గురు, ఐదుగురు, ఏడు గురు, తొమ్మండ్రు మఱియు పదునొకండ్రనియు చెప్పబడును. వేయేల! వందలాది, అంతేల! ఎన్నో వేలు, అసంఖ్యాకముగ నగును. సర్వ స్వరూపుడతడే నని అర్థము. (సంభవ ప్రమాణ రీత్యా ఈ విషయాన్వయము) ఆహార శుద్ధి మైన సత్వశుద్ధి యగును. అనగా అంతఃకరణశుద్ధి. సత్వ శుద్ధి మైన స్మరణశక్తి స్థిర మగును. స్మృతి దృఢపడిన సర్వ సంశయములు బాయును. ఈ విధముగా దోషములచే ముక్తుడైన నారదునకు భగవంతుడగు సనత్కుమారుడు అవిద్య కవ్వల నున్న బ్రహ్మతత్త్వమును (భూమవిద్యను) బోధించెను. ఇతనికే స్కందు డనియు పేరు. స్కందఅనగా చీల్చివైచి దాటివైచి వెళ్ళువాడని అర్థము.

---

## 8–వ ప్రపాఠకము 1–వ ఖండము

### ఆత్మయే పరమ సత్యమై యున్నది

అథ యదిదమస్మిన్ బ్రహ్మపురే దహరం పుండరీకం వేశ్మ దహరోఽస్మిన్నంతరాకాశ స్తస్మిన్ యదంత స్తదన్వేష్టవ్యం తద్వావ విజిజ్ఞాసితవ్య మితి. 1

ఇక ఈ బ్రహ్మపురమునందు అనగా మానవ దేహమునందు, ఈ హృదయమునందు చిన్నదగు కమలము ఒకటి గలదు. అందు సూక్ష్మమగు అంతరాకాశమున్నది. దాని అంతరమందు ఏమున్నదను నది విచారార్హము.

తం చేద్బ్రూయుర్యదిదమస్మిన్ దహరం బ్రహ్మపురే పుండరీకం వేశ్మ దహరోఽస్మిన్నంతరాకాశః కిం తదత్ర విద్యతే యదన్వేష్టవ్యం యద్వావ విజిజ్ఞాసితవ్యమితి. స బ్రూయాత్. 2

ఈ బ్రహ్మపురమునందుండు చిన్నకమలములో సూక్ష్మమగు ఆకాశమున్నదో అందేమున్నది? ఏమి? శోధింప దగును: ఏమి

తెలిసికొనదగునని జను లడిగిన అనగా శిష్యు డడుగ గురుడు చెప్ప వలసిన దేమనిన,

యావాన్ వా అయమాకాశస్తావానేషోఽంతర్హృదయ ఆకాశ ఉభే అస్మిన్ ద్యావా పృథివీ అంతరేవ సమాహితే ఉభావగ్నిశ్చ వాయుశ్చ సూర్యాచంద్రమసా వుభౌ విద్యున్నక్షత్రాణి యచ్చా స్యేహాస్తి యచ్చ నాస్తి సర్వం తదస్మిన్ సమాహితమితి. 3

వెలుపలి ఆకాశము ఎంత అనంతమై యున్నదో అంతే హృదయమునందలి ఆకాశమును గలదు. ద్యులోకము, పృథివి ఇవి ఇందే యున్నవి. అగ్ని, వాయువు, సూర్యుడు, చంద్రుడు, విద్యుత్తు, నక్షత్రములు ఇచ్చట ఉండినవియు లేనివియు సర్వము దీనియందు స్థితమై యున్నది. నిరుపాధికమగు బ్రహ్మోపాసనార్థమైన హృద యాకాశమందు సర్వజగత్ కల్పన యని ఇందలి భావము.

తం చేద్బ్రూయురస్మిగ్ంశ్చేదిదం బ్రహ్మపురే సర్వగ్ం సమా హితగ్ం సర్వాణి చ భూతాని సర్వే చ కామా యదైతజ్జరా వా ప్నోతి ప్రధ్వగ్ంసతే వా కిం తతోఽతిశిష్యత ఇతి. 4

ఈ బ్రహ్మపురమునందు ఇదంతయును ఈ అన్నిభూతములును సమస్త కామములును అంతర్భూతమై యున్నచో ఈ శరీరమునకు ముదిమి గలిగిన, మరణ మేర్పడిన ఇందుండునవి ఏమగుననిన, ఘట నాశానంతరము అందలి ఆకాశము నశించనట్లు హృదయాకాశము నందలి యివి నశించవని చెప్పుచున్నారు.

స బ్రూయాన్నాస్య జరయైతజ్జీర్యతి న వధేనాస్య హన్యత ఏతత్సత్యం బ్రహ్మపురమస్మిన్కామాస్సమాహితా ఏష ఆత్మాఽప హతపాప్మా విజరో విమృత్యుర్విశోకో విజిఘత్సోఽపిపాసస్సత్య కామః సత్యసంకల్పో యథా హ్యేవేహ ప్రజా అన్వావిశంతి యథాఽనుశాసనం యం య మంతమభికామా భవంతి యం జనపదం యం క్షేత్రభాగం తం తమేవోపజీవంతి. 5

శరీరముయొక్క ముదిమిచే ఇది (ఈయంతరాకాశము) ముదిమి నొందుట లేదు. దీనివధచే ఇది వధింపబడుట లేదు. అనగా చచ్చుట లేదు. ఈ బ్రహ్మపురము సత్యమై యున్నది. ఇందు సర్వకామములు అంతర్భూతములై యున్నవి. ఇదే ఈ అంతరాకాశమే ఆత్మ. ఇతడు (అంతర్యామి) పాపరహితుడు; ముదిమిలేనివాడు; చావు లేనివాడు; శోకరహితుడు; ఆకలి దప్పులు లేని వాడు; సత్యకాముడు; సత్య సంకల్పుడు. ఈ లోకమునందు రాజాజ్ఞ ననుసరించి ప్రజలు నడుచునట్లు తమ తమ ఇచ్ఛల ననుసరించి తత్తద్దేశ కాల వస్తు భూభాగముల నాశ్రయించి ప్రాణులు జీవించునట్లు ఆత్మజ్ఞానము లేనివారు తమ తమ కోరిక లీడ్చుకొని వెళ్ళిన లోకములకు వెళ్ళుదురు. దీని అన్వయము ఈ ముందు మంత్రమునందు గలదు.

తద్యథేహ కర్మజితో లోకః క్షీయత ఏవమేవాముత్ర పుణ్యజితో లోకః క్షీయతే తద్య ఇహాత్మాన మననువిద్య వ్రజంత్యేతాగ్ంశ్చ సత్యాన్కామాగ్ం స్తేషాగ్ం సర్వేషు లోకేష్వకామచారో భవత్యథ య ఇహాత్మానమనువిద్య వ్రజంత్యేతాగ్ంశ్చ సత్యాన్కామాగ్ం స్తేషాగ్ం సర్వేషు లోకేషు కామచారో భవతి.6

ఈ లోకమునందు కర్మచే గలిగిన ఫలము క్షయ మొందునట్లు అచ్చటను (పరలోకమునందు) పుణ్యముచేత లబ్ధమైన ఫలము నాశ మొందును. అదియును శాశ్వతము గాదని అర్థము. అందుచేత ఇహమునందు ఆత్మతత్త్వమును మఱియు సత్యకామములను తెలిసికొనకనే ఇచ్చటినుండి పరలోకమునకు బోయినవారు ఆ లోకమున పరావలంబులగుదురు. ఇచ్చటనే ఆత్మను మఱియు సత్యకామముల నెఱిగినవారు సర్వలోకములందును రాజువలె స్వతంత్రముగా విహరింతురు.

## 2—వ ఖండము

అవ: దహరాకాశోపాసనా ఫలసిద్ధి నొందిన జ్ఞానియొక్క కామచారిత్వవర్ణన.

స యది పితృలోకకామో భవతి సంకల్పాదేవాస్య పితరస్సము త్తిష్ఠంతి తేన పితృలోకేన సంపన్నో మహీయతే. 1

జ్ఞాని పితృలోకములోనివారిని ఇచ్ఛయించిన అతని సంకల్ప మాత్రముచే పితరు లతని కడకు వచ్చెదరు. అతడు పితృలోకమును బడసి మహిమ గలవా డగును.

అథ యది మాతృలోకకామో భవతి సంకల్పాదేవాస్య మాత రస్సము త్తిష్ఠంతి తేన మాతృలోకేన సంపన్నో మహీయతే. 2

ఇక అతడు మాతృలోకమువారిని ఇచ్ఛయించిన సంకల్ప మాత్రముచే మాతృ దేవతలు అతని కడకు వచ్చెదరు. అతడు మాతృ లోకమును బడసి మహిమ గలవా డగును.

అథ యది భ్రాతృలోక కామో భవతి సంకల్పాదేవాస్య భ్రాతరస్సము త్తిష్ఠంతి తేన భ్రాతృలోకేన సంపన్నో మహీయతే. 3

అతడు భ్రాతృలోకమును అన్నదమ్ములను ఇచ్ఛయించిన సంకల్పమాత్రమున భ్రాతృలోకవాసు లతనికడకు వచ్చెదరు. అతడు భ్రాతృలోకమును బొంది మహిమ గలవా డగును.

అథ యది స్వసృలోకకామో భవతి సంకల్పాదేవాస్య స్వసార స్సము త్తిష్ఠంతి తేన స్వసృలోకేన సంపన్నో మహీయతే. 4

అతడు స్వసృలోకమువారిని అనగా అక్కచెల్లెండ్రను ఇచ్ఛ యించిన సంకల్పమాత్రమున వార తని కడకు వచ్చెదరు. అతడు స్వసృ లోకమునకు వెళ్ళి మహిమ గలవా డగును.

అథ యది సఖిలోకకామో భవతి సంకల్పాదేవాస్య సఖాయ స్సము త్తిష్ఠంతి తేన సఖిలోకేనసంపన్నో మహీయతే. 5

అతడు సఖుల లోకమును స్నేహితులను ఇచ్ఛయించిన సంకల్ప మాత్రమున స్నేహితు లతని కడకు వచ్చెదరు. ఆ లోకమునకు వెళ్ళి అతడు మహిమ గలవా డగును.

అథ యది గంధమాల్యలోకకామో భవతి సంకల్పాదేవాస్య గంధమాల్యే సముత్తిష్ఠత స్తేన గంధమాల్యలోకేన సంపన్నో మహీయతే. 6

అతడు గంధమాల్యాదులను ఇచ్ఛయించిన సంకల్పమాత్రమున ఆ గంధమాల్యాదు లతని కడకు వచ్చును. ఆ లోకమునకు వెళ్ళి అచట మహిమ గలవా డగును.

అథ యద్యన్నపానలోకకామో భవతి సంకల్పాదేవాస్యాన్నపానే సముత్తిష్ఠత స్తేనాన్నపానలోకేన సంపన్నో మహీయతే. 7

అతడు అన్నపానాదులను ఇచ్ఛయించిన అన్నపానాదులు సంకల్పమాత్రమున అతని కడకు వచ్చును. అతడు ఆ లోకమునకు వెళ్ళి మహిమ గలవా డగును.

అథ యది గీతవాదితలోకకామో భవతి సంకల్పాదేవాస్య గీతవాదితే సముత్తిష్ఠత స్తేనగీతవాదితలోకేన సంపన్నో మహీయతే. 8

అతడు గీతవాద్యాదులను ఇచ్ఛయించిన అవి వాని సంకల్పమాత్రమున నతని కడకు వచ్చును. అతడు సంగీత వాద్యాదిలోకమునకు వెళ్ళి అచ్చట మహిమ నొందును.

అథ యది స్త్రీలోకకామో భవతి సంకల్పాదేవాస్య స్త్రియస్సముత్తిష్ఠంతి తేన స్త్రీలోకేన సంపన్నో మహీయతే. 9

అతడు స్త్రీలోకమును (స్త్రీలను) ఇచ్ఛయించిన సంకల్పమాత్రముననే స్త్రీలతని కడకు వచ్చెదరు. అతడాలోకమునకు జేరి మహిమ గలవా డగును.

యం యమంతమభికామో భవతి యం కామం కామయతే సోఽస్య సంకల్పాదేవ సముత్తిష్ఠతి తేన సంపన్నో మహీయతే. 10

ఏయే లోకముల నత డిచ్ఛయించునో మఱియు నేయే కామములను గుఱించి అతడు కామించునో అవి వాని సంకల్పమాత్రముననే

అతనికి ప్రాప్తమగును. వాటిని పొంది అతడు మహిమ గలవాడగును. తాత్పర్య మేమన, ఈ ఉపాసకుడు దేహ వియోగానంతరము తన ఇచ్ఛానుసారము ఫలములను బడయునని భావము. సంకల్ప సిద్ధి గల ఉపాసకు డని అర్థము.

3-వ ఖండము

అవ: ఆత్మయొక్క సత్యకామములు లౌకిక ప్రజ్ఞచే మూయబడి యున్నవి.

త ఇమే సత్యాః కామా అనృతాపిధానా స్తేషాగ్ం సత్యానాగ్ం సతామనృతమపిధానం యో యో హ్యస్యేతః ప్రైతి న తమిహదర్శనాయ లభతే. 1

(ఆత్మయొక్క) సత్యకామములు అసత్యాముచే మూయబడి యున్నవి. అనగా స్వరూప భూతమగు నిరాలంబమైన ఆనందము విషయేచ్ఛచే మూయబడి యున్నది. ఆ ఆత్మకామములు సత్యమై యుండి నను అసత్యముగ లౌకిక ప్రజ్ఞచే ఆవరింపబడి యున్నవి. ఇచ్చటినుండి వెడలి పోయిన వాని దర్శనము మరల ఈ లోకమునందు గాదు.

అథ యే చాస్యేహ జీవా యే చ ప్రేతా యచ్చాన్యదిచ్ఛన్న లభతే సర్వం తదత్రగత్వా విందతేఽత్రహ్యస్యైతే సత్యాః కామా అనృతాపిధానా స్తద్యథాపి హిరణ్యనిధిం నిహిత మక్షేత్రజ్ఞా ఉపర్యుపరి సంచరంతో న విందేయు రేవమేవేమాస్సర్వాః ప్రజా అహరహర్గచ్ఛంత్య ఏతం బ్రహ్మలోకం న విందంత్యనృతేన హి ప్రత్యూఢాః. 2

ఇచ్చట బ్రతికియున్నవారిని, మఱియు చచ్చి పోయిన వారిని బంధువులను అతడిచ్చట ఇచ్ఛయించినను దొరకక యుండిన అన్ని పదార్థములును అతని కచ్చట (బ్రహ్మలోకమున) దొరకును. అతని ఈ సత్యకామము లెల్ల అసత్యముచే ఆవరింపబడి యున్నవి. ఎట్లు భూగతమై యుండు ధనము నెఱుగని వారు అనుదినము దానిపై బారాడుచుండినను ఆ ద్రవ్యము నెట్లు పొంద జాలరో అదే విధముగ

ఈ సమస్త ప్రజలును అనుదినము బ్రహ్మలోకమునకు (సుషుప్తియందు) బోవుచుండినను అసత్యముచే మోహితులై వాటిని ఆ సత్యకామాదు లను పొంద జాలరు. తెలిసికొన జాలరని భావము.

స వా ఏష ఆత్మా హృది తస్యైతదేవ నిరుక్తగ్ం హృద్యయ మితి తస్మాద్ధృదయ మహరహర్వా ఏవంవిత్స్వర్గం లోకమేతి. 3

అట్టి ఈ యాత్మ హృదయమునం దున్నాడు. "హృది అయం" హృద్యయమునందు (ఆత్మ) యున్నదని అర్థము. ఇట్లు దెలిసినవాడు అనుదినము స్వర్గమునకు బోవును.

అథ య ఏష సంప్రసాదోఽస్మాచ్ఛరీరాత్సముత్థాయ పరం జ్యోతిరుపసంపద్య స్వేన రూపేణాభినిష్పద్యత ఏష ఆత్మేతి హోవా చైతదమృతమభయమేతద్బ్రహ్మేతి తస్య హ వా ఏతస్య బ్రహ్మణో నామ సత్యమితి. 4

ఇక నీ శాంత సుప్రసన్నాత్మ (వ్యక్తి) ఈ శరీరమును వీడి పరంజ్యోతి యగు తత్త్వానుభవమును బడసి స్వస్వరూప జ్ఞాన యుక్త మగును. ఆ స్వరూపమే ఆత్మ. ఈ విధముగ నతడు జెప్పెను. ఇదే అమృతము, అభయము, బ్రహ్మము. ఈ బ్రహ్మముయొక్క నామము సత్యము.

తాని హ వా ఏతాని త్రీణ్యక్షరాణి సతీయమితి తద్యత్సత్త దమృతమథ యత్తి తన్మర్త్యమథ యద్యం తేనోభే యచ్ఛతి యదనే నోభే యచ్ఛతి తస్మాద్యమహరహర్వా ఏవంవిత్స్వర్గం లోకమేతి. 5

స-తీ-యం-అని దానికి సత్యమునకు మూ డక్షరములు గలవు. స త్తనునది అమృతము. తీ యనునది మర్త్యము. యమ్ అనునది రెండింటిని కలుపుటచే అది యం అనబడును. ఇట్లు దెలిసిన వా డను దినము స్వర్గలోకమును అనగా ఆత్మను పొందుచున్నాడు.

—o—

## 4–వ ఖండము

### ఆత్మమహిమ బ్రహ్మచర్యముచే బ్రహ్మలోక ప్రాప్తి

అథ య ఆత్మా స సేతుర్విధృతి రేషాం లోకానామసంభేదాయ నైతగ్ం సేతుమహోరాత్రే తరతో న జరా న మృత్యుర్న శోకో న సుకృతం న దుష్కృతగ్ం సర్వే పాప్మానోఽతో నివర్తంతే ఽపహతపాప్మా హ్యేష బ్రహ్మలోకః. 1

ఆత్మ సేతువు వలె నున్నాడు. ఈ లోకములు నాశ మొందరాదని ఆత్మ ఒక యానకట్టవలె నున్నాడు. పగలు రాత్రిలు ముదిమి చావులు శోక మోహములు పుణ్య పాపము లా సేతువును దాట జాలవు. అన్ని పాపము లచ్చటినుండి దానిని దాట జాలక మరలి వచ్చును. ఈ బ్రహ్మలోకము పాపరహితమై యున్నది.

తస్మాద్వా ఏతగ్ం సేతుం తీర్త్వాఽంధస్సన్ననంధో భవతి విద్ధస్సన్నవిద్ధో భవత్యుపతాపీ సన్ననుపతాపీ భవతి తస్మాద్వా ఏతగ్ం సేతుం తీర్త్వాఽపి నక్తమహారేవాభినిష్పద్యతే సకృద్విభాతో హ్యేవైష బ్రహ్మలోకః. 2

అందువలన ఈ సేతువును దాటిన వాడు అనగా జ్ఞానమును బొందినవాడు గ్రుడ్డివాడైనను కన్నులు గలవాడగును. గాయము గల వాడై యున్నను గాయము లేని వాడగును. దుఃఖియై యున్నను సుఖి యగును. కాబట్టి ఈ సేతువును దాటిన రాత్రి పగలగును. ఈ బ్రహ్మలోక మొక్క పెట్టున ప్రకాశ పరిపూర్ణమై యున్నది.

తద్య ఏవైతం బ్రహ్మలోకం బ్రహ్మచర్యేణానువిందంతి తేషామేవైష బ్రహ్మలోకస్తేషాగ్ం సర్వేషు లోకేషు కామచారో భవతి. 3

ఈ బ్రహ్మలోకము నెవరు బ్రహ్మచర్యముచే బడయుదురో వారిదే ఈ బ్రహ్మలోకము. వనితాది విషయ చింత లేనివారి దే. వారు సర్వలోకములయందు స్వతంత్రులై విహరించువా రగుదురు.

## 5-వ ఖండము

### బ్రహ్మచర్యముయొక్క మహిమ

అథ యద్యజ్ఞ ఇత్యాచక్షతే బ్రహ్మచర్యమేవ తద్బ్రహ్మచర్యేణ హ్యేవ యో జ్ఞాతా తం విందతేఽథ యదిష్టమిత్యాచక్షతే బ్రహ్మచర్యమేవ తద్బ్రహ్మచర్యేణ హ్యేవేష్ట్వాఽఽత్మానమనువిందతే. 1

ఇక యజ్ఞమని శిష్టులగు మానవులు దేని నందురో అది బ్రహ్మచర్యమే! జ్ఞాని బ్రహ్మచర్యముచేతనే దానిని బ్రహ్మమును బడయును. అనుభవము నొందును. హోమము చేయ "ఇష్ట" అనగా హోమము చేయబడినది యనినను బ్రహ్మచర్యమే. బ్రహ్మచర్యముచే నుండుచు పూజించి (అనుష్ఠించి) ఆత్మను బడయుదురు.

అథ యత్సత్త్రాయణమిత్యాచక్షతే బ్రహ్మచర్యమేవ తద్బ్రహ్మచర్యేణ హ్యేవ సత ఆత్మనస్త్రాణం విందతేఽథ యన్మౌనమిత్యాచక్షతే బ్రహ్మచర్యమేవ తద్బ్రహ్మచర్యేణ హ్యేవాత్మానమనువిద్య మనుతే. 2

మానవులు దేనిని సత్త్రాయణ మని యనెదరో అట్టి యజ్ఞపరంపరయును బ్రహ్మచర్యమే. మనుష్యుడు బ్రహ్మచర్యముద్వారా సద్రూపాత్మనుండి త్రాణమును బడయును. దేనిని మౌన మనెదరో అదియును బ్రహ్మచర్యమే. బ్రహ్మచర్యముచేతనే ఆత్మతత్త్వమును తెలిసి మానవుడు మననము చేయును.

అథ యదనాశకాయనమిత్యాచక్షతే బ్రహ్మచర్యమేవ తదేష హ్యాత్మా న నశ్యతి యం బ్రహ్మచర్యేణానువిందతేఽథ యదరణ్యాయనమిత్యాచక్షతే బ్రహ్మచర్యమేవ తత్తదరశ్చ హ వై ణ్యశ్చార్ణవౌ బ్రహ్మలోకే తృతీయస్యామితో దివి తదైరం మదీయగ్ంసరస్తదశ్వత్థస్సోమసవనస్తదపరాజితా పూర్బ్రహ్మణః ప్రభువిమితగ్ం హిరణ్మయమ్. 3

మానవులు అనాశకాయని లేక అమృతపదమని దేనిని చెప్పుదురో

అది బ్రహ్మచర్యమే. బ్రహ్మచర్యముచే పొందబడిన ఆత్మతత్త్వము నాశ మొందుట లేదు. అరణ్యాయన మనగా సన్న్యాస మనునది యును బ్రహ్మచర్యమే. ఇచ్చటినుండి మూడవది యగు ద్యులోకమునం దుండు బ్రహ్మలోకమునందు "అర" మఱియు "ణ్య" యను రెండు సాగరములు గలవు. అచ్చట "ఐరంమదీయ" మను సరోవరమును, సోమరసమను అశ్వత్థము, అపరాజితమను బ్రహ్మపురము సువర్ణ మయమగు హిరణ్యాగర్భ ప్రభు నిర్మిత సభామంటపమును గలదు.

తద్య ఏవైతావరం చ ణ్యం చార్ణవౌ బ్రహ్మలోకే బ్రహ్మ చర్యేణానువిందంతి తేషా మేవైష బ్రహ్మలోకస్తేషాగ్ం సర్వేషు లోకేషుకామచారో భవతి. 4

బ్రహ్మలోకమునం దుండు "అర" మఱియు "ణ్య" అను సాగరములను పొందువారే బ్రహ్మలోకముయొక్క యజమానులు. వారు సర్వ లోకములయందు స్వతంత్రముగ సంచరించ గలరు.

## 6–వ ఖండము

### హృదయ గతమైన నాడులే ఉత్క్రమణ మార్గములు

అథ యా ఏతా హృదయస్య నాడ్యస్తాః పింగళస్యాణిమ్న స్తిష్ఠంతి శుక్లస్య నీలస్య పీతస్య లోహితస్యేత్యసౌ వా ఆదిత్యః పింగళ ఏష శుక్ల ఏష నీల ఏష పీత ఏష లోహితః. 1

సూర్యునియందు పింగళ (నల్యము వన్నె) శుక్ల, నీల, పీత, లోహిత వర్ణములు వివిధకిరణములచే అగపడునట్లు ఈ హృదయము నుండి వెలువడిన నాడులు పింగళ, శుక్ల, నీల, పీత, లోహితమను వన్నెలు గల సూక్ష్మ రసముచే నిండి ఆ యా వన్నెలు గలవై యున్నవి.

తద్యథా మహాపథ ఆతత ఉభౌ గ్రామౌ గచ్ఛతీమం చాముం చైవ మేవైతా ఆదిత్యస్య రశ్మయ ఉభౌ లోకౌ గచ్ఛంతీమం

చాముం చాముష్మాదాదిత్యాత్ప్రతాయంతే తా ఆసు నాడీసు సృప్తా ఆభ్యో నాడీభ్యః ప్రతాయంతే తేఽముష్మిన్నాదిత్యే సృప్తాః 2

విశాల మగు ఒకే రాజమార్గము ఒక వైపున సమీపము నందలి గ్రామమునకు, దూరమునందలి గ్రామమునకు ఎట్లు రెండు గ్రామములకు మార్గమై యున్నదో ఆదిత్యుని కిరణములు ఇహ పరము లను నీ రెండు లోకములకు బోవును. అయ్యాదిత్యునిచే వెలువడిన కిరణములీ నాడులయందు చేరి యున్నవి. ఈ నాడులనుండి ప్రసరించిన కిరణములా యాదిత్యునియందు చేరి యున్నవి.

తద్యత్రైతత్సుప్తస్సమస్తస్సమ్ప్రసన్నస్స్వప్నం న విజానాత్యాసు తదా నాడీషు సృప్తో భవతి తన్న కశ్చన పాప్మా స్పృశతి తేజసా హి తదా సంపన్నో భవతి. 3

మనుష్యుడు నిద్రించినపుడు స్వాస్థ్య మగు పూర్ణస్థితియం దుండునపుడు స్వప్నమును గాంచుట లేదు. అప్పుడా జీవుడీ నాడుల యందు చేరి యుండును. అప్పు డతనికి ఏ పాపమును సోకుట లేదు. ఎందుకనగా, అతడు తేజస్సంపన్నుడై యుండును.

అథ యత్రైతదబలిమానం నీతో భవతి తమభిత ఆసీనా ఆహుర్జానాసి మాం జానాసి మామితి స యావదస్మాచ్ఛరీరాదను త్క్రాంతో భవతి తావజ్జానాతి. 4

మనుష్యుడు కేవలము దుర్బలుడై మరణాసన్నుడైనపుడు వాని చుట్టుప్రక్కల నుండువారు నేనెవరు నేనెవరని అడుగుదురు. శరీరము నందు జీవుడు ఉన్నంత పర్యంతము అతడు వారిని కనుగొనును.

అథ యత్రైతదస్మాచ్ఛరీరాదుత్క్రామత్యథైతైరేవ రశ్మిభి రూర్ధ్వమాక్రమతే స ఓమితి వాహోద్వామీయతే స యావత్క్షిప్యే న్మనస్తావదాదిత్యం గచ్ఛత్యేతద్వై ఖలు లోకద్వారం విదుషాం ప్రపదనం నిరోధోఽవిదుషామ్. 5

ఈ శరీరమును వీడి పోవునపుడు అతడీ కిరణములద్వారా పైకి పోవును. ఓం అనుచు పైకి పోవును. ఎంత సేపటికి మనస్సు వెళ్ళునో అంతే సమయమున అతడాదిత్యలోకమునకు బోవును. ఇదే (ఆ) లోకముయొక్క ద్వారము. జ్ఞానులు దానిని దాటి వెళ్ళుదురు. అజ్ఞానులచ్చటనే యాపబడుదురు.

తదేష శ్లోకః శతం చైకా చ హృదయస్య నాడ్యస్తాసాం మూర్ధానమభినిస్సృతైకా. తయోర్ధ్వమాయన్నమృతత్వమేతి విష్వఙ్ఙన్యా ఉత్క్రమణే భవంత్యుత్క్రమణే భవంతి. 6

ఈ విషయమున మంత్రము గలదు. హృదయమునుండి 101 నాడులు వెలువడును. అందులో నొకటి శిరఃప్రాంతమున వెళ్ళియున్నది (సుషుమ్న). తద్ద్వారా పోవువాడు అమృత స్వరూపుడగును. తక్కినవి దిక్కుదిక్కులకు తీసికొనిపోవును.

### 7-వ ఖండము

ప్రజాపతి (బ్రహ్మ)కడకు ఇంద్ర విరోచనులు వచ్చి ఉపదేశమొందుట-

య ఆత్మాఽపహతపాప్మా విజరో విమృత్యుర్విశోకో విజిఘత్సోఽపిపాసస్సత్యకామస్సత్యసంకల్పస్సోఽన్వేష్టవ్యస్స విజిజ్ఞాసితవ్యస్స సర్వాగ్ంశ్చ లోకానాప్నోతి సర్వాగ్ంశ్చ కామాన్యస్తమాత్మానమనువిద్య విజానాతీతి హ ప్రజాపతిరువాచ. 1

ఏ యాత్మ పాప రహితమో, ముదిమి, చావులు లేనిదో శోక రహితమో, ఆకలిదప్పులు లేనిదో, సత్యకామ, సత్యసంకల్పయుక్తమో అట్టి ఆత్మను శోధింప దగును. విచారింప దగును. అట్టి ఆత్మజ్ఞానమును బొందినవాడు సమస్తలోకములను సర్వకామములను బడయునని ప్రజాపతి చెప్పెను.

తద్ధోభయే దేవాసురా అనుబుబుధిరే తే హోచుర్హన్త తమాత్మానమన్విచ్ఛామో యమాత్మానమన్విష్య సర్వాగ్ంశ్చ

లోకానాప్నోతి సర్వాగ్ంశ్చ కామానితీంద్రో హైవ దేవానా మభి ప్రవవ్రాజ విరోచనోఽసురాణాం తౌహాసం విదానావేవ సమిత్పాణీ ప్రజాపతిసకాశమాజగ్మతుః. 2

ఏ యాత్మను విచారించి తెలిసికొనుటవలన సర్వ కామావాప్తి యగునో అట్టి ఆత్మను తెలిసికొన వలయునని దేవతలయందు ఇంద్రుడును, రాక్షసులయందు విరోచనుడును ఈ యిరువురు ఒకరికొకరు తెలియపఱచు కొనక సమిత్పాణులై ప్రజాపతికడ కేగిరి.

తౌ హ ద్వాత్రింశతం వర్షాణి బ్రహ్మచర్యమూషతుస్తౌహ ప్రజాపతిరువాచ కిమిచ్ఛంతావవాస్తమితి తౌ హోచతుర్య ఆత్మాఽపహతపాప్మా విజరో విమృత్యుర్విశోకో విజిఘత్సోఽపిపాసస్సత్యకామస్సత్యసంకల్పస్సోఽన్వేష్టవ్యస్స విజిజ్ఞాసితవ్యస్స సర్వాగ్ంశ్చ లోకానాప్నోతి సర్వాగ్ంశ్చ కామాన్ యస్తమాత్మానమనువిద్య విజానాతీతి భగవతో వచో వేదయంతే తమిచ్ఛంతావవాస్తమితి. 3

వారిరువురు బ్రహ్మదేవుని సన్నిధియందు 32 సంవత్సరములు బ్రహ్మచర్య వ్రతముచే నుండుచుండగా అప్పుడు మీ రేయుద్దేశముచే ఇచ్చట నున్నారని ప్రజాపతి వారినడిగెను. అంత వారు ఏ యాత్మ పాపరహితమును ముదిమి, మరణము లేనిదియును శోక రహితమును ఆకలి దప్పులు లేనిదియును సత్యకామమునై యున్నదో అట్టి ఆత్మ తత్త్వము నెఱుగుట కొఱకై ఇచ్చటికి వచ్చి యున్నామని చెప్పిరి.

తౌ హ ప్రజాపతిరువాచ య ఏషోఽక్షిణి పురుషో దృశ్యత ఏష ఆత్మేతి హోవాచైతదమృతమభయమేతద్బ్రహ్మేతథయో యం భగవోఽప్సు పరిఖ్యాయతే యశ్చాయమాదర్శే కతమ ఏష ఇత్యేష ఉ ఏవైషు సర్వేష్వంతేషు పరిఖ్యాయత ఇతి హోవాచ. 4

అప్పుడు ప్రజాపతి ఇట్లు జెప్పెను. ఈ నేత్రములయం దగపడు పురుషుడే ఆత్మ. అదే. అమృతము, అభయము. బ్రహ్మమని చెప్పెను.

ఓ భగవంతుడా! నీటియందును అద్దమునందును అగపడు పురుషు డెవ డని అడిగిరి. అతడే ఈ సర్వమునం దగపడునని ప్రజాపతి చెప్పెను.

8–వ ఖండము

అవ : విరోచనుడు సత్యము నెఱుగక భ్రమాత్మక మగు సిద్ధాంతము నెఱిగి వెనుదిరిగి వెళ్ళుట.

ఉదశరావ ఆత్మానమవేక్ష్య యదాత్మనో న విజానీథ స్తన్మే ప్రబ్రూతమితి తౌ హోదశరావేఽవేక్షాం చక్రాతే తౌ హ ప్రజాపతి రువాచ కిం పశ్యథ ఇతి తౌ హోచతుస్సర్వమేవేదమావాం భగవ ఆత్మానం పశ్యావ ఆలోమభ్య ఆనఖేభ్యః ప్రతిరూపమితి. 1

నీటి పాత్రయందు మిమ్ము జూచుకొనుడు. ఆత్మనుగుఱించి మీకు ఏమి తెలియలేదో మరల దానిని నన్ను వచ్చి ప్రశ్నించుడని ప్రజాపతి చెప్పెను. ఆ పిదప వారు నీరు గల పాత్రయందు తమ్ము తాము జూచుకొనిరి. మీ కేమి అగపడుచున్నదని ప్రజాపతి అడిగెను. భగవంతుడా! అందు మేము నఖశిఖ పర్యంతము మా పూర్ణ ప్రతిబింబమును చూచుచున్నా మనిరి.

తౌ హ ప్రజాపతిరువాచ సాధ్వలంకృతౌ సువసనౌ పరిష్కృతౌ భూత్వోఽదశరావేఽవేక్షేథామితి తౌ హ సాధ్వలంకృతౌ సువసనౌ పరిష్కృతౌ భూత్వోదశరావేఽవేక్షాం చక్రాతే తౌ హ ప్రజాపతి రువాచ కిం పశ్యథ ఇతి. 2

మరల క్షురకర్మ చేయించుకొని మంచిగుడ్డలు ధరించి చక్కగా అలంకరించుకొని నీటి పాత్రయందు జూచుకొను మని చెప్పెను. వారిరువురటులనే జేసిరి. అప్పుడు ప్రజాపతి ఇపుడు మీ కేమి యగపడు చున్నదని యడిగెను.

తౌ హోవాచతుర్యథైవేదమావాం భగవస్సాధ్వలంకృతౌ సువసనౌ పరిష్కృతౌ స్వ ఏవమేవమా భగవస్సాధ్వలంకృతౌ సువసనౌ

పరిష్కృతౌ వి త్యేష ఆత్మేతి హోవాచైతదమృతమభయమేతద్బ్రహ్మేతి తౌ హ శాంతహృదయౌ ప్రవవ్రజతుః. 3

భగవంతుడా! మేము అలంకరించుకొని యున్నటుల ఇందు ప్రతిబింబము లగపడుచున్నవి. అంత ప్రజాపతి అతడే ఆత్మ; అదే అమృతము, అభయము, బ్రహ్మమని చెప్పెను. వారు శాంతహృదయులై వెడలిపోయిరి.

తౌ హాన్వీక్ష్య ప్రజాపతిరువాచ అనుపలభ్యాత్మానమననువిద్య వ్రజతో యతర ఏతదుపనిషదో భవిష్యంతి దేవా వాఽసురా వా తే పరాభవిష్యంతీతి స హ శాంతహృదయ ఏవ విరోచనోఽసురాన్ జగామ తేభ్యోహైతాముపనిషదం ప్రోవాచాత్మైవేహ మహయ్య ఆత్మా పరిచర్య ఆత్మానమేవేహ మహయన్నాత్మానం పరిచరన్నుభౌ లోకావవాప్నోతీ మంచాముంచేతి. 4

వారు వెడలి పోయిన పిదప వారి వైపునకే చూచు ప్రజాపతి ఇట్లనుకొనెను. ఆత్మతత్త్వమును తెలియకనే వీరిరువురు పోవుచున్నారు. ఎవరు ఇదే పూర్ణ జ్ఞానమని తెలియుదురో వారు రాక్షసులే యగుగాక! లేక దేవతలే యగుగాక! నాశమొందెదరు. దేహాత్మబుద్ధి యని తాత్పర్యము. విరోచనుడు సమాధాన మొంది రాక్షసుల కడ కేగెను. వారికీ జ్ఞానమును తెలిపెను. ఈ ఆత్మనే అనగా ఛాయాత్మనే పూజింప దగును. ఇతనినే సేవింప దగును. ఈ ఆత్మ నిచ్చట పూజించి సేవించినచో మనుష్యు డిహ పరలోకములను బడయును.

తస్మాదప్యద్యేహాదదాన మశ్రద్దధాన మయజమాన మాహురాసురో బతేత్యసురాణాగ్ం హ్యేషోపనిషత్ప్రేతస్య శరీరం భిక్షయా వసనేనాలంకారేణేతి సగ్ంస్కుర్వంత్యేతేన హ్యాముం లోకం జేష్యంతో మన్యంతే. 5

అందుచేత ఇప్పుడు గూడ దాతృత్వ బుద్ధి లేని వాడును యజ్ఞము చేయని వాడును రాక్షసుడే యని జనులందురు. అసురుల తత్త్వజ్ఞాన

మీాప్రకారమున్నది. వారు చచ్చిన వాని శరీరమును అన్నవస్త్రాద్య
లంకారములచే నలంకరింతురు. మఱియు నిట్లు జేయుటచే నతడు పర
లోకమును పడయునని భావింతురు.

9–వ ఖండము

ఇంద్రుడు ప్రజాపతి కడకు మరల వచ్చి ప్రశ్నించుట

అథ హేంద్రోఽప్రాప్యైవ దేవానేతద్భయం దదర్శ యథైవ
ఖల్వాయమస్మిన్ శరీరే సాధ్వలంకృతే సాధ్వలంకృతో భవతి సువసనే
సువసనః పరిష్కృతే పరిష్కృతః ఏవమేవాయమస్మిన్నంధేఽంధో
భవతి స్రామే స్రామః పరివృక్ణే పరివృక్ణోఽస్యైవ శరీరస్య నాశమన్వేష
నశ్యతి. 1

అయితే దేవతల కడకు చేరునంత లోపలనే ఇంద్రునకీ విష
మగు సందేహమువలన భయము కలిగెను. ఈశరీరము నలంకరిం
జేసినపుడు అది శృంగారముగ నలంకరింప బడిన దానివలెను మంచి
గుడ్డలు ధరించినట్లుగను శరీరము క్షురకర్మ చేయించుకొన్నపుడు శుభ్ర
ముగా క్షురకర్మ చేయించుకొన్నట్లుగను అగపడును. అదేవిధముగా
ఈ శరీరము గ్రుడ్డిదై యుండిన గ్రుడ్డిదిగ నగపడును, శరీరము, కన్ను,
ముక్కు. వీటిచే అసహ్యముగ కానబడుచుండినపుడు అటువలెనే
రోతమై తోచును. శరీరము కుంటిదై యుండిన కుంటిదై అంగహీన
ముగ నగపడును. ఈ శరీరము నాశమైన వెంటనే అదియు నాశ
మగును గదా? ఇది ఆత్మ ఎట్లగును?

నాహమత్ర భోగ్యం పశ్యామీతి స సమిత్పాణిః పునరేయాయ
తగ్ంహ ప్రజాపతిరువాచ మఘవన్యచ్ఛాంతహృదయః ప్రావ్రాజీస్సార్ధం
విరోచనేన కిమిచ్ఛన్ పునరాగమ ఇతి సహోవాచ యథైవ
ఖల్వాయం భగవోఽస్మింఛరీరే సాధ్వలంకృతే సాధ్వలంకృతో భవతి
సువసనే సువసనః పరిష్కృతే పరిష్కృత ఏవమేవాయమస్మిన్నం
ధేఽంధోభవతి స్రామే స్రామః పరి వృక్ణే పరివృక్ణోఽస్యైవ శరీరస్య

నాశమన్వేవ నశ్యతి నాహమత్రభోగ్యం పశ్యామీతి. 2

(కాబట్టి) ఇందు నేను ఏ విధమగు సత్యమును, మంచిని గాంచుట లేదు. ఇది ఆత్మ ఎట్లగును? అని సందేహించి అతడు మరల సమిత్పాణియై ప్రజాపతికడకు వెళ్ళెను. (అప్పుడు) ప్రజాపతి విరోచనునితో గూడ సమాధాన మొంది వెడలిన నీవు మరల వచ్చితివేమి? యని అడిగెను. ఇంద్రుడు ఓ భగవంతుడా! ఈ శరీరము అలంకరింపబడినపుడు ఈ (ఛాయాత్మ) అలంకరింప బడిన దానివలె యగపడును. అలంకార హీనమైనపుడు అలంకారము లేనిదిగ నగపడును. వేయేల! ఈ సర్వ పరిణామములును శరీరము నాశ మైన యెడల అవియును నాశ మొంది పోవునవై యున్నవి. అందుచేత ఇందు నే నేశుభమును చూడలే దనెను.

ఏవమేవైష మఘవన్నితి హోవాచైతంత్వేవ తే భూయోను వ్యాఖ్యాస్యామి వసాపరాణి ద్వాత్రింశతం వర్షాణీతి సహాపరాణి ద్వాత్రిగ్ంశతం వర్షాణ్యువాస తస్మై హోవాచ. 3

ఇంద్రా! ఔను. ఇది ఇటులనే యున్నది. ఈ విషయమును నీకు మరల చెప్పెదను. మఱియు నిచ్చట 32 సంవత్సరములు బ్రహ్మచర్య వ్రతముచే నుండువాడ వగుమని ప్రజాపతి చెప్పెను. అటులనే ఇంద్రు డాచరించెను.

## 10–వ ఖండము

### స్వప్నోదాహరణచే ఆత్మతత్త్వమును దెలుపుట

య ఏష స్వప్నే మహీయమానశ్చరత్యేష ఆత్మేతి హోవాచైతదమృతమభయమేతద్బ్రహ్మేతి సహ శాంతహృదయః ప్రవవ్రాజ సహాఽప్రాప్యైవ దేవానేతద్భయం దదర్శ తద్యద్యపీదగ్ంశరీరమంధం భవత్యనంధస్స భవతి యది స్రామమస్రామో నైవైషోఽస్య దోషేణ దుష్యతి. 1

స్వప్నమునందు గొప్పతనమును బడసి విహరించునదే ఆత్మ. అదే అమృతము, అభయము, బ్రహ్మమని చెప్పెను. ఇచ్చట స్వప్నమునందుండు ఆత్మ యనిన తైజసుడగు జీవుడని మాత్ర మర్థము గ్రహింపవలెను. ఈ విషయము నాలకించి సమాధాన మొంది ఇంద్రుడు వెడలి పోయెను. అయితే దేవతల కడకు వెళ్ళి వారిని చేరునంతలోపల మరల సంశయముచే భయ మొందెను. ఈ శరీరము గ్రుడ్డిదైనపుడు ఆ స్వప్నమునందలి ఆత్మయు గ్రుడ్డిదగును. శరీరమునందు నేత్రాది ద్వారములనుండి హేయము కారుచుండినను తద్ద్వారా ఏమియును స్రవించదు. కాబట్టి అదియును శరీరదోషముచే దూషితమగును.

న వధేనాస్య హన్యతే నాస్య స్రామ్యేణ స్రామో ఘ్నంతి త్వేవైనం విచ్ఛాదయంతీవా ప్రియవేత్తేవ భవత్యపి రోదితీవ నాహమత్ర భోగ్యం పశ్యామీతి. 2

శరీరము వధింపబడినను అది వధింపబడదు (చావదు). శరీరము యొక్క రోతచే అది రోత నొందదు. ఇట్లుండియు స్వప్నమునందు ఆ స్వప్నాత్మను చంపినట్టుగను పరుగెత్త జేసినట్టుగను దుఃఖము కలిగినట్టుగను ఏడ్చినట్లుగను అగపడును. కావున ఇందు నేను ఏ పవిత్రతయును గాంచుట లేదు. ఈ స్వప్నాత్మ ఆత్మ కాదని సందేహము నొందెను.

స సమిత్పాణిః పునరేయాయ తగ్ంహ ప్రజాపతిరువాచ మఘవన్యచ్ఛాంతహృదయః ప్రావ్రాజీః కిమిచ్ఛన్పునరాగమ ఇతి స హోవాచ తద్యద్యపీదం భగవచ్ఛరీరమంధంభవత్యనంధస్స భవతి యది స్రామమస్రామో నైవైషోఽస్య దోషేణ దుష్యతి. 3

ఇట్టి సంశయ నివృత్త్యర్థమై మరల చేతులు జోడించుకొని ప్రజాపతి కడ కేగెను. ఓ దేవేంద్రా! సమాధానము నొంది వెళ్ళి యుంటివే మరల వచ్చితి వేల? యని ప్రజాపతి యడిగెను. భగవంతుడా!

ఈఆత్మ అనగా స్వప్నాత్మ శరీరము గ్రుడ్డిదయినపుడు ఇది గ్రుడ్డిది కాదు. శరీరేంద్రియద్వారమున మలము కారుచుండినపు డిది మలవంతము గాదు. ఇది శరీరేంద్రియదోషములచే దూషితము కాదు.

న వధేనాస్య హన్యతే నాస్య స్రామ్యేణస్రామో ఘ్నంతి త్వేవైనం విచ్ఛాదయంతీవాప్రియవేత్తేవ భవత్యపి రోదితీవ నాహ మత్ర భోగ్యం పశ్యామీత్యేవమేవైష మఘవన్నితి హోవాచైతం త్వేవ తే భూయోనువ్యాఖ్యాస్యామి వసాపరాణి ద్వాత్రిగ్ంశతం వర్షాణీతి సహాఽపరాణి ద్వాత్రిగ్ంశతం వర్షాణ్యువాస తస్మై హోవాచ. 4

శరీరము వధింపబడినను ఇది వధింపబడదు. శరీరముయొక్క కోతచే అది కోత నొందదు. ఇట్లుండినను (స్వప్నమునందు) దానిని స్వప్నాత్మను చంపినట్లుగను పరుగెత్తజేసినట్లుగను అది దుఃఖ మొంది నట్లుగను అగపడుచున్నది. అందుచే ఇందు నే నేశ్రేయస్సును గాంచ లేదని చెప్పెను. ఔను. ఇది నిజమే. మరల 32 సంవత్సరములు బ్రహ్మచర్యవ్రతముచే ఇచట నుండుము. తత్త్వమును నీకు జెప్పెదనని ప్రజాపతి పలికెను.

## 11-వ ఖండము

అవ : ఇంద్రుడు 101 సంవత్సరములు బ్రహ్మచర్య వ్రతముతో నుండి ఉపదేశార్హు డగుట.

తద్యత్రై౽తత్సుప్తస్సమస్తస్సంప్రసన్నః స్వప్నం న విజానాత్యేష ఆత్మేతి హోవాచైతదమృతమభయమేతద్బ్రహ్మేతి స హ శాంత హృదయః ప్రవవ్రాజ స హ ప్రాప్యైవ దేవానేతద్భయం దదర్శ నాహ ఖల్వయమేవగ్ం సంప్రత్యాత్మానం జానాత్యయమహమస్మీతి నో ఏవే మాని భూతాని వినాశమేవాపీతో భవతి నాహమత్ర భోగ్యం పశ్యామీతి. 1

ఏది సంపూర్ణ ప్రసన్నతచే నిద్రించియున్నదో ఏది (ఏ) స్వప్న మును గాంచదో అదే ఆత్మ. అదే అమృతము. అదే అభయము. అదే బ్రహ్మమని చెప్పెను. ఇంద్రు డందులకు సమాధాన మొంది వెడలి పోయెను. దేవతల కడకు పోయి చేరు నంతలో మరల నాతని కీవిధముగా సంశయము గలిగి భయము పుట్టెను. ఇది ఈ సుషుప్తాత్మ ఇప్పుడీ నిద్రయందు నే నిట్టివాడ ననునది చక్కగా తెలియుట లేదు. ఏ భూతములను తెలియుట లేదు. ఇది నాశమొందిన దానివలె నున్నది. ఇందు నేను శుభ మేమియును గాంచుట లేదని తలచెను.

స సమిత్పాణిః పునరేయాయ తగ్ంహ ప్రజాపతిరువాచ మఘ వన్యచ్ఛాంతహృదయః ప్రావ్రాజీః కిమిచ్ఛన్ పునరాగమ ఇతి సహో వాచ నాహఖల్వయం భగవ ఏవగ్ం సంప్రత్యాత్మానం జానాత్యయ మహమస్మీతి నో ఏవేమాని భూతాని వినాశ మేవాపీతో భవతి నాహ మత్ర భోగ్యం పశ్యామీతి. 2

మరల ఈ సంశయమును బాపుకొనుటకు సమిత్పాణియై ప్రజా పతి కడకు వెళ్ళెను. ఓ ఇంద్రుడా! శాంతమగు మనస్సుచే వెళ్ళిన నీవు మరల నా కడకు వచ్చితివేమి? యని అడిగెను. భగవంతుడా! నన్ను నే నిట్టివాడనే యని ఈ సుషుప్తి స్థితియందు చక్కగా తెలియుట లేదు. ఇతరమగు నీ భూతములను దెలియుట లేదు. ఇది నాశ మొందిన దానివలె నున్నది. ఇందు నే నేలాంటి శుభమును జూడలే దనెను.

ఏవమేవైష మఘవన్నితి హోవాచ ఏతం త్వేవతే భూయోనువ్యాఖ్యాస్యామి నో ఏవాన్యత్రైతస్మాద్వసాపరాణి పంచ వర్షాణీతి స హాపరాణి పంచవర్షాణ్యువాస తాన్యేకశతగ్ం సంపేదుః ఏతత్తద్యదాహు రేకశతగ్ం హ వై వర్షాణి మఘవాన్ప్రజాపతౌ బ్రహ్మచర్యమువాస తస్మై హోవాచ. 3

ఔను. ఇది నిజమే యని ప్రజాపతి పలికి ఈ విషయమై మరల

నీకు దెలిపెదను. దీనికి వేఱుగా ఏదియును ఏ ఆత్మయును లేదు. ఇంకొక 5 సంవత్సరములు బ్రహ్మచర్యవ్రతముచే నుండుమని ప్రజాపతి చెప్పెను. అటువలె ఇంద్రు డాచరించెను. మొత్త మీవిధముగా 101 సంవత్సరములు ఇంద్రుడు ప్రజాపతికడ బ్రహ్మచర్య వ్రతముచే నుండెను.

## 12–వ ఖండము

### ఇంద్రునకు ప్రజాపతి ఉపదేశించుట

మఘవన్మర్త్యం వా ఇదగ్ం శరీరమాత్తం మృత్యునా తదస్యా మృతస్యాశరీరస్యాత్మనోఽధిష్ఠానమాత్తో వై సశరీరః ప్రియాప్రియా భ్యాం న వై సశరీరస్య సతః ప్రియాప్రియయోరపహతిర స్త్యశరీరం వా వ సంతం న ప్రియాప్రియే స్పృశతః. 1

ఓ దేవేంద్రా! ఈ శరీరము మరణ యుక్తము. ఇది మృత్యు గ్రస్తము. ఇది ఆ అమృతమును అశరీరియు నగు ఆత్మయొక్క ఉపాధి. ఆత్మ సశరీరమై యుండినపుడు అహంవృత్తిచే ప్రియాప్రియము లతో గూడియుండును. శరీరాత్మబుద్ధి యున్నంతవఱకు ప్రియా ప్రియములు నాశము గావు. అశరీరి యగు ఆత్మకు ప్రియాప్రియముల స్పర్శ లేదు.

అశరీరో వాయురభ్రం విద్యుత్స్తనయిత్నురశరీరాణ్యేతాని తద్యథైతాన్యముష్మాదాకాశాత్సముత్థాయ పరంజ్యోతి రుపసంపద్య స్వేన రూపేణాభినిష్పద్యంతే ఏవమేవైష సంప్రసా దోఽస్మాచ్ఛరీరా త్సముత్థాయ పరం జ్యోతి రుపసంపద్య స్వేన రూపేణాభినిష్పద్యతే. 2

వాయువు శరీర రహితము. అటువలెనే ఆకాశము, విద్యుత్తు, పిడుగు, ఇవన్నియును శరీరము లేనివై యున్నవి. ఇవి ఆకాశమున శవ్వల వెళ్ళి పరమగు జ్యోతియందు చేరి అచ్చట స్వస్వరూపముచే వెలుగొందు చందమున,

స ఉత్తమః పురుషః స తత్ర పర్యేతి జక్షత్క్రీడన్రమమాణః

స్త్రీభిర్వా యానైర్వా జ్ఞాతిభిర్వా నోపజనగ్ం స్మరన్నిదగ్ం శరీరగ్ం స యథా ప్రయోగ్య ఆచరణే యుక్త ఏవ మేవాయమస్మింఛ్ఛరీరే ప్రాణో యుక్తః. 3

ఈ సుప్రసన్నాత్మ ఈ శరీరము నుండి వెడలి పరమ జ్యోతియం దొకటియై స్వస్వరూపమున విరాజమాన మగును. అతడే ఉత్తమ పురుషుడు. అచ్చట నతడు తా బుట్టిన శరీరమును జ్ఞప్తికి తెచ్చు కొనక స్త్రీలతోడను వాహనములతోడను సంబంధికులతోడను నవ్వుచు ఆడుచు ఆనందించుచు విహరించును. రథమునకు గుఱ్ఱము పూన్పబడి యున్నది. అనగా వాహనమై కట్టబడి యున్నది.

అథ యత్రైతదాకాశమనువిషణ్ణం చక్షుస్సచాక్షుషః పురుషో దర్శనాయ చక్షురథ యో వేదేదం జిఘ్రాణీతి స ఆత్మా గంధాయ ఘ్రాణమథ యో వేదేదమభివ్యాహరాణీతి స ఆత్మాఽభివ్యాహారాయ వాగథ యో వేదేదగ్ం శృణ్వానీతి స ఆత్మా శ్రవణాయ శ్రోత్రమ్. 4

ఎచ్చట ఈ కన్ను ఆకాశమునందు చేరి యున్నదో అదే చాక్షుష పురుషుని స్థానము. కంటియందలి ఆకాశమని భావము. అత నికి రూప గ్రహణార్థమైయే ఈ కన్ను గలదు. నే నాఘ్రాణించి చూడవలెనను జ్ఞానము గలది ఆత్మయే. అది ఆఘ్రాణించుట కొఱకు ముక్కున్నది. నేను మాటలాడ వలయునను జ్ఞానము గలదే ఆత్మ. అది మాటలాడుట కొఱకై వాక్కున్నది. నేను వినవలెనను జ్ఞానముగలదే ఆత్మ. అది వినుటకైయే చెవి యున్నది.

అథ యో వేదేదం మన్వానీతి స ఆత్మా మనోఽస్య దైవం చక్షుస్సవా ఏష ఏతేన దైవేన చక్షుషా మనసైతాన్కామాన్పశ్య న్రమతే. 5

నేను మననము చేయ వలయు నను జ్ఞాన మున్నదే ఆత్మ. మనస్సు దాని దైవమయ మగు నేత్రమై యున్నది. దైవికమగు కన్నయిన మనస్సుచే కామ్యపదార్థముల గనుగొని ఆనందించును.

య ఏతే బ్రహ్మలోకే తం వా ఏతం దేవా ఆత్మానముపాసతే తస్మాత్తేషాగ్ం సర్వే చ లోకా ఆత్తాస్సర్వే చ కామాస్స సర్వాగ్ంశ్చ లోకానాప్నోతి సర్వాంగ్ంశ్చ కామాన్యస్తమాత్మాన మనువిద్య విజానాతీతి హ ప్రజాపతిరువాచ ప్రజాపతిరువాచ. 6

బ్రహ్మలోకమునం దుండువారు, (మఱియు) దేవతలు, ఈ ఆత్మను గుఱించి ఉపాసింతురు. అందుచేత వారు అన్ని లోకములను అన్ని కామములను పొందుదురు. ఈ ఆత్మ నెఱిగి సర్వ కామములను సర్వ లోకములను పొందునని ప్రజాపతి చెప్పెను. (ఇట్లు బోధించెను.)

## 13–వ ఖండము

శ్యామ బ్రహ్మముచే శబళ బ్రహ్మప్రాప్తి కొఱకు ఉపదేశము

శ్యామాచ్ఛబళం ప్రపద్యే శబళాచ్ఛ్యామం ప్రపద్యే అశ్వ ఇవ రోమాణి విధూయ పాపం చంద్ర ఇవ రాహోర్ముఖాత్ప్రముచ్య ధూత్వా శరీరమకృతం కృతాత్మా బ్రహ్మలోకమభిసంభవామీత్యభి సంభవామీతి.

శ్యామమునుండి అనగా తెలియ బడనిదై, శ్యామ వర్ణమువలె గంభీరమై దురవగాహమై యున్న హృదయస్థ మగు బ్రహ్మమునుండి కామ మిశ్రణ మగుటచే అరణ్యమువలె శబలమైన బ్రహ్మలోకమును పొందుచున్నాను. మరల నా శబలమునుండి శ్యామమునకు వెళ్ళెదను. అనగా హృదయరూపుడ నగుచున్నాను. గుఱ్ఱము తన వెంట్రుకలను విదళించు పగిది పాపముల నెల్ల దూలించి రాహుగ్రహమునుండి ముక్తుడైన చంద్రుని భంగి శరీరమును విడిచి కృతకృత్యుడై స్వయంభువమగు బ్రహ్మలోకమునకు పోయెదను.

—o—

### 14–వ ఖండము

ఆకాశమను పేరు గల బ్రహ్మముయొక్క ఉపదేశము

ఆకాశో హ వై నామ నామరూపయోర్నిర్వహితా తే యదంతరా తద్బ్రహ్మ తదమృతగ్ం స ఆత్మా ప్రజాపతేస్సభాం వేశ్మ ప్రపద్యే యశోఽహం భవామి బ్రాహ్మణానాం యశో రాజ్ఞాం యశో విశాం యశోఽహమనుప్రాపత్సిసహాఽహం యశసాం యశః శ్యేతమదత్కమదత్కగ్ం శ్యేతం లిందుమాభిగాం లిందుమాభిగామ్. 1

దహరాకాశ మనునది నామ రూపములను వ్యక్తపఱచును. ఈ నామ రూపములు దేనియందున్నవో అది బ్రహ్మము, అమృతము, ఆత్మ. నేను ప్రజాపతి సభాంగణమును గృహమును చేరెదను. నేను బ్రాహ్మణుల యశస్సు, క్షత్రియుల యశస్సు, వైశ్యుల యశస్సయ్యెదను. అట్టి యశస్సు నే నిచ్ఛయించుచున్నాను. నేనా యశస్సుల యశస్సైయున్నాను. నేను ఎప్పటికిని ఆ ఎఱ్ఱటి వన్నె గలిగి దంతవిహీన మైనను సర్వ భక్షకమై జాఱి పడిపోవుట కనువై గోతి వలె నుండు (స్త్రీయోని) మోహమున బడకుందును గాత! అర్థాత్ సర్వేంద్రియ శక్తి తుష్టి పుష్టి సంహారకమగు మాతృగర్భమును బొందకుందును గాత యని భావము.

### 15–వ ఖండము

అవ. ఆత్మజ్ఞానముయొక్క పరంపర, తన్నియమము, తత్ఫలమును తెలుపుట.

తద్ధైతద్బ్రహ్మ ప్రజాపతయ ఉవాచ ప్రజాపతిర్మనవే మనుః ప్రజాభ్యః ఆచార్యకులాద్వేదమధీత్య యథా విధానం గురోః కర్మాతిశేషేణాభిసమావృత్య కుటుంబే శుచౌ దేశే స్వాధ్యాయమధీయానో ధార్మికాన్విదధదాత్మని సర్వేంద్రియాణి సంప్రతిష్ఠాప్యాహిగ్ంసంత్సర్వాభూతాన్యన్యత్ర తీర్థేభ్యః స ఖల్వేవం వర్తయన్యావదాయుషం బ్రహ్మలోక మభిసంపద్యతే న చ పునరావర్తతే న చ పునరావర్తతే.1

ఓమిత్యేతదక్షరముద్గీథ మని ప్రారంభింప బడిన ఈ జ్ఞానమును బ్రహ్మ ప్రజాపతికి, ప్రజాపతి మనువునకును, అతడు ప్రజలకును చెప్పెను. గురుకులమునం దుండునపుడు గురుసేవ జేసి తక్కిన సమయమునందు యథావిధి వేదాధ్యయనమును జేయుచు పూర్ణత నొందిన పిదప గురువుల యాజ్ఞను బడసి గృహస్థాశ్రమము నం దుండుచు వేదాధ్యయన సంపన్నులగు పుత్రులను శిష్యులను బడసి మఱియు శాస్త్రవిహితమగు కర్మప్రవృత్తి మాత్రుడవై దేశ కాలముల నరసి హింసాది కర్మలను జేయక ఇట్లు యావజ్జీవితమును గడుపు మానవుడు బ్రహ్మలోకమును బొందును. అతడు పునర్జన్మ నొందడు. పునర్జన్మ నొందడు.

ఓమ్. ఆప్యాయంతు మమాంగాని వాక్ప్రాణశ్చక్షుశ్శ్రోత్ర మథోబలమింద్రియాణి చ. సర్వాణి సర్వం బ్రహ్మోపనిషదం మాఽహం బ్రహ్మ నిరాకుర్యాం మా మా బ్రహ్మ నిరాకరోదనిరాకరణమస్త్వనిరాకరణం మేఽస్తు తదాత్మని నిరతే య ఉపనిషత్సు ధర్మాస్తే మయి సంతు తే మయి సంతు.

ఓం శాంతిః శాంతిః శాంతిః

ఛాందోగ్యోపనిషత్తు సమాప్తము

# ౧౦. బృహదారణ్యకోపనిషత్తు

ఓమ్. పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే,
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే.

ఓం శాంతిః శాంతిః శాంతిః

(ఈ మంత్రార్థము మొదటి వలె)

## ప్రథమాధ్యాయము

### 1-వ బ్రాహ్మణము

ఈ ఉపనిషత్తు ఆఱు అధ్యాయములు గలదై యున్నది. ఇందు మొదటి అధ్యాయము ప్రథమ బ్రాహ్మణమునందు యజ్ఞీయాశ్వము యొక్క వర్ణన గలదు. ఈ ప్రపంచ మంతయు యజ్ఞాశ్వముయొక్క స్వరూపమే ననియు పరబ్రహ్మతత్త్వమే ఈ యశ్వముయుక్క ఉత్పత్తిస్థాన మనియు దీనిని బంధించు స్థానమును ఇదియే ననియు సూర్య చంద్రులు, దశదిక్కులు, మొదలైన వెల్ల ఈ యశ్వముయొక్క అవయవము లనియు వర్ణింపబడెను. తాత్పర్యము ఈ అన్ని కార్యముల యొక్క ఉద్దేశ్యము ఆత్మను దెలియుట కొఱకై యేనని తెలియుచున్నది.

### 2-వ బ్రాహ్మణము

ఇక రెండవ బ్రాహ్మణమునందు సర్వమును భక్షించు మృత్యు దేవతయే మొట్టమొదట ఉండెనని ప్రారంభింపబడి అతడు మొదట మనస్సును, తరువాత పృథివీ జలాగ్నులను పుట్టించె ననియు ప్రాణము త్రివిధమై యున్నదనియు చెప్పబడి యున్నది. ఆ మృత్యువే సంవత్స రము వాక్కు మొదలైన వాటిని సృజించి యజ్ఞము జేసె నను మొదలగు విషయములు చెప్పబడి యున్నవి.

### 3-వ బ్రాహ్మణము

దేవదానవుల వైరము, దేవతలు ఉద్గీథోపాసన చేయుట

ద్వయా హ ప్రాజాపత్యా దేవాశ్చాసురాశ్చ తతః కానీయసా ఏవ దేవా జ్యాయసా అసురా స్త ఏషు లోకేష్వస్పర్ధంత తే హ దేవా ఊచుర్హంతాసురాన్యజ్ఞ ఉద్గీథేనాత్యయామేతి. 1

ప్రజాపతికి దేవతలు, మఱియు అసురులు అని ఇరు తెగల సంతానము గలదు. అందు దేవతలు చిన్నవారు, అసురులు పెద్దవారు. ఈ

రెండు తెగలవారు లోకముయొక్క ఆధిపత్యమునకై తమయందు తాము పోరాట మారంభించిరి. దేవతలు శాస్త్రజన్య జ్ఞానమును, కర్మను అంగీకరించినవారు. అసురులు ప్రత్యక్ష జ్ఞానమును కర్మను అంగీకరించినవారు, దేవతలు సాత్త్వికులు గావున వారు కొద్దిమందియై యున్నారు. అసురులు రాజస తామస గుణములుగల అసాత్త్వికులు గావున అధికముగ నున్నారు. అప్పుడు యజ్ఞమునందు ఉద్గీథము యొక్క సహాయముచే మేమూ అసురులను జయింతు మని దేవతలు పలికిరి.

అవ: వాక్కునందుంచి ప్రణవము నుపాసింప రాక్షసులు దానిని పాపముచే గొట్టిరను విషయమును తెలుపుచు ప్రాణము యొక్క మహిమను వర్ణించుచున్నారు.

తే హ వాచమూచుస్త్వం న ఉద్గాయేతి తథేతి తేభ్యో వాగుదగాయత్ యో వాచి భోగస్తం దేవేభ్య ఆగాయత్ యత్ కల్యాణం వదతి తదాత్మనే తే విదురనేన వై న ఉద్గాత్రాఽత్యేష్యంతీతి తమభిద్రుత్య పాప్మనాఽవిధ్యన్ స యః స పాప్మా యదేవేదమప్రతిరూపం వదతి స ఏవ స పాప్మా. 2

దేవతలు ఇట్లు నిశ్చయించుకొని వాక్కును గుఱించి, లేక వాగభిమాన దేవతను చూచి నీవు మా కొఱకై ఉద్గానము జేయుమనిరి. మంచిదని వాక్కు ఉద్గాన మొనర్చెను. వాక్కు తనయందుండు భోగమును అనగా రుచికర మగు మాటలను దేవతల కొసగెను. మఱియు తాను ఏ కల్యాణ కారక మగు మాటల నాడునో దానిని తన కొఱకై ఉంచుకొనెను. అప్పుడు ఉద్గాతృ సహాయముచే దేవతలు మమ్ము మీఱెదరని అసురులు తెలిసికొని వాక్కు కడకు వెడలి అసురులా వాక్కును పాపముచే గొట్టిరి. అదేమనిన, అయోగ్య మగు సంభాషణమే వాగ్విషయక మగు పాపము. అట్టి అసాత్త్వికతను బలుకునట్లు ప్రేరణ యొనర్చి పాపముచే వాక్కును గొట్టిరి.

అథ హ ప్రాణమూచు స్త్వం న ఉద్గాయేతి తథేతి తేభ్యః ప్రాణ ఉదగాయద్యః ప్రాణే భోగ స్తం దేవేభ్య ఆగాయద్యత్ కల్యాణం జిఘ్రతి తదాత్మనే తే విదు రనేన వై న ఉద్గాత్రాఽత్యే ష్యంతీతి తమభిద్రుత్య పాప్మనాఽ విధ్యన్ స యః స పాప్మా యదేవేద మప్రతిరూపం జిఘ్రతి స ఏవ స పాప్మా. 3

ఆ పిదప మా కొఱకై ఉద్గానము చేయుమని దేవతలు ప్రాణమునకు అనగా ఘ్రాణేంద్రియమునకు జెప్పుకొనిరి. మంచిదని ప్రాణము వారికొఱకై ఉద్గానము జేసెను. మిగత విషయము పై మంత్రము నందు వలె. రాక్షసులు దానిని పాపముచే గొట్టిరి. అదేమన, దుర్గంధ సుగంధములను ఆఘ్రాణించుటయే దీనియొక్క పాపము. ఈ పాపముచే ఘ్రాణము తాడన మొందెను.

అథ హ చక్షురూచు స్త్వం న ఉద్గాయేతి తథేతి తేభ్యశ్చక్షు రుదగాయత్ యశ్చక్షుషి భోగ స్తం దేవేభ్య ఆగాయద్యత్కల్యాణం పశ్యతి తదాత్మనే తే విదురనేన వై న ఉద్గాత్రాఽత్యేష్యంతీతి తమభిద్రుత్య పాప్మనాఽ విధ్యన్ స యః స పాప్మా యదేవేద మప్రతిరూపం పశ్యతి స ఏవ స పాప్మా. 4

పై నిరూపింప బడిన విధముగ చక్షురింద్రియమును దేవతల కొఱకై ఉద్గాన మొనర్ప జేసి పోరాడిరి. కాని దానిని గూడ పాపముచే రాక్షసులు గొట్టిరి. చక్షువు దేని మూలమున అయోగ్యమగు రూపములను చూచునో అదే చక్షురింద్రియముయొక్క పాపము.

అథ హ శ్రోత్రమూచు స్త్వం న ఉద్గాయేతి తథేతి తేభ్యః శ్రోత్రముదగాయద్యః శ్రోత్రే భోగ స్తం దేవేభ్య ఆగాయద్యత్కల్యాణగ్ం శృణోతి తదాత్మనే తే విదుర నేన వై న ఉద్గాత్రా త్యేష్యంతీతి తమభిద్రుత్యా పాప్మనాఽవిధ్యన్ స యః స పాప్మా యదేవేదమప్రతిరూపం శృణోతి స ఏవ స పాప్మా. 5

శ్రోత్రేంద్రియ విషయమున గూడ నింతే. దేని మూలమున

చెడ్డ శబ్దములు వినునో అదే దాని పాపము. దీనితో శ్రోత్రేంద్రియ మును వేధించిరి.

అథ హ మన ఊచు స్త్వం న ఉద్గాయేతి తథేతి తేభ్యో మన ఉదగాయద్యో మనసి భోగ స్తం దేవేభ్య ఆగాయద్యత్ కల్యాణం సంకల్పయతి తదాత్మనే తే విదురనేన వై న ఉద్గాత్రా త్యేష్యంతీతి తమభిద్రుత్య పాప్మనాఽ విధ్యన్స యః స పాప్మా యదేవేద మప్రతి రూపం సంకల్పయతి స ఏవ స పాప్మైవము ఖల్వేతా దేవతాః పాప్మభి రూపాసృజన్నేవ మనాః పాప్మనా విధ్యన్. 6

ఆ పిదప మనస్సు విషయమునను రాక్షసు లిదే విధముగ నెది రించిరి. దేని మూలమున చెడ్డ సంకల్పమును చేయునో అదే ఇచ్చట దీని పాపము. ఈ విధముగా దేవతలు పాపసంపర్కముచే దెబ్బ తినిరి.

అథ హేమమాసన్యం ప్రాణమూచు స్త్వం న ఉద్గాయేతి తథేతి తేభ్య ఏష ప్రాణ ఉదగాయ త్తే విదురనేన వై న ఉద్గాత్రాఽ త్యేష్యం తీతి తదభిద్రుత్య పాప్మనావివ్యత్సన్స యథాఽశ్మానమృత్వా లోష్టో విధ్వగ్ంసేతై వగ్ంహై వ విధ్వగ్ంసమానా విష్వంచో వినేశు స్తతో దేవా అభవన్ పరాఽసురా భవత్యాత్మనా పరాస్య ద్విషన్ భ్రాతృవ్యో భవతి య ఏవం వేద. 7

అనంతరము దేవతలు ముఖమునందుండు ప్రాణమును గురించి నీవు మా కొఱకై ఉద్గానము చేయుమని చెప్పికొనిరి. మంచిదని ప్రాణము వారి కొఱకై ఉద్గాన మొనర్చెను. ఈ ఉద్గాతృ సహాయ మున దేవతలు మనలను జయింతురని రాక్షసులు తెలిసికొని దాని కడకు వెళ్ళి పాపముచే వేధింప దొడగిరి. కాని అతి వేగముగ వెళ్ళి ఱాతిపై కొట్టబడి నాశ మొందు మట్టిపెల్లవలె పాపముచే ప్రాణమును గొట్టుట కొఱకై వెళ్ళిన అసురులు వందలాదిగా తునకలై నాశ మొందిరి. అప్పుడు దేవతలు విజయ మొందిరి. శ్రేష్ఠులైరి. అసురు లప జయము నొందిరి. ఇట్లు తెలిసిన వానిని ద్వేషించు అన్నదమ్ములు

గూడ అసురులవలె నాశ మొందుదురు.

తే హోచుః క్వ ను సోఽభూద్యో న ఇత్థమసక్తేత్యయమాస్యేఽన్తరితి సోఽ యాస్య ఆంగీరసోఽంగానాగ్‍ం హి రసః. 8

తక్కిన వాగాది ప్రాణములు మాకు దేవత్వము నిచ్చిన ముఖ్య ప్రాణు డెచ్చట నున్నాడని విచారింప అతడు ముఖాకాశము నందున్నాడని తెలిసెను. అతడే ముఖమునం దుండు వాడను మఱియు అంగిరసుడు అనగా సర్వాంగముల రసము లేక సారభూతు డనియు అర్థము.

సా వా ఏషా దేవతా దూర్నామ దూరగ్‍ం హ్యస్యా మృత్యుర్దూరగ్‍ం హ వా అస్మాన్మృత్యుర్భవతి య ఏవం వేద. 9

ఆ దేవత "దూర్" అను నామము గలవాడు. ఎందు కనగా మృత్యు వతనికి దూరముగా ఉండును. ఈ విధముగ తెలిసిన వానికి మృత్యువు దూరముగాఉండును.

సా వా ఏషా దేవతైతాసాం దేవతానాం పాప్మానం మృత్యుమపహత్య యత్రాసాం దిశామన్త స్తద్గమయాంచకార తదాసాం పాప్మనో విన్యదధా త్తస్మాన్న జనమియాన్నాన్తమియాన్నే త్పాప్మానం మృత్యుమన్వవాయానీతి. 10

ప్రసిద్ధమగు నా దేవత ఈ అన్య దేవతల పాపరూప మృత్యువును దూరీకరించి దానిని దిక్కుల చిట్టచివరకు నెట్టివేసెను. తుచ్ఛమగు భావముచే పాపము అచ్చట ఉంచ బడెను. అందుచేత పాపమును మృత్యువును తాకరాదు. కాబట్టి ఆ స్థానమునకును వెళ్ళరాదు పాపమయాచారము ఉండరాదని భావము.

సా వా ఏషా దేవతైతాసాం దేవతానాం పాప్మానం మృత్యుమపహత్యాథైనా మృత్యుమత్యవహత్. 11

ఆ దేవత అనగా ప్రాణము ఈ మిగిలిన దేవతల పాపరూప మృత్యువును దూరము జేసి వారిని మృత్యువున కవ్వల తీసికొని వెళ్ళెను.

స వై వాచమేవ ప్రథమామత్యవహత్సా యదా మృత్యుమత్యముచ్యత సోఽగ్నిరభవత్సోఽయమగ్నిః పరేణ మృత్యుమతిక్రాంతో దీప్యతే. 12

అతడు మొదట వాక్కును దాటించెను. వాక్కు మృత్యువును దాటిన వెంటనే అగ్ని యయ్యెను. ఈ అగ్ని మృత్యువును దాటిన వాడై ప్రకాశవంతుడై యున్నాడు.

అథ ప్రాణమత్యవహత్స యదా మృత్యుమత్యముచ్యత స వాయురభవత్సోఽయం వాయుః పరేణ మృత్యుమతిక్రాంతః పవతే. 13

అనంతరము అతడు ఘ్రాణమునందుండు ప్రాణమును దాటించెను. మృత్యువును దాటిన వెంటనే అతడు వాయు వయ్యెను. ఈ వాయువు మృత్యువును దాటిన వాడై అవ్వల వీచుచున్నాడు.

అథ చక్షురత్యవహత్తద్యదా మృత్యుమత్యముచ్యత స ఆదిత్యోఽభవత్సోఽసావాదిత్యః పరేణ మృత్యుమతిక్రాంతస్తపతి. 14

ఆ పిదప అతడు చక్షుస్సును దాటించెను. మృత్యువును మీరిన వెంటనే చక్షువు ఆదిత్యుడయ్యెను. ఈ ఆదిత్యుడు మృత్యువు నతిక్రమించిన వాడై తపించుచున్నాడు, అనగా ప్రకాశించుచున్నాడు.

అథ శ్రోత్రమత్యవహత్తద్యదా మృత్యుమత్యముచ్యత తా దిశోఽభవగ్ంస్తా ఇమా దిశః పరేణ మృత్యుమతిక్రాంతాః. 15

అనంతర మతడు శ్రోత్రమును దాటించెను. మృత్యువును దాటిన వెంటనే శ్రోత్రము దిక్కులయ్యెను. ఈ దిక్కులు మృత్యువును మీరి ఆవలనున్నవి.

అథ మనోఽత్యవహత్తద్యదా మృత్యుమత్యముచ్యత స చంద్రమా అభవత్సోఽసౌ చంద్రః పరేణ మృత్యుమతిక్రాంతో భాత్యేవగ్ంహ వా ఏనమేషా దేవతా మృత్యుమతివహతి య ఏవం వేద. 16

పిదప మనస్సును దాటించెను. మృత్యువును మీాఱిన పిదప మనస్సు చంద్రుడాయెను. చంద్రుడు మృత్యువును దాటినవాడై ప్రకాశించుచున్నాడు. ఈ విధముగా దెలిసిన వారిని ఈ దేవత అనగా ముఖ్యప్రాణము మృత్యువునుండి విముక్తుల నొనర్చును.

అథాత్మనేఽన్నాద్యమాగాయద్యద్ధి కించాన్నమద్యతేఽనేనైవ తదద్యత ఇహ ప్రతితిష్ఠతి. 17

తే దేవా అబ్రువన్నేతావద్వా ఇదగ్ం సర్వం యదన్నం తదాత్మన ఆగాసీరను నోఽస్మిన్నన్న ఆభజస్వేతి తే వై మాఽభిసంవిశతేతి తథేతి తగ్ంసమంతం పరిణ్యవిశంత తస్మాద్యదనేనాన్నమత్తి తేనైతాస్తృప్యంత్యేవగ్ంహ వా ఏనగ్ం స్వా అభిసంవిశంతి భర్తా స్వానాగ్ం శ్రేష్ఠః పుర ఏతా భవత్యన్నాదోఽధిపతిర్య ఏవం వేద య ఉ హైవం విదగ్ంస్వేషు ప్రతిప్రతిర్బుభూషతి న హైవాలం భార్యేభ్యో భవత్యథ య ఏవైతమనుభవతి యో వై తమనుభార్యాన్బుభూషతి స హైవాలం భార్యేభ్యో భవతి. 18

పిదప నతడు తన కొఱకై భుజింప బడుటకు వచ్చు అన్నమును గుఱించి పాడెను. తినబడు ఆహారమును భుజించువా డతడే. ప్రాణము అన్నమునందు ప్రతిష్ఠితమై యున్నదని భావము. అప్పుడా దేవతలనిన దేమన, ఈ అన్నము ఇంతే గలదు. నీ కొఱకై నీవే గానమొనర్చి పొంది యున్నావు. దానియందు మాకును భాగము నిమ్ము: భాగస్థులనుగా జేసికొనుమని తదితర ఇంద్రియ వృత్తులగు ప్రాణములు (దేవతలు) ముఖ్యప్రాణము నడిగెను. అప్పుడు ముఖ్య ప్రాణము మీారందఱు చుట్టుప్రక్కల నుండి నాయందు ప్రవేశించుడి. ప్రవేశించుడని తెలుపగా నా దేవత లందఱు అతనియందు ప్రవేశించిరి. అందుచే ప్రాణమువలన భుజింపబడిన అన్నముచే ఈ దేవతలు తృప్తు లగుదురు. ఈ విధముగా ముఖ్య ప్రాణమును ఎవరు దెలియుదురో అతనిని జ్ఞాతులు ఆశ్రయింతురు. అతడు వారియందు శ్రేష్ఠుడై వారి ,, పోషకు

డగును. వారి ముందంజ వేయు మనుష్యు డగును. ఇంతే గాక అతని జ్ఞాతులయందు ఎవడు ఇతనికి విరుద్ధమై నిలువవలె ననునో అతడు అన్యులను పోషింప అసమర్థు డగును. అయితే ఎవడు ప్రాణానురోధము కలిగి యుండునో మఱియు ప్రాణోపాసకుని అనుసారముగా జనులను పోషింప నిచ్ఛయించునో అతడే పోషింప సమర్థుడగును.

సోఽయాస్య ఆంగిరసోఽంగానాగ్ం హి రసః ప్రాణో వా అంగానాగ్ం రసః ప్రాణో హి వా అంగానాగ్ం రస స్తస్మాద్యస్మాత్కస్మాచ్చాంగాత్ప్రాణ ఉత్క్రామతి తదేవ తచ్ఛుష్యత్యేష హి వా అంగానాగ్ం రసః. 19

ఆ దేవతయొక్క ముఖమునం దుండు దేవతయే అంగిరసము అనగా అంగముల సారము. ప్రాణము అన్ని అంగములకు రసము. ఇది ప్రసిద్ధమైన విషయము. అందువల్లనే ఏ అంగమునందలి ప్రాణము వెడలి పోవునో అది ఎండి పోవును ఇదే అంగముల సార మని అర్థము.

ఏష ఉ ఏవ బృహస్పతిర్వాగ్ వై బృహతీ తస్యా ఏష పతి స్తస్మాదు బృహస్పతిః. 20

ఇతడే ప్రాణము అనగా బృహస్పతి. వాక్కును బృహస్పతియు నితడే. అందుచేత ఇతడు బృహస్పతి యని చెప్పబడును.

ఏష ఉ ఏవ బ్రహ్మణస్పతిర్వాగ్ వై బ్రహ్మ తస్యా ఏష పతి స్తస్మాదు బ్రహ్మణస్పతిః. 21

ఇతడే బ్రహ్మణస్పతియు. వాక్కు బ్రహ్మము (యజస్సు). బ్రహ్మ యొక్క పతి యైనందు వలన బ్రహ్మణస్పతి యనియు చెప్పబడును.

ఏష ఉ ఏవ సామ వాగ్ వై సామైష సా చామశ్చేతి తత్సామ్నః సామత్వం యద్వేవ సమః ప్లుషిణా సమో మశకేన సమో నాగేన సమ ఏభిస్త్రిభిర్లోకైః సమోఽనేన సర్వేణ తస్మాద్వేవ సామాశ్నుతే సామ్నః సాయుజ్యగ్ం సలోకతాం జయతి య ఏవమేతత్సామ వేద. 22

ఇతడే సామము. వాక్కు సామము. అది "సా" మఱియు "అమ" అను వాటియొక్క కలయికయై యున్నది. ఇదే సామము యొక్క సామత్వము. అతడు ఒక విధమగు తేనెటీగకు ఎలుకకు ఏనుగకు ఈ మూడు లోకములకు ఈ సర్వస్వమునందును అణువు అధిక మనునది లేక సముడై యున్నందువలన అతడు సామ మనిపించు కొనును. ఈ సామమును తెలిసినవాడు సామముయొక్క సాయుజ్య మును సాలోక్య వస్తువును పొందును.

ఏష ఉ వా ఉద్గీథః ప్రాణో వా ఉత్ ప్రాణేన హీదగ్ం సర్వ ముత్తబ్ధం వాగేవ గీథోచ్చ గీథా చేతి స ఉద్గీథః. 23

ఇతడే ఉద్గీథము. ప్రాణమే "ఉత్". ప్రాణము వలననే ఇదంతయు ధరింప బడుచున్నది. వాక్కే గీథము. అందుచేత "ఉత్" మఱియు "గీథము" కూడి ఉద్గీథమై యున్నది.

తద్ధాపి బ్రహ్మదత్తశ్చైకితానేయో రాజానాం భక్షయన్ను వాచాయం త్యస్య రాజా మూర్ధానం విపాతయతాద్యదితోఽయాస్య ఆంగిరసోఽన్యేనోదగాయదితి వాచా చ హ్యేవ స ప్రాణేన చోదగా యదితి. 24

ఈ విషయమున ఈ కథ గలదు. చైకితానేయ బ్రహ్మదత్తుడు సోమమును సేవించు నపుడు ఈ ఆయాస్య అంగిరసుడు వాక్కు మఱియు ప్రాణమను నీ దేవతల సహాయము లేనిదే ఉద్గానము చేసి యుండిన ఈ సోమరాజు నాతల కత్తిరించునుగాక! యని చెప్పెను.

తస్య హైతస్య సామ్నో యః స్వం వేద భవతి హాస్య స్వం తస్య వై స్వర ఏవ స్వం తస్మాదార్త్విజ్యం కరిష్యన్వాచి స్వరమిచ్ఛేత తయా వాచా స్వరసంపన్నయార్త్విజ్యం కుర్యాత్తస్మాద్యజ్ఞే స్వర వంతం దిదృక్షంత ఏవాఽథో యస్య స్వం భవతి భవతి హాస్య స్వం య ఏవమేతత్సామ్నః స్వం వేద. 25

ఇట్టి సామ ప్రాణముల యొక్క అర్థమును ఎవడు తెలిసి యున్నాడో అతనికి ధనప్రాప్తి యగును. స్వరమే సామముయొక్క ధనమగును. అందుచేత ఋత్విక్కర్మను చేయువాడు తన వాక్కునందు స్వరము స్థితి నొందుగాక! యని ఇచ్ఛయింపవలెను. స్వర సంపన్న మగు వాక్కుచే ఋత్విక్కు కర్మ చేయువలయును. అందుచేత యజ్ఞమునందు స్వరము గల ఉద్గాతను జూడ నిచ్ఛయింతురు. ఈ విధ ముగా సామధన మెఱిగిన వానికి ధనప్రాప్తి యగును.

తస్య హైతస్య సామ్నో యః సువర్ణం వేద భవతి హాస్య సువర్ణం తస్య వై స్వర ఏవ సువర్ణం భవతి హాస్య సువర్ణం య ఏవ మేతత్సామ్నః సువర్ణం వేద. 26

స్వరమే (సువర్ణము) అనగా స్వరము సువర్ణముగా వర్ణింపబడి యున్నది. ఈ ప్రకారముగ తెలిసికొన్న వానికి సువర్ణము, లేదా సంపద గలుగునని భావము.

తస్య హైతస్య సామ్నో యః ప్రతిష్ఠాం వేద ప్రతిహ తిష్ఠతి తస్య వై వాగేవ ప్రతిష్ఠా వాచి హి ఖల్వేష ఏతత్ప్రాణః ప్రతిష్ఠితో గీయతేఽన్న ఇత్యుహైక ఆహుః. 27

ఈ సామ ప్రాణ ప్రతిష్ఠను తెలిసికొన్న వారికి మహిమ కలుగును. వాక్కే సామముయొక్క ప్రతిష్ఠ. వాక్కునందే ప్రాణము ప్రతిష్ఠింప బడినది. ప్రాణము అన్నమునందు ప్రతిష్ఠితమై యుండి వాక్కుచే గానము చేయబడు చున్నదని కొందఱు చెప్పెదరు.

అథాతః పవమానా నామేవాభ్యారోహః స వై ఖలు ప్రస్తోతా సామ ప్రస్తౌతి స యత్ర ప్రస్తుయాత్తదేతాని జపేత్. అసతో మా సద్గమయ తమసో మా జ్యోతిర్గమయ మృత్యోర్మాఽమృతం గమ యేతి స యదా హాసతో మా సద్గమయేతి మృత్యుర్వా అసత్స దమృతం మృత్యోర్మాఽమృతం గమయామృతం మా కుర్విత్యేవైత దాహ తమసో మా జ్యోతిర్గమయేతి మృత్యుర్వై తమో జ్యోతి

రమృతం మృత్యోర్మాఽమృతం గమయామృతం మా కుర్విత్యేవైత దాహ మృత్యోర్మాఽమృతం గమయేతి నాత్ర తిరోహితమివాస్తి, అథ యానీతరాణి స్తోత్రాణి తేష్వాత్మనేఽన్నాద్యమాగాయేత్తస్మాదు తేషు వరం వృణీత యం కామం కామయేత తగ్ం స ఏష ఏవం విదుద్గాతాత్మనే వా యజమానాయ వా యం కామం కామయతే తమాగాయతి తద్ధై తల్లోకజిదేవ న హైవాలోక్యతాయా ఆశాఽస్తి య ఏవమేతత్సామ వేద. 28

అవ: ఇక పవమాన మను పేరు గల మంత్రముల గాన విధానము చెప్పబడును. ప్రాణ విజ్ఞానము గల వానికి జపకర్మ చెప్ప బడు చున్నదని తెలియ వలయును. "అసతో మా సద్గమయ" "తమసో మా జ్యోతిర్గమయ" "మృత్యోర్మా అమృతం గమయ" ఇవే ఆ మంత్రములు. వీటి అర్థమేమనిన, మృత్యువే అసత్తు. సత్తే అమృతము. మృత్యువును దాటించి నాకు అమృతత్వము నిమ్మని అర్థము. "మృత్యోర్మాం అమృతం గమయ" ఈ అర్థము స్పష్టమై యున్నది. తక్కిన స్తోత్రముల ముఖమున తన కొఱకై తినుటకు యోగ్యమైన అన్నమును గుఱించి అప్పుడప్పుడు స్తోత్రము చేయ వలెను. ఏ పక్షమునందు ఉద్గాత తన కొఱకై, లేక యజమానుని ఇష్టము ననుసరించి గానము చేయునో ఆ పక్షమునందు ఆ కాలము నకు యజమానుడు తా నిచ్ఛయించిన వస్తువును ప్రార్థన చేయవలెను. ఈ విద్య లోకప్రాప్తి సాధన మాత్రమై యున్నది. ఎవడు దీనిని తెలిసి యున్నాడో, ఈ సామము నెఱిగిన వాడో అతనికి లోకముల కవ్వల బోవలసిన (అమృతత్వముయొక్క) ఆశ లేదు. కాని మంచి లోకములకు మాత్ర మతడు వెళ్ళనే వెళ్ళును.

## 4–వ బ్రాహ్మణము

### బ్రహ్మముయొక్క వ్యాపకత, చాతుర్వర్ణ్య సృష్టి

ఆత్మైవేదమగ్ర ఆసీత్ పురుషవిధః సోఽనువీక్ష్య నాన్య

దాత్మనోఽపశ్యత్సోఽహమస్మీత్యగ్రే వ్యాహరత్తతోఽహంనామా భవత్. తస్మాదప్యేతర్హ్యామన్త్రితోఽహమయమిత్యేవాగ్ర ఉక్త్వాఽథాన్యన్నామ ప్రబ్రూతే యదస్య భవతి స యత్పూర్వోఽస్మాత్సర్వస్మాత్సర్వాన్పాప్మన ఔషత్తస్మాత్పురుష ఓషతి హ వై స తం యోఽస్మాత్పూర్వోబుభూషతి య ఏవం వేద. 1

సృష్టికి పూర్వము మొట్టమొదట పురుష వాచ్యమగు ఆత్మ యొక్కటే ఉండెను. అది తేరిపార జూడగ తనకంటె అన్యమగు పదార్థ మగపడ లేదు. నేనే ఉన్నా ననుకొనెను. తద్ద్వారా 'అహం' అను పేరుగల దాయెను. (అతడే హిరణ్యగర్భుడు) అందుచేతనే ఇప్పుడు నీ వెవరవని అడిగిన అహం (నేను) అని చెప్పిన పిదప మనుష్యుడ నని ఫలానా వాడ ననియు చెప్పును. అతడే ఈ సర్వదృశ్య ప్రపంచమునకు పూర్వముననే యున్నవాడు. సమస్త పాపములను గాల్చినవాడు; కావున పురుషుడని పేరు. ఇట్లు తనకంటె శ్రేష్ఠుడగువాడింకొకడు లేడు.

సోఽబిభేత్తస్మాదేకాకీ బిభేతి స హాయమీక్షాం చక్రే యన్మదన్యన్నాస్తి కస్మాన్ను బిభేమీతి తత ఏవాస్య భయం వీయాయ కస్మాద్ధ్యభేష్యద్ద్వితీయాద్వై భయం భవతి. 2

అతడు ఎవరును లేనందువలన భయ మొందెను. అందువల్లనే ఒక్కడుగ నుండువాడు భయపడును. అతడు ఇట్లు విచారించెను. నేను వినా ఇంకెవరును లేరుగదా! నేను ఏల భయపడవలయును? అను నీ వివేకముచే నతడు నిర్భయు డయ్యెను. మఱి దేనిచేత భయభీతు డగును? భయము రెండవ వస్తువు ఉన్నపుడు మాత్రమే గదా గలుగును?

స వై నైవ రేమే తస్మాదేకాకీ న రమతే స ద్వితీయమైచ్ఛత్ స హైతావానాస యథా స్త్రీపుమాంసౌ సంపరిష్వక్తౌ స ఇమమేవాత్మానం ద్వేధాఽపాతయత్తతః పతిశ్చ పత్నీ చాభవతాం తస్మా

దిదమర్ధబృగలమివ స్వ ఇతి హ స్మాహ యాజ్ఞవల్క్యస్తస్మాదయ మాకాశః స్త్రియా పూర్యత ఏవ తాగ్ం సమభవత్తతో మనుష్యా అజాయంత. 3

ఒంటరిగా ఉన్న అతడు తృప్తి నొంద లేదు. అందుచేతనే ఒక్కడుగా నుండువాడు ఆనందించుట లేదు. అతడు రెండవ దాని నపేక్షించెను. అప్పుడతడు స్త్రీపురుషు లిరువుర జంట ఎట్లుండునో అటుల ఉండెను. అనగా తన్ను రెండు భాగములుగా చేసికొనెను. అప్పు డతడే సతి, పతి యని ఇద్దఱు వ్యక్తులుగ నయ్యెను. కాబట్టియే మనుష్యుడు చీల్చిన వెదురు బొంగు వలె నున్నాడని యాజ్ఞవల్క్య ముని చెప్పి యున్నాడు. అందుచేత పురుషునియం దుండిన ఈ అర్ధ భాగము స్త్రీచే పూర్ణము చేయబడును. అట్టి యీ యిరువురివలన మనుష్యులు పుట్టిరి.

సా హేయమీక్షాంచక్రే కథం ను మాఽఽత్మన ఏవ జనయిత్వా సంభవతి హంత తిరోఽసానీతి సా గౌరభవదృషభ ఇతరస్తాగ్ం సమేవా భవత్తతో గావోఽజాయంత బడబేతరాఽభవదశ్వవృష ఇతరో గర్ధ భీతరా గర్దభ ఇతరస్తాగ్ం సమేవాభవత్తత ఏకశఫమజాయతాఽజేతరా ఽభవద్బస్త ఇతరోఽవిరితరా మేషఇతర స్తాగ్ం సమేవాభవత్తతోఽ జావయో జాయంతైవమేవ యదిదం కించ మిథునమాపిపీలికాభ్యస్త త్సర్వమసృజత. 4

అంత అర్ధభాగముగా ఉన్న ఆమె విచారించిన దేమన, తన నుండియే నన్ను పుట్టించి ఇతడు నాతోనే కవయుచున్నాడుగదా! ఇక నేను అంతర్ధాన మొంద వలయునని గోరూపిణి యయ్యెను. అప్పు డతడు వృషభమై ఆమెతో గూడెను. ఆ సంయోగముచే ఎద్దులు ఆవులు పుట్టెను. ఆమె ఆడుగుఱ్ఱ మాయెను. అతడు మగగుఱ్ఱ మాయెను. ఆమె ఆడుగాడిద యాయెను. అతడు మగ గార్దభమై దానితో గలసెను. ఆమె మేక యయ్యెను. అతడు మేకపోతాయెను.

తరువాత ఆమె గోవ్వై, అతడు గోవృషభ మాయెను. ఇట్లు పిపీలిక పర్యంతము స్త్రీపురుషాత్మకమగు ప్రాణులను పుట్టించెను.

సోఽవేదహం వావ సృష్టిరస్మ్యహగ్ం హీదగ్ం సర్వమసృక్షీతి తతః సృష్టిరభవత్సృష్ట్యాగ్ం హాస్యైతస్యాం భవతి య ఏవం వేద. 5

ఇప్పుడు ఇన్ని రూపములచే నేనే సృష్టినై యున్నానని అతడు తెలిసికొనెను. ఈ సమస్తమును నేనే పుట్టించి యున్నాను. ఈ సృష్టి రహస్యమును తెలిసినవాడే సృష్టియందుండి సృష్టితాదాత్మ్యము లేని వాడగును.

అథేత్యభ్యమంథత్స ముఖాచ్చ యోనేర్హస్తాభ్యాం చాగ్నిమసృజత తస్మాదేతదుభయమలోమకమంతరతోఽలోమకాహి యోనిరంతరతః తద్యదిదమాహురముం యజాముం యజేత్యేకైకం దేవమేతస్యైవ సా విసృష్టిరేష ఉ హ్యేవ సర్వే దేవాః. అథ యత్కించేదమార్ద్రం తద్రేతసోఽసృజత తదు సోమ ఏతావద్వా ఇదగ్ం సర్వమన్నం చైవాన్నాదశ్చ సోమ ఏవాన్నమగ్నిరన్నాదః సైషా బ్రహ్మణోఽతిసృష్టిః యచ్ఛ్రేయసో దేవానసృజతాథ యన్మర్త్యః సన్నమృతానసృజత తస్మాదతిసృష్టిరతిసృష్ట్యాగ్ం హాస్య తస్యాం భవతి య ఏవం వేద. 6

ఆ పిదప నతడు మంథన మొనర్చెను. మఱియు రెండు చేతులు, ముఖము, యోని-వీటియందు అగ్ని నుత్పన్నము చేసెను. అందు చేతనే ఈ రెండు అరచేతులయందు వెండ్రుకలు ఉండవు. అటువలె యోనియందును వెండ్రుకలు మొలవవు. ఈ దేవతకొఱకై యజ్ఞము చేయుము. మఱియు నా దేవతను గుఱించి యజ్ఞము చేయుమని చెప్పుదురు. అది యోగ్యము కాదు. ఎందుచేత ననగా ఈ సృష్టి యంతయు అతనిదై యే యున్నది. అన్ని దేవతలును అతడే అయి యున్నాడు. ఉండిన సమస్తమును తన రేతస్సుచేతనే పుట్టించెను. అదే సోమము. సృష్టి యంతయు అన్నము మఱియు అన్నాద మని ఈ రెండే గలవు.

సోమమే అన్నము. అగ్నియే అన్నాదము. ఇది బ్రహ్మయొక్క అతి సృష్టి. శ్రేష్ఠులగు దేవతలను పుట్టించి నందువలన అనగా తాను మర్త్యుడై యుండి అమర్త్యులగు దేవతలను పుట్టించి నందువలన ఇది అతి సృష్టి యన బడును. దీనిని తెలిసినవాడు అతిసృష్టియం దుండిన వాడగును.

తద్ధేదం తర్హ్యవ్యాకృతమాసీత్. తన్నామరూపాభ్యామేవ వ్యాక్రియతాసౌ నామాఽయమిదగ్ం రూప ఇతి తదిదమప్యేతర్హి నామరూపాభ్యామేవ వ్యాక్రియతేఽ సౌ నామా యమిదగ్ం రూప ఇతి స ఏష ఇహ ప్రవిష్టః. ఆనఖాగ్రేభ్యో యథా క్షురః క్షురధానేఽ వహితః స్యాద్విశ్వంభరో వా విశ్వంభరకులాయేతన్న పశ్యంత్యకృత్స్నో హి స ప్రాణన్నేవ ప్రాణో నామ భవతి వదన్వాక్పశ్యగ్ంశ్చక్షుః శృణ్వన్ శ్రోత్రం మన్వానో మనస్తాన్యస్యై తాని కర్మనామాన్యేవ సయోఽతఏకైక ముపాస్తే న స వేదాకృత్స్నో హ్యేషోఽత ఏకైకేన భవత్యాత్మేత్యేవో పాసీతాత్ర హ్యేతే సర్వ ఏకం భవంతి. తదేతత్పదనీయమస్య సర్వస్య యదయమాత్మాఽనేన హ్యేతత్సర్వం వేద యథా హ వై పదేనాను విందేదేవం కీర్తిం శ్లోకం విందతే య ఏవం వేద. 7

ఈ సృష్టి మొదట అవ్యక్తమై యుండెను. అది నామరూపముల మూలమున వ్యక్తమాయెను. దీని నామ మిది యనియు దీని రూప మిది యనియు వ్యక్త మాయెను. అందువల్లనే ఇప్పుడు వస్తువుల యొక్క నామ రూపముల చేతనే దీని పేరిది; దీని రూప మిది యని వ్యక్తమగును. ఆ సృష్టికర్తయే ఈ సృష్టియం దంతటను ప్రవేశించి యున్నాడు. ఆమూలాగ్రము నఖ శిఖ పర్యంతము ఈ దేహమునందు ప్రవేశించి యున్నాడు; వ్యాపించి యున్నాడు. కత్తి ఒరయందు గాన బడ కుండినట్లు విశ్వంభర మూర్తియగు పరమాత్మ ఒరవలె నున్న ఈ జగద్వస్తువులయం దంతటను నిండి యున్నాడు. జను లతనిని గానరు. ఏందు కనగా, అతడు సృష్టియందు పూర్ణముగ నగపడడు.

ఉచ్ఛ్వాస ప్రశ్వాసలు చేయునపుడు అతడు ప్రాణుడై యున్నాడు. మాటలాడు నపుడు వాక్కై యున్నాడు. చూచునపుడు కన్నులై యున్నాడు. వినునపుడు చెవులై యున్నాడు. విచారించు నపుడు మనోరూపుడై యున్నాడు. ఇవి వాని పనులయొక్క నామములై యున్నవి. వీటి నొక్కొక్క దానినే ఉపాసించువాడు పూర్ణ బ్రహ్మమును దెలియడు. అతడు ఒక్కొక్క దానినే ప్రత్యేకముగ తెలియ గలడు. ఆత్మ యగు పూర్ణ బ్రహ్మము నుపాసించ వలెను. ఎందు కనగా, ఈ ఆత్మయందు సమస్త దేవతలు ఏకరూప మొందుదురు. సర్వ పదార్థములయం దీ ఆత్మయే అధికముగా పొంద వలసినదై, తెలియ వలసినదై యున్నది. ఈ జ్ఞానము వలననే సర్వమును తెలి యును. పోగొట్టుకొనిన పశువును దాని యడుగుల జాడను గుఱు తించి పట్టి తెచ్చుతెఱగున దీని నెఱిగిన వాడు కీర్తిని ప్రశంసను పొందును.

తదేతత్ప్రేయః పుత్రాత్ప్రేయో విత్తాత్ప్రేయోఽన్యస్మాత్సర్వ స్మా దంతరతరం యదయమాత్మా స యోఽన్యమాత్మనః ప్రియం బ్రువాణం బ్రూయాత్ ప్రియగ్ం రోత్స్యతీతీశ్వరో హ తథైవ స్యాదాత్మానమేవ ప్రియముపాసీత స య ఆత్మానమేవ ప్రియము పాస్తే నహాస్య ప్రియం ప్రమాయుకం భవతి. 8

ఈ ఆత్మ ప్రియము. పుత్రుని కంటెను ధనము కంటెను తక్కిన సర్వవస్తు జాతమున కంటెను ప్రియమై యున్నది. ఏందుచేత ననగా, ఇది మన కత్యంత సమీపమై స్వరూపమైయే యున్నది. ఇట్లుండగా అనాత్మను ప్రియమని చెప్పెడి మనుజునకు ఈ తత్వము నెఱిగిన ఆత్మ జ్ఞాని అయ్యా! నీ ప్రియము నాశ మొందునని చెప్పును. ఈ యథా ర్థమును తెలుపుటకు ఇతడొక్కడే సమర్థుడు. అనాత్మ స్వరూపమైన దానికి అస్తిత్వము లేదు. అవిద్యచే ఉన్నట్లు అగపడును. కావున ఆత్మయను ప్రియవస్తువునే ఉపాసింపవలెను. ఆత్మను ప్రియమని ఉపా సించువాని యానందము ఏప్పటికిని నాశ మొందదు.

తదాహుర్యద్బ్రహ్మవిద్యయా సర్వం భవిష్యంతో మనుష్యా మన్యంతే కి ము తద్బ్రహ్మాఽవేద్యస్మాత్తత్సర్వ మభవ దితి. 9.

బ్రహ్మవిద్యా మహిమచే మేమీా సర్వము నయ్యెదమని జనులు చెప్పెదరు. బ్రహ్మ మనగా నేమి? దేనిచే సమస్తము నయ్యెనో అట్టి బ్రహ్మము నేది తెలిసికొనె నని జిజ్ఞాసువులు ప్రశ్న జేసిరి.

బ్రహ్మ వా ఇదమగ్ర ఆసీత్తదాత్మానమేవావేత్. అహం బ్రహ్మాస్మీతి తస్మాత్తత్సర్వమభవత్ తద్యో యో దేవానాం ప్రత్య బుధ్యత స ఏవ తదభవత్తథర్షీణాం తథా మనుష్యాణాం తద్ధైత త్పశ్యన్నృషిర్వామదేవః ప్రతిపేదేఽహం మనురభవగ్ం సూర్య శ్చేతి తదిదమప్యేతర్హి య ఏవం వేదాహం బ్రహ్మాస్మీతి స ఇదగ్ం సర్వం భవతి తస్య హ న దేవాశ్చ నాభూత్యా ఈశతే ఆత్మా హ్యేషాగ్ం స భవత్యథ యోఽన్యాం దేవతాముపాస్తేఽన్యోసావన్యో ఽహమస్మీతి న స వేద యథా పశురేవగ్ం స దేవానాం యథా హ వై బహవః పశవో మనుష్యం భుంజ్యురేవ మేకైకః పురుషో దేవాన్ భునక్త్యేకస్మిన్నేవ పశావాదీయమానేఽప్రియం భవతి కిము బహుషు తస్మాదేషాం తన్నప్రియం యదేతన్మనుష్యా విద్యుః. 10

మొట్టమొదట బ్రహ్మమే యుండెను. అది తనను తానే నేను బ్రహ్మమై యున్నానని తెలిసికొనెను. స్వసంవిత్తు స్వయంప్రకాశ మని అర్థము. తద్ద్వారా సర్వము నయ్యెను. దేవతలయందు ఎవరెవరీ జ్ఞానము సంపాదించిరో వారు బ్రహ్మస్వరూపు లయిరి. అదే విధముగా ఋషులయందును మనుష్యులయందును ఈ తత్త్వము నెవరు తెలిసికొని యున్నారో వారు తద్రూపులే అయిరి. అంతయు నెఱిగిన వామదేవుడు "నేనే మనువను; నేనే సూర్యుడను" అని ప్రతిపాదించెను. ఇప్పుడును ఇట్టి జ్ఞానమును అనగా బ్రహ్మమై యున్నానను అపరోక్షానుభవము నొందిన వాడు ఇదంతయును తానే యై యున్నాడు.

దేవతలు గానిమ్ము మనుష్యులు గానిమ్ము. అతని ముక్తి నడ్డగించుటకు ఎవరును సమర్థులు గారు. కారణ మేమన, అతడే వారందఱి ఆత్మయై యున్నాడు. ఇక ఎవడు అన్యదేవతను తాను వేఱు; ఆ దేవత వేఱని భావించి ఉపాసించునో అతనికి జ్ఞానము గలుగ లేదని తెలియవలయును. మనకు పశువు ఎటులనో అటువలె అజ్ఞాని దేవతలకు పశువై యుండును. ఎక్కువ పశువులు మానవుల కెట్లు ఉపయోగకరములో అటువలె ఒక్కొక్క మనుష్యుడును దేవతలకు ఉపయోగపడుదురు. ఒక పశువు నెవరైన తీసికొని పోయినచో మనకు చాలా దుఃఖ మగును. ఇట్లుండగా అధిక మగు పశువులను గొంపోయినచో అడుగవలసిన దేమున్నది? మానవులు జ్ఞానమొంది ముక్తులగుట దేవతలకు ఇష్టము లేదు. ఎందుచేత ననగా మా సేవ చేయు వీరు మమ్ము విడిచి పోవుదురు గదా యని వారికి దుఃఖము. కావుననే సాధకుడగు ముముక్షువునకు ఆరంభమున ఇంద్రాది దేవతలు వివిధరీతుల విఘ్నములను కలుగ జేతురు. కాబట్టి సాధకుడు శ్రద్ధను వీడ రాదు. ఇంద్రియ విషయ లోలత నొందరాదని భావము.

బ్రహ్మ వా ఇదమగ్ర ఆసీదేకమేవ తదేకగ్ం సన్న వ్యభవత్ తచ్ఛ్రేయో రూపమత్యసృజత క్షత్రం యాన్యేతాని దేవత్రా క్షత్రాణీంద్రో వరుణః సోమో రుద్రః పర్జన్యో యమో మృత్యురీశాన ఇతి తస్మాత్క్షత్రాత్పరం నాస్తి తస్మాద్బ్రాహ్మణః క్షత్రియమధస్తాదుపాస్తే రాజసూయే క్షత్ర ఏవ తద్యశో దధాతి సైషా క్షత్రస్య యోనిర్యద్బ్రహ్మ తస్మాద్యద్యపి రాజా పరమతాం గచ్ఛతి బ్రహ్మైవాంతత ఉపనిశ్రయతి స్వాం యోనిం య ఉ ఏనగ్ం హినస్తి స్వాగ్ం స యోనిమృచ్ఛతి స పాపీయాన్ భవతి యథా శ్రేయాగ్ంసగ్ం హిగ్ంసిత్వా. 11

ఆదియం దిదంత యను అద్వితీయ మగు బ్రహ్మమాత్రమైయే యుండెను. అది ఒక్కటిగా నుండుటవలన వేఱు వేఱు కర్మలు చేయు

టకు సాధ్యము కాలేదు. అప్పుడు బ్రహ్మ క్షత్ర మను ప్రశస్త రూప మును ఉత్పన్నము జేసెను. దేవతలయందు ఇంద్ర, వరుణ, సోమ, రుద్ర, పర్జన్య, యము, మృత్యు, ఈశాన్య ఇత్యాది క్షత్రియులను ఉత్పన్నము జేసెను. అందువల్లనే క్షత్రియునికంటెను ఎక్కువయిన ధేమియును లేదు. కాబట్టి రాజసూయమునందు బ్రాహ్మణులు క్రింద నిలిచి క్షత్రియుని ఉపాసన జేతురు. అతడు అనగా బ్రహ్మము తన యశస్సును క్షత్రియునియందు స్థాపించును. బ్రహ్మమే క్షత్రియునకు యోని కాబట్టి రాజు శ్రేష్ఠత్వమును పొందినను చివరకు బ్రహ్మము నాశ్రయించును. అది అతని ఉత్పత్తిస్థానము. అతనిని అనగా బ్రహ్మ మును హింసించువాడు తన్నే హింసించుకొనిన వాడగును. శ్రేష్ఠులను హింసించి పాపి యైనట్లు అతడు పాపి యగును. ఆత్మఘాతకు డగును.

స నైవ వ్యభవత్ స విశమసృజత యాన్యేతాని దేవజాతాని గణశ ఆఖ్యాయంతే వసవో రుద్రా ఆదిత్యా విశ్వేదేవా మరుత ఇతి. 12

ఇట్లు క్షత్రియులను కలుగ జేసినను వివిధ కర్మలు చేయ బ్రహ్మము శక్తివంతము కాలేదు. అందువలన నతడు వైశ్యుని ఉత్ప న్నము జేసెను. గణశః లేక గణములని చెప్పబడు దేవతలందు వసు, రుద్ర, ఆదిత్య, విశ్వేదేవాది దేవతలను అనగా వైశ్య దేవతలను ఉత్ప న్నము జేసెను.

స నైవ వ్యభవత్ స శౌద్రం వర్ణమసృజత పూషణమియం వై పూషేయగ్ం హీదగ్ం సర్వం పుష్యతి యదిదం కించ. 13

అయినను అతడు అన్నిపనులు చేయుటకు శక్తుడు గాలేదు. కావున నప్పుడు శూద్ర వర్ణమును కలిగించెను. పురుషుడే శూద్రుడు అనగా ఈ పృథివి అంతయు పూష యని చెప్పబడును. ఎందుకనగా, ఇదియే అన్నిటిని పోషించునదై యున్నది.

స నైవ వ్యభవత్తచ్ఛ్రేయోరూప మత్యసృజత ధర్మం తదేతత్క్షత్రస్య క్షత్రం యద్ధర్మస్తస్మాద్ధర్మాత్పరం నాస్త్యథో అబలీయాన్ బలీయాగ్ంసమాశగ్ంసతే ధర్మేణ యథా రాజ్ఞైవం యో వై స ధర్మస్సత్యం వై తత్తస్మాత్సత్యం వదంతమాహుర్ధర్మం వదతీతి ధర్మం వా వదంతగ్ం సత్యం వదతీ త్యేతద్ధ్యేవైతదుభయం భవతి.14

అప్పటికిని అతడు అన్ని కర్మలను నిర్వర్తింప సమర్థుడు గాలేదు. అప్పుడు ధర్మమను ప్రశస్త రూపము నుత్పన్నము జేసెను. ఈ ధర్మమను నది క్షత్రియుని క్షత్రమై యున్నది. అనగా రక్షకమై యున్నది. అందు వలన ధర్మమునకంటె ఎక్కువైన దేమియు లేదు. కాబట్టి అబలులు గూడ ధర్మబలమున సబలులను పరాజయ మొనర్ప యత్నింతురు. ఎట్లు ఒక సామాన్య వ్యక్తి రాజుయొక్క బలముచే అన్యులను జయింప ప్రయత్నించునో అటువలె ఈ ధర్మ మనునది సత్యమై యున్నది. ఎవడైనను సత్యము పలుక నారంభించిన అతడు ధర్మమును పలుకుచున్నాడని యందురు. ధర్మమును చెప్ప నారంభించిన సత్యమును పల్కుచున్నా డందురు. ఇదే ఈ రెండు రూపము లయి యున్నది. ధర్మమే సత్యము. సత్యమే ధర్మము. ఈ రెండును ఒకటే.

తదేతద్బ్రహ్మ క్షత్రం విట్ఛూద్రస్తదగ్నినైవ దేవేషు బ్రహ్మాభవద్బ్రాహ్మణో మనుష్యేషు క్షత్రియేణ క్షత్రియో వైశ్యేన వైశ్యః శూద్రేణ శూద్రస్తస్మాదగ్నావేవ దేవేషు లోకమిచ్ఛంతే బ్రాహ్మణే మనుష్యేష్వేతాభ్యాగ్ం హి రూపాభ్యాం బ్రహ్మాభవత్. అథ యో హ వా అస్మాల్లోకాత్స్వం లోకమదృష్ట్వా ప్రైతి స ఏనమవిదితో న భునక్తి యథా వేదో వాఽననూక్తోఽన్యద్వా కర్మాకృతం యది హ వా అప్యనేవం విన్మహత్పుణ్యం కర్మ కరోతి తద్ధాస్యాంతతః క్షీయత ఏవాత్మానమేవ లోకముపాసీత స య ఆత్మానమేవ లోకముపాస్తే న హాస్య కర్మ క్షీయతే. అస్మాద్ధ్యేవాత్మనో యద్యత్కామయతే తత్తత్సృజతే. 15

ఆ బ్రహ్మతత్త్వ మీ విధముగ బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను నాలుగు విధములై యున్నది. అది అగ్నిరూపముచేత దేవతలయందు బ్రాహ్మణ్య మయ్యెను. మనుష్యులయందు బ్రాహ్మణు డయ్యెను. క్షత్రియుల రూపమున క్షత్రియత్వము నొందెను. వైశ్యుల రూపమున వైశ్యత్వమును, మఱియు శూద్ర రూపమున శూద్రత్వము నందెను. అందుచేత అగ్నియే ముఖముగా గలిగి దేవతలవలన మంచి లోకములను ఇచ్ఛయింతురు. మానవులయందు బ్రాహ్మణుల ముఖమున సత్ఫలము నిచ్ఛయింతురు. ఎందుకనగా బ్రహ్మము ఈ రెండు రూపములను బొందెను. ఇక ఎవడు ఆత్మ లోకము నెఱుగకనే ఇచ్చటినుండి వెడలునో అనగా చచ్చునో అతడు తత్త్వమును తెలియ నందువలన దానిని పొందుట లేదు. ఎట్లనిన, వేదాధ్యయనము చేయకుండినను, కర్మను చేయలేకపోయినను ఫల ప్రాప్తి ఎటులగాదో అటువలె ఆత్మవిషయకమగు జ్ఞానము లేక యుండిన అది తెలియదు. ప్రాప్తము గాదు. ఇచ్చట ఆత్మజ్ఞానము లేని వాడు అనగా ఆత్మానుభవము లేని వాడు మహత్తరమగు పుణ్య కర్మను చేసినను అది చివరకు క్షయ మొందును. అందువలన ఆత్మ లోకోపాసన అనగా జ్ఞానము నొందుట అత్యావశ్యకము. ఆత్మోపాసన చేయు వాని కర్మ క్షయ మొందదు. ఏతత్ఫలము అక్షయ మగు ఆత్మ జ్ఞానము నొసగునని భావము. అతడేదేది ఇచ్ఛయించునో అదెల్ల ఆత్మచే ప్రాప్తమగును. *సర్వాకామావాప్తి తృప్తి యగునని అర్థము

అథో అయం వా ఆత్మా సర్వేషాం భూతానాం లోకః సయ జ్జుహోతి యద్యజతే తేన దేవానాం లోకోఽథ యదనుబ్రూతే తేన ఋషీణా మథయత్పితృభ్యో నిపృణాతి యత్ప్రజామిచ్ఛతే తేన పితౄణా మథ యన్మనుష్యా న్వాసయతే య దేభ్యోఽశనం దదాతి తేన

* సర్వరూపు డగుటయే సర్వము ప్రాప్తించుట యనుమాట కర్థమని వార్తి కారుల వాక్యము.

మనుష్యాణాం అథ యత్పశుభ్యస్తృణోదకం విందతి తేన పశూనాం యదస్య గృహేషు శ్వాపదానయాగ్ంస్యాపిపేలికాభ్య ఉపజీవంతి తేన తేషాం లోకో యథా హ వై స్వాయలోకాయారిష్టిమిచ్ఛేదేవగ్ం హైవం విదే సర్వాణి భూతాన్యరిష్టిమిచ్ఛంతి తద్వా ఏతద్విదితం మీమాంసితమ్. 16

ఈ ఆత్మయే అన్నిభూతములయొక్క లోకమై యున్నది. సర్వ ఫలములునై యున్నదని భావము. మనుష్యుడు యజ్ఞము చేసినచో ఆత్మ వానికి దేవలోక మొసగును. స్వాధ్యాయ మొనర్చిన ఋషిలోకమును, పితృదేవతలకు పిండము పెట్టుచో ప్రజను అనగా సంతానమును, ఇచ్ఛయించిన పితృలోకమును, జనులకు ఆశ్రయము, అన్నము నిచ్చినచో మనుష్య లోకమును, పశువులకు గడ్డి నీళ్ళిచ్చిన పశులోకమును, చీమలు మొదలగు ప్రాణులకు ఉపజీవన మొసగిన వాటి లోకములను, నొసగును. మానవులు తమ ఇష్టమగు లోకములను ఇచ్ఛయించునట్లు, ఆత్మయే సర్వ లోకములని తెలిసినవారు ఈ ఆత్మనే ఇచ్ఛయింతురు. ఈ విధముగా సర్వోత్కృష్టమగు ఆత్మయే సర్వ మని ఆత్మజ్ఞాన మహిమ చెప్పబడినది. మఱియు ఏతద్విమర్శయు నయినది.

ఆత్మైవేదమగ్ర ఆసీదేక ఏవ సోఽకామయత జాయా మే స్యాదథ ప్రజాయేయాథ విత్తం మే స్యాదథ కర్మ కుర్వీయేత్యేతావాన్ వై కామో నేచ్ఛగ్ంశ్చ నాతో భూయో విందేత్తస్మాదప్యేతర్హ్యేకాకీ కామయతే జాయా మేస్యాదథ ప్రజాయేయాథ విత్తం మే స్యాదథ కర్మ కుర్వీయేతి స యావదప్యేతేషామేకైకం న ప్రాప్నోత్యకృత్స్న ఏవ తావన్మన్యతే తస్యోకృత్స్నతా మన ఏవాస్యాత్మా వాగ్జాయా ప్రాణః ప్రజా చక్షుర్మానుషం విత్తం చక్షుషా హి తద్విందతే శ్రోత్రం దైవగ్ం శ్రోత్రేణ హి తచ్ఛృణోత్యాత్మైవాస్య కర్మాత్మనా హి కర్మ కరోతి స ఏష పాఙ్క్తో యజ్ఞః పాంక్తః పశుః పాంక్తః పురుషః పాంక్తమిదగ్ం సర్వం యదిదం కించ తదిదగ్ం సర్వమాప్నోతి య ఏవం వేద.

ఆదియందు ఆత్మ ఒక్కటే యుండెను. అయ్యది నాకు భార్య కావలెనని ఇచ్ఛయించెను. ప్రజలు, సంతానోత్పత్తియు, ధనమును కావలెను; నేను కర్మ చేయవలయు ననుచీ విధముగా ఇచ్ఛయించెను. ఇవి వానియొక్క కోరికలు. ఇంతకంటెను అధికముగ ఇచ్ఛయించిన వాడు అధికమును పొందజాలడు. అందువలన ఒక్కడుగ నుండువాడు ధన వనితాపుత్రాదులు గావలయునని, నేను కర్మ చేయ వలయు నని ఇచ్ఛయించును. వీనియం దొక్కటి ప్రాప్త మగునంత వఱకు. వాని మనస్సే వానికి ఆత్మ. వాక్కే భార్య. ప్రాణమే పుత్రుడు. కన్నులే మానుషమగు ధనము. ఎందుకనగా, కంటిచేతనే విత్తమును దెలిసికొనును. శ్రోత్రేంద్రియమే దైవము. ఆత్మయే కర్మ. ఆత్మ నుండియే దేహేంద్రియములచే కర్మ యగునని అర్థము. ఇది పాంక్త యజ్ఞము. ఐదుగురిచే నయినదని అర్థము. యజ్ఞము, పశువు పాంక్తము. పురుషుడు పాంక్తమే. సర్వమును పాంక్తమే. ఇట్లు తెలిసినవాడు సమస్తమును బడయును.

## ౫-వ బ్రాహ్మణము

అవ : అన్నముయొక్క ఉత్పత్తి, తదుపాసనయు, మనో వాక్ప్రాణ రూపములచే కల్పింప బడిన సృష్టివిభాగము.

యత్సప్తాన్నాని మేధయా తపసా జనయత్పితా ఏకమస్య సాధారణం ద్వే దేవానభాజయత్త్రీణ్యాత్మనే కురుత పశుభ్య ఏకం ప్రాయచ్ఛత్తస్మిన్సర్వం ప్రతిష్ఠితం యచ్చ ప్రాణితి యచ్చ న కస్మా త్తాని న క్షీయంతేఽద్యమానాని సర్వదా యో వై తామక్షితిం వేద సోఽన్నమత్తి ప్రతీకేన స దేవానపి గచ్ఛతి స ఊర్జ ముపజీవతీతి శ్లోకాః. 1

ప్రజాపతి మేధ, మఱియు తపస్సు వీటి సహాయముచే ఏ సప్తా న్నములను ఉత్పన్నము జేసెనో అవేవి? యనిన, ఒకటి అందఱికి సామాన్యమై యుండి భుజింపబడు అన్నము, రెండన్నములను దేవతల్కు

పొందునట్లు జేసెను. ఒకటి హుతము. అగ్నియందు హోమము చేయ బడిన అన్నము. మఱొకటి ప్రహుతము. బలిగా అర్పించినఅన్నము. ఒక అన్నమును పశువుల కిచ్చెను. ఆ అన్నమే పాలు. మనుష్యులును పశువులును మొదట పాలు త్రాగియే జీవింతురు. ఎవడు ఈ తత్త్వమును తెలిసికొనునో అతడు తన ముఖరూప ప్రతీకముచే అన్నమును దినును. దేవత్వమును బొందును. అనగా అమృతత్వమును పొంది ఉపజీవించును.

ఈ బ్రాహ్మణమునందు 23 మంత్రములు గలవు. అన్నప్రశంస, సంవత్సరము ప్రజాపతి యనువాడు 16 కళలు గలవాడను విషయము, మఱియు మూడు లోకములను గుఱించిన విమర్శయు, అనంతరమే వ్రతములయొక్క చర్చయు, ప్రజాపతియే కర్మనిర్మాత యనునీ విషయములు చెప్పబడి యున్నవి.

## 6-వ బ్రాహ్మణము

ఈ బ్రాహ్మణమునందు నామ రూప కర్మలును, వాటి ఉత్పత్తి స్థానమును చెప్పబడి యున్నది. వాక్కుచే నామములయొక్క ఉత్పత్తి, అదియే వాటికి ఆధారమును, అటువలె రూపములయొక్క ఉత్పత్తి చక్షుస్సు అనియు అదియే ఆధార మనియు, ఆత్మచే కర్మలయొక్క ఉత్పత్తి అర్థాత్ శరీరముచే కర్మ యని భావము. ఆత్మ నామ రూపాచ్ఛాదితమై యున్నదను మొదలగు విషయములు చెప్పబడి యున్నవి.

ప్రథమాధ్యాయము సమాప్తము

## ద్వితీయాధ్యాయము

### 1-వ బ్రాహ్మణము

### గార్గ్య అజాతశత్రువుల సంవాదము

దృప్త బాలాకిర్హానూచానో గార్గ్య ఆస స హోవాచాజాతశత్రుం కాశ్యం బ్రహ్మ తే బ్రువాణీతి స హోవాచాజాతశత్రుః సహస్రమేతస్యాం వాచి దద్మో జనకో జనక ఇతి వై జనాధావంతీతి. 1

పూర్ణ మగు చక్కని జ్ఞానము లేకుండినను గార్గ్య బాలాకి యను గర్విష్ఠు డొక డుండెను. అతడు అజాత శత్రువను కాశీరాజు కడకు వెళ్ళి ఓ రాజా! నీకు నేను బ్రహ్మజ్ఞానము బోధించెద ననెను. అజాతశత్రువు ఈ మాట మాత్రముననే వెయ్యి గోవులను నీకిచ్చెద ననెను. (అందువల్లనే) ఇతనిని "జనక" "జనక" అనగా మహాదాని యని జను లెల్లరు స్తోత్రము జేయుదురు.

స హోవాచ గార్గ్యో య ఏవాసావాదిత్యే పురుష ఏతమేవాహం బ్రహ్మోపాస ఇతి స హోవాచాజాతశత్రుర్మా మైతస్మిన్ సంవదిష్ఠా అతిష్ఠాః సర్వేషాం భూతానాం మూర్ధా రాజేతి వా అహమేతముపాస ఇతి స య ఏతమేవముపాస్తేఽతిష్ఠాః సర్వేషాం భూతానాం మూర్ధా రాజా భవతి. 2

బాలాకి : ఆదిత్యునియం దుండు పురుషుడే బ్రహ్మ మని నేనుపాసింతు నని చెప్పెను. ఈ మాటవిని అజాతశత్రువు: వలదు. ఆ బ్రహ్మమును గుఱించి నేను ఎఱుగుదును. కావున ఆ సంవాదమునే చేయకుము. బ్రహ్మము అన్ని భూతముల కతీతమై యున్నది. అది సమస్త భూతముల శిరస్సై యున్నది. అది రాజు. నేనా బ్రహ్మము నుపాశించుచున్నాను. ఎవడా బ్రహ్మమును ఉపాసించునో అతడు సర్వభూతముల అగ్రస్థానమై యుండును. ఇత్యాదిగా రాజు చెప్పుట; మరల బాలాకి తనకు తెలిసిన ప్రకారముగ చంద్రుడు,

విద్యుత్తు, ఆకాశము వీనిని బ్రహ్మమని తెలుపుట; అటువలె జలము నందలి పురుషుడు, దర్పణమునందుండు పురుషుడు, దిక్కులయందున్న పురుషుడు, ఛాయా పురుషుడు ఇత్యాదులను బ్రహ్మమని తెలుపుట; అజాత శత్రువు ఇది చక్కని బ్రహ్మానుభవము కాదని ఖండించుట ఇత్యాది రూప మైన సంవాదము పదుమూడవ మంత్రము వఱకు ఇచ్చట తెలుపబడి యున్నది.

అవ: ఈ పదునాల్గవ మంత్రమునుండి అజాతశత్రువుయొక్క ప్రబోధ చేయబడి యున్నది.

స హోవాచాజాతశత్రు రేతావన్నూ3 ఇత్యేతావద్ధీతి నైతావతా విదితం భవతీతి స హోవాచ గార్గ్య ఉపత్వాయానీతి. 14

అజాతశత్రువు: అయినదా? ఇంతేనా?

గార్గ్యుడు: ఔను. ఇంతే.

అజాతశత్రువు: ఇంత మాత్రమున నీవు బ్రహ్మమును దెలిసినట్లు కాలేదు.

గార్గ్యుడు: మహారాజా! నేను నిన్ను శిష్య భావముచే శరణు బొందితిని. నాకు బ్రహ్మతత్త్వమును తెలుపుము.

స హోవాచాజాతశత్రుః ప్రతిలోమం చైతద్యద్బ్రాహ్మణః క్షత్రియముపేయాద్బ్రహ్మ మే వక్ష్యతీతి వ్యేవ త్వా జ్ఞాపయిష్యామీతి తం పాణావాదాయోత్తస్థౌ తౌ హ పురుషగ్ం సుప్త మాజగ్మతు స్తమేతైర్నామభిరామంత్రయాంచక్రే బృహన్పాణ్డరవాసః సోమ రాజన్నితి స నోత్తస్థౌ తం పాణినా పేషం బోధయాంచకార సహోత్తస్థౌ. 15

అజాతశత్రువు: బ్రహ్మజ్ఞానమును నాకు దెలుపుమని బ్రాహ్మణుడు క్షత్రియుడనైన నా కడకు వచ్చి అడుగుట యనిన ఇది విరుద్ధము. అయిన నేమి? నేను నీ కాజ్ఞానమును గుఱించి చెప్పెదనని

అతని చేయి పట్టుకొని లేచి వారిద్దఱు గలసి నిద్రించి యుండిన ఒక మనుష్యుని కడకు వెడలిరి. ఓ సోమరాజా! తెల్లని వస్త్రములను కట్టిన వాడా! యని అతనిని అజాతశత్రువు పిలిచెను. నిద్రించినవాడు లేవ లేదు. అప్పుడు రాజతనిని చేతితో దట్టి కదలించెను. అప్పు డతడు లేచెను.

స హోవాచాజాతశత్రుర్యత్రైష ఏతత్సుప్తోఽభూద్య ఏష విజ్ఞానమయః పురుషః క్వైష తదా ఽభూత్కుత ఏతదాగాదితి తదుహ న మే నే గార్గ్యః. 16

అజాతశత్రువు: ఓ గార్గ్యుడా! ఈ విజ్ఞానమయ పురుషుడు నిద్రించినపుడు ఎచ్చటికి వెళ్ళి యుండెను? అతడు ఎక్కడ నుండెను? ఇప్పుడు ఎచ్చటనుండి వచ్చెను?

గార్గ్యుడు: నా కావిషయము తెలియ లేదు.

స హోవాచాజాతశత్రుర్యత్రైష ఏతత్సుప్తోఽభూద్య ఏష విజ్ఞానమయః పురుష స్తదేషాం ప్రాణానాం విజ్ఞానేన విజ్ఞానమాదాయ య ఏషోఽంతర్హృదయ ఆకాశ స్తస్మిఞ్ఛేతే తాని యదా గృహ్ణాత్యథ హైతత్పురుషః స్వపితి నామ తద్గృహీత ఏవ ప్రాణో భవతి గృహీతా వాక్ గృహీతం చక్షుర్గృహీతగ్ం శ్రోత్రం గృహీతం మనః. 17

అజాతశత్రువు: ఇతడు నిద్రించిన కాలమున ఈ విజ్ఞానమయ పురుషుడు, ఈ ప్రాణములు విజ్ఞానముతో సహ సంవేదన సామర్థ్యము అనగా తెలియు శక్తిని గ్రహించి హృదయాంతర్గతమై యుండు ఆకాశమున-విశ్రమించి యుండును. పురుషుని జ్ఞాన సామర్థ్యము లెల్ల కారణాకారముగ ఘనీభవించి ఏకమై యుండు నపుడు పురుషుడు నిద్రించి యున్నాడని యందుము. అప్పుడు ప్రాణము (లోపలికి) గ్రహింప బడి యున్నది. వాక్కు, చక్షుస్సు, శ్రోత్రము, మనస్సు ఇత్యాది విజ్ఞాన సామర్థ్యము గల ఇంద్రియము లన్నియు గ్రహింపబడి యున్నవి.

స యత్రైతత్స్వప్న్యయా చరతి తే హాస్య లోకా స్తదు తేవ మహారాజో భవత్యు తేవ మహాబ్రాహ్మణ ఉతేవోచ్చావచం నిగచ్ఛతి స యథా మహారాజో జానపదాన్ గృహీత్వా స్వే జనపదే యథా కామం పరివర్తేతైవమేవైష ఏతత్ప్రాణాన్ గృహీత్వా స్వే శరీరే యథా కామం పరివర్తతే. 18

అపుడు ఆ విజ్ఞానమయ పురుషుడు స్వప్న సృష్టియందు సంచరించుచుండ ఆ స్వప్నము అతని లోక మైయే అగపడును. అప్పుడతడు మహారాజగును. మహా బ్రాహ్మణు డగును. ఉచ్చనీచ భావములను పొందును. రాజు ఒక్కడే తన సేవకునితో గూడి స్వదేశమున ఇచ్ఛానుసారముగ ఎట్లు సంచరించునో అదే విధముగా విజ్ఞానమయాత్మ ఈ ప్రాణములతో స్వప్న సమయమున ఈ శరీరమునందు స్వేచ్ఛగా సంచరించును. వాసనానుసార మా యా అనుభవములను పొందును.

అథ యదా సుషుప్తో భవతి యదా న కస్య చ న వేద హితా నామ నాడ్యోద్వాసప్తతిః సహస్రాణి హృదయాత్పురీతత మభిప్రతిష్ఠంతే తాభిః ప్రత్యవసృప్య పురీతతి శేతే స యథా కుమారో వా మహారాజో వా మహాబ్రాహ్మణో వాఽతిఘ్నీమానందస్య గత్వా శయీతైవ మేవైష ఏతచ్ఛేతే. 19

ఇక నతడు నిద్రించు నపుడు రెండవ ఏ వస్తు జ్ఞానమును లేనపుడు హృదయము నుండి వెడలి సర్వ శరీరమును వ్యాపించు హిత యను పేరు గల 72 వేల నాడులయందు చేరి అతడు శరీరమునందు నిద్రించి యున్నాడు. ఏ విషయ వాసనలును లేక బాలుడును, మహారాజును, మహాబ్రాహ్మణుడును అత్యంత ఆనందస్థితి యందు నిద్రించునటుల ఇతడు అనగా విజ్ఞానమయ పురుషుడు నిద్రించును.

స యథోర్ణనాభి స్తంతునోచ్చరేద్యథాఽగ్నేః క్షుద్రా విస్ఫులింగా వ్యుచ్చరంత్యేవమేవాస్మాదాత్మనః సర్వే ప్రాణా స్సర్వే లోకా స్సర్వే

దేవా స్సర్వాణి భూతాని వ్యుచ్చరంతి తస్యోపనిషత్సత్యస్య సత్యమితి ప్రాణా వై సత్యం తేషా మేష సత్యమ్. 20

సాలెపురుగు శరీరమునుండి తంతువులు వెడలునట్లును, అగ్ని నుండి మిణుగురులు బయల్వెడలునట్లును ఆత్మనుండి ప్రాణములు సర్వ లోకములు, సర్వదేవతలు, సమస్త భూతప్రాణిజాతము బయల్వెడలును (కలుగును). ఆయాత్మ జ్ఞానము సత్య సత్యమై యున్నది. ప్రాణములయొక్క పరమ సత్యమగు అస్తిత్వము ఆత్మయేనని అర్థము.

---

## 2–వ బ్రాహ్మణము

ఈ బ్రాహ్మణమున ప్రాణముయొక్క అధిష్ఠానము శరీరమే యని చెప్పి ప్రాణము శిశువని వర్ణించి, ఇంద్రియములే దీనికి సహచరులనియు, వాక్కే ముఖమనియు ఇత్యాది విషయములు చెప్పబడి యున్నవి.

## 3–వ బ్రాహ్మణము

ఈ బ్రాహ్మణమునందు బ్రహ్మమునకు మూర్తామూర్తములను రెండు రూపములను కల్పించి ఆధ్యాత్మిక ఆదిదైవికము లను రెండు భేదములు గలవనియు ప్రాణమే సత్యమనియు, బ్రహ్మమే పరమసత్యమనియు నిత్యాది విషయములు చెప్పబడి యున్నవి.

## 4–వ బ్రాహ్మణము

ఈ బ్రాహ్మణమునందలి విషయము, 4–వ అధ్యాయము –5–వ బ్రాహ్మణమునందలి విషయము రెండును ఒకటే గావున, ఈ బ్రాహ్మణమునందలి విషయము 4–వ అధ్యాయము –5–వ బ్రాహ్మణమునందు తెలుప బడినది.

## 5–వ బ్రాహ్మణము

ఈ ఐదవ బ్రాహ్మణమునందు మధువిద్య యొక్క వర్ణన గలదు. పృథివి మొదలు ఆత్మ వఱకును గల ఆదిత్య చంద్రాది సమస్త

వస్తు జాతము మధుస్వరూప మని ప్రతిపాదింపబడి యున్నది. ప్రతి ప్రదార్థమునందును ఆత్మయే మధువనియు, అదే బ్రహ్మ మనియు వర్ణింప బడినది.

ఈ బ్రాహ్మణముయొక్క తత్త్వార్థ మేమనగా ఆత్మయే సర్వ స్వరూపము. అదే రసము. మధురము. ఆత్మయందే ఈ సర్వమునకు ఉత్పత్తి స్థితి లయాదులు. ఆత్మ సర్వాతీతము. కార్య కారణ రహితము అను ఇత్యాది విషయములు చెప్పబడి యున్నవి.

## 6–వ బ్రాహ్మణము

ఈ బ్రాహ్మణమునందు మధువిద్యయొక్క గురు శిష్య పరంపరాభివర్ణనము గలదు.



# తృతీయాధ్యాయము

## 1–వ బ్రాహ్మణము

అవ: ఈ అధ్యాయమున 9 బ్రాహ్మణములు గలవు. యాజ్ఞవల్క్యునకును కురుపాంచాల దేశపు బ్రాహ్మణులకును జరిగిన సంవాదము గలదు. జనకమహారాజు ఒకప్పుడు పెద్ద యజ్ఞము చేసెను. ఆ యజ్ఞమునకు యాజ్ఞవల్క్య మహామునితో సహా కురుపాంచాల దేశములోని అనేకమంది బ్రాహ్మణులు వచ్చి యుండిరి. బ్రహ్మవిషయక మగు చర్చను విన గోరి జనకుడు వేయి గోవులను సువర్ణాభరణములచే నలంకరింప జేసి మీలో ఎవరు బ్రహ్మజ్ఞానులో వారీ గోవులను తోలుకొని పోవచ్చునని పలుకుట ఇత్యాది విషయములు.

జనకో హ వైదేహో బహుదక్షిణేన యజ్ఞేనేజే తత్ర హ కురుపాంచాలానాం బ్రాహ్మణా అభిసమేతా బభూవుస్తస్య హ జనకస్య వైదేహస్య విజిజ్ఞాసా బభూవ కస్స్విదేషాంబ్రాహ్మణానా మనూచానతమ ఇతి సహ గవాగ్ం సహస్ర మవరురోధ దశ దశ పాదా ఏకైకస్యాశ్శృంగయో రాబద్ధా బభూవుః. 1

విదేహ దేశపు రాజగు జనకుడు విశేషమగు దక్షిణ లొసగి యజ్ఞమును జేసెను. కురుపాంచాల దేశమునుండి అనేకమంది బ్రాహ్మణు లా యజ్ఞమునకు వచ్చి యుండిరి. వారియందు ఎవరు వేదజ్ఞులో తెలియ నిచ్ఛయించి వేయి గోవులను ఒక్కొక్క గోవునకు పది పది నాణెముల వంతున బంగారపు తొడుగులను గోశృంగములకు ధరింప జేసి,

తాన్ హోవాచ బ్రాహ్మణా భగవంతో యో వో బ్రహ్మిష్ఠః స ఏతా గా ఉదజతామితి తే హ బ్రాహ్మణా న దధృషురథ హ యాజ్ఞవల్క్యః స్వమేవ బ్రహ్మచారిణ మువాచైతాః సోమ్యోదజ సామశ్రవా ఇతి తా హోదాచకార తే హ బ్రాహ్మణాశ్చుక్రుధుః కథం నో బ్రహ్మిష్ఠో బ్రువీతేత్యథ హ జనకస్య వైదేహస్య హోతాఽశ్వలో బభూవ స హైనం పప్రచ్ఛ త్వం ను ఖలు నో యాజ్ఞవల్క్య బ్రహ్మిష్ఠోసీ3 ఇతి స హోవాచ నమో వయం బ్రహ్మిష్ఠాయ కుర్మో గోకామా ఏవ వయగ్ంస్మ ఇతి తగ్ం హ తత ఏవ ప్రష్టుం దధ్రే హోతాఽశ్వలః. 2

ఓ బ్రాహ్మణ శ్రేష్ఠులారా! మీ అందఱియందు ఎవరు బ్రహ్మనిష్ఠులో వారీ ఆవులను తీసికొని పోవచ్చునని మహారాజు అందఱికిని తెలియ జేసెను. అప్పుడా గోవులను దోలుకొని పోవుటకా బ్రాహ్మణులయం దెవరికిని శక్తి చాల దయ్యెను. ధైర్యము లేక పోయెను. యాజ్ఞవల్క్య మహాముని తన శిష్యుడగు సామశ్రవుడను నొక బ్రహ్మచారిని పిలిచి ఓ సౌమ్యుడా! ఈ యావులను మన ఆశ్రమమునకు దోలుకొని పొమ్మని ఆజ్ఞ జేసెను. మంచిదని అతడు గురువులు చెప్పిన చొప్పున ఆవులను తోలుకొని పోయెను. అచ్చట గూడిన యా బ్రాహ్మణులు ఇందఱిలో తా నొక్కడే గొప్ప బ్రహ్మనిష్ఠు డనునది ఇతడెట్లు తెలిసెనని కుపితులైరి. జనకరాజు కడ అశ్వలుడను నొక ఋత్విజు డుండెను, అతడు యాజ్ఞవల్క్యుని చూచి ఓ యాజ్ఞవల్క్యుడా! మా అందఱి

యందును నీ వొక్కడవే గొప్ప బ్రహ్మనిష్ఠుడ వని తెలిసి యున్నావా? ఏమని ప్రశ్నించెను. అప్పుడు వినమ్రభావమున యాజ్ఞవల్క్యుడు స్వామీ! బ్రహ్మనిష్ఠునకు నేను వందనము లాచరింతును. నాకు ఆవుల యాశ మాత్రము గలదు. అనగా మన మందఱము గోవులను గోరెడి వారమై యున్నార మని నిరహంకృతి సూచకముగ బలికెను. అశ్వాలు డను నతడు పరీక్షార్థమై ఇట్లు యాజ్ఞవల్క్యుని ప్రశ్నింప నారంభించెను.

మృత్యుగ్రస్త మగు కర్మాసక్తినుండి దూరమగు ఉపాయము

యాజ్ఞవల్క్యేతి హోవాచ యదిదగ్ం సర్వం మృత్యు నాఽఽప్తగ్ం సర్వం మృత్యునాఽభిపన్నం కేన యజమానో మృత్యో రాప్తి మతిముచ్యత ఇతి హోత్ర ర్త్విజాగ్నినా వాచా వాగ్వై యజ్ఞస్య హోతా తద్యేయం వాక్ సోఽయమగ్నిః స హోతా స ముక్తి స్సాఽతి ముక్తిః.3

అశ్వాలుడు: ఓ యాజ్ఞవల్క్య! ఇదంతయును ఋత్విగాది యజ్ఞోప కరణము లన్నియును మృత్యువుచే వ్యాప్తమై యున్నవి. అనగా మృత్యువశమై యున్నది. కాబట్టి యజమానుడు ఏ సాధనలచే మృత్యువును దాటి ముక్తు డగును?

యాజ్ఞవల్క్యముని : హోత యను ఋత్విజునిచే అగ్నిరూప మగు వాక్కువలననే. వాక్కే యజ్ఞముయొక్క హోత. వాక్కను నది అగ్ని. అతడే హోత. ఇట్లభేదముగ దెలియుటయే ముక్తి. అదియే మృత్యువునుండి తరించెడి అతిముక్తి.

యాజ్ఞవల్క్యేతి హోవాచ యదిదగ్ం సర్వ మహోరాత్రాభ్యా మాప్తగ్ం సర్వ మహోరాత్రాభ్యా మభిపన్నం కేన యజమానో ఽహోరాత్రయో రాప్తిమతిముచ్యత ఇత్యధ్వర్యుణ ర్త్విజా చక్షుషా ఽఽదిత్యేన చక్షుర్వై యజ్ఞస్యాధ్వర్యు స్తద్యదిదం చక్షుః సోఽసా వాదిత్యః సోఽధ్వర్యుః స ముక్తిః సాఽతిముక్తిః. 4

అశ్వలుడు : అయ్యా! ఈ సమస్తమును రేయింబవళ్ళచే వ్యాప్తమై యున్నది. రాత్రింబవళ్ళకు వశమై యున్నది. యజమానుడు ఏ సాధనలచేత ఈ అహోరాత్రములను గడపి ముక్తుడగును?

యాజ్ఞవల్క్యముని : అధ్వర్యువను ఋత్విజునిచేతను చక్షువుచేతను ఆదిత్యునిచేతను. చక్షుస్సే యజ్ఞముయొక్క అధ్వర్యుడు. ఈ చక్షువే ఆదిత్యుడు. అదే అధ్వర్యుడు ముక్తియు అతిముక్తియును.

యాజ్ఞవల్క్యేతి హోవాచ యదిదగ్ం సర్వం పూర్వపక్షాపరపక్షాభ్యా మాప్తగ్ం సర్వం పూర్వపక్షాపరపక్షాభ్యా మభిపన్నం కేన యజమానః పూర్వపక్షాపరపక్షయో రాప్తి మతిముచ్యత ఇత్యుద్గాత్ర ర్త్విజా వాయునా ప్రాణేన ప్రాణో వై యజ్ఞస్యోద్గాతా తద్యోఽయం ప్రాణస్స వాయుః స ఉద్గాతా స ముక్తిః సాఽతి ముక్తిః. 5

అశ్వలుడు : ఓ యాజ్ఞవల్క్యా! ఇదంతయును పూర్వపక్షము, అపర పక్షము; అనగా శుక్ల కృష్ణ పక్షములచే వ్యాప్తమై యున్నది. ఇది పూర్వ అపర పక్షముల వశమై యున్నది. యజమానుడు ఏ సాధనమువలన ఈ రెండు పక్షములను దాటి ముక్తుడగును?

యాజ్ఞ : ప్రాణముచేతను ఉద్గాత యను వాయువుచేతను దాట వచ్చును. ప్రాణమే ఈ యజ్ఞముయొక్క ఉద్గాత. ఈ ప్రాణమే వాయువు. ఇదే ఉద్గాత. ఈ ప్రకారము అభేదముగా దెలిసికొనిన అదే ముక్తి. అదియే అతిముక్తి.

యాజ్ఞవల్క్యేతి హోవాచ యదిద మంతరిక్ష మనారంభణ మివ కేనాఽఽక్రమేణ యజమానః స్వర్గం లోక మాక్రమత ఇతి బ్రహ్మణ ర్త్విజా మనసా చంద్రేణ మనో వై యజ్ఞస్య బ్రహ్మా తద్య దిదం మనః సోఽసౌ చంద్రః స బ్రహ్మా స ముక్తిః సాఽతిముక్తి రిత్యతిమోక్షా అథ సంపదః. 6

అశ్వాలుడు : ఈ అంతరిక్షము (అంతరిక్ష లోకము) ఏ ఆలంబన మును లేక నిరాశ్రయమై యున్నదిగదా ? యజమానుడు ఏ మార్గ మున స్వర్గలోకమునకు వెళ్ళును?

యాజ్ఞ : బ్రహ్మయను ఋత్విజుని వలనను, మనస్సుచేతను చంద్రునిచేతను ఈ మార్గమున యజమానుడు స్వర్గమునకు పోవును. మనస్సే బ్రహ్మము. మనస్సే యజ్ఞమునందలి బ్రహ్మ. ఈ మనస్సే చంద్రుడు. ఇదే బ్రహ్మ. ఈ ప్రకారము అభేదముగ తెలియుటచే ముక్తి, అతిముక్తి. ఇంతవఱకు ముక్తిని గుఱించి చెప్పుట యైనది. ఇక తత్సాధనములను గుఱించి చెప్పబడును.

యాజ్ఞవల్క్యేతి హోవాచ కతిభి రయమద్యర్గ్భి ర్హోతాఽస్మి న్యజ్ఞే కరిష్యతీతి తిసృభి రితి కతమా స్తా స్తిస్ర ఇతి పురోఽనువాక్యా చ యాజ్యా చ శస్యైవ తృతీయా కిం తాభిర్జయతీతి యత్కించేదం ప్రాణభృదితి. 7

అశ్వాలుడు : యాజ్ఞవల్క్యమునీ ! ఈ యజ్ఞమునందు ఈ దినము హోత ఎన్ని ఋక్కులచే ప్రశంసనము జేయును. అనగా హోమము జేయును?

యాజ్ఞ : మూడు ఋక్కులచే.

అశ్వాలుడు : ఏ మూడు ఋక్కులచేత ?

యాజ్ఞ : యజ్ఞమునకు మొదట జెప్పబడిన పురోనువాక్య మను ఋక్కులు. అవి అనువాక్య, యాజ్య, శస్యములని చెప్పబడును.

అశ్వాలుడు: వీటిచేత యజమానుడు దేనిని జయించును.?

యాజ్ఞ: ప్రాణమును ధరించిన సర్వమును, మూడు లోకము లను జయించును.

యాజ్ఞవల్క్యేతి హోవాచ కత్యయ మద్యాధ్వర్యు రస్మిన్యజ్ఞ ఆహుతీ ర్హోష్యతీతి తిస్ర ఇతి కతమా స్తా స్తిస్ర ఇతి యా హుతా

ఉజ్జ్వలంతి యా హుతా అతినేదంతే యా హుతా అధిశేరతే కిం తాభిర్జయతీతి యా హుతా ఉజ్జ్వలంతి దేవలోకమేవ తాభిర్జయతి దీప్యత ఇవ హి దేవలోకో యా హుతా అతినేదంతే పితృలోకమేవ తాభి ర్జయత్యతీవ హి పితృలోకో యా హుతా అధిశేరతే మనుష్య లోకమేవ తాభి ర్జయత్యధ ఇవ హి మనుష్యలోకః. 8

అశ్వలుడు: ఈ యజ్ఞమునందు అధ్వర్యుడు ఎన్ని ఆహుతులను హవన మొనర్చును?

యాజ్ఞ: మూడు ఆహుతులను.

అశ్వలుడు: అవి ఏవి?

యాజ్ఞ: మంటవలె పై కెగబ్రాకు ఆహుతులు అనగా జ్వలించునవి. ఎక్కువ శబ్దము చేయు ఆహుతులు. క్రింది భాగమునకు పోవు ఆహుతులు.

అశ్వలుడు: ఆ యజమానునకు ఇందుచే ఏ విజయము కలుగును?

యాజ్ఞ: మీాద బోవు ఆహుతులచే దేవలోకమును జయిం చును. ఎందుకనగా, దేవలోకము ప్రకాశవంతమై యున్నది. ఎక్కువగా చప్పుడు చేయు ఆహుతులచే పితృలోకమును గెలుచును ఎందుకనగా పితృలోకము ఎక్కువ శబ్దముచే నిండి యుండును. క్రింద బడు ఆహుతులచే మనుష్యలోకము జయించును. ఎందుకనగా మనుష్యలోకము క్రిందిభాగమున నున్నది.

యాజ్ఞవల్క్యేతి హోవాచ కతిభి రయ మద్య బ్రహ్మా యజ్ఞం దక్షిణతో దేవతాభి ర్గోపాయతీ త్యేకయేతి కతమా సైకేతి మన ఏవేత్యనంతం వై మనోఽనంతావిశ్వే దేవా అనంతమేవ స తేన లోకం జయతి. 9

అశ్వలుడు: ఈ యజ్ఞమునందు బ్రహ్మయను ఋత్విక్కు ఎందఱు దేవతల సహాయముచే దక్షిణదిక్కునందు రక్షింప బడు చున్నాడు.

యాజ్ఞ : ఒక్క దేవతయొక్క సహాయమువలన.

అశ్వలుడు: ఆ దేవత ఎవరు?

యాజ్ఞ : మనస్సు. మనస్సు అనంతము. విశ్వదేవతలు అనగా మనోభిమాన దేవతలు అనేకులు. అందుచే యజమానుడు మనస్సుచే అనంత లోకములను జయించును.

యాజ్ఞవల్క్యేతి హోవాచ కత్యయ మద్యోద్గాతాఽస్మిన్యజ్ఞే స్తోత్రియాః స్తోష్యతీతి తిస్ర ఇతి కతమాస్తాస్తిస్ర ఇతి పురోనువాక్యా చ యాజ్యా చ శస్యైవ తృతీయా కతమాస్తా యా అధ్యాత్మమితి ప్రాణ ఏవ పురోనువాక్యాఽపానో యాజ్యా వ్యానశ్శస్యా కిం తాభిర్జయతీతి పృథివీ లోకమేవ పురోనువాక్యయా జయత్యంతరిక్షలోకం యాజ్యయా ద్యులోకగ్ం శస్యయా తతో హ హోతాఽశ్వల ఉపరరామ. 10

అశ్వలుడు : ఈ యజ్ఞమునందు ఉద్గాత ఎన్ని స్తోత్రములను చెప్పును? ఎన్ని వచనములచే స్తోత్రము జేయును?

యాజ్ఞ : మూడింటిచే

అశ్వలుడు : అవి ఏవి ?

యాజ్ఞ : యజ్ఞారంభమునకంటె పూర్వము పురోనువాక్యము, యజ్ఞకాలమునందు చెప్పబడు యాజ్యా, మఱియు ప్రశంసకొఱకై గానము చేయఁబడు శస్య అని ఇట్లు మూడు తెఱగులు.

అశ్వలుడు : ఆత్మకు సంబంధించిన ఆ మూడు ఏవి ?

యాజ్ఞ : ప్రాణమే పురోనువాక్య మనునది. అపాన వాయువుచే యాజ్య, వ్యానవాయువుచే శస్య ఇవియే.

అశ్వలుడు : యజమానుడు వీటిచే దేనిని జయించును?

యాజ్ఞ : పురోనువాక్య మను మంత్రములచే మనుష్య లోకమును, యాజ్య యను మంత్రములచే అంతరిక్షమును, శస్య యను మంత్రములచే స్వర్గమును జయించును. ఈ విషయముల నన్నిటిని విని అశ్వలుడు శాంతించెను.

2–వ బ్రాహ్మణము

అవతారిక : ఇందు అజ్ఞాన నివృత్త్యుపాయాత్మక మగు గ్రహాతి గ్రహా లక్షణమైన మృత్యువునుండి విడువబడు విషయము చెప్ప బడును. గ్రహా మనగా పట్టుకొను శక్తి గలది. అతిగ్రహా మనగా గ్రహామును పట్టుకొన్నది. ఇట్టి మృత్యువునుండి వీడువడు విషయము వర్ణింపబడును.

అథ హైనం జారత్కారవ ఆర్తభాగః పప్రచ్ఛ యాజ్ఞవల్క్యేతి హోవాచ కతి గ్రహాః కత్యతిగ్రహా ఇతి అష్టౌ గ్రహాఅష్టావతిగ్రహా ఇతి ఏ తేఽష్టౌ గ్రహా అష్టా వతిగ్రహాః కతమే త ఇతి. 1

ఇక జరత్కారు కులోత్పన్ను డగు ఆర్తభాగుడను ఋషియిట్లు ప్రశ్నించుచున్నాడు. ఓ యాజ్ఞవల్క్యా! జ్ఞానసాధనములు మఱియు వాటి సహాయకము లగునవి ఎన్ని గలవు? అనగా గ్రహాము లెన్ని! అతిగ్రహాము లెన్ని ?

యాజ్ఞ : గ్రహాములు, సాధనములు, ఎనిమిది. అతిగ్రహాములు, సహాయకములు ఎనిమిది.

ఆర్తభాగుడు : ఆ ఎనిమిది సాధనములు, మఱియు సహాయకము లగునవి ఏవి?

ప్రాణో వై గ్రహాః సోఽపానేనాఽతిగ్రాహేణ గృహీతోఽపానేన హి గంధాన్ జిఘ్రతి. 2

యాజ్ఞ : ప్రాణము వెలుపలకుపోవు వాయువు. ఇది సాధనము. ఇది అపానవాయువుచే ఎక్కువ బలముగలది యగును. అపాన వాయువు నుండియే గంధము గ్రహింపబడును. గంధము వలననే లేక గంధశక్తి వలననే మానవుడు సమస్తమును మూర్కొనుచున్నాడు. ఘ్రాణము గ్రహాము. గంధము అతిగ్రహామని అర్థము.

వాగ్వై గ్రహాః స నామ్నాఽతిగ్రహేణ గృహీతో వాచా హి నామాన్యభివదతి. 3

వాక్కు సాధనము (గ్రహము). ఇది నామముయొక్క సహాయమువలన బలము గలది యగును. వాక్కుచే నామములు చెప్పబడుచున్నవి కాబట్టి నామము అతిగ్రహము. వాక్కు గ్రహము.

జిహ్వా వై గ్రహః స రసేనాఽతిగ్రహేణ గృహీతో జిహ్వయా హి రసాన్విజానాతి. 4

జిహ్వ (రసనేంద్రియము) సాధనము (గ్రహము). ఇది రసముయొక్క సహాయమున బలము గలది యగును. రసనేంద్రియముచేతనే రసము తెలియబడును. కావున రసము సహాయకము, అతిగ్రహము.

చక్షుర్వై గ్రహః స రూపేణాఽతిగ్రాహేణ గృహీతశ్చక్షుషా హి రూపాణి పశ్యతి. 5

చక్షువు సాధనము, గ్రహము. రూపము సహాయకము (అతిగ్రహము). రూపముయొక్క సహాయమువలన ఇది బలము గలదగుచున్నది. నేత్రము రూపమును చూచును.

శ్రోత్రం వై గ్రహః స శబ్దేనాఽతిగ్రాహేణ గృహీతః శ్రోత్రేణ హి శబ్దాన్ శృణోతి. 6

శ్రోత్రము గ్రహము అనగా సాధనము. శబ్దము అతిగ్రహము. అనగా సహాయకము. ఇది శబ్ద సహాయముచే బలము గలదిగా నగును. చెవి శబ్దమును వినును.

మనో వై గ్రహః స కామేనాఽతిగ్రాహేణ గృహీతో మనసా హి కామాన్కామయతే. 7

మనస్సు గ్రహము అనగా సాధనము. ఇచ్ఛ అతిగ్రహము (సహాయకము). ఈ కామముల సహాయమున ఇది బలము నొందును. మనస్సుచే కామములు సంకల్పింప బడుచున్నవి.

హస్తౌ వై గ్రహః స కర్మణాఽతిగ్రాహేణ గృహీతో హస్తాభ్యాం హి కర్మ కరోతి. 8

చేతులు గ్రహము అనగా సాధనము. కర్మ అతిగ్రహము అనగా సహాయకము. ఈ సహాయముచే ఇవి బలము గల వగు చున్నవి. చేతులచే పని చేయబడును.

త్వగ్వై గ్రహః స స్పర్శేనాఽతి గ్రాహేణ గృహీత స్త్వచా హి స్పర్శాన్వేదయత ఇత్యేతేఽష్టౌ గ్రహా అష్టా వతిగ్రహాః. 9

త్వక్కు గ్రహము అనగా సాధనము. స్పర్శ అతిగ్రహము (సహాయకము). దీనివలన ఇది బలము గలది యగును. త్వక్కుచే స్పర్శ తెలియ బడును. ఈ ఎనిమిది జ్ఞానసాధనములు, మఱియు వీటిని సహాయకము లని తెలియవలెను.

యాజ్ఞవల్క్యేతి హోవాచ యదిదగ్ం సర్వం మృత్యోరన్నం కాస్విత్సా దేవతా యస్యా మృత్యురన్నమిత్యగ్నిర్వై మృత్యుః సోఽపామన్నమప పునర్మృత్యుం జయతి. 10

ఆర్తభాగుడు : ఓ యాజ్ఞవల్క్య! ఇదంతయు నశించు స్వభావము గలదై మృత్యువునకు అన్నమై యున్నది గదా! ఈ మృత్యువు మఱి ఏ దేవతకు అన్నమై యున్నది?

యాజ్ఞ : అగ్నియే సర్వమునకు మృత్యువై యున్నది. దీనికి జలము మృత్యువై యున్నది. జలమునకు ఇది అన్నమై యున్నది. ఈ విధముగా మృత్యువునకు మృత్యువు గలదు. ఈ ప్రకారము మృత్యువు జయింప బడును.*

యాజ్ఞవల్క్యేతి హోవాచ యత్రాయం పురుషో మ్రియత ఉదస్మాత్ప్రాణాః క్రామంత్యాహో నేతి నేతి హోవాచ యాజ్ఞవల్క్యో త్రైవసమవనీయంతే స ఉచ్ఛ్వయత్యాధ్మాయత్యాధ్మాతో మృతః శేతే. 11

*సర్వమును మృత్యువు భక్షించును. ఈ మృత్యువును పరమేశ్వరుడు ఊరగాయగా చేసికొని గుటుకున మ్రింగును. అట్టి పరమేశ్వరుడు ప్రత్యగాత్మగా ఉన్నాడు, కావున ఆ ప్రత్యగాత్మ రూపుడగు తాను మృత్యువునకు మృత్యువు.

ఆర్తభాగుడు : ఈ పురుషుడు అనగా జ్ఞాని, దేహము విడిచిన పిదప ఇతని ప్రాణములు పైకి లేచి పోవునా? లేదా?

యాజ్ఞ : లేదులేదు. ఈ ప్రాణములు ఇచ్చటనే (ఆత్మయందు) అలలు జలమే యగునట్లు అభేద మొందును. లయ మొందును. అప్పుడు మృతి నొందినట్లుగ చెప్పబడుచున్నాడు. ఇతని శరీరము వాచును ఉబ్బును. శయనించిన వానివలె చేష్టలు లేక యుండును.

యాజ్ఞవల్క్యేతి హోవాచ యత్రాయం పురుషో మ్రియతే కిమేనం న జహాతీతి నామేత్యనంతం వై నామానంతా విశ్వే దేవా అనంత మేవ స తేన లోకం జయతి. 12

ఆర్తభాగుడు : బ్రహ్మవేత్తయగు నీ పురుషుడు చచ్చిన పిదప ఇతనిని విడిచి పోవక యుండున దేది?

యాజ్ఞ : నామము మాత్రమే విడిచి పోవక యుండును. నామము అనంతమై యున్నది. విశ్వదేవతలును అనంతమైయున్నారు. నామమువలన అనంత లోకములను జయించును.

యాజ్ఞవల్క్యేతి హోవాచ యత్రాస్య పురుషస్య మృతస్యాగ్నిం వాగప్యేతి వాతం ప్రాణ శ్చక్షు రాదిత్యం మన శ్చంద్రం దిశః శ్రోత్రం పృథివీగ్ం శరీర మాకాశ మాత్మౌషధీర్లోమాని వనస్పతీన్కేశా అప్సు లోహితంచ రేతశ్చ నిధీయతే క్వాయం తదా పురుషో భవతీత్యాహర సోమ్యహస్త మార్తభాగావామేవైతస్య వేదిష్యావో న నావేతత్ సజన ఇతి తౌ హోత్క్రమ్య మంత్రయాంచక్రాతే తౌ హ యదూచతుః కర్మ హైవ తదూచతురథ యత్ప్రశశగ్ంసతుః కర్మ హైవ తత్ప్రశశగ్ంసతుః పుణ్యో వై పుణ్యేన కర్మణా భవతి పాపః పాపేనేతి తతో హ జారత్కారవ ఆర్తభాగ ఉపరరామ. 13

ఆర్తభాగుడు : అజ్ఞాని మృతి నొందిన యెడల అతని వాక్కు అగ్నియందును, ప్రాణము వాయువునందును, నేత్రము ఆదిత్యునియం

దును, మనస్సు చంద్రునియందును, శ్రోత్రము దిక్కులందును శరీరము పృథివియందును జీవుడు హృదయాకాశమునందును శరీర రోమములు ఓషధులయందును శేతో రక్తములు నీటియందును ఒకటియై చేరిపోయిన ఇక ముందు ఈ పురుషుడు ఎక్కడ నుండును? ఏ ఆశ్రయమున నుండును? ఎట్లు కార్య కారణరూప సంఘాతమగు శరీరమును పొందునని అడిగెను.

యాజ్ఞ : నీ చేయి నిమ్ము, రా రమ్ము. ఈ ఉత్తరము మన ఇరువురకు మాత్రమే తెలియ వలసినదై యున్నది. ఈ ప్రశ్నను ఇంతటి జనసమూహమున చెప్పుట తగదని చెప్పుచు వాని చేయి బట్టుకొనెను. ఇరువురును ఏకాంతమునకు వెళ్ళి విచారించిరి. ఏమనగా ఇది కర్మ విషయక మగు ప్రశంస యని మాత్రము తేలినది. పుణ్య కర్మచే మనుష్యుడు పుణ్యవంతు డగును. పాపకర్మచే పాపి యగును. ఇంతే. ఈ ప్రకారముగ విని జరత్కారుడను ఆర్తభాగు డుపశమించెను.

---

### 3-వ బ్రాహ్మణము

అవ : యాజ్ఞవల్క్యుని భుజ్యు డనువత డిట్లు ప్రశ్నించెను.

అథ హైనం భుజ్యుర్లాహ్యాయనిః పప్రచ్ఛ యాజ్ఞవల్క్యేతి హోవాచ. మద్రేషు చరకాః పర్యవ్రజామ తే పతంజలస్య కాప్యస్య గృహానైమ తస్యాసీద్దుహితా గంధర్వ గృహీతా తమపృచ్ఛామ కోఽసీతి సోఽబ్రవీత్సుధన్వాఽఽంగిరస ఇతి తం యదా లోకానామంతానపృచ్ఛామ మాథైనమబ్రూమ క్వ పారిక్షితా అభవన్నితి క్వ పారిక్షితా అభవన్స త్వా పృచ్ఛామి యాజ్ఞవల్క్య క్వ పారిక్షితా అభవన్నితి. 1

అనంతరము లాహ్యాయని కుమారుడగు భుజ్యు వను వాడిట్లు ప్రశ్నించెను. ఓ యాజ్ఞవల్క్య! వేదాధ్యయనమునకై వ్రతాచరణ

లకై మేము మద్రదేశమున సంచరించుచు కపిగోత్రి యగు పతంజలుని ఇంటికి వెళ్ళితిమి. అతనిబిడ్డయొక్క ఒంటిపై గంధర్వుడు వచ్చి ఆవేశ మొందుచుండెను. అప్పుడు మేము నీ వెవరని ఆ గంధర్వు నడిగితిమి. నేను ఆంగిరస సుధన్వుడ నని అతడు చెప్పెను. అప్పుడు మేము లోక ములయొక్క సీమను గుఱించి అతని నడిగితిమి. మఱియు మరణ మొందిన పారిక్షితులు ఎచ్చట నున్నారని అడిగితిమి. ఇప్పుడు ఆ ప్రశ్ననే నిన్ను నేనడుగుచున్నాను. నీకు తెలిసి యుండిన చెప్పుమని ప్రశ్నించెను. ఇచ్చట పారిక్షితు లనగా అశ్వమేధ యాగము చేసిన వారు. వీరు ఎచ్చటికి పోవుదు రను విషయమే ప్రశ్నార్థమై యున్న దని తెలియవలయును.

స హోవాచోవాచ వై సోఽగచ్ఛన్వై తే తద్యత్రాశ్వమేధ యాజినో గచ్ఛంతీతి క్వన్వశ్వమేధయాజినో గచ్ఛంతీతి ద్వాత్రింగ్ం శతం వై దేవరథాహ్న్యాన్యయం లోక స్తగ్ం సమంతం పృథివీ ద్విస్తావ త్పర్యేతి తాగ్ం సమంతం పృథివీం ద్విస్తావత్సముద్రః పర్యేతి తద్యా వతీ క్షురస్య ధారా యావద్వా మక్షికాయాః పత్రం తావానంత రేణా కాశస్తా నింద్రః సుపర్ణో భూత్వా వాయవే ప్రాయచ్ఛత్తాన్వాయు రాత్మని ధిత్వాతత్రాగమయద్యత్రాశ్వమేధ యాజినోఽభవన్నిత్యేవ మివ వై స వాయుమేవ ప్రశశగ్ంస తస్మాద్వాయు రేవ వ్యష్టిర్వాయుస్సమ ష్టిరపపునర్మృత్యుం జయతి య ఏవం వేద తతో హ భుజ్యుర్లాహ్యా యని రుపరరామ. 2

యాజ్ఞ : అశ్వమేధమును చేసినవారు పోవు చోటునకే వీరును పోవుదురని ఆ గంధర్వుడు మీకు చెప్పియే యుండును. అంతమాత్రమే చాలును. అనిన మరల ఓ మునీ! ఆ అశ్వమేధ యాజులు ఎచ్చటికి వెళ్ళుదురు? అని అడుగగా అయ్యా! సూర్యుని రథము 32దినములకు ఎంత నడువగలుగునో అంత ఈ మానవ లోకము విస్తారము గలదై యున్నది. పృథివి దానికి రెండింతలు ప్రమాణముచే లోకమును చుట్టి

యున్నది. దాని చుట్టు ప్రక్కలును దానికి రెండింతలు సముద్రము చుట్టి యున్నది. అచ్చట కత్తియొక్క కొస భాగ మంత, లేక ఈగయొక్క ఱెక్కయంత పలుచని ఆకాశము గలదు. ఇంద్రుడు తాను పక్షియై ఆ పారిక్షితులను తీసికొని వెళ్ళి వాయువశమున నిచ్చును. వాయువు తనయందు లీనము చేసికొని అశ్వమేధ యాగము చేసినవారు పోవు చోటునకు వీరిని చేర్చును. ఈ విధముగ గంధర్వుడు వాయువును పొగడెను. అందువల్లనే వాయువు వ్యష్టియు మఱియు సమష్టియునై యున్నది. దీనిని తెలిసినవాడు మృత్యువును జయించును. ఈవిధమగు ఉత్తరమును పొంది భుజ్యువు మిన్నకుండెను.

---

## 4-వ బ్రాహ్మణము

అవ : యాజ్ఞవల్క్యుని చాక్రాయణ ఉషస్తుడు ఇట్లు ప్రశ్నించెను.

అథ హైన ముషస్తశ్చాక్రాయణః పప్రచ్ఛ యాజ్ఞవల్క్యేతి హోవాచ యత్సాక్షాదపరోక్షాద్బ్రహ్మ య ఆత్మా సర్వాంతర స్తం మే వ్యాచక్ష్వేత్యేష త ఆత్మా సర్వాంతరః కతమో యాజ్ఞ వల్క్య సర్వాంతరో యః ప్రాణేన ప్రాణితి స త ఆత్మా సర్వాంతరో యోఽపానేనాపానీతి స త ఆత్మా సర్వాంతరో యో వ్యానేన వ్యానీతి స త ఆత్మా సర్వాంతరో య ఉదానేనోదానీతి స త ఆత్మా సర్వాంతర ఏష త ఆత్మా సర్వాంతరః. 1

ఆ పిదప చక్రాయణుని కుమారుడగు ఉషస్తుడు అను నతడిట్లు ప్రశ్నించెను. ఓ యాజ్ఞవల్క్యా! సర్వసాక్షియును అపరోక్షుడును సర్వాంతరుడు నయిన బ్రహ్మమును గుఱించి నాకు చెప్పు మనెను.

యాజ్ఞ : నీ ఆత్మయే సర్వాంతరమున నుండు ఆత్మ.

ఉషస్తి : ఓ యాజ్ఞవల్క్యా! ఏ ఆత్మ సర్వాంతరమున నున్నాడు? అయ్యా! ప్రాణవాయువుతో గూడి ఉచ్ఛ్వాస ప్రశ్వాసము

లను చేయు నీ ఆత్మయే సర్వాంతరుడు. అపాన వాయువుతో గూడి క్రిందికిబోవు నీఆత్మయే సర్వాంతరము. యావచ్ఛరీరమునందు పారాడు నీ ఆత్మయే సర్వాంతరుడు. ఉదానముతోగూడి పైకిపోవు నీ ఆత్మయే సర్వాంతరుడు. ఇట్లు నీ ఆత్మయే సర్వాంతరమై యున్నదని తెలియ వలెను.

స హోవాచోషస్తశ్చాక్రాయణో యథా విబ్రూయాదసౌ గౌరసావశ్వ ఇత్యేవ మేవైతద్వ్యపదిష్టం భవతి య దేవ సాక్షా దపరోక్షాద్బ్రహ్మ య ఆత్మా సర్వాంతర స్తం మే వ్యాచక్ష్వేత్యేష త ఆత్మా సర్వాంతరః కతమో యాజ్ఞవల్క్య సర్వాంతరః న దృష్టేర్ద్రష్టారం పశ్యేర్న శ్రుతేః శ్రోతారగ్ం శృణుయాన్న మతేర్మం తారం మన్వీథా న విజ్ఞాతేర్విజ్ఞాతారం విజానీయాః. ఏష త ఆత్మా సర్వాంతరో ఽతో ఽన్యదార్తం తతో హోషస్తశ్చాక్రాయణ ఉపరరామ. 2

ఇట్లు విని మరల ఉషస్తుడు లోకమున ఇది ఆవు; ఇది గుఱ్ఱమని చెప్పునట్లు నీవు ఈ బ్రహ్మమునుగుఱించి వర్ణించి యున్నావు. సర్వసాక్షియు అపరోక్షుడును సర్వాంతర్యామియు నగు ఆ బ్రహ్మ మును గూర్చి నాకు మరల జెప్పుము.

యాజ్ఞ : నీ ఆత్మయే సర్వాంతరుడై యున్నాడు. సర్వాంత ర్యామియే నీ ఆత్మ. సర్వమును చూచు దృగ్రూప మగు బ్రహ్మమును ఈ నీ చూపుచే చూడజాలవు. విను శక్తినే వినువానిని నీవు విన జాలవు. విచారించు శక్తినే విచారించు వానిని విచారింప జాలవు. తెలిసికొను శక్తినే తెలియు వానిని నీవు తెలియ జాలవు. ఈ నీ ఆత్మయే సర్వాంతరుడు. సర్వాంతమున నుండు వాడే ఆత్మ. ఈ పరమ సత్యమును విడిచి తక్కిన దెల్ల శుక్తి రజతము వలె మిథ్య; లేక వినాశ శీలమని అర్థము. ఈ ప్రకారముగ విని ఉషస్తుడు చాక్రాయ ణుడు విరమించెను.

5-వ బ్రాహ్మణము

అవ : యాజ్ఞవల్క్య కహోళ సంవాదము. ఇందు బ్రహ్మము మఱియు ఆత్మయను విషయము చెప్పబడును.

అథ హైనం కహోలః కౌషీతకేయః పప్రచ్ఛ యాజ్ఞవల్క్యేతి హోవాచ యదేవ సాక్షాదపరోక్షాద్బ్రహ్మ య ఆత్మా సర్వాంతరస్తం మే వ్యాచక్ష్వేత్యేష త ఆత్మా సర్వాంతరః కతమో యాజ్ఞవల్క్య సర్వాంతరో యోఽశనాయాపిపాసే శోకం మోహం జరాం మృత్యుమత్యేతి. ఏతం వై తమాత్మానం విదిత్వా బ్రాహ్మణాః పుత్రైషణాయాశ్చ విత్తైషణాయాశ్చ లోకైషణాయాశ్చ వ్యుత్థాయాథ భిక్షాచర్యం చరంతి యా హ్యేవ పుత్రైషణా సా విత్తైషణా యా విత్తైషణా సా లోకైషణోభే హ్యేతే ఏషణే ఏవ భవతః. తస్మాద్బ్రాహ్మణః పాండిత్యం నిర్విద్య బాల్యేన తిష్ఠాసేత్ బాల్యం చ పాణ్డిత్యం చ నిర్విద్యాథ మునిరమౌనం చ మౌనం చ నిర్విద్యాఽథ బ్రాహ్మణః స బ్రాహ్మణః కేన స్యాద్యేన స్యాత్తేనేదృశ ఏవాతోఽన్యదార్తం తతో హ కహోలః కౌషీతకేయ ఉపరరామ.

అనంతరము కౌషీతకుని పుత్రుడగు కహోళుడు లేచి ఓయాజ్ఞవల్క్యా! సర్వసాక్షియును అపరోక్షుడును సర్వాంతర్యామియు నగు బ్రహ్మమును గుఱించి నాకు చక్కగ బోధించుమని అడిగెను.

యాజ్ఞ : ఈ నీ ఆత్మయే సర్వాంతరుడు.

కహోళ : ఏ ఆత్మ సర్వాంతరుడని చెప్పెదవు? (అని మరల నడిగెను.)

యాజ్ఞ : అయ్యా! ఏ ఆత్మ ఆకలి దప్పులు, శోకము, మోహము ముదిమి, మరణముల కతీతుడో నిజమగు అట్టి ఆత్మ నీవై యున్నావు. ఆ యాత్మను తమ స్వరూపముగ దెలిసికొని బ్రహ్మవిదులగు బ్రాహ్మణులు పుత్రైషణ లోకైషణలను వీడి భిక్షావృత్తి నవలంబింతురు. అద్వితీయానుభవ నిత్య తృప్తియే ఇచ్చట నిజమగు భిక్ష యని గ్రాహ్యము

యెందుకనగా పుత్రేచ్ఛ యుండిన విత్తేచ్ఛయు, విత్తేచ్ఛ యుండిన లోకేచ్ఛయు నుండును, ఈ రెండు ఇచ్ఛలచే బ్రాహ్మణుడు నిజమగు పాండిత్యమును కడకు ద్రోసి బాల స్వభావము గలవాడై అనగా అజ్ఞుడై యుండవలసి వచ్చును. మొదట బాల్యమును అజ్ఞానమును మఱియు పాండిత్యమును విద్యాహంకారమును విడిచి మననశీలుడగు ముని కావలెను. మానావమానములను కడకు ద్రోసి బ్రాహ్మణుడై బ్రహ్మజ్ఞానియై కృతకృత్యుడు కావలెను. పై జెప్పిన విధముగా సర్వేచ్ఛలను సమస్త వాసనలను వీడియే సద్బ్రాహ్మణుడు కాగలుగును. ఆత్మను విడిచి తక్కిన దెల్ల వినాశవంతమై యున్నది. ఈ యథార్థానుభవమే జ్ఞానము. ఇట్లు ముని జెప్పినది విని కహోళుడు ఊరకుండెను.

—o—

## 6–వ బ్రాహ్మణము

### గార్గి యాజ్ఞవల్క్య సంవాదము

అథ హైనం గార్గీ వాచక్నవీ పప్రచ్ఛ యాజ్ఞవల్క్యేతి హోవాచ యదిదగ్ం సర్వమప్స్వోతం చ ప్రోతం చ కస్మిన్ను ఖల్వాప ఓతాశ్చ ప్రోతాశ్చేతి. వాయౌ గార్గీతి కస్మిన్ను ఖలు వాయురోతశ్చ ప్రోతశ్చేత్యంతరిక్షలోకేషు గార్గీతి కస్మిన్ను ఖల్వంతరిక్షలోకా ఓతాశ్చ ప్రోతాశ్చేతి గంధర్వలోకేషు గార్గీతి కస్మిన్ను ఖలు గంధర్వలోకా ఓతాశ్చ ప్రోతాశ్చేత్యాదిత్యలోకేషు గార్గీతి కస్మిన్ను ఖల్వాదిత్యలోకా ఓతాశ్చ ప్రోతాశ్చేతి చంద్రలోకేషు గార్గీతి కస్మిన్ను ఖలు చంద్రలోకా ఓతాశ్చ ప్రోతాశ్చేతి నక్షత్రలోకేషు గార్గీతి కస్మిన్ను ఖలు నక్షత్ర లోకా ఓతాశ్చ ప్రోతాశ్చేతి దేవలోకేషు గార్గీతి కస్మిన్ను ఖలు దేవలోకా ఓతాశ్చ ప్రోతాశ్చేతీంద్రలోకేషు గార్గీతి కస్మిన్ను ఖల్వింద్రలోకా ఓతాశ్చ ప్రోతాశ్చేతి ప్రజాపతి లోకేషు గార్గీతి కస్మిన్ను ఖలు ప్రజాపతిలోకా ఓతాశ్చ ప్రోతాశ్చేతి బ్రహ్మలోకేషు గార్గీతి కస్మిన్ను ఖలు బ్రహ్మలోకా ఓతాశ్చ ప్రోతాశ్చేతి

స హోవాచ గార్గి మాఽతిప్రాక్షీర్మా తే మూర్ధా వ్యపప్తదనతి. ప్రశ్న్యాం వై దేవతామతిపృచ్ఛసి గార్గి మాఽతిప్రాక్షీరితి తతో హ గార్గీ వాచక్నవ్యుపరరామ.

అనంతరము వచక్నుని బిడ్డ యగు గార్గి లేచి యాజ్ఞవల్క్యా! ఈ సమస్త వస్తు జాతము జలమునందు ఓత ప్రోతమై యున్నది గదా. ఇక ఆ జలము దేనియందు ఓతప్రోత భావము నొంది యున్నది? అనగా జలమునకు కారణ మేమి?

యాజ్ఞవల్క్యుడు : అది వాయువునందు ఓత ప్రోతమై యున్నది. ఇచ్చట జలమునకు పిదప అగ్ని యని చెప్పని కారణ మేమనిన అగ్నికి భూ జలముల సంబంధము లేక స్థితి లేదు. గాన ఈ రెండిటియందు అది అంతర్గతమని గ్రహింపవలయును.

గార్గి : ఆ వాయువు దేనియందు ఓత ప్రోత భావము నొంది యున్నది? ఇట్లు ఒక్కొక్క భూతమును గురించి గార్గి ప్రశ్న చేయు చుండుటవలన ఇచ్చట మొత్తము అన్నిటికిని ఒకే సారిగా ఉత్తరము వ్రాయబడును.

యాజ్ఞవల్క్యుడు : వాయువు అంతరిక్షమునందును, అంతరిక్షము గంధర్వ లోకమునందును, గంధర్వలోకము ఆదిత్యుని లోకమునందును, ఆదిత్య లోకము చంద్రలోకమునందును, చంద్రలోకము నక్షత్ర లోకమునందును, నక్షత్రలోకము దేవలోకమునందును, దేవలోకము ఇంద్రలోకమునందును, ఇంద్రలోకము ప్రజాపతిలోకమునందును, ప్రజాపతిలోకము బ్రహ్మలోకమునందును, ఓత ప్రోత భావము నొంది యున్నవి. బ్రహ్మలోకము దేనియందు ఓత ప్రోతమై యున్నదని గార్గి యడుగగా ఓ గార్గీ! ఇక అడుగకుము. నీ తల పగిలి పడి పోవును. ఇంతవఱకు అడిగినది సబబు. న్యాయము. సర్వమునకు అతీతమై బ్రహ్మవస్తువు మాత్రమే గలదు. అదే సర్వము. దానిని చెప్పుటకు సాధ్యము కాదు. ఏ దేవతను గుఱించి నీవడుగకూడదో

ఆ దేవతను గురించి అడుగుచున్నావు. అడుగ బోకుమని చెప్పగా విని వచక్నుని బిడ్డ యగు గార్గి మిన్నకుండెను. ఓత ప్రోత మనగా వస్త్రమునందు దూది యు, దారము లేనిది వస్త్రము గానియట్లు వస్త్ర మనిన ఇదంతమును అదేనని ఎట్లు గ్రాహ్యమో అటువలె బ్రహ్మ తత్త్వమే అంతర్బాహిరములను విభిన్నత లేక వ్యాపకమై యున్నదని అర్థము.

—o—

## 7-వ బ్రాహ్మణము

అవ: యాజ్ఞవల్క్యుడు, ఉద్దాలకుడను ఆరుణి వీరి సంవాదము. ఆత్మస్వరూప కథనము.

అథ హైనముద్దాలక ఆరుణిః పప్రచ్ఛ యాజ్ఞవల్క్యేతి హోవాచ మద్రేష్వవసామ పతంజలస్య కాప్యస్య గృహేషు యజ్ఞమధీయానా స్తస్యాసీద్భార్యా గంధర్వగృహీతా తమపృచ్ఛామ కోఽసీతి సోఽబ్రవీత్ కబంధ ఆథర్వణ ఇతి సోఽబ్రవీత్పతంజలం కాప్యం యాజ్ఞికాగ్ంశ్చ వేత్థను త్వం కాప్య తత్సూత్రం యేనాయం చ లోకః పరశ్చ లోకః సర్వాణి చ భూతాని సందృబ్ధాని భవంతీతి సోఽబ్రవీత్పతంజలః కాప్యో నాహం తద్భగవన్వేదేతి సోఽబ్రవీత్పతంజలం కాప్యం యాజ్ఞికాగ్ంశ్చ వేత్థ ను త్వం కాప్య తమంతర్యామిణం య ఇమం చ లోకం పరం చ లోకగ్ం సర్వాణిచ భూతాని యోఽంతరో యమయతీతి సోఽబ్రవీత్పతంజలః కాప్యో నాహం తం భగవన్ వేదేతి సోఽబ్రవీత్ పతంజలం కాప్యం యాజ్ఞికాగ్ంశ్చ యో వై తత్కాప్య సూత్రం విద్యా త్తం చాంతర్యామిణమితి స బ్రహ్మవిత్స లోకవిత్స దేవవిత్స వేదవిత్స భూతవిత్స ఆత్మవిత్స సర్వవిదితి తేభ్యోఽబ్రవీ త్తదహం వేద తచ్చే త్త్వం యాజ్ఞవల్క్య సూత్రమవిద్వాగ్ం స్తం చాంతర్యామిణం బ్రహ్మగవీరుదజసే మూర్ధా తే విపతిష్యతీతి వేదవా

అహం గౌతమ తత్సూత్రం తం చాంతర్యామిణమితి యో వా ఇదం కశ్చిద్బ్రూయాద్వేద వేదేతి యథా వేత్థ తథా బ్రూహీతి. 1

ఆపిదప ఉద్దాలకు డను ఆరుణి యజ్ఞవల్క్యుని జూచి అయ్యా! యజ్ఞకర్మను నేర్చుకొనుచు మేము మద్రదేశమునందు కపిగోత్రస్థుడగు పతంజలుని ఇంటియందుండగా అతని భార్య యొడలిమీద గంధర్వుడు ఆవేశ మగుచుండెను. నీ వెవరని మేమడిగితిమి. నేను అథర్వణ పుత్రుడగు కబంధుడ నని ఆ గంధర్వుడు చెప్పెను. మఱియు నా గంధర్వుడు పతంజలుని యాజ్ఞికులను చూచి ఇట్లడిగెను. ఓ కాప్యుడా! ఈ లోకము పరలోకము మఱియు సర్వభూతములు ఏ సూత్రముచే కట్టుపడి యున్నవో నీకు తెలియునా? యని అడిగెను. అంత పతంజలుడు భగవన్! నాకు తెలియదని బదులు చెప్పెను. మరల గంధర్వుడు పతంజలుని చూచి ఎవడీ లోక పరలోకములను మఱియు సమస్త భూతములకు అంతర్యామియై నియమనము చేయుచున్నాడో ఆ అంతర్యామిని నీ వెఱుగుదువా? యనెను. పతంజలుడు ఓభగవన్! నాకు తెలియదని బదులు చెప్పెను. మరల గంధర్వుడు ఓ కాప్యుడా! ఎవడు ఈ సూత్రమును మఱియు అంతర్యామిని తెలిసికొని యున్నాడో అతడే బ్రహ్మమును లోకములను దేవతలను వేదములను భూతములను ఆత్మను సర్వమును ఎఱిగిన వాడని గంధర్వుడు మరల జెప్పెను. ఈ జ్ఞానమును ప్రార్థనా పూర్వకముగ అతనినుండి తెలిసికొంటిమి. యాజ్ఞవల్క్యుడా! నీవు ఆ సూత్రముయొక్క మఱియు అంతర్యామియొక్క జ్ఞానములేకనే జ్ఞానులకు మాత్రమే చెల్లదగిన గోవులను తీసికొని పోయిన నీ తల తునకలై పోవును.

యాజ్ఞ : ఓ గౌతముడా! ఆ సూత్రమును మఱియు అంతర్యామి తత్త్వమును నాకు తెలియును.

ఆరుణి : నాకు దెలియును నాకు జెలియును అని అందఱును అందురు. అట్లైన - నీకు తెలిసి యుండినచో-చెప్పుము. చూచెదమనెను.

స హోవాచ వాయుర్వై గౌతమ తత్సూత్రం వాయునా వై గౌతమ సూత్రేణాయంచ లోకః పరశ్చ లోకః సర్వాణి చ భూతాని సంధృబ్ధాని భవంతి తస్మాద్వై గౌతమ పురుషం ప్రేతమాహుర్వ్యస్రగ్ంసిషతాస్యాంగానీతి వాయునా హి గౌతమ సూత్రేణ సంధృబ్ధాని భవంతీత్యేవమేవైతద్యాజ్ఞవల్క్యాంతర్యామిణం బ్రూహీతి. 2

యాజ్ఞ: ఓ గౌతమా! వాయువే ఆ సూత్రము. వాయువు అను సూత్రముచే ఈ లోకము పరలోకము మఱియు సమస్త భూతములును కట్టువడి యున్నవి. అందువలననే చచ్చిన మనుష్యుని గుఱించి మాటలాడు నపుడు ఇతని అంగములు శిథిలమై యున్నవని చెప్పుదురు. కావున ఓ గౌతమా! వాయువను సూత్రముచే కట్టబడి యున్నవని తెలియుము.

ఆరుణి: ఔను. ఔను. ఇక అంతర్యామిని గుఱించి చెప్పుము.

యః పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యా అంతరో యం పృథివీ న వేద యస్య పృథివీ శరీరం యః పృథివీ మంతరో యమయత్యేష త ఆత్మాంతర్యామ్యమృతః. 3

యాజ్ఞ: ఎవడు పృథివియందు న్నాడో, ఎవనిని పృథివీదేవత తెలిసికొన జాలదో, ఈ పృథివి ఎవని శరీరమో ఎవడు పృథివీ మయుడై పృథివిలోపల నుండి నియమించునో అతడే నీ యాత్మ. అతడే అంతర్యామి. అమృత స్వరూపుడు (మరణములేనివాడు).

యోఽప్సు తిష్ఠన్నద్భ్యోఽంతరో యమాపో న విదుర్యస్యాపశ్శరీరం యోఽపోఽంతరో యమయత్యేష త ఆత్మాంతర్యామ్యమృతః. 4

ఎవడు జలరూపుడై యుండి జలాంతర్గతుడై యున్నాడో అతనిని ఈ జలము తెలిసికొన జాలదు. జలము ఎవనికి శరీరమై లోపల ఉండి జలము నెవడు నియమించునో అతడే నీ ఆత్మ. అతడే అంతర్యామి. మరణము లేని అమృత స్వరూపుడు.

యోఽగ్నౌ తిష్ఠన్నగ్నేరంతరో యమగ్నిర్న వేద యస్యాగ్నిః శరీరం యోఽగ్నిమంతరో యమయత్యేష త ఆత్మాంతర్యామ్యమృతః. 5

ఎవడు అగ్నియందుండి అగ్నిని నియమించుచున్నాడో, అగ్నికి ఎవనిని తెలియుటకు శక్తిలేదో, అగ్ని ఎవని శరీరమో అగ్నికి లోపల నుండి దాని నెవడు నియమించునో, అతడే నీ ఆత్మ. వాడే నీవును, నేనును. అదే అమృతము.

యోఽంతరిక్షే తిష్ఠన్నంతరిక్షాదంతరో యమంతరిక్షం న వేద యస్యాంతరిక్షగ్ం శరీరం యోఽంతరిక్షమంతరో యమయత్యేష త ఆత్మాంతర్యామ్యమృతః. 6

ఎవడు అంతరిక్షమునందుండి అంతరిక్షము నందంతట వ్యాపించి యున్నాడో, ఎవనిని అంతరిక్షము తెలియజాలదో, అంతరిక్షము ఎవని శరీరమో, లోపలనుండి దానిని ఎవడు నియమించునో అతడే నీ ఆత్మ, అతడే అంతర్యామి. అతడే అమృతము.

యో వాయౌ తిష్ఠన్వాయోరంతరో యం వాయుర్న వేద యస్య వాయుః శరీరం యో వాయుమంతరో యమయత్యేష త ఆత్మాంతర్యామ్యమృతః. 7

ఎవడు వాయువునందుండి వాయువునకు లోపల నున్నాడో, ఎవనిని వాయువు తెలియ జాలదో, వాయువు ఎవని శరీరమో, లోపల నుండి ఎవడు వాయువును నియమించునో అతడే నీ ఆత్మ. అతడే అంతర్యామి. అదే అమృతము.

యో దివి తిష్ఠన్దివోఽంతరో యం ద్యౌర్న వేద యస్య ద్యౌః శరీరం యో దివమంతరో యమయత్యేష త ఆత్మాంతర్యామ్యమృతః.8

ఎవడు ద్యులోకమునకు లోపల, వెలుపల నున్నాడో, ఎవనిని ద్యులోకము తెలియ జాలదో, ద్యులోకము ఎవనికి శరీరమో, అంత

ర్యామియై యుండి ద్యులోకము నెవడు నియమించునో, అతడే నీ ఆత్మ. అతడే అంతర్యామి. అదే అమృతము.

య ఆదిత్యేతిష్ఠన్నాదిత్యాదంతరో యమాదిత్యో న వేద యస్యాదిత్యః శరీరం య ఆదిత్యమంతరో యమయత్యేష త ఆత్మాంత ర్యామ్యమృతః. 9

ఎవడు ఆదిత్యుని లోపల, వెలుపల నున్నాడో, ఎవనిని ఆదిత్యుడు తెలియ జాలడో, ఆదిత్యుడు ఎవని శరీరమో, అంతర్యామియై యుండి ఆదిత్యుని ఎవడు నియమించునో అతడే నీ ఆత్మ. అతడే అంతర్యామి. అదే అమృతము.

యో దిక్షు తిష్ఠన్దిగ్భ్యోఽంతరో యం దిశో న విదుర్యస్య దిశ శ్శరీరం యో దిశోఽంతరో యమయత్యేష త ఆత్మాంత ర్యామ్యమృతః.

ఎవడు దిక్కుల వెలుపలను లోపలను ఉన్నాడో, ఎవనిని దిక్కులు తెలియ జాలవో, దిక్కులు ఎవని శరీరమో, అంతర్యామియై యుండి దిక్కుల నెవడు నియమించునో అతడే నీ ఆత్మ. అతడే అంతర్యామి. అదే అమృతము.

యశ్చంద్రతారకే తిష్ఠగ్ంశ్చంద్ర తారకాదంతరో యం చంద్ర తారకం న వేద యస్య చంద్రతారకగ్ం శరీరం యశ్చంద్రతారక మంతరో యమయత్యేష త ఆత్మాంత ర్యామ్యమృతః. 11

ఎవడు చంద్ర నక్షత్రాదుల వెలుపలను లోపలను నున్నాడో, ఎవనిని చంద్ర నక్షత్రాదులు తెలియ జాలవో, చంద్ర నక్షత్రాదులు ఎవని శరీరమో, అంతర్యామియై యుండి చంద్ర నక్షత్రాదుల నెవడు నియమించునో అతడే నీ ఆత్మ. అతడే అంతర్యామి. అతడే అమృతము.

య ఆకాశే తిష్ఠన్నాకాశాదంతరో యమాకాశో న వేద యస్యాకాశశ్శరీరం య ఆకాశమంతరో యమయత్యేష త ఆత్మాంత ర్యామ్యమృతః. 12

ఎవడు ఆకాశమునకు వెలుపలను లోపలను ఉన్నాడో, ఎవనిని ఆకాశము తెలియ జాలదో, ఆకాశము ఎవని శరీరమో అంతర్యామియై యుండి ఆకాశము నెవడు నియమించునో అతడే నీఆత్మ. అతడే అంతర్యామి. అతడే అమృతము.

య స్తమసి తిష్ఠగ్ం స్తమసోఽంతరో యం తమో న వేద యస్య తమశ్శరీరం య స్తమోఽంతరో యమయ త్యేష త ఆత్మాంత ర్యామ్య మృతః. 13

ఎవడు తమస్సు లోపలను వెలుపలను ఉన్నాడో, ఎవనిని తమస్సు తెలియజాలదో, తమస్సు ఎవని శరీరమో ఎవడు అంతర్యామియై యుండి తమస్సును నియమించునో అతడే నీ ఆత్మ. అతడే అంతర్యామి. అతడే అమృతము.

య స్తేజసితిష్ఠగ్ం స్తేజసోఽంతరో యం తేజో న వేద యస్య తేజశ్శరీరంయ స్తేజోఽంతరో యమయ త్యేష త ఆత్మాంతర్యామ్యమృత ఇత్యధిదై వతమథాధిభూతమ్. 14

ఎవడు తేజస్సునకు వెలుపలను లోపలను ఉన్నాడో, ఎవనిని తేజస్సు తెలియ జాలదో, తేజస్సు ఎవని శరీరమో, ఎవడు అంతర్యామియై యుండి తేజస్సును నియమించునో, అతడే నీ ఆత్మ. అతడే అంతర్యామి. అతడే అమృతము.

యస్సర్వేషు భూ తేషు తిష్ఠన్స ర్వేభ్యో భూ తేభ్యోఽంతరోయగ్ం సర్వాణి భూ తాని న విదుర్యస్య సర్వాణి భూ తాని శరీరం యస్సర్వాణి భూ తాన్యంతరో యమయ త్యేష త ఆత్మాంతర్యామ్యమృత ఇత్యధి భూత మథాధ్యాత్మమ్. 15

ఎవడు సకల భూతముల వెలుపలను లోపలను ఉన్నాడో, ఎవనిని భూతములు తెలియజాలవో, భూతములు ఎవని శరీరమో, ఎవడు అంతర్యామియై యుండి భూతములను నియమించునో అతడే నీ ఆత్మ. అతడే అంతర్యామి. అతడే అమృతము.

యః ప్రాణే తిష్ఠన్ప్రాణాదంతరో యం ప్రాణో న వేద యస్య ప్రాణశ్శరీరం యః ప్రాణమంతరో యమయత్యేష త ఆత్మాంతర్యామ్యమృతః. 16

ఎవడు ప్రాణము లోపలను వెలుపలను ఉన్నాడో, ఎవనిని ప్రాణము తెలియ జాలదో, ప్రాణము ఎవని శరీరమో, ఎవడు అంతర్యామియై యుండి ప్రాణమును నియమించునో అతడే నీ ఆత్మ. అతడే అంతర్యామి. అతడే అమృతము.

యో వాచి తిష్ఠన్వాచోఽంతరో యం వాఙ్న వేద యస్య వాక్శరీరం యో వాచమంతరో యమయత్యేష త ఆత్మాంతర్యామ్యమృతః. 17

ఎవడు వాక్కు లోపలను వెలుపలను ఉన్నాడో, ఎవనిని వాక్కు తెలియ జాలదో, వాక్కు ఎవని శరీరమో, ఎవడు అంతర్యామియై యుండి వాక్కును నియమించునో అతడే నీ ఆత్మ. అతడే అంతర్యామి. అతడే అమృతము.

యశ్చక్షుషి తిష్ఠగ్ంశ్చక్షుషోఽంతరోయం చక్షుర్న వేద యస్య చక్షుశ్శరీరం యశ్చక్షురంతరో యమయత్యేష త ఆత్మాంతర్యామ్యమృతః. 18

ఎవడు నేత్రముయొక్క లోపల వెలుపల నున్నాడో, ఎవనిని నేత్రము తెలియ జాలదో, నేత్రము ఎవని శరీరమో, ఎవడు అంతర్యామియై యుండి నేత్రమును నియమించునో అతడే నీ ఆత్మ. అతడే అంతర్యామి. అతడే అమృతము.

యశ్శ్రోత్రే తిష్ఠన్ శ్రోత్రాదంతరో యగ్ం శ్రోత్రం న వేద యస్య శ్రోత్రగ్ం శరీరం యశ్శ్రోత్రమంతరో యమయత్యేష త ఆత్మాఽంతర్యామ్యమృతః. 19

ఎవడు శ్రోత్రము లోపలను వెలుపలను ఉన్నాడో, ఎవనిని శ్రోత్రము తెలియజాలదో శ్రోత్రము ఎవని శరీరమో, ఎవడు అంత

ర్యామియై యుండి శ్రోత్రమును నియమించునో అతడే నీ ఆత్మ, అతడే అంతర్యామి. అతడే అమృతము.

యో మనసి తిష్ఠన్మనసో௨ంతరో యం మనో న వేద యస్య మనః శరీరం యో మనో௨ంతరో యమయత్యేష త ఆత్మాంతర్యామ్యమృతః. 20

ఎవడు మనస్సులోపలను వెలుపలను ఉన్నాడో, ఎవని మనస్సు తెలియ జాలదో, మనస్సు ఎవని శరీరమో, ఎవడు అంతర్యామియైయుండి మనస్సును నియమించునో అతడే నీ ఆత్మ. అతడే అంతర్యామి. అతడే అమృతము

యస్త్వచి తిష్ఠగ్ంస్త్వచో௨ంతరో యం త్వఙ్న వేద యస్య త్వక్శరీరం యస్త్వచ మంతరో యమయత్యేష త ఆత్మాంతర్యామ్యమృతః. 21

ఎవడు త్వగింద్రియముయొక్క లోపలను వెలుపలను ఉన్నాడో, ఎవనిని త్వక్కు తెలియ జాలదో, త్వక్కు ఎవని శరీరమో, ఎవడు అంతర్యామియై యుండి త్వక్కును నియమించునో అతడే నీ ఆత్మ, అతడే అంతర్యామి. అతడే అమృతము.

యో విజ్ఞానే తిష్ఠన్విజ్ఞానాదంతరో యం విజ్ఞానం న వేద యస్య విజ్ఞానగ్ం శరీరం యో విజ్ఞాన మంతరో యమయత్యేష త ఆత్మాంతర్యామ్యమృతః. 22

ఎవడు విజ్ఞానము (బుద్ధి) యొక్క లోపలను వెలుపలను ఉన్నాడో, ఎవనిని విజ్ఞానము తెలియ జాలదో, విజ్ఞానము ఎవని శరీరమో, ఎవడు అంతర్యామియై యుండి విజ్ఞానమును నియమించునో అతడే నీ ఆత్మ, అతడే అంతర్యామి అతడే అమృతము.

యో రేతసి తిష్ఠన్రేతసో௨ంతరో యగ్ం రేతో న వేద యస్య రేతశ్శరీరం యో రేతో௨ంతరో యమయత్యేష త ఆత్మాంతర్యామ్యమృతో௨దృష్టో ద్రష్టా௨శ్రుతః శ్రోతా௨మతో మంతా௨విజ్ఞాతో

విజ్ఞాతా నాన్యోఽతోఽస్తి ద్రష్టా నాన్యోఽతోఽస్తి శ్రోతా నాన్యోఽతోఽస్తి మంతానాన్యోఽతోఽస్తి విజ్ఞాతైష త ఆత్మాంతర్యామ్యమృతోఽతోఽన్యదార్తం తతో హోద్దాలక ఆరుణి రుపరరామ. 23

ఎవడు రేతస్సులోపలను వెలుపలను ఉన్నాడో, ఎవనిని రేతస్సు తెలియ జాలదో, రేతస్సు ఎవని శరీరమో, ఎవడంతర్యామియై యుండి రేతస్సును నియమించునో అతడే నీ ఆత్మ. అతడే అంతర్యామి. అతడే అమృతము. అతడు స్వయముగా ఎవరికిని అగపడక అన్నిటిని చూచును. ఎవరికిని వినబడక సమస్తమును వినును. ఎవరిచేతను భావింపబడక సర్వమును భావించును. ఎవరి చేతను తెలియ బడక అందఱిని తెలియును. అతడుదప్ప ఇంకెవరును చూచువారు లేరు. వినువారు లేరు. విచారించువారు లేరు. తెలియువారును లేరు. అతడే ఆత్మ. అతడే అంతర్యామి. అతడే అమృతము. ఇంతకంటె తక్కిన సమస్తము వినాశవంతమని యాజ్ఞవల్క్యుడు చెప్పగా ఉద్దాలకుడు మౌనము వహించెను.

—o—

## 8-వ బ్రాహ్మణము

అవ: అక్షరమను నామముచే ఆత్మస్వరూపానుకథనము. గార్గి యాజ్ఞవల్క్యుల సంవాదము.

అథ హ వాచక్నవ్యువాచ బ్రాహ్మణా భగవంతో హంతాహమిమం ద్వౌప్రశ్నౌప్రక్ష్యామి తౌ చేన్మే వక్ష్యతి న వై జాతు యుష్మాకమిమం కశ్చిద్బ్రహ్మోద్యం జేతేతి పృచ్ఛ గార్గీతి. 1

అనంతరము వాచక్నవి యను గార్గి మరల ఇట్లనియె. పూజ్యులగు బ్రాహ్మణులారా! నేను ఈ యాజ్ఞవల్క్యుని రెండు ప్రశ్నల నడిగెదను. వాటికి అతడు ఉత్తర మొసగినచో ఇక బ్రహ్మచర్చలో.

మీాయం దెవరును అతనిని జయింప లేరని పలికెను. బ్రాహ్మణు లందఱు అంగీకరించి అడుగు మని చెప్పిరి.

సా హోవాచాహం వై త్వా యాజ్ఞవల్క్య యథా కాశ్యో వా వై దేహో వోగ్రపుత్ర ఉజ్జ్యం ధనురధిజ్యం కృత్వా ద్వా బాణవంతౌ సపత్నాతి వ్యాధినౌ హస్తే కృత్వోపోత్తిష్ఠే దేవమేవాహం త్వాం ద్వాభ్యాం ప్రశ్నాభ్యాముపోదస్థాం తౌ మే బ్రూహీతి పృచ్ఛ గార్గీతి. 2

గార్గి: ఓ యాజ్ఞవల్క్యా! శూరుడైన కాశీదేశపు రాజు గాని, లేక విదేహ రాజు గాని తమ ధనుస్సునందు బాణములను సంధించి చక్కగ లాగి విడువ బడిన బాణము లెట్లు శత్రువులను వేధించునో అటువలె నేను నిన్ను రెండు ప్రశ్న లడుగ బోయెదను. జాగ్రత్తగా నుత్తరము జెప్పుము. యాజ్ఞవల్క్యుడీ మాటలను విని కానిమ్ము గార్గి! అడుగు మనెను.

సా హోవాచ యదూర్ధ్వం యాజ్ఞవల్క్య దివో యదవా క్పృథివ్యా యదంతరా ద్యావాపృథివీ ఇమే యద్భూతం చ భవచ్చ భవిష్యచ్చేత్యాచక్షతే కస్మిగ్ంస్తదోతం చ ప్రోతం చేతి. 3

గార్గి: ఓ యాజ్ఞవల్క్యా! ద్యులోకమునకు అవ్వలను పృథివికి దిగువను అనగా ఆకాశమునకు మీాద ఏది గలదో, మఱియు ఉన్న ట్టియు ఉండబోవునట్టియు సమస్తము దేనియందు ఓత ప్రోతమై యున్నదో దానిని దెలుపుము.

స హోవాచ యదూర్ధ్వం గార్గి దివో యదవాక్పృథివ్యా యదంతరా ద్యావాపృథివీ ఇమే యద్భూతం చ భవచ్చ భవిష్య చ్చేత్యాచక్షత ఆకాశే తదోతం చ ప్రోతం చేతి. 4

యాజ్ఞ: ఓ గార్గీ! ఈ సర్వము అవ్యాకృతాకాశమునందు ఓత ప్రోతమై యున్నది.

సా హోవాచ నమస్తేఽస్తు యాజ్ఞవల్క్య యో మ ఏతం వ్యవోచోఽపరస్మై ధారయస్వేతి పృచ్ఛ గార్గీతి. 5

గార్గి: ఓ యాజ్ఞవల్క్యా! నీకు నమస్కారము. ప్రశ్నను నీవు చక్కగా విచారించి చెప్పి యున్నావు. ఇక రెండవ ప్రశ్న నడిగెదను; చెప్పుము. మంచిది; అడుగుమని ముని అనెను.

సా హోవాచ యదూర్ధ్వం యాజ్ఞవల్క్య దివో యదవాక్పృథివ్యా యదంతరా ద్యావాపృథివీ ఇమే యద్భూతం చ భవచ్చ భవిష్యచ్చేత్యాచక్షతే కస్మిగ్ంస్తదోతం చ ప్రోతం చేతి. 6

ఓ యాజ్ఞవల్క్యుడా! ద్యులోకమునకు అవ్వలను పృథివికి క్రిందను తన్మధ్యముననను ఉండి ఈద్యావాపృథివులు, భూతభవిష్య ద్వర్తమానాదులని చెప్పబడు ఈ సర్వమును దేనియందు ఓత ప్రోతమై యున్నది? పైని (మొదటి) ప్రశ్ననే మఱొకసారి దార్ఢ్యము కొఱకై అడిగిన దని తెలియ వలయును.

స హోవాచ యదూర్ధ్వం గార్గి దివో యదవాక్పృథివ్యా యదంతరా ద్యావాపృథివీ ఇమే యద్భూతం చ భవచ్చ భవిష్యచ్చేత్యాచక్షత ఆకాశ ఏవ తదోతం చ ప్రోతం చేతి కస్మిన్ను ఖల్వాకాశ ఓతశ్చ ప్రోతశ్చేతి. 7

యాజ్ఞ: ఓగార్గీ! ద్యులోకమునకు అవ్వల, పృథివికి దిగువను మధ్యను ఈ ద్యావాపృథివ్యాదులును, భూత భవిష్యద్వర్తమానాది కాలములును, ఈ సమస్తము అవ్యాకృత ఆకాశమున ఓత ప్రోతమై యున్నది.

గార్గి: (మరల) ఓ యాజ్ఞవల్క్యా! ఈ ఆకాశము దేనియందు ఓత ప్రోతమై యున్నది?

స హోవాచైతద్వై తదక్షరం గార్గి బ్రాహ్మణా అభివదంత్యస్థూల మనణ్వహ్రస్వ మదీర్ఘ మలోహిత మస్నేహ మచ్ఛాయ మతమో

వాయ్వనాకాశ మసంగ మరస మగంధ మచక్షుష్క మశ్రోత్ర మవా గమనోఽతేజస్క మప్రాణ మముఖ మమాత్ర మనంతర మబాహ్యం న తదశ్నాతి కించన న తదశ్నాతి కశ్చన. 8

ఓగార్గీ! బ్రహ్మజ్ఞానులు దానిని అక్షరమునందని యందురు. నాశ రహితమైన దానియందు ఓత ప్రోతమై యున్నదని నుడివెదరు. అది స్థూలము గాదు. సూక్ష్మము గాదు. అణువును గాదు. పొట్టిది యును గాదు. పొడుగైనదియును గాదు. అలోహితము (రక్తము) లేనిది. అస్నేహము (చమురు, క్రొవ్వు లేనిది.) అచ్ఛాయము (నీడ లేనిది) అతమము (తమస్సు, అజ్ఞానము, చీకటి) లేనిది. అవాయువు (అది వాయువు గాదు.) అనాకాశము (అది ఆకాశము గాదు) అసం గము (సంగము లేనిది) అరసము (రసములేనిది) అగంధము (గంధము లేనిది) అచక్షువు (కన్నులులేనిది) అశ్రోత్రము (చెవులు లేనిది) అవాక్కు (మాటలు లేనిది) అమనస్సు (మనస్సులేనిది) అతేజస్కము (తేజస్సు లేనిది) అప్రాణము (ప్రాణములేనిది) అముఖము (నోరులేనిది) అమాత్రము (పరిమాణము లేనిది) లోవెలి యనునవి లేనిది. అదే ఉండునది. అది దేనిని తినుటలేదు. దానిని ఎవరునూ తినుట లేదు. (అది దేనికిని భోక్త కాదు. అది దేనికిని భోజ్యము కాదు.) అనగా అక్షరమగు వ్యాపకమైన స్వరూపమని అర్థము. (అయినను) ఇట్టి అపూర్వమగు తత్త్వమును ఎట్లు తెలియ వలయుననిన, చెప్పు చున్నారు.

ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి సూర్యాచంద్రమసౌ విధృతౌ తిష్ఠతః ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి ద్యావాపృథివ్యౌ విధృతే తిష్ఠత ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి నిమేషా ముహూర్తా అహోరాత్రాణ్యర్ధమాసా మాసా ఋతవః సంవత్సరా ఇతి విధృ తా స్తిష్ఠంత్యేతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి ప్రాచ్యో౽న్యా నద్యః స్యందంతే శ్వేతేభ్యః పర్వతేభ్యః ప్రతీచ్యో౽న్యా యాం యాం చ

దిశమన్వేతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి దదతో మనుష్యాః ప్రశగ్ంసంతి యజమానం దేవా దర్వీం పితరోఽన్వాయత్తాః. 9

యాజ్ఞ : ఓగార్గీ! ఈ అక్షరముయొక్క ఆజ్ఞచేత సూర్య చంద్రులు తమ తమ స్థానములయందు స్థిరముగ నిలిచియున్నారు. ఈ అక్షరముయొక్క ఆజ్ఞాధారముననే పృథివ్యాది భూతములు తమ తమ స్థానములందు కదలక స్థిరముగా నిలువ శక్తిమంతములై యున్నవి. ఈ అక్షరముయొక్క ఆజ్ఞాధారముననే నిమిషములు, ముహూర్తములు, అహోరాత్రములు, పక్షములు, మాసములు, ఋతువులు, సంవత్సరములు, అనగా కాలపురుషుడు ఉనికి గలిగి వర్తించుచున్నాడు. ఈ అక్షరముయొక్క ఆజ్ఞవల్లనే జనులు దాతలను పొగడుచున్నారు. దేవతలు యజమానుల ననుసరింతురు. పితృదేవతలు హోమమును స్వీకరింతురు.

యో వా ఏ తదక్షరం గార్గ్యవిదిత్వాఽస్మింల్లోకే జుహోతి యజతే తపస్తప్యతే బహూని వర్ష సహస్రాణ్యంతవదేవాస్య తద్భవతి యో వా ఏ తదక్షరం గార్గ్యవిదిత్వాఽస్మాల్లోకాత్ప్రైతి స కృపణోఽథ య ఏతదక్షరం గార్గి విదిత్వాఽస్మాల్లోకాత్ప్రైతి స బ్రాహ్మణః. 10

ఓగార్గీ! ఈ అక్షరము నెఱుగక ఈ లోకమునందు యజ్ఞము చేయువాని వేలాది సంవత్సరములు తప మాచరించువాని తత్తత్ఫలము లెల్ల వినాశవంతము లైనవని తెలియుము. ఈ అక్షరమును దెలియక అనగా ఆత్మజ్ఞానమును పొందక ఈ లోకమునుండి వెడలువాడు (మరణించువాడు) కృపణుడు, క్షుద్రుడు, దీనుడు, దరిద్రుడని భావము. ఈ అక్షరజ్ఞానమును బడసి ఈ లోకమునుండి వెడలి పోవువాడే (శరీరమును విడిచినవాడే) బ్రాహ్మణుడు. బ్రహ్మజ్ఞాని యని తాత్పర్యము.

తద్వా ఏతదక్షరం గార్గ్యదృష్టం ద్రష్ట్రశ్రుతగ్ం శ్రోత్రమతం మంత్రవిజ్ఞాతం విజ్ఞాతృ నాన్యదతోఽస్తి ద్రష్టృ నాన్యదతోఽస్తి

శ్రోతృ నాన్యదతోఽస్తి మంతృ నాన్యదతోఽస్తి విజ్ఞాతేత్రస్మిన్ను ఖల్వక్షరే గార్గ్యాకాశ ఓతశ్చ ప్రోతశ్చేతి. 11

ఓ గార్గీ! ఈ అక్షరము (ఆత్మ) తానన్యుల కగపడక అందఱిని చూచును. వినబడకుండి వినును. ఆలోచనార్హము గాక పోయినను విచారార్హమై యున్నది. తెలియబడదు. తెలిసికొనును. ఇది వినా చూచువారు లేరు. ఈ సత్యవస్తువువినా వినువారు లేరు. దీనిని విడిచి విచారించువారు లేరు. మఱియు తెలియువారును లేరు. ఓగార్గీ! ఈ అక్షరమునందే ఆకాశము ఓత ప్రోతమై యున్నది.

సా హోవాచ బ్రాహ్మణా భగవంతస్తదేవ బహుమన్యేధ్వం యదస్మాన్నమస్కారేణముచ్యేధ్వం న వై జాతు యుష్మాకమిమం కశ్చిద్బ్రహ్మోద్యం జేతేతి తతో హ వాచక్నవ్యుపరరామ. 12

అప్పుడు గార్గి, ఓ పూజ్యులగు బ్రాహ్మణులారా! యాజ్ఞవల్క్య మహామునికి వందనము లాచరించి అతనితో వాదమునుండి మనము విరమించుట మంచిది. మీయందెవరును ఇతనిని బ్రహ్మచర్చయందు జయింప జాలరని చెప్పి వాచక్నవి యగు గార్గి మిన్నకుండెను.

---

## 9-వ బ్రాహ్మణము

అవ: యాజ్ఞవల్క్య శాకల్య సంవాదము. యాజ్ఞవల్క్యుని విజయము.

అథ హైనం విదగ్ధః శాకల్యః పప్రచ్ఛ కతి దేవా యాజ్ఞవల్క్యేతి స హైతయైవనివిదా ప్రతిపేదే యావంతో వైశ్వదేవస్య నివిద్యుచ్యంతే త్రయశ్చ త్రీ చ శతా త్రయశ్చ త్రీ చ సహస్రేత్యోమితి హోవాచ కత్యేవ దేవా యాజ్ఞవల్క్యేతి త్రయస్త్రింశదిత్యోమితి హోవాచ కత్యేవ దేవా యాజ్ఞవల్క్యేతి షడిత్యోమితి హోవాచ కత్యేవ దేవా యాజ్ఞవల్క్యేతి త్రయ ఇత్యోమితి హోవాచ కత్యేవ దేవా యాజ్ఞవల్క్యేతి ద్వావిత్యోమితి హోవాచ

కత్యేవ దేవా యాజ్ఞవల్క్యేత్యథ్యర్థ ఇత్యోమితి హోవాచ కత్యేవ దేవా యాజ్ఞవల్క్యేత్యేక ఇత్యోమితి హోవాచ కతమే తేత్ర యశ్చ త్రీ చ శతాత్రయశ్చ త్రీ చ సహస్రేతి. 1

పిదప విదగ్ధ శాకల్యుడను నతడు ఇట్లు ప్రశ్నించెను. ఓ యాజ్ఞవల్క్యా! దేవత లెందఱు? ఆ సంఖ్య ఎంత? అని యడిగెను.

యాజ్ఞ : నివిత్ అను మంత్రముల మూలమున చెప్పెను. ఏమనిన వైశ్వదేవ యాగమంత్రములందు నివిత్ లేక నివిత్ (నివిది) యందు ఒక మంత్రము గలదు. అందు ఉల్లేఖింప బడిన సంఖ్య గల వారై యున్నారు.

శాకల్యుడు : ఆ సంఖ్య ఎంత?

యాజ్ఞ : మూడు, మూడు, నూఱు, మూడు, మూడు, వేలు; దేవతలు గలరు.

దేవత ఎవరని మఱియు సంఖ్యను తగ్గించి యడుగగా 33–6–3–2–1½–1 దేవత అని ఇట్లు చెప్పబడెను.

శాకల్యుడు: మున్నూటమూడు, మూడు వేల మూడు అని చెప్పిన ఆ దేవత లెవరు?

స హోవాచ మహిమాన ఏవైషామేతే త్రయస్త్రింగ్ంశత్త్వేవ దేవా ఇతి కతమే తే త్రయస్త్రింగ్ంశదిత్యష్టౌ వసవ ఏకాదశ రుద్రా ద్వాదశాదిత్యాస్త ఏకత్రింగ్ంశదింద్రశ్చైవ ప్రజాపతిశ్చ త్రయస్త్రింగ్ంశావితి. 2

యాజ్ఞ: అయ్యా! వారు దేవతలు కారు. సంఖ్యాక్రమము ననుసరించి 33 దేవతలయొక్క విభూతులే; మహిమలే. 303 మఱియు 3003 అయి యున్నారు. ఆ 33 దేవత లెవరనగా ఎనమండ్రుగురు వసువులు, పదునొకండుగురు రుద్రులును, పన్నెండుగురు ఆదిత్యులును. ఇట్లు ముప్పదియొకటి, మఱియు ఇంద్రుడు, ప్రజాపతి. ఈ విధముగ మొత్తము ముప్పదిముగ్గురు దేవతలు.

కతమే వసవ ఇత్యగ్నిశ్చ పృథివీ చ వాయుశ్చాంతరిక్షం చాదిత్యశ్చ ద్యౌశ్చ చంద్రమాశ్చ నక్షత్రాణి చైతే వసవ ఏతేషు హీదం వసు సర్వగ్ం హిత మితి తస్మాద్వసవ ఇతి. 3

ప్రశ్న: ఎనమండుగురు వసువు లెవరు?

సమా: అగ్ని, పృథివి, వాయువు, అంతరిక్షము, ఆదిత్యుడు, ద్యులోకము, చంద్రుడు, నక్షత్రములు. (ఈ ఎనమండుగురు వసువులు). సర్వము ఈ వసువులయం దుంచబడినది. అందుచే వాటికి వసువులని పేరాయెను.

కతమే రుద్రా ఇతి దశేమే పురుషే. ప్రాణా ఆత్మైకాదశస్తే యదాఽస్మాచ్ఛరీరాన్మర్త్యాదుత్క్రామంత్యథ రోదయంతి తద్య ద్రోదయంతి తస్మాద్రుద్రా ఇతి. 4

ప్రశ్న: పదునొక్కరు రుద్రులనగా నెవరు?

సమా: పురుషునియం దుండు ప్రాణములు, మనస్సు, మఱియు ఆత్మ; ఈ రెండును చేరి ఒకటి. పంచ కర్మేంద్రియములు, పంచ జ్ఞానేంద్రియములు మొత్తము ఈ పదునొక్కరు రుద్రులు. ఆత్మయే పదునొకండవ వాడు. ఇది ఈ మర్త్య శరీరమును విడిచి వెళ్ళినని మానవుని ఏడ్చునట్లు చేయును, అట్లు ఏడ్పించునవి యైనందువలననే "రోదయంతి" రుద్రులని వీటికి నామము గలిగెను.

కతమ ఆదిత్యా ఇతి ద్వాదశ వై మాసాః సంవత్సరస్యైత ఆదిత్యా ఏతే హీదగ్ం సర్వమాదదానా యంతి తే యదిదగ్ం సర్వ మాదదానా యంతి తస్మాదాదిత్యా ఇతి. 5

ప్రశ్న : పన్నెండుగురు ఆదిత్యు లెవరు?

సమా : సంవత్సరముయొక్క పన్నెండు నెలలు ఆదిత్య దేవతలు. వీరు ఆ యా సమయములయందు పరివర్తనము నొందుచు ప్రాణుల ఆయుస్సును కర్మఫలమును హరించుటచేత "ఆదదానః" ఆదిత్యులని పేరు గలిగెను.

కతమ ఇంద్రః కతమః ప్రజాపతిరితి స్తనయిత్నురేవేంద్రో యజ్ఞః ప్రజాపతిరితి కతమ స్తనయిత్నురిత్యశనిరితి కతమో యజ్ఞ ఇతి పశవ ఇతి. 6

ప్రశ్న : ఇంద్రుడు, మఱియు ప్రజాపతి అనగా నెవరు?

సమా : ఉరుమే ఇంద్రుడు. యజ్ఞమే ప్రజాపతి. మేఘమే ఇంద్రుడు. పిడుగే ఉరుము. పశువులే యజ్ఞము.

కతమే షడిత్యగ్నిశ్చ పృథివీ చ వాయుశ్చాంతరిక్షం చాదిత్యశ్చ ద్యౌశ్చైతే షడేతే హీదగ్ం సర్వగ్ం షడితి. 7

ప్రశ్న : ఆ ఆఱుగురు దేవత లెవరు?

సమా : అగ్ని, పృథివి, వాయువు, అంతరిక్షము, ఆదిత్యుడు, ద్యులోకము, ఈ ఆఱుగురు దేవతలు. సర్వ దేవతలును ఈ ఆఱుగు రందు అంతర్భూతులై యున్నారు.

కతమే తే త్రయో దేవా ఇతీమ ఏవ త్రయో లోకా ఏషు హీమే సర్వే దేవా ఇతి కతమౌ తౌ ద్వౌ దేవావిత్యన్నం చైవ ప్రాణశ్చేతి కతమోఽధ్యర్ధ ఇతి యోఽయం పవత ఇతి. 8

ప్రశ్న : ఇక ముగ్గురు దేవతలనగా నెవరు?

సమా : ఈ మూడు లోకములే. ఎందుకనగా ఇందే అందఱు దేవత లున్నారు. భూలోకము, అంతరిక్షము, స్వర్గలోకము, పృథివి, అగ్ని చేరి ఒకటి. అంతరిక్షమును వాయువును చేరి రెండవది. స్వర్గము, ఆదిత్యుడు చేరి మూడవది. యీ మూడింటిలో సర్వము అంతర్గతమై యున్నది.

ప్రశ్న : ఇద్దఱు దేవత లెవరు?

సమా : అన్నము, మఱియు ప్రాణము. ఈ రెండిటిలో సర్వము అంతర్గతమై యున్నది.

ప్రశ్న : ఒకటిన్నర దేవత యనగా నెవరు?

సమా : ఈ వీచు గాలియే, (వాయువు).

తదాహుర్యదయమేక ఇవైవ పవతేఽథ కథమధ్యర్ధ ఇతి యద స్మిన్నిదగ్ం సర్వమధ్యార్ధ్నో త్తేనాధ్యర్ధ ఇతి కతమ ఏకో దేవ ఇతి ప్రాణ ఇతి స బ్రహ్మ త్యదిత్యాచక్షతే. 9

వాయు వొక్కడే వీచువా డందురు. అన్నపుడు ఒకటిన్నర అని ఎందుకు చెప్పవలె ననగా, ఈ వాయువుచేతనే సమస్తమును వృద్ధి పొందుటవలన దీనిని 'అధ్యర్ధ' ఒకటిన్నర యని అందురు. ఇక ఒక్క దేవు డెవరు? ప్రాణము. ఈ ప్రాణమే సర్వ దేవతాత్మకమగు బ్రహ్మము. దీనిని "త్యత్" అని యందురు. ఒక్కటి యైనది, అనే కము నదియె అయియున్నదని భావము.

పృథివ్యేవ యస్యాయతనమగ్నిర్లోకో మనో జ్యోతిర్యో వై తం పురుషం విద్యాత్సర్వస్యాత్మనః పరాయణగ్ం స వై వేదితా స్యాత్. యాజ్ఞవల్క్య వేద వా అహం తం పురుషగ్ం సర్వస్యాత్మనః పరా యణం యమాత్థ య ఏవాయగ్ం శారీరః పురుషః స ఏష వదైవ శాకల్య తస్య కా దేవతేత్యమృతమితి హోవాచ. 10

ప్రశ్న : యాజ్ఞవల్క్యుడా! పృథివి ఏ పురుషుని అధిష్ఠానమో, అగ్ని ఎవని దర్శనశక్తియో, మనస్సు ఎవరి జ్యోతియో, ఇట్టి పురు షుని ఎవడెఱుగునో, అతడు సర్వవస్తువుల అధిష్ఠానమగు ఆత్మను తెలి యును. ఆ పురుషుని నీ వెఱుగుదువా?

సమా : అయ్యా! సర్వవస్తువులు ఏ ఆత్మాధిష్ఠానము నందున్న వని ఎవనిని గుఱించి నీవు చెప్పితివో ఆ యాత్మను నేను తెలిసి యున్నాను. ఈ శరీరమునందుండు పురుషుడే అతడు. శాకల్యుడా! ముందు మాటాడుము.

ప్రశ్న : ఆ పురుషుడు ఎవరు?

సమా : అతడమృత స్వరూపుడు.

కామ ఏవ యస్యాయతనగ్ం హృదయం లోకో మనో జ్యోతిర్యో వై తం పురుషం విద్యాత్సర్వస్యాత్మనః పరాయణగ్ం స వై వేదితా స్యాత్. యాజ్ఞవల్క్య వేద వా అహం తం పురుషగ్ం సర్వస్యాత్మనః పరాయణం యమాత్థ య ఏవాయం కామమయః పురుషః స ఏష వదైవ శాకల్య తస్య కా దేవతేతి స్త్రియ ఇతి హోవాచ. 11

ప్రశ్న : యాజ్ఞవల్క్యుడా! కామము ఏ పురుషుని అధిష్ఠానమో, హృదయము దర్శన స్థానమో, మనస్సు జ్యోతియో అట్టి పురుషుని తెలియువాడు సర్వ వస్తువుల అధిష్ఠానమగు ఆత్మను తెలియునుగదా?

సమా: సర్వ వస్తువులు ఆత్మాధిష్ఠితము లని ఎవనిని గుఱించి నీవు మాటలాడితివో అతనిని గుఱించి నేను తెలిసి యున్నాను. అతడే ఈ కామమయ పురుషుడు. సరే! ఇక ముందు ఏమి మాటలాడెదవో మాటలాడుము.

ప్రశ్న: ఈ పురుషుని దేవత ఎవరు?

సమా. స్త్రీలు. (అని ముని ఉత్తరము చెప్పెను.)

రూపాణ్యేవ యస్యాయతనం చక్షుర్లోకో మనో జ్యోతిర్యో వై తం పురుషం విద్యాత్సర్వస్యాత్మనః పరాయణగ్ం స వై వేదితా స్యాత్. యాజ్ఞవల్క్య వేద వా అహం తం పురుషగ్ం సర్వస్యాత్మనః పరాయణం యమాత్థ య ఏవాసావాదిత్యే పురుషః స ఏష వదైవ శాకల్య తస్య కా దేవతేతి సత్యమితి హోవాచ. 12

ఓ యాజ్ఞవల్క్యుడా! రూపములు ఏ పురుషుని అధిష్ఠానమో, కన్ను దర్శన స్థానమో, మనస్సు జ్యోతియో, ఆ పురుషుని తెలియువాడు సర్వ వస్తువుల అధిష్ఠానమగు ఆత్మను తెలియునని శాకల్యుడు చెప్పెను. సమస్త వస్తువులకు ఆత్మయే అధిష్ఠానమని ఎవనిని గుఱించి

నీవు మాటలాడెదవో వానిని నేను దెలిసి యున్నాను. ఆదిత్యునియం దుండు పురుషుడే అతడు. అనంతరము ఈ పురుషుని దేవత ఎవరని యడుగ సత్యమని ముని బదులు చెప్పెను.

ఆకాశ ఏవ యస్యాయతనగ్ం శ్రోత్రం లోకో మనో జ్యోతిర్యో వై తం పురుషం విద్యాత్సర్వస్యాత్మనః పరాయణగ్ం స వై వేదితా స్యాత్. యాజ్ఞవల్క్య వేద వా అహం తం పురుషగ్ం సర్వస్యాత్మనః పరాయణం యమాత్థ య ఏవాయగ్ం శ్రౌత్రః ప్రాతిశ్రుత్కః పురుషః స ఏష వదైవ శాకల్య తస్య కా దేవతేతి దిశ ఇతి హోవాచ.13

యాజ్ఞవల్క్యుడా! ఆకాశము ఏ పురుషుని అధిష్ఠానమో, శ్రోత్రము దర్శన స్థానమో, మనస్సు జ్యోతియో, ఆ పురుషుని తెలియువాడు సర్వ వస్తువుల అధిష్ఠానమగు ఆత్మను తెలియునని శాకల్యు డనెను.

యాజ్ఞ: సర్వవస్తువులు ఆత్మయొక్క అధిష్ఠానమునం దున్నవని దేనిని గుఱించి నీవు మాటలాడెదవో దానిని నేను దెలిసి యున్నాను. ధ్వని విషయకమగు చెవికి ఆశ్రయ స్థానమైన పురుషుడే అతడు. ఈ పురుషుని దేవత ఎవరు? దిక్కులని ముని చెప్పెను.

తమ ఏవ యస్యాయతనగ్ం హృదయం లోకో మనో జ్యోతిర్యో వై తం పురుషం విద్యాత్సర్వస్యాత్మనః పరాయణగ్ం స వై వేదితా స్యాత్. యాజ్ఞవల్క్య వేద వా అహం తం పురుషగ్ం సర్వస్యాత్మనః పరాయణం యమాత్థ య ఏవాయం ఛాయామయః పురుషః స ఏష వదైవ శాకల్య తస్య కా దేవతేతి మృత్యురితి హోవాచ. 14

ఓ యాజ్ఞవల్క్యా! తమస్సు ఏ పురుషుని అధిష్ఠానము? మఱియు ఏ పురుషుని హృదయము దర్శనస్థానమో, మనస్సు జ్యోతియో, ఆ పురుషుని తెలియువాడు సర్వ వస్తువుల అధిష్ఠానమగు

ఆత్మను తెలియునని శాకల్యుడనగా సర్వ వస్తువులును ఆత్మాధిష్ఠితములని ఎవనిని గుఱించి నీవు మాటలాడితివో ఆ ఛాయామయ పురుషుడే అతడని యాజ్ఞవల్క్యుడు చెప్పెను. ఈ పురుషుని దేవత ఎవరు? మృత్యువని ముని ఉత్తరము చెప్పెను.

రూపాణ్యేవ యస్యాయతనం చక్షుర్లోకో మనో జ్యోతిర్యో వై తం పురుషం విద్యాత్సర్వస్యాత్మనః పరాయణగ్ం స వై వేదితా స్యాత్. యాజ్ఞవల్క్య వేద వా అహం తం పురుషగ్ం సర్వస్యాత్మనః పరాయణం యమాత్థ య ఏవాయమాదర్శే పురుషః స ఏష వదైవ శాకల్య తస్య కా దేవతేత్యసురితి హోవాచ. 15

ఓ యాజ్ఞవల్క్యుడా! రూపములు ఏ పురుషుని అధిష్ఠానములో, కన్ను దర్శన స్థానమో, మనస్సు జ్యోతియో, ఆ పురుషుని తెలియువాడు సర్వ వస్తువుల అధిష్ఠానమగు ఆత్మను తెలియునని శాకల్యుడనెను. సర్వ వస్తువుల అధిష్ఠానమని ఏ ఆత్మను గుఱించి నీవు మాటలాడితివో, వానిని నేను తెలిసియున్నాను. అద్దమునందుండు పురుషుడే అతడు. మఱియు ఓ శాకల్యుడా! ఇంకేమైన నుండిన మాటలాడుమని ముని చెప్పెను. ఈ పురుషుని దేవత ఎవరని మరల అడుగ ఊపిరి (శ్వాస యని) ముని చెప్పెను.

ఆప ఏవ స్యాయతనగ్ం హృదయం లోకో మనో జ్యోతిర్యో వై తం పురుషం విద్యాత్సర్వస్యాత్మనః పరాయణగ్ం స వై వేదితా స్యాత్. యాజ్ఞవల్క్య వేద వా అహం తం పురుషగ్ం సర్వస్యాత్మనః పరాయణం యమాత్థ య ఏవాయమప్సు పురుషః స ఏష వదైవ శాకల్య తస్య కా దేవతేతి వరుణ ఇతి హోవాచ. 16

ఓ యాజ్ఞవల్క్యుడా! జలము ఏ పురుషుని అధిష్ఠానమో, హృదయము దర్శన స్థానమో, మనస్సు జ్యోతియో, ఆ పురుషుని తెలియువాడు సర్వ వస్తువుల అధిష్ఠానమగు ఆత్మను తెలియునని శాకల్యుడనెను. ఏ ఆత్మను గురించి నీవు మాటలాడితివో వానిని నేను

తెలిసి యున్నాను. జలముల యందుండు పురుషుడే అతడు. శాకల్యుడా! ఇందుపై ఇంకేమైన నుండిన మాటలాడుము. ఈ పురుషుని దేవత ఎవరు? వరుణుడని యాజ్ఞవల్క్యుడు చెప్పెను.

రేత ఏవ యస్యాయతనగ్ం హృదయం లోకో మనో జ్యోతిర్యో వై తం పురుషం విద్యాత్సర్వస్యాత్మనః పరాయణగ్ం స వై వేదితా స్యాద్యాజ్ఞవల్క్య వేద వా అహం తం పురుషగ్ం సర్వస్యాత్మనః పరాయణం యమాత్థ య ఏవాయం పుత్రమయః పురుషః స ఏష వదైవ శాకల్య తస్య కా దేవతేతి ప్రజాపతి రితి హోవాచ. 17

ఓ యాజ్ఞవల్క్యుడా! రేతస్సు ఏ పురుషుని అధిష్ఠానమో, హృదయము దర్శన స్థానమో, మనస్సు జ్యోతియో, ఆ పురుషుని తెలియువాడు సర్వాధిష్ఠాన మగు ఆత్మను తెలియునని శాకల్యుడనెను. సర్వవస్తువుల అధిష్ఠానమని ఏ ఆత్మను గుఱించి నీవు మాట లాడితివో అతనిని నేను తెలియుదును. పుత్రమయ పురుషుడే అతడు. శాకల్యుడా! ముందేమైనను మాటలాడదలంచిన మాటలాడుము. ఈ పురుషుని దేవత ఎవరు? ప్రజాపతియని యాజ్ఞవల్క్యుడు పలికెను.

శాకల్యేతి హోవాచ యాజ్ఞవల్క్యస్త్వాగ్ం స్విదిమే బ్రాహ్మణా అంగారావక్షయణమక్రతా3 ఇతి. 18

ఓ శాకల్యుడా! ఈ బ్రాహ్మణులు నిన్ను పటుకారు వలె పట్టుకొని ఆడించుచున్నారు. నీ ద్వారా నన్ను ఓడింప యత్నించుచున్నారు. ప్రశాంత మనస్కుడవై చాలించుము. మంచిదగును.

యాజ్ఞవల్క్యేతి హోవాచ శాకల్యో యదిదం కురు పాంచాలానాం బ్రాహ్మణానత్యవాదీః కిం బ్రహ్మ విద్వానితి దిశో వేద స దేవాస్స ప్రతిష్ఠా ఇతి యద్దిశో వేత్థ స దేవాస్స ప్రతిష్ఠాః. 19

ఓ యాజ్ఞవల్క్యా! నేను బ్రహ్మమును దెలిసి యున్నానను భావముచే ఈ కురు పాంచాల దేశపు బ్రాహ్మణోత్తములనెల్ల

జయించితినని విఱ్ఱవీగుచున్నావా ఏమి? నీవు ఏ బ్రహ్మతత్త్వమును నెఱిగి ఇట్లు పలుకుచున్నావు?

యాజ్ఞవల్క్యుడు : నేను దిక్కులను మఱియు వాటి దేవతలను తదధిష్ఠానమును తెలియుదునని యాజ్ఞవల్క్యుడు చెప్పెను.

శాకల్యుడు : దిక్కులు వాటి అధిదేవతలు తత్ప్రతిష్ఠను నీవు తెలిసి యున్నచో తెలుపగలవా?

కిం దేవతోఽస్యాం ప్రాచ్యాం దిశ్యసీత్యాదిత్య దేవత ఇతి స ఆదిత్యః కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి చక్షుషీతి కస్మిన్ను చక్షుః ప్రతిష్ఠితమితి రూపేష్వితి చక్షుషా హి రూపాణి పశ్యతి కస్మిన్ను రూపాణి ప్రతిష్ఠితానీతి హృదయ ఇతి హోవాచ హృదయేన హి రూపాణి జానాతి హృదయే హ్యేవ రూపాణి ప్రతిష్ఠితాని భవంతీత్యేవమేవైతద్యాజ్ఞవల్క్య. 20

ప్రశ్న : పూర్వ దిక్కునం దే దేవత యున్నది?

సమా : ఆదిత్య దేవత.

ప్రశ్న : అది దేని యందు ప్రతిష్ఠింప బడి యున్నది?

సమా : కన్నులయందు

ప్రశ్న : ఆ కన్నులు దేనియందు ప్రతిష్ఠితములై యున్నవి?

సమా : రూపములందు. కన్నులచే రూపములను చూచును.

ప్రశ్న : రూపములు దేనియందు ప్రతిష్ఠింపబడియున్నవి?

సమా : హృదయమునందు. హృదయమునుండియే మనుష్యుడు రూపములను గ్రహించును. హృదయమునందే రూపములన్నియు ప్రతిష్ఠింపబడి యున్నవి. సరి అని శాకల్యుడంగీకరించెను.

కిం దేవతోఽస్యాం దక్షిణాయాం దిశ్యసీతి యమ దేవత ఇతి స యమః కస్మిన్ప్రతిష్ఠిత ఇతి యజ్ఞ ఇతి కస్మిన్ను యజ్ఞః ప్రతిష్ఠిత ఇతి దక్షిణాయామితి కస్మిన్ను దక్షిణా ప్రతిష్ఠితేతి శ్రద్ధాయామితి యదా హ్యేవ శ్రద్ధత్తేఽథ దక్షిణాం దదాతి శ్రద్ధాయాగ్ంహ్యేవ దక్షిణా

ప్రతిష్ఠితేతి కస్మిన్ను శ్రద్ధా ప్రతిష్ఠితేతి హృదయ ఇతి హోవాచ హృదయేన హి శ్రద్ధాం జానాతి హృదయే హ్యేవ శ్రద్ధా ప్రతిష్ఠితా భవతీత్యేవమేవైతద్యాజ్ఞవల్క్య. 21

ప్రశ్న : దక్షిణ దిక్కునందు ఏ దేవత గలదు?

సమా : యమ దేవత.

ప్రశ్న : ఆ యముని ప్రతిష్ఠ ఏది?

సమా : యజ్ఞము.

ప్రశ్న : యజ్ఞము దేనియందు ప్రతిష్ఠితమై యున్నది?

సమా : దక్షిణ యొసగుటయందు.

ప్రశ్న : దక్షిణలు దేనియందు ప్రతిష్ఠితములై యున్నవి?

సమా : శ్రద్ధయందు. ఎందుకనగా శ్రద్ధ యుండునపుడే మనుష్యుడు దక్షిణ యొసగును. శ్రద్ధయందే దక్షిణ ప్రతిష్ఠింపబడి యున్నది.

ప్రశ్న : శ్రద్ధ దేనియందు ప్రతిష్ఠింపబడి యున్నది?

సమా : హృదయమునందు.

ప్రశ్న : హృదయముచేతనే మనుష్యుడు శ్రద్ధను తెలిసికొనగలుగును. అందుచేత హృదయమే శ్రద్ధయొక్క ప్రతిష్ఠా స్థానము. ఔనని శాకల్యుడు ఒప్పుకొనెను.

కిం దేవతోఽస్యాం ప్రతీచ్యాం దిశ్యసీతి వరుణ దేవత ఇతి స వరుణః కస్మిన్ప్రతిష్ఠిత ఇత్యప్స్వితి కస్మిన్న్వాపః ప్రతిష్ఠితా ఇతి రేతసీతి కస్మిన్ను రేతః ప్రతిష్ఠితమితి హృదయ ఇతి తస్మాదపి ప్రతిరూపం జాతమాహుర్హృదయాదివ సృప్తో హృదయాదివ నిర్మిత ఇతి హృదయే హ్యేవ రేతః ప్రతిష్ఠితం భవతీత్యేవమేవైతద్యాజ్ఞవల్క్య. 22

ప్రశ్న : పశ్చిమ దిక్కునందు ఏ దేవత గలదు?

సమా : వరుణ దేవత.

ప్రశ్న : వరుణుని ప్రతిష్ఠ ఏది?

సమా : జలము.

ప్రశ్న : జలము దేనియందు ప్రతిష్ఠింపబడి యున్నది?

సమా : రేతస్సునందు.

ప్రశ్న : రేతస్సు దేనియందు ప్రతిష్ఠింపబడి యున్నది?

సమా : హృదయమునందు. అందుచేతనే తండ్రిరూపము కుమారునకు ఉన్నదని చెప్పుదురు. హృదయమునుండియే వెడలి హృదయమునుండియే ఉత్పన్నమైనాడని కుమారుని అందురు. అందుచేత హృదయమునందే రేతస్సుండునని అర్థము. శాకల్యుడంగీకరించెను.

కిం దేవతో౽స్యాముదీచ్యాం దిశ్యసీతి సోమ దేవత ఇతి స సోమః కస్మిన్ప్రతిష్ఠిత ఇతి దీక్షాయామితి కస్మిన్ను దీక్షా ప్రతిష్ఠితేతి సత్య ఇతి తస్మాదపి దీక్షితమాహుః సత్యం వదేతి సత్యే హ్యేవ దీక్షా ప్రతిష్ఠితేతి కస్మిన్ను సత్యం ప్రతిష్ఠితమితి హృదయ ఇతి హోవాచ హృదయేన హి సత్యం జానాతి హృదయే హ్యేవ సత్యం ప్రతిష్ఠితం భవతీత్యేవమేవైతద్యాజ్ఞవల్క్య. 23

ప్రశ్న : ఈ ఉత్తరదిశయందు ఏ దేవత కలదు?

సమా : సోమదేవత.

ప్రశ్న : సోముడు దేనియందు ప్రతిష్ఠితుడై యున్నాడు?

సమా : దీక్షయందు.

ప్రశ్న : దీక్షలు దేనియందు ప్రతిష్ఠితములై యున్నవి?

సమా : సత్యమునందు. అందువలన దీక్షితునకు సత్యమును చెప్పుమని చెప్పుదురు. సత్యమునందే దీక్షలు ప్రతిష్ఠితములై యున్నవి.

ప్రశ్న : సత్యము దేనియందు ప్రతిష్ఠితము?

సమా : హృదయమునందు. హృదయము చేతనే సత్యమును మానవుడు తెలిసికొనును. ఈ విషయమును విని మౌనని శాకల్యుడంగీకరించెను.

కిం దేవతోఽస్యాం ధ్రువాయాం దిశ్యసీత్యగ్ని దేవత ఇతి సోఽగ్నిః కస్మిన్ప్రతిష్ఠిత ఇతి వాచీతి కస్మిన్ను వాక్ప్రతిష్ఠితేతి హృదయ ఇతి కస్మిన్ను హృదయం ప్రతిష్ఠిత మితి. 24

శాకల్యుడు : ఈ ధ్రువ నక్షత్రాది దిక్కులయందు ఏ దేవత గలదు?

యాజ్ఞ : అగ్ని దేవత.

శాకల్యుడు : అగ్ని దేవత దేనియందు ప్రతిష్ఠితమై యున్నది?

యాజ్ఞ : వాక్కునందు.

శాకల్యుడు : వాక్కు దేనియందు ప్రతిష్ఠితమై యున్నది?

యాజ్ఞవల్క్యుడు : హృదయమునందు.

శాకల్యుడు : హృదయము దేనియందు ప్రతిష్ఠితమై యున్నది?

అహల్లికేతి హోవాచ యాజ్ఞవల్క్యో యత్రైతదన్యత్రాస్మన్మన్యాసై యద్ధ్యేత దన్యత్రాస్మత్స్యాచ్ఛ్వానో వైన ధద్యుర్వయాగ్ంసి వైన ద్విమథ్నీరన్నితి. 25

అప్పుడు యాజ్ఞవల్క్యు డీ విధముగ బలికెను. ఓ అహల్లికా! ఓరి అతిమూఢుడా! ఈ హృదయము మనలను విడిచి అనగా నిన్ను విడిచి వేఱొక దానియందు ప్రతిష్ఠింపబడి యున్నదని నీవు తెలిసిన పక్షమున రెండవ స్థానమునందు ప్రతిష్ఠింపబడినచో దానిని కుక్కలు తిని వేసి యుండును. పక్షులు గ్రుక్కి వేయవా? తాత్పర్య మేమనిన హృదయము నీకంటె వేఱుగా ప్రతిష్ఠితమై యున్నదని తెలిసిన కుక్కలు నీ శరీరమును పెఱికి తినునని అర్థము.

కస్మిన్ను త్వం చాత్మా చ ప్రతిష్ఠితౌ స్థ ఇతి ప్రాణ ఇతి కస్మిన్ను ప్రాణః ప్రతిష్ఠిత ఇత్యపాన ఇతి కస్మిన్న్వపానః ప్రతిష్ఠిత ఇతి వ్యాన ఇతి కస్మిన్ను వ్యానః ప్రతిష్ఠిత ఇత్యుదాన ఇతి కస్మిన్నూదానః ప్రతిష్ఠిత ఇతి సమాన ఇతి స ఏష నేతినేతీ త్యాత్మాఽగృహ్యో న

హి గృహ్యతేఽశీర్యో న హి శీర్యతేఽసంగో న హి సజ్యతేఽసితో న వ్యథతే న రిష్యతి. ఏతాన్యష్టా వాయతనా న్యష్టా లోకా అష్టా దేవా అష్టౌ పురుషాః స యస్తాన్పురుషాన్నిరుహ్య ప్రత్యుహ్యాత్య క్రామ_త్తంత్వౌపనిషదం పురుషం పృచ్ఛామి తం చేన్మే న వివక్ష్యసి మూర్ధా తే విపతిష్యతీతి. తగ్ం హ న మేనే శాకల్య స్తస్య హ మూర్ధా విపపాతాపి హాస్య పరిమోషిణోఽస్థీన్యపజహ్రురన్య న్మన్యమానాః. 26

ప్రశ్న : నీవు మఱియు నీఆత్మ దేనియందు ప్రతిష్ఠితమై యున్నది ?

సమా : ప్రాణమునందు.

ప్రశ్న : ప్రాణము దేనియందు ప్రతిష్ఠితమై యున్నది?

సమా : అపానమునందు.

ప్రశ్న : అపానము దేనియందు ప్రతిష్ఠితము?

సమా : వ్యాన వాయువునందు.

ప్రశ్న : వ్యాన వాయువు దేనియందు ప్రతిషితము?

సమా : ఉదాన వాయువునందు.

ప్రశ్న : ఉదాన వాయువు దేనియందు ప్రతిష్ఠితమై యున్నది?

సమా : సమాన వాయువునందు.

ఈ ఆత్మ నేతి నేతి న ఇతి, న ఇతి అనగా ఇది కాదు, ఇదికాదు అని వర్ణింపబడును. ఆత్మ అగ్రాహ్యము (ఇంద్రియాగోచరము.) అవినాశి (నాశరహితుడు.) అసంగుడు (ఆసక్తి లేనివాడు.) ఇతనికి బంధము లేదు. కావున వ్యథయును లేదు. ఈ ఆత్మను ఎవరును హింసింప లేరు. ఈ విధముగా యాజ్ఞవల్క్యముని చెప్పి, ఓ శాకల్యుడా! ఈ ఎనిమిది ఆశ్రయ స్థానములు ఎనిమిది లోకములు. ఎనమండ్రు దేవతలు ఎనమండ్రు పురుషులును గలరు. ఏ జ్ఞాని ఈ ఎనమండ్రు పురుషులను తన

జేయు) యజమానుడైన దాతకు పరాయణుడునై యున్నాడు. వానిని దెలిసికొనుము.

---

## చతుర్థ అధ్యాయము

### 1-వ బ్రాహ్మణము

అవ : జనక యాజ్ఞవల్క్య సంవాదము. ఏయే ఆచార్యులు ఏమి చెప్పినది జనకుడు యాజ్ఞవల్క్యునితో విన్నవించుకొనుట.

జనకో హ వైదేహ ఆసాంచక్రేఽథ హ యాజ్ఞవల్క్య ఆవవ్రాజ. తగ్ంహోవాచ యాజ్ఞవల్క్య కిమర్థమచారీః పశూనిచ్ఛన్నణ్వంతానితి. ఉభయమేవ సమ్రాడితి హోవాచ. 1

ఒకసారి విదేహ దేశపు రాజగు జనకుడు సింహాసనారూఢుడై యుండునపుడు అతని కడకు యాజ్ఞవల్క్యముని వచ్చెను. అప్పుడు జనకుడు ఓ మునీంద్రా! తమ ఆగమనముయొక్క ఉద్దేశ్య మేమి? ఆవులు గావలయునా? లేక సూక్ష్మ ప్రశ్నలను నన్నడుగు అపేక్షచే వచ్చితిరా యని అడిగెను. ఓ జనక సార్వభౌమా! ఆ రెండిటిని అపేక్షించి వచ్చితి ననెను. తాత్పర్య మేమనిన జనకునకు ఆధ్యాత్మిక విద్యా విషయక మైన యథార్థ మతిని ప్రసాదించుటకొఱకై ఏతెంచి తని భావము.

యత్తే కశ్చి దబ్రవీ త్తచ్ఛృణవామేత్యబ్రవీన్మే జిత్వాశైలినిర్వాగ్వై బ్రహ్మేతి యథా మాతృమాన్పితృమానాచార్యవాన్బ్రూయాత్తథా తచ్ఛైలినిరబ్రవీద్వాగ్వై బ్రహ్మేత్యవదతో హి కిగ్ంస్యాదిత్యబ్రవీత్తు తే తస్యాయతనం ప్రతిష్ఠాం న మే బ్రవీదిత్యేకపాద్వా ఏతత్సమ్రాడితి స వై నో బ్రూహి యాజ్ఞవల్క్య. వాగేవాయతనమాకాశః ప్రతిష్ఠా ప్రజ్ఞేత్యేనదుపాసీత. కా ప్రజ్ఞతా యాజ్ఞవల్క్య? వాగేవ సమ్రాడితి హోవాచ. వాచా వై సమ్రాడ్బంధుః ప్రజ్ఞాయతే

ఋగ్వేదో యజుర్వేద స్సామవేదో ఽథర్వాంగిరస ఇతిహాసః పురాణం విద్యా ఉపనిషదః శ్లోకాః సూత్రాణ్యానువ్యాఖ్యానాని వ్యాఖ్యానానీష్టగ్ం హుతమాశితం పాయితమయం చ లోకః పరశ్చ లోకః సర్వాణి చ భూతాని వాచైవ సమ్రాట్ ప్రజ్ఞాయంతే వాగ్వై సమ్రాట్పరమం బ్రహ్మ. నైనం వాగ్జహాతి సర్వాణ్యేనం భూతాన్యభిక్షరంతి దేవో భూత్వా దేవానప్యేతి య ఏవం విద్వానేతదుపాస్తే. హస్త్యృషభగ్ం సహస్రం దదామీతి హోవాచ జనకో వైదేహః. స హోవాచ యాజ్ఞవల్క్యః పితా మేఽమన్యత నాననుశిష్యహరేతేతి. 2

ఓ జనకరాజా! నీకు ఎవరెవరు ఏ యే రహస్యార్థములను దెలిపిరో ఆ యా విషయములను నాకు దెలుపుమని అడిగెను. అప్పుడు రాజు, మునిపుంగవా! వాక్కు బ్రహ్మమని జిత్వన్ శైలిని యను నతడు నాకు దెలిపెను. మంచి తల్లిదండ్రులును ఉత్తముడగు ఆచార్యుడును గలవాని కెటులనో అటువలె శైలిని యను నతడు వాక్కే బ్రహ్మమని నాకు దెలిపెను. ఎందుకనగా ఎవనికి వాక్కే అసలు లేదో వానినుండి ప్రయోజన మేమి? అయితే బ్రహ్మయొక్క ఆశ్రయమును ప్రతిష్ఠను నీకతడు తెలిపి యున్నాడా! యని ముని అడిగెను. నాకు అతడు జెప్పలేదని రాజు జెప్పెను. ఓ రాజా! అట్లైన ఇది పూర్ణము గాదు బ్రహ్మముయొక్క ఒక పాదము మాత్రమే. ఓ యాజ్ఞవల్క్యా! నాకు ఆ పూర్ణమగు తత్వజ్ఞానమును దెలుపుమని రాజడిగెను. వాక్కు యొక్క ఆశ్రయము ఆకాశము. ప్రతిష్ఠయే ప్రజ్ఞ యని దానిని ఉపాసింప వలయును. ప్రజ్ఞ యనున దేది యని అడుగ? వాక్కే ప్రజ్ఞ. వాక్కు చేతనే మన బంధువులను మనము తెలిసికొనగలము. ఋగ్యజుస్సామాథర్వణ వేదములను ఇతిహాస పురాణాది విద్యలను ఉపనిషత్తులు శ్లోకము సూత్రము వ్యాఖ్యానము అనువ్యాఖ్యానము ఇష్టఫలము ఆహుతి అన్నదానము జలదానము ఇహలోక పరలోకాది రూపములగు ఈసమస్తభూతములు వాక్కు వలననే తెలియును. రాజా! వాక్కే పరబ్రహ్మము. ఎవడీ

విధముగా దెలిసి బ్రహ్మము నుపాసించునో అతనిని వాక్కు వరించును. అతనిని వీడిపోదు. అన్ని భూతములు అతనినే అనుసరించును. అతడు దేవుడై దేవతల కడకు వెళ్ళునని చెప్పెను. ఈ విషయమును విని జనకుడు ప్రేమచే మహానీయా! నేను నీకు ఏనుగువంటి పెద్దవగు కోడెలతో గూడిన వెయ్యి ఆవులను మీ కిచ్చెద ననెను. అప్పుడు యాజ్ఞవల్క్యుడు రాజా! నీవు జ్ఞానానుభవము నొందక పూర్వమే నీచే నేను దానమును స్వీకరింప గూడదు. ఇట్లు నాతండ్రియొక్క ఆదేశమును గలదు. తాత్పర్య మేమనగా శిష్యుని కృతార్థుని చేయకనే వానినుండి ఏమియును గ్రహింపరాదని భావము.

యదేవ తే కశ్చిదబ్రవీ త్తచ్ఛృణవా మేత్యబ్రవీన్మ ఉదంకః శౌల్బాయనః ప్రాణోవై బ్రహ్మేతి యథా మాతృమాన్ పితృమానాచార్యవాన్ బ్రూయా త్తథా తచ్ఛౌల్బాయనో ఽబ్రవీత్ప్రాణోవై బ్రహ్మేత్యప్రాణతో హి కిగ్ం స్యాదిత్యబ్రవీత్తు తే తస్యాయతనం ప్రతిష్ఠాం న మేఽబ్రవీదిత్యేకపాద్వా ఏతత్సమ్రాడితి స వై నో బ్రూహి యాజ్ఞవల్క్య ప్రాణ ఏవాయతనమాకాశః ప్రతిష్ఠా ప్రియమిత్యేనదుపాసీత. కా ప్రియతా యాజ్ఞవల్క్య ప్రాణ ఏవ సమ్రాడితి హోవాచ ప్రాణస్య వై సమ్రాట్కామాయాయాజ్యం యాజయత్యప్రతిగృహ్యస్య ప్రతిగృహ్ణాత్యపి తత్ర వధాశంకం భవతి యాం దిశమేతి ప్రాణస్యైవ సమ్రాట్కామాయ ప్రాణో వై సమ్రాట్పరమం బ్రహ్మ నైనం ప్రాణో జహాతి సర్వాణ్యేనం భూతాన్యభిక్షరంతి దేవో భూత్వా దేవానప్యేతి య ఏవం విద్వానేతదుపాస్తే హస్త్యృషభగ్ం సహస్రం దదామీతి హోవాచ జనకో వై దేహః స హోవాచ యాజ్ఞవల్క్యః పితా మేఽమన్యత నాననుశిష్య హరేతేతి. 3

నీకింకను ఇతరులు బోధించిన దెల్ల మరల జెప్పుమని యాజ్ఞవల్క్యు డడిగెను. మునిపుంగవా! ప్రాణము బ్రహ్మమని ఉదంక శౌల్బాయణుడు జెప్పెను. మంచి తల్లి దండ్రులు, ఆచార్యులు, ఎవనికి

గలరో అతనికివలె, ప్రాణము బ్రహ్మమని నాకతడాదరమున జెప్పెను. ప్రాణము లేనివాడు ఏమి జేయగలడు? అయితే బ్రహ్మముయొక్క ఆశ్రయమును, ప్రతిష్ఠను నీకు అతడు చెప్పియున్నాడా? యని యాజ్ఞవల్క్యు డడిగెను. రాజు - నాకతడు చెప్ప లేదనెను. అంతనా యాజ్ఞవల్క్యుడు ఓ రాజా! ఇప్పుడు నీవు జెప్పినది బ్రహ్మముయొక్క ఒక పాదము మాత్రమే! ఓ యాజ్ఞవల్క్య మహర్షీ! నాకు సంపూర్ణమగు తత్త్వమును బోధింపుము. ప్రాణమే ఆయతనము. ఆకాశము ప్రతిష్ఠ. ప్రియమని ఈ బ్రహ్మమును ఉపాసింపవలెను. మునివర్యా! ప్రియ మనగా నేమి? ప్రాణమే. ప్రాణము నందలి తీపి వలననే ఎవరిని గుఱించి యజ్ఞము చేయ రాదో అట్టివానిని గుఱించి కూడా యజన మొన ర్చును. పూజించును. ప్రాణ రక్షణార్థమై ఏ పనినైనను జేయుచు న్నాడు. ఎవరిచే దానమును స్వీకరింపరాదో వారిచే దానమును స్వీక రించును. ఏవైపు పోయిన నా వధ యగునో యని భయముచే నుండును. కాబట్టి రాజా! ప్రాణము పరబ్రహ్మము. ఇట్లు దెలిసి ఉపా సించువానిని ప్రాణములు విడిచి వెళ్ళవు. సర్వ భూతములు అతని కడకు పోవును. అతడు దేవతయై దేవతల కడకు పోవును. ఈ ప్రకార ముగా యాజ్ఞవల్క్యముని బోధించెను. జనకుడు గొప్పవగు వెయ్యి గోవులను మరల ఇవ్వ బోయెను. నీకు బ్రహ్మ సాక్షాత్కారము గానిదే దానమును నేను స్వీకరించరాదని ముని పలికెను.

యదేవ తే కశ్చిదబ్రవీత్తచ్ఛృణవామేత్య బ్రవీన్మేబర్కుర్వార్ష్ణశ్చక్షుర్వై బ్రహ్మేతి యథా మాతృమాన్పితృమానాచార్యవాన్బ్రూయాత్తథా తద్వార్ష్ణో బ్రవీచ్చక్షుర్వై బ్రహ్మేత్యపశ్యతో హి కిగ్ం స్యాదిత్యబ్రవీత్తు తే తస్యాయతనం ప్రతిష్ఠాం న మే உబ్రవీదిత్యేకపాద్వా ఏతత్సమ్రాడితి స వై నో బ్రూహి యాజ్ఞవల్క్య చక్షురేవాయతన మాకాశః ప్రతిష్ఠా సత్యమిత్యేత దుపాసీత కా సత్యతా యాజ్ఞవల్క్య చక్షురేవ సమ్రాడితి హోవాచ చక్షుషా వై

సమ్రాట్ పశ్యంత మాహు రద్రాక్షీరితి స ఆహాద్రాక్షమితి తత్సత్యం. భవతి చక్షుర్వై సమ్రాట్ పరమం బ్రహ్మ నైనం చక్షుర్జహాతి సర్వా. ణ్యేనం భూతాన్యభిక్షరంతి దేవో భూత్వా దేవానప్యేతి య ఏవం. విద్వానేత దుపాస్తే హస్త్యృషభగ్ం సహస్రం దదామీతి హోవాచ. జనకో వైదేహః స హోవాచ యాజ్ఞవల్క్యః పితా మేఽమన్యత. నాననుశిష్య హరేతేతి. 4

ఇంకను ఎవరెవరు ఏమి చెప్పినది మిగిలి యుండిన తెలుపుమని యాజ్ఞవల్క్య డడిగెను. నేత్రమే బ్రహ్మమని వర్కువార్ష్ణ డను నతడు దెలిపెను. ఉత్తములగు తల్లి తండ్రి, గురువువలె నాకు వార్ష్ణుడు నేత్రము బ్రహ్మమని బోధించెను. కన్ను లేని వాడు ఏమి చేయ గలడు? అట్లైన అతడు బ్రహ్మముయొక్క ఆయతనమును ప్రతిష్ఠను నీకు తెలిపి యున్నాడా? యని యడుగ నా కతడు తెలుప లేదని జనకుడు చెప్పెను. ఓ రాజా! ఇది బ్రహ్మముయొక్క ఒక పాదము మాత్రమే మునిశ్రేష్ఠా! అటులైన నాకు మరల ఆ పూర్ణ తత్త్వమును చెప్పుమని అడిగెను. కన్నే ఆయతనము. ఆకాశమే ప్రతిష్ఠ. సత్యమని దీనిని ఉపాసింప వలెను. సత్య మనగా నేమి? రాజా నేత్రమే సత్యము. నీవు చూచి యున్నావా? అని కన్నులు గల వానిని నడిగిన ఔను. నేను చూచి యున్నానని చెప్పును. అదే సత్యము. రాజా! ఆ చక్షువే పరబ్రహ్మము. ఇట్లు దెలిసి ఎవరు ఉపాసింతురో అతనిని కన్ను విడచి పోవుట లేదు. సర్వ భూతములు అతని కడకు పోవును. అతడు దేవతయై దేవతల కడకు పోవును. అంత జనకుడు ఈ మాటలను విని ఒక మంచి వెయ్యి గోవుల నిచ్చెద నని జనకు డనెను. అయ్యా! పూర్ణ మగు విద్యను బోధింపకనే దానమును స్వీకరింప రాదని ముని మరల పలికెను.

యదేవ తే కశ్చి దబ్రవీ త్తచ్ఛృణవామేత్యబ్రవీన్మే గర్దభీవిపీతో భారద్వాజః శ్రోత్రం వై బ్రహ్మేతి యథా మాతృమాన్పితృమానా.

చార్యవాఙ్మృబ్రూయాత్తథా తద్భారద్వాజో ఽబ్రవీచ్ఛ్రోత్రం వై బ్రహ్మేత్యశృణ్వతో హి కిగ్ంస్యాదిత్యబ్రవీత్తు తే తస్యాయతనం ప్రతిష్ఠాం న మేఽబ్రవీదిత్యేకపాద్వా ఏతత్సమ్రాడితి స వై నో బ్రూహి యాజ్ఞవల్క్య శ్రోత్రమేవాయతనమాకాశః ప్రతిష్ఠాఽనంత ఇత్యేనదుపాసీత కాఽనంతతా యాజ్ఞవల్క్య దిశ ఏవ సమ్రాడితి హోవాచ తస్మాద్వై సమ్రాడపి యాం కాం చ దిశం గచ్ఛతి నైవాస్యా అంతం గచ్ఛత్యనంతా హి దిశో వై సమ్రాట్ శ్రోత్రగ్ం శ్రోత్రం వై సమ్రాట్ పరమం బ్రహ్మ నైనగ్ం శ్రోత్రం జహాతి సర్వాణ్యేనం భూతాన్యభిక్షరంతి దేవో భూత్వా దేవానప్యేతి య ఏవం విద్వానేతదుపాస్తే హస్త్యృషభగ్ం సహస్రం దదామీతి హోవాచ జనకో వై దేహః స హోవాచ యాజ్ఞవల్క్యః పితా మేఽమన్యత నాననుశిష్య హరేతేతి. 5

ఇంక నెవరైనను ఏమైనను చెప్పియుండిన దానిని తెలుపుమని ముని అడిగెను. శ్రోత్రమే బ్రహ్మమని నాకు గర్దభీ విపీత భరద్వాజుడు చెప్పెను. మంచి తల్లి, తండ్రి, గురుడు గల వానివలె గర్దభీ విపతి భరద్వాజుడు శ్రోత్రమే బ్రహ్మమని నాకు చెప్పెను. ఎందు కనగా ఎవనికి వినబడదో అతనితో ప్రయోజన మేమి? అయితే బ్రహ్మము యొక్క ఆశ్రయమును ప్రతిష్ఠను అతడు నీకు దెలిపి యున్నాడా? అతడు నాకు చెప్పలే దనెను. అట్లైన ఓ రాజా! ఇది బ్రహ్మముయొక్క ఒక పాదము మాత్రమే! అయిన నాకు పూర్ణ తత్త్వమును దెలుపు మని జనకుడు మరల అడిగెను. శ్రోత్రమే ఆయతనము. ఆకాశమే ప్రతిష్ఠ, అనంతమని దీనిని ఉపాసింప వలెను. ఆ యనంతత్వ మేది? దిక్కే అనంతత్వము. అందువలన ఏ దిక్కునకు పోయినను దానికి అంతము లేదు. దిక్కులు అంతము లేనివి. రాజా! దిక్కే శ్రోత్రము. శ్రోత్రమే పరబ్రహ్మము. ఇట్లని ఉపాసించువానిని శ్రోత్రము వీడి పోదు. అతని కడకు సర్వ భూతములును వెడలును. అతడు

దేవతయై దేవతల కడకు పోవును. ఇట్లు విని జనకుడు మరల బలిష్ఠ మగు వేయి ఆవులను నీ కిచ్చెద ననెను. పూర్ణ విద్యను నీవు ఇవ్వనిదే నేను దానమును స్వీకరింప రాదని యాజ్ఞవల్క్యుడు చెప్పెను.

యదేవ తే కశ్చిదబ్రవీత్తచ్ఛృణవామేత్యబ్రవీన్మే సత్యకామో జాబాలో మనో వై బ్రహ్మేతి యథా మాతృమాన్పితృమానాచార్యవాన్బ్రూయాత్తథా తజ్జాబాలో ఽబ్రవీన్మనో వై బ్రహ్మేత్యమనసో హి కిగ్ంస్యాదిత్యబ్రవీత్తు తే తస్యాయతనం ప్రతిష్ఠాం న మేఽబ్రవీదిత్యేక పాద్వా ఏతత్సమ్రాడితి స వై నో బ్రూహి యాజ్ఞవల్క్య మన ఏవాయతన మాకాశః ప్రతిష్ఠాఽఽనందఇత్యేన దుపాసీత కాఆనందతా యాజ్ఞవల్క్య మన ఏవ సమ్రాడితి హోవాచ మనసా వై సమ్రాట్ స్త్రియ మభిహార్యతే తస్యాం ప్రతిరూపః పుత్రో జాయతే స ఆనందో మనో వై సమ్రాట్ పరమం బ్రహ్మ నైనం మనో జహాతి సర్వాణ్యేనం భూతాన్యభిక్షరంతి దేవో భూత్వా దేవానప్యేతి య ఏవం విద్వానేతదుపాస్తే హస్త్యృషభగ్ం సహస్రం దదామీతి హోవాచ జనకో వై దేహః స హోవాచ యాజ్ఞవల్క్యః పితా మేఽమన్యత నాననుశిష్య హరేతేతి. 6

మరల నీకు ఇంకెవరు ఏమైనను దెలిపి యుండిన దానిని తెలుపుమని ముని అడిగెను. మంచి తల్లి, తండ్రి, గురువు గల వానివలె సత్యకామ జాబాలుడు మనస్సు బ్రహ్మమని నాకు దెలిపి యున్నాడు. ఎందుకనగా మనస్సు లేని వాడు ఏమి చేయగలడు? బ్రహ్మముయొక్క ఆయతనమును, ప్రతిష్ఠను అతడు నీకు దెలిపి యున్నాడా? నాకు దెలుప లేదని రాజనెను. అట్లైన ఓ రాజా! అది బ్రహ్మముయొక్క ఒక్క పాదము మాత్రమే! ఆ పూర్ణ తత్త్వమును నాకు తెలుపుమని రాజడిగెను. మనస్సే ఆనందము. మనస్సుచేతనే మనుష్యుడు స్త్రీని ఇచ్ఛయించును. ఆమెకు తనవంటి పుత్రుడు కలుగును. ఆ పుత్రుడు ఆనందరూపుడై యున్నాడు. కాబట్టి రాజా! మనస్సే బ్రహ్మము. ఇట్లు

దెలిసి ఉపాసించువాని మనస్సు వానిని విడచి పోదు. అతని కడకు అన్ని భూతములు పోవును. అతడు దేవతయై దేవతల కడకు పోవును; అని చెప్పగా విని ఏనుగులాంటి మంచి వేయి గోవులను ఇచ్చెద నని జనకుడు చెప్పెను. అయ్యా! నీకు బ్రహ్మవిద్యను తెలుపకనే నేను దానము స్వీకరించ కూడదు.

యదేవ తే కశ్చిదబ్రవీత్తచ్ఛృణవామేత్యబ్రవీన్మే విదగ్ధః శాకల్యో హృదయం వై బ్రహ్మేతి యథా మాతృమాన్పితృమానాచార్యవాన్బ్రూయాత్తథా తచ్ఛాకల్యోఽబ్రవీద్ధృదయం వై బ్రహ్మేత్యహృదయస్య హి కిగ్ం స్యాదిత్యబ్రవీత్తు తే తస్యాయతనం ప్రతిష్ఠాం న మేఽబ్రవీదిత్యేకపాద్వా ఏతత్సమ్రాడితి స వై నో బ్రూహి యాజ్ఞవల్క్య హృదయ మేవాయతన మాకాశః ప్రతిష్ఠా స్థితి రిత్యేన దుపాసీత కా స్థితతా యాజ్ఞవల్క్య హృదయమేవ సమ్రాడితి హోవాచ హృదయం వై సమ్రాట్ సర్వేషాం భూతానామాయతనగ్ం హృదయం వై సమ్రాట్ సర్వేషాం భూతానాం ప్రతిష్ఠా హృదయే హ్యేవ సమ్రాట్ సర్వాణి భూతాని ప్రతిష్ఠితాని భవంతి హృదయం వై సమ్రాట్ పరమం బ్రహ్మ నైనగ్ం హృదయం జహాతి సర్వాణ్యేనం భూతాన్యభిక్షరంతి దేవో భూత్వా దేవానప్యేతి య ఏవం విద్వానేతదుపాస్తే హస్త్యృషభగ్ం సహస్రం దదామీతి హోవాచ జనకో వై దేహః స హోవాచ యాజ్ఞవల్క్యః పితా మేఽమన్యత నాననుశిష్య హరేతేతి. 7

ఇంకెవరయినను నీకు ఈ తత్త్వమును తెలిపి యుండిన తెలిసిన దానిని తెలుపు మని మరల అడిగెను. మంచి తల్లి, తండ్రి, మంచి గురుడు కలవాని వలె విదగ్ధ శాకల్యుడు హృదయమే బ్రహ్మమని నాకు బోధించి యున్నాడు. ఎందుకనగా హృదయము లేని వానిచేత ఏమి కాగలదు? అయితే బ్రహ్మముయొక్క ఆయతనమును ప్రతిష్ఠను సత్యమును అతడు నీకు తెలిపి యున్నాడా? అతడు నాకు తెలుప లేదు.

కావున నా కా పూర్ణత త్త్వమును తెలుపు మని జనకు డడుగగా హృదయమే ఆయతనము. ఆకాశమే ప్రతిష్ఠ, స్థితి యని ఉపాసింప వలెను. స్థితి యనగా నేమి? రాజా! హృదయమే స్థితి. హృదయమే సర్వ భూతముల కాశ్రయ స్థానము. సర్వ భూతముల ప్రతిష్ఠ, ఆధారము. హృదయమునందే అన్ని భూతములు ప్రతిష్ఠితములై యున్నవి. రాజా! హృదయమే పరబ్రహ్మము. దీనిని దెలిసి ఉపాసించు వానికి బ్రహ్మము దూరము గాదు. అన్ని భూతములు ఇతని కడకు పోవును. అతడు దేవతయై దేవతల వద్దకు వెళ్ళును. ఇట్లు తెలుపగా విని ఏనుగు వంటి బలమైన వేయి గోవులను నీ కిచ్చెదనని జనకుడు బలికెను. నీవు పూర్ణ విద్యను గ్రహించనిదే నీ దానము స్వీకరించను. ఇది నా తండ్రి యాజ్ఞ అని చెప్పెను.

—o—

## 2-వ బ్రాహ్మణము

జనకో హ వై దేహః కూర్చాదుపావసర్పన్నువాచ నమస్తే ఽస్తు యాజ్ఞవల్క్యాను మా శాధీతి స హోవాచ యథా వై సమ్రాణ్మహాంతమధ్వానమేష్యన్ రథం వా నావం వా సమాదదీతైవమేవైతాభిరుపనిషద్భిః సమాహితాత్మాఽస్యేవం బృందారక ఆఢ్యస్సన్నధీతవేద ఉక్తోపనిషత్క ఇతో విముచ్యమానః క్వ గమిష్యసీతి నాహం తద్భగవన్వేద యత్ర గమిష్యామీత్యథ వై తేఽహం తద్వక్ష్యామి యత్ర గమిష్యసీతి బ్రవీతు భగవానితి. 1

విదేహ దేశపు రాజగు జనక మహారాజు తన ఆసనమునుండి లేచి యాజ్ఞవల్క్యుని చూచి నమస్కరించి నాకు విద్యను చెప్పవలెనని అనెను. యాజ్ఞవల్క్యముని ఓ రాజా! దూర దేశమునకు పోవలెనని కొన్న వాడు రథమునో లేక నావనో సిద్ధ మొనర్చునట్లు నీవు బ్రహ్మజ్ఞాని గావలెనని ఉపనిషత్తుల అభ్యాసముచే స్థిరచిత్తుడవై యున్నావు. ఇదే విధముగా నీవు యోగ్యుడవును ధనవంతుడును అయి

యుండి వేదములను అభ్యసించి యున్నావు. అర్థాత్ వేదార్థములను దెలిసి యున్నావు. ఉపనిషత్తుల అధ్యయన మొనర్చి యున్నావు. అయితే ఇచ్చటినుండి ప్రయాణము చేసిన పిదప మృతి నొందిన పిదప ఎచ్చటికి పోయెదవు? దీనిని దెలిసి యున్నావా? భగవంతుడా! అది నాకు తెలియదు. నే నెచ్చటికి పోవలెనో తెలియ దనెను. యాజ్ఞవల్క్యుడు నీవు ఎచ్చటికి పోవుదు వనునది నేను చెప్పెద ననిన, జనకుడు చెప్పుమని అడిగెను. ప్రార్థించెను.

ఇంధో హ వై నామైష యోఽయం దక్షిణేఽక్షన్పురుష స్తం వా ఏతమింధగ్ం సంతమింద్ర ఇత్యాచక్షతే పరోక్షేణైవ పరోక్ష ప్రియా ఇవ హి దేవాః ప్రత్యక్షద్విషః. 2

కుడి కంటియందుండు ఈ పురుషుని నామము ఇంధ యని కలదు. ఇతనినే ఇంద్రుడని యందురు. ఇది పరోక్షమైన నామము; దేవతలకు ప్రత్యక్ష మగు నామము ప్రియము గాదు. పరోక్ష మైన దే ప్రియము.

అథై తద్వామేఽక్షణి పురుషరూప మేషాస్య పత్నీ విరాట్ తయో రేష సగ్ంస్తావో య ఏషోంతర్హృదయ ఆకాశోఽథై నయో రేతదన్నం య ఏషోంతర్హృదయే లోహిత పిండోఽథై నయో రే తత్ప్రావరణం య దేతదంతర్హృదయే జాలకమివాథై నయో రేషా సృతిః సంచరణీ యైషా హృదయాదూర్ధ్వా నాడ్యుచ్చరతి యథా కేశః సహస్రధా భిన్న ఏవమస్యైతా హితా నామ నాడ్యోంతర్హృదయే ప్రతిష్ఠితా భవన్త్యేతాభిర్వా ఏతదాస్రవదాస్రవతి తస్మాదేష ప్రవివిక్తా హారతర ఇవైవ భవత్యస్మాచ్ఛారీరాదాత్మనః. 3

ఈ ఎడమ కంటియం దుండు పురుషరూపము అతని పత్ని; ఇది విరాడ్రూపము. హృదయాంతరమునం దుండు ఆకాశము ఆ ఇరువురి సంగమ స్థానము. అంతర హృదయమునం దుండు ఎరుపైన పర్ణమే వారి అన్నము. అంతర హృదయమునందలి నాడుల సరళి

వారిగుపురి పై కప్పు. హృదయము నందలి పై భాగపు నాడి వారి మార్గము. అనగా స్వప్నమునుండి జాగ్రత్తకు, జాగ్రత్తనుండి స్వప్న మునకు పోవు మార్గము. సహస్రశః విభాగ మొనరింప బడిన కేశము వలె సూక్ష్మమైన హిత యను నామము గల నాడులు అంతర హృదయమునందు ప్రతిష్ఠింప బడి యున్నవి. అన్నము ఈ నాడుల ద్వారమున వెడలును. అతడు ఈ శరీరాత్మకంకెను సూక్ష్మతర ఆహారము గలవాడై యున్నాడు. ఆత్మాస్తిత్వ మత్యంత సూక్ష్మమని భావము.

తస్య ప్రాచీ దిక్ ప్రాంచః ప్రాణా దక్షిణా దిగ్దక్షిణే ప్రాణాః ప్రతీచీ దిక్ ప్రత్యంచః ప్రాణా ఉదీచీ దిగుదంచః ప్రాణా ఊర్ధ్వాదిగూర్ధ్వాః ప్రాణా అవాచీ దిగవాంచః ప్రాణాః సర్వా దిశః సర్వే ప్రాణా స ఏష నేతినేత్యాత్మాఽగృహ్యో నహి గృహ్యతేఽశీర్యో నహి శీర్యతేఽసంగో న హి సజ్యతేఽసితో న వ్యథతే న రిష్యత్యభయం వై జనక ప్రాప్తోఽసీతి హోవాచ యాజ్ఞవల్క్యః. స హోవాచ జనకో వై దేహోఽభయం త్వా గచ్ఛతాద్యాజ్ఞవల్క్య యో నో భగవన్నభయం వేదయసే నమస్తేఽస్త్విమే విదేహా అయమహమస్మిఇతి. 4

తూర్పు దిక్కు అతని తూర్పు ప్రాణము. దక్షిణదిక్కు అతని దక్షిణప్రాణములు. పశ్చిమదిక్కు పశ్చిమ ప్రాణములు. ఉత్తర దిక్కు ఉత్తర ప్రాణములు. అన్నిదిక్కులు అన్ని ప్రాణములును అదే అయి యున్నది. ఆ యాత్మ నేతి నేతి ఇది కాదు ఇది కాదని వర్ణింప బడినదై పట్టుటకు రానిదై యున్నది. ఎందు చేత ననగా అది అవినాశి. ఎవరును దానిని నశింప జేయ జాలరు. అది అసంగమై యున్నది. అది ఆసక్తి నొందదు. అది బంధింప బడదు. దాని నెవరును వ్యథ పఱుప జాలరు. జనక రాజా! నీ కభయము ప్రాప్తమై యున్నది. అభయ స్వరూపుడవని ఈ విధముగ యాజ్ఞవల్క్యుడు చెప్పెను. అపుడు జనకుడు యాజ్ఞవల్క్యమునీ! ఏ అభయమును గుఱించి నీవు నాకు చెప్పుదువో ఆ

బ్రహ్మము నాకు ప్రాప్త మగు గాక! నీకు నమస్కారము. ఈ విదేహ దేశము మఱియు నేను నీ అధీనమై యున్నాము.

---

3-వ బ్రాహ్మణము

అవ: పురుషునియొక్క జ్యోతి ఏది? యను ప్రశ్న మూలమున్న ఆత్మతత్త్వ స్వరూపానుకథనము.

జనకగ్ం హ వైదేహం యాజ్ఞవల్క్యో జగామ స మేనేన వదిష్య ఇత్యథ హ యజ్జనకశ్చ వైదేహో యాజ్ఞవల్క్యశ్చాగ్నిహోత్రే సముదాతే తస్మై హ యాజ్ఞవల్క్యో వరం దదౌ స హ కామప్రశ్నమేవ వవ్రే తగ్ం హాస్మై దదౌ తగ్ం హ సమ్రాడేవ పూర్వం పప్రచ్ఛ. 1

యాజ్ఞవల్క్యుడు మఱొకసారి విదేహ దేశపు రాజగు జనకుని కడ కేగెను. నేనిక చెప్ప వలసిన దేమియు లేదను నిశ్చయముచే నచ్చటికి వెళ్ళి యుండెను. కాని ఒకసారి జనకునకు, యాజ్ఞవల్క్యునకు అగ్నిహోత్ర విషయకమైన సంవాదము జరిగి యుండెడిది. ఆ ప్రసంగమునందు యాజ్ఞవల్క్యుడు రాజునకు నీవు కావలసినన్ని ప్రశ్నలడుగ వచ్చునని వర మొకటి యొసగి యుండెను. ఆ కారణముచే జనకమహారాజు మరల ప్రశ్న చేసెను.

యాజ్ఞవల్క్య కిం జ్యోతిరయం పురుష ఇతి. ఆదిత్య జ్యోతిః సమ్రాడితి హోవాచ ఆదిత్యేనైవాయం జ్యోతిషాస్తేపల్యయతే కర్మ కురుతే విపల్యేతీత్యేవమేవైతద్యాజ్ఞవల్క్య. 2

ఓ యాజ్ఞవల్క్య మహర్షీ! ఈ పురుషుడు ఏ జ్యోతిచే కూడి యున్నాడు? రాజా! ఆదిత్యుడే అతని జ్యోతి ఆ యీ వైపుల వెళ్ళుచున్నాడు. కర్మ చేయును. మరల వచ్చును. ఇట్లు చెప్పగా జనకు డంగీకరించెను.

అస్తమిత ఆదిత్యే యాజ్ఞవల్క్య కిం జ్యోతిరేవాయం పురుష ఇతి చంద్రమా ఏవాస్య జ్యోతిర్భవతీతి చంద్రమసైవాయం జ్యోతిషాఽఽస్తే పల్యయతే కర్మ కురుతే విపల్యేతీత్యేవమేవైతద్యాజ్ఞవల్క్య. 3.

మునిసత్తమా! సూర్యుడస్తమించు నపుడీ పురుషుడు ఏ జ్యోతిచే యుక్తుడై యున్నాడు? చంద్రుడే అప్పుడతని జ్యోతి. చంద్రజ్యోతిచే అప్పుడతడు కూడి యున్నాడు చలించుచున్నాడు. కర్మ చేయుచున్నాడు. మఱలి వచ్చుచున్నాడు.

అస్తమిత ఆదిత్యే యాజ్ఞవల్క్య చంద్రమస్యస్తమితే కిం జ్యోతిరేవాయం పురుష ఇత్యగ్నిరేవాస్య జ్యోతిర్భవతీత్యగ్నినైవాయం జ్యోతిషాఽఽస్తే పల్యయతే కర్మ కురుతే విపల్యేతీత్యేవమేవైతద్యాజ్ఞవల్క్య. 4

యాజ్ఞవల్క్య మునీ! సూర్య చంద్రాదులును అస్తమించినపుడు ఈ పురుషునకు జ్యోతి ఏది? అప్పుడు అగ్నియే అతనికి జ్యోతి. తద్ద్వారా చలించుట, కర్మ చేయుట ఇత్యాదులు జరుగును.

అస్తమిత ఆదిత్యే యాజ్ఞవల్క్య చంద్రమస్యస్తమితే శాంతేఽగ్నౌ కిం జ్యోతిరేవాయం పురుష ఇతి వాగేవాస్య జ్యోతిర్భవతీతి వాచైవాయం జ్యోతిషాఽఽస్తే పల్యయతే కర్మ కురుతే విపల్యేతీతి తస్మాద్వై సమ్రాడపి యత్ర స్వః ప్రాణిర్న వినిర్జ్ఞాయతేఽథ యత్ర వాగుచ్చరత్యుపైవ తత్ర న్యేతీత్యేవమేవైతద్యాజ్ఞవల్క్య. 5

యాజ్ఞవల్క్యుడా! సూర్యుడు, చంద్రుడు, అగ్ని ఇవన్నియు అస్తమించినపుడు (లేనప్పుడు) ఈ పురుషునకు జ్యోతి ఏది? వాక్కే అతని జ్యోతియై యున్నది. వాక్సహాయముచే అతడట్టిట్టు తిరుగువాడును, కర్మచేయువాడును, మఱలి వచ్చువాడు నయి యున్నాడు. ఓ రాజా! తన హస్తముగూడ తనకు అగపడక యుండు అంధకారమునందును వాక్కు ఏ దిక్కునుండి వచ్చునో ఆ దిక్కునకు మనుష్యుడు వెడలును.

అ_స్తమిత ఆదిత్యే యాజ్ఞవల్క్య చంద్రమస్య_స్తమితే శాంతే ఽగ్నౌ శాంతాయాం వాచి కిం జ్యోతిరేవాయం పురుష ఇత్యాత్మై వాస్య జ్యోతిర్భవతీత్యాత్మనైవాయం జ్యోతిషాఽఽస్తే పల్యయతే కర్మ కురుతే విపల్యేతీతి. 6

ఓ ఋషిపుంగవా! సూర్య చంద్రు ల_స్తమించి నపుడును, అగ్ని శాంతించినపుడును, వాక్కు ఆగిపోయినపుడును పురుషు డే జ్యోతిచే కూడి యుండును? అప్పుడు ఆత్మే అతని జ్యోతి. ఆత్మజ్యోతి సహాయమునసే అతడు కూర్చుండుట పారాడుట ఇత్యాది కర్మలను చేయును.

కతమ ఆత్మేతి యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు హృద్యంతర్జ్యోతిః పురుషః స సమానస్సన్నుభౌ లోకావనుసంచరతి ధ్యాయతీవ లేలాయతీవ స హి స్వప్నో భూత్వేమం లోక మతిక్రామతి మృత్యో రూపాణి. 7

ఈ ఆత్మ ఎవరు? ఎవడు ప్రాణములయందు విజ్ఞాన మయుడో హృదయమునందు అంతర్జ్యోతియై యున్నాడో ఆ పురుషుడే ఆత్మ. అతడు సముడై యుండి రెండు లోకముల సంచార మొనర్చును. అతడు బుద్ధిచే విచారించినట్లును ప్రాణములచే చలన వలనాదు లొనర్చినట్లును అగపడును. అతడు స్వప్నరూపుడై ఈ లోకమును దాటిపోవును. మృత్యువు నతిక్రమించును.

స వా అయం పురుషో జాయమానః శరీరమభిసంపద్యమానః పాప్మభిః సగ్ంసృజ్యతే స ఉత్క్రామన్మ్రియమాణః పాప్మనో విజహాతి. 8

ఈ పురుషుడు పుట్టునపుడు, శరీర ధారణము చేయునపుడు పాపముచే యుక్తుడగును. అనగా ఉపాధి యుక్తుడగునని భావము. అతడు పైకి పోవునపుడు చచ్చునపుడు పాపములను పరిత్యాగము చేయును.

తస్య వా ఏతస్య పురుషస్య ద్వే ఏవస్థానే భవత ఇదం చ పరలోకస్థానం చ సంధ్యం తృతీయగ్ం స్వప్నస్థానం తస్మిన్సంధ్యే స్థానే తిష్ఠన్నేతే ఉభే స్థానే పశ్యతీదం చ పరలోకస్థానంచ. అథ యథాక్రమోఽయం పరలోకస్థానే భవతి తమాక్రమమాక్రమ్యో భయాన్పాప్మన ఆనందాగ్ంశ్చ పశ్యతి. స యత్ర ప్రస్వపిత్యస్యలోకస్య సర్వావతో మాత్రా మపాదాయ స్వయం విహత్య స్వయం నిర్మాయ స్వేన భాసా స్వేన జ్యోతిషా ప్రస్వపిత్యత్రాయం పురుషః స్వయం జ్యోతిర్భవతి. 9

ఈ లోకము మఱియు పరలోకమని రెండు స్థానములు గలవు. మూడవది స్వప్నస్థాన మనునది. ఈ రెండిటికి సంధియై యున్నది. ఈ సంధియందు నిలిచి ఈ రెండు స్థానముల వైపు చూచును. అతడు తనసాధనముల ననుసరించి పరలోకమున పాపము మఱియు ఆనందము ననుభవించును. నిద్రా సమయమున అతడు ఈ లోకముయొక్క సమస్త వస్తువుల సూక్ష్మాంశములతో గూడి ఈ దేహమును క్రింద అడ్డముగ పడవైచి అనగా స్వప్నమునందు వాసనా రూపముచే స్వయంప్రకాశమానుడై యుండును. ఈ అవస్థయందు పురుషుడు స్వయం జ్యోతి యగునని భావము.

న తత్ర రథా న రథయోగా న పన్థానో భవంత్యథరథాన్ రథయోగాన్పథస్సృజతే న తత్రానందా ముదః ప్రముదో భవంత్యథా నందాన్ముదః ప్రముదః సృజతే న తత్ర వేశాంతాః పుష్కరిణ్యః స్స్రవంత్యో భవంత్యథ వేశాంతాః పుష్కరిణ్యస్స్రవంతీః సృజతే స హి కర్తా. 10

అచ్చట అనగా స్వప్నమునందు రథములు గాని రథమునకు పూన్చు గుఱ్ఱములు గాని మార్గములు గాని లేవు. వాటి నన్నిటిని ఆత్మప్రకాశమున మనస్సే నిర్మించును. అచ్చట ప్రియము, మోదము, ప్రమోద మనున వేవియు లేవు. వాటిని గూడ అతడు సృజించును.

అచ్చట చెరువులు గాని సరోవరములు గాని నదులు గాని ఉండవు. ఆ సర్వమును అతడే నిర్మించును. అతడే కర్త.

తదేతే శ్లోకా భవంతి. స్వప్నేన శారీరమభిప్రహత్యాఽసుప్తః సుప్తానభిచాకశీతి. శుక్రమాదాయ పునరేతి స్థానగ్ం హిరణ్మయః పురుష ఏక హగ్ంసః. 11

ఈ విషయమునందు మంత్రములు గలవు. నిద్రాదశలో శరీరమును నిశ్చేష్ట మొనర్చి తాను నిద్రింపకనే స్వప్నమునందు పదార్థములను ప్రకాశింపజేయును. శుద్ధ స్వరూపమును ధరించి మరల మొదటి స్థానమును జాగ్రత్తను చేరును. హిరణ్మయ పురుషుడును అన్ని స్థలములయందు వెడలు వాడును అతడొకడే అయి యున్నాడు.

ప్రాణేన రక్షన్నవరం కులాయం
బహిష్కులాయాదమృతశ్చరిత్వా,
స ఈయతే అమృతో యత్ర కామగ్ం
హిరణ్మయః పురుష ఏక హగ్ంసః. 12

ఈ నికృష్ట మగు శరీరమును ప్రాణములచే రక్షించుచు అమృతమయ ఆత్మ శరీరమునకు వెలుపల దిరుగాడ తన ఇచ్ఛ యుండిన చోటునకు వెడలును. ఆ హిరణ్మయ పురుషుడు సర్వత్ర వెళ్ళును. అతడు ఒక్కడే.

స్వప్నాంత ఉచ్చావచమీయమానో
రూపాణి దేవః కురుతే బహూని,
ఉతేవ స్త్రీభిః సహ మోదమానో
జక్షదుతేవాపి భయాని పశ్యన్. 13

స్వప్నమునందు ఉచ్చ నీచ భావములను పొందు దేవుడు వాసనా కల్పిత వివిధ రూపములను పుట్టించును. ఒకప్పుడు స్త్రీవిషయముగా గలిగి ఆనందించును. నవ్వును. లేక భయ మొందును.

ఆరామస్య పశ్యంతి న తం పశ్యతి కశ్చనేతి. తం నాయతం బోధయేదిత్యాహుః. దుర్భిషజ్యగ్ం హాస్మై భవతి యమేష న ప్రతిపద్యతే. అథో ఖల్వాహుర్జాగరితదేశ ఏవాస్యైష ఇతి యాని హ్యేవ జాగ్రత్పశ్యతి తాని సుప్త ఇత్యత్రాయం పురుషః స్వయం జ్యోతిర్భవతి సోఽహం భగవతే సహస్రం దదామ్యత ఊర్ధ్వం విమోక్షాయ బ్రూహీతి. 14

అతని సుఖ స్థానములను జనులు జూతురు. కాని అతనిని ఎవరును చూడరు. అందువలననే నిద్రించిన వానిని ఒక్క పెట్టున (తటాలున) లేప రాదని చెప్పుదురు. అతనికి ఈ శరీరమునందు తాను పోయి వచ్చెడి ద్వారము దొరక కుండిన అతని ఆత్మ (శరీరము) మెలకువ నొందుట కష్ట మగును. జాగ్రదవస్థయే ఒక స్థానము. అచ్చటనే స్వప్నమును జూచునని కొందఱు చెప్పుదురు. మెలకువ యుండినపుడు చూచిన దానిని నే స్వప్నమునందు చూచును. అందువలన ఈ రెండవస్థలను ఒకటే యని అందురు. అయితే అది అట్లు గాదు. స్వప్నమునం దతడు స్వయంజ్యోతి యగును. ఈ విషయమును విని జనకుడు ఓ భగవంతుడా! నేను నీకు ఒక వేయి గోవులను ఇచ్చెదను ఇకను నాకు ఆ ముక్తి మార్గమును గుఱించి చెప్పుమని అడిగెను.

స వా ఏష ఏతస్మిన్ సమ్ప్రసాదే రత్వా చరిత్వా దృష్ట్వైవ పుణ్యం చ పాపం చ పునః ప్రతిన్యాయం ప్రతియోన్యాద్రవతి స్వప్నాయైవ స యత్తత్ర కించిత్పశ్యత్యనన్వాగతస్తేన భవత్యసంగోహ్యయం పురుష ఇత్యేవ మేవైతద్యాజ్ఞవల్క్య సోఽహం భగవతే సహస్రం దదామ్యత ఊర్ధ్వం విమోక్షాయైవ బ్రూహీతి. 15

ఈ పురుషుడు సుషుప్తియందు మునిగి రమించుచు విహరించి పుణ్య పాపములను జూచి మఱల పోయిన మార్గమునే మొదటి స్థానమునకు అనగా స్వప్న స్థానమునకు వచ్చును. కొంత తడవు సుషుప్తి యందుండుట యని అర్థము. సుషుప్తిస్థానమునందు దేనిని (లేమిని

చూచి యున్నాడో అతడు దానిచే బద్ధుడు కాడు. ఈ పురుషుడు అసంగుడై యున్నాడని చెప్పెను. ఓ యాజ్ఞవల్క్యమునీ! ఇంకను వేయి గోవులను ఇచ్చెదను. ఆ ముక్తితత్త్వమును (మరల) చెప్పుమనెను.

స వా ఏష ఏతస్మిన్ స్వప్నే రత్వా చరిత్వా దృష్ట్వైవ పుణ్యం చ పాపం చ పునః ప్రతిన్యాయం ప్రతియోన్యాద్రవతి బుద్ధాంతాయైవ స యత్తత్ర కించిత్పశ్యత్యనన్వాగతస్తేన భవత్యసంగో హ్యయం పురుష ఇత్యేవ మేవైతద్యాజ్ఞవల్క్య సోఽహం భగవతే సహస్రం దదామ్యత ఊర్ధ్వం విమోక్షాయైవ బ్రూహీతి. 16

ఈ పురుషుడు స్వప్నమున రమమాణుడై విహరించి పుణ్యపాపములను చూచి మరల పోయిన మార్గమున జాగరిత స్థానమునకు వచ్చును. స్వప్నస్థితియందు అతడు దేనిని చూచి యున్నాడో అతడు దానిచే బద్ధుడు కాడు. ఆ పురుషు డసంగుడై యున్నాడని చెప్పెను. మరల జనకుడు వేయి గోవుల నీ కిచ్చెదను ముక్తితత్త్వమును చెప్పుమని అడిగెను.

స వా ఏష ఏతస్మిన్ బుద్ధాంతే రత్వా చరిత్వా దృష్ట్వైవ పుణ్యం చ పాపం చ పునః ప్రతిన్యాయం ప్రతియోన్యాద్రవతి స్వప్నాంతాయైవ. 17

ఈ పురుషుడు జాగరిత స్థానమునందు రమించుచు విహార మొనర్చి పుణ్య పాపములను చూచి మఱల పోయిన మార్గముననే స్వప్నస్థానమునకు వచ్చును.

తద్యథా మహామత్స్య ఉభేకూలే అనుసంచరతి పూర్వం చాపరం చైవమేవాయం పురుష ఏతావుభావంతావను సంచరతి స్వప్నాంతంచ బుద్ధాంతంచ. 18

ఇందులకు దృష్టాంతము — ఒక పెద్ద చేప (తిమింగలము) నదియొక్క ఆవలి ఈవలి ఒడ్డునకు (గట్టునకు) నీటియందు స్వేచ్ఛగా

సంచరించునట్లు ఈ పురుషుడు స్వప్న జాగరిత స్థానములయందు సంచరించును.

తద్యథాస్మిన్నాకాశే శ్యేనో వా సుపర్ణో వా విపరిపత్య శ్రాంతః స్సగ్ంహత్య పక్షౌ సంలయాయైవ ధ్రియత ఏవ మేవాయం పురుష ఏతస్మా అంతాయ ధావతి యత్ర సుప్తో న కంచన కామం కామయతే న కంచన స్వప్నం పశ్యతి. 19

ఆకాశమునందు సంచరించి అలసి డేగ యను పక్షి గాని, గ్రద్దగాని తన రెక్కలను ముడుచుకొని నేరుగా తన గూటికి వెళ్ళునట్లు ఈ పురుషుడు తన సీమ యగు లేక స్థానమగు సుషుప్తికి వెడలును. అచ్చట నిద్రించును. అచ్చట ఏ కామములను కామించడు. ఏ స్వప్నములను చూడడు.

తా వా అస్యైతా హితా నామ నాడ్యో యథా కేశః సహస్రధా భిన్నస్తావతాఽణిమ్నా తిష్ఠంతి శుక్లస్య నీలస్య పింగళస్య హరితస్య లోహితస్య పూర్ణా అథ యత్రైనం ఘ్నంతీవ జినంతీవ హస్తీవ విచ్ఛాయయతి గర్తమివ పతతి యదేవ జాగ్రద్భయం పశ్యతి తదత్రావిద్యయా మన్యతే అథ యత్ర దేవ ఇవ రాజేవాహమేవేదగ్ం సర్వోఽస్మీతి మన్యతే సోఽస్య పరమో లోకః. 20

వేలాది విభాగములుగా చేయ బడిన వెంట్రుక యంతటి సూక్ష్మ మగు హిత యను పేరు గల నాడులు శుభ్రవర్ణము, నీలవర్ణము, నస్యవర్ణము, మఱియు ఆకుపచ్చ వన్నె గల రసములచే నిండియుండును. ఇక ఇతడు తన్ను గొట్టుచున్నారు. పట్టుకొని వశమొనర్చు కొనుచున్నారు. ఏనుగు తరుముచున్నది. నేను పల్లములయందు పడుచున్నానను నిత్యాదిగా అజ్ఞానమూలమున తన్ను తానట్లు భావించును. మరల మేల్కాంచి ఎప్పుడు తన్ను తాను నేను దేవతను నేను రాజును నేనే ఈ సర్వము నయి యుంటినని తెలియునో అప్పుడది అతని పరమ లోకము జాగ్రత్త.

తద్వా అస్యై తదతిచ్ఛందా అపహతపాప్మాఽభయగ్ం రూపం। తద్యథా ప్రియయా స్త్రియా సంపరిష్వక్తో న బాహ్యం కించన వేద నాంతర మేవమేవాయం పురుషః ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్తో న బాహ్యం కించన వేదనాంతరం తద్వా అస్యై తదాప్తకామ మాత్మ కామ మకామగ్ం రూపగ్ం శోకాంతరమ్. 21

ఇదే అతని కామ్య రహిత మగు పాప రహిత మగు భయ రహిత మగు రూపము. ఆ స్థితి ఎట్లున్న దనిన, తన స్త్రీతోగూడి నపుడు లో, వెలి, యను భేదము లేక మై మఱచి ఒకటియై యుండు నటుల ఈ పురుషుడు ప్రాజ్ఞాత్మతో అభేద మొంది నపుడు అంత ర్బాహ్యములు అనెడి భావన లేక ఏకరూపమై యుండును. ఇది అతని ఆత్మకామము, ఆప్తకామము, అకామము, శోకరహితమునగు స్వరూపము.

అత్ర పితాఽపితా భవతి మాతాఽమాతా లోకా అలోకా దేవా అదేవా వేదా అవేదాః। అత్ర స్తేనోఽస్తేనో భవతి భ్రూణహాఽభ్రూణహా చాండాలోఽచాండాలః పౌల్కసోఽపౌల్కసః శ్రమణోఽశ్రమణస్తాపసోఽతాపసోఽనన్వాగతం పుణ్యేనానన్వాగతం పాపేన తీర్ణో హి తదా సర్వాఞ్ఛోకాన్హృదయస్య భవతి. 22

ఆ స్థితియందు తండ్రి తండ్రి కాడు. తల్లి తల్లి కాదు. లోకములు లోకములు గావు, దేవతలు దేవతలు గారు. వేదములు వేదములు గావు. అచట దొంగ దొంగ కాడు. భ్రూణ (శిశు) హత్య జేసిన వాడు భ్రూణ హంతకుడు కాడు. చండాలుడు చండాలుడు కాడు. పౌల్కసుడు పౌల్కసుడు కాడు. (క్షత్రియా శూద్ర సంపర్కముచే పుట్టినవాడు.) శ్రమణుడు శ్రమణుడు కాడు. తాపసి తాపసి కాడు. అతడు పుణ్య పాపములచే అలిప్తుడై యున్నాడు. హృదయ గతమగు సమస్త శోకముల నతడు దాటి యున్నాడు.

యద్వై తన్న పశ్యతి పశ్యన్వై తన్న పశ్యతి। న హి ద్రష్టు

ద్రష్టుర్దృష్టేర్విపరిలోపో విద్యతేఽవినాశిత్వాత్. న తు తద్ద్వితీయమస్తి తతోఽన్యద్విభక్తం యత్పశ్యేత్. 23

ఆ స్థితియందు అతడు చూచుట లేదనిన, అట్లును గాదు. చూచు సామర్థ్యముండియు అతడేమియు చూచుట లేదు. చూచువాని (ద్రష్టయొక్క) దృష్టికి నష్ట మెప్పుడును కలుగదు. ఎందుకనగా, అతడు అవినాశియై యున్నాడు. అతనికంటె వేఱుగ చూచుటకు వచ్చు దృష్టికి విషయమగు అన్య పదార్థము లేదు.

యద్వై తన్న జిఘ్రతి జిఘ్రన్వై తన్న జిఘ్రతి న హి ఘ్రాతుర్ఘ్రాతేర్విపరిలోపో విద్యతేఽవినాశిత్వాన్న తు తద్ద్వితీయమస్తి తతోఽన్యద్విభక్తం యజ్జిఘ్రేత్. 24

ఆ స్థితియం దతడు వాసన చూచుట లేదు. వాసన చూచుట లేదని ఎవరైనను అనిన అదియు అట్లు గాదు. వాసన జూచు సామర్థ్యముండినను అతడు దేనినిగూడ ఆఘ్రాణింపడు. ఆఘ్రాణించు వాని ఘ్రాణశక్తికి (సామర్థ్యమునకు) లోపము లేదు. ఎందుకనగా, అది అవినాశము. అతనిచే వేఱుగా వాసన జూచుటకు రెండవ పదార్థమే అప్పుడు లేదు.

యద్వై తన్న రసయతే రసయన్వై తన్న రసయతే న హి రసయితూ రసయతేర్విపరిలోపో విద్యతేఽవినాశిత్వాన్న తు తద్ద్వితీయమస్తి తతోఽన్యద్విభక్తం యద్రసయేత్. 25

ఆ స్థితియందు రుచి చూచుట లేదని ఎవరైనను అనిన, అది అట్లు గాదు. రుచి చూచు సామర్థ్య ముండియు అతడు ఏ రుచియును చూచుట లేదు. రుచి చూచు వాని రుచించు సామర్థ్యలోపము కాలేదు. ఎందుకనిన, అది ఆత్మ. అవినాశియై యున్నది. రెండవ వస్తువు లేదు. కాబట్టి వేఱుగా రుచించుటకు రాదు.

యద్వై తన్న వదతి వదన్వై తన్న వదతి న హి వక్తుర్వక్తేర్విపరిలోపో విద్యతేఽవినాశిత్వాన్న తు తద్ద్వితీయమస్తి తతోఽన్యద్విభక్తం యద్వదేత్. 26

ఆ స్థితియం దతడు మాటలాడుట లేదు. మాటలాడ జాలడని ఎవరైన అనిన అది అట్లు కాదు. మాటలాడు శక్తి యుండియు అతడు ఏ ఒకటిని మాటలాడడు. మాటలాడు వాని మాటలాడు సామర్థ్యమునకు లోపము లేదు. ఎందుకనగా, అది అవినాశియై యున్నది. వేఱుగా మాటలాడ దగిన రెండవ పదార్థము లేదు.

యద్వై తన్న శృణోతి శృణ్వాన్వై తన్న శృణోతి న హి శ్రోతుః శ్రుతేర్విపరిలోపో విద్యతేఽవినాశిత్వాన్న తు తద్ద్వితీయమస్తి తతోఽన్యద్విభక్తం యచ్ఛృణుయాత్. 27

ఆ ఆత్మ (స్వరూప) స్థితియం దతడు వినుట లేదని ఎవరైనను అనిన అట్లన గూడదు. విను సామర్థ్య ముండియు దేనినిగూడ వినుట లేదు. వినువాని విను శక్తికి లోపము లేదు. ఎందుకన, అది అవినాశియై యున్నది. వేఱుగా వినుటకు రెండవ పదార్థము లేదు.

యద్వై తన్న మనుతే మన్వానో వై తన్న మనుతే న హి మంతుర్మతేర్విపరిలోపో విద్యతేఽవినాశిత్వాన్న తు తద్ద్వితీయమస్తి తతోఽన్యద్విభక్తం యన్మన్వీత్. 28

ఆ స్థితియం దతడు విచారించుట లేదనిన అట్లు గాదు. విచారించు సామర్థ్య ముండియు అతడు విచారించుట లేదు. విచారించువాని విచార సామర్థ్యమునకు లోపము లేదు. ఎందుకన, అది అవినాశియై యున్నది. వేఱుగా విచారించుటకు రెండవ వస్తువు లేనే లేదు.

యద్వై తన్న స్పృశతి స్పృశన్వై తన్న స్పృశతి న హి స్ప్రష్టుః స్పృష్టేర్విపరిలోపో విద్యతేఽవినాశిత్వాన్న తు తద్ద్వితీయమస్తి తతోఽన్యద్విభక్తం యత్స్పృశేత్. 29

ఆ స్థితియం దతడు స్పృశించుట లేదని ఎవరైనను అనిన, అట్లన రాదు. స్పర్శ చేయు సామర్థ్య ముండియు అతడు దేనినిగూడ స్పృశించుట లేదు. స్పర్శ చేయువాని స్పృశించు సామర్థ్యమునకు

లోపము లేదు. ఎందుకన, అది అవినాశియై యున్నది. వేఱుగా స్పృశించుటకు రెండవ పదార్థము లేదు.

యద్వై తన్న విజానాతి విజానన్వై తన్న విజానాతి న హి విజ్ఞాతుర్విజ్ఞాతేర్విపరిలోపో విద్యతేఽవినాశిత్వాన్న తు తద్ద్వితీయమస్తి తతోఽన్యద్విభక్తం యద్విజానీయాత్. 30

ఆ స్థితియం దతడు తెలియుట లేదు. తెలియుట లేదని ఎవరైనను అనిన అట్లనరాదు. తెలియు సామర్థ్య ముండియు అతడు దేనినిగూడ తెలియుట లేదు. తెలియునట్టి వాని తెలియుసామర్థ్యమునకు (తెలివికి) నాశము లేదు. ఎందుకన, అది అవినాశియై యున్నది. వేఱుగా దెలియుటకు రెండవ పదార్థము లేదు.

యత్ర వా అన్యదివ స్యాత్తత్రాన్యోఽన్యత్పశ్యే దన్యోఽన్యజ్జిఘ్రే దన్యోఽన్యద్రసయే దన్యోఽన్యద్వదే దన్యోఽన్యచ్ఛృణుయా దన్యోఽన్యన్మన్వీతాన్యోఽన్యత్స్పృశే దన్యోఽన్యద్విజానీయాత్. 31

ఏ స్థితియందు ఈ ఆత్మకంటె వేఱగు వస్తు వున్నదో, అపుడు ఒకటి రెండవ దానిని చూడ గలుగును. ఒకటి ఇంకొకటిని వాసన చూడ గలదు. రుచి చూడ గలదు. ఒకటి రెండవ దానిని మాటలాడించ గలదు. ఒకటి రెండవ దానిని విన గలదు. ఒకటి రెండవ దానిని విచారింప గలదు. ఒకటి రెండవ దానిని స్పృశింప గలదు. ఒకటి మఱియొకటిని తెలియ గలదు.

సలిల ఏకో ద్రష్టాఽద్వైతో భవత్యేష బ్రహ్మలోకః సమ్రాడితి హైనమనుశశాస యాజ్ఞవల్క్య ఏషాఽస్య పరమా గతి రేషాఽస్య పరమాసంపదేషోఽస్య పరమో లోక ఏషోఽస్య పరమ ఆనంద ఏతస్యైవానందస్యాన్యాని భూతాని మాత్రాముపజీవంతి. 32

శుద్ధ జలమునందు చూచువాడు తన నీడతో తానొక్కడే యగునట్లు పురుషుడు సుషుప్తియందు తనకు తానై ఒకటగును. ఇదే బ్రహ్మలోకమని యాజ్ఞవల్క్యముని జనకున కుపదేశించెను. ఇది ఆత్మ

యొక్క- అనగా పురుషునియొక్క- పరమగతియై యున్నది. ఇదే సర్వముకంటె అధికమగు అతని సంపత్తు. ఇదే సర్వముకంటె శ్రేష్ఠమగు అతని లోకము. ఇదే అతని శ్రేష్ఠమగు ఆనందము. ఈ ఆనందముయొక్క, అంశమాత్రమున-లేశమాత్రమున- అన్య జీవులెల్ల ఉపజీవించుచున్నవి.

స యో మనుష్యాణాగ్ం రాద్ధః సమృద్ధో భవత్యన్యేషా మధిపతిస్సర్వైర్మానుషైర్భోగై స్సమ్పన్నతమః స మనుష్యాణాం పరమ ఆనందోఽథ యే శతం మనుష్యాణా మానందాః స ఏకః పితృణాం జితలోకానా మానందోఽథ యే శతం పితృణాం జితలోకానా మానందాః స ఏకో గంధర్వలోక ఆనందోఽథ యే శతం గంధర్వలోక ఆనందాః స ఏకః కర్మదేవానా మానందో యే కర్మణా దేవత్వమభిసంపద్యంతే. అథ యే శతం కర్మదేవానా మానందాః స ఏక ఆజానదేవానా మానందో యశ్చ శ్రోత్రియోఽవృజినోఽకామహతోఽథ యే శతమాజానదేవానా మానందాః స ఏకః ప్రజాపతి లోక ఆనందో యశ్చ శ్రోత్రియోఽవృజినోఽకామహతోఽథ యే శతం ప్రజాపతిలోక ఆనందాః స ఏకో బ్రహ్మలోక ఆనందో యశ్చ శ్రోత్రియోఽవృజినోఽకామహతోఽథైష ఏవ పరమఆనందః ఏష బ్రహ్మలోకస్సమ్రాడితి హోవాచ యాజ్ఞవల్క్యః సోఽహం భగవతే సహస్రం దదామ్యత ఊర్ధ్వం విమోక్షాయైవ బ్రూహీత్యత్ర హ యాజ్ఞవల్క్యోఽబి భయాంచకార మేధావీ రాజా సర్వేభ్యో మాఽంతేభ్య ఉదరౌత్సీదితి. 33

మనుష్యులయందు పూర్ణావయవ సౌష్ఠవియును ధనవంతుడును జనులకు ప్రభువునై ఇట్లు మానవీయములగు సమస్త భోగములచే పూర్ణుడై యుండును. వాని ఆనందమును మానవులయందు అన్నిటికంటెను ఎక్కువ యగు ఆనందము. ఇదే మానుషానందమని చెప్పబడును. ఇట్టి ఆనందముయొక్క నూఱంత లధికమగు ఆనందము కర్మచే

పితృలోకమును గెలిచిన పితృలోకానందమునకు సమము. ఇట్టి పితృలోకానందమునకంటెను గంధర్వలోకానందము నూఱింత లధికము. గంధర్వ లోకానందమున కంటెను కర్మదేవతల ఆనందము నూఱింత లధికము. ఇట్టి కర్మదేవతల ఆనందమున కంటెను నూఱింత లధికము దేవతానందము. కోరికలు లేనివాడును పాప రహితుడు నగు వేదజ్ఞుడు ఈ ఆనందము ననుభవించును. దేవతల ఆనందమున కంటెను నూఱింత లధికము ప్రజాపతిలోకానందము. నిష్కాముడు పాపరహితుడునైన వేదజ్ఞుడు ఈ ఆనందము ననుభవించును. ప్రజాపతి లోకానందమున కంటెను నూఱింత లధికము బ్రహ్మలోకానందము. నిష్కాముడును పాపరహితుడు నైన వేదజ్ఞుడు ఈ ఆనందము ననుభవించును. * ఆనందములలో ఇదే పరమానందము. ఇదే బ్రహ్మలోకమని యాజ్ఞవల్క్యుడు జనకునకు బోధించెను. అంత ఓ మునీశ్వరా! ఒక వెయ్యి గోవుల నిచ్చెదను. నాకు మరల ముక్తిమార్గమును బోధింపు మని జనకు డడిగెను. ఈ మాటను విని యాజ్ఞవల్క్యుడు ఇదేమి? యని భయ మొందెను. బుద్ధిమంతుడగు రాజు తన జ్ఞానము యొక్క అంత్యమును చూచుననుటయే భయకారణము.

స వా ఏష ఏతస్మిన్ స్వప్నాంతేరత్వా చరిత్వా దృష్ట్వైవ పుణ్యం చ పాపం చ పునః ప్రతిన్యాయం ప్రతియోన్యాద్రవతి బుద్ధాంతాయైవ. 34

ఈ పురుషుడు స్వప్నము నొందినవాడై అచ్చట విహరించి కేవలము పుణ్యా పాపముల దర్శన మాత్రముననే తృప్తినొంది పోయిన మార్గముచే మరల జాగరిత స్థానమునకు వచ్చును.

తద్యథాఽనస్సుసమాహితముత్సర్జద్యాయాదేవ మేవాయగ్ం

---

* ఆనందములలో బ్రహ్మానందము సర్వోత్కృష్టమైనది. కాని బ్రహ్మమనెడి స్వరూపానందములో ఈ బ్రహ్మానందము ఒక లేశము మాత్రమే యని వేదాంత సిద్ధాంతము.

శారీర ఆత్మా ప్రాజ్ఞేనాత్మనాన్వారూఢ ఉత్సర్జన్యాతి యత్రైత దూర్ధ్వోచ్ఛ్వాసీ భవతి. 35

పై పెచ్చు సామానులచే పూర్ణముగ నుండిన బండి ఏరీతి చప్పుడు చేయుచు వెడలునో అదేవిధముగా శరీర పతనావస్థయందు ఈ శరీరాత్మ ప్రాజ్ఞాత్మచే అధిష్ఠితుడై చప్పుడు చేయుచు సంసార దుఃఖమునుండి నివృత్తుడై దేహమును విడచి వెడలును.

స యత్రాయ మణిమానం న్యేతి జరయా వోపతపతా వాఽణిమానం నిగచ్ఛతి తద్యథా మ్రం వౌదుంబరం వా పిప్పలం వా బంధ నాత్ప్రముచ్యత ఏవమేవాయం పురుష ఏభ్యోఽంగేభ్యస్సంప్రముచ్య పునః ప్రతిన్యాయం ప్రతియోన్యా ద్రవతి ప్రాణాయైవ. 36

ఎప్పు డితడు కృశించునో ముదిమిచే, లేక రోగములచే పడి పండై పోవునో అప్పుడు మామిడిపండు, లేక మేడిపండు లేక రావి పండు వృక్షమునుండి రాలి పడునట్లు ఈ పురుషుడు అవయవములచే వీడువడి మరల జన్మ మెత్తుటకొఱకై వచ్చిన మార్గమున తిరుగ వెడలును.

తద్యథా రాజాన మాయాంత ముగ్రాః ప్రత్యేనసః సూత గ్రామణ్యోఽన్నైః పానై రావసథైః ప్రతికల్పంతేఽయ మాయా త్యయ మాగచ్ఛతీత్యేవగ్ం హైవం విదగ్ం సర్వాణి భూతాని ప్రతి కల్పంత ఇదం బ్రహ్మ యాతీద మాగచ్ఛతీతి. 37

ఇందులకు దృష్టాంతము. ఎట్లు రాజు వచ్చునని తెలిసిన అతని సైన్యము, అంగరక్షకులు, సేవకులు, గ్రామాధికారులును అన్నపాన గృహాది వసతులను సంసిద్ధ మొనర్చుకొని ఇదో వచ్చెను; అదో వచ్చిరి; ఇదో ఇచ్చట నున్నారని అతని మార్గమును నిరీక్షించు నటుల ఈ సమస్తము నెఱిగిన జ్ఞాని యగు బ్రహ్మవిదుని గుఱించి ఇదో బ్రహ్మము వచ్చెను. ఇచ్చట వచ్చునని సర్వ భూతములును (అతని) మార్గ ప్రత్యవేక్షణము జేయును.

తద్యథా రాజానం ప్రయియాసంత ముగ్రాః ప్రత్యేనసస్సూత గ్రామణ్యోఽభిసమాయంత్యేవమేవేమ మాత్మాన మంతకాలే సర్వే ప్రాణా అభిసమాయంతి యత్రై తదూర్ధ్వోచ్ఛ్వాసీ భవతి. 38

ఎట్లు సైన్య సమేతుడై వెళ్ళుటకు సంసిద్ధుడైన రాజు ననుస రించి అతని సైనికులు, అంగరక్షకులు, సేవకులు, గ్రామాధికారులును ఏకమై అతని చెంతకు వచ్చెదరో ఆ ప్రకారము అంత్యకాలమున ఇతని శ్వాస పైకి పోవ నారంభించిన ఆత్మకడకు ప్రాణము లన్ని యును వచ్చును.

---

## 4–వ బ్రాహ్మణము

అవ : ఈ నాల్గవ బ్రాహ్మణమున పై విషయమునే విపులీక రించుచు సంపూర్ణ కామనాశమే బ్రహ్మాత్వమను మొదలగు విషయ ములు చెప్పబడుచున్నవి.

స యత్రాయమాత్మాఽబల్యం న్యేత్య సమ్మోహమివ న్యేత్య థైన మేతే ప్రాణా అభిసమాయంతి స ఏతా స్తేజోమాత్రాః సమ భ్యాదదానో హృదయమేవాన్వవక్రామతి సయత్రైష చాక్షుషః పురుషః పరాఙ్పర్యావర్తతేఽథారూపజ్ఞో భవతి. 1

ఈ ఆత్మ అనగా శరీరస్థమగు జీవాత్మ దుర్బలుడైనపుడు మరణ కాలమున, మఱియు మూర్ఛ నొందినట్లైనపుడు ఈ ప్రాణము లన్నియు అతని కడకు పోవును. తేజస్సు గల చక్షురాది అవయవ ములనెల్ల ఆకర్షించి అతడు హృదయమునందు ప్రవేశించును. కంటి యందుండు పురుషుడు మఱలి వెడలె ననిన అనగా హృదయమున ప్రవేశించినట్లైన ఆ పిదప (ఆత్మకు) రూపజ్ఞానము ఉండదు.

ఏకీభవతి న పశ్యతీత్యాహు రేకీభవతి న జిఘ్రతీత్యాహు రేకీ భవతి న రసయత ఇత్యాహు రేకీభవతి న వదతీత్యాహు రేకీభవతి

వ శృణోతీత్యాహు రేకీభవతి న మనుత ఇత్యాహు రేకీభవతి న స్పృశతీత్యాహు రేకీభవతి న విజానాతీత్యాహు స్తస్య హైతస్య హృదయస్యాగ్రం ప్రద్యోతతే తేన ప్రద్యోతేనైష ఆత్మా నిష్క్రామతి. చక్షుష్టో వా మూర్ధ్నో వాఽన్యేభ్యో వా శరీరదేశేభ్య స్తముత్క్రామంతం ప్రాణోఽనుత్క్రామతి ప్రాణమనూత్క్రామంతగ్ం సర్వే ప్రాణా అనూత్క్రామంతి స విజ్ఞానో భవతి స విజ్ఞానమేవాన్వవక్రామతి. తం విద్యాకర్మణీ సమన్వారభేతే పూర్వప్రజ్ఞా చ. 2

నేత్రముయొక్క సామర్థ్యము మరణ సమయమునందు ఆత్మతో గూడి ఒకటి యగును. అందువలన అతడు చూచుట లేదందురు. ఆఘ్రాణించు శక్తి ఆత్మతో కలసి ఒక్కటైనపుడు అతడు ఆఘ్రాణించుట లేదందురు. రుచించు సామర్థ్యము ఆత్మతో కూడినపుడు అతడు రుచి చూచుట లేదందురు. వాక్ఛక్తి ఆత్మతో అభేద మొందినపుడు అతడు మాటలాడుట లేదందురు. విను సామర్థ్యము ఆత్మతో అభేద మొందినపుడు అతడు వినుట లేదందురు. మనశ్శక్తి ఆత్మతో అభేద మొందినపుడు అతడు విచారించుట లేదందురు. స్పృశించు శక్తి ఆత్మతో అభేద మొందినపుడు అతడు స్పృశించుట లేదందురు. అందు వలన తెలియుట లేదందురు. అతని హృదయాగ్రము ప్రకాశించును. ఆ ప్రకాశ సహాయమున ఆత్మ శరీరమునుండి వెలుపలకు వెడలును. నేత్ర ద్వారముననో, శిరఃప్రాంతముననో, లేక శరీరావయవములలో నేయొక మార్గముననో వెలుపలకు వెళ్ళు ఆత్మ (సూక్ష్మశరీరము) జీవుని ననుసరించి వాని వెంబడి ప్రాణము బోవును. ఆ ప్రాణము వెడలిన దన్న అన్నిప్రాణములును పోవును. అప్పు డతడు విజ్ఞాన యుక్తుడగును. విజ్ఞానముచే కూడి వెడలును. అతని ననుసరించి విద్య, కర్మ, మఱియు పూర్వజ్ఞానము తదనుభవాది సర్వమును అతని ననుగమించును.

తద్యథా తృణజలాయుకా తృణస్యాంతం గత్వాఽన్య

మాత్రమమాత్ర మ్యాత్మాన ముపసగ్ంహర త్యేవమేవాయ మాత్మే దగ్ం శరీరం నిహత్యాఽవిద్యాం గమయిత్వాఽ న్యమాత్రమ మాత్ర మ్యాత్మాన ముపసగ్ంహరతి. 3

శరీరమును విడిచి అన్య శరీరమునకు ఆత్మ ఏ విధముగ వెళ్ళు ననెడి విషయమున దృష్టాంతము : తృణ జలూక మను ఒక పురుగు ఏ ప్రకారము ఒక గడ్డిపోచ చివరకు వెళ్ళి మఱొక గడ్డిపోచ నాలంబన ముగ గైకొని ఆ పిదప తన దేహమును మొదటి గడ్డిపోచనుండి తీసి కొనునో అదేవిధముగా ఆత్మ శరీరమును క్రింద పడవైచి నిశ్చేష్ట మొనర్చి రెండవ శరీరమును పొంది తన్ను ఈ శరీరమునుండి ఉప సంహరించుకొనును. లేక తీసికొనునని భావము.

తద్యథా పేశస్కారీ పేశసో మాత్రా ముపాదాయాన్య న్నవతరం కళ్యాణతరగ్ం రూపం తనుత ఏవమేవాయ మాత్మేదగ్ం శరీరం నిహత్యాఽవిద్యాం గమయిత్వాఽన్యన్నవతరం కల్యాణతరగ్ం రూపం కురుతే పిత్ర్యం వా గాంధర్వం వా దైవం వా ప్రాజాపత్యం వా బ్రాహ్మం వాఽన్యేషాం వా భూతానామ్. 4

కంసాలివాడు ఏ విధముగా కొద్ది సువర్ణమును దీసికొని నూతన మును మఱియు సుందరము నగు అలంకారమును ఆభరణమును నిర్మించునో అదేవిధముగ ఆత్మ, శరీరమును విడిచి క్రింద పడవైచి దానిని నిశ్చేష్ట మొనర్చి నూతనమును మఱియు అందము నగు అన్య శరీరమును నిర్మించుకొనును. పితరుల, లేక గంధర్వుల, లేక దేవతల, లేక ప్రజాపతి, లేక అన్య భూతముల శరీరములను నిర్మించుకొనునని అర్థము.

స వా అయమాత్మా బ్రహ్మ విజ్ఞానమయో మనోమయః ప్రాణమయశ్చక్షుర్మయః శ్రోత్రమయః పృథివీమయ ఆపోమయో వాయుమయ ఆకాశమయ స్తేజోమయోఽ తేజోమయః కామమయోఽ కామమయః క్రోధమయోఽక్రోధమయో ధర్మమయోఽధర్మమయః

సర్వమయ_స్తద్య దేతదిదంమయో౽దోమయ ఇతి యథా కారీ యథా ౽౽చారీ తథా భవతి సాధుకారీ సాధుర్భవతి పాపకారీ పాపో భవతి పుణ్యః పుణ్యేన కర్మణా భవతి పాపః పాపేన. అథో ఖల్వాహుః కామ మయ ఏవాయం పురుష ఇతి స యథా౽కామో భవతి తత్క్రతుర్భవతి యత్క్రతుర్భవతి తత్కర్మ కురుతే యత్కర్మ కురుతే తదభిసంప ద్యతే. 5

ఈ ఆత్మ బ్రహ్మము. ఇతడు విజ్ఞానమయుడును, మనోమయు డును, ప్రాణమయుడును, నేత్రమయుడును, శ్రోత్రమయుడును, పృథివీ మయుడును, జలమయుడును, వాయుమయుడును, ఆకాశమయుడును, తేజోమయుడును, అతేజోమయుడును, కామమయుడును, అకామ మయుడును, క్రోధమయుడును, అక్రోధమయుడును, ధర్మమయుడును, అధర్మమయుడును వేయేల! సర్వమయుడు. ఇది అది యని చెప్పబడు వ్యక్తావ్యక్తము నయి యున్నాడు. ఎవడు ఏవిధముగా నాచరించు చుండునో తానావిధముగనే యగును. మంచి కార్యములు చేయు వాడు మంచి వాడగును. పాపము నాచరించువాడు పాపి యగును. పుణ్యకర్మచే పుణ్యవంతుడగును. పాపకర్మచే పాపియు నగును. ఈ పురుషుని కామమయుడని యందురు. ఇతని కామము ననుసరించి నిశ్చయ మేర్పడును. నిశ్చయానుసారము కర్మ చేయును. కర్మాను సారము ఫల మేర్పడును.

తదేష శ్లోకో భవతి. తదేవ స_క్తస్సహ కర్మణైతి లింగంమనో యత్ర నిష_క్తమస్య, ప్రాప్యాంతం కర్మణ_స్తస్య యత్కించేహ కరో త్యయమ్, తస్మాల్లోకాత్పునరైత్యస్మై లోకాయ కర్మణే ఇతి ను కామయమానో౽థాకామయమానో యో౽కామో నిష్కామ ఆ_ప్తకామ ఆత్మకామో న తస్య ప్రాణా ఉత్క్రామంతి బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి. 6

ఈ విషయమున ఈ మంత్రము గలదు-

ఆసక్తి గలవాడు కర్మచే ఇష్ట వస్తువును బడయును. ఇత డిచ్చట జేసిన కర్మకు అంతమున ఫలమును పరలోకమున బడసి ఈ లోకమునకు మరల కర్మాచరణమునకై వచ్చును. ఇది విషయేచ్ఛ గలిగిన పురుషుని గతియై యున్నది. ఇక కామరహితుని గతి ఎటులనిన, అకాముడు, నిష్కాముడు, ఆప్తకాముడునై యుండిన ఇతని ప్రాణములు రెండవ లోకమునకు పోవుట లేదు. అతడు బ్రహ్మమే యై బ్రహ్మమున అభేద మొందును. అనగా ఒకటి యగును.

తదేష శ్లోకో భవతి. యదా సర్వే ప్రముచ్యంతే కామా యేఽస్య హృది శ్రితాః, అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే ఇతి, తద్యథాఽహినిర్ల్వయనీ వల్మీకే మృతా ప్రత్యస్తా శయీతైవమేవేదగ్ం శరీరగ్ం శేతే. అథాయ మశరీరోఽమృతః ప్రాణో బ్రహ్మైవ తేజ ఏవ సోఽహం భగవతే సహస్రం దదామీతి హోవాచ జనకో వైదేహః. 7

ఈ విషయమున మంత్రము గలదు: ఇతని హృదయమునం దుండు సమస్త కామములు మటుమాయ మయ్యెనన్న మర్త్యుడు అమృత స్వరూపు డగును. మఱియు ఇచ్చటనే బ్రహ్మపద మనుభ వించును. ఇందుల కుదాహరణము : పాము వేఱై పాముచే విడువ బడిన కుబుసము (పొర) ఏవిధముగా పుట్టపై చచ్చినట్లు పడియుండునో అదే విధముగా ఈ జ్ఞానియొక్క శరీరము పడిపోవును. శరీర రహిత మగు అమృతమయ ప్రాణము బ్రహ్మరూప మయ్యే యున్నది. తేజో రూపమై యున్నది.

ఇట్లు యాజ్ఞవల్క్యుడు బోధింపగా జనకుడు పూజ్యుడవగు ఓ యాజ్ఞవల్క్యమునీ! మరల నీకు వేయి గోవుల నిచ్చుచున్నా నని చెప్పెను.

తదేతే శ్లోకా భవంతి. అణుః పంథా వితతః పురాణో మాగ్ం స్పృష్టోఽనువిత్తో మయైవ, తేన ధీరా అపియంతి బ్రహ్మవిద్య స్స్వర్గం లోకమిత ఊర్ధ్వం విముక్తాః. 8

ఈ విషయమున మంత్రములు గలవు: ఈ సూక్ష్మమైన మోక్షమార్గము విస్తృతమును, పురాతనమునై యున్నది. ఇది నాకు దొరకి యున్నది. దీనిని నేను పూర్ణముగ పొంది యున్నాను. ధీరులగు ఇతర బ్రహ్మజ్ఞానులు ముక్తులై ఈ మార్గమున బ్రహ్మలోకమునకు పోవుదురు.

తస్మింశుక్లముత నీలమాహుః
పింగళగ్ం హరితం లోహితం చ,
ఏష పంథా బ్రహ్మణా హానువిత్తః
తేనైతి బ్రహ్మవిత్పుణ్యకృత్తైజసశ్చ. 9

ఈ మార్గమును కొందరు తెల్లటి దనియు, నీలవర్ణ మనియు, కంది వన్నె గలదనియు, ఆకుపచ్చ యనియు, ఎఱుపనియు వేఱు వేఱు వన్నెలు గలదిగా చెప్పుదురు. ఇది బ్రహ్మమార్గము. పుణ్యవంతుడును తేజోవంతుడు నగు జ్ఞాని ఈ మార్గమున వెడలును.

అంధంతమః ప్రవిశంతియేఽవిద్యాముపాసతే,
తతో భూయ ఇవ తే తమో య ఉ విద్యాయాగ్ం రతాః. 10

అవిద్య నుపాసించువారు అంధకారయుక్తమగు తమో లోకమునకు పోవుదురు. వైదిక కర్మలయందే నిరతులైనవారు దానికంటె నధికమగు అంధతమస్సును బొందుదురు.

అనందానామ తే లోకా అంధేన తమసాఽఽవృతాః,
తాగ్ంస్తే ప్రేత్యాభిగచ్ఛంత్యవిద్వాగ్ంసోఽబుధా జనాః. 11

ఆలోకములు ఆనంద రహితములు. మిక్కిలి చీకటిచే ఆవృతములైనవి. విద్యావిహీనులు, బుద్ధి హీనులు చచ్చిన పిదప అట్టి లోకములకు పోవుదురు.

ఆత్మానం చేద్విజానీయాదయమస్మీతి పూరుషః,
కిమిచ్ఛన్కస్య కామాయ శరీరమనుసంజ్వరేత్. 12

ఎవడైనను ఆత్మను తెలిసికొన్నచో అనగా తానే సచ్చిదానంద స్వరూపమగు ఆత్మయను జ్ఞానమును పొందినచో ఇక తాను ఏ యిచ్ఛచేత లేక దేనికొఱకై ఈ శరీరమునుగూర్చి తాపముల ననుభవించును? (భోగేచ్ఛకు స్థానము లేదు. అతడు కృతకృత్యుడని భావము. ఈ మహామంత్రముయొక్క వ్యాఖ్యను శ్రీమద్విద్యారణ్యస్వాములవారు వేదాంత పంచదశి యను ప్రకరణ గ్రంథమునందు తృప్తిదీపమున 298 శ్లోకములుగా రచించియున్నారు.)

యస్యానువిత్తః ప్రతిబుద్ధ ఆత్మా
ఽస్మిన్సందేహ్యే గహనే ప్రవిష్టః,
స విశ్వకృత్స హి సర్వస్య కర్తా
తస్య లోకస్స ఉ లోక ఏవ. 13

సందేహముచే నిండిన గహనమగు సంసారమునందు ప్రవేశమొనర్చి ఆత్మతత్త్వమును ఎవడు తెలిసి యున్నాడో, సాక్షాత్కారము నొంది యున్నాడో, అతడే విశ్వకర్త, సర్వ కర్త. సమస్త లోకములును అతనివే. అతడే ఈ లోకమంతయును.

ఇహైవ సంతోఽథ విద్మస్తద్వయం
న చేదవేదిన్మహతీ వినష్టిః,
య ఏతద్విదురమృతాస్తే భవం
త్యథేతరే దుఃఖమేవాపి యంతి. 14

ఇచ్చటనే ఇహలోకమునందే యున్న మనము బ్రహ్మతత్త్వమును తెలిసికొన గలము. మనము తెలిసికొన కున్నచో అది మన కత్యంతము నష్టదాయకము, హానిప్రదము. బ్రహ్మతత్త్వము నరసిన వారు అమృతస్వరూపు లగుదురు. ఇతరులు దుఃఖితాత్ము లగుదురు.

యదైతమనుపశ్యత్యాత్మానం దేవమంజసా,
ఈశానం భూతభవ్యస్య న తతో విజుగుప్సతే. 15

ఈ దివ్యమును ప్రకాశస్వరూపము నగు ఆత్మతత్త్వమును భూత భవిష్యత్తుల శాసకుడగు ఈశుని సాక్షాత్కార మొందిన మానవుడు జుగుప్స నొందడు. వేసట జెందడు.

యస్మాదర్వాక్సంవత్సరోఽహోభిః పరివర్తతే,
తద్దేవా జ్యోతిషాం జ్యోతిరాయుర్హోపాసతేఽమృతమ్. 16

సంవత్సరము అహోరాత్రములతో గూడి ఏ బ్రహ్మమున కీవల ఇవి తిరుగుచున్నవో, ఆ యమృతమయమైన జ్యోతులలోని జ్యోతిని దేవతలు ఆయుస్సని ఉపాసింతురు.

యస్మిన్పంచ పంచజనా ఆకాశశ్చ ప్రతిష్ఠితః,
తమేవ మన్య ఆత్మానం విద్వాన్ బ్రహ్మామృతోఽమృతమ్. 17

ఎవనియందు ఐదు తెఱగులగు జనులు అనగా గంధర్వులు, పితృదేవతలు, దేవతలు, అసురులు, రాక్షసులు మఱియు ఆకాశము ప్రతిష్ఠితములై యున్నవో, అతడే అమృతమయుడగు బ్రహ్మమని, ఆత్మయని జ్ఞాని నగు అమృత స్వరూపుడనైన నేను తెలియుదును.

ప్రాణస్య ప్రాణముత చక్షుషశ్చక్షురుత శ్రోత్రస్య శ్రోత్రమ్,
మనసో యే మనో విదుః తే నిచిక్యుర్బ్రహ్మ పురాణమగ్ర్యమ్.

ఇతడు ప్రాణములకు ప్రాణము, కంటికి కన్ను, చెవికి చెవి, మనస్సునకు మనస్సు అని ఎవరు తెలిసి యున్నారో వారే శ్రేష్ఠులు. మఱియు సమస్తమునకు పూర్వము ప్రాచీనము నగు బ్రహ్మమును తెలిసినవారు.

మనసైవానుద్రష్టవ్యం నేహ నానాస్తి కించన,
మృత్యోస్స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి. 19

ఈ బ్రహ్మతత్త్వమును పరిశుద్ధమగు మనస్సుచేతనే తెలియదగును. ఇచ్చట నానాత్వము లేదు. బ్రహ్మ మొక్కటియే గలదు. భేదదర్శి సారెసారెకు మృత్యువశుడగును.

ఏకధైవానుద్రష్టవ్యమేతదప్రమేయం ధ్రువమ్,
విరజః పర ఆకాశాదజ ఆత్మా మహాన్ ధ్రువః. 20

ఇతనిని ఒకే విధముగ జూడ దగును. ఇత డప్రమేయుడు. నిత్యుడు, దోషరహితుడు. ఆకాశమునకంటె నతీతుడగు ఈ ఆత్మ అవినాశి, పరమశ్రేష్ఠుడు.

తమేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః,
నానుధ్యాయాద్బహూన్ శబ్దాన్వాచో విగ్లాపనగ్ంహి తదితి.21

ధీరుడగు బ్రహ్మవిదుడైన బ్రాహ్మణుడు ఆత్మతత్త్వమును దెలిసి తన్నిష్ఠావంతుడు గావలెను. బహుళమగు ఇతర అనాత్మ శబ్దములను (విషయములను) అభ్యసించ రాదు. కారణ మేమన, ఆ వృథా శబ్దములు శ్రమ దాయకములు.

స వా ఏష మహానజ ఆత్మా యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు య ఏషోంతర్హృదయ ఆకాశస్తస్మిఞ్ఛేతే సర్వస్య వశీ సర్వస్యేశానః సర్వస్యాధిపతిః స న సాధునా కర్మణా భూయాన్నో ఏవాసాధునా కనీయాన్. ఏష సర్వేశ్వర ఏష భూతాధిపతిరేష భూతపాల ఏష సేతుర్విధరణ ఏషాం లోకానామసంభేదాయ తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి యజ్ఞేన దానేన తపసాఽనాసకేనైతమేవ విదిత్వా మునిర్భవతి. ఏతమేవ ప్రవ్రాజినో లోకమిచ్ఛంతః ప్రవ్రజంతి. ఏతద్ధస్మ వై తత్పూర్వే విద్వాగ్ంసః ప్రజాం న కామయంతే కిం ప్రజయా కరిష్యామో యేషాం నోఽయమాత్మాఽయం లోక ఇతి తే హ స్మ పుత్రైషణాయాశ్చ విత్తైషణాయాశ్చ లోకైషణాయాశ్చ వ్యుత్థాయాథ భిక్షాచర్యం చరంతి. యా హ్యేవ పుత్రైషణా సా విత్తైషణా యా విత్తైషణా సా లోకైషణోభే హ్యేతే ఏషణే ఏవ భవతః. స ఏష నేతినేత్యాత్మాఽగృహ్యో న హి గృహ్యతేఽశీర్యో న హి శీర్యతేఽసంగో న హి సజ్యతేఽసితో న వ్యథతే న రిష్యత్యేతముహైవైతే న తరత ఇతి. అతః పాపమకరవమిత్యతః కల్యాణమకరవ

మిత్యుభే ఉ హైవైష ఏతే తరతి నైనం కృతాకృతే తపతః. 22

ఎవడు ప్రాణులయందు విజ్ఞానమయుఁడో, అతఁడే స్వయంభువగు ఆత్మ. అతఁడు అంతర్హృదయాకాశమున పరుండి యున్నాఁడు. అతఁడే సర్వులను వశమునం దుంచుకొన్న వాఁడు. సర్వాధిపతి, సర్వశాసకుఁ డగు ఈశ్వరుఁడు. మంచి కర్మలచే పెద్దవాఁడగుట లేదు. చెడ్డకర్మలచే చిన్నవాఁడగుట లేదు. అతఁడు సర్వేశ్వరుఁడు, భూతాధిపతియు భూత పాలకుఁడును. అతఁడే సేతువునై యున్నాఁడు. ఈ లోకములు పడి నాశ మొందరాదని అతఁడాధారమువలె నున్నాఁడు. ఆ బ్రహ్మమును వేద విదులగు బ్రాహ్మణులు వేదవచనములచేతను, యజ్ఞముచేతను, దానముచేతను, తపస్సుచేతను అనాశక వ్రతముచే అనగా ఉపవాస వ్రతముచేతను తెలియ వలయునని చెప్పుదురు. ఈ బ్రహ్మతత్త్వము నెఱిఁగినవాఁడు ముని యని చెప్పబడును. ఈ బ్రహ్మతత్త్వము నపేక్షించియే సన్న్యాసులు సన్న్యాస దీక్ష నొందుదురు. ఈ కారణమువలననే ప్రజల నిచ్ఛయించుట లేదు. మేము ప్రజలను అనగా (సంతానము) నిచ్ఛయించి పొందవలసిన దేమున్నది? ఈ ఆత్మయే మా ఇష్టమగు లోకమై యున్నది. అందువలననే వారు పుత్రైషణ విత్తైషణ లోకైషణలను వీడి భిక్షాటనము చేయుదురు. పుత్రేచ్ఛయే విత్తేచ్ఛ. విత్తేచ్ఛయే లోకేచ్ఛ. ద్వివిధములే ఇచ్ఛలు అని అర్థము. ఆత్మ యన్నదో "నేతి నేతి" ఇది కాదు ఇది కాదని వర్ణింపబడి యున్నాఁడు. అతఁడగ్రాహ్యుఁడు. ఎందుకనగా, కర్మేంద్రియములచే పట్టుబడువాఁడు కాఁడు. అతఁడు అశీర్యుఁడు అనగా నాశ మొందు వాఁడు కాఁడు. అసంగుఁడు. కాబట్టి ఆసక్తుఁడు కాఁడు; బద్ధుఁడు కాఁడు. అవినాశియు బ్రహ్మజ్ఞానియు నైన అతనికి పాప పుణ్యములు రెండును సోకవు. అందువల్లనే అతఁడు నేను పాపమును చేసితిని లేక పుణ్యమును జేసితినని యనఁడు. అతఁడీ రెండింటికి అతీతుఁడు. అతనికి ఇవి తాపము నొసగవు.

తదేతదృచాభ్యుక్తమ్. ఏష నిత్యో మహిమా బ్రాహ్మణస్య

న వర్ధతే కర్మణానో కనీయాన్. తస్యైవ స్యాత్పదవిత్తం విదిత్వా న లిప్యతే కర్మణా పాపకేనేతి. తస్మాదేవం విచ్ఛాంతో దాంత ఉపరత స్తితిక్షుస్సమాహితో భూత్వాఽఽత్మన్యేవాత్మానం పశ్యతి సర్వమాత్మానాం పశ్యతి నైనం పాప్మా తరతి సర్వం పాప్మానం తరతి నైనం పాప్మా తపతి సర్వం పాప్మానం తపతి విపాపో విరజోఽవిజిఘిత్సో బ్రాహ్మణో భవత్యేష బ్రహ్మలోకః సమ్రాడేనం ప్రాపితోఽసీతి హోవాచ యాజ్ఞవల్క్యః సోఽహం భగవతే విదేహాన్ దదామి మాం చాపి సహ దాస్యాయేతి. 23

అది ఈ ఋక్కుచే చెప్పబడినది. బ్రహ్మజ్ఞానియొక్క మహిమ నిత్యమై యున్నది. అది కర్మచే అధికమును, అల్పము నగునది కాదు. అట్టి జ్ఞానావస్థ నెఱిగినవాడు గావలయును. తత్త్వమును దెలిసిన పాపకర్మయొక్క లేపము గాదు. అందుచేత ఈ జ్ఞానము నొందినవాడు శాంతుడును, దాంతుడును, విరక్తుడును, సహనశీలుడును, స్థిరచిత్తుడునై తనయందు తానాత్మసాక్షాత్కారము నొంది పూర్ణుడగును. అతనికి పాపము తాకదు. అతడు సర్వ పాపములను దాటును. అతనికి పాపము తాప మొసగదు. అతనికడ అన్ని పాపములు దహింపబడును. అతడు నిష్పాపుడు. దోష రహితుడు. సంశయ రహితుడు. బ్రహ్మజ్ఞానియు నగును. ఇదే బ్రహ్మలోకము. ఓ జనక మహారాజా! ఇదే బ్రహ్మస్థితి. సమ్రాట్. అది నీకు సంప్రాప్తమై యున్నదని యాజ్ఞవల్క్యుడు చెప్పెను. ఓ భగవంతుడా! నాతోసహా ఈ విదేహదేశమును పూజ్యుడవగు నీ సేవార్థమై అర్పించు చున్నాడనని జనకుడు పలికెను.

స వా ఏష మహానజ ఆత్మాఽన్నాదో వసుదానో విందతే వసు య ఏవం వేద. 24

ఇతడు శ్రేష్ఠుడు, స్వయంభువు, ఆత్మయు, అన్నాదుడు, ధనదాయియు నయి యున్నాడు.

స వా ఏష మహానజ ఆత్మాఽజరోఽమరోఽమృతోఽభయో బ్రహ్మాభయం వై బ్రహ్మాభయగ్ం హి వై బ్రహ్మ భవతి య ఏవం వేద. 25

ఇతడు శ్రేష్ఠుడును, స్వయంభువు, ఆత్మయును, ముదిమి మరణములు లేని అమర అమృత అభయ స్వరూపమగు బ్రహ్మము. ఇట్టి అభయమగు బ్రహ్మము నేనని తెలిసినవాడు బ్రహ్మమే యగును.



## *5-వ బ్రాహ్మణము

అవ : యాజ్ఞవల్క్య మైత్రేయీ సంవాదాత్మకమైన అమృతతత్త్వోపదేశముయొక్క నిరూపణము.

మైత్రేయీతి హోవాచ యాజ్ఞవల్క్య ఉద్యాస్యన్వా అరేఽహమస్మాత్ స్థానాదస్మి హంత తేఽనయా కాత్యాయన్యాఽంతం కరవాణీతి. 1

యాజ్ఞవల్క్య మహర్షి తన భార్యయగు మైత్రేయిని జూచి ఓ మైత్రేయీ! నేను ఉత్తరాశ్రమమును (సన్న్యాసమును) స్వీకరింప నిచ్ఛయించు చున్నాను. అందుచేత ఉన్న ఆస్తి పాస్తులను నీకును రెండవ భార్యయగు కాత్యాయనికిని విభాగ మొనర్చి యిచ్చెదననెను.

సా హోవాచ మైత్రేయీ, యన్ను మ ఇయం భగోః సర్వా పృథివీ విత్తేన పూర్ణా స్యాత్కథం తేనామృతా స్యామితి, నేతి హోవాచ యాజ్ఞవల్క్యో యథైవోపకరణవతాం జీవితం తథైవ తే జీవితగ్ం స్యాదమృతత్వస్య తు నాఽఽశాస్తి విత్తేనేతి. 2

---

* ఈ బ్రాహ్మణము నందలి విషయము 2-వ అధ్యాయము 4-వ బ్రాహ్మణము నందలి విషయము రెండును ఒకటే గావున ఇచ్చట 2-వ అధ్యాయము 4-వ బ్రాహ్మణము నందలి మంత్రములు ఉల్లేఖింప బడనవి.

ఈ సంపద్విశిష్టమగు పృథివి యంతయు నాకు దొరకిన దానిచే నేను అమృతురాలన గుదునా? యని మైత్రేయి యడుగ, యాజ్ఞవల్క్య మహర్షి లేదు. లౌకిక మగు సర్వ సుఖ సాధనములచే యుక్తమై యున్నవారి జీవనము వలె నీ జీవనము నగును. కాని సంపత్తుచే అమృతత్వము దొరకు నను మాట నిరర్థకము. ఆ యాశ వ్యర్థము.

సా హోవాచ మైత్రేయీ యేనాహం నామృతా స్యాం కిమహం తేన కుర్యాం యదేవ భగవాన్వేద తదేవ మే బ్రూహీతి. 3

అటులయిన నేను దేనివలన అమృత స్వరూపిణిని గాజాలనో, అమృతానుభవమును బడయజాలనో అట్టి దానిని దీసికొని నేనేమి చేతును? అది నాకు వలదు. అందుచేత భగవన్! తాము తెలిసిన అమృతపద సాధనమునే నాకు బోధించు డని యడిగెను.

స హోవాచ యాజ్ఞవల్క్యః ప్రియా బతారే నః సతీ ప్రియం భాషస ఏహ్యాస్స్వ వ్యాఖ్యాస్యామి తే వ్యాచక్షాణస్య తు మే నిదిధ్యాసస్వేతి. 4

యాజ్ఞవల్క్యుడు: మైత్రేయీ! నీవు నాకు మొదటనే ప్రియురాలివై యుండి ఇప్పుడును నాకు అత్యంత ప్రియమైన దానినే పలుకుచున్నావు. ఇట్లు రమ్ము. సమీపమున గూర్చుండుము. నేను నీకు నిజానుభవ జ్ఞానమును బోధించెదను. చెప్పబడు ఈ నా మాటలను చక్కగ ఏకాగ్ర చిత్తమున ఆలకించి తెలిసికొనుము.

*స హోవాచ న వా అరే పత్యుః కామాయ పతిః

* భర్తయొక్క సంతోషము కొఱకై భర్తను భార్య ప్రేమించుట లేదు. తన సంతోషము కొఱకే. భార్యయొక్క సంతోషముకొఱకై భార్యను భర్త ప్రేమించుట లేదు. తన సంతోషము కొఱకే. ఎవరెవరు ఏదేది ప్రేమించినను ఆయాపదార్థము కొఱకై ప్రేమించుట లేదు. తన సంతోషముకొఱకైయే ఆయా పదార్థము ప్రేమింపబడుచున్నది తనను ప్రేమించుటయో ఎవరి సంతోషముకొఱకును గాదు. ఈ ప్రేమ నిర్హేతుకము. ఆనందస్థానము. ఆత్మ. మఱేదియు గాదు.

ప్రియో భవత్యాత్మనస్తు కామాయ పతిః ప్రియో భవతి. న వా
అరే జాయాయై కామాయ జాయా ప్రియా భవత్యాత్మనస్తు
కామాయ జాయా ప్రియా భవతి. న వా అరే పుత్రాణాం కామాయ
పుత్రాః ప్రియా భవంత్యాత్మనస్తు కామాయ పుత్రాః ప్రియా భవంతి.
న వా అరే విత్తస్య కామాయ విత్తం ప్రియం భవత్యాత్మనస్తు
కామాయ విత్తం ప్రియం భవతి. న వా అరే బ్రహ్మణః కామాయ
బ్రహ్మ ప్రియం భవత్యాత్మనస్తు కామాయ బ్రహ్మ ప్రియం భవతి.
న వా అరే క్షత్రస్య కామాయ క్షత్రం ప్రియం భవత్యాత్మనస్తు
కామాయ క్షత్రం ప్రియం భవతి. న వా అరే లోకానాం కామాయ
లోకాః ప్రియా భవంత్యాత్మనస్తు కామాయ లోకాః ప్రియా భవంతి.
న వా అరే దేవానాం కామాయ దేవాః ప్రియా భవంత్యాత్మనస్తు
కామాయ దేవాః ప్రియా భవంతి. న వా అరే భూతానాం
కామాయ భూతాని ప్రియాణి భవంత్యాత్మనస్తు కామాయ భూతాని
ప్రియాణి భవంతి. న వా అరే సర్వస్య కామాయ సర్వం ప్రియం
భవత్యాత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవత్యాత్మా వా అరే
ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యో మైత్రేయ్యాత్మనో
వా అరే దర్శనేన శ్రవణేన మత్యా విజ్ఞానేనేదగ్ం సర్వం విదితమ్. ౫

ఓ మైత్రేయీ! సతికి పతి తన ఆత్మయొక్క ప్రేమమూలము
ననే ప్రియు డగును గాని పతియొక్క ప్రీతిచే గాదు. ఆత్మయందలి
ప్రేమయే సర్వ ప్రేమలకు మూలము, బీజము. పతికి సతి తన ఆత్మ
ప్రీతి మూలముననే ప్రియురాలగును గాని ఆమెప్రీతికొఱకై కాదు.
తండ్రికి బిడ్డలు ఆత్మప్రీతిమూలముననే ప్రియు లగుదురు గాని వారి
ప్రీతికై కాదు. యజమానునకు తన సంపద ఆత్మప్రేమ మూలముననే
ప్రియ మగును గాని సంపదయొక్క ప్రీతికి గాదు. మానవుని బ్రాహ్మణ
త్వము ఆత్మప్రీతి కారణముచే ప్రియ మగును గాని బ్రాహ్మణత్వము
యొక్క ప్రీతికి గాదు. అటువలె క్షత్రియత్వము ఆత్మప్రీతి మూలము

నసే ప్రియ మగును గాని క్షత్రియత్వముయొక్క ప్రీతికి గాదు. మనుష్యునకు లోకలోకాంతరములు ఆత్మప్రీతి కొఱకై ప్రియ మగునే గాని వాటి ప్రియమునకు గాదు. దేవతలు ఆత్మప్రీతికై ప్రియు లగుదురే గాని వారి ప్రీతికి గాదు. ఎల్లభూతములు ఆత్మప్రీతికి గాను ప్రియ మగునే గాని వాటి ప్రీతికొఱకై కాదు. అటువలె మానవునకు సర్వము తన ఆత్మయొక్క ప్రీతిమూలమున ప్రియమగునే గాని వాటి ప్రీతి కొఱకై గాదు. ఏ ఆత్మమూలమున ఇవన్నియు ప్రియ మగునో ఆ యాత్మను చూడ దగును. విన దగును. మననము చేయదగును. నిది ధ్యాసనము చేయదగును. ఓ మైత్రేయీ! ఆ యాత్మయొక్క దర్శనము చేతను, శ్రవణముచేతను, మననముచేతను, ఏతద్విషయక మగు పూర్ణ జ్ఞానముచేతను ఈ సర్వము తెలియబడినది యగును.

బ్రహ్మతం పరాదాద్యోఽన్యత్రాత్మనో బ్రహ్మ వేద క్షత్రం తం పరాదాద్యోఽన్యత్రాత్మనః క్షత్రం వేద లోకాస్తంపరాదుర్యోఽన్య త్రాత్మనో లోకాన్వేద. దేవాస్తం పరాదుర్యోన్యత్రాత్మనో దేవా న్వేద. భూతాని తం పరాదుర్యోఽన్యత్రాత్మనో భూతాని వేద. సర్వం తం పరాదాద్యోఽన్యత్రాత్మనః సర్వం వేదేదం బ్రహ్మేదం క్షత్రమిమే లోకా ఇమే దేవా ఇమాని భూతానీదగ్ం సర్వం యదయమాత్మా.

బ్రాహ్మణత్వము (ఈ) ఆత్మనుండి భిన్నమని తెలియువానిని బ్రాహ్మణ్యము వ్యాపకమగు బ్రహ్మత్వము పరిచ్ఛిన్న మైనదివలె నై అతనిని వీడిపోవును. అదే విధముగా క్షత్రియత్వము ఆత్మభిన్నమని తెలియు వానిని క్షత్రియత్వము వీడి పోవును. లోకములు ఆత్మనుండి భిన్నమని తెలియు వానిని లోకములు వీడి పోవును. దేవతలు ఆత్మ నుండి భిన్నమని తెలియు వానిని దేవతలు వీడి పోవుదురు. భూతములు ఆత్మభిన్నమని తెలియు వానిని భూతములు వీడి పోవును. * సర్వము

* వస్తుతః ఏదియు తనకంటె భిన్నము గాదు. అందుచే దేనిని తనకంటె భిన్నముగా జూచినను దానిచే తనకు పరాభవము సంభవించును. సమస్తమును తనను గానే చూచుట పాండిత్యము (జ్ఞానము).

ఆత్మకంటెను భిన్నమని తెలియు వానిని సర్వము వీడి పోవును. అనగా ఈ బ్రాహ్మణత్వము, క్షత్రియత్వము, లోకములు, దేవతలు, భూతములు సర్వమును ఆత్మయే నని అర్థము. ఈ విషయమునందు ఉదాహరణలు ఉదహరింపబడుచున్నవి-

స యథా దుందుభేర్హన్యమానస్య న బాహ్యాంఛబ్దాన్ శక్నుయాద్గ్రహణాయ దుందుభేస్తు గ్రహణేన దుందుభ్యాఘాతస్య వా శబ్దో గృహీతః. 7

ఎవరైనను భేరిని వాయింప ఆ భేరీ శబ్దమునందు ఇతర శబ్దము లన్నియు అణగి వినబడక భేరీశబ్దము మాత్రమే వినబడును. జాగ్రదాద్యవస్థలయందు ప్రజ్ఞాన రూప బ్రహ్మమున కంటెను వేఱేధియును లేదు. అది లేని యెడల ఏ ఇంద్రియ వ్యవహారమును లేదు. అదియే ఇదంతయునై యున్నది.

స యథా శంఖస్య ధ్మాయమానస్య న బాహ్యాంఛబ్దాన్ శక్నుయాద్గ్రహణాయ శంఖస్య తు గ్రహణేన శంఖధ్మస్య వా శబ్దో గృహీతః 8

అదే విధముగా శంఖమును వాయింప ఆ ధ్వనియందు ఇతర శబ్దము లన్నియు అంతర్గతము లయిపోవును.

స యథా వీణాయై వాద్యమానాయై న బాహ్యాంఛబ్దాన్ శక్నుయాద్గ్రహణాయ వీణాయై తు గ్రహణేన వీణావాదస్య వా శబ్దో గృహీతః 9

ఇటువలె వీణావాద్య స్వరమునందు తనకంటె అల్పములగు స్వరములు శబ్దము లన్నియు అణగి పోవుచున్నవి. ఇట్లు ఆత్మతత్త్వమును తెలియుటచే ఇదంతయును ఆత్మయే యను జ్ఞానము గలుగును. ఒక్క, ఆత్మజ్ఞాన మైనచో సమస్తమును తెలిసి నట్లగును.

స యథాఽఽర్ద్రైధాగ్నేరభ్యాహితాత్పృథగ్ధూమా వినిశ్చరంత్యేవం వా అరేఽస్య మహతో భూతస్య నిశ్శ్వసితమేతద్యదృగ్వేదో యజు

ర్వేదః సామవేదో౽థర్వాంగిరస ఇతిహాసః పురాణం విద్యా ఉపనిషదః శ్లోకాః సూత్రాణ్యనువ్యాఖ్యానాని వ్యాఖ్యానాన్యస్యైవైతాని సర్వాణి నిశ్శ్వసితాని. 10

పచ్చి కట్టెల నంట బెట్టిన అగ్నిచే పొగ మొదలగునవి ప్రత్యేకముగ వెలువడునట్లు ఓ మైత్రేయీ! మహద్రూపమగు ఈ ఆత్మనుండి ఉచ్ఛ్వాస ప్రశ్వాసములవలె ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణవేదము, ఇతిహాస పురాణములు, శ్లోకములు, సూత్రములు, వ్యాఖ్యానములు, అనువ్యాఖ్యానములు ఇత్యాది సర్వమును వెలువడి యున్నవి. ఇవన్నియు ఈ ఆత్మయొక్క ఉచ్ఛ్వాస ప్రశ్వాసములే.

అవ : ఆత్మయే అన్ని వస్తువుల పరమ ఆశ్రయమను విషయమును దృష్టాంత పూర్వకముగ తెలుపుచున్నారు-

స యథా సర్వాసామపాగ్ం సముద్ర ఏకాయనమేవగ్ం సర్వేషాగ్ం స్పర్శానాం త్వగేకాయనమేవగ్ం సర్వేషాగ్ం గన్ధానాగ్ం నాసికై కాయనమేవగ్ం సర్వేషాగ్ం రసానాం జిహ్వైకాయనమేవగ్ం సర్వేషాగ్ం రూపాణాం చక్షురేకాయనమేవగ్ం సర్వేషాగ్ం శబ్దానాగ్ం శ్రోత్రమేకాయనమేవగ్ం సర్వేషాగ్ం సంకల్పానాగ్ం మన ఏకాయనమేవం సర్వాసాగ్ం విద్యానాగ్ం హృదయమేకాయనమేవగ్ం సర్వేషాం కర్మణాం హస్తావేకాయనమేవగ్ం సర్వేషామానందానాముపస్థ ఏకాయనమేవగ్ం సర్వేషాం విసర్గాణాగ్ం పాయురేకాయనమేవగ్ం సర్వేషామధ్వనాం పాదావేకాయనమేవగ్ం సర్వేషాం వేదానాం వాగేకాయనమ్. 11

సమస్త జలములకు సముద్ర మొక్కటే ఆశ్రయమై యుండినట్లు త్వగింద్రియము సర్వ స్పర్శలకును, ఘ్రాణేంద్రియము సమస్త వాసనలకును, జిహ్వేంద్రియము అన్ని రసములకును, చక్షురింద్రియమన్ని రూపములకును, శ్రోత్రేంద్రియము సర్వ శబ్దములకును, మనస్సు

సర్వ సంకల్పములకును, హృదయము అన్ని విద్యలకును, కరములు సర్వ కర్మలకును, ఉపస్థ అన్ని ఆనందములకును, గుదము సర్వ విసర్జనములకును, పాదములు అన్ని త్రోవలకును, వాక్కు సర్వ వేదములకును ఆశ్రయమగునట్లు ఆత్మ వీనితో సహా సర్వమునకు ఒకే ఒక ఆశ్రయముగా ఉన్నది.

స యథా సైన్ధవఖిల్య ఉదకే ప్రాస్త ఉదకమేవానువిలీయేత న హాస్యోద్గ్రహణాయేవ స్యాత్ యతో యతస్త్వాదదీత లవణమేవైవం వా అర ఇదం మహద్భూతమనంత మపారం విజ్ఞానఘన ఏవ. ఏతేభ్యో భూతేభ్యః సముత్థాయ తాన్యేవాఽనువినశ్యతి న ప్రేత్య సంజ్ఞాఽస్తీత్యరే బ్రవీమీతి హోవాచ యాజ్ఞవల్క్యః. 12

ఎట్లు జలమునందు వేయబడిన ఉప్పుగల్లు కరగి అందు లీనమై పోవునో దానిని వేఱు చేయుటకు రాదో, ఆ నీటిని రుచి చూచిన మాత్రము సర్వత్ర ఉప్పగనే యుండునో మైత్రేయీ! అటువలె ఈ వ్యాపకమగు ఆత్మ, అనంతము, అపారము, విజ్ఞానఘనమునై యున్నది. ఉదాహరణమున జల స్థానీయమగు బ్రహ్మమునందు సైంధవ ఘనముతో సమమగు నీ జగత్తు లయ మొందుచున్నది. ఈ భూతములు ఆత్మస్వరూపమున బుట్టి నాశమొంది లేనివగును. మరణానంతరము నేనను సంజ్ఞయు మిగులుట లేదు. అనగా పంచ భూతముల నుండి సమస్తమును గలిగి తమ తమ నామరూపములచే తత్తత్కారణములయందు నసించునని అర్థము. ఇట్లు యాజ్ఞవల్క్యుడు మైత్రేయికి బోధించెను.

సా హోవాచ మైత్రేయ్యత్రైవ మా భగవానమోముహన్న ప్రేత్య సంజ్ఞాఽస్తీతి స హోవాచ యాజ్ఞవాల్క్యో న వా అరేఽహం మోహం బ్రవీమ్యలం వా అర ఇదం విజ్ఞానాయ. 13

ఈ మాటలను విని మైత్రేయి ఓ భగవంతుడా! మరణానంతరము ఆత్మకు ఏ గుఱుతును లేదని చెప్పుటచేత నేను సందేహ గర్త

మున పడినట్లైనది. అనగా ప్రజ్ఞానఘన మని ఒక పేరు బెట్టి ఆ బ్రహ్మ మును బోధించితిరి. అద్దానిని పొందిన పిదప నామ రూపములు నశించు ననియు తెలిపితిరి. ఈ విషయము నాకు చక్కగా బోధ్యము కాలేదని అడిగెనని భావము.

ఓ మైత్రేయీ! నేను సందిగ్ధమగు అర్థమును చెప్ప లేదు. నే నింతవఱకు చెప్పినది బ్రహ్మతత్త్వమును ఎఱుగుటకు చాలినంతయై యున్నది. అవిద్యా సంబంధమగు ద్వైతప్రతీతి నివృత్తియైన యెడల దానితో సంబంధించిన నామరూపములును నశించి పోవును. బాధితా నివృత్తి యగునని భావము.

యత్ర హి ద్వైతమివ భవతి తదితర ఇతరం పశ్యతి తదితర ఇతరం జిఘ్రతి తదితర ఇతరగ్ం శృణోతి తదితర ఇతరమభివదతి తదితర ఇతరం మనుతే తదితర ఇతరం విజానాతి యత్ర వా అస్య సర్వ మాత్మైవాభూత్తత్కేన కం జిఘ్రేత్తత్కేన కం పశ్యేత్తత్కేన కగ్ం శృణుయాత్తత్కేన కమభివదేత్తత్కేన కం మన్వీత తత్కేన కం విజానీయాత్. యేనేదగ్ం సర్వం విజానాతి తం కేన విజానీ యాత్ విజ్ఞాతారమరే కేన విజానీయాదితి. 14

యాజ్ఞవల్క్యుడు: ద్వైతముండిన చోట అనగా రెండవ పదార్థ ముండినచో ఒకటి ఇంకొకటిని చూచుటయు, మఱొకటిని వినుటయు, వేఱొకటిని మాటలాడుటయు, విచారించుటయు, తెలిసికొనుటయు నుండును. కాని ఎవనికి సర్వము ఆత్మరూపమే యను ఏకత్వానుభవ మేర్పడి యుండునో అపుడు అతడు దేనిచేత దేనిని ఆఘ్రాణించును? దేనిచే దేనిని చూచును? దేనిచే దేనిని వినును? దేనిచే దేనిని మాట లాడును? విచారించును? దేనివలన ఇంకొక దానిని తెలిసికొనును? ఏ ఆత్మమూలమున ఈ సమస్తమును అతడు తెలియునో అట్టి ఆత్మను మఱి దేనిచే తెలియవలయును? తెలియుటకు రాదు. వ్యాపకమగు బ్రహ్మమే యని అర్థము.

## 6-వ బ్రాహ్మణము

ఈ బ్రాహ్మణమునందు ఉపనిషద్విద్యా-గురు శిష్య పరంపరాభి వర్ణనము గలదు.

## పంచమాధ్యాయము

## 1-వ బ్రాహ్మణము

హరిః ఓమ్. పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే, పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే. 1

ఓమ్. అది అనగా బ్రహ్మము పూర్ణమై యున్నది. ఇది అనగా వ్యక్త రూపమగు విశ్వము పూర్ణమై యున్నది. పూర్ణమగు బ్రహ్మము నుండియే పూర్ణమగు వ్యక్త విశ్వము పుట్టును. పూర్ణమగు బ్రహ్మము నుండి పూర్ణమగు విశ్వమును తీసి వేసిన మిగులునది పూర్ణ బ్రహ్మమే.

అవ: ఆకాశము, వాయువు; ఇవి వేదమను విషయము

ఓం౩ఖం బ్రహ్మ. ఖం పురాణం వాయురం ఖమితి హస్మాహ కౌరవ్యాయణీపుత్రో వేదోఽయం బ్రాహ్మణా విదుర్వేదైనేన యద్వేదితవ్యమ్. 2

ఓం. ఆకాశము బ్రహ్మము. ఆకాశము పురాతనము. ఆకాశము వాయువుయొక్క ఉత్పత్తిస్థానమని కౌరవ్యాయణీపుత్రుడు చెప్పి యున్నాడు. ఇది వేదమని బ్రాహ్మణులు తెలిసికొని యున్నారు. ఎందుకనగా, తెలియదగిన దెల్ల దీనిచేతనే తెలియును.

---

## 2-వ బ్రాహ్మణము

అవ: ప్రజాపతి దయామతిచే దేవ, దానవ, మానవులకు ద, ద, ద, యని ఉపదేశించుట. అక్షర మొకటియే యైనను వారి వారి సంస్కారానుసార మర్థభేదము.

త్రయాః ప్రాజాపత్యాః ప్రజాపతౌ పితరి బ్రహ్మచర్యమూషు ర్దేవా మనుష్యా అసురా ఉషిత్వా బ్రహ్మచర్యం దేవా ఊచుర్బ్రవీతు నో భవానితి తేభ్యో హైతదక్షరమువాచ ద ఇతి వ్యజ్ఞాసిష్టా3 ఇతి వ్యజ్ఞాసిష్మేతి హోచుర్దామ్యతేతి న ఆత్థేత్యోమితి హోవాచ వ్యజ్ఞాసిష్టేతి. 1

దేవతలు, మానవులు, దానవులు ఈ ముప్పురును ప్రజాపతికి బిడ్డలు. వీరు తండ్రి యగు ప్రజాపతికడకు వచ్చి బ్రహ్మచర్య వ్రతముచే వసించు చుండిరి. (ఇట్లు) బ్రహ్మచర్యముచే నుండుచు దేవతలు ప్రజాపతిని గురించి తాము మాకు (తత్త్వమును) విద్యను బోధించవలెనని కోరిరి. అపుడు ప్రజాపతి వారికి "ద" యను అక్షరమును (చెప్పి) ఉపదేశించి మీకు తెలిసినదా? యని అడిగెను. అప్పుడు దేవతలు మాకు తెలిసెను. దమము కలిగి యుండుడని మాకు మీరు బోధించితిరని దేవతలు చెప్పిరి. దేవతలు ఇంద్రియ లాలసులు; కావున దమము గలిగి యుండుడని ఉపదేశముయొక్క అర్థము. ఔను. మీరు చక్కగ తెలిసికొని యున్నారని ప్రజాపతి నుడివెను.

అథ హైనం మనుష్యా ఊచుర్బ్రవీతు నో భవానితి తేభ్యో హైతదేవాక్షరమువాచ ద ఇతి వ్యజ్ఞాసిష్టా3ఇతి వ్యజ్ఞాసిష్మేతి హోచుర్దత్తేతి న ఆత్థేత్యోమితి హోవాచ వ్యజ్ఞాసిష్టేతి. 2

అనంతరము మానవులు ప్రజాపతికడకు వచ్చి మాకు విద్యను బోధింపవలెనని అడిగిరి. వారికిని "ద" యను అక్షరము నుపదేశించి తెలిసినదా యని అడిగెను. తెలిసినది. మానవులు దానము చేయువారు కారు; కావున దానము చేయుమని మాకు బోధించితిరి. అని మానవులు చెప్పిరి. ఔను. అంతే మీరు విషయమును చక్కగా తెలిసికొన్నారని ప్రజాపతి యనెను.

అథ హైనమసురా ఊచుర్బ్రవీతు నో భవానితి తేభ్యో హైతదేవాక్షరమువాచ ద ఇతి వ్యజ్ఞాసిష్టా3ఇతి వ్యజ్ఞాసిష్మేతి హోచుర్ద

యధ్వమితి న ఆత్థేత్యోమితి హోవాచ వ్యజ్ఞాసిష్టేతి తదేతదేవైషా దైవీ వాగనువదతి స్తనయిత్నుర్ద ద ద ఇతి దామ్యత దత్త దయధ్వమితి తదేతత్ త్రయగ్ం శిక్షేద్దమం దానం దయామితి. 3

ఆ పిదప అసురులు ప్రజాపతి కడకు వచ్చి మాకు విద్యను తెలుపుమని అడిగిరి. వారికి "ద" అను అక్షరమును చెప్పి మీకు తెలిసినదా? యని ప్రజాపతి అడిగెను. ఔను. తెలిసెను. దయారహితులు దానవులు గావున మీరు దయ గలిగి యుండుడని బోధించితిరి. ఔను. మీకు తెలిసియున్నదని ప్రజాపతి యనెను. ఇదే ఉపదేశము దైవీ వాణి యగు ఉఱుము నుండి "ద""ద""ద" అని వినబడును, దీని అర్థ మేమనగ, దమనము చేయుడి! దానము చేయుడి! దయగలిగి యుండుడని అర్థము. అందువల్లనే దమనము, దానము, దయ ఈ మూడు తెలియ దగినవి. నేర్చుకొన దగినవి. మానవులకు ఈ మూడును ఉండ దగునని భావము.

---

## 3-4-వ బ్రాహ్మణములు

ఈ మూడు, నాలుగు బ్రాహ్మణములయందు హృదయమును బ్రహ్మరూపముచే నుపాసించుట, సత్యమును బ్రహ్మరూపముగా నుపాసించుట యనునవి చెప్పబడి యున్నవి. ఈ హృదయమను పేరు గల బ్రహ్మమే యుండెను. అది సత్యస్వరూపము. ఈ మహాత్మమగు పూజ్యమైన సర్వమునకు మొదట పుట్టినది యగు హృదయబ్రహ్మము సత్యము. పరబ్రహ్మ స్వరూపమునై యున్నదని ఎవడు తెలిసి యున్నాడో అతడీ లోకములను జయించును. అన్నిటికంటెను మొదట పుట్టిన పూజ్యమగు ఈ హృదయబ్రహ్మము సత్యము. పరబ్రహ్మస్వరూపమై ఉన్నదని తెలిసినవాని శత్రువులు అపజయ మొందినట్టే. సత్యమే బ్రహ్మము ఇత్యాదివిషయములు ఇందు చెప్పబడినవి.

## 5-వ బ్రాహ్మణము

ఈ బ్రాహ్మణమునందు ప్రప్రథమమున జల మొకటియే యుండెననియు, తన్మూలమున సత్యము పుట్టెననియు ఆ పిదప చతుర్ముఖ బ్రహ్మ, తరువాత దేవతలు కలిగిరనియు చెప్పబడినది. ఇచ్చట సత్య మనగా ఆదిత్యుడనియు ఇతడు "భూః, భువః" స్వరూపు డనియు ఈ మంత్రములచే అతడు వ్యక్తమగు ననియు ప్రపంచమునందలి ఆదిత్యుడే పురుషునియందు నేత్రరూపుడనియు, పగలని ఆదిత్యుని గుప్తమగు రూపము, నేనని పురుషుని గోప్యమగు రూపము ఈ రెండును ఒకటియే యని చెప్పబడినది.

## 6-వ బ్రాహ్మణము

ఈ బ్రాహ్మణమునందు పురుషుని వాసస్థానము తత్పరిమాణే త్యాది విషయములు. పురుషుడు మనోమయుడు; హృదయము వాస స్థానము. ఇతడు వ్రీహి యవాది సూక్ష్మ పరిమాణుడనియు ఇతడే సర్వేశ్వరుడు, సర్వాధిపతి యను మొదలగు విషయములు చెప్పబడి యున్నవి.

## 7-వ బ్రాహ్మణము

ఈ బ్రాహ్మణమునందు విద్యుత్తును గురించి చెప్పబడినది.

## 8-వ బ్రాహ్మణము

ఈ బ్రాహ్మణమునందు వాక్కున ఆవుయొక్క పొదుగు మూల మునవచ్చు క్షీరములు ఇత్యాది వర్ణన యున్నది.

## 9-వ బ్రాహ్మణము

ఈ బ్రాహ్మణమునందు అగ్నియే వైశ్వానరుడను నామమున పురుషుడు జఠరమునం దున్నాడని తెలుపబడినది.

## 10-వ బ్రాహ్మణము

ఈ బ్రాహ్మణమున పురుషుని దేహ పాతానంతరము ఇతడు ఏ మార్గమున బ్రహ్మలోకము పోవునను విషయము, మొదట వాయు

లోకము, పిదప ఆదిత్యలోకము, చంద్రలోకము, అనంతరము శోకరహిత మగు హిమరహితమగు బ్రహ్మలోకమునకు వెళ్ళును. అచట కొంత కాలముండును అను మొదలగు విషయములు తెలుపబడి యున్నవి.

## 11–వ బ్రాహ్మణము

ఈ బ్రాహ్మణమున లోకమునందు పురుషునకు వ్యాధి, మరణము లనునవి మహాతాపములని తెలిపి యున్నారు.

## 12–13–వ బ్రాహ్మణములు

ఈ బ్రాహ్మణములందు అన్న ప్రాణ సంయోగములచే గలుగు సుఖమును గుఱించి ఉక్థము. యజుస్సు, సామము, క్షత్రము ఇవన్నియు ప్రాణములే యను మొదలగు విషయములు తెలుపబడినవి.

## 14–వ బ్రాహ్మణము

ఈ బ్రాహ్మణమునందు గాయత్రికి నాలుగు పాదములు గలవు. ప్రతిపాదమునందు ఎనిమిది అక్షరములుండును. భూమి, ద్యౌ (స్వర్గము), అంతరిక్షము ఇవి మొదటి పాదము. ఋక్కు, యజుస్సు ఇవి రెండవ పాదము. ప్రాణము, అపానము, వ్యానము ఇవి మూడవ పాదము. ఆదిత్యుడే నాల్గవ పాదము. ఇట్లు గాయత్రీవిషయకమగు వర్ణన, మఱియు గాయత్రి, సావిత్రి యనిన సూర్యదేవతయేననియు చెప్పుచు గాయత్రి యొక్క మాహాత్మ్యమును, తత్ప్రతిష్ఠను, మఱియు తదుపాసనాఫలమును, అగ్నియే గాయత్రియొక్క ముఖమనియును చెప్పబడి యున్నది.

## 15–వ బ్రాహ్మణము

ఈ బ్రాహ్మణమున ఈశావాస్యోపనిషత్తుయొక్క చివర నుండు "అగ్నే నయ" యను మంత్ర విషయకమగు ప్రార్థన చెప్పబడి యున్నది.

—o—

## షష్ఠాధ్యాయము

ఈ అధ్యాయమునందు 5 బ్రాహ్మణములు గలవు. మొదటి రెండు బ్రాహ్మణముల విషయము ఛాందోగ్యోపనిషత్తునందు చెప్పబడినదే. ఒకటి ప్రాణముయొక్క శ్రేష్ఠత్వమును, రెండవది శ్వేతకేతు, జైవలి వీరి సంవాదవిషయము గలదు.

మూడవ బ్రాహ్మణమునందు మహత్త్వప్రాప్తిని జేసికొనుటకైన విధానములు, ఔషధముల మంథనక్రియ, హోమాది విధానములు తెలుపబడి యున్నవి.

నాలుగవ బ్రాహ్మణము ఆధ్యాత్మిక తత్త్వవిషయమునకు సంబంధించినది కాదు. గార్హస్థ్యమునకు సంబంధించిన కొన్ని విషయములు చెప్పబడినవి.

ఐదవ బ్రాహ్మణమునందు విద్యా విషయకమైన పరంపరాభివర్ణనము గలదు.

ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే,
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే.
ఓం శాంతిః శాంతిః శాంతిః.
బృహదారణ్యకోపనిషత్తు సమాప్తము.
ఓం తత్ సత్.

—oo:o:oo—

సుధాఖ్యవ్యాఖ్యాసమేత

# ప్రస్థానత్రయము

సంపూర్ణము



# శ్రీమదుమామహేశ్వర గ్రంథమాల

1వ పుష్పము : కైవల్య నవనీత సార సంగ్రహము
2వ పుష్పము : శ్రీ ప్రణవానంద సద్గురు బోధామృత తత్త్వములు
3వ పుష్పము : శ్రీ శంకరానందగిరి గురువర చరిత్ర (ప్రథమ భాగము)
4వ పుష్పము : మంత్రానుష్ఠాన విధిః
5వ పుష్పము : ప్రశ్నోత్తరి మణిరత్నమాల (కన్నడము)
6వ పుష్పము : శ్రీమద్భగవద్గీత (మూలము)
7వ పుష్పము : ముముక్షుసర్వస్వమ్
8వ పుష్పము : మంగళాచరణ స్తోత్రములు
9వ పుష్పము : జ్ఞానసుధ
10వ పుష్పము : జ్ఞానదర్పణము
11వ పుష్పము : జగద్గురు శ్రీ శంకరచరిత్ర
12వ పుష్పము : ప్రస్థానత్రయము—సుధాఖ్యవ్యాఖ్యాసమేతము
13వ పుష్పము : శ్రీ శంకరానందగిరి గురువర చరిత్ర (ద్వితీయభాగము)
14వ పుష్పము : మహోపనిషత్తు

ప్రతులకు :

**శ్రీ సద్గురు ప్రణవానందాశ్రమము**

గంజిగుంట, వజ్రకరూరు (P.O.)

(వయా) గుంటకల్.

# శుద్ధి పత్రము

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు | పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 6 | 2 | — | అర్జునఉవాచ | 149 | 16 | అస్తేయము | — |
| 9 | 2 | హిం | హి | 152 | 17 | యజ్ఞై | యజ్ఞై |
| 12 | 26 | పోపు | పోవు | 162 | 3 | భార | భర |
| 15 | 11 | త్మ్రవ | ఆత్మ | 170 | 4 | విప్ర | విత్ర |
| 16 | 26 | నాశ | నాశి | 173 | 20 | వ్ర | శ్ర |
| 18 | 4 | కాదు | కాడు | 176 | 18 | ప్మనో | ప్మానో |
| 21 | 26 | సీ | సి | 178 | 14 | యుగ | యాగ |
| 22 | 6 | సుఖి | సుఖ | 179 | 11 | తమం | మహం |
| 49 | 24 | సర్మ | సర్వ | 182 | 11 | క్షత్వ | క్షుత్వ |
| 52 | 24 | నిశ్చ | నిశ్చి | 191 | 20 | చందో | ఛందో |
| 54 | 22 | — | తినుట | 191 | 22 | — | ప్రశ్న : |
| 63 | 17 | రున | ర్జున | 204 | 21 | ధ్యా | ద్యా |
| 71 | 13 | వ్త్వా | త్వా | 208 | 12 | యాత | యాత |
| 72 | 23 | గుచ్ఛ | గ్రుచ్ఛ | 225 | 28 | దాత్మా | దాత్మ |
| 86 | 26 | కర్మషు | కర్మసు | 226 | 20 | సల్ప | కల్ప |
| 88 | 14 | బహుథా | బహుధా | 226 | 21 | కర్వ | సర్వ |
| 94 | 15 | బ్రదుకు | చావు | 227 | 16 | 1-1-1 | 1-1- |
| 100 | 9 | క్షమాః | క్షమా | 231 | 2 | కాశ | కాశా |
| 102 | 19 | ప్రత్ర | పత్ర | 245 | 13 | నిరుప | నిరు |
| 112 | 28 | యిన్నాము | యున్నాము | 245 | 23 | ప | పప |
| 116 | 3 | గతిః | గతః | 250 | 17 | యుక్క | యొక్క |
| 117 | 22 | మాతాః | మతాః | 264 | 4,9 | మాతి | మాత |
| 119 | 8 | శుద్య | శుద్ధ్య | 267 | 15 | దాత్మా | దాత్మ |
| 120 | 9 | మలై | ములై | 272 | 21 | జుహూ | జుహు |
| 127 | 26 | జ్ఞేయ | జ్ఞేయం | 277 | 19 | యుక్క | యొక్క |
| 131 | 12 | మూత్మా | మాత్మ | 292 | 21 | జర | జరా |
| 135 | 5 | భూయం | భూయః | 298 | 2 | దాత్మా | దాత్మ |
| 136 | 8 | వాలె | వలె | 298 | 10 | — | బ్ర |
| 140 | 20 | ల్యా | ల్య | 305 | 27 | నిన్ను | నిన్ను చెప్పుటు మొదటిది: |
| 146 | 2 | ఖలమ్ | ఖిలమ్ | 307 | 26 | శ్రుతులు | ఊ |
| ,, | 20 | మత్త | మత్తః | 317 | 7 | ధర్మ | దర్శ |
| 147 | 17 | ఛ్ఛ | బ్భ | 321 | 19 | అక్షరా | అక్షర |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు | పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 328 | 10 | 4 | 44 | 475 | 1 | మాత్మ | మాత్మా |
| 345 | 2 | దృ | ద్వృ | 476 | 20 | వ్యాప్య | వాప్య |
| 348 | 13 | మనా | మననా | 476 | 26 | దృష్ణ | దృష్ట |
| 355 | 22 | దీర్య | వీర్య | 477 | 7 | నఃన | నని |
| 356 | 12 | జ్మ్ర | జ్మ్ర | 482 | 5 | దిప్ర | ధిప్ర |
| 358 | 1 | ప్యప | వ్యప | 489 | 5 | రు | తరు |
| 360 | 16 | ద్బే | ద్దే | 496 | 4 | హచే | హ్మచే |
| 370 | 13 | లేవి | లేని | 496 | 25 | ఆస | అస |
| 371 | 20 | రణ | రణా | 507 | 3 | సందు | సందు, ఆకాశము పృథివియందు |
| 377 | 16 | స్థమై | స్థైమై | 510 | 23 | సీన్నాత్ | సీత్ |
| 378 | 18 | ర్యాధా | ర్యాథా | 512 | 27 | జెప్పి | జెప్పి |
| 386 | 12 | హాతీ | హాతీ | 514 | 24 | తృ | త్సృ |
| 390 | 15 | తీతి | తీ | 515 | 14 | సక్నో | శక్నో |
| 394 | 21 | ఆతడు | — | 515 | 21 | యద్దె | యద్రై |
| 399 | 22 | ల్లి | ల్లి | 516 | 12 | హైహవ్య | హైహయ్య |
| 403 | 4 | పంతః | పంత | 524 | 23 | ఏషో | ఏషా |
| 411 | 9 | సార్ధ | సారథి | 529 | 20 | సర | స్వర |
| 416 | 14 | శ్యతే | శ్యత | 536 | 12 | మను | మునిమను |
| 426 | 19 | పంచే | పంచేం | 536 | 26 | పరహ | పరః |
| 428 | 17 | థై | ధై | 537 | 3 | ; సయుగ్వాన్ అను | — |
| 429 | 15 | స్తార్త్రో | స్తార్త్ర్యో | 540 | 18 | యేవా | మేవా |
| 431 | 3 | స్త్వా | ష్ట్వా | 541 | 11 | రతు | కతు |
| 432 | 8 | తథా | తధా | 548 | 3 | త్సుర | చర |
| 434 | 14 | చర్య | చర్యా | 554 | 1 | జ్ఞ | జ్ఞ |
| 436 | 16 | తిష్ఠ | తిష్ఠి | 556 | 12 | హ | వాహ |
| 437 | 18 | ఋషులు | ఋషుల | 556 | 26 | సంద | సంపద |
| 440 | 9 | ఇచ్ఛ | ఇచ్చ | 557 | 18 | కిర | అగ్నిక |
| 442 | 7 | హైహ్యా | హైహ | 558 | 4,16 | కిరణ | కణ |
| 450 | 6 | ఎదా | పదా | 559 | 2,13 | కిరణ | కణ |
| 458 | 9 | సంత | స్పంప | 559 | 24 | జర | జరా |
| 463 | 25 | మాత్మ | మాత్మ | 560 | 18 | పూర్వ. | పూర్వ |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 563 | 9 | మన్య | మస్య |
| 563 | 9 | షిని | షుని |
| ,, | 11 | త్య్వ | త్వ |
| 565 | 20 | సూతఅ | సుతఆ |
| 568 | 1 | శర్క | శార్క |
| 570 | 19 | ఊరువులు | ఉరము |
| 570 | 20 | హార్య | హోర్య |
| 572 | 26 | షిత | ష్థిత |
| 574 | 21 | బ్రహా | బ్రహ్మ |
| 576 | 10 | సమ | సమి |
| 579 | 25 | త్కా | త్కృ |
| 588 | 1 | ణీ | ణి |
| 588 | 3 | నాచ | వాచ |
| 601 | 1 | నామము మంత్ర ములయందు | నామమందు మంత్రములు |
| 601 | 8 | కర్మా | కర్మ |
| 604 | 4 | కాచ | కామచ |
| 606 | 15 | తాయ | తా |
| 607 | 13 | వృతి | వృతీ |
| 607 | 16 | ముర్తా | మూర్తా |
| 608 | 11 | తరూ | తదూ |
| 608 | 12 | హ్వారి | రావోరి |
| 608 | 16 | గొప్ప | గొప్ప |
| 609 | 9 | సూర్య | సూర్యా |
| 611 | 26 | కించ | కించి |
| 612 | 11 | ణా | హ్ణ |
| 619 | 20 | హారంపురే | హారే,పురం |
| 620 | 3 | మిాకా | మాకా |
| 623 | 12,13 | దితా | ద్రితా |
| 623 | 13 | దితే | ద్రితే |
| 627 | 21 | హ్యా | హ్యా |
| 627 | 26 | య | యనమ |
| 629 | 9 | ష్మ | ష్మ |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 629 | 17 | నయా | సయా |
| ,, | 23 | ౯ | — |
| 631 | 1 | నీతీ | నితీ |
| 632 | 26 | వమా | వేమా |
| 639 | 10 | న | నహా |
| 642 | 21 | హ్మా | హ్మా |
| 647 | 8 | మనాః | మేనాః |
| 663 | 3 | సగ్ | శగ్ |
| 664 | 23 | ఋషి | ఋషీ |
| 665 | 2 | పిపే | పిపీ |
| 671 | 15 | తిష | తిష్ఠ |
| 675 | 24 | స్నా | స్యా |
| 675 | 24 | హ | — |
| 675 | 25 | ది | వాది |
| 676 | 23 | భణ | బణ |
| 682 | 12 | ర్త్యం | త్యం |
| 685 | 17 | ధ్యత్రా | ద్యత్రా |
| 687 | 23 | త | తర |
| 688 | 7 | సర్యా | సర్వా |
| 688 | 9 | త్రైషణాయ | త్రైషణాయా |
| 688 | 18 | గెడు | గెను |
| 689 | 14 | ఖి | ఖ |
| 702 | 23 | ధృతేః | ధృతే |
| 703 | 13 | జహో | జుహో |
| 704 | 1 | దత్రో | దత్తో |
| 704 | 11 | సర | పర |
| 704 | 22 | చ్ఛ | చ్య |
| 706 | 2 | దా | ద్యా |
| 711 | 18 | స్యా | యస్యా |
| 713 | 18,23 | ష్టి | ష్ఠి |
| 725 | 7 | దిశో | దిశోదిశో |
| 736 | 18 | ష్ట్రై | ష్ట్రై |
| 741 | 15 | ల్ | త |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు | పేజి | పంక్తి | తప్పు | ఓప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 747 | 4 | ర్ద్నో | ర్ధ్నో | 758 | 13 | వాన | వాచ |
| 750 | 27 | విద్య | విద | 759 | 13 | త్వా | త్యా |
| 751 | 6 | చు | షు | 759 | 17 | విజా | విజ్ఞా |
| 752 | 17 | దిన్మ | దిర్మ | 762 | 17,18,20 | గ | — |
| 754 | 13 | స్మి | స్మిం | 763 | 22 | మో | మూ |
| 754 | 17 | నాస | నాశ | 763 | 23 | జ్ఞవా | జ్ఞవ |
| 758 | 8 | కూ | కు | 764 | 9 | నివృ | నువృ |

